# నలుగురు కలసి నవ్వేవేళ

(కథల సంపుటి) **రాధిక**



వెల రు. **150/-** **$10**

ప్రచురణ : 02-12-2001

పబ్లిషర్స్
**'రాక శ్రీశ'**
**గెద్దాడ బ్రహ్మయ్య మెమోరియల్ ట్రస్ట్, సాహితీ విభాగం,**
**బ్రహ్మకృప, 70-3-33, వైద్య నగర్ - 1, రమణయ్యపేట,**
**కాకినాడ - 530 005. ఫోన్ : 350320**

సోల్ డిస్ట్రిబ్యూటర్లు
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
**విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,**
**హైదరాబాద్-500 001.**
**ఫోన్ : 040-4744580**

ముద్రణ
**రాంషా-శిరీషా పబ్లికేషన్స్,**
**40, ఇండస్ట్రియల్ ఎస్టేట్,**
**సామర్లకోట-533 440.**
**ఫోన్ : 327454**

# అంకితం



భర్త అంటే ఇలా ఉండాలి అని అనిపించే

శ్రీవారికి అర్పితం

రచయిత్రి
రాధికకు
పాఠక
పురస్కారం

# ముత్యాల పళ్లెం



పత్రికల్లో పడిన కథలు
పాఠకులకు నచ్చిన కథలు
పరోక్షంగా ముందు
ప్రత్యక్షంగా తరవాత

గ్రంథంగా అవి వచ్చినపుడు
గట్టిపడ్డాయన్నమాట
కాలం మారినపుడల్లా
కథలు మారతాయి

అయినా పోయిందేం లేదు
అన్నింటికీ రక్ష చరిత్ర
రాధిక కథలు
రమణీయ కథలు

ఎవరు రాయగల ప్రక్రియలో
ఎంత బాగా రాయగల్గితే అంత
రాధిక గారి ప్రక్రియ
రమణీయంగా కథలు రాయడం.



రాజేంద్రప్రసాద్‌గారన్నారు
రాధిక ఈవిడే
రాసిన కథలచ్చుకిచ్చాం
రాస్తారా ముందుమాట అని

నా దారి కవిత్వం కదా
నాలుగు ముక్కలందులోనే రాస్తాను
ప్రభ, భూమి వగైరా
ప్రతికల్లో వచ్చిన కథలా

మౌనంగా ఆ దంపతులు
మహాగ్రంథం అచ్చుప్రతిని
నా ముందు పెట్టారు
నాలుగు వందల పేజీలు

మిగిలింది చదివాకా నేనూ
మేలయిన నా అభిప్రాయాలూను
ఈమె బాణీలో
ఈమె మహారాణి

'నలుగురు కలిసి నవ్వేవేళ' కథ
నాకే కాదు అందరికీ
నాలుగు కాలాల పాటు
నాణ్యంగా కనిపిస్తుంది.

విశ్లేషించడానికి వేళా
వేదికా కాదిది
విశ్వవిద్యాలయాలున్నాయి
విద్యార్థులు పరిశీలిస్తారు.

అయినా ఒక్కమాట
అద్భుతరసం జాలువారేలా
అనిపించిన ఈ కథ
అంతిమక్షణంలో కరుణంలో

మునిగినా
ముదితలకు కనువిప్పే.

అబలలకు ఆస్తిహక్కు
అంటున్న ప్రభుత్వాలకు
కూడా ఇది కనువిప్పే
మనస్సు నెలా సవరిస్తారు
వాలంటరీగా మారాలి
వధూవరులంతా.



"యోగ్యత" కథ చూశాను
యుగానికి అలాంటి
మనస్తత్వం గల
మానవతామూర్తులు కావాలి.

"గోల్డ్‌మైన్" కథ చదివాను
బోల్డుగా చెప్పారు రాధిక
మనిషి బ్రతుకులో
మనీ అండ్ షీ పాత్ర

విస్మయావర్తంలో పడ్డాను
విప్పుకోవాల్సి వచ్చి
"పిచ్చి కథ" అది దాన్ని
పేర్చారు సక్రియలిస్తుగా.

"ఇది మరోరకం శిక్ష" చదివాను
ఇలా ఉన్నారన్నమాట కథకులు
ఆ కథ ఒక వాస్తవానికి
అద్దమే అనిపించింది నాకు.

ఒరిజినల్ కంటెంటు ఉంది
ఒక్కో ఒక్కో కథలోనూ
టెక్నిక్కుల్లో పేచీలేమీ
పిక్నిక్కుకని వచ్చి కూచోవు.



"తీర్పు" కథ చూడండి
తీవ్రమైన సస్పెన్సు
చివరికి ఎలా విడిపోయిందో
చేదు ఎలా మిగిలిందో

జోక్సు వేయందే మన వాళ్ళకి
జుత్తు దువ్వుకోడం కూడా
బద్ధకమే అనిపిస్తుంది
నిజమైన జోకుల కథకి
నిదర్శనం "ఉగాదికి ఉచితం"

చిన్న కథలు రాయడంలో
సిద్ధహస్తం రాధికగారిది
ఎలా లెక్కించినా ఆనవాళ్లు
ఏం సరిపోతాయి మన వ్రేళ్ల

వారపత్రికల కన్నింటికీ
వాంఛనీయాలే చిన్న కథలు
చిన్న కథలేని పత్రిక
చిన్నబోవడం అనుభవసిద్ధం
"మంచుతెరలు; "కాగితం పులి"
మంచి చిన్న కథల్లో రెండు.

మితిమీరిన సెక్సు వర్ణనలు
మీద పడితే బావుండదుకానీ
సెక్సు ఎడ్యుకేషను లేకపోతే
సిగ్గుచేటవుతుంది
అందుకే రాధికగారి కలం
అలవోకగా సందర్భాలకు
అతికేలా యువతకు
అనుభవం కలిగేలా
అంటించారు శృంగార టీకాలు



వస్తుబలం ఉన్న కథలు
వాస్తవాలకు వన్నెలే
భాష విషయం
భాస్వంత శైలి
కాలోచితం మాత్రమే
కాదు దేశోచితం కూడా
ఇంకా మాటాడితే
హేతు బద్ధం
జర్నలిజానికి
జయం చేకూర్చే
కథాకథనం
రాధిక రచనం

వాక్య చమత్కారాల కోసం
వంటా వార్పూ తాలింపూ ఉండదిక్కడ
పద బంధాల బలాత్కారం
పచ్చని ఈ కథల్లో లేదు.

కొన్ని కథల్లో
కొత్తరకం ఆలోచనలు
"పుట్టిల్లు" కథ చదివినవారు
పూర్తిగా మారిపోతారు.

కథలు కొత్తగా
కలంపట్టి రాద్దామని
అనుకున్న వారికి
అమృతం ఇక్కడుంది.

జీవితం మీద ఆసక్తి
జేగీయమానంగా
పెంచగల కథలు
మంచి కథ లివి.
"రంగుల రాట్నం" కథ

రమణులకు
రాధిక గారిచ్చిన కానుక
"అసలు రహస్యం"
అదో డాక్టర్ల రహస్య కథ

సారాంశం చెప్పాలంటే
సాహిత్యం ఇది మంచిది
వస్తుబలం ఉన్న కథలు
వాస్తవాలకు సన్నిహితమైన కలలు

ఇంకా "కిళ్ళీ" లాంటి స్కెచ్‌లూ
ఎంతో కుశాగ్రంగా
బుద్ధిని చూపించే
'వ్యాపారదక్షత' లాంటి పొట్టి కథలూ
ఓమారు చదివినా
ఊహల్లో అలాగే ఉండి పోయేవి
చాలా ఉన్నాయి
మేళా లాంటి కథల సంపుటి మరి.

రాధిక చేతిలోకి
రానేవస్తాయి
చిన్న చిన్న కొత్త కొత్త థీమ్సు
అసలు సంగతేమిటంటే
ఆమె కథలు ఆల్చిప్పలు
విప్పి చూస్తే
వెన్నెల కాసే ముత్యాలు.

**- మిరియాల రామకృష్ణ**

---

డా॥ మిరియాల రామకృష్ణ ఎం.ఏ. పి.హెచ్.డి.
113, 'వెన్నెల', పోస్టల్ కాలనీ,
కాకినాడ - 533 003., ఫోన్ : 374952

# రాధిక కథల విశ్లేషణ

ఏభై సంవత్సరాల క్రితం సగటు స్త్రీ జీవితంలో ఎన్నో బాధలు వుండేవి. ఆనాటి సామాజిక కట్టుబాట్లు, నిరక్షరాస్యత, భర్తే దైవం, ఇల్లే ముఖ్యంగా వంటిల్లే దేవాలయం అనే రీతి, నీతితో స్త్రీని ఓ చాకిరీ బొమ్మగా మార్చేసింది. భర్త తిట్టినా కొట్టినా, అత్తగారు, ఆడబడుచులు హింసించినా, భర్త త్రాగుబోతు, తిరుగుబోతు అయినా, ఆ గృహిణి సహించాలి. భరించాలి. బిడ్డల మీది మమకారంతో బ్రతకాలి అవన్నీ సహిస్తూ, ఆ తర్వాత మరలా ఆ బిడ్డలే ఆ తల్లిని అవమానపరచినా, బాధించినా ఆమె అదీ భూదేవిలా భరిస్తూ మరణించాలి.

ఆనాటి కథకులూ, కథలూ ఈ సమస్యని ఎన్ని విధాలుగానో చిత్రించి చూపారో తమ కథల్లో, నవలలో!

ఆ తర్వాత స్త్రీలకు చదువు, ఉద్యోగం, ఆస్తిలోవాటా ఇలా మంచి ప్రోత్సాహం మార్పు, చట్టాలూ వచ్చాయి. విద్యాధికురాలైన స్త్రీ - ఉద్యోగినిగా స్త్రీ, పుట్టింటి ఆస్తి హక్కు పొందిన స్త్రీగా, స్త్రీ సుఖపడిపోతోందని భావించారు సంఘసంస్కర్తలు. కానీ - కాలం మార్పేగానీ, "జరుగుతున్న కథ"లో మార్పురాలేదు. పాత్రల మార్పేగానీ పదార్థం మారలేదు.

స్త్రీ జీవితం క్రొత్త సమస్యల వలయంలో చిక్కుకుపోయింది.

నవ్వుతూ, నవ్విస్తూ, జీవితాన్ని అందంగా, ఆనందంగా మలుచుకోగల విద్య, వివేకం, సున్నితత్వం, సంస్కారం అన్నీ వున్న "స్మిత" లాటి యువతి - పుట్టింటి నుండి సగభాగం ఆస్తి హక్కు పొంది కూడా, సంస్కార హీనుడైన భర్త - అత్తగారు, మరది, మామగారు ఇలా అందరిచేతా వేధించబడి, హింసించబడి, వెంటాడబడి, వేటాడబడిన లేడిపిల్లలా నవ్వుతూ, నవ్విస్తూనే. - తన చివరి సందేశంగా ఆడపిల్లలకు ఆస్తి హక్కు వద్దు. దానివల్ల పుట్టింటి అండకోల్పోవటం తప్ప మరో ప్రయోజనం లేదు..." అంటుంది స్మిత. "నలుగురు కలసి నవ్వేవేళ" అనే కథలో. ఈ కథకు ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీలో ద్వితీయ బహుమతి వచ్చింది. (12-11-1986).

ఇక, భర్త అనబడే నరరూప రాక్షసుడు మరొకడు, కట్టుకున్న భార్య పుట్టింటి ఆస్తిని తన ఉంపుడుకత్తెకు ఇచ్చే ప్రయత్నంలో వున్న అతినాగరిక రాక్షసుడు. "ఇది మరో రకం శిక్ష" కథలో. అయితే ఆ కథలోని కథానాయిక "సారిక" - అతని పథకం తెలుసుకుని, అతని నుండి పారిపోతుంది. పుట్టింటికి - తనకు పుట్టినింటి ఆస్తి అవసరం లేదనీ, పుట్టినింటి అండ చాలనీ. ఇదే 1987లో "వనితాజ్యోతి"లో మూడవ బహుమతి పొందిన కథ. స్త్రీకి ఆస్తి హక్కులు, చట్టాలు భద్రతను, సుఖాన్ని సంతోషాన్ని

ఇవ్వవనీ, ఆ భర్త అనేవాడు సంస్కార హృదయుడైతే, - ఆమెను సమాదరించి ప్రేమిస్తే, అది ఒక్కతే స్త్రీ జీవితానికి గొప్ప ఆలంబన అనీ - చాటి చెప్పే కథలు. కథ, కథనం - సాధారణ జీవితాలకు దగ్గరగా వుండి, ఇవి ఎక్కడో జరిగినవి కావు సుమా, మన చుట్టుప్రక్కల వున్న ప్రతి నాలుగు కుటుంబాలలోనూ ఒక కుటుంబంలో జరుగుతున్న కథలే! 1900 సం॥ నుండి 1987 లో కూడా ఇంకా ఇంకా 2001లో కూడా జరుగుతున్నాయి అనిపించే కథలు.

ఎవరో దుష్యంతుడు - ఎప్పుడో మోసం చేశాడు శకుంతలని - కానీ ఈనాడూ అలాటి వేలాది శకుంతలలు వున్నారు. కుంతీదేవులూ వున్నారు. అలాటి శకుంతలే - "అర్చన" "యోగ్యత" అనే కథలో. స్లీపింగ్ పిల్స్ మ్రింగి - మరణశయ్య మీదకు హాస్పిటల్‌కు తీసుకురాబడిన అర్చనను, ఎంతో ఆలోచించి, తన ఇల్లాలిగా స్వీకరిస్తాడు కథానాయకుడైన డాక్టర్. ఆమెకు పుట్టబోయే బిడ్డకు తండ్రిగా తాను మనస్ఫూర్తిగా వుంటానంటాడు. అయితే - ఇంతటి సంస్కారం వెనకా - ఓ చిన్న ట్విస్ట్ కొత్తగా వున్నది.

మధ్య తరగతి మనిషి యాక్సిడెంట్ అయి - గవర్నమెంటు హాస్పిటల్ పాలు అయ్యాక - అతని మరణం వాయిదాల పద్ధతిలో ఎంత చక్కగా అంచెలంచెలుగా వస్తుందో వివరించే కథ "ఇన్‌స్టాల్‌మెంట్ డెత్" కథ, కథనం కూడా సమసమాజ దర్పణాలుగా వున్నాయి! రాధిక గారి కలంనుండి వాస్తవిక దృశ్యాలు అక్షరాలుగా రూపుదిద్దుకున్నాయి ఈ చిన్న కథలో.

"మహావృక్షం" క్రింద ఏ చిన్న మొలకా పెరిగి మరో వృక్షం కాదన్న నగ్నసత్యాన్ని "మహావృక్షం" కథద్వారా, గురుశిష్యుల అనుబంధం అనే తెరచాటున - గురువుగారి స్వార్థాన్ని - ప్రతిబింబిస్తుంది. తెలిసిన కథావస్తువే అయినా, కథనం - శైలి విలక్షణంగానూ, సలక్షణంగానూ వున్నాయి.

తల్లి గుండెల్లో పొంగులు వారే ప్రేమను ఆమె దాచిన డబ్బుతో విలువ కట్టే కొడుకులు, కోడళ్లు, ఆనాడూ, ఈనాడూ, మరేనాడూ కొందరు వుంటారన్న నగ్నసత్యానికి ప్రతిబింబంగా సాగిన కథ "డబ్బు".

ఈ పవిత్ర భారతదేశంలో భార్యభర్తని ప్రేమించటం అన్నది "శ్వాస" పీల్చుకున్నంత సహజమైన విషయం. తనని మోసం చేసిన వ్యక్తిని కూడా హృదయంలో భర్తగానే ఆరాధిస్తుంది ఈ దేశపు సగటు స్త్రీ. కానైతే తిరిగి భార్యకు తన నిండు ప్రేమను పంచగల భర్త, సమానమైన అనురాగం, ఆప్యాయత, ఆదరణ, స్వేచ్ఛ, వాక్స్వాతంత్ర్యం ఇచ్చే భర్తలు - ఎందరుంటారు? అది శ్వాసను నిరోధించి మనిషిని బ్రతికించినంత కష్టతరం! నూటికి ఒకరో - వెయ్యికి ఒకరో వుంటారు! అదే ప్రపంచంలోని అన్ని దేశాల ప్రత్యేకతా కావొచ్చు. తన భార్య ఏ విషయంలోనూ బాధ, ఆవేదన

పొందకూడదనీ, తన ఇల్లాలు ఎప్పుడూ ఆనందంగా వుండాలనీ ఆరాటపడే భర్త శంకరం - అదృష్టం కొద్దీ అలాగే తనని దైవంగా భావించి సహకరించే ఇల్లాలిని పొంది ఆమె కన్నుల్లో, హృదయంలో వెలిగే ఆనందాన్ని చూసన్తూ అది శాశ్వతంగా వుంచాలనుకుంటాడు. "చిన్న విషయంలో భార్య మాట భర్త వినాలి. పెద్ద విషయాలలో భర్త మాటలు భార్య వినాలి." అనే దాంపత్య జీవిత సూత్రాన్ని చెప్పే అనురాగ పూరిత దాంపత్యం కలకాలం సాగే మార్గం ఇదీ అంటూ - ఆదర్శదాంపత్యం విలువలని చిన్న కథ "ఓ భర్త కథ"లో ఆణిముత్యంలా పొదిగిన రచయిత్రి కథా కథన శిల్పం గొప్పగా వున్నది.

బఫే డిన్నర్‌లో ఆకలి ఎరగనివారూ, ఆకలి లేనివారూ వేలాది మంది పాల్గొంటుండగా, ఓ అనాథ కుర్రాడికి పేగులు తెగిపోయే ఆకలిని గుర్తించి పట్టెడన్నం పెట్టేవారు లేరు సభ్య సమాజంలో. "కిళ్ళీ"లో - ఆకలి - విలువ తెలిపారు రచయిత్రి.

తల్లి సవతి కూతురిని ముద్దు చేయవద్దని హితబోధ చేయగా, ఆ తల్లిని - తనలోని అందం - అణకువ మాత్రమే చూచి - తన చనిపోయిన భార్య వలన కలిగిన బిడ్డను - తానూ ప్రేమగా చూస్తుందనే నమ్మకంతో, కోటీశ్వరుల కూతుళ్లను ఇస్తామన్నా కాదని వివాహమాడి - ఆ బిడ్డను తన చేతిలో పెట్టిన భర్త - మోహన్.

తన పుట్టింటి ఇల్లు తాకట్టునుండి విడిపించి, చెల్లికి పెళ్ళి చేసి, తమ్ముడికి చదువు, ఉద్యోగం ఇప్పించి - వైద్యం చేయించి ఆరోగ్యం చేకూర్చింది - ఎవరి కోసం! ఆ సవతి కూతురిని తాను ప్రేమగా చూస్తుందనే నమ్మకం కోసం! అంటూ తన తల్లిని మరో మారు ఇలా చెడ్డ బోధ చేయవద్దని చీవాట్లు వేసిన యువతి మాధురి పాత్ర స్త్రీ జాతికే గర్వకారణం. మాతృస్థానానికే మకుటాయమానం - రచయిత్రి కలంలో నుండి, భావావేశంలో నుండి జాలువారిన చక్కని కథ ఇది. మనిషిలో ఆత్మవిశ్వాసం ప్రేరేపిస్తే చాలు - మరోమందు అవసరం లేదనే చక్కని కథ "మందు".

ఇక "రిసెర్చి" స్టూడెంటు - ఆడపిల్లైతే ఆ పిల్లని తన శారీరక వాంఛ తీర్చనిదే "పాస్" చేయననే అపర కీచకుల్లాంటి ప్రొఫెసర్లకు కనువిప్పు కలిగించే "రీ-సెర్చి" కథలోని "వారుణి" అనే విద్యార్థిని - శారీరకంగా అబల అయినా, తెలివితేటలు, దృఢ నిశ్చయంతో "సబల"గా తనని తాను మలచుకొని ఎప్పటికప్పుడు తెలివిగా ప్రవర్తించి, ఆ కీచకుడికే కనువిప్పుకలిగించి, ఆయనలో మానసిక మార్పు తేగలిగిన పరోక్ష శక్తిస్వరూపిణి. ఇలాటి పదిమంది ఆడపిల్లలు కలసికట్టుగా ప్రవర్తిస్తే - అలాటి కీచక ప్రొఫెసర్లను నలుగురిలో నిలబెట్టి - లక్షలాది విద్యార్థినులను మానసిక బలహీనత - భయం నుండి కాపాడనూవచ్చు. అలాటి ప్రొఫెసర్లకు బుద్ధి చెప్పనూవచ్చు. "రీ-సెర్చి" అనే కథ - ఎంతో ఆలోచింపజేసేది - సమాజానికి సందేశాన్ని ఇచ్చేది. "ఉగాదికి ఉచితం" అనే చిన్న కథ - రచయిత్రి హాస్యరస పోషణకు నిదర్శనంగా - చొప్పదంటు

ప్రశ్నలకు చక్కని సమాధానాలూ, సలహాలు రూపంలో ఇచ్చి - పాఠకులను నవ్వుల జల్లులో ముంచెత్తారు.

రాధిక గారికి - సహజమైన శైలి, సమాజ సమస్యల పట్ల అవగాహన, నిండుగా, దండిగా వున్నాయి.

ఈ రచయిత్రి కలం నుండి - ఇంకా ఎన్నో ఎన్నో సమసమాజ దర్పణాల్లాటి రచనలు వస్తాయనీ, రావాలనీ ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ...

అమ్మగారు.

- పవని నిర్మల ప్రభావతి

# స్వగతం



1977లో "రాధిక" కలం పేరుతో ఐర్లాండు నుండి రాసి పంపిన 'అమ్మాయిలూ జాగ్రత్త' కథను అచ్చువేసి ఆంధ్రప్రభ నన్ను రచయిత్రిని చేసింది. మొదటి బహుమతీ ఆంధ్రప్రభే యిచ్చింది.

నేను మహా రచయిత్రినని నాసాటివారు ఎవరూ లేరని నా అభిప్రాయం. అది నా ఒక్కదాని అభిప్రాయమే కాదు. ఆంధ్రప్రదేశ్ మొత్తంలో. మా అమ్మది కూడ.

నా రచనలు, కథలు, మినీ కథలు, వ్యాసాలు, పిల్లల కథలు, కవితలు, మినీ నవలలు - ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, పత్రిక, ఆంధ్రజ్యోతి, వనితాజ్యోతి, అమృత్ కిరణ్, జయశ్రీ, కావ్యజ్యోతి, మయూరి, పల్లకి, తరంగిణి, జాగృతి మొదలగు వాటిలో వచ్చాయి. కాకినాడ లోకల్ పేపర్ సర్కార్ ఎక్స్‌ప్రెస్, శ్రీకాకుళం మహోదయలోనూ వచ్చాయి. రేడియోలో దాదాపు 15 కథల వరకూ ప్రసారమయినా నాకు ఒకేసారి ఫెయిర్ తప్పించి, రఫ్ వ్రాయడం అలవాటు లేని చెడ్డగుణం ఉండడం వలన వాటి కాపీలు నా దగ్గర లేవు. (రికార్డు చేసికున్నాను). అప్పట్లో జిరాక్సులు అంతగా లేవు. పైగా నాకు ఆ ఆలోచన రాలేదు కూడ. టి.వి.లో శలవు దొరికింది - 1987లో పెద్ద నాటిక ప్రసారమయింది.

ఇటీవల కాలంలో కథలు వ్రాయడం మానేశాను గాని, తలకు నూనె, మొహానికి పౌడరు వ్రాయడం మానలేదు. (చిన్నప్పుడు డ్రాయింగులోను, ఆటల్లోనూ, బహుమతులు వచ్చాయి).

ఇందులో "హత్య కాని హత్య" నిజంగా జరిగింది. మిగిలిన వన్నీ ఊహాజనితాలే.

నా కథలు మొత్తం యింతే కాదండోయ్. తిరిగి వచ్చినవి పాతికపైనే ఉన్నాయి.

కథల పుస్తకాలు ఇన్‌స్టాల్‌మెంట్‌లో చదివితే ఇంటరెస్టుగా ఉంటాయి.

ఇది నా స్వగతం. ఇక కథల్లోకి స్వాగతం....

☆ ☆ ☆

# బహుమతులు

**ఆంధ్రప్రభ** : "నలుగురు కలసి నవ్వే వేళ", 'దీపావళి కథల పోటీలో రెండవ బహుమతి (12-01-1986).

**ఆంధ్రభూమి** : "నవయుగ కుంతి", పేజీ కథల పోటీలో మొదటి బహుమతి (16-02-1989).

"గోల్డ్‌మైన్" సెంటర్ సెన్సేషన్ కథల పోటీలో నాలుగవ బహుమతి (20-10-1988).

"చ్పిపిథక", పిచ్చి కథల పోటీలో 2000 పైసలు బహుమతి పొందిన సెమిపిచ్చి కథ (16-02-1989).

**ఆంధ్రభూమి (పేపర్)** : "యోగ్యత", చిన్న కథల పోటీలో కన్సొలేషన్.

**ఆంధ్రభూమి (మంత్లీ)** : "పెళ్ళి మీద పెళ్ళి", పొట్టి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి (మే 1995)

**వనితా జ్యోతి** : "ఇది మరోరకం శిక్ష", మూడవ బహుమతి (అక్టోబరు 1987).

**అమృత్ కిరణ్** : "ఇన్‌స్టాల్‌మెంట్ డెత్", తృతీయ బహుమతి (10-02-1989).

బెల్లంపల్లి నాగార్జున కల్చరల్ అసోషియేషన్‌వారు నిర్వహించిన కవితల పోటీలో **'రాజకీయ నాయకులు'** కవిత, వ్యాసాల పోటీలో **'మన దేశ సమగ్రత-మనకర్తవ్యం'** అన్నదానికి, విజయవాడ విశ్వహిందూ కళాపరిషత్‌వారు నిర్వహించిన కవితల పోటీలో ప్రథమ బహుమతి.

షిరసం విశాఖపట్నం పోర్టుట్రస్టువారు నిర్వహించిన హాస్య కథల పోటీలో 4-10-1993న "**బదిలీ**" కథకు బహుమతి శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావుగారి చేతుల మీదుగా అందుకోవడం, భరాగోగారి ఆధ్వర్యంలో 27-11-1989లో విశాఖ సాహితీ వనభోజనాల్లో నిర్వహించిన తక్షణ కథల (ఇన్‌స్టెంట్) పోటీలో "**సంగీతం**" కథకు మూడవ బహుమతి శ్రీ రావిశాస్త్రిగారి చేతుల మీదుగా అందుకోవడం.

విజయనగరం విజయభావన ప్రతి సంవత్సరం నిర్వహించే ఉగాది కవితలు - ఒకసారి శ్రీమతి మాలతీ చందూర్‌గారి సమక్షంలో, మరో తూరి కరుణశ్రీగారి సమక్షంలో చదవడం అదృష్టంగా భావిస్తున్నాను.

# అవార్డులు

మనోరంజనివారి **కల్యాణి సాహితీ అవార్డు** - కథకు

**మాదిరెడ్డి సులోచన అవార్డు** (సిని హీరో కృష్ణ, విజయనిర్మలగార్ల చేతులమీదుగా) - నవలకు

రేపల్లె యునెస్కోవారు (బట్టు హరిబాబు) "**యునెస్కో సాహిత్య శిరోమణి అవార్డు**" ఇచ్చారు.

# కృతజ్ఞతలు

నన్ను రచయిత్రిగా పుట్టించిన దేవునికి. నాకు జన్మ నిచ్చిన తల్లిదండ్రులకు. చిన్నప్పుడు పుస్తక పఠనం అలవాటు చేసి పరోక్షంగా నేను రచయిత్రిని కావడానికి దోహదం చేసిన అక్క 'ప్రభ'కు. రేడియోలోని సమస్యా పూరణాన్ని పూరిస్తుంటే, వాటిని చూసి, మెచ్చుకొని 'వారెవా భలే చలాకి బాలవే కస్తూరి భాయి' అంటూ నాపై పద్యం వ్రాసిన మా కొత్తపేట హైస్కూలు తెలుగు మాస్టారికి. (చిన్నతనంలో ఆ పద్యం దాచుకోవాలని తెలియలేదు. అందుకే మిగిలిన పాదాలు గుర్తులేవు.)

గోరంత ప్రశంసతో బొల్డంత ఆశను నాలో నింపిన, మా చిన్నాన్నగారు కీ॥శే॥ సరిపెల్లి సుందరరావు (రిటైర్డ్ జిల్లా జడ్జి)గారికి.

నాకు మంచి భర్తను ప్రసాదించిన మా అత్తమామలు శ్రీమతి గెద్దాడ నరసమ్మ, కీ॥శే॥ గెద్దాడ బ్రహ్మయ్యగార్లకు. నన్ను అనునిత్యం ప్రోత్సహిస్తూ, అనురాగం పంచి యిచ్చే శ్రీవారికి.

నా కథలను అచ్చువేసిన అన్ని పత్రికల ఎడిటర్లకు, ప్రసారం చేసిన రేడియో వారికి (ముఖ్యంగా బి. కృష్ణశాస్త్రిగారికి) టి.వి. వారికి.

అవార్డులనిచ్చిన వారికి, విజయనగరం విజయ భావనకు. నా కథలకు చక్కని బొమ్మలు వేసిన ఆర్టిస్టులకు. ఆ బొమ్మలు బాగా ఉండడం వలన వాటినే ముఖ చిత్రాలుగా వాడుకున్నాను. అవి వేసిన ఆర్టిస్టులకు ప్రత్యేక కృతజ్ఞతలు.

నలుగురు కలసి నవ్వేవేళ కథ జడ్జి అయిన మధురాంతకం రాజారాంగారికి. ఉగాది కవితలు వేస్తున్న శ్రీలేఖ సాహితీ శ్రీ టి.రంగస్వామిగారికి. బెల్లంపల్లి నాగార్జున కల్చరల్ అసోసియేషన్ వారికి.

నా కథలను చదివి ముత్యాల పళ్ళెంలో రతనాల మాలగా మలచిన శ్రీ మిరియాల రామకృష్ణగారికి.

కథలలోని భావాలను అందరికీ అర్థం అయ్యేలా పొదిగి ఇంకా కొన్ని జీవిత సత్యాలను తెలియజేసిన శ్రీమతి పవని నిర్మల ప్రభావతిగారికి, పుస్తకం ఒద్దికగా ప్రింటుచేసి యిచ్చిన శ్రీ పూషాగారికి.

పోస్ట్‌మెన్‌లకు.

నేను ఎవరికైనా కృతజ్ఞతలు చెప్పడంలో మరచిపోయి ఉంటే మన్నించవలసిందిగా కోరుతున్నాను. వారితో అక్షింతలు వేయించుకోడానికి సిద్ధంగా ఉన్నాను.

★ ★ ★

# ఇందులో...

☆ ☆ ☆

"శిల్ప ప్రభావాన్ని బట్టి చూస్తే అద్వితీయ మనిపించే గొప్ప కథ 'నలుగురు కలసి నవ్వేవేళ', గడచిన అర్ధశతాబ్దిలో తెలుగు మహిళ ఎదుర్కొన్న దుర్భర, దుస్సహ పరిస్థితుల్ని చిత్రించే కథలతో ఒక సంపుటం వేయాలనుకుంటే అందులో 'పూర్ణమ్మ కథ' ఆదిలోను, 'నలుగురు కలసి నవ్వేవేళ' ఆఖరులోను ఉండవలసినవి. వినీలాకాశంలో విహరించే అందమైన పావురాళ్ళలో ఒక్కటి ఇంకాస్సేపట్లో వేటగాడి క్రూరబాణానికై బలై భూపతనం కాగలదని ఎవరూహించగలరు? ఇంతకూ ఆ వేటగాడు, ఆమెను పెళ్ళాడిన వాడా, కుటుంబ సభ్యులా, లేక వాళ్ళ ఆటల్ని అలా సాగనిచ్చే సమాజమా అన్నది బుద్ధిజీవులు ఆలోచించదగ్గ విషయం. వికృత మనస్తత్వం ఉన్న వ్యక్తుల మధ్య ఎదురయ్యే జీవితకాలపు వేసటకన్నా, మన సెరిగి మన్నన చేసే మంచి స్నేహితురాళ్ళతో సరససల్లాపాలాడే కొన్ని నిమిషాలే ఈ జీవితానికి చాలునన్నట్టుగా నాశనమైన తన జీవితాన్ని, అటువంటి అకృత్యానికి పాల్పడిన కర్కోటకపు సమాజం ముఖంమీద విసిరేసిపోయిన ఈ ధీరురాలి కథ తెలుగు కథా సాహిత్యం గర్వించదగ్గ కథల్లో ఒకటిగా ఉంటుంది."

- మధురాంతకం రాజారాం

(దామల్ చెరువు)

# నలుగురు కలసి నవ్వే వేళ!

కోణార్క ఎక్స్‌ప్రెస్ హుందాగా, అందంగా కోణార్క శిల్పాన్ని నేనే సుమా అన్నట్లు రైలు పట్టాలపై నిలుచుని ఉంది. సికింద్రాబాద్ ప్లాట్‌ఫారమ్ పెళ్ళి పందిరిలా ఉంది. ప్రయాణికులు అందరూ హడావిడిగా, కోలాహలంగా గోల చేస్తూ తిరుగుతున్నారు. ఠీవిగా నిలుచున్న కోణార్క్ ఎక్స్‌ప్రెస్ లోనికి చారుమతి, రాజేష్‌లతో పాటు మరో నలుగురు అమ్మాయిలు ఎక్కారు. వారు ఎక్కుపెట్టిన విల్లుల్లా, భవిష్యత్తులో కూడా లోకంలోని ఆనందమంతా తాగేస్తాం అన్నట్లు అందర్నీ తప్పించుకుని దూసుకుపోతున్నారు. వారు అప్సరసలు కాదు, కాని అందగత్తెలే. చూసే కొద్దీ చూడాలనిపించేవారే. చారుమతి, రాజేష్‌లు నవ దంపతులు. కూర్చున్న తరువాత "ట్రయిన్ ఎప్పుడూ ప్లాట్‌ఫారమ్ మీద నిలబడి ఉంటుంది ఎందుకు?" అపర్ణ అడిగింది. అందులో అందరికంటే ఎక్కువ అందమైనది, సరదా అయినది ప్రత్యేకంగా సుస్మిత ఒక్కతే. మిగిలిన వారికందరికీ జోక్స్ వెయ్యడం కంటె నవ్వడం బాగా వచ్చు.

"ఆఁ ఏం లేదు. దానికి కూర్చోవడం చేతకాక." సుస్మిత అంది. అందరూ నవ్వారు. "ఇదేదో సినిమాలో జోక్ లాగుందే" రమ్య అంది. "సినిమాలోదైనా, మరేదైనా సమయానుకూలంగా జోక్ చెప్పడం కూడా ఒక కళ" అపర్ణ అంది.

"ఏమిటి కళల మీద కవిత్వం చెబుతున్నారు?" నిరీక్షణ అంది.



"లేకపోతే నీమీద చెప్పమంటావా? నిరీక్షణ అమావాస్య నిశీధిలా తెల్లగా ఉంది." స్మిత మాటలకు నిరీక్షణ ఉడుక్కుంది.

వారు అయిదుగురూ ఆడ పంచపాండవులలాగ ఉండేవారు విశాఖపట్నంలో కాలేజీలో. అందులో నిరీక్షణ, అపర్ణ, రమ్యలకు ముందుగా పెళ్ళిళ్ళు అయిపోయాయి. వారందరూ సుస్మిత పెళ్ళిలోనే ఆఖరుసారి కలుసుకున్నారు. ఇప్పుడు మరలా చారుమతి పెళ్ళిలోనే కలవడం. సుస్మిత పెళ్ళి అయిన తరువాత ఆమె కాపురం సంగతులు వారికి తెలియవు. తెలుసుకోవాలనే ఆరాటం అందరిలోనూ ఉంది. అంతకు ముందు రోజే చారుమతికి పెళ్ళి అయింది. చారుమతి వాళ్ళ అమ్మమ్మ ఊరిలో పెళ్ళి చేయాలని పట్టుబట్టడంతో పెళ్ళి హైదరాబాదులో జరిగింది. పెళ్ళి కాగానే అందరూ విశాఖపట్నం బయలుదేరారు. అందరూ డిగ్రీచేశారు. పెళ్ళిళ్ళు చేసుకున్నారు.

రన్నింగ్ రేస్‌కి బయలుదేరుతున్నట్టు ట్రెయిన్ కదిలింది. ట్రయిన్‌లో ఉన్నవారి సుఖదుఃఖాలతో ప్రమేయం లేకుండా అది సాగిపోతుంది. అందులో ఎవరు ఎలాంటివారైనా అందరినీ ఒకేవిధంగా వారి వారి గమ్యాలకు, తారతమ్యాలు చూపకుండా చేర్చాలని దాని తాపత్రయం. పెళ్ళి కొడుకు రాజేష్ ఏమనుకున్నాడో వారి దగ్గరినుండి వెళ్ళిపోయి మరోచోట పెళ్ళి బంధువుల దగ్గర కూర్చున్నాడు.

"ఏమిటో. చారుమతి! మీ ఆయన అలిగాడా ఏమిటి? దూరంగా కూర్చున్నాడు" చారుమతి సిగ్గుపడింది అందంగా. విరిసీ విరియని పువ్వు ఆకుల మధ్య దాగినట్టు మొహం క్రిందకు వుంచుకుంది భర్తను గుర్తు చేయగానే. వారి అయిదుగురి పుట్టిళ్ళు విశాఖపట్నమే. అత్తారిళ్ళు మాత్రం వేర్వేరు ఊర్లు.

'ఆఁ అలిగాడు. అలకపాన్పు మీద ట్రెయిన్ కొనిమ్మని అడిగాడట. మామగారు ట్రెయిన్ కొనివ్వలేదని, ఇంకెప్పుడూ ట్రెయిన్‌లో మీ అమ్మాయి పక్కన కూర్చోను అని అలిగాడట." స్మిత మాటలకు అందరూ నవ్వారు. పువ్వులు విరిసినట్టు.

"ఇదేం కోరిక! చిన్నపిల్లాడిలాగ. పోనీ ఆడుకుంటానంటే లియో టాయిస్ ఉన్నాయిగా!" రమ్య అంది.

"అబ్బే! వాళ్ళింట్లో జనాభా చాలామంది ఉన్నారట. ఎంబాసిడర్‌లో అయితే సరిపోరట పాపం!" రమ్య అంది.

"ఎంబాసిడర్ సరిపోకపోతే ఏ లారీయో అడగాలిగాని ట్రెయిన్ ఏమిటి?"

"లారీలో కూడా సరిపోరట పాపం, వారి చుట్టాలు!" స్మిత అంది. వారు మాట్లాడుకుంటుంటే, నవ్వుకుంటుంటే చుట్టపక్కలవారు వింతగా చూసినా ఆ అమ్మాయిలు ఎవరినీ కేర్ చెయ్యడం లేదు. మేము టికెట్ కొనుక్కున్నాము కాబట్టి

మాకు మాట్లాడుకోవడానికి, నవ్వుకోడానికి సర్వ హక్కులూ ఉన్నాయి అన్నట్టు ప్రవర్తిస్తున్నారు.

"ఏయ్, స్మితా! అలకపాన్పు మీద మీ వారు ఏమి కోరారు?" రమ్య అడిగింది.

"నా ప్రాణాలు" నవ్వుతూ అంది.

"ఏం మీ ఆయన యమధర్మరాజా! ప్రాణాలు ఎందుకు? జోక్ చెయ్యక సరిగా చెప్పు."

"పోనీ నిజం చెప్పనా? నా నవ్వులు!"

"నవ్వులా ఏం చేసుకుంటాడట? పువ్వులు గుచ్చి నీ మెడలో వెయ్యడానికా?"

"కాదు తీసుకెళ్ళి సముద్రంలో పారేయడానికి" స్మిత అంది.

"మీకు సముద్రం దగ్గర లేదుగా! పాపం ప్రయాణం ఖర్చులు దండుగ." అపర్ణ.

"మీ వారికి హాస్యం, లాస్యం ఇష్టమేనా?" నిరీక్షణ అడిగింది.

"హాస్యం, లాస్యం నాకెంత ప్రాణమో. ఆయనకు అవి చంద్రుడు, సూర్యుడూలాంటివి. అవి అందవు ఆయనకు. నోరుంది నమలడానికి గాని, నవ్వడానికి కాదు అంటారు."

"మీ ఆయన పేరు అశోక్ కదా! అందులో 'అ' తీసేసి శోకబ్రహ్మ అని బిరుదు ఇచ్చేయి. పద్మశ్రీ కూడా ఇవ్వచ్చేమో శోకబ్రహ్మలకు" రమ్య.

"పద్మశ్రీ ఎందుకు? జయశ్రీ ఉందిగా!" నవ్వింది స్మిత.

"నీవు పెళ్ళయినా కథలు అల్లడం, చెప్పడం మానలేదన్నమాట" నిరీక్షణ.

"అమ్మో! మానేస్తే ఎలాగ? అవి నా ప్రాణం."

"మీ అత్తగారు నీపెళ్ళికి కట్నం తీసుకోలేదుగా! బాగా చూస్తారా?"

"అవును. ఆవిడ చాలా మంచివారు. కట్నం వద్దన్నారు. ఆస్తిహక్కు కావాలన్నారు"

"ఆస్తి అడిగారా?" ఆశ్చర్యంగా అడిగింది అపర్ణ.

"ఏం అంత ఆశ్చర్యపోతావు? ఆవిడ ఏమీ వేరే గ్రహంమీద నుండిగాని, వేరే దేశం నుండిగాని రాలేదు. ఆవిడ పదహారణాల భారతీయ అత్తగారు. సారీ పదహారణాలు కదా, అణాలు ఇప్పుడు లేవుగా! పదహారు పైసలు!" స్మిత చెప్పే తీరుకి నవ్వకుండా ఉండలేకపోయారు అందరూ.

"ఛ! అత్తగార్లను గుర్తు చెయ్యకే! నాకు కిరోసిన్ జ్ఞాపకం వస్తుంది." రమ్య అంది.

"మా అత్తగారు అంత పాతకాలం ఆవిడ కాదు, కిరోసిన్ వాడడానికి?"

"మరేం వాడతారు"

"ఏ గేస్ స్టౌ అయినా, స్లీపింగ్ పిల్స్ అయినా వాడతారు."

"ఛ! మరీ అన్యాయంగా మాట్లాడుతున్నావు!" నిరీక్షణ అంది.

"న్యాయంగా మాట్లాడాలి అంటే అబద్ధం ఆడాలి. నాకు ఆడపిల్లని కనడం ఇష్టం లేదు."

"ఆడపిల్ల అంటున్నావు. ఏమైనా విశేషం ఉందా? కంగ్రాచ్యులేషన్స్!" అపర్ణ.

"విశేషం లేదుగాని. విషం ఉండే ఉంటుంది మా ఇంట్లో!" స్మిత.

"ఎవరికీ విశేషాలు లేకపోతే అందరం ప్రస్తుతం ఫ్యామిలీ ప్లానింగ్‌ని ఫాలో అవుతున్నా మన్నమాట. బాబోయ్ మన భారత దేశం బాగుపడిపోతుంది. నేనేం చెయ్యాల్రోయ్! నేను భరించలేనురోయ్!" నాటకీయంగా అంది రమ్య.

"ఫామిలీ ప్లానింగ్ వాళ్ళమో, భర్తలను ఫాలోయింగ్ వాళ్ళమోగాని మన పెళ్ళిళ్ళు అయిపోయాయి. ఈసారి మనం కలిసేది బారసాలకే" నిరీక్షణ అంది.

ఇంతలో చారుమతి మొహం వికారంగా పెట్టేసింది.

"ఏం అలా వున్నావు!" అపర్ణ అడిగింది.

"వాంతొచ్చేలా ఉంది. నాకు ఈ ట్రెయిన్‌లు, బస్సులు పడవు."

"అప్పుడే వాంతొస్తుందా? నిన్నేగా పెళ్ళయింది. మరీ ఇంత ప్రొగ్రెస్సా!" స్మిత అంది.

"ఛీ పోవే! నాకు కడుపులో తిప్పుతుంటే నీ గోల నీది." చారుమతి అంది.

రమ్య హేండ్‌బేగ్‌లోంచి ఏలక్కాయ తీసిచ్చింది. నోట్లో వేసుకోమని.

రమ్య అంది. "తరువాత తరువాత ఇలా అందరం ఒంటరిగా కలుసుకోవడానికి కుదరదు. మొగుళ్ళను అయితే బుట్టలో పెట్టి, అందరం ఒక్కొక్కళ్ళమే వచ్చాము. పిల్లలు పుడితే వారిని చంకలో వేసుకుని రాకతప్పదు."

"పెళ్ళయితే స్వేచ్ఛ పోయిందని అనుకున్నాంగాని, మన భర్తలు మంచివారే!" అపర్ణ.

"ఒక జోక్ చెప్పనా" అని స్మిత అంది.

"చెప్పు." అందరూ ఒకేసారి అన్నారు.

"మాపక్కింటి వాళ్ళు తమిళియన్స్. ఆవిడకు తెలుగు సరిగా రాదు. మీ హజ్‌బెండ్ ఆఫీసునుండి వచ్చారా అనడానికి 'మన హజ్‌బెండ్ ఆఫీసునుండి వచ్చారా? అంటుంది.."

అందరూ తెరలు తెరలుగా ఫక్కున నవ్వారు. సముద్రపు అలలు సంతోషంతో ఎగసి పడుతున్నట్లుంది వారు నవ్వుతోంటే. ఇప్పుడు ట్రయిన్‌లోని చుట్టూ ఉన్నవారు వారి అల్లరికి అలవాటు పడిపోయారు. వింతగా చూడడం లేదు. వీలుంటే ఒక చెవి వీరివైపు పడేస్తున్నారు.

అలా నవ్వుతూంటే చారుమతికి పొలమారింది. అది చూసి రాజేష్ హడావిడిగా వచ్చాడు. అతని కంగారు చూసి మరింత నవ్వారు.

"కొత్త పెళ్ళి కొడుకు కదా! కంగారెక్కువ. కొత్త భార్యను, కొత్త కారును చాలా అపురూపంగా చూసుకోవాలి అని ఎక్కడో చదివినట్లున్నాడు." స్మిత అంది.

చారుమతి చిరుకోపం ప్రదర్శించింది. "మీరు మరీ ఘోరంగా మాట్లాడుతున్నారు." అంది.

"అవి భర్త లక్షణాలు" అపర్ణ అంది.

"మగవాడు భర్త లక్షణాలు సంపాదించడానికి చాలా వ్యవధి పడుతుందట. కాని స్త్రీ భార్య హోదా పొందడం మహాతేలికట." స్మిత అంది.

"నీ సొంత వాక్యమేనా?" నిరీక్షణ.

సొంత వాక్యమైతే ఆ 'ట'లు ఎందుకు ఉపయోగిస్తాను అని - "అసలు ఆడవారికి తృప్తి అనేది తక్కువ. ఆడవారు పెళ్ళి కాకముందు, పెళ్ళి అయ్యి భర్త వస్తే చాలనుకుంటారు. తీరా పెళ్ళయిన తరువాత భర్తను తప్పించి అన్నీ కోరుకుంటారు."

"అది నీ జీవితానుభవమా?" రమ్య అడిగింది.

"నీది కాదు, నాదీ కాదు, మన ఆడవారి జీవితానుభవం!" అపర్ణ.

"వార్ధక్యం, వివాహం అందరూ కోరతారట. తీరా వచ్చిన తరువాత విచారిస్తారట. మా వారు అంటారు ఎప్పుడూ!" రమ్య అంది.

"అయితే మీ ఆయన పెళ్ళి చేసుకున్నందుకు విచారిస్తున్నారన్న మాట." స్మిత అంది.

"మరి ఆయన స్వాతంత్ర్యాన్ని రమ్య ఎప్పుడో హస్తగతం చేసేసుకుందిగా!" అపర్ణ అంది.

"నేను మాత్రం వార్ధక్యాన్ని కోరుకోను." స్మిత అంది స్థిరంగా.

"ఏం, ఇలాగే ఉండిపోతావా?" రమ్య ప్రశ్నించింది.

"తప్పకుండా. మీరందరూ ముసలి వాళ్ళయినా నేను మాత్రం కాను. చూస్తూ ఉండండి."

"ఏం? మీ వారు ఏమైనా అమృతం పోశారా?"

"ఆ! పోశారు. అమృతంలాంటి విషం. ఎంత బాగుందో, కాడ్‌బరీలాగ" నోరు చప్పరించింది.

"మీ వారు నిన్ను ఎలా చూస్తారు?" అపర్ణ అడిగింది.

"ఎలా చూస్తారు? అందరిలాగే కళ్ళతో చూస్తారు. కాళ్ళతో తన్నుతారు. బెల్టుతో కొడతారు. గరిటతో కాలుస్తారు." పకాపకా నవ్వింది.

"అందరిలాగే అంటున్నావు. మా వారు అలా చెయ్యరు." నిరీక్షణ అంది.

"అయితే మీ వారు మగవారే అన్నమాట. మనిషే అన్నమాట!"

"మీ ఆయన నలుగురిలోనూ కలుస్తారా?" రమ్య అడిగింది.

"ఊహూఁ!, ఆయనకు ఒంటరితనం అంటే ఇష్టం. ఆఖరికి పడగ్గదిలో కూడా!"

"ఒంటరితనమా?" ఆమె హేళనగా, సరదాగా చెబుతున్న జవాబులు ఇంటరెస్టుగా వింటూ ప్రశ్నించారు అందరూ ఒకేసారి.

"అవును. పెళ్ళవగానే పాత పద్ధతులు మార్చుకొని పెళ్ళాం కొంగుకి ముడిపడకూడదనేది ఆయన వాదన" అందరూ నవ్వారు, స్మిత అన్నమాట తీరుకి. స్మిత మాత్రం కిటికీలోనుండి చూస్తూ ఉండిపోయింది సాగే చెట్లవైపు. నిజానికి సాగేవి చెట్లు కాదు. ట్రయిన్ మాత్రమే. కాని ట్రయిన్ పరుగుపెడుతూ చెట్లు పరుగుపెడుతున్న భ్రమ కలిగిస్తుంది. జీవితం కూడా ఒక భ్రమేనేమో!

"మరి మీ అత్తగారు ఏమంటారు?"

"ఏమంటారు? 'ఏమే దౌర్భాగ్యపుదానా! మీ అన్నయ్యను అడిగి ఇంకా ఆస్థి పట్టుకురా' అని పట్టుకుని మరీ పట్టుబడతారు. ఆవిడ మా ఆయనలా కాదు. చేత్తో కొడతారు. ఎందుకంటే ఆవిడ' పాంటు వేసుకోరుగా? నడుముకి బెల్టు లేదుగా?"

"చాల్లే, స్మితా! మీ అత్తగారిని రాక్షసిలా చిత్రిస్తున్నావు"

"మీ అన్నయ్య నీకు ఏమీ ఆస్తి ఇవ్వలేదా?"

"ఒక ఇల్లు ఇచ్చాడు. తనొక ఇల్లు పెట్టుకున్నాడు. ఇస్తూ ఇస్తూ మరలా పుట్టింటి గుమ్మం తొక్కద్దు అని లక్ష్మణరేఖ గీశాడు. తాను రామాయణ కాలంనాడు పుట్టాననుకుంటాడు. అందుకే నేను ఇంక పుట్టింటికి వెళ్ళకూడదు."

"మీ వదిన ఏమనలేదా?"

"ఎదుటి వారిని ఏడిపించడంలో మాత్రం అన్నయ్యను ఎప్పుడూ అనుసరిస్తుంది."

ఇంతలో ట్రెయిన్ ఆగింది. రాజేష్ వచ్చి అందరికీ టిఫిన్ తెచ్చి ఇచ్చాడు. అందరూ వద్దు వద్దు అంటూనే అందుకున్నారు. అందరూ తిన్నారు.

"అసలేమీ బాగాలేవు. కాఫీకూడా చండాలంగా ఉంది. ఎలా చేస్తారో ఏమో?" రమ్య అంది.

"మంచినీళ్ళు మాత్రం బావున్నాయి. ఎవరు వండారోగాని" స్మిత మాటలకు మరొక్కసారి అందరూ ఫక్కున నవ్వారు. మంచినీళ్ళు ఆ కుదుపుకి అపర్ణ చీరమీద పడ్డాయి.

"అబ్బ! నీ మాటలకు నాచీర పాడైంది."

"పాడైనా ఫరవాలేదులే. ఇప్పుడు నీకేం పెళ్ళి చూపులు కాదు ఇక్కడ."

"అయితే పెళ్ళి చూపులకు మాత్రమే మంచిగా ఉండాలా."

"ఆడది ఎక్కడ ఎలా ఉన్నా పెళ్ళి చూపుల్లో మాత్రం లక్షణంగా కనబడాలి. లక్షల కట్నం ఇవ్వాలి."

"ఆస్తి హక్కు వచ్చిందిగా! లక్షలు కట్నం రోజులు పోతాయి."

"నిజమే! ఉరి పోసుకోవడానికి చేంతాడు బదులు ప్లాస్టిక్ తాడు" స్మిత అంది.

తరాలు మారుతున్నాయి. తరాలతోపాటు స్త్రీ సమస్యలూ మారుతున్నాయి గాని, సమస్యలు మాత్రం పోవడం లేదు. అప్పటికి, ఇప్పటికి, ఎప్పటికి మగవాడు హాయిగానే ఉన్నాడు.

"మీ అన్నయ్య ఇచ్చిన ఇంట్లోకి మారిపోయారా?" అపర్ణ అడిగింది.

"అది అమ్మేశాముగా?" స్మిత అంది.

"అమ్మేశారా?" ఆశ్చర్యంగా అడిగారు అందరూ.

"అమ్మేశారా కాదు, కొనేశారా కాదు, ఏ సారా అయినా మా ఆయనకు మంచినీళ్ళప్రాయం. మరోచోట ఇల్లు కొని జయశ్రీని అందులో పెట్టారు. అలా చేసినందుకు ఎవరైనా పద్మశ్రీ ఇస్తారా అని గుమ్మంలోనే కూర్చుని ఎదురుచూస్తున్నాను."

"నీ ఆస్తి మరొకరికా? జోక్ చెయ్యకు."

"మన ఆడవారి జీవితమే మరొకరిది. ఇంక ఆస్తి ఎందుకు మనకు? అసలు బ్రహ్మదేవుడు ఆడవారిని అమీబాల్లాగ సృష్టించి, అసలు కళ్ళు, ముక్కు, చెవులు, నోరు, మాటలు ఎందుకిచ్చాడో! మెదడు లేకుండా చేసేస్తే ఆలోచనలూ, ఆవేదనలూ

ఉండవుకదా! ఆడది ఒక ద్రవ పదార్థం మగవాడి దృష్టిలో. ఎందులో వేస్తే ఆ రూపాన్నే సంతరించుకోవాలి గాని, సొంత రూపాలు, సొంత ఆలోచనలు ఉండకూడదు. ఆడది ఆడేదిగా ఉండాలంటాడు మగవాడు. తాను బాట్ అట, ఆడది బాల్ అట. బాట్ ఎప్పుడూ బాల్‌ని తన్నుతూనే ఉంటుంది."

"గొప్పగా ఇచ్చావే స్పీచ్! అబ్బా స్టేజ్ లేదుగాని అదిరిపోయిందనుకో!" రమ్య అంది.

"ఇంకా ఇస్తానే! అసలు జీవితం అంటే యౌవనం, వార్ధక్యం, పెళ్ళి, పిల్లలు, సుఖం, దుఃఖం అంటారుగాని - అందులో చావుని కూడా చేర్చాలి. చనిపోయిన వాడే ఏ ఆలోచనలూ లేక స్థిరంగా ఉండగలడు. బ్రతికున్నంత కాలం బాధలు తప్పవు."

"పెళ్ళయిన తరువాత వేదాంతం నేర్చుకున్నావా?"

"అవును. మరి మనకు కాలేజీలో నేర్పలేదుగా! నాజీవితమే నేర్పింది." పకపకా నవ్వింది స్మిత - ముత్యాలు గిన్నెలో వేసి గలగలలాడించినట్టు. అసలు ఆడదాని అందంలోనే అన్నిరకాల ఆభరణాలు ఉన్నాయి. ఇంకా ఆడదానికి ఆభరణాలెందుకో? ఆడదాని మంచి మనసు బంగారం, నవ్వులు ముత్యాలు, చూపులు పగడాలు, ప్రేమ వజ్రం అంతటి విలువైనది.

"స్మిత చాలా చిక్కింది కదూ!" రమ్య అంది.

"అవును. మాఅత్తింటి వారి చేతిలో చిక్కాను." నవ్వింది స్మిత.

"డైటింగా!" సన్నగా ఉన్నా, వారందరిలోనూ స్మిత అందం కొట్టొచ్చినట్టు కనబడుతోంది అందరికీ. చక్కనమ్మ చిక్కినా అందమేనట.

"కాదు, మా ఆడపడుచు మెడిసిన్ చేస్తోంది. ఎనాటమీకి శవాలు కావాలట. అమ్మా! మనింట్లోనుంచి వదిన్ని ఇచ్చేద్దామే అంది."

"ఆమెను మెడిసిన్ చదివిస్తున్నది మనుషులను చంపడానికా?"

"మా అత్తగారు మెడిసిన్ చదవకుండానే చంపగలరు."

"నీ ఆస్తి అమ్మడానికి ఎందుకు ఒప్పుకున్నావు?" నిరీక్షణ అడిగింది.

"నన్ను నొప్పించకుండానే నాతో సంతకం చేయించారు. మా వారు జాగ్రత్తగా నా చేయి పట్టుకుని నా చేతికి నొప్పి తగలకుండా సంతకం దగ్గర ఉండి చేయించారు. ఎంత మంచివారో చూడు." మరోసారి నవ్వింది స్మిత.

స్మిత ఎప్పుడూ అందర్నీ నవ్విస్తూ, తను నవ్వుతూ ఉంటుంది. అందరినీ ఒకే ఒక్కసారి ఏడ్పించింది. హైస్కూలులో పుత్తడి బొమ్మ పూర్ణమ్మ నాటకం వేసినప్పుడు.

"నలుగురు కలిసి నవ్వే వేళ నాపేరొకటి తలవండి" అంటూ పూర్ణమ్మ పాత్రలో లీనమై ఎంతో బాగా ఏక్ట్ చేసి అందరినీ ఏడ్పించింది.

"మరి మీ అత్తగారు ఇల్లు అమ్మవద్దు. సంతకం పెట్టవద్దు అనలేదా?"

"పాపం ఆవిడా మంచావిడే! సంతకం పెట్టేటప్పుడు నేనెక్కడ గింజుకుంటానో అని నోట్లో గుడ్డలు కుక్కి, కాళ్ళు కట్టేశారు అంతే! ఇంకా నయం. మంచావిడ కాబట్టి వదిలేశారు. మరొకరైతే నోటితోపాటు ముక్కులో దూదికూడా పెట్టి మూసేసేవారే!"

"నీకు చిన్నప్పటినుండి కథలు అల్లి చెప్పడం అలవాటేగా. ఈ కథ ఏ పత్రికలోది?" రమ్య అడిగింది.

"నిజమే! ఆ అలవాటు మానుకోలేకపోతున్నాను"

"మా దగ్గర చెబితే చెప్పావు. మీ ఆయన దగ్గర చెప్పకేం?" అపర్ణ అంది.

"చెప్పను. అసలు ఆయనతో మాట్లాడాలంటే ముందే జయశ్రీ దగ్గర అపాయింట్‌మెంట్ తీసుకోవాలి. ఇంక కథలు చెప్పడానికి అవకాశం ఏది?"

"ఏం మీ ఆయన అంత బిజీనా?"

"ఊహూఁ బిజీకాదు, మాజీ ప్రియురాలి దగ్గర ఉంటారు కదా!"

"మీ మరిది ఏం చేస్తున్నాడు? ఉద్యోగం దొరికిందా?" నిరీక్షణ అడిగింది.

"ప్రస్తుతం ఉద్యోగం లేక నావెంట పడుతున్నాడు."

"అంటే?"

"అన్నయ్య చేయలేని పని నేను చేస్తాను. ఎంతకాలం ఒంటరిగా ఉంటావు. అంటాడు."

"ఛీ! నీకు మరీ సిగ్గు లేదే." సరదాగా అంది అపర్ణ.

"మామగారు కూడా అలాగే అంటారు. నేను సిగ్గులేని దాన్నని. నీతిలేని దాన్నని. నన్ను వెంటాడేది మా మరిది. వేటాడేది మామగారు. ఏమైనా అంటే పుట్టింటికి పో! మా అబ్బాయికి వేరే పెళ్ళి చేస్తాం అన్న మాటలు, తప్పనిసరిగా ప్రొద్దున్నే సుప్రభాతంతో వినిపిస్తాయి." విషాదంగా నవ్వింది.

"నేనైతే అలాంటి ఇంట్లో ఉండను సుమా?" రమ్య అంది.

"నేనూ ఉండను. నీవే కాదు" స్మిత అంది.

"మీ అన్నయ్య దగ్గరకు వెళ్ళిపోతావా?"

"లక్ష్మణరేఖ గీశాడు. దాటి లోపలికి ఎలా వెళ్ళను?" స్మిత.

"దాటెయ్యి. చిన్నప్పుడు హైజంప్, లాంగ్ జంప్‌లు చేసేదానివిగా!" నిరీక్షణ అంది.

"ఆ జంప్‌లన్నీ ఇప్పుడు పనికి రావడం లేదు."

"ఏం? పని మానేశావా? బట్టలు కూడా ఉతకడం లేదా?" చారుమతి అంది.

"ఓహూ! పెళ్ళి కూతురు కూడా మాట్లాడుతూందే! వికారం తగ్గిందా?" వెక్కిరించింది స్మిత.

ఇంతలో 'చల్లని రాజా, ఓ చందమామా అని పాడుకుంటూ అడుక్కునేవాడు వచ్చాడు. "ఈ అడుక్కునే వాళ్లంటే నాకు చిరాకు బాబూ! వీళ్ళని..." అంటూ ఆగిపోయింది రమ్య.

"భిక్షం వేసి పంపించెయ్యాలి" అని మాట పూర్తిచేస్తూ పర్స్ తీసి పది రూపాయలు వేసేసింది స్మిత.

"ఏయ్, ఏమిటా పని అదెంతో తెలుసా?"

"తెలుసు. పది రూపాయలు. అల్లుడి హోదాలో అడుక్కుని భార్యను బాధించే వాళ్ళకంటే వీళ్ళేం తక్కువవాళ్ళు కాదు. రెండుపూటలా కడుపునిండా తిననియ్!"

బిక్షగాడు మాత్రం ముందు బిత్తరపోయినా తరువాత ఆ నోటు కళ్ళ కద్దుకొని గబగబా అక్కడినుండి వెళ్ళిపోయాడు. స్మిత ఆ నోటు లాక్కుంటుంది అని కాదు, ఆమె ఫ్రెండ్స్ లాక్కుంటారనే భయంతో.

"మరలా స్టేషన్ వస్తే బాగుండును!" స్మిత అంది.

"ఎందుకూ?" ప్రశ్నించింది చారుమతి.

"మీ ఆయనకు కూల్‌డ్రింక్స్ బిల్ అప్పజెప్పడానికి!" స్మిత మాటలకు చారుమతి నవ్వింది.

ఉన్నట్టుండి "మనుషులు ఒంటరిగా వెళ్ళేది ఎక్కడికి?" అడిగింది స్మిత.

"పైకి" వేలు పైకి పెట్టి చూపించింది రమ్య.

"కాదు. ఇంకో చోటు కూడా ఉంది" అంటూ చటుక్కున లేచి నిలబడింది స్మిత.

"ఏయ్! ఎక్కడికి?" కంగారుగా అడిగింది నిరీక్షణ.

"ఇదిగో ఇక్కడికి" అంటూ నాలుగు వేళ్ళు మూసి చిటికెన వ్రేలు చూపించింది.

"ఏయ్, నీకు కొంటెతనం పోలేదు."

"వెడతా, ఒంటరిగా వెళ్ళే చోటుకి" అంటూ టాయిలెట్‌వైపు వెళ్ళింది స్మిత.

స్మిత కొంటెతనం చూసి అందరూ నవ్వుకున్నారు.

"వాళ్ళ అత్తగారు, భర్త మంచివారేనట. స్మిత ఎందుకు అలా మాట్లాడుతుంది?"

"ఆ! దాని సంగతి కొత్తగా అడుగుతావెందుకు? ఏదైనా పుస్తకంలో చదివిన కథలు మనకు చెప్పడం మొదటినుంచీ అలవాటేగా!" అపర్ణ అంది.

"నిజమేనంటావా?"

"నిజం కాకపోతే అది చెప్పిన కథలన్నీ నమ్మేసి కడివెడు నీళ్ళు కార్చు."

ఇంతలో స్మిత వచ్చింది. ట్రెయిన్ ఎందుకో ఆగిపోయింది.

"మనం బయలుదేరిన తరువాత ఈ ట్రెయిన్ ఇలా ఆగిపోవడం అప్పుడే నాలుగవసారి. ఇలాగే ఈ బండి నడిచిందంటే చారుమతికి డెలివరీ కూడా ఇందులోనే అయిపోతుంది - మనం విశాఖ వెళ్ళేలోపుగా."

అందరూ నవ్వారు. చారుమతి సిగ్గుపడింది.

బండి ఆగడం తరువాయి కాఫీలు, కూల్‌డ్రింక్స్ వచ్చేశాయి. అందరూ అన్ని కూల్‌డ్రింక్స్ తాగారు. "ఇంకా కావాలాండి" అడిగాడు డ్రింక్స్ అబ్బాయి.

"ఇంకే మొద్దని చెప్పవే. బిల్లు కూడా!" స్మిత మెల్లగా అంది అపర్ణతో.

"మొత్తం అయిదు" అని లెక్కలు కడుతున్నాడు డ్రింక్స్ అబ్బాయి.

"అదిగో అక్కడ కనబడుతున్నారు చూడు. ఆయనకు ఇవ్వు" స్మిత అంది రాజేష్‌ని చూపిస్తూ.

"గోల్డ్‌స్పాటా, మజాకానా!" అన్నాడా అబ్బాయి.

"రెండూ కాదు. బిల్లు!" ఆ మాటలకు ఆ అబ్బాయి బిత్తరపోయినా మిగిలిన వారు గొల్లున నవ్వారు.

"నీవు ఊరుకోవే, స్మితా!" అంటూ చారుమతి పర్స్ తీయబోయింది.

"అబ్బో! అప్పుడే ఆయనగారు అంటే ఎంత ప్రేమ! ఏమీ అననివ్వడం లేదు."

వారు తాగిన కూల్‌డ్రింక్స్‌లో ఏ రకం హుషారు ఉందోగాని ఈ సారి వారు మరింత విజృంభించారు అల్లరితో.

చారుమతి ఇంకా మెల్లగా తాగుతూనే ఉంది.

"అబ్బ. ఎంతసేపే, బాబూ! త్వరగా తాగు. వేడిగా ఉందా! నీవు కొత్త పెళ్ళి కూతురివని దానికి తెలియదులే. మెల్లగా తాగనక్కరలేదు." స్మిత అంది.

"సీసాను కాదు, నోట్లో పట్టనుగాని పడితే నన్నే మింగేయాలని ఉంది. దానికి వాళ్ళాయనకు బిల్లు అప్పుజెప్పానని."

అందరితోపాటు చారుమతీ నవ్వింది.

వాళ్ళ మాటలు ట్రయిన్‌లోని వారికి డిస్ట్రబెన్స్ అయినాసరే మాదారి మాదేసుమా అన్నట్లు వాళ్ళు మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఒకరిమీద ఒకరు జోక్స్ వేసుకొని నవ్వుకుంటూనే ఉన్నారు.

ట్రయిన్ ఎందుకో ఆగిపోయింది. అప్పుడే చీకట్లు కమ్ముకొంటున్నాయి.

"అబ్బ! ఈ ట్రయిన్ ఇలా ఆగిపోవడం అప్పుడే అయిదోసారి." రమ్య అంది.

"ఈ ట్రయిన్ ఇలాగే ఆగుతూ వెళ్ళిందంటే చారుమతి కొడుక్కి అన్నప్రాశన రైల్వే భోజనంతో రైల్లోనే చెయ్యాల్సి ఉంటుంది చారుమతిని చూస్తూ వెక్కిరిస్తూ అంది స్మిత.

మరోసారి అందరూ నవ్వారు ఆనందంగా. పచ్చని కలశంలో మేలిమి ముత్యాలు వేసినట్లు వారి తీరు చూస్తుంటే గాలినే ఆనందంగా మలుచుకొని పీలుస్తున్నట్లుంది వారు.

"నాకు కథలు వ్రాయాలని ఉంది. మంచి కథ చెప్పవే!" రమ్య అడిగింది స్మితను.

"ఇప్పుడు చెప్పిన కథ వ్రాసెయ్యి!" స్మిత అంది.

"అందులో బలం లేదు."

"అయితే అపర్ణ వాళ్ళ ఆయన్ని అడుగు డాక్టరు కదా, ఒక టానిక్ ఇస్తారు!"

"సరేలే! ఎనాల్జిన్ ఎందుకు పనికొస్తుంది అని ఎన్నిసార్లు అడిగినా మాట్లాడరు. ఇంటినిండా మందులుంటాయిగాని ఏది ఎందుకు పనికి వస్తుందో తెలియదు. ఒకసారి కడుపులో కుడిపక్క నొప్పి వచ్చి అపెండిసైటిస్ అని భయపడి - అపెండిసైటిస్‌కి నొప్పి ఎక్కడ వస్తుంది? ఎలా వస్తుంది. ఆపరేషన్ ఎక్కడ చేస్తారు? అని అడిగాను."

"ఏమన్నారు మీ ఆయన?" నిరీక్షణ ప్రశ్నించింది.

సమాధానం స్మిత చెప్పింది. "ఏమీ చెప్పి ఉండరు. అవన్నీ చెప్పేస్తే 'మీరు అయిదు సంవత్సరాలు చదివి డాక్టరయ్యారు. కాని మిమ్మల్ని పెళ్ళాడి డాక్టరయ్యాను. అపెండిసైటిస్ ఆపరేషన్ చేయడం నాకూ వచ్చేసింది. చేసేస్తాను!' అని అంటుందని పాపం ఆయన భయపడి ఉంటారు." అందరూ నవ్వారు మరోసారి.

"అబ్బ, పొట్ట చెక్కలవుతోందే!" రమ్య అంది.

"ఫరవాలేదు. మీరు ఇల్లు కట్టించుకుంటున్నారుగా! తలుపులు చేయించుకోండి!" అంటూ స్మిత తిరిగి అంది - "నేనొక కథ వ్రాశాను." అంది.

"ఏయ్ నిజంగా! మరి మెల్లగా చెపుతావేం. పడిందా ఎందులోనైనా?" రమ్య అంది.

"ఆ పడ్డాయి - వీక్లీలో ఓ కథ, నా వీపు మీద వాత?"

"వాతా? ఎందుకు?"

"కథలో హీరోయిన్‌కి అనుకోకుండా పెళ్ళికి ముందు ఒక కూతురు పుడుతుంది. ఆ కథను నాకు అన్వయించి నీకూ పెళ్ళికి ముందు ఒక కూతురుందా అని మామగారు నన్ను అనరాని మాటలన్నారు."

"ఉంది. నాతోనే బియ్యే చదివేది అని చెప్పలేకపోయావా!"

"అసలు కథలు - ఎవరికి వారే రాసుకుంటే ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క కథే వస్తుంది. ఇన్ని కథలు ఎక్కడినుండి వస్తాయి. రచయిత(త్రి) సంఘంలోని సమస్యలను తీసుకొని, వాటిని వ్రాసి పరిష్కారం కూడా చూపించాలి. అందుకే 'రవి కాంచని చోటు కవి కాంచున్' అన్నారు. అంతేగాని ఎవరో ఏదో అన్నారని భయపడుతూ కూర్చుంటే అసలు ఎవరూ ఏమీ వ్రాయలేరు. అయినా రామాయణం వ్రాసిన వాల్మీకిని 'నీవు రామాయణంలో రాముడివా? రావణుడివా?' అని అడిగితే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో అలాగే ఉంది నీ గొడవ." నిరీక్షణ అడిగింది.

"ఏమో! బహుశా తప్పు నాదేనేమో! నేనే తప్పుగా వ్రాశానేమో!" అవతలి వారిని ఏమీ అనలేక తప్పు తనమీదే వేసుకుంది.

"అవును. తప్పు నీదే! నిన్ను ఏం చేసినా పాపం లేదు. నిన్ను నరికినా తప్పులేదు. లేకపోతే నాకు చెప్పకుండా కథలు వ్రాస్తావా? బంగారుతల్లీ, కథలు ఎలా వ్రాయాలో నేర్పించవూ?" రమ్య అడిగింది లాలనగా స్మితను.

స్మిత "కథలు వ్రాయడం ఒకరు నేర్పిస్తే వచ్చేది కాదు! ఏ కళనైనా - చిత్రకళ, శిల్పకళ, సంగీతం ఏదైనా ఒకరి దగ్గర నుండి ఒకరు నేర్చుకోవచ్చు. కాని, రచనలు చేయడం అలా కాదే. అదొక వరం. కాగితం, కలం చేయి ఉంటే సరిపోవు. ఆలోచించే మెదడు, అవి కాగితంమీద పెట్టగలిగే శక్తి ఉండాలి. అయినా నీవూ వ్రాయగలవులే! ఉత్తరం వ్రాయడం వచ్చిన వారికి కథలు వ్రాయడం వస్తుందట!" అంది.

"అయితే నాకు మెదడు లేదంటావా?" రమ్య అంది.

"ఏమో? నాకేం తెలుసు బ్రెయిన్ స్కానింగ్ చేయించుకొని న్యూరోసర్జన్ని అడుగు." స్మిత అంది నవ్వుతూ.

అపర్ణ కునికిపాట్లు పడసాగింది.

"దుర్మార్గురాలా! మేమందరం మాట్లాడుకుంటుంటే నీకు మత్తెలా వస్తుందే?"

ఉలిక్కిపడి లేచి నవ్వేసింది అపర్ణ. బాత్‌రూమ్‌కి వెళ్ళి నీళ్ళతో మొహం కడుక్కొని వచ్చింది. అపర్ణ వచ్చిన తరువాత టాయిలెట్‌కి చారుమతి వెళ్ళింది. నిజానికి టాయిలెట్‌కి కాదు. వాళ్ళాయన ఏం చేస్తున్నాడో చూడడానికి. అప్పటికే అందరితోపాటు రాజేష్ కూడా నిద్రపోయాడు. వీళ్ళు మాత్రం పడుకోకుండా కూర్చుని అలాగే కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఏయ్ చారూ! ట్రయిన్‌లో మనుషుల్నే గాని, పిల్లల్ని ఎక్కనివ్వరు." స్మిత అంది.

"ఇప్పుడు నీకు పిల్లలు ఎందుకు గుర్తుకు వచ్చాయి?"

"అబ్బే! మీ ఆయన్ని పిల్లెత్తుకుపోయిందేమోనని చూసి వచ్చావుగా!"

అందంగా సిగ్గుపడింది చారుమతి. "మీ ఆయన పేరు నచ్చలేదోయ్! రాజేష్ ఏమిటి బాటా షూలాగా!" మరలా ఏడిపించింది స్మిత, చారుమతిని.

"మరి మమ్మల్ని ఇన్ని ఆటలు పట్టిస్తున్నావు! మరి మీ ఆయన్ని ఎన్ని ముప్పుతిప్పలు పెడుతున్నావో?" రమ్య అంది.

"ముప్పుతిప్పలు పెట్టడం లేదు. పడుతున్నాను." స్మిత అంది నవ్వుతూ.

"అసలు ఆడది మగవాడికి ఎందుకు లొంగి ఉండాలి?" నిరీక్షణ అంది.

"ఆడది కాబట్టి!" స్మిత అంది.

"అసలు అందరూ మగవాళ్ళని ఆడిపోసుకుంటారుగాని, భార్యల వల్ల నరకం చూసే భర్తలు లేరా? వారి మీద ఏదైనా వ్యాసం వ్రాయాలనుకుంటున్నాను." రమ్య అంది.

"వారిమీద వద్దులే! కాగితం మీద వ్రాయి. అయినా నీకిదేం బుద్ధి? అసలే ఆంధ్రుల బ్రతుకు అంతంత మాత్రంగా ఉంది. నీవు కలంతో వారిని మర్డర్ చేయకు."

"మీకు వంట మనిషి ఉందా?" అపర్ణ అడిగింది స్మితను.

"ఆల్-ఇన్-వన్‌ని నేనుండగా ఇంకెందుకు వంటమనిషి. వాళ్ళు పెట్టిన తిండి తినడం, ఇచ్చిన బట్ట కట్టడం, మెలకువగా ఉన్నంతసేపూ చాకిరీ చెయ్యడం. మాఅన్నయ్య ఆస్తి పట్టుకుపోయానని నా విషయం కల్పించుకోడు. నన్ను పట్టు పరుపులమీద పడుకోబెడుతున్నారనుకుంటాడు. అది అంపశయ్య అని తెలియదు. అది సరేగాని, ఇంక వైజాగ్ వస్తే ఎవరిదారి వారిదే. మనం అందరం ఎప్పుడూ ఆడుకునే

ఆట ఆడదాం" అంటూ గబగబా హేండ్‌బాగ్‌లో నుండి కాగితాలు, పెన్ను తీసి రహస్యంగా వ్రాయడం మొదలుపెట్టింది స్మిత.

"మరలా ఆటలు మొదలుపెట్టావా?" ఆవలిస్తూ అంది అపర్ణ.

"వెధవ మొద్దు నిద్రా, నీవూనూ! అప్పటికీ ఇప్పటికీ నీకు ఆ నిద్ర పోవడం లేదు. మీ ఆయన నీతో ఎలా వేగుతున్నాడో. అలాగే నిద్రపో! నీ కసలు పిల్లలే పుట్టరు." స్మిత విసుక్కుంది.

గబగబా చీటీలమీద వ్రాసినవి ఎవరివి వారికి ఇచ్చింది.

"ఎవరూ విప్పి అప్పుడే చూడవద్దు సుమా?" అని అంది. అది వారికి సుగ్రీవాజ్ఞ.

"నా దాంట్లో ఏం వ్రాశావో. బాబోయ్, రైల్లోనుండి దూకమంటే నేను దూకలేను. అసలే మావారికి నేనంటే పంచప్రాణాలు." నిరీక్షణ అంది.

"పోనీలే నీ బదులు నేను చేస్తాను ఆ పని." స్మిత అనగానే - "ఒకరి బదులు ఒకరు చేసేది లేదు. ఇదివరకు అలాగే చెట్టుమీద నుండి దూకమని చీటీలో ఉండే నిరీక్షణకు నీవు సాయం చేశావు. అసలే నిరీక్షణ అంటే ఎక్కువ ఇష్టం!" రమ్య అంది.

"సరే! ఈసారి ఎవరికీ సహాయం చేయను. చీటీలో పాడమని ఉంటే పాడాలి. సిగరెట్ తాగమని ఉంటే తాగాలి!"

"బాబోయ్, ట్రయిన్‌లోనా?" అపర్ణ భయంగా అంది. "ట్రయిన్ కాబట్టే సరదాగా ఆడదాం. మరలా ఇలాంటి అవకాశం మనకు రాదు. ఈ ఒక్కసారికి మనం ట్రయిన్‌లో ఎవరు ఏమనుకున్నా లెక్క చెయ్యవద్దు. మనం ఆర్ట్స్ స్టూడెంట్స్ కదా, లెక్కలు ఎలాగూ రావనుకో మనకు!" అంటూ లేచింది.

"నేను బాత్‌రూమ్‌నుండి వచ్చేవరకూ అవి విప్పని వాళ్ళకి ఒక మంచి ప్రజంటేషన్ ఇస్తాను." స్మిత అంది.

"అందరం విప్పకపోతే అందరికీ ప్రజంటేషన్ పంచబడుతుంది" రమ్య అంది.

"బాత్‌రూమ్‌లో ఎంత సేపు ఉంటావు?"

"నాకు వంద సంవత్సరాలు వచ్చేవరకూ!"

"అయ్యబాబోయ్" అంటూ అందరూ నవ్వారు.

ట్రయిన్ సామర్లకోట దాటింది. అందరూ మంచి నిద్రలో ఉన్నారు. స్మిత టాయిలెట్‌కి వెళ్ళడానికి లేచింది.

"విష్‌యూబెస్ట్‌ఆఫ్ లక్!" నిరీక్షణ అంది స్మితను ఏడిపిస్తూ.

"థాంక్యూ!" నిరీక్షణ బుగ్గని ముద్దు పెట్టుకుంది.

"మరి నాకో? నాకో?" అంటూ అందరూ ఆమె వెనుక పడ్డారు. అందరికీ తలో ముద్దు పెట్టింది. ఆ ట్రయిన్‌లో అందరూ నిద్రపోతున్నా, వీరు అయిదుగురు అల్లరిమాత్రం మానలేదు. ఎటొచ్చీ వారు కూర్చున్న సీట్ల దగ్గర పరాయివాళ్ళు లేకపోవడంతో అల్లరికి ఏమీ ఆటంకం కలగలేదు.

స్మిత టాయిలెట్‌కి వెడుతుంటే "నేనూ రానా?" అపర్ణ అంది.

"ఛీ! వెధవబుద్ధి! అక్కడికి కూడా ఒంటరిగా వెళ్ళనివ్వరు!" నవ్వుతూ విసుక్కుంది.

"సర్లే, తల్లీ! ఒంటరిగానే పని పూర్తి చేసుకొని రా! సస్పెన్స్ భరించలేకపోతున్నాం!"

స్మిత చిరునవ్వు నవ్వుతూ వెళ్ళింది. ట్రయిన్ మంచి స్పీడుగా నడుస్తూంది.

ఆ చీటీల్లో ఏముందోనని అందరికీ ఆత్రుతగా ఉంది. విప్పి చూడాలని ప్రయత్నించారు. కాని నిరీక్షణ ఊరుకోలేదు - వద్దు స్మితతో చెబుతానని బెదిరించింది. అందరూ స్మిత గురించి మాట్లాడుకుంటూంటే ఎవరో చెయిన్ లాగినట్టున్నారు. ట్రయిన్ ఆగింది.

ఏమిటా అని అందరూ బయటకు చూశారు. బయట అంతా చీకటి. స్మిత ఇంకా ఏం చేస్తోంది? అని టాయిలెట్‌కి అపర్ణ వెళ్ళింది. టాయిలెట్స్ రెండూ ఖాళీ. ఒక్కసారి కెవ్వున అరిచింది అపర్ణ.

"ఇందాక అమ్మాయి ట్రయిన్‌లోనుండి దూకింది. నేనే చెయిన్ లాగాను." ఎవరో అన్నారు. ఆ ట్రయిన్ అంతా గందరగోళం అయిపోయింది. అందరికీ వెన్నులోనుండి వణుకు వచ్చింది.

"స్మితా! నీవు చెప్పిన కథ నిజమేనా?" అందరూ గొల్లుమన్నారు.

చేతిలో చీటీలు తడిసిపోయి నలిగిపోయాయి. దుఃఖంలో విప్పి చూశారు. నిరీక్షణ విప్పింది - "ఆడపిల్లకు ఆస్తి హక్కు వద్దు. దాని వలన పుట్టింటికి దూరం కావడం తప్ప ఉపయోగం లేదు."

అపర్ణ చీటీలో - "నేను చెప్పింది అబద్ధం కాదు. అంతా పచ్చి నిజం. ఒక్క అక్షరం కూడా తప్పు లేదు. నాకు దినదినగండంలాంటి ఈ బ్రతుకు వద్దు. వారి చేతిలో చచ్చేకంటే మీ అందరి ముందూ ఇదే హాయి కదూ!"

రమ్య చేతిలో - "నాకు ముసలితనం రాదు. మీరందరూ ముసలివాళ్ళయినా మీదృష్టిలో నేనెప్పుడూ పడుచు స్మితనే కదూ!"

చారుమతి చీటీలో - "విష్ యూ హేపీ మారీడ్ లైఫ్! మీలో ఎవరికి ముందు ఆడపిల్ల పుట్టినా ఆమెకు నా పేరు పెట్టండి. బారసాలలకు పెళ్ళిళ్ళకు కల్సినట్టే అందరూ

కలవండి. అప్పుడు నలుగురు నవ్వే వేళ నా పేరూ తలవడం మానకండేం."

గుడ్ బై.

అంతవరకూ నవ్వులు వినబడిన ఈ సీట్లలో ఇప్పుడు ఏడువులు ప్రారంభమయ్యాయి. ఈసారి అయిదుగురు కాదు - నలుగురు మాత్రమే ఆ నిశీధిలో స్టేషను కాకపోయినా నిశ్శబ్దంగా నిలబడిపోయింది. స్మిత చావుకు సంతాపసూచకంగా కోణార్క్.

(ప్రభ, 12-11-86)

☆ ☆ ☆

# యోగ్యత

ఎప్పటిలాగే హాస్పిటల్‌లో రౌండ్స్ పూర్తిచేశాను. కొన్ని కేసులను చూస్తుంటే మగవాళ్ళు బాసులయిన కారణానికి ఆడవాళ్లు అభాసుపాలై హాస్పిటల్ పాలవడం, వాటిని పరీక్షించడం ఎంత మొండిగా ఉండాలన్నా దండిగానే బాధ పడడం అలవాటై పోయింది.

ఇటీవల కోడళ్లు అగ్నికి ఆహుతి అయి హాస్పిటల్‌లో చేరుతుంటే అలాంటి సంగతులు పేపర్లో చదువుతుంటే మనసే ఒక అగ్నిగుండం అవుతుంది. నేనూ మగవాడినే. మా అమ్మా అత్తగారు అవుతుంది. రేపు నేను పెళ్లి చేసుకుంటే... ఎందుకో ఆ ఊహ నాకు ఎంత మాత్రమూ సంతోషాన్ని ఇవ్వలేదు.

పని అయిపోయి ఇంటికి వెళ్ళబోతూ ఉండగా ఆత్మహత్య కేసు ఒకటి వచ్చింది. ఆకలిని అవతలకు నెట్టి పరుగు పెట్టాను. అందమైన అమ్మాయి. ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. ఆ అమ్మాయి ఎవరోకాదు. మేము ఇదివరకు ఉన్న ఇంటి ప్రక్కన ఉండేవారు. నాకు పెద్దగా పరిచయం లేకపోయినా ఆంటీ, అంకుల్ అంటూ మా అమ్మా నాన్నల చుట్టూ తిరిగేది. మేము ఇల్లు కట్టుకుని అక్కడినుండి వచ్చేయడంతో తనకు అంతగా వాళ్ళ విషయాలు తెలియవు. పైగా నేను ఇంట్లో ఉండే సమయం తక్కువ. ఆ మధ్య ఒకటి రెండుసార్లు సినిమాహాల్లో కనిపించి పలకరించింది.

పేషెంటుని చూశాను. ఏముంది కథ. మామూలే. అర్చనను ఎవరో పెళ్ళి చేసుకుంటానని మోసం చేసి, ఆమెను గర్భవతిని చేసి అర్చనకు చెప్పకుండా వేరే పెళ్ళి చేసేసుకున్నాడట. తరతరాలుగా తీరంచేరని కథలు అవి. అలా సముద్రంలో ఈదులాడుతూ మునగాల్సిందే. అంతవరకు ఆడదాని అందాన్ని పొగిడి పొగిడి బొగడపూల దండల్ని మెడలో వేసినంతగా మాటలతో లోబరుచుకుని పెళ్లి చేసుకుంటాననే వాగ్దానాలతో మునగచెట్టు ఎక్కించేసి ఎక్కుపెట్టిన విల్లులాంటి అమ్మాయిలను కూడా ఇలా తొక్కిపెట్టి నాశనం చేయడం సర్వసాధారణం అయిపోయిందీ సంఘంలో.

ఆమెను అతి కష్టంమీద బ్రతికించాను. అప్పుడే రెండవ నెల ప్రవేశించింది అర్చనకు. ఆ విషయంలో అనుమానం రాగానే అతని పెళ్ళి కబురు వినగానే, అతని తండ్రి అర్చన సంగతి విని హేళనగా గుబురుమీసాల చాటున నవ్వగానే అర్చనదే తప్పని అతను ఘాటుగా మాట్లాడగానే ఏమీ చేయాలో తోచక స్లీపింగ్ పిల్స్ మింగిందట.

అర్చనను బ్రతికించానుగాని ఆమెకు బ్రతుకుమీద ఇష్టంలేదని గ్రహించాను. తాను గర్భవతినన్న విషయం ఎవరికీ తెలియ చేయవద్దని బ్రతిమాలింది. నాకు తప్ప



ఆ విషయం హాస్పిటల్‌లో ఎవరికీ తెలియదు. అయినా అదేమన్నా తాళికట్టిన తర్వాత వచ్చిన గర్భమా? సీమంతం చేసి చాటిచెప్పటానికి.

ఎందుకో అర్చనను చూడగానే ఆమెకు జరిగిన అన్యాయం ఒక ప్రక్కన పెడితే నాలో ఒక విధమైన స్పందన మొదలైంది. అర్చనను పెళ్ళి చేసుకుంటే అన్న ఆలోచన ఇంతకాలం పెళ్లికి దూరంగా ఉన్న నా మనసుని బలవంతం చేయడం మొదలుపెట్టింది. ఆమెను అలాగే వదిలేస్తే అందరికీ ఆ విషయం తెలిసిపోయి అర్చన మరోసారి ప్రాణాలు తీసుకోడానికి ప్రయత్నించడం ఖాయం. అర్చనకు అబార్షన్ చేస్తే ప్రస్తుతం హాస్పిటల్‌లో అందరికీ తెలిసిపోతుంది. ఆమె నాకు తెలిసిన అమ్మాయి. పైగా ఎందుకో ఆమె బ్రతుకు అల్లరి పాలవడానికి నా మనసు అంగీకరించలేదు. అర్చన వెంటనే ఒప్పుకుంటే బావుండును. నేనే తాళి కట్టేద్దును అనుకున్నాను. ఆ ఊహ రాగానే అర్చనను మరింత శ్రద్ధగా చూడడం మొదలుపెట్టాను. ఆమె నేను చెప్పిన ధైర్య వచనాలతోనే నాలుగు రోజుల్లో లేచి తిరగడమే గాక జీవితం మీద అనురక్తి కలిగించుకుంది.

అర్చనను మరెవరైనా పెళ్ళి చేసుకున్నా తర్వాత ఈ విషయం తెలిస్తే ఆమె బ్రతుకు నరకమే అవుతుంది. ఒకవేళ ఔదార్యంతో తెలిసి చేసుకున్నా ఆ తరువాత

పుట్టిన పిల్లలను చూసుకుని మొదటి బిడ్డను నిరసిస్తే? అందుకే అర్చన జీవితంలో ముందు ముందు అలాంటి సమస్యలు రాకుండా నేను అన్నీ తెలిసి ముందడుగు వేస్తున్నాను. కాబట్టి జాగ్రత్త పడాలని నిర్ణయించుకున్నాను.

ఆ తర్వాత నా మనసులో మాట బయట పెట్టాను. అర్చన ముందు ఒప్పుకోలేదు. కానీ ఆమెకు నిండు నూరేళ్లు సంతోషంగా బ్రతకాలని ఉంది. పైగా ఆ గర్భం విచ్ఛిన్నం చేసుకోవాలని లేదు. దానితో ఆలస్యం చేస్తే అమృతం విషం అయిపోతుందని తన విషయం అందరికీ తెలిసిపోతుందని భయపడి పెళ్లికి ఒప్పుకుంది. మా పెళ్లి జరిగిపోయింది.

నేను ఇంతకాలం పెళ్లి చేసికొనక పోవడానికి కారణం అర్చనను అర్జంటుగా ఇప్పుడు చేసుకోవడానికి కారణం మాత్రం ఎవరికీ తెలీదు. నాకు మాత్రమే తెలుసు. ఇప్పుడు నాకు చాలా తృప్తిగా ఉంది. పెళ్లికి ముందే సరదాగా చేసుకున్న పరీక్షల్లో తేలిన విషయం నాకు పిల్లలు పుట్టే 'యోగ్యత' లేదు.

అర్చనకు భర్తనయ్యే యోగ్యత ఉంది.

(ఆంధ్రభూమి వీక్లీ, 12-11-86)

☆ ☆ ☆

# గోల్డ్‌మైన్

ఎప్పటిలాగే ఆ రోజూ సూర్యోదయ మయింది. రాత్రంతా ఏడ్చినందువలన చిత్ర కళ్ళు రానురాను ఎర్రబారుతున్న సూర్యుడిలా ఎరుపెక్కుతున్నాయి. ఆమె వెక్కుతూనే ఉంది మెల్లిగా.

"ఏయ్ చిత్రా డియర్ నా మీద కోపం ఇంకా పోలేదా?" మిథిలేష్ అడిగాడు. ఆమె మౌనంగా బ్రహ్మ చెవుటి మనిషిలా వంట గదిలోకి వెళ్ళిపోయింది.

"నేను నిన్న ప్రొద్దున్న స్టేషనుకి కారు పంపలేదనేగా నీ కోపం. ఈ ఊరిలోనే ఉన్న స్టేషనుకి కారేమిటిలే అని ఏకంగా హైదరాబాద్‌కే గోదావరి ఎక్స్‌ప్రెస్ పంపాను కదా! పైగా నీకు ఒక్కర్తికి బోరుకొడుతుందని బోలెడన్ని కంపార్ట్‌మెంట్‌లు కూడా వేయించాను" ఆమె స్టౌ మీద కూర వేయిస్తుంది. మాటలు పట్టించుకోకుండా వంట గదిలోకి వెళ్ళి ఆమె పక్కనే చేరి "అదేం కుక్కర్ పనిచేయడం లేదా ఎసరు పెట్టావు అన్నానికి. ఇదిగో చూడు బియ్యం కొత్తవి అనుకుంటాను గంజి చిక్కగావుంది. అసలు అన్నం ఉడికేటప్పుడు మెతుకు మెతుకు అంటుకోకుండా ఉండాలంటే ఏం చేయాలో తెలుసా?"

'అన్నం ఉడికేటప్పుడు మంచినూనె వెయ్యాలి' అంటాడనుకుంది. అలాంటి సలహాలు అప్పుడప్పుడు ఇస్తుంటాడు మిథిలేష్. "ఒక్కో బియ్యం గింజని ఒక్కో గిన్నెలో వండితే అన్నం అతుక్కోదుగా పొడిపొడిగా ఉంటుంది" అన్నాడు. సుచిత్ర నవ్వలేదు. మరోసారి అయితే పడి పడి నవ్వేది. ఇప్పుడు పొడి దగ్గు దగ్గేసి ఊరుకుంది. కోపం అనే మడికట్టుకుంది మరి.

"ఏమిటోయ్ ఆ కోపం సంపెంగ లాంటి ముక్కు అందం అలా ఎగబీల్చి పాడుచెయ్యకు. దానిమ్మ గింజల్లాంటి పళ్ళు మరీ అలా కోపంతో కొరికేసి విరిచెయ్యకు. నామీద కోపం వస్తే నన్నుకొట్టు" అంటూ చెయ్యి పట్టుకుంటే విడిపించేసుకుంది.

చిత్రా నీవు లేనప్పుడు ఏం జరిగిందో తెలుసా? మన పని మనిషి మనుమరాలు వచ్చింది. ఎంత అందంగా ఉందనుకున్నావు. అలా అసూయగా చూడకు. వయసులో లేదులే చిన్నపిల్ల. పోస్ట్‌మెన్ ఉత్తరాలు ఈ కాలనీలో అందరికీ ఇచ్చి మనకివ్వలేదని పరుగున వెళ్ళి అతన్ని పిలుచుక వచ్చింది. ఆమెకు నవ్వు రాబోయింది. కాని తమాయించుకుంది.

"ఏమిటోయ్ జోక్‌చేసినా నవ్వవు. వచ్చే జన్మలో జంతువులా పుట్టగలవు జాగ్రత్త. జంతువులకు నవ్వడం రాదుగా" ఆమె ఉడుక్కుంది. అబ్బ ఎంత అందంగా ఉంది



అనుకున్నాడు. అమాంతంగా కౌగిలించుకోవాలనే ఉంది. కాని పర్మిషన్ లేదు. ఓపిక పట్టక తప్పదనుకున్నాడు. మరలా మొదలెట్టాడు. మొన్న ఎవరో గుడికడుతున్నాం, చందా అయినా ఏదైనా వస్తు రూపంలో అయినా సహాయం చేయమని వచ్చారు. నీవు లేవు. వాళ్ళు నన్ను పట్టుకున్నారు. పక్కింటి ఇంజనీరుగారు ఇరవై సిమెంటు బస్తాలిచ్చారట. నన్నూ ఏదైనా సహాయం చేయమన్నారు.

ప్రస్తుతం నా దగ్గర ఏమీ లేదు. కావాలంటే నా స్నేహితుడిచ్చిన టానిక్కులు చాలా ఉన్నాయి. మా అన్నయ్య డాక్టరే అతనూ కొన్ని ఇచ్చాడు. అవి ఊరికే ఇస్తాను. తీసికెళ్ళి పునాదుల్లో వేయండి. నా వంతుగా గోడలు, బలంగా గట్టిగా ఉంటాయి అన్నాను" ఆమెలో మార్పేమీ లేదు.

ఇంకా నవ్వు రాలేదా? జోకేసి కితకితలు పెట్టాలన్నమాట. చనువుగా మీద చేయివేయబోతే విసిరి కొట్టింది. సున్నాతో చుట్టిన మూతిని ముద్దు పెట్టుకోవాలని ఉన్నా సమయం కాదని ఊరుకున్నాడు. వారం రోజుల తరువాత కలయిక విరహం భరించడం కష్టంగా ఉంది. చెక్కిన శిల్పం ప్రాణం పోసుకొని వచ్చినట్లున్న అవయవ పొందిక సన్నజాజి సౌకుమార్యం వెన్నెలను బంగారంలో రంగరించి పోత పోసినట్టున్న మేని రంగు శరీరపు లావణ్యపు పొంగులు అతనిని నిలువనీయడంలేదు. అప్పుడే తలస్నానం చేసిందేమో పొడవైన కురులు సముద్రపు కెరటాల్లా ఎగసి ఎగసి పడుతున్నాయి. గాలికి ఆ కురులలో మొహం దాచుకోవాలనే కోరిక ఆపుకోలేక తల ముట్టుకున్నాడు. పక్కకు కోపంగా జరిగి జుట్టు ముడివేసేసుకొని పైట గట్టిగా బిగించి దోపేసుకొని మరింత కోపంగా అతనికి కాఫీ కప్పు బల్లమీద పెట్టి ఆమె ఒకటి తీసుకొని

జీవిత ధ్యేయం కాఫీ తాగడమేనన్నట్లు తాగసాగింది.

కొప్పునైనా కాకపోతిని నీదు మెడకు అండగా,

కాఫీ కప్పునైనా కాకపోతిని నీదు పెదవుల నుండగా.

వేళాకోళంగా పాట అందుకున్నాడు. రాయినైనా కాకపోతిని అన్న వరుసలో.

పైటనైనా కాకపోతిని మెడక్రింద నిగ్గులు అదమగా

గోటినైనా కాకపోతిని నీదు బుగ్గలు చిదమగా.

ఆమెకు రానురాను కోపం ఎక్కువ కాసాగింది. నిన్న ప్రొద్దున్న అనగా వస్తే భర్త ఇంట్లో లేకపోవడం రాత్రంతా రాకపోవడం ఆమె భరించలేక పోతుంది.

కొంచెం నవ్వవోయ్. నోటినుండి రత్నాలు ముత్యాలు రాలినా దండ నీకే చేయిస్తానులే. మా మగవాళ్ళ మెడకు మంగళ సూత్రాలు లాంటి వరమా, ముత్యాల సరమా ఏమున్నాయి మాకు. అన్నీ ఆడవాళ్ళకే. చూడు నీవు అస్తమానూ ఏదో వంకన పుట్టింటికి పరుగెడుతున్నావు. మరి మేం ఎక్కడకు వెళ్ళగలం. మా మొహాలకు బొట్టు, కాటుక లేకపోతే లేకపోయింది. పుట్టిల్లయినా వ్రాయలేదు ఆ బ్రహ్మదేవుడు. మీలా అలికి ముగ్గులు పెట్టగలమా, అలిగి పుట్టింటికి పరుగెట్టగలమా?

ఆమె అతని మాటలు విననట్లు కిటికీలో నుండి బయటకు చూడసాగింది. "చిత్రా! నీవు అప్పుడెప్పుడో మందారకొమ్మ పాతి అది వంగిపోతుందని సపోర్టుకి ములగ కొమ్మని నిలబెట్టావు చూడు. మందారకొమ్మ చచ్చిపోయిందిగాని ములగ కొమ్మ బ్రతికేసింది. గమ్మత్తుగా వుందికదా?..." దగ్గరగా వచ్చి అన్నాడు. విసురుగా అటువైపు తిరిగింది. "అరె! మీ అమ్మగారు బంగారు పట్టీలు చేయించారా. మరింతసేపూ చెప్పలేదే" మెల్లగా పట్టీలు చూసే వంకన కాళ్ళ బేరానికి దిగాడు. అక్కడి నుండి విస విస వెళ్ళి పోయింది. తన భార్య అస్తమాను పుట్టింటికి వెళ్ళి ఆడపిల్ల ఆస్తి హక్కు పేరున ఈ మధ్య చాలా తేవడం అతనికి నచ్చలేదు.

"సాయంకాలం రెండుగౌనులు తెస్తాను. మన వీధిలో ఆడంగులకు మరి నీ బంగారు పట్టీలు కనబడాలి అంటే, చీర బావుండదుగా" ఏడిపిస్తూ అన్నాడు. ఆమెకు నిజంగానే దుఃఖం తన్నుకు వస్తుంది.

"ఏయ్, చిత్రా! ఇంకా కోపం పోలేదా? గొప్ప అందాలన్నీ నీకే ఉన్నాయని బడాయి. నీ సన్నని నడుంచూడు. నాచేతి స్పర్శకోసం అల్లాడిపోతూ ఎలా చిక్కిపోయిందో. మన పెళ్ళయి ఏడాదేగా అయింది. మరీ ఇన్ని అలకలా. ఆనాటి మన కొంగుల ముడిలో మన గుండెలసడి మరచిపోయావా!

నీ కాలి చిరుమువ్వలో గువ్వనవ్వాలని

నీ చిరునవ్వులో రవ్వనై మురియాలని

నీ చిగురు పెదవిపై సదా పువ్వునై నవ్వాలని

ఎన్ని కలలు కన్నాను. ఎన్నికలలో ఓడిపోయినవాడిలా అయిపోయానిప్పుడు.

నీ కనురెప్పల నీడలో నేను, నా అడుగుల జాడలో నీవు ఉంటే సంసారం స్వర్గం అవుతుందనుకున్నాను. పందిరికి అల్లుకున్న సన్నజాజి తీగలా, చందురుని చేరుకున్న అందమైన తారలా ఉండాలనుకున్నాను. అవన్నీ కలలుగా మిగిలిపోయాయి.

'ఇదిగో చూడు నీకోసం డైమండ్ దుద్దులు తెచ్చాను" అన్నాడు. ఆమె వాటివైపు కన్నెత్తి చూడలేదు. 'పోనీ ఈ చీర చూడు, జరీపూలతో ఎంత బావుందో" ఊరించాడు. ఆమె ఉలకలేదు, పలకలేదు. ఆమెకు వజ్రాలకంటే విలువైనది అతని ప్రేమ, అందులోని నిష్కళంకం. అది కావాలిగాని, డబ్బు పెట్టికొనే వస్తువులు కావు.

"నేను ఒక్కరాత్రి రాకపోతే అంత కోపం వచ్చిందే. నీవు అస్తమానమూ నన్ను వదిలి ఈ మధ్య పుట్టింటికి వెళ్ళడంలేదా? ఆ బాధేమిటో నీకు తెలియాలనే రాత్రంతా రాలేదు. నీకు చెప్పకుండా నా స్నేహితుని పెళ్ళికి వెళ్ళాను. ఎందుకు చిత్రా పుట్టింటినుండి ఆస్తి తెచ్చుకోవాలని అస్తమానం హైదరాబాదు పరుగెడుతావు. ఆడపిల్ల ఆస్తి హక్కుపై నీకెందుకు మరీ అంత మక్కువ. మీ నాన్నగారు అంతా మీ అన్నయ్యకు ఇస్తే ఇచ్చేయనీ. మీ అన్నయ్యే కదా మీ అమ్మ, నాన్నలను చూస్తూ కుటుంబ భారం మోస్తున్నాడు. చిత్రా! నీ తరపు నుండి ఆస్తి వస్తేగాని నిన్ను ప్రేమించననుకున్నావా! చాలా పొరపాటు పడుతున్నావు. నీవే నాకు పెద్దాస్తి. నాకింకేమీ వద్దు. మనకున్నది మనకు చాలు.

ఆ మాటలకూ ఆమెకు తృప్తి కలగలేదు. మనసు కరగలేదు. ఆమె మనసులో దేమిటో ఇప్పుడు బాగా అర్థం అయింది మిథిలేష్‌కి.

మగవాళ్ళలో పెద్ద లోపాలు వారికి సెక్స్ కోరిక పాలు ఎక్కువ ఉండడం. ఆడవారికి చాలా తక్కువ ఉండడంతో మీరు మమ్మల్ని అనుమానిస్తారు. అదే మీతో వచ్చిన చిక్కు. నీతి ఆడదాని కొక్కదానికే హక్కు అనుకుంటారు. కాని మాకూ మంచిగా బ్రతకాలని ఉంటుందని గ్రహించరు.

'నేను పరాయి స్త్రీల దగ్గరకు వెళ్ళి అపవిత్రమైన శరీరంతో నిన్ను తాకి అపవిత్రం చేయగలనా' నా భార్య నా ద్వారా పవిత్రురాలిగానే ఉండాలి. ఆ మాటలతో ఆమె కన్నుల్లో కోటి కాంతులు. ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. ఏం చేస్తాడో ఆమెకు తెలుసా? ఇప్పుడా అనబోయిన ఆమె పెదవులను పెదవులతో మూసేసి తరువాత

గుసగుసగా అన్నాడు. ప్రపంచంలో దేనికైనా టైమ్ లిమిట్ ఉందిగాని సెక్స్‌కి మాత్రం లేదు అని.

ఆమె నగ్న శరీరాన్ని పూర్తిగా తాకుతుంటే కాళ్ళ పట్టీలు, గాజులు, గొలుసులు, రింగులు, ముక్కుపుడక అన్నీ అతనికి తగులుతూనే ఉన్నాయి. ఆడవాళ్ళకు ఎంత పిచ్చి ఈ గోల్డ్‌చైన్ అంటే, కాని మగవాడికి ఆడదాని శరీరము ఆమెతో సెక్స్ ఓ పెద్ద గోల్డ్‌మైన్ అనుకున్నాడు తృప్తిగా.

(ఆంధ్రభూమి వీక్లీ, 20-10-88)

☆ ☆ ☆

# నవయుగ కుంతి

కాంతి ఆలోచిస్తూ నడుస్తుంది. ఆమె ఆలోచనలు కూడా ఎంతో రద్దీగావున్న ఆ రోడ్డులాగే గజిబిజిగా ఉన్నాయి. ప్రొద్దున్న పేపర్లో చదివిన వార్త, తన కడుపులో పెరుగుతున్న బిడ్డకూడా ఎంతో కలవరపెడుతున్నాయి. లండన్‌లో రోజీనా అనే పద్దెనిమిది సంవత్సరాల యువతి పెళ్ళి కాకుండా పుట్టిన తన బిడ్డను రహస్యంగా పెట్టెలో పెట్టి అనాధ శరణాలయానికి పార్శిల్ చేయబోతూ పోస్టాఫీసులో పోలీసులకు దొరికిపోయి కేసులో చిక్కుకుందట. పిల్లాడి పేరు వెడ్ అట. ఆనాడు కర్ణుడు. ఈనాడు వెడ్. యుగాలు, తరాలు మారుతున్నా ఆడదాని తలరాతలు మారడంలేదు. పెళ్ళి కాకుండా తల్లి అయిన ఆడది కాలుతున్న సమిధ. ఆ పుట్టిన బిడ్డ అనాధ. తండ్రికి ఉండదు ఏ ఆపద.

సాగర్ కాంతిని పెళ్ళిచేసుకుంటానంటూ వెంటబడి ఆమె ఉన్న సమయం చూసి బలవంతంచేసి తన దారిన తాను పోయాడు. ఇండియాలో ఉన్న ఆస్తి అంతా అమ్మేసి, మరో పెళ్ళి చేసుకుని విదేశాలకు వెళ్ళిపోయాడని, ఆ తర్వాత కాంతికి తెలిసి కుమిలిపోయింది. ముసిముసి నవ్వులు నవ్వుతూనే ఆమె జీవితం మసి చేశాడు. పసితనంలోనే కసిగా కాంతి బ్రతుకు నేలరాశాడు. ఆమె కడుపులో బిడ్డకు ప్రాణం పోశాడు.



దిక్కుతోచని కాంతి ఉక్కు సంకెళ్ళలాంటి సంఘం దృష్టిలో తాను కులట. తన బిడ్డ చవట కాకుండా ఉండాలని తనకుతానే మెడలో పసుపుతాడు వేసుకుని ఈ ఊరి నుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని, హైదరాబాద్ వచ్చింది. భర్త గురించి ఎన్ని అబద్ధాలు చెప్పాలోనని, నిశ్శబ్దంగానే ఆలోచించుకుంటుంది. ప్రతి బిడ్డకు ఒక తండ్రి ఉంటాడు అని తెలిసిన మనుషులు ఆ తండ్రి ఆడదానిని భార్యగా స్వీకరించక పోతే ఆమెను చూసి ఛీంకరిస్తారెందుకో

అర్థం కాదు. దగా చేసి దర్జాగా తిరిగేది మగాడు, భంగపడి కొవ్వొత్తిలా కరిగేది ఆడది.

తన ప్రక్కన ఎవరు నడుస్తున్నదీ కూడా గమనించకుండా నడుస్తున్న కాంతి తన ప్రక్కన నడుస్తున్న మనిషిమీద నుండి అనుకోకుండా బస్ వెళ్ళడం, నిమిషాలలో అతను నుగ్గునుగ్గు కావడం జరిగిపోయాయి. అప్పుడు ఈ లోకంలోకి వచ్చి అతన్ని తేరిపార చూసింది. అసలు మనిషిని గుర్తించడం కష్టం. కానీ అతన్ని తనతోనే ట్రైన్‌లో దిగిన వ్యక్తిగా బట్టలను బట్టి గుర్తించింది. మెరుపులాంటి ఆలోచన వచ్చి అందరినీ తప్పించుకుని "ఏమండి! నన్ను అన్యాయం చేశారా?'' అంటూ శవంమీద భోరుమంది.

(ఆంధ్రభూమి వీక్లీ, 16-02-89)

☆ ☆ ☆

# ఇది మరోరకం శిక్ష

"సారికా!" మత్తుగా పిలిచాడు సుందర్.

"ఊ" మరింత మత్తుగా పలికింది సారిక.

"నీవంటే నాకెంత ఇష్టమో, తెలుసా?"

"ఊహు తెలియదు"

"ఎంతో ఇష్టం. నీ కంటే ఇంకా ఇష్టమైనది ఏమిటో తెలుసా?"

"ఊహు, అదీ తెలియదు. ఏమిటది?" మరింత మత్తుగా అడిగింది.

"నీ పేరు"

నవ్వింది పున్నమి విరిసినట్టు. ఆమె పేరుని అందరూ మెచ్చుకోవడం ఆమెకు కొత్తకాదుకాని, భర్త నోటి వెంట ఆ మాట వినేసరికి ఆమె శరీరం మరింత పులకరించింది.

"అసలు ప్రపంచంలో ఎన్ని మంచి కొత్త అందమైన పేర్లు రానీయ్. 'సారిక' అన్న పేరు అంటే వున్న అభిమానం మరి దేనిమీద వుండదు. పెళ్ళి చూపుల్లో నీవెంతో నచ్చావు. మా అమ్మ కట్నం గురించి గొడవ చేస్తుంటే నీ పేరు గురించి ఆ కట్నం కూడా వద్దనేసానుగా."

"మీరు చాలా మంచివారు."

"మరో సంగతి. నేను నవల వ్రాస్తాను. ఆ నవల్లో హీరోయిన్ పేరు నీ పేరే సుమా"

"మీరు కథలు వ్రాస్తారా?" ఆశ్చర్యంగా, ఆనందంగా అడిగింది. ఆ మాట ఆమెకు ఎంతో సంతోషంగా వుంది.

"నేను కథలు వ్రాస్తాను. నీవు కాపీ చేసిపెట్టాలి, తెలిసిందా! నా హేండ్ రైటింగ్ బావుండదు. నీది ముత్యాల కోవలా వుంది. కాపీ చేసిపెడతావా"

"చేసిపెడతావా? అని మెల్లిగా అడుగుతారా? పరమానందంగా చేస్తాను. అసలు నాకు కథలు వ్రాసే వారంటే ఎంత పిచ్చో తెలుసా? ఇంకా నా భర్తే కథలు వ్రాస్తాడంటే..."

"ఆపు మరి ఆ టాపిక్ ఇంక" అంటూ ఆమెను మరింత దగ్గరకు తీసుకున్నాడు. తరువాత గుసగుసగా అన్నాడు. "నేను కథలు వ్రాస్తాను నీవు కాపీ చేస్తుండు. మనం ఆదర్శ దంపతుల్లా వుండాలి."

★ ★ ★

సారికకు అర్జంట్‌గా అపెండిక్స్ ఆపరేషన్ చేయవలసి వచ్చింది. కడుపు నొప్పి అని బాధపడేది. సారిక అన్నగారికి టెలిగ్రాం ఇస్తే వచ్చి చెల్లెలిని తీసికెళ్ళాడు పుట్టింటికి. "ఇక్కడ చేసే వాళ్ళెవరూ లేరే, మీరు తీసికెళ్ళండి" అని సారిక అన్నగారితో సుందర్ అన్నాడు.

పుట్టింటికి వచ్చిన సారికను చూసి, వదిన వాసంతి మొహం చిట్లించింది, సారిక ఆపరేషన్ అయి ఇంటికి వచ్చింది. సుందర్ ఆపరేషన్ టైమ్‌లో వచ్చి సారికను చూసి వెళ్ళాడు.

ఆ రాత్రి నిద్ర పట్టక అటు, ఇటు దొర్లుతుంటే పక్క గదిలో నుంచి వదినగారి మాటలు వినబడ్డాయి సారికకు. వినగూడదనుకుంది. కాని, మాటల్లో తన పేరు రావడంతో వినకుండా వుండలేకపోయింది.

"ఆస్థిహక్కు, ఆస్థిహక్కు అంటూ సగం ఆస్తి పట్టుకుపోయింది. ఇప్పుడు ఆపరేషన్ అంటూ ఎంత ఖర్చయిందో చూడండి. రేప్రొద్దున్న ఇంక పురుళ్ళకు, పేరంటాలకు మరెంత అవుతుందో ఇంకా ఇలాంటివన్నీ నానెత్తిన వేస్తే మాత్రం ఊరుకునేదిలేదు" ఖచ్చితంగా అంది వాసంతి.

సారిక అన్నగారు సాగర్ మాట్లాడలేదు.

"మీ నాన్నగారు 'కట్నం ఇవ్వడంలేదుకదా" అంటూ పెళ్ళి ఘనంగా చేశారు. మీరు ఏదో అంటే 'నా జీతంతో అప్పులు తీరుస్తాను. నీ మీద భారం పెట్టను. నాకు వచ్చే ప్రావిడెంట్ ఫండ్ నీదే కదా అన్నారు. ఆయన అకస్మాత్తుగా చనిపోవడంతో ఆ ప్రావిడెంట్ ఫండ్ డబ్బు, పెళ్ళికి చేసిన అప్పులికే సరిపోయింది. ఇప్పుడు మీ చెల్లికి మీకంటే ఎక్కువ ఆస్తే ముట్టిందిగా. పుట్టింటి వారిని మట్టం చేసింది. అది చాలక ఇంకా ఈ ఖర్చులేమిటి.

"నిజమే వాసంతి, నన్ను మాత్రం. ఏం చేయమంటావు. దాన్ని రావద్దని ఎలా అనను? అదంతా చెల్లి బావగారు ఆలోచించుకోవాలి. నా పరిస్థితి గ్రహించాలి. మరోసారి ఇలా అవసరానికి వస్తే నేనే డైరెక్ట్‌గా చెప్పేస్తానులే. ఈ సారికి గొడవ చేయకు, బాధపడుతుంది."

"అవును నేను బాధపడినా ఫరవాలేదు. మీ చెల్లెలు మాత్రం ఆస్తి పట్టుకుపోవాలి. మరలా పుట్టింటి నుంచి ఏ లోటూ రాకూడదు. అందుకే మీరు ఏమన్నాసరే, నేను పుట్టింటి నుంచి మాత్రం ఆస్తి తేను. నేను బ్రతికి వున్నంతకాలం నాకు పుట్టింటి వారి అండకావాలి."

"అలాగేలే. నీకు ఏ కష్టం వచ్చినా, డెలివరీలో అవసరమైనా నేను మాత్రం ఒక్కడినీ ఏం చేయగలను. అమ్మ లేదుగా నాకు. నీవు ఎలాగు పుట్టింటికి వెళ్ళక తప్పదు."

★ ★ ★

“సారికా నీవు మరోలా అర్థం చేసుకోనంటే నాదొక్క చిన్నమాట”



“చెప్పండి మీ కంటే ఎవరున్నారు నాకు. మీరు ఏది చెప్పినా శిరసావహిస్తాను” నవ్వుతూ అంది.

“నీవు విదేశాలకు వెళ్ళడం ఇష్టమన్నావుగా”

“అవును అన్నాను.”

“నాకు ఫారెన్ వెళ్ళే అవకాశం దొరికిందోయ్”

“నిజంగా!”

“నిజంగా, నా మీద ఒట్టు”

“మీ మీద ఒట్టు పెట్టుకోవడం ఎందుకు. నేను నమ్మనా. అలాంటి మాటలు ఎప్పుడూ అనకండి ప్లీజ్”

“నా ఫ్రెండొకడు అమెరికాలో ఉద్యోగం ఇప్పిస్తాను రమ్మని వ్రాశాడు. మరి నా దగ్గర డబ్బు లేదుగా. నేను ముందు వెళతాను. ఉద్యోగం రాగానే రాణిగారిని తీసికెళతాను”

“నిజంగా అదృష్టం అంటే నాదేనండోయ్. కథలు వ్రాసే భర్త, అమితంగా ప్రేమించి, ఫారెన్ తీసికెళ్ళే భర్త, నా జీవితంలో తీరని ఆశలు మీ నుండి తీరుతున్నాయి. నాకు ఎంతో సంతోషంగా వుంది.”

“నేను కథలు వ్రాసినా నీవే ఫెయిర్ చేస్తున్నావు. అలాగే నిన్ను ఫారెన్ తీసికెళ్ళినా నాకు డబ్బు నీవే ఇవ్వాలి”

“డబ్బా! నా దగ్గర ఎక్కడిది?”

“అదేనోయ్ మీ నాన్న ఇచ్చిన రెండెకరాల పొలం వుందిగా. అది అమ్మేయకూడదూ?”

“అదా?” అంది అనుమానంగా.

“అవును. మనం తరువాత డబ్బు సంపాదించుకుంటే ఆ రెండు పక్కన సున్నా పెట్టినన్ని ఎకరాలు కొని నీ పేరున వేసేస్తానుగా.”

"ఆలోచించి చెబుతానండి"

"నీవు దొరకడం నిజంగా నేను ఏ జన్మలో చేసుకున్న అదృష్టమో."

"ఆ అదృష్టం మీది కాదు. నాది. ఏమండీ, నా దొక్క చిన్న కోరిక."

"ఏమిటి చెప్పు. కాదు కాదు ఆజ్ఞాపించు."

"మీరు విదేశాలకు వెళ్ళినప్పుడు నేను ఎక్కడ వుండాలి! మా అన్నయ్య దగ్గర వుండడం నాకు ఇష్టం లేదు."

"ఓ అదా నా స్నేహితుని దగ్గర వుందువుగాని. అతని భార్య చాలా మంచిది. సరేనా?"

"ఓ అలాగే" అంది సంతోషంగా.

☆ ☆ ☆

"సారికా సారికా"

"ఏమిటండీ"

"నీకు కథ ఫెయిర్ చెయ్యమని ఇచ్చాను కదా చేశావా ఎల్లుండే పంపాలి. దీనికి ప్రయిజ్ వస్తే ఆ గొప్పతనం అంతా నీదే సుమా. ఇంతవరకూ ఏ కథకూ ప్రయిజ్ రాలేదు నాకు."

"ఇదిగో వ్రాశానండి" అంటూ తెచ్చి ఇచ్చింది.

"కథ చాలా బావుందండి. హీరోయిన్ పేరు 'సారిక' అని పెట్టడంతో మరీ నచ్చింది నాకు" అంది.

అది చూసి "చాలా బాగా వ్రాశావు. నేను చెప్పినట్టుగా చక్కగా అర్థం అయ్యేలా ఖాళీగా వ్రాశావు. ఇంత చక్కగా కథలు వ్రాస్తే అసలు ఎడిటర్స్‌కి చదువుకోడానికి ఏ అవస్థ వుండదు. అబ్బ ఇంత కాలం నీవు లేకుండా కథలు ఎలా వ్రాశానో కదా అనిపిస్తుంది. ఇది ఈ రోజే పోస్ట్ చేసేస్తాను ఎల్లుండి వరకూ ఎందుకు. అది సరే ఎల్లుండి మంచిరోజు. ఆ పొలం కొనుక్కునే వాళ్ళు వస్తారు. నీకు ఇష్టమే కదా? బలవంతం ఏమీ లేదు కదూ! మీ నాన్నగారు ఇచ్చిన పొలం అమ్మడానికి నాకే మనసు రావడం లేదు. మరి నీకెలాగ వుందో తెలియదు. పాస్‌పోర్ట్‌లు రడీ అయ్యాయి. వచ్చే నెలలోనే నా ప్రయాణం. నిన్ను విడిచి వుండలేకపోయినా, తప్పదుగా మరి"

"ఏం ఫరవాలేదు. మీరేం చేసినా, మీరు నన్ను వదిలి వెళ్ళినా నా మంచికేగా. కొన్ని రోజులు ఓపిక పడితే ఆ తరువాత అంతా సుఖమే."

ఆ మర్నాడు విదేశాల గురించి కలలు కంటూ ఏదో ఆలోచిస్తోంది సారిక. ఇంక అక్కడకు వెళ్ళిపోతే ఇంక పుట్టింటికి వెళ్ళాల్సిన అవసరం, అన్నయ్య వదినలతో మాటలు పడాల్సిన అవసరం లేదు అని ఆలోచిస్తుంది సారిక. భర్త వెళ్ళిన తరువాత అవసరం అయితే ఒక్కతినే అయినా వుండాలిగాని పుట్టింటికి మాత్రం పోకూడదు అని గట్టిగా నిర్ణయించుకుంది.

ఇంతలో ఫోన్ మ్రోగింది. భర్త రేప్రొద్దున గాని రాడు. ఊర్లు వెళ్ళినప్పుడు అలా ఫోన్లు చేయడం, చిలిపి ఊహలు రేపడం అతనికి అలవాటే. భర్త దగ్గర నుండి ఫోన్ అనుకొని హుషారుగా అందుకుంది.

"హలో హలో ఎవరండి"

"అది సుందర్‌గారి ఇల్లేనాండి"

"అవునండి. నేను వారి భార్యను. మీరు ఎవరండి. ఆయన ఊర్లో లేరు. ఏమైనా చెప్పమంటారా?"

"నేను ఫోన్ చేసింది నీకొరకేనమ్మా" గొంతులో ఎంతో ఆప్యాయత. ఆ గొంతు వింటుంటే తండ్రి గుర్తుకువచ్చాడు. అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి సారికకు. తండ్రి బ్రతికి వుంటే అన్నయ్య, వదినలు అలా మాట్లాడేవారా అనిపించింది. మనసులో భావాలను బలవంతంగా అదిమిపెట్టి "నాకొరకా?" అంది ఆశ్చర్యంగా.

"నీ పేరేమిటమ్మా?"

"సారిక" అంది.

"చాలా మంచిపేరు. కాని నీ పేరు నీకు చాలాప్రమాదం తెచ్చిపెడుతుంది."

"ప్రమాదమా?" ఆశ్చర్యంగా భయంగా అడిగింది.

"అవును. నీ భర్త నీవనుకున్నంత మంచివాడు కాదు. ఫారెన్ వెళ్ళేది నిజమేగాని, అతని కూడా తీసుకెళ్ళేది నిన్ను కాదు. నీ స్థానంలో అతని భార్యలాగ అతని ప్రియురాలు వెళుతుంది. ఇద్దరికీ పాస్‌పోర్ట్‌లు, వీసాలు కూడా సిద్ధమయ్యాయి."

ఒక్కసారి భూమి గిర్రున తిరిగినట్లయింది. "ఆయన చాలా మంచివారు. అలా ఎప్పటికీ జరగదు" అంది సహనం కూడదీసుకొని.

"నీవుగాని కథలు ఫెయిర్ చేసిపెట్టకు. నీ పేరు హీరోయిన్‌కి ఉన్న కథలు అసలే చేయకు. నీ ఆస్తి అమ్మచూపుతాడేమో జాగ్రత్త. త్వరపడి దేనిమీద సంతకాలు పెట్టకు."

"ఇంతకీ మీరు నా భర్తమీద ఎందుకు అపవాదు వేస్తున్నారో తెలియడం లేదు. ఆయన చాలా మంచివారు."

"అందుకే ముందు భార్య గాస్ లీక్ అయిచనిపోయింది. నీవు త్వరలో కాలుజారి నూతిలో పడబోతున్నావు."

సారికకు ఒళ్ళంతా చెమటలు పెట్టేశాయి. "ఇంతకీ మీరెవరు?" అంది.

"నీ భర్త మొదటి భార్య తండ్రిని. అమ్మా సారికా, నీకు తండ్రిలాంటివాడిని. దయ వుంచి నా మాట విను. నా కూతురు ఇలాగే మోసపోయింది. నా కూతురు పేరు సుబ్బలక్ష్మి. ఆ పేరు కూడా తనకెంతో ఇష్టం అని కథలు ఫెయిర్ చేయించేవాడు సుందర్. నా కూతురు నిద్ర లేవకుండానే గాస్ సిలెండర్ ఆన్ చేసి పెట్టాడు సుందర్. నిద్రమొహాన వంటగదిలోకి వెళ్ళి నా కూతురు అగ్గిపుల్ల వెలిగించి మసైపోయింది. నిజంగా ఆ కథలు ఎవరితోనో వ్రాయిస్తున్నాడు డబ్బిచ్చి."

"మీరు చెప్పేది నిజమేనా?"

"అక్షరాల నిజం. కథలో హీరోయిన్ పేరు సుబ్బలక్ష్మి అని పెట్టి ఆ కథలు ఫెయిర్ చేయించి ఆ కథలో ఆత్మహత్య లెటరు సృష్టించి, ఆమెను చంపేసి ఆ తరువాత అది ఆత్మహత్యగా నిరూపించాడు. అది అతని హాబీ. సారికా, నీ తండ్రిలాంటివాడిని. జాగ్రత్త తల్లీ. నా కడుపు శోకంతో నీకు అలా జరగకూడదని చెపుతున్నాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

సారికకు ఒళ్ళంతా చెమటలు పట్టేసి కంగారు ఎక్కువయిపోయింది. నిజంగా నమ్మబుద్ధి కావడంలేదు. చెడ్డ వాళ్ళు ఎదుట వారికి చెడ్డగా కనిపించరు. మంచిగా కనిపించే ముంచుతారు. దొంగైనా దొరల్లా తిరుగుతారు. ఎందుకో అనుమానం వచ్చి తను వ్రాసిన కథ అంతా దొరకలేదుకాని కథ మధ్యలో చిన్న పేపర్ దొరికింది.

ప్రియమైన శ్రీవారికి,

మీరు నన్ను ఎంతో అభిమానంగాను, ప్రేమగాను చూశారు. కాని నేను హాయిగా వుండడం దేవుడికి ఇష్టంలేదులా వుంది. అందుకే నా జీవితంలో విషం నింపాడు. నిన్న మధ్యాహ్నం మీ రాకకై ఎదురు చూస్తున్నాను. ఇంతలో కాలింగ్‌బెల్ మ్రోగింది. మీరే అనుకొని తలుపులు తెరిచేసరికి ఒక దుండగుడు వచ్చి నాపై అత్యాచారం జరిపాడు. మలినమైన శరీరంతో మీ ముందు వుండలేను. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను. మీరు వచ్చేసరికి నేను ఇంట్లో ఇండను. నా శవం నూతిలో వుంటుంది చూడండి. ఈ నా ఆత్మహత్యకు ఆ దుండగుడే తప్ప మరెవ్వరూ కారణం కాదు. వచ్చే జన్మలో కూడా మీ భార్యగా పుట్టి మీ ప్రేమను పొందాలని ఆశిస్తూ శలవు తీసుకుంటున్నాను.

- మీ ప్రియమైన సారిక.

అది నిజంగా కథలోని భాగం. కాని విచిత్రంగా కథలో పై భాగం, క్రింద భాగం లేదు. ఆ పేపర్ చుట్టూ చక్కగా కత్తిరించబడి దాచిపెట్టబడి వుంది. మిగిలిన కథ ఏమై

వుంటుందా అని చూసింది. అంతలోనే భర్త అంతకు ముందు రోజు తను బాత్‌రూమ్‌లో వుండగా, చెత్త తగలబెట్టడం గుర్తుకు వచ్చింది. వెంటనే వెళ్ళి చూసింది. అంతా కాలిపోయి వుంది. గాలికి వెళ్ళి దూరంగా పడిన చిన్నకాగితం ముక్క కనబడింది. అది ఆమె ఫెయిర్ చేసిన కథలోని భాగమే. అంతే అంతా అర్థం అయిపోయింది. ఇంక ఆలస్యం చేయదలచుకోలేదు. ఆ శ్రేయోభిలాషి చేసిన ఫోన్ పచ్చి నిజం అని తెలిసిపోయింది. పొలం కాగితాలు, తన సర్టిఫికేట్లు, ఖరీదైన సామానులు తీసుకొని బయలుదేరింది.

☆ ☆ ☆

పుట్టింటికి సామానుతో సహా వచ్చిన ఆడబడుచుని చూసి మొహం చిట్లించింది వాసంతి. అన్నయ్యకు, వదినకు తన కథంతా చెప్పింది సారిక.

"అన్నయ్యా! ఆడదానికి ఇది మరోరకం శిక్ష. ఆస్తి పట్టుకెళ్ళిన ఆడదాన్ని ఎవరూ అందలం ఎక్కించరు. ఆ ఆస్తి ఏదోవంకన చేజిక్కించుకొని, ఆ అమ్మాయిని మరో విధంగా హత్యచేసే వాళ్ళున్నారు. కొత్త కొత్త చుట్టాలకు కొత్త కొత్త పథకాలు వస్తాయి. కాని సమస్యలు తీరవు. అసలు మార్పు రావలసింది చుట్టాలలో కాదు, మనుషులలో. ఇదిగో ఈ పొలం పట్టాలు తీసుకో. ఈ ఆస్తి ఇంక నీది. నాకు ఏదో ఉద్యోగం దొరికే వరకూ నేను ఇక్కడే వుంటాను. నాకు నేను బ్రతికి వున్నంతకాలం పుట్టింటి అండ కావాలి. ఈ ఆస్తి వద్దు" అంది.

(వనితాజ్యోతి, 18-10-87)

☆ ☆ ☆

# ఇన్‌స్టాల్‌మెంట్ డెత్

శివం ఆఫీసులో గుమాస్తా. జీవితంలో అన్ని విషయాల్లో చాలా జాగ్రత్తగా ఉంటాడు. చౌరస్తాలో అయినా సరే, మనుషులు లేనిచోట అయినా సరే ఎంతో జాగ్రత్తగా స్కూటర్ నడుపుతాడు. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ. అనారోగ్యం కలిగించేవేవీ తినడు.

ఎంత జాగ్రత్తగా వెహికల్ నడిపినా, అతను ఎంత జాగ్రత్తగా ఉన్నా, అవతలి వారు రాష్‌గా వెహికల్ నడపడంతో డాష్‌కొట్టక తప్పలేదు.

స్కూటర్ని డాష్ కొట్టిన శేఖరం వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు. అతని స్కూటర్‌కు దెబ్బలు తగిలాయి. మనిషి క్షేమంగా ఉన్నాడు. శివం స్కూటర్ నిక్షేపంగా ఉంది. కాని అతని శరీరం గాయాలకి నిలయమైంది. అక్కడ ఉన్నవారు అతన్ని దయదలచి ప్రైవేటు నర్సింగ్‌హోమ్‌కి తీసుకెళ్ళారు.

అది మెడికోలీగల్ కేసు (ఎమ్.ఎల్.సి.కేస్!) పైగా శివం పరిస్థితేమంత బాగాలేదు. అందుకే ఎవరూ నర్సింగ్‌హోమ్‌లో అతణ్ణి అడ్మిట్ చేసుకోలేదు.

శివం మాట్లాడే స్థితిలో లేడు. బాధపడుతోన్న శవంలా ఉన్నాడు. ఒళ్ళు పచ్చిపుండులా ఉంది. అయినా నోరు విప్పి చెప్పలేకపోతున్నాడు.

ఆ తర్వాత శివాన్ని గవర్నమెంటు ఆసుపత్రికి తీసికొని వచ్చారు. కేజువాలిటీలో వార్డుబోయ్‌కి డబ్బుతో షేక్‌హాండ్ ఇస్తేగాని లోపలికి సులువుగా వెళ్ళడానికి కుదరలేదు.

శివాన్ని అక్కడ చేర్చిన వాళ్ళు శివం చుట్టాలికి కబురు పెట్టి, వారెళ్ళిపోయారు.

శివం భార్య వాణి గొల్లుగొల్లున ఏడుస్తూ వచ్చింది. అప్పటికే శివం అక్కడ చేరి మూడు గంటలయింది.

ఏదో కేసు నమోదు చేసుకున్నారేగాని, నగదు చేతిలోపడే వరకు ఎవరూ పట్టించుకోలేదు.

శివం అన్న సూర్యం ఎక్కడో అప్పుచేసి డబ్బు తెచ్చే వరకూ అతనికి ట్రీట్‌మెంట్ అందలేదు.

అక్కడ పేషెంటుని చూసి, కంగారు పడిన వాళ్ళుగాని బ్రతికించాలని తాపత్రయపడిన వాళ్ళుగాని ఎవ్వరూలేరు.

చివరికి కేసుని వార్డుకి పంపించారు. అక్కడా అదేస్థితి... డబ్బులు గుంజేపద్ధతి.

సూర్యం మళ్ళీ అప్పుచేసి అక్కడివాళ్ళందరి చేతులూ తడిపాడు.



ఈలోగా సూర్యుడు అస్తమించడం, ఉదయించడం కూడా జరిగింది.

శివం బాధతో మూలుగుతుంటే... సూర్యం అప్పుల్లో మూలుగుతున్నాడు.

చిట్టచివరికి శివాన్ని పరీక్షించిన డాక్టరు 'ఈకేసు నాది కాదు' అంటూ మరో వార్డుకి షిఫ్టు చేశాడు.

వైకుంఠపాళిలో పాము నోటబడ్డ శివం మళ్ళీ మొదటికే వచ్చాడు.

సూర్యం, మరో అప్పులాడి గుమ్మం తొక్కితేగాని శివం ఈ వార్డులో పరీక్షకు నోచుకోలేదు.

అక్కడి రక్తపరీక్షలు... అవోరకం శిక్షలు! స్కానింగులకే మీనింగులుండవు.

ఎక్స్‌రేలు, యూరిన్‌టెస్ట్‌లు, బ్లెడ్ టెస్ట్‌లన్నీ నామకార్థమే.

రెండోవార్డు వాళ్ళు సూదులు గుచ్చారు. మందులు తాగించారు.

వార్డ్ బోయ్‌లు బెడ్‌ప్యాన్ దగ్గర తిప్పలు పెట్టారు.

సిస్టర్స్, అటెండెంట్స్ మీద అకారణంగా చిర్రుబుర్రులాడారు. డాక్టరుగారు ఈ కేసు నాది కాదు అన్నట్లు శివాన్ని దాటుకొని వెళ్ళారు.

ఆ నిర్లక్ష్యం అంతా తరువాత డబ్బుతో తుడుచుకుపోయింది.

శివంపై శ్రద్ధ ఎక్కువయింది అప్పటికే ఆరోగ్యం క్షీణించసాగింది.

చేతులు తడిపేవరకూ చేతలకి కాళ్ళురాలేదు. అది ప్రభుత్వ ఆసుపత్రి అన్న

మాస్క్ వేసుకున్న ప్రైవేటు ఆసుపత్రి. అక్కడ నీతి నేతిబీరకాయలో నెయ్యిలాంటిది.

మొత్తానికి డబ్బు నీళ్ళలాగ ఖర్చవుతోంది. టెస్టులూ జరుగుతున్నాయి. మందులూ పడుతున్నాయి.

కాని శివం పరిస్థితి మాత్రం మింగేది విషమన్నట్లు గంట గంటకీ విషమిస్తోంది.

ఆ డాక్టర్లు, మిగిలిన స్టాఫ్, వెంట వెంటనే పేషెంటుని చూడకపోవడం, ట్రీట్‌మెంట్ వెంటనే ఇవ్వకపోవడం, హాస్పిటల్‌ని ప్లేగ్రౌండ్‌గా చేసుకుని పేషెంటుని బాల్ విసిరినట్లు ఒకవార్డు నుండి మరోవార్డుకి విసరడం, ఇవన్నీ శివాన్ని యమధర్మరాజుకి దగ్గరచేశాయి.

సూర్యం ఖర్చు పెట్టిన డబ్బు ఏ బూడిదలో పడిందోగాని, శివం శరీరం శవమై బూడిద కావడానికి సిద్ధమైంది!

ఎమ్.ఎల్.సీ. కేసు కాబట్టి బాడీని వెంటనే ఇవ్వలేదు.

మార్చ్యురీ దగ్గరా డబ్బులే! పోస్ట్‌మార్టమ్ దగ్గరా డబ్బులే!

అర్జంటుగా శివం స్కూటర్ అమ్మేశాడు సూర్యం.

ఆ తర్వాత శివం బూడిద అయ్యాడు. అతనితోపాటు అతణ్ణి అంటిపెట్టుకుని ఉన్న అతడి స్కూటరూ అతనితో పాటు వెళ్ళిపోయింది. మన చుట్టూ ఉన్న సమాజంలో శివం లాంటి వాళ్ళు, అణుపరంగా ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో డబ్బు ఖర్చు పెడుతూ ఇన్‌స్టాల్ మెంటులో బ్రతుకుతూ... చావడం ఇంకా అక్కడక్కడా జరుగుతూనే ఉంది.

ఇన్‌స్టాల్‌మెంటూ... నీకు జోహార్లు! షాపు దగ్గరానీవే... చావుదగ్గరా నీవే!

(అమృత్‌కిరణ్, 01-04-95)

☆ ☆ ☆

# చ్ఛిపిథక

29. దేశం దద్దరిల్లిపోను. వీక్లీ రెగ్యులర్‌గారాను, సర్క్యులేషన్ పెరిగిపోను. హ్హిహ్హి ఇహ్హ

23. మరో చక్కని చుక్కను కట్టుకుని ఎంచక్కా చుక్కల్లోకి నడుస్తూ వెళ్ళిపోతాను

10. ఛీ, మా ఆవిడకు పిచ్చి పట్టేసింది

2. ఆ, ఆ, నేనే మాట్లాడుతున్నాను. మీకేం కావాలి?

5. అబ్బెబ్బె అదేందుకండి నా సమస్యకు పరిష్కారం దొరికింది

11. అయ్యో పాపం, అలాగా అండి, అంత పని జరిగిందా

17. ఎర్రకోక, పరుగెట్టింది ముడి సరిగా వేసుకోక నా మాట వినిపించుకోక

22. కొత్త చొక్కా వేసుకుని బుగ్గన చుక్కెట్టుకుని, గొంతులో చుక్కేసుకుని

24. సారీ అండి మీ కోరిక తీరదు అని చెప్పడానికి చింతిస్తున్నాను.

9. మీరు అడ్వర్‌టైజ్ చేసిన పిచ్చికథల పోటీ గురించి పిచ్చిగా ఆలోచించి

6. నాకు చీమనెక్కి ఊరేగినంత ఆనందంగా వుంది.

13. నాకు తేనె సముద్రంలో ఈత కొడుతున్నంత సంబరంగావుంది.

18. నిజంగానా? ఆవిణ్ణి వెతికించమంటారా?

21. అయితే ఇప్పుడు మీరేం చేయదలచుకున్నారు?

25. ఏం ఎందుకు? ఎందుకట?

3. ఇహ్హిహ్హి. రైలెక్కి సూర్యుడి దగ్గరకెళ్ళినంత సంతోషంగా వుందండి నాకు.

12. పాపం లేదూ, దీపం లేదు. ఇది నాకు ఉపకారం. మా ఆవిడ కంట్లో కారం.

27. బావుంది. ఫస్ట్ ప్రయిజ్ ఆవిడకే.

16. కుంటూ, ఎక్కడికో వెళ్ళిపోయింది. ఆవిడపేరు చంద్రిక. కట్టుకున్నది.

8. మీకు వందలకొద్దీ వందనాలు చెబుదామని ఎందుకో తెలుసా?

7. ఇంతకీ అసలు సంగతి...

14. అదిసరే మీ శ్రీమతి ప్రస్తుతం ఎలా వున్నారు. ఆవిడ పేరు?

20. అంటూ ఆమె పీడ విరగడై నా కోరిక తీరింది.



28. అహ్హిహ్హి, ఇహ్హహ్హి. ఎంత అన్యాయం. ఆంధ్రభూమి వర్ధిల్లిపోను ఆంధ్ర
1. అల్లోవ్! నాకు సికరాజుగారు, కావాలండి.
4. ఇంతకీ ఏమిటి సంగతి. మీకు ఎవరో తెలిసిందా
19. ఎతికించవద్దు. మరలానాకు అతికించవద్దు. మీ పిచ్చికథ పుణ్యామా
15. తెల్లగానే వుంది. ఓ గంట క్రితం ఏదో వ్రాసి యురేకా అని అరచు
26. మీ మిసెస్ పిచ్చికథ వ్రాసి ఇక్కడకు తెచ్చారు. చదివాను అది చాల

(ఆంధ్రభూమి వీక్లీ, 'పిచ్చి కథల పోటీ', 16-02-89)

☆ ☆ ☆

# అమ్మాయిలూ జాగ్రత్త

శాంతాదేవి చేతిలో పేపరుతో వచ్చి మౌనంగా కుర్చీలో కూర్చుంది. ఆవిడ రాగానే హాలంతా నిశ్శబ్దమై పోయింది. ఆవిడకు అటు, ఇటు కుర్చీలలో ఆ స్కూల్లో పనిచేస్తున్న మరి కొందరు టీచర్లు కూర్చొని ఉన్నారు. ఆవిడ ఏం చెబుతోందని అందరూ ఆత్రుతగా చూస్తున్నారు. ఆ స్కూల్లో చదివే ప్రతి పిల్లకు శాంతాదేవి అంటే చాలా గౌరవం, అభిమానం. ఆవిడ తెల్ల చీరలో స్వచ్ఛంగా, నిర్మలంగా ఉండి పేరుకి తగినట్లనిపిస్తుంది. అందరి ఆత్రుత గమనించిన శాంతాదేవి తన ప్రసంగం మొదలు పెట్టింది.

"అమ్మాయిలూ! ఈరోజు మిమ్మల్ని ఇచ్చట సమావేశపరచిన విషయం చెబుతాను. అందరూ జాగ్రత్తగావిని, నేను చెప్పేది అర్థం చేసుకుంటారని భావిస్తున్నాను. నిన్న పేపర్లో ఒక సంగతి పడ్డది. అది మీలో కొందరు చదివి ఉండవచ్చు. మరికొందరు చదవకపోవచ్చు. ఏమైనప్పటికి నేను ఇప్పుడు చదువుతాను శ్రద్ధగా వినండి.

ఆ మాటలతో బాలికలందరూ ఆ విషయం ఏమై ఉంటుందా అని ఆత్రుతగా చూడసాగారు. ఆవిడ పేపరు తెరిచి చదవడం మొదలు పెట్టారు.

"పల్లెపాడు అనే గ్రామంలో యుక్తవయసులో ఉన్న ఒక అమ్మాయిని, - పెండ్లి చేసుకుంటానని చెప్పి ఒక యువకుడు మోసం చేసి తనతో తీసికొని వెళ్ళాడు. అమాయకురాలైన ఆ అమ్మాయి అతనిని నమ్మి, తల్లిదండ్రులకు చెప్పకుండా వెళ్ళిపోయింది. అతను ఆమెను తీసికొని వెళ్ళి తను, తన అయిదుగురు స్నేహితులు ఆమెను అనుభవించి, హింసించి అపస్మారక స్థితిలో ఉన్న ఆ అమ్మాయిని సంచిలో పెట్టి నీటిలోకి తోసివేశారు. శవాన్ని పోలీసులు హాస్పిటల్‌కు చేర్చారు. నేరస్థుల గురించి వెతుకుతున్నారు. ఇదీ సంగతి." ఆవిడ చదవడం ఆపింది.

నిశ్శబ్దంగా వింటున్న అమ్మాయిల మొహాలకి చిరుచెమటలు పట్టాయి. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఆ పరిస్థితుల్లో తామే ఉన్నట్లు భావించుకొని, భయపడసాగారు. పరిస్థితి గమనించి శాంతాదేవి -

"నేను చదివింది మీరు విన్నారు కదా! నేను చెప్పబోయేది ఏమిటంటే, మీరందరూ వయస్సులో ఉన్న ఆడపిల్లలు ఎవరు ఏమి చెప్పినా విని మోసపోవద్దు. బంగారంలాంటి జీవితాల్ని పాడుచేసుకోవద్దు. శ్రద్ధగా చదువుకొని తల్లిదండ్రుల మాట వినండి. శరీరానికి ఆహారం ఎంత ముఖ్యమో, శీలం కూడా అంతే ముఖ్యం. అల్లరి అబ్బాయిలు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నించవచ్చు. మీ జాగ్రత్తలో మీరుండాలి. ఎవరినీ నమ్మవద్దు. మీ తల్లిదండ్రులు మీకు మంచి బాట చూపగలరు. ప్రస్తుతం నేను చెప్పేది ఇంతే."

★ ★ ★




ఒక్కసారిగా ఉరుములు, మెరుపులు లేకుండా పిడుగు నెత్తి మీద పడినట్లయింది. నేను కూర్చున్న కుర్చీ తిరగబడి పోయినట్లు కళ్ళు తిరిగినట్లయింది. నా పరిస్థితి గమనించిన డాక్టరుగారు "రఘురామయ్య గారూ! నేను చెప్పబోయేది జాగ్రత్త వినండి. నిజమే ఈ విషయం నేనూ నమ్మలేక పోతున్నాను. మీరు ఇలా అయిపోతే ఎలా? ముందు సంగతి ఆలోచించండి. శాంత ఇలా చేసిందంటే నేనూ నమ్మలేక పోతున్నాను. ఈ వార్త మిమ్మల్ని ఎంత కృంగదీస్తోందో నాకు తెలుసు. పరువు మర్యాదలకు ప్రాణం పోసే మీరు ఇది విని తట్టుకోలేరని తెలిసికూడా, డాక్టరుగా చెప్పక తప్పలేదు. ఎవరికీ తెలియకుండా నేను శాంతకు అబార్షన్ చేస్తాను. ఆ అబ్బాయి ఎవరో కనుక్కొని వెళ్లి అడగండి. లేదా త్వరలో వేరొక సంబంధమైనా చేయండి.

కాని ఆయన మాటలు వినే స్థితిలో లేదు నా మనస్సు. ఎంతో గౌరవంగా పెంచిన శాంత ఎందుకిలా చేసింది. తనకు స్వేచ్ఛ నివ్వడం తప్పా? పెళ్ళి కాకుండానే గర్భవతి అయిన కూతుర్ని ఏంచెయ్యాలి? నాలోని నవనాడులు కృంగిపోయాయి. డాక్టరుగారితో ఏమీ చెప్పకుండానే ఇంటికి బయలుదేరాను. ఏమి ఆలోచిస్తున్నానో, ఎలా నడుస్తున్నానో, ఇకముందు నేను ఎలా బ్రతకాలో తెలియని అయోమయస్థితిలో నున్న నన్ను ఒక కారువచ్చి గుద్దడం నా ఆలోచనలకు, బాధకు స్వస్తిపలకడం నిజంగా నాకు తెలియదు. ఒక్క దెబ్బతో నా మనస్సు శాంతంగా ఉంది.

☆ ☆ ☆

అకస్మాత్తుగా నా నుదుటి కుంకుమ తుడుచుకొని పోతుందని నేను అనుకోలేదు. నేను, శాంతా ఒంటరిగా మిగిలిపోయాం. శాంతి పెళ్ళిగురించి ఆయన, నేను ఎన్నో ఊహించుకున్నాం. ఒక్కగానొక్క కూతురు చక్కగా పెళ్ళి చేయాలని, మనుమలని ఎత్తాలని. కాని ఒక్కరోజుతో నా ఆశలు, జీవితంకూడా నాశనమయ్యాయి. పులిమీద పుట్రలా శాంత గర్భవతి. పోయిన భర్త గురించే ఏడవనా, కూతురుచేసిన నీచమైన పనికే తలబ్రద్దలు కొట్టుకోనా? సుడిగాలిలోని నావలాగ ఉంది నా పరిస్థితి. అటువంటి సమయంలో మా తమ్ముడు వచ్చి నా సంగతి తెలిసి, శాంతనూ, నన్నూ వాళ్ళ ఊరు తీసుకొని వెళ్ళాడు. అక్కడే రహస్యంగా అబార్షన్ చేయించాడు శాంతకు. శాంతను నోటికి వచ్చినట్లు తిట్టాను. కాని శాంతను శీలవతి చెయ్యగలనా? ఆ అబ్బాయి ఎవరై ఉంటారో నాకు తెలుసు. ఆనాడు శాంత తరుచుగా వాళ్ళ ఇంటికి వెళ్ళడం చూసీ చూడనట్లు ఊరుకోవడం నాతప్పే. అప్పుడే అది తప్పని చెప్పి ఉంటే ఇలా జరిగేది కాదేమోననిపించింది. శాంతకుభయం చెప్పకుండా పెంచడం, ఏం చేస్తుందో గమనించక పోవడం నేను చేసిన పెద్ద పొరపాటు. శాంత చేసిన ఈ తప్పటడుగు వలనే నా భర్తను పోగొట్టుకుని దిక్కులేనిదాననయ్యాను అని తలచుకుంటే, మనస్సు బద్దలవుతుంది. ప్రస్తుతం నేను చెయ్యగలిగినది ఒక్కటే. వెళ్ళి మా పక్కింటి అబ్బాయి కాళ్ళమీద పడయినా సరే శాంతకు పెళ్ళి చేయాలి. అదే ఉద్దేశంతో రఘు ఇంటికి వెళ్ళాము. రఘు మెడిసిన్ నాలుగవ సంవత్సరం చదువుతున్నాడు. నన్ను చూడగానే ముఖం చిట్లించుకున్నాడు. నా అభ్యర్థన విని అతనన్న మాటలు నన్ను పాతాళంలోకి విసిరేసాయి. “మీ అమ్మాయికి నాతో కాక చాలమందితో సంబంధాలున్నాయి. వాళ్ళలో ఎవరైనా చేసుకుంటారేమో అడగండి. చూస్తూ, చూస్తూ శీలం లేని ఆడదాన్ని చేసుకునే సాహసం లేదు నాకు” అన్నాడు. నిర్జీవిగా ఇంటికి చేరాను. శాంతకు ఎవరినో ఒక్కరిని చూసి త్వరలో పెళ్ళి చెయ్యాలి. ఆ తరువాత ఏమైనా కాని ముందు శాంతకు పెళ్ళి అవసరం. మాతమ్ముడి ద్వారా వెతికితే ఒక మంచి సంబంధం దొరికింది. త్వరలోనే శాంతకు పెళ్ళిచేసి అత్తవారింటికి పంపి, నేను మా తమ్ముడి పంచను చేరుకున్నాను.

★ ★ ★

కోటి ఆశలతో, కోటి కోరికలతో శాంత మెడలో తాళి కట్టాను. నిజంగా శాంతను పొందడం నా అదృష్టమనే చెప్పాలి. శాంత చాలా అందమైంది. అమాయకురాలు, అనుకూలవతి. శాంతను పొందిన నా జీవితం సార్థకమైందని ఎంతో మురిసిపోయాను. నా తల్లిదండ్రులను, తమ్ముళ్ళను ఎంతో ఆప్యాయంగా చూసేది. నాకు స్వర్గాలే చూపించేది. ఏ విషయంలోనూ తప్పుపట్టలేక పోయేవాడినికాని, శాంతకు బిడియం ఎక్కువ. అందమైన శాంతకు ఆ సిగ్గు మరింత శోభనిచ్చేది. మరొక సంవత్సరానికి నాకు ముద్దుల మూటగట్టే కూతురిని కూడా ప్రసాదించింది. నా కుటుంబమంతా నా

జీతం మీదే ఆధారపడి ఉన్నావారు. కాబట్టి శాంత కోరికలు మాత్రం తీర్చ లేకపోయేవాడిని. అసలు శాంతకు కోరికలున్నాయా అని ఒక్కొక్కసారి అనుమానం కలిగేది. నేనంటే శాంతకు ఎంతో ఆరాధన, అభిమానం. పాపతో రోజూదివ్యంగా గడిచిపోయే సమయంలో నాకు మరో ఊరు ట్రాన్స్‌ఫర్ అయింది. పోనీ శాంతకు స్థలమార్పువల్ల కొంచెం విశ్రాంతి దొరుకుతుందని, మా జీవితం ఇంకా హాయిగా ఉంటుందని భావించి ఎంతో హుషారుగా ఆ ఊరికి ప్రయాణమయ్యాను. అక్కడ కొద్దిరోజులు ఆనందంగా గడిచాయి. ఒక రోజు ఇంటికి వచ్చేసరికి శాంత మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. ప్రక్కనే మరొక మగవాడిగొంతు. "ఆనంద్! దయచేసి నా జోలికి రాకు. నేను చెడ్డదాన్నయినంత మాత్రాన నీవు నన్ను ఇలా వెంబడించడం బాగులేదు. నాకు పెళ్ళయింది. నా భర్త ఎంతో మంచివాడు. నా జీవితంలో నిప్పులు పొయ్యకు. ఇంకెప్పుడూ మా ఇంటికి రాకు" అంటూ ఏడుస్తుంది. పరిస్థితి అర్థమైంది. వెంటనే వెనక్కి వెళ్ళి పోయాను. తర్వాత ఏమీ తెలియనట్లే ఇంటికి వచ్చాను. శాంత మామూలుగాగే ఉంది. ఆనంద్‌తో నేను మాట్లాడి వచ్చానని తెలిస్తే శాంత ముఖం ఎలా ఉంటుందో? ఆనంద్ ద్వారా విన్న సంగతులు - "ఆనంద్‌ది, శాంతది ఒకే ఊరు. ఆనంద్ మా బ్యాంక్‌లోనే పనిచేస్తున్నాడు. శాంతకు చాలామందితో పరిచయం, అబార్షన్, తండ్రి మరణం - అన్నీ వివరించి చెప్పాడు. నా శరీరంలోని రక్తమంతా ఒక్కసారి నీరైపోయింది. నాకు పాములన్నా, శీలంలేని స్త్రీలన్నా ఇష్టంలేదు. కాని ఇంతకాలం పాము నా ప్రక్కనే ఉందని, అది రోజూ నన్ను కాటువేస్తోందని నాకు తెలియదు. ఆడయినా, మగ అయినా ప్రతివారికీ శీలం చాలా అవసరం. నేను ఎప్పుడూ ఏ ఆడపిల్ల జోలికీ పోలేదు. నాలాగే నా భార్య పవిత్రంగా ఉందని, నేనెంతో అదృష్టవంతుడినని అనుకున్నాను. శాంత గయ్యాళిదయినా నేను మనస్ఫూర్తిగా భరించేవాడినేమో కాని ప్రతివాళ్ళూ నా భార్య గురించి అసహ్యంగా మాట్లాడుకోవడం నేను భరించలేను. శాంతను క్షమించలేను. విడాకులిచ్చి మరొక పెళ్ళి చేసుకున్నా సుఖపడతానని నమ్మకం ఏమిటి? ఇకపై ప్రతి నిముషం నరకయాతన అనుభవిస్తూ బ్రతికే కంటే ఒక్కసారి చస్తే మంచిదని తోచింది. నన్ను పిరికివాడని ఎవరైనా అన్నా బాధలేదు. నేను శాంతతో ఒక్కరోజుకూడా బ్రతకలేను. ప్రతివారికి అందం అంతో ఇంతో ఉంటుంది. కాని అందం కంటె శీలం ముఖ్యం.

☆ ☆ ☆

నా పేరు శాంత. తల్లిదండ్రులకు ఒక్కతేకూతురిని బి.ఎ.చదువుకున్నాను. చాల అందమైన దానినని అందరూ అంటారు. అది నాకు గర్వకారణం. ఈ అందాన్ని చూసి గర్వపడతానని ఎవరూ అనుకోరు. ప్రతి మగవాడిని నేను చుట్టూ తిప్పుకోగలగని నేనంటే పడి చస్తారని నా అభిప్రాయం. ఆ అభిప్రాయంతోనే మా లెక్చరర్ ప్రసాద్

మాటలకు లొంగిపోయాను. మొదట తెలియని పాఠాలు చెప్పించుకోడానికి వెళ్లేదాన్ని, ఆయన నన్ను చాలా ఆకర్షించారు. నా అందాన్ని ఎంతో పొగిడారు. మురిసి పోయాను. ఆ మైకంలోనే ఒకరోజు ఆయనకు నన్ను నేను అర్పించుకున్నాను. ఇందులో ఆయన బాధ్యత లేదు. నాది చాలా ఉంది. తర్వాత పెళ్ళి సంగతి గుర్తుకు వచ్చింది. ప్రసాద్‌గారిని అడిగితే అప్పటికే తనకు పెళ్ళయిందని, ఇద్దరు పిల్లలున్నారని - చావు కబురు చల్లగా చెప్పాడు. ఏం చెయ్యాలో తోచలేదు. అయినప్పటికీ నా శరీరం నాకు తెలియకుండానే వాళ్ళింటికి లాక్కెళ్లేది రోజూ. తియ్యని అనుభూతులతో నేను తప్పు చేస్తున్నాననిగాని, అది నా జీవితానికి గొడ్డలి పెట్టని అనిపించలేదు. ఒకరోజు లెక్చరర్ గారి శ్రీమతి అకస్మాత్తుగా ఊరినుండి రావడం మా ఇద్దరినీ అల్లరిపెట్టడం జరిగింది. నా సంగతి చాలా వరకు అందరికీ తెలిసింది. మా తల్లిదండ్రులకు మాత్రం తెలియలేదు. నేను ఎంతో మంచిదాన్నని నాన్నగారి అభిప్రాయం. ఆయన నాకు స్వేచ్ఛ ఇచ్చారు. కాని నేను దాన్ని నిలుపుకోలేక పోయాను. ప్రతీ ఆడపిల్లా తన జాగ్రత్తలో తానుండాలిగాని, ప్రతీ నిముషం తల్లిదండ్రులు కాపలా కాయలేరు కదా!

మా కాలేజీలో నా గురించి చాలా కథలు పాకాయి. స్నేహితులు నాతో మొహమాటానికి మాట్లాడినా వెనుకగా హేళన చేసేవారు. పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతున్నట్లే నేనూ ప్రవర్తించాను. ఆ తర్వాత మా ఇంటి ప్రక్క డాక్టర్ విద్యార్థి రఘుతో పరిచయం పెంచుకున్నాను. మొదట్లో రఘుని అన్నయ్యా అని పిలిచేదాన్ని కాని అన్నయ్య అనే భావం నాలోనూ లేదు. చెల్లెలు అనే భావం అతనిలోనూ లేదని తెలుసుకున్నాం.

ఒకరోజు అన్నాడు. నన్ను అన్నయ్యా అని పిలవకు. నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను. నీలాంటి అందంను వదులుకోలేను. ఆ మాటలు నాకు పన్నీటిలా అనిపించాయి. ఇప్పటికే లెక్చరర్ సంగతి, నా సంగతి చాలా మందికి తెలుసు. ఆయనను పెళ్ళి చేసుకునే అవకాశం లేనప్పుడు రఘుని పెళ్ళి చేసుకోవడం మంచిది. అదే ఉద్దేశంతో అతను నన్ను కోరినప్పుడు కాదనలేదు. ప్రతిరోజు క్లాసులు ఎగ్గొట్టి అతని స్నేహితుని గదిలో కలుసుకొనే వాళ్ళం. రఘూ నిజంగా ప్రేమ చూపిస్తున్నాడనే భ్రమలో ఉన్నాను. పెళ్ళి గురించి కలలు కనేదాన్ని. కాని అతను ఒక్కొక్క సంవత్సరం పైకి వెళ్ళేకొలది కొన్ని వేలు కట్నం పెరుగుతుందని అది వదులుకోడని అప్పట్లో నాకు తెలియదు. నా మీద అతనికి మోజు తీరినతర్వాత ఎలాగైనా నన్ను వదుల్చుకోవాలని చూశాడు.

ఒకరోజు రఘు గురించి ఎప్పటిలా ఎదురు చూస్తున్నాను. ఆ గదిలో నా మనస్సునిండా అతనే ఉన్నాడు. ఆసమయంలో రఘుస్నేహితులు ముగ్గురు నన్ను బలవంతంగా అనుభవించడం జరిగింది. ఇంతకాలం స్వర్గమనుకున్న గది, ఎంత

నరకమో ఆరోజే తెలిసింది. ఆ గది ఆనంద్‌ది. అతను బిఎస్సీ చదివేవాడు. అంతటి ఘోరమైన పరిస్థితిలో కూడా నేను రఘుకోసం వెళ్ళడం మానలేదు. దానికి నా నిర్లక్ష్యం ఒకకారణం. అందగత్తెననే గర్వంమరొకటి. మొదట ఆకర్షణలో పడి తప్పు చేశాను. తర్వాత తెలిసి తెలిసి చేశాను. తెలిసి చేసే తప్పు కాబట్టి నా మనస్సు రాయిలా మారిపోయింది. ఆ స్నేహితులందరూ కలిసి నాకు క్రిస్టిన్ కీలర్ అనే పేరు పెట్టారు. ఆ క్రిస్టిన్ కీలర్ ఎవరో నాకు తెలియదుగాని, నాలాంటి శీలంలేని యువతి అని గ్రహించాను. ఇంక ఏ ముఖం పెట్టుకుని రఘుని పెళ్ళిచేసుకోమని అడగను. రోజురోజుకీ ఆ ఊబిలో మరీ దిగబడి పోయాను. తల్లిదండ్రులను మోసం చేశాను. ఒక రోజు ఇంట్లో కళ్ళు తిరిగి పడిపోతే నాన్నగారు హాస్పిటల్‌లో నన్ను డాక్టరుగారికి అప్పజెప్పి వెళ్ళిపోయారు. ఆ సాయంకాలం నాన్నగారి శవం ఇంటికి వచ్చింది. దానికి కారణం నేనేనని తెలుసు. అన్నివిధాలా అంధకారంలో ఉన్న నేను ఇంకా ఏడవలేను. అమ్మ రహస్యంగా మామయ్యగారింటి దగ్గర నాకు అబార్షన్ చేయించింది.

అమ్మ నాకు పెళ్ళి చేయాలని తొందరపడి ఒక సంబంధం నిర్ణయించింది. నాకు సన్నని వణుకు ప్రారంభమైంది. నా సంగతి అతనికి తెలిస్తే చేసుకుంటాడా అని భయం కలిగింది. నాకు పెళ్ళన్నా, నల్ల పూసలన్నా, మట్టెలన్నా చాలా ఇష్టం. భార్యా భర్తలు పిల్లలతో వీధిలో నడుస్తుంటే ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసేదాన్ని. నాకు అలాంటి అదృష్టం ఎప్పుడు వస్తుందో ననుకునేదాన్ని. కొద్ది రోజులుఆగితే నాన్నగారు పెళ్ళిచేసేవారు. కాని స్వేచ్ఛ, వయస్సు, కోరికలు నన్ను తప్పుదారి పట్టించాయి. నా స్వేచ్ఛను, అందాన్ని నేను దుర్వినియోగం చేశాను. ఒక్కసారిగా మొద్దుబారిపోయింది నా మనస్సు. అందుకే పెళ్ళికి అంగీకరించాను.

పెళ్ళి దగ్గరకు వస్తుంటే భయం. ఎవరైనా నా సంగతి పెళ్ళివారికి చెప్పేస్తే పెళ్ళి ఆగిపోతుంది. లేదా మొదటి రాత్రయినా నాసంగతి నా భర్తకు తెలిసి పోతుంది. ఆ తర్వాత నా గతేమిటి? నాకూ అందరిలా చక్కగా కాపురం చేసుకోవాలని ఉంది. నేను చేసినది ఎంత తప్పో ఇప్పుడిప్పుడే అర్థం అవుతోంది. నా మనస్సు నాకు తెలియకుండానే భయపడుతోంది.

నేను అనుకున్నట్లు పెళ్ళికి ఎలాంటి ఆటంకాలు రాలేదు. నా భర్త చాలా మంచివాడు. అతనికి ఎటువంటి చెడ్డ అలవాట్లు లేవని మొదటిరాత్రే తెలుసుకున్నాను. అతను నన్ను అనుమానించలేదు. ఒకరిని మోసం చేస్తున్నాననే భావం నాలో ఉన్నా ఎందుకో నాకు తెలియకుండానే అతనికి అర్పించుకున్నాను. లోపల సుడిగుండాల్ని పెట్టుకుని పైకి నవ్వుతూ బ్రతకడం అలవాటు చేసుకున్నాను. ఎప్పటి కప్పుడు నా సంగతి ఆయనకు చెప్పి క్షమాపణ వేడుకోవాలనుకునేదాన్ని. కాని అతను క్షమించకపోతే ఆ జీవితం అంతటితో సమాప్తం. బంగారంలాంటి భర్తకు దూరం కావాలని లేదు.

నేను జీవితంలో తప్పుచేసినప్పటికీ నా జీవితం సంతోషంగా ఉండాలనే కోరుకున్నాను. మా అత్త మామలు చాలా మంచివారు. మా అత్తగారు నన్ను కన్న కూతురులా చూసుకునేది. ఆవిడకు కూతుర్లులేని కారణం ఒకటి, ఆమె తన అత్తగారితో చాలా బాధలు పడ్డదట. అందుకే తన కోడళ్ళు బాధ పడకూడదని ఆవిడ ఉద్దేశం. ఇలాంటి అత్తమామలు, నన్ను అభిమానించే మరుదులను, ప్రేమకు ప్రతిరూపం అయిన భర్తను వదలడానికి నా మనస్సు అంగీకరించక, లోపల నా మనసు ప్రతి నిమిషం వేయి ముక్కలవుతున్నా పైకి గంభీరంగా ఉండసాగాను.

ఆయనకు శీలంలేని ఆడవాళ్ళంటే అయిష్టమని తెలిసి క్రుంగిపోయాను. ఎప్పటికయినా ఈ సంగతి తెలిస్తే తరువాత నా బ్రతుకేమిటి? భగవాన్ తెలిసే తప్పుచేశాను. నన్ను మనస్ఫూర్తిగా క్షమించు ఈ సుఖాల్ని నాకు దూరం చేయకు అని మనసులోనే దేవుణ్ణి వేడుకునేదాన్ని. అలాగే మూడు సంవత్సరాలు గడిచాయి. పాప పుట్టింది. పాపకు సంవత్సరంన్నర రాగానే మాకు వేరే ఊరు ట్రాన్స్‌ఫరయింది. అది నాకు శాపమైంది. నేను పాపతో, ఆయనతో బయటకు వెళితే నా మనస్సు ఎంతగానో పొంగిపోయేది. ఇదే నేను కోరుకున్న జీవితం అనిపించేది. నా భర్త తన అనురాగం విషయంలో ఎప్పుడూ లోటు చేయలేదు. ఏనాడూ నన్నేమీ అనలేదు. మావారు పనిచేసే బ్యాంక్‌లోనే ఆనంద్ పనిచేస్తున్నాడట. ఒకరోజు మావారితో నన్ను చూశాడట. ఆయన లేనప్పుడు ఇంటికి వచ్చి నన్ను బలవంతం చెయ్యడం, లొంగి పొమ్మనడం చేయసాగాడు. నేను ఎటువంటి పరిస్థితులలో ఉన్నా నా బాధ నా భర్తకు తెలియనివ్వలేదు. కాని నా బ్రతుకు సుడి గాలిలో చిక్కింది.

ఆరోజు నాభర్త మామూలుగా ఇంటికి వచ్చాడు. అంతకు ముందే ఆనంద్ వచ్చి వెళ్ళాడు. ఆయనగాని ఆనంద్‌ని చూడలేదుకదా అనిపించింది. ఆయన ఎప్పటిలా నన్ను దగ్గరకు తీసుకోలేదు. పాపను ఎత్తు కోలేదు. మామూలుగా భోజనం చేశారు. మనస్సులో ఏముందో అర్థం కాలేదు. పడుకునేటప్పుడు మాత్రం "నేను లేకపోయినా నీకు చదువుంది. బ్రతకగలవు. నీ అందాన్ని చూసి అయినా ఉద్యోగం యిస్తారు. అదీ లేకపోతే సానిగా బ్రతికినా బోలెడు డబ్బు వస్తుంది. ఆ వృత్తి నీ కభ్యంతరం లేదనుకుంటాను." అంతే పిడిగుపడినట్లయింది. ఆ మర్నాడు ఆయన శవం మంచం మీద ఉంది. నిద్రమాత్రలు మమ్మల్నిద్దర్నీ దూరం చేశాయి.

అన్నివిధాల నాశనమైన నేను ఇప్పుడు చెయ్యగలిగింది ఒక్కటే. నా కూతుర్ని నాలా తయారు చెయ్యకూడదు. "అమ్మా! ఆనాడు నాలుగు తన్ని అయినా నన్ను ఇంట్లో కూర్చోబెడితే ఆ రఘూ దగ్గరకు వెళ్ళకపోయేదాన్ని" అని ఎన్నో సార్లు ఏడ్చుకున్నాను. తర్వాత బియ్యీడి ట్రయినింగయ్యాను. ఆడపిల్లల స్కూలుకి హెడ్‌మిస్ట్రెస్ నయ్యాను. ఆధారం లేని నా అత్తమామలకు నేనే దిక్కు. నా కూతురు నానమ్మ

తాతయ్యల పెంపకంలో, బాబాయిల అనురాగముతో చక్కగా పెరుగుతోంది. నా జీవితంలా కాకుండా నా కూతుర్ని పెంచాలి. ఏ ఆడపిల్లా నాలాగ జీవితాన్ని పాడుచేసుకోకూడదు. ప్రతి స్త్రీకి శీలం ఎంతో ముఖ్యం. ప్రతీ ఆడపిల్ల వేసే అడుగు బంగారు బాట కావాలి గాని, అది తప్పటడుగు కాకూడదు. నా విద్యార్థులకు నేను ఎప్పుడూ ఇచ్చే సందేశం ఇదే!

"అమ్మాయిలూ! వయస్సు వ్యామోహంలో పడి మీ శీలాన్ని మాత్రం ఎవరికీ అర్పించవద్దు. పెళ్ళికి ఉన్న విలువ తెలుసుకోండి. ప్రతి స్త్రీకీ పెళ్ళి ఎంత అవసరమో, శీలం కూడా అంతే అవసరం అని గ్రహిస్తే నేను ధన్యురాల్ని!!

(మొట్టమొదట అచ్చయిన కథ, ప్రభ, 10-08-77)

☆ ☆ ☆

# మంచుతెరలు

"రామ్మా! రా, ఒక్కదానివే వచ్చావేం అల్లుడుగారేరి?"

"నాన్నా!"

"ఏం అమ్మా! ప్రయాణం బాగా జరిగిందా?"

"ప్రయాణం బాగే జరిగింది నా బ్రతుకే బాగులేదు"

"అంటే?"

"అంటే ఏముంది. నేనిక ఆయన దగ్గరకు వెళ్ళదలచుకోలేదు. ఆయన కేంప్‌కి వెళ్ళారు. నేనిలా వచ్చినట్లు ఆయనకు తెలియదు."

"అక్కడ నీకేం కష్టం వచ్చింది తల్లీ? అంతటి నిర్ణయం తీసుకున్నావు. అల్లుడుగారు కొడుతున్నారా, తిడుతున్నారా?"

"ఊహూ, అదేం లేదు."

"మరి, నీకు విలువ ఇవ్వడం లేదా? అన్నం సరిగా పెట్టడం లేదా?'

"అహ, అది కాదు"

"మరేమిటమ్మా. నిన్ను పంజరంలో బంధించి, నీ కోరికలు తీర్చడం లేదా?"

"అబ్బెబ్బే, అదేం కాదు నాన్నా!"

"అయితే ఇప్పుడర్థం అయింది. అల్లుడుగారిలో ఉన్న లోపం ఏమిటో?"

"ఏమిటి నాన్నా! ఆ సంగతి నీవూ విన్నావా?"

"నేను ఏ సంగతీ వినలేదుగాని, అల్లుడిగారిలో ఉన్న లోపం ఒక్కటేనమ్మా! ఒక్క చెడ్డ గుణమూలేకపోవడం. అది నీవు భరించలేక పోతున్నావు."

"నాన్నా! నీవూ మగాడివే కదా. అందుకే ఆయన్ని వెనకేసుకొస్తున్నావు."

"నాకు జరిగిన అన్యాయం వింటే, నీవిలా మాట్లాడలేవు నాన్నా!"

"సరే, ఏమిటో చెప్పు అది. నాకు చేతనైతే పరిష్కరిస్తాను."

"ఆయనకు... ఆయనకు..."

"ఏం ఆయనకు మరో స్త్రీతో సంబంధం ఉందా?"

"అలా అని నే నన్నానా?"

"ప్రశ్నకు ప్రశ్న సమాధానం కాదు. పోనీ, నే నడగ వలసిన మాట కాదనుకో, నిన్ను అతను సంసారంలో సుఖపెట్టలేక పోతున్నాడా?"

"అది అసలే కాదు."

"మరేమిటమ్మా?'

"ఆయనకు... ఆయనకు పిల్లలు పుట్టే యోగం లేదుట. ఆయనే చెప్పారు. ఇంతకాలం లోపం నాదే ననుకున్నాను."

"లోపం నీదే అనుకొని గుట్టుగా సంసారం చేశావు. ఇప్పుడు అల్లుడుగారిది అని తెలిశాక, రట్టు చేయాలనుకుంటున్నావా?"

"ఏమో ఆ సంగతి తెలిసిన తరువాత ఇంక ఉండబుద్ధి కాలేదు."

"ఒకవేళ, నీలో లోపం ఉంటే, అతను అలా వెళ్ళిపోతే నీవేం చేస్తావు. బాధపడవా?"

"మగవాళ్ళేం చేస్తారు? పిల్లలకోసం మరో పెళ్ళి చేసుకుంటారు."

"అయితే, నీవూ మరో పెళ్ళి చేసుకుంటావా?"

"ఛ... ఛ...."

"మరైతే ఎందుకు వచ్చేసినట్టు?"

"నాకు ఉండబుద్ధి కాలేదు. ముందు ముందు నేను అక్కడ ఉండలేనేమోనని భయం వేసింది."

"రాని కష్టాన్ని ఊహించుకొని, ముందే పరిష్కారం ఆలోచించావన్నమాట."

"మరేం చేయమంటావు?"

"తిరిగి అల్లుడుగారు కేంప్ నించి రాకముందే వెళ్ళి పొమ్మంటాను."

"అది, అది నావల్ల కాదు. పిల్లలు లేకుండా..."

"కొంపేం మునిగిపోదు! అదో దేశసేవ అనుకో. పిల్లలున్న వారికి తమ పిల్లలే పిల్లలుగాని, లేని వారికి, అనాథలందరూ పిల్లలే. ఒక అనాథను పెంచుకొని, ఒక జీవితంలో దీపం వెలిగించి, ఆ వెలుగులో జీవించు."

"అనాథను నేను నా స్వంత పిల్లగా చూడలేను."

"అయితే ఈ ఉత్తరం చదువు." అంటూ డ్రాయరులాగి ఉత్తరం తీసి ఇచ్చాడు.

"డియర్ గోపాల్! ఈ ఉత్తరం ఎలా రాయాలో తెలియడంలేదు. మొన్ననే మహిత, మనోహర్‌లను పరీక్షించాను. మనం అనుకున్నట్లు లోపం అల్లుడిది కాదు.

అమ్మాయిదే. మనోహర్ ఈ విషయం మహితకు చెబితే అప్‌సెట్ అవుతుందని, జీవితాంతం బాధపడుతుందని కాబట్టి తనలోనే లోపం ఉన్నట్లు మహితకు చెప్పమన్నాడు. ఆమెకాలిలో ముల్లుగుచ్చుకుంటే, అతని కళ్ళలో గుచ్చుకున్నట్లు బాధపడే మనోహర్ మంచి మనసుని దేనితో చెప్పాలి? వద్దు పోల్చి, ఆ పోలికతో అతన్ని అపవిత్రం చేయవద్దు. ఈ విషయం, మహితకు ఎట్టి పరిస్థితుల్లోనూ తెలియనీయవద్దని మనోహర్ కోరిక.

ఇట్లు
రామం.

"నాన్నా!"

"ఏమిటమ్మా?"

"నాకళ్ళకు కట్టిన మంచు తెరలు తొలిగిపోయాయి. ఆటో తీసుకురా నాన్నా! ఆయన రాకముందే ఆ స్వర్గంలోకి నేను చేరిపోవాలి."

"అలాగే తల్లీ. నీ సంతోషమే నా సంతోషం."

(ప్రభ, 14-06-89)

☆☆☆

# టాప్ సీక్రెట్

నా భార్య అవంతి. ఆమె అందాల పూబంతి.

పెళ్ళిచూపుల్లో, మొదటి చూపుల్లోనే ఓకే చేసేసాను. బంగారపు ముద్దలా, ముద్దుగుమ్మలా, సద్దుచేస్తే పారిపోయే రాచిలకలా, పొద్దు పొడుపు కిరణంలా ఆ ముద్దుగుమ్మ, కొద్దిగా తలవంచుకుని కూర్చుంటే నా కోసం, కేవలం నా కోసం దేవుడు పంపిన భార్య అనుకున్నాను.

నా అనుమతితో అవంతి నా శ్రీమతి అయింది. అవంతిలో ఏ వంకా లేదు. కొన్ని రోజులు చాలా సరదాగా, ఆనందంగా గడిచిపోయాయి.

గడపదాటి బయటకు వెళితే అవంతిని తిరిగి ఎప్పుడు చూస్తానా అని గడగడలాడిపోయేవాడిని.

వాసు రాకతో మా దంపతుల మధ్య చిన్న తెరపడింది. వాడు నా ప్రాణ స్నేహితుడు. వాసుకి జీవితం అనుభవించడానికే అన్న భావం తప్ప మరేదీ కాదు. మా పెళ్ళయి రెండు సంవత్సరాలు నిండడంతో ఆ ముద్దరాలు మొద్దురాలుగా కనబడింది నాకు.

వాసు నా బాసు అయిపోయాడు. ఇంట్లో ఏం తోస్తుందిరా బోరు అంటూ నన్ను క్లబ్బుకి సాయం మబ్బు చీకటికి చేరకుండానే ఆఫీసు నుండి అలాగే లాక్కెళ్ళిపోతున్నాడు.

ఒక గంటేకదా అంటూ ప్రారంభమైన పేకాట ఒక పట్టాన కదలనిచ్చేదికాదు. ఆ పదమూడు ముక్కలు నన్ను తాళ్ళుగా మారి అక్కడే కట్టి పారేస్తున్నాయి. దానితో అవంతి కళ్ళల్లో నీరు కాలవలై పారుతోంది. అవంతి నాకోసం ఎదురుచూసి నన్ను సాధించకుండా విసిఆర్ కొన్నాను. లైబ్రరీ పుస్తకాల అబ్బాయిని రోజూ అవంతి ఎన్ని అడిగితే అన్ని తెచ్చి ఇమ్మన్నాను.

మొదట్లో అవంతికి వాటితో కాలక్షేపం అయినా రానురాను ఈ టీవీలో పాత్రలు తనతో మాట్లాడడం లేదని, ఆఫీసునుండి నేరుగా ఇంటికి వచ్చేయమని ప్రాధేయపడింది.

మంచికి అలవాటు అలవడడానికి సంవత్సరాలు పట్టవచ్చుగానీ, చెడుకి మాలిమి కావడానికి క్షణాలు చాలు. నాకు పేకముక్కల్లోని రాణీయే అవంతికంటే దగ్గరయింది. ఆ క్లబ్బుల్లోనే ఏదో తినేయడం, అప్పుడప్పుడు తాగడం కూడా అలవాటు అయిపోయింది.

అవంతి పుట్టింటికి వెళతానని బెదిరించింది. నీ ఇష్టం అన్నాను. ఆమె లేకపోతే తెల్లవార్లూ క్లబ్బులోనే వుండవచ్చని. కానీ ఆమె వెళ్లలేదు. కానీ మరలా ఆ మాట ఎప్పుడూ అనలేదు. ఆమెతో బయటకు వెళ్లి కాలక్షేపం చేసే అవకాశంలేదు. ఒకవేళ వెళ్లినా టివిలో ప్రోగ్రాములకిచ్చే ప్రాధాన్యత, అతిథులకు ఇచ్చే స్టేజీ నుండి మనం ఇటీవల కాలంలో బాగా దిగజారిపోయాం. అతిథులను పట్టించుకోవడంలేదు.

అవంతి నాకు చెప్పి చెప్పి విసిగిపోయింది. నేను మారనని ఆమెకు అర్థం అయిపోయింది. నాతో మాట్లాడడం బాగా తగ్గించేసింది. ఇప్పుడు నాకు చాలా ఫ్రీగా వుంది. ఇంటి దగ్గర సాధింపుల వేధింపులు లేవు.

ఒకరోజు క్లబ్బులో మా స్నేహితుడు వాళ్ళ అబ్బాయి పుట్టినరోజని పిలవడానికి మా ఇంటికెళితే మా ఆవిడలేదని, ఇంటికి తాళం వేసి ఉందని, పుట్టినరోజు వేడుకకు తప్పక రమ్మని ఆహ్వానించాడు.

ఇంటికి వెళ్లిన తరువాత అవంతి తను ఎక్కడికి వెళ్ళిందో చెబుతుందని అనుకున్నాను. చెప్పలేదు పైగా అవంతిని గమనిస్తే ఆ కళ్ళల్లో ఓ మెరుపు. మేనిలో సంతోషపు విరుపు కనిపించాయి. మార్పు మా జీవితానికి చెరుపు చేయదుకదా అనుకున్నాను.

మరో రోజు కూడా అదే కంప్లయింట్ వచ్చింది మరో స్నేహితుని నుండి. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. వెంటనే క్లబ్బు నుండి ఇంటికి వచ్చేసాను. నిజంగానే ఇంటికి తాళంకప్ప వేలాడుతోంది. నాకు మతిపోయింది. ఇంతవరకూ అవంతి కప్పలాగా నేను పాములాగా బ్రతికాం ఆ ఇంట్లో. ఇప్పుడు నేనే ఆ కప్పగా మరి ఆ తలుపుకి వేలాడడంలేదు కదా అనే అనుమానం వచ్చింది.

తిరిగి పేకాటకు వెళ్లిపోయాను. బుర్ర పనిచేయడం లేదు. చాలా డబ్బులు పోగొట్టుకున్నాను. ఇంటికి వచ్చి అవంతిపై అరిచాను. తెల్లబోయింది. మీరు ఇంటికి రాత్రి పన్నెండులోపుగా రారుకదా అందుకే బయటకు వెళ్లాను అంది. 'ఎక్కడికి?' తీవ్రస్థాయిలో అడిగాను. మత్తుగా నవ్వి ఊరుకుంది గమ్మత్తుగా.

మరో రోజు కూడా అలాగే జరిగింది. నేను అడిగితే అది సస్పెన్స్ చెప్పను. కావాలంటే కనుక్కోండి అంది. నాకు ఒళ్లు మండిపోతున్నా కూల్‌గానే అవంతితో మాట్లాడాను. కాని ఆమెనుండి ఎక్కడకు వెళ్తుంది అన్న విషయం ఎన్ని రోజులకైనా బయట పెట్టలేకపోయాను. ఆమెను తిట్టగలను, కొట్టగలను. కానీ నిజం చెప్పించడం వట్టి మాట అని అర్థం అయింది.

ఒక్కోరోజు నేను ఇంటికి త్వరగా వచ్చినా అవంతికి బదులు మూసిన తలుపులు స్వాగతం ఇస్తున్నాయి. నాకు పిచ్చి పట్టేస్తుంది. అక్కడికీ ఈ విషయం బడటపడకుండా అవంతికి నేను పరిచయం చేసిన స్నేహితులందరి ఇళ్లకు వెళుతున్నాను. ఈమధ్య వాళ్ల మాటల్లోనయినా అవంతి వచ్చి వెళ్లింది అన్న మాట వస్తుందని. కానీ అక్కడా నిరాశే ఎదురయింది. నన్ను ఇంత టార్చర్ పెడుతున్న అవంతిని పీక పిసికి చంపాలన్నంత కోపం వచ్చింది. నా కోపం నాకే శత్రువవుతోంది తప్ప తాళం కప్ప మాత్రం లోపలకు వెళ్లడంలేదు రాత్రిళ్లు.

ఓరోజు అవంతిని కనిపెడదామని ఇంటికి త్వరగా వచ్చేసాను. అవంతి మంచి చీర కట్టుకుని తలనిండా పూలు పెట్టుకుని ఒళ్లంతా సెంటు స్ప్రే చేసుకుని పుత్తడి బొమ్మలా ఇంటికి తాళం వేస్తోంది. ఆమెను చూస్తే ఆ నిముషంలో కోపం రాలేదు. సరికదా అంత అందంగా ముస్తాబైనందుకు తమకం కలిగింది. తల తిప్పుకో లేకపోయాను.

మేను మామిడి పండు, నోరు దొండపండు, కనులు కలువరేకులు, చెక్కిళ్ళు గులాబీపువ్వులు... ఇలా పూలపండ్లను రంగరించి సింగారించినట్లుంది అవంతి.

నన్ను చూసి చిరునవ్వుతో 'అరే ఈరోజు త్వరగా వస్తారని తెలియక బయటకు వెళుతున్నాను' అంటూ తలుపులు తెరచి లోపలికి వచ్చేసింది నాతోపాటు. నాకు అమాంతం ఆమెను మంచం మీదకు లాగేయాలనిపించింది. ఈమధ్య మనస్పర్థలతో మా మధ్య శారీరక దూరం కూడా పెరిగింది. ఇప్పుడు మాత్రం కోరిక చాలా పెరిగింది.

గబగబా స్నానం ముగించుకుని బయటకు వచ్చేసరికి అవంతి ఆ చీర మార్చేసి పాత చీర కట్టుకుని తలకు దట్టంగా నూనె పెట్టుకుని ముడిపెట్టుకొని దిద్దులు, గొలుసు తీసేసి బోడెమ్మలా వుంది. తలలో పూలు తీసేసి రేప్రొద్దుటికని మంచులో తీగమీద వేసింది. మంచం మీద రాత్రిపూట ఉండాల్సిన పూలు రేపటికి బయట వ్రేలాడుతున్నాయి.

నాకు చెప్పలేని నీరసం వచ్చేసింది. బట్టల స్టాండు నిండా కట్టి విప్పిన మంచి చీరలు వున్నాయి. అవన్నీ రోజు కొకటి కట్టుకుంటున్నదన్నమాట. డస్ట్‌బిన్‌లో వాడిపోయిన పూలదండలు, డ్రెస్సింగ్ టేబుల్ మీద సెంటు, మేకప్ సామాగ్రి, అవన్నీ నన్ను జీవిత సమరంలో ఓడించడానికి నాపై దూకే కత్తులు, కటార్లలాగా అనిపించాయి.

రోజూ ఎక్కడకు వెళుతున్నావు అంటే మాత్రం చెప్పడం లేదు అవంతి. రాత్రి పదకొండు వరకూ ఆమె ఇంట్లో వుండడం లేదు. అది గ్యారంటీ. ఇది వరకులా నన్ను పల్లెత్తి మాట అనడంలేదు. గొప్ప హుషారుగా వుంటుంది. ఆమె రోజూ ఎక్కడకు

వెళుతుందో తెలుసుకోలేకపోయినా ఎక్కడికీ వెళ్లకుండా ఆపగలిగాను. నేను ఆఫీసు నుండి నేరుగా ఇంటికి వచ్చేస్తున్నాను పెళ్లయిన కొత్తలోలాగ.

పాపం భాస్కరం. భార్య బయట తాళం పెట్టి వెనుక నుండి వెళ్లి తన ఇంట్లోనే వుంటుందని తెలుసుకోలేకపోయాడు.

(భూమి, 08-09-94)

☆☆☆

# మహావృక్షం

మహావృక్షం పక్కన మనిషి ఎంతో చిన్నవాడు అన్నది చాల నిజం. కాని అతని మేధ మాత్రం ఎంతో పెద్దది. విమానాల్లో ఎగరడం, సబ్‌మెరైన్‌లో తిరగడం, టెస్ట్ ట్యూబ్ ద్వారా పుట్టిన పిల్లలు క్షేమంగా పెరగడం, ఇవన్నీ, కొండల పక్కన, వృక్షాల చెంతన అతిచిన్నగా కనిపించే మానవుడు కనుగొన్న విచిత్రాలే. వాటికి ఆయుష్షు ఎక్కువ. మనిషికి తక్కువ. మనిషికి ఆయుష్షు తక్కువైనా అతనిలోని కళలకు మాత్రం తరతరాలకు తరగని చరిత్ర ఉంటుంది. ఆ కళలు మహావృక్షంలాగే వందల సంవత్సరాలు చెక్కుచెదరకుండా ఉంటాయి మనిషి లేకున్నా.

విశ్వం కూర్చున్న మారుతి కారు విశాఖపట్నం నుండి బయలుదేరి, ఋషికొండవైపు దూసుకుపోతుంది. విశ్వానికున్నవి రెండేకళ్ళు. కాని నాలుగు కాళ్ళకారులో కూర్చొని రయ్‌మని వెళ్ళిపోతున్నాడు. అతనికున్నది రెండేకళ్ళు. కాని వెనుకకూడా రెండు కళ్ళు మనసులో అమర్చుకొని మొత్తం నాలుగు కళ్ళతో ప్రకృతినంతా ఆస్వాదించేస్తున్నాడు. అతను ఆ పరిసరాలు ఎరుగక కాదు, అంత పరవశం. అప్పుడే వీటిని వదిలివెళ్ళి ఏడాది అయిపోయిందే అన్న దిగులుతో కూడిన ఆవేశం. అంటే గురువుగారు చనిపోయి కూడా ఏడాది అయింది అన్న భావం మనసులోకి వచ్చి అతన్ని నిలవనీయడం లేదు.

తాచుపాము మెలికలు తిరిగినట్లు రోడ్డు వంకర్లుగా ఉంది. రోడ్డంతా ఎత్తుపల్లాలతో ఉంటే, ఎదురుగా కనిపిస్తున్న సముద్రం మాత్రం గతుకులు, ఎగుడుదిగుడులు లేక సాఫీగా కనిపిస్తుంది.

దారికి ఇరువైపులా, రేషన్ షాపు క్యూలో అస్తవ్యస్తంగా నిలబడి ఉన్న మనుషుల్లా తాడిచెట్లు ఉన్నాయి. వాటికి ఒక ఆర్డర్ లేదు. సముద్రపు ఒడ్డున వరుసగా నిలబడి మార్చ్‌ఫాస్ట్ చేస్తున్న సైనికుల్లా సర్వేచెట్లు గాలికి మెల్లగా ఊగుతున్నాయి.

సంవత్సరాల తరబడి ఆకులు నేలమీదరాలి అసలు ఇసుక కనబడక, ఇసుకపై అందంగా ఎండిన నాజూకైన ఈల ఆకుల నేలపై కార్పెట్ పరచినట్లు ఉన్నాయి. చెట్లు మాత్రం పచ్చని కేరెట్‌లను పైకి నిలబెట్టినట్లు కనబడుతున్నాయి.

తల్లీతండ్రి, చేపలు పట్టడానికి వెళ్ళి, సముద్రంలో కొట్టుకుపోతే, ఎవరూ లేక సముద్రం ఒడ్డున కూర్చుని, ఏడుస్తున్న పిల్లవాణ్ణి పలకరించారు గురువుగారు.

వాళ్ళు మాట్లాడుతుంటే అనుకోకుండా కెరటంవచ్చి, ఆయన చేతిలో నున్న ఆసరాగా తెచ్చుకున్న హేండ్‌స్టిక్ సముద్రంలోకి కొట్టుకుపోయింది.



దుఃఖాన్ని దిగమింగి అది తెచ్చే ప్రయత్నంలో పరుగెట్టబోయాడా కుర్రాడు.

కాని ఆయన వెళ్ళనివ్వలేదు. అప్పటినుండి ఆ కుర్రాడే విశ్వంగా మారి ఆయన చేతి కర్రగా చేరి సంగీత అశ్వపుకళ్ళాలను సరిగమలతో కట్టేశాడు.

నడుం నొప్పితో స్ట్రయిట్‌గా నిలబడలేకపోతున్న గురువుగారికి డాక్టర్లు చేతికర్రను ఆసరాగా పెట్టుకొని, మెల్లమెల్లగా పెద్ద కర్రను వాడుతూ ఆ విధంగా ఎక్సర్‌సైజు చేయమన్నారు. అప్పుడు నడుం బాగవుతుందన్నారు.

ఆయన చెంతన, చింతలేకుండా పెరుగుతున్న విశ్వమే ఆయనకు ఎక్సర్ సైజ్ స్టిక్ అయిపోయాడు.

విశ్వం మంచితిండి దొరకడంతో త్వరగా పెరుగుతున్న కొద్ది విశ్వం తలనో భుజాన్నో ఆసరాగా పట్టుకొనినడవడం వలన గురువుగారి నడుము స్ట్రయిట్‌గా అయిపోయింది. క్వయిట్‌గా ఆరోగ్యం కుదుటబడిపోయింది.

ఎవరీ అబ్బాయి అనాధ పిల్లాడా? అని ఎవరైనా అడిగితే గురువుగారికి కోపం వచ్చేది. విశ్వం నింగినుండి ఉల్కలా ఊడిపడలేదు. నేల మీదనుండి మొలకలా రాలేదు. అమ్మనాన్నల కడుపునే పుట్టాడు. మాతృమూర్తి కడుపుచించుకొని పుట్టిన ఏ ప్రాణి అనాధకాదు అనేవారు.

ఏ కులం అని అడిగితే ఆయనకు వెర్రికోపం వచ్చేది. మానవకులం అనేవారు ఉక్రోషాన్ని అణచుకుంటూ. రానురాను ప్రజలు విశ్వంవర్ణాన్ని చూడడం మానేసి సువర్ణాల్లాంటి వర్ణాలను మధురంగా పాడుతుంటే మైమరచిపోతున్నారు. భుక్తి గురించి కూడా ఆలోచించక శ్రద్ధగా గీతాలు ఆలపిస్తుంటే ఏదో శక్తి వారిని కదలనిచ్చేదికాదు.

గళం ఎత్తితే భూగోళం అంతా పరవశించిపోయినట్లుండేది. అపశ్రుతులు లేక కృతులు మొదలుపెడితే బండలు కూడా శృతి కలుపుతున్నాయి.

కీర్తనలు అందుకుంటే చాలు మార్తాండుడు కూడా ఎండను పక్కకునెట్టి మలయమారుతాన్ని పంపుతున్నాడు. విశ్వంవేసే సంగతులు కూడా సంగీత గతులనే చెవులకింపుగా మార్చివేస్తున్నాయి.

మా కులంవాడు అంటూ విశ్వం చుట్టాలు వస్తే గురువుగారు వారికి విశ్వాన్ని తన బిడ్డ అన్నట్లే చెప్పి పంపేసారు. ఆయన తన పేరు చివరున్న కులాన్ని చెప్పే గుర్తుని ఏనాడు బయటపెట్టలేదు. అందరికీ సంగీత పాఠాలు చెప్పడంతో ఆయనకు గురువుగారు అన్నదే సార్థకం అయిపోయింది.

గురువు అంటే అర్థం తెలియని అక్కడి నిరక్షరాస్యులకు ఆయనకు వేరే పేరుందని కూడా తెలియదు.

ఎవరైనా ఆయనకోసం వచ్చి, ఆయన పేరు చెప్పి ఎక్కడ ఉంటారు అనడిగితే అలాంటివాడు ఇక్కడలేరు. గురువుగారు మాత్రమే ఉన్నారు అని చెప్పేవారు. నేలలోనున్న మాణిక్యాన్ని నానబెట్టి, మట్టి కడిగి సానబట్టి మహా కాంతివంతంచేసినట్లు విశ్వాన్ని తీర్చిదిద్దారు. సప్తస్వరాలను నేర్పుతూ, ఆయనే సమస్తము అయి జీవితంలో ఎన్నో వరాలను ప్రసాదించారు. నిత్య సత్య ముత్యాల సరాలను ప్రభోదించారు.

గురువుగారు ఉండే కుటీరం వాకిట్లో ఒక మహావృక్షం ఉంది. అది కొన్ని వందల సంవత్సరాల క్రిందటిది. ఆ చెట్టు మొదలు చుట్టూ చాల మంది కూర్చోడానికి అనువుగా సిమెంటు చేయబడి ఉంది. గురువుగారు దానిమీద కూర్చొని కొన్ని వందల మందికి సంగీత పాఠాలు నేర్పారు. ఆ చెట్టే సంగీత పట్టాలు ఇచ్చే యూనివర్శిటీ వారికి. ఊరికి దూరంగా ఉన్నప్పటికీ సంగీతం మీద అభిరుచి, గురువుగారి మీద అభిమానం ఉన్నవాళ్ళందరూ వాళ్ళవాళ్ళ పిల్లల్ని విశాఖనుండి పంపుతారు. ఆయన దగ్గర సంగీతం నేర్చుకున్నారని చెబితే చాలు ఇంక ఎవరికీ తిరుగులేదు ఎక్కడైనా.

తన దగ్గరకు ఎండలో నుండి నీడకోసం స్వేద బిందువునుండి సేద తీర్చుకోవడంకోసం వచ్చిన వారినందరినీ ఆహ్వానిస్తుంది ఆ వృక్షం.

రోడ్డుకి పక్కగా ఉండడం వలన వచ్చే పోయేవారికి అది ఎంతో ఉపయోగంగా ఉంటుంది. ఆ వృక్షం కంటే గొప్పవాడైన గురువుగారు సంగీత పాఠాలకు గాని ఆకలి

పొట్లలతో గాని తన దగ్గరకు వచ్చిన వారిని పొమ్మనలేదు ఏనాడు, డబ్బుతో లంకె పెట్టలేదు. చెప్పలేను, చేయలేనని వంకపెట్టలేదు. అందరికీ ఆశ్రయాన్నిచ్చారు.

గురువుగారు ఇచ్చే ప్రతీకచేరికి వెళ్ళేవాడు విశ్వం. నీ అంతట నీవు పాడెయ్యడమే కాదు, ఎవరెవరు ఎలా పాడుతున్నారో గమనించాలి. మెళకువలు గ్రహించాలి అంటూ ఎంతో మంది పాటలను వినిపిస్తుంటారు విశ్వానికి.

విశ్వానిది గంధర్వగానం అండి బాబు, ఒక్కసారి చెబితే స్వరాల్ని పట్టేస్తాడు. అలాంటి గొంతు ఏ కోటి మందిలోనో ఒకరికి కూడా ఉండదు. గోల్డెన్ వాయిస్ అండి. చూస్తుండండీ మీతో సమానంగా అయిపోతాడు అని సంగీత విద్వాంసులు అంటే 'నాతో సమానంగా అయిపోవడమేమిటి' అని విసుక్కున్నారు గురువుగారు. విశ్వం మొహం ఆ మాటకు మాడిపోయింది. మనసు చివుక్కుమంది. 'నన్ను మించినవాడు కావాలి' అనగానే ఆ మాటలు చెవిలో అమృతం పోసినట్లు వెన్నెలస్నానం చేసినట్లు, చుక్కల్లో విహరించినట్లు అనిపించింది విశ్వానికి. గురువుగారిని అపార్థం చేసికున్నందుకు మనసులోనే చెంపలు వాయించుకున్నాడు.

'సంగీత సరస్వతి నడిపే గాన రథానికి సారధిని చేసారు గురువుగారు విశ్వాన్ని' అంటే ఒప్పుకోలేదు ఆయన. సంగీత వారధి విశ్వమేనయ్యా. అన్ని రాష్ట్రాలకు, అన్ని దేశాలకు మన దేశం నుండి గానమనే వారధి అతనే కావాలి అన్నారు విశ్వానికి వినబడకుండా. విశ్వం ఎదురుగా అతన్ని పొగడం ఆయనకు ఇష్టం ఉండదు. అదే ఆయనలోని బలహీనత.

ఎంతటి మహామనిషి లోనైనా అంతర్గతంగా కొన్ని బలహీనతలు ఉండవచ్చు.

'రవీంద్రభారతిలోని విశ్వం ప్రోగ్రాములు ఏర్పాటుచేయాలండి' అన్న ఒకాయన మాటలకు విశ్వానికి ఆశమొలకెత్తింది. ఎప్పటికైనా రవీంద్రభారతిలో ప్రోగ్రాము ఇవ్వాలనే పట్టుదల రానురాను పెరిగిపోసాగింది. అదే గురువుగారి దగ్గర అన్నాడు.

నీవు ఇంకా చాలా చేర్చుకోవాలి విశ్వం. రెక్కలు లేకుండా ఎగరాలని చూడకు. ఈ విద్య సముద్రంలా అనంతమైనది. నీవు ప్రాక్టీసు ఇంకా కష్టపడి చేయాలి అన్నారు.

ఆయన అలా అసంతృప్తి వ్యక్తంచేసే కొలది విశ్వంలో పట్టుదల ఎక్కువయ్యేది. ఇంకా బాగా పాడేవాడు. పాడడానికి ఇరవై నాలుగు గంటలు చాలవన్నట్లు పాడేవాడు.

అతనికి రాను రాను ఆకాశాన్ని ఒక పెదవిగాను, భూదేవిని మరో పెదవిగాను చేసేసికొని ప్రకృతిలోని రాగాలన్నింటిని గొంతులో నింపేసుకొని పాడేయాలన్నంత ఉద్వేగం కలిగేది. విశ్వానికి దేవుడు శరీరంలో నరాలకు బదులు వీణ తీగలు పెట్టాడేమోనండి. ఆ కంఠం చూడండి బంగారు వీణ మీటినట్లుంది. అని అందరూ మెచ్చుకుంటుంటే గురువుగారు మెచ్చుకునే వారుకాదు.

"అంతా వచ్చేసిందనుకోకు విశ్వం. దేశంలో నీకు నీవేసాటి అన్నట్లుండాలి. నీవు ఒకరికిగాని నీకు వేరొకరుగాని పోటీ ఉండకూడదు. సమానం కాకూడదు. వీరేశలింగంగారు, పొట్టిశ్రీరాములు, గాంధీ మహాత్ముడు, రామకృష్ణ పరమహంస లాంటివాళ్ళు ఒక్కొక్కరే. వాళ్ళను అనుసరించినవాళ్ళు ఎంతచేసినా ఏమిచేసినా వాళ్ళతో సమానం కాలేదు. విద్యలో, పట్టుదలతో ప్రజాసేవలో అలా ఉండాలయ్యా మరో గురువుగారిలా కావాలనుకోకు. నీవు నీవుగానే ఉండు" అన్నారు.

ఎప్పటికప్పుడు కొత్త రాగాలను కనిపెట్టే తపనలోనే ఉండేవారు గురువుగారు. భార్య చనిపోయి పిల్లలందరూ దూరదూరాల్లో సెటిల్ అయిపోతే ఆయనకు సరిగమ పదని సప్తస్వరాలే బంధువులు, ఆత్మీయులు అయ్యాయి. విశ్వానికి కూడా అంతే. విశ్వం మాత్రం ఆయనకు చేతికర్ర. చీకట్లో చిరుదివ్వె.

కుటీరంలోంచి చూస్తుంటే పొంగే సముద్రం, వంగే ఆకాశం మనోహరంగా కనిపిస్తుంటే ఆయన గొంతులో నెమళ్ళు నాట్యం చేస్తాయి. ఫేన్‌గాలి, ఫోన్ గోలలకు దూరంగా రమణీయంగా ఉన్న ఆ ప్రకృతి ఆయనకు, విశ్వానికి కూడా ప్రాణం. రోడ్డుకి అటుఇటు రక్షక భటుల్లా ఉన్న కొండలు కూడా గురువుగారు పాడుతుంటే చెట్లను కదుపుతూ ఆనందిస్తున్నట్లుంటాయి. సముద్రుడు ఆయన దగ్గర సంగీతం నేర్చుకోవాలి అనే ఆశతో రాబోయి రాలేక కోపంతో తానే సాగరగీతం ఆలపించి తప్పులు దిద్దమని ఆయనకు వినిపిస్తుంటాడు.

చెట్ల ఆకుల గలగలలనుండి సముద్రపు హోరు నుండి కూడా ఆయన రాగాలు వెతికి వీణపై పలికించేవారు. దూది వడికిన నూలు దారాలు తీసినట్లు ప్రకృతిలోని శబ్దాల వినికిడికి రాగాలు తీసేవారు గురువుగారు. ఆయనతో పాటు విశ్వం కూడా అన్నింటా ప్రావీణ్యం సంపాదించేసాడు నింపాదిగా. ఎంతో మంది సంగీత విద్వాంసులు విశ్వం చక్కగా పాడుతున్నట్లు ఒప్పుకున్నా మీరు ఊ అంటే కచేరి ఏర్పాటుచేస్తాం అని అన్నా గురువుగారు మిన్నకుండే వారు. ఆ మాటలకు విశ్వం మనసు మాత్రం ఎగిరిగంతేసేది. అహోరాత్రులు గురువుగారు 'ఊ' అంటే బావుణ్ణు అనేతపన ఎక్కువ కాసాగింది. కాని అది చిల్లు బిందెలో నీరులా కారిపోసాగింది.

విశ్వం మనసు గ్రహించి దారులు తెలిసిన వారికి దూరాలు చేరుకోవడం సులువే. కాని దారులు తెలిసినంత మాత్రాన కూర్చున్నచోటునుండి అక్కడకు చేరుకోలేం కదా! కష్టపడి వెళ్ళాల్సిందే. నీ సంగీత జ్ఞానాన్ని, నీ అమృతగానాన్ని అభినందిస్తాను. గాని నీవు సాధనచేయవలసింది చాలా ఉంది అన్నారు. ఆ మాటతో నిరాశ కలిగినా పట్టుదల తరగలేదు విశ్వంలో. తన కళ్ళెదురుగానే గురువుగారి దగ్గర సంగీతం నేర్చుకుని, వెళ్ళిపోయి కచేరీలు చేసి పేరు ప్రఖ్యాతులు గడించిన వారు ఎంతోమంది ఉన్నారు. అలాంటి అవకాశం నాకు ఎప్పుడు వస్తుందో, గురువుగారు ఎప్పుడు

అనుమతిఇస్తారో అనుకునేవాడు ఎప్పుడూ! ఆఖరికి నిద్రలో కూడా... కాని అది పునాదులు లేని కోరికల మేడ.

. ఆయనకు తలదువ్వుతూ తలలో పండిన తెల్లవెంట్రుకలను లాగేయబోతుంటే వద్దు విశ్వం చెట్ల ఆకులు చూడు రాలేముందు ఎండుతాయి. ఎండే ముందు పండుతాయి. నా తల అంతే సుమా!'' అన్నారు.

ఆ మాటలకు చెప్పలేని దుఃఖం కలిగింది విశ్వంలో. గురువుగారు ఉండరు అన్న ఊహ అతను భరించలేడు. ఒంటరిగా ఉన్న తనని తీసికొని వచ్చి, చాకిరీ చేయించుకొని వదిలేయకుండా, ఆయనతో సమానంగానే చూసారు. సమస్త విద్యలను నేర్పారు. సంగీతంతో పాటు చదువుచెప్పించారు. ప్రయివేటుగా పరీక్షలు కట్టించారు. ఆ కుటీరానికి దగ్గరలో రొయ్యల ఫారమ్ పెట్టుకొని ఆంగ్లో ఇండియన్స్ ఉంటే వారి దగ్గరకు పంపి ఇంగ్లీషు మాట్లాడడం నేర్పించారు. ఆయనకు సాధ్యమైనది అసాధ్యమైనది కూడా విశ్వానికి అందేటట్లు చేసారు. విశ్వం ఆయన కొడుకుకాడు అని ఎవ్వరైనా అనడానికి సాహసం చేయవలసి వచ్చేది. అలాంటి సమాయాల్లో ఆయన మానవుడుకాదు దేవుడు విశ్వానికి. ఇసుక అరచేతిలో నుంచి జారిపోకుండా ఉండాలంటే దాన్ని తడపాలి. గొంతుక మన అధీనంలోనే ఉండాలంటే చల్లనివి, పుల్లనివి తగ్గించి కొన్ని ఆహార నియమాలు పాటించాలి అని పాఠం చెబుతుంటారు విశ్వానికి.

విశ్వం మీద ఈగవాలితే తన మీద తేనెటీగ వాలినట్లు బాధపడతారాయన. మనుషులందరూ సమానమే అన్నది కొందరు నోటితో చెప్పారు. మరి కొందరు చేతి వ్రాతలో చెప్పారు. గురువుగారు మాత్రం చేతలతో చూపారు. గురువుగారు తనను చేరదీయకపోతే తన బంధువులందరిలాగే తాను, చేపల కంపు భరించలేక చుట్టతాగడానికి అలవాటు పడిపోయి, బట్టలు లేవని పేచీ పెట్టక గోచీతో సరిపెట్టుకొని, చేపలు పట్టుకోవడంతోనే లాలూచి పడిపోయి ఉండేవాడిని అనుకుంటాడు. అలా అనుకోగానే గురువుగారు దేవుని మించిన దేవుడు అనిపిస్తారు విశ్వానికి.

అనుకోకుండా తుఫాను రావడంతో మహావృక్షం కూలిపోయింది. నిద్రలో గురువుగారి గుండె ఆగిపోయింది. సంగీత విద్వాంసులు విశ్వాన్ని దిక్కులేని వాడిని చేయలేదు. హైదరాబాద్ తీసికెళ్ళి గురువుగారి మీద భక్తితో అన్ని విధాల ప్రోత్సహించి అన్నిచోట్ల కచేరీలు ఇప్పించడమేకాక విదేశాలకు వెళ్ళే అవకాశం కూడా కల్పించారు. 'అయ్యో నా కచేరి గురువుగారు చూడలేదే అన్న అసంతృప్తి విశ్వం నరనరాల్లోనూ ఉంది, ఇప్పుడు గురువుగారి కోరికమీద ప్రతీ సంవత్సరం ఆయన సంవత్సరీకాలు, ఆయన కుటీరంలోనే చేయదలచారు ఆయన కుమారులు. గురువుగారికి సంవత్సరీకాల మీద మోజుకాదు, ఆ వంకనైనా సంవత్సరానికొకసారి ఆ ప్రదేశం మరలా కళకళలాడుతుందని, సంగీతం పాడుతుందని.

కారులోనుండి వెనక్కి తిరిగి చూసాడు విశ్వం. ఎత్తు మీద నుండి దూరంగా ఉన్న ఇళ్ళు తెల్ల అట్టలతో చేసిన బొమ్మరిళ్ళలా కనబడుతున్నాయి. అదే రాత్రిళ్ళు అయితే ఇళ్ళు కనబడక వట్టి లైట్లు మాత్రమే నేలమీద జిలుగు ముగ్గువేయడానికి పెట్టిన వెలుగు చుక్కల్లా అనిపిస్తాయి. కుటీరం చేరింది కారు. ఇంకా చుట్టాలెవరూ రాలేదు. ఆ ప్రదేశం అంతా వెలవెలపోయింది.

గురువుగారు లేని స్థలంలో ఉండలేనని మనసు మొరాయించింది విశ్వానికి. లోపల అంతా శుభ్రం చేస్తుంటే చెత్త, కాగితాలు సరిగమలు పాడుతున్నాయి. బయట ఎండిన ఆకులు తాళం వేస్తున్నాయి. నవ్వే చెట్లు సన్నని ఆకులను వీణ తీగలవలె కదిల్చి, శృతి సరిచేసికుంటున్నాయి. పక్షులు వాటి వాటి కిలకిలరాగాలతో ఇన్‌స్ట్రుమెంట్ మ్యూజిక్‌ని అందిస్తున్నాయి.

అక్కడ దొరికిన కొన్ని ఉత్తరాలపై విశ్వం దృష్టి పడింది. అవి విశ్వానికి రవీంద్రభారతిలో గురువుగారు అనుమతిస్తే ప్రోగ్రాముల ఏర్పాటు చేయిస్తానని విదేశాలకు కూడా పంపుతానని ఒకాయిన ప్రాధేయపూర్వకంగా వ్రాసిన ఉత్తరాలు.

గురువుగారు ఈ విషయం విశ్వానికి చెప్పనేలేదు. ఉత్తరాలు మధ్యకు చింపేసి ఉన్నాయి.

గురువుగారు విశ్వాన్ని కులమతాలు, పేదరికం పట్టించుకోకుండా చేరదీసి విద్యాదానం చేసినప్పుడు ఆయనొక గొప్ప ఋషి.

ఆ ఉత్తరాలను చింపేసినప్పుడు అతి మామూలు మనిషి. విశ్వానికి ఆయనలో ఋషే కనబడుతున్నాడు గాని మనిషి కాదు "మహావృక్షం నీడ నిస్తుందిగాని తన చేరువలో చెట్లను పెరగనీయదు" అన్నది విశ్వానికి తెలియదు.

(ఆంధ్రభూమి వీక్లీ, 17-05-90)

☆ ☆ ☆

# జీవితపయనం

విమానం రన్‌వేమీద నుంచి బయలుదేరడానికి సిద్ధంగా ఉంది. తాత్కాలికంగా ఆగిన సురేఖ ఆలోచనలు విమానం శబ్దంతో బాటు చెవులలో రొద చేయడం ప్రారంభించాయి. కిటికీ దగ్గర సీటు దొరికింది. కిటికీలోంచి ఎయిర్‌పోర్ట్‌కి సెండాఫ్ ఇవ్వడానికి వచ్చిన బంధువు లెవరూ ఇదివరకులా కనబడడంలేదు. ఎందుకంటే హైదరాబాద్ ఎయిర్‌పోర్ట్‌లో ఎవరినీ లోపలికి వెళ్ళనీయడంలేదు. అన్నయ్య ఒక్కసారి కనబడితే బావుండును అన్న కోరికను అతికష్టం మీద ఆపుకుంది సురేఖ.

ఎయిర్ హూస్టెస్ ఏమేమో చెబుతూంది. అందులో ఒక్కటి కూడా సురేఖ చెవికి ఎక్కడంలేదు. ఎయిర్‌హూస్టెస్ తన పని కాగానే సురేఖ వైపు చూసి చిరునవ్వులు విసిరింది. అది వారి డ్యూటీలో భాగం. తన మనసులో బాధ సుడులు తిరుగుతున్నా, ఆమెకు జవాబుగా సురేఖ కూడా నవ్వింది.

సురేఖ పక్కనున్న ఒక పాప వాళ్ళ అమ్మను అడుగుతోంది. "మమ్మీ. మనం డాడీని ఈరోజే! చూడగలమా." అని. ఆ అమ్మాయి ప్రశ్నలో ఎంతో ఆత్రుత. డాడీ అంటే అంత ఇష్టం కాబోలు! ఆవిడ తను కలుసుకోబోయే భర్తను తలుచుకొని సిగ్గపడింది. తనలో తానే నవ్వుకుంది. ఆవిడ కళ్ళలో ఎంతో వెలుగు!

'నేను ఎవరికి అన్యాయం చేశాను. నా జీవితం ఎందుకిలా అయింది?' అని సురేఖ తనలో తనే మథనపడుతూంది. వెళ్ళేది ఆకాశమార్గంలో, కాని మనసులోని బాధ సాగరమథనంలా ఉంది. సురేఖకు ఆలోచనలు చుట్టముట్టాయి.

అసలు తను ఎందుకు వెళుతూంది ఇంగ్లండు? ఒక ఉద్యోగినిగా వెళ్ళడంలేదు. ఒక భర్తకు భార్యగా అంతకన్నా కాదు. తెలిసిన వారింటికి అతిథిగానూ వెళ్ళడంలేదు. ఎందుకు, ఎవరికోసం, ఏమి సాధిద్దామని? అవును. సాధించాలి, ఏదో సాధించితీరాలి! ఆడది అంటే ఆటబొమ్మ కాదని అందరికీ చాటిచెప్పాలి. అందరికీ చెప్పలేకపోయినా తనకు తానైనా నిరూపించుకోవాలి.

'భగవాన్! నా ఇరవై ఏళ్ళ జీవితంలో నిన్ను ఆరాధించడమే తప్ప ఏదీ అడగలేదు. ఇప్పుడు నా జీవితాన్ని సవాలుగా చేసి, అంజలి ఘటించి నిన్ను అర్థిస్తున్నాను. నా రెండు చేతులనే శతకోటి చేతులుగా భావించుకొని నన్ను ఆదుకో స్వామీ! మనుషుల ప్రేమ శాశ్వతమైనది కాదు. అది ఏ రోజు ఎలా ఉంటుందో ఎవరికీ తెలియదు. కానీ, నీ ప్రేమ శాశ్వతమైనది. ఇకమీద నేను ఇండియా తిరిగి వచ్చేవరకూ నాకు తోడుగా ఉండు స్వామీ! తిరిగి వచ్చేటప్పుడు నేను చనిపోయినా ఫరవాలేదు. వెళ్ళేటప్పుడు మాత్రం ఈ విమానానికి ఏ ప్రమాదమూ జరగకుండా నన్ను క్షేమంగా చేర్చు తండ్రీ.

నేను అనుకున్నది సాధించిన తరువాత ఏమైపోయినా ఫరవాలేదు. తృప్తిగా జీవితాన్ని చాలిస్తాను!'

విమానం ఎప్పుడు బయలుదేరిందో కూడా ఆలోచనల్లో ఉన్న సురేఖ గమనించలేదు. పక్షిలా ఆకాశమార్గాన దూసుకుపోతూంది విమానం, అలవాటైన దారిగుండా.

కిటికీలో నుంచి చూస్తుంటే మేఘాలు కనబడుతున్నాయి. ఆ మేఘాలు విమానానికి ఆహ్వానం పలుకుతూ పరిచిన మెత్తని తివాసీల్లా ఉన్నాయి.

"గగన సీమల తేలు ఓ మేఘమాలా" ఘంటసాల గొంతు చెవుల్లో గింగురుమన్నది. తన కెంతో ఇష్టమైన ఆ పాట గుర్తుకి రాగానే అప్రయత్నంగా మనసుకి ఉల్లాసం కలిగింది. ఇప్పుడు తను ఆ గగన సీమలలోనే ఉంది. కాని తన బ్రతుకే అధఃపాతాళంలో ఉంది. తను ఎందుకింత మోసపోయింది? తన ఆస్తే తన పాలిట శాపమైంది. ఎంతమంది ఆస్తిపరులు లేరు? అందరి బ్రతుకులూ తనలాగే చదరంగంలోని పావుల లాగా అయ్యాయా? దేవుడు తన నొక బంతిని చేసి ఆడించాడు. ఆ ఆటకు అంతం కనుక్కోవడానికి ఆ బంతే ఇప్పుడు బయలుదేరింది. తన బ్రతుకేమిటో తెలుసుకునేందుకు!

ఎయిర్‌హూస్టెస్ ఏవేవో తెచ్చి పెడుతోంది. అన్యమనస్కంగానే అవి తీసుకుంది సురేఖ. తినాలని లేకపోయినా తినక తప్పదు అన్నిటినీ నోరు తిరస్కరించినా, ప్రేవులు ఆహ్వానిస్తున్నాయి. తను రంగు, రుచి, వాసనను పసిగట్టడం ఆరు నెలల క్రితమే మానేసింది. యాంత్రికంగా అన్ని పనులూ జరుగుతున్నాయి.

తను వెళుతున్నందుకు తల్లీ, తండ్రీ ఎంత ఆనందించారో! తమ కూతురు విదేశాలు చూడబోతూందన్న వారి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. పట్టపగలే కలల్లో తేలిపోతున్నారు. పాపం, అమాయకులు! వారికి నిజం చెప్పి బాధించదలుచుకోలేదు. అసలే పెద్దవారు. అనారోగ్యవంతులు. తను ఎందుకు వెళుతూందో తెలిస్తే, వారి గుండె పగులుతుంది. తన గుండె ఏనాడో పగిలి ఎవరికీ కనబడకుండా రక్తం కారుస్తూనే ఉంది. తనను కన్నందుకు వాళ్ళను కూడా బాధపెట్టడం ఎందుకు. నిజాన్ని దాచి బయలుదేరింది.

అన్నయ్యకు అంతా తెలుసు. తన ప్రయాణాన్ని ఎంకరేజ్ చేసింది తనే. స్త్రీకి ధైర్యం కావాలన్నాడు. వాళ్ళ సమస్యలను వాళ్ళే పరిష్కరించుకోవాలన్నాడు. తన వెనుక వెన్నంటి ఉంటానన్నాడు. తనను వెన్నుపోటు పొడిచిన వాళ్ళని మాత్రం వదలవద్దన్నాడు. ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురుచూడక, ఎవరో నీవే కమ్మన్నాడు. అన్నయ్య ధైర్యం చెప్పకుంటే తను ఇంత త్వరగా బయలుదేరేదా? బయలుదేరినా భయం





భయంగా ఉండేది. ఇప్పుడు ఆ భయం స్థానంలో, అన్నయ్య ఇచ్చిన ధైర్యం ఉంది. బొంబాయిలో మరో విమానం ఎక్కింది. తెలిసిన వారి సహాయంతో.

విమానం ఎవరి ఆలోచనలతోనూ, ఎవరి బ్రతుకులతోనూ సంబంధం లేకుండా తన దారిన తాను పయనిస్తూనే ఉంది. కొండలు, గుట్టలు, సముద్రాలు దాటుకుంటూ, మనిషి కష్టసుఖాలనుభవిస్తూ బతుకుతున్న విధంగా పయనిస్తూనే ఉంది. భూమిని చూసి గర్వంగా నవ్వుతూంది. అప్పుడప్పుడు కొండల్ని చూసి కన్నుగీటుతుంది. సముద్రం మీదుగా పోతున్నప్పుడు సముద్రుణ్ణి చూసి సరాగాలాడుతుంది. దేనికీ అందకుండా ఊరించుకుంటూ, ఊళ్ళు దాటుకుంటూ ఉత్సాహంగా దూసుకుపోతూనే ఉంది. సురేఖ మాత్రం తనతో పాటు భావాల్నీ, బాధల్నీ కూడా దేశాలు దాటించి తీసుకెళుతూంది. అది నాన్‌స్టాప్ ఫ్లయిట్ కాబట్టి బొంబాయిలో బయలుదేరిన దగ్గర నుంచి ఎక్కడా ఆగలేదు. ఏడు గంటల్లో అది లండన్ విమానాశ్రయం చేరింది.

అందరూ మెల్ల మెల్లగా దిగుతున్నారు. విమానం లాండ్ కాగానే సురేఖలో కొత్త ఉత్సాహం వచ్చింది. అది స్వంత దేశంలో అడుగుపెట్టిన విమానం తనని వేరే దేశంలో దించినందుకు కాబోలు! ఎయిర్‌హూస్టెస్ గుమ్మంలో నిలబడి చిరునవ్వుతో అందరికీ నమస్కారం చెప్పి సాగనంపుతూంది. అందమైన ఎయిర్‌పోర్ట్‌ని పెద్ద పెద్ద కళ్ళతో ఆశ్చర్యంగా చూడసాగింది రేఖ. ఆ కళ్ళలో అదివరకటి దిగులు కొంచెం మాయమయింది. ఎయిర్‌పోర్టే ఇంత అందంగా ఉంటే, ఈ నగరం ఎంత అందంగా ఉంటుంది. ఈ దేశం ఇంకెంత అందంగా ఉంటుంది - అనుకోకుండా ఉండలేకపోయింది. పసిపిల్లను ఇంట్లో నుంచి బయటకు తీసుకొస్తే బయటి దృశ్యాలను ఎంత ఉత్సాహంగా, వింతగా చూస్తుందో అలా చూసింది రేఖ. ఎయిర్‌పోర్ట్‌లో ఫార్మాలిటీస్

అన్నీ పూర్తి చేసుకొని బయటపడింది. బయటకు రాగానే ఒళ్ళంతా కళ్ళు చేసుకొని స్నేహితురాలికోసం చూసింది. ఉమను చూడగానే సురేఖ కళ్ళలో కాంతిరేఖ మెరిసింది. ఆనందం, ఆవేశం పోటీపడి ఒక్క ఉదుటున ఉమను వాటేసుకుంది.

ఉమ అంతవరకూ సురేఖ ఎలా వస్తుందో అన్న టెన్షన్‌తో ఉంది. ఇప్పుడామెను చూడగానే కొండంత బరువు దిగినట్లనిపించింది. కళ్ళలోనే క్షేమ సమాచారాలు చెప్పుకున్నారు. ఇద్దరిలోనూ నోటితో చెప్పుకోలేని ఎన్నో భావాలు ఎగసిపడ్డాయి.

"ఇంటి దగ్గర అమ్మ, అన్నయ్యా అంతా బావున్నారా?" అంటూ మాట్లాడింది ఉమ. బాగానే ఉన్నారంటూ తల ఊపింది రేఖ. అమ్మ, అన్నయ్యలను గుర్తుచేయగానే తన జీవితం మళ్ళీ గుర్తుకు వచ్చి కళ్ళలో నీలినీడలు కదలాడాయి. వెంటనే మనసు గట్టిపరచుకుంది.

ఉమ భర్త భాస్కర్ పార్కింగ్ ప్లేస్ నుంచి టాయాటాని తీసుకువచ్చాడు. కారులో కూర్చుని అటూ ఇటూ ఉన్న దృశ్యాలను కంగారుగా చూస్తూ "అబ్బ ఎంత అందమైన నగరమో!" అని పైకి అనకుండా ఉండలేకపోయింది సురేఖ. ఉమ చిన్నగా నవ్వింది. ఆగస్టు నెల కావడంతో చలి ఎక్కువగా లేదు. అక్కడ వారికి అది ఉక్కకింద లెక్క అయినా, సురేఖ చలిగానే ఫీల్ అయింది. ఉమ సురేఖకోసం తెచ్చిన ఓవర్‌కోటు, గ్లవ్స్ ఇచ్చింది. బరువుగా, పెద్దగా ఉన్న ఆ కోటు వేసుకోగానే రేఖకు చలి తగ్గింది.

ఇంటికి వెళ్ళిన తరువాత ఉమ చల్లని కబుర్లతో, చక్కని భోజనంతో తాత్కాలికంగా బాధ మరచిపోయింది రేఖ. భాస్కర్ ఉమకు అన్ని విధాలా తగిన భర్త అని ఒక రోజులోనే గ్రహించింది. సురేఖతో చాలా ఆప్యాయంగా, స్వంత అన్నలా మాట్లాడాడు భాస్కర్. భాస్కర్‌కు ఫ్రెండ్స్ సర్కిల్ ఎక్కువ. ఎప్పుడూ వాళ్లింటికి ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు. అతను స్నేహమేరా జీవితం అన్నట్లు వాళ్ళతో ఒళ్ళు మరిచి కబుర్లు చెబుతాడు. ఉమ వాళ్ళకు చాలా ఓపిగ్గా కాఫీలు, టిఫిన్లు అందిస్తుంది. కాని సురేఖను, అక్కడికి వచ్చిన ఎవరికీ పరిచయం చేయలేదు ఉమ. అసలెవరికంటా పడనీయలేదామెను.

రెండు రోజుల వరకూ సురేఖకు, ఉమకు ఎన్ని కబుర్లు చెప్పుకున్నా తరగలేదు. బావిలోని నీళ్ళలా ఊరుతూనే ఉండేవి విశేషాలు.

రేఖ ఉమ సహచర్యంలో ఎంత తనను తాను మరచిపోయినా ఉన్నట్టుండి తను వచ్చిన పని గురించి అడిగేది ఉమను.

"ఏమిటే అంత తొందర? నీ పని త్వరగా అయిపోతే ఇప్పుడే అమ్మా, నాన్న అంటూ మూటాముల్లే సర్దేస్తావు. ఒక నెల పోనీయ్. తరువాత ఆలోచించవచ్చు" అని తేలిగ్గా తీసిపారేసింది.

"అది కాదు ఉమా! అనుకున్న పని త్వరగా అయిపోతే అప్పుడు హాయిగా ఎన్ని నెలలైనా ఉంటాను. ఇప్పుడు మనసులోని ఈ బరువుతో ఎంజాయ్ చేయలేక పోతున్నాను" అంది రేఖ.

ఉమ సురేఖను రోజుకో స్థలానికి, రోజుకో ఇంగ్లీష్ ఫ్రెండ్ ఇంటికి తీసుకెళ్ళేది. అక్కడి స్త్రీల పరిస్థితులు, వారి వివాహ విషయాలు చెబుతుంటే సురేఖ కళ్ళు పెద్దవి చేసుకొని ఆశ్చర్యంగా వినేది. 'యువర్ చిల్డ్రన్ అండ్ మై చిల్డ్రన్ ఆర్ క్వారలింగ్ విత్ అవర్ చిల్డ్రన్" అన్న సామెతను వినడమే కాకుండా ఒక కుటుంబంలో స్వయంగా చూసింది.

ఇక్కడి జంటలు ఎంత ఆనందంగా ఉన్నాయి అనుకున్న అభిప్రాయాన్ని పదిహేను రోజుల్లోనే మార్చేసుకుంది రేఖ. పెళ్ళి కాని తల్లుల కథలు, భర్తలను మార్చే స్త్రీ కథలు వింటుంటే అయ్యో పాపం" అనిపించేది.

సురేఖ వచ్చి నెల రోజు లయింది. ఒక రోజు ఉమ అంది, "ఈ ఆదివారం భాస్కర్ తన ఫ్రెండ్స్ అందరినీ పార్టీకి పిలుస్తాడట ఆ రోజు మా పెళ్ళి రోజు అని." ఉమ పిల్లలు ఇండియాలో అమ్మమ్మ దగ్గర ఉన్నారు. కొంచెం పెద్దవాళ్ళు అయిన తరువాత, వాళ్ళ పనులు వాళ్ళు చేసుకునే స్టేజిలో తీసుకొని రావాలని ఉమ కోరిక. ఇద్దరూ ఉద్యోగస్థులు. పిల్లలతో ఇబ్బంది పడాలని ఇండియాలోనే ఉంచేశారు.

ఆ ఆదివారం రానే వచ్చింది. ఆ రోజు అందరికీ సురేఖను ఇంట్రొడ్యూస్ చేస్తారని చాలా ధైర్యంగా ఉండాలని, పార్టీలో ఒక పాట పాడాలని సురేఖకు ముందుగానే వార్నింగ్ ఇచ్చింది ఉమ. స్పెషల్‌గా సురేఖను బ్యూటీ క్లినిక్‌కి తీసుకెళ్ళి అందంగా మేకప్ చేయించింది. అసలే అందమైన సురేఖ ఆ మేకప్‌లో మరింత అందంగా మెరిసి పోసాగింది. ఖరీదైన కంచిపట్టు చీర, దానికి సరిపోయే జాకెట్, వాటికి మేచ్ అయ్యే నగలతో ఇంగ్లాండ్‌లో వెలసిన ఇండియన్ క్వీన్‌లా ఉంది సురేఖ. ఆడవాళ్ళకే మోహం కలిగించేంత రమణీయంగా తయారైన సురేఖను చూసి ఉమ మురిసిపోయింది.

సాయంకాలం ఆరు నుంచి అతిథులు రావడం ప్రారంభించారు. అందరికీ సురేఖను ఇంట్రొడ్యూస్ చేసింది ఉమ. ఒక్కొక్క జంటను చూస్తుంటే చాలా ఆశ్చర్యం వేసింది సురేఖకు. అందరూ భారతీయులే! కాని ఏ జంటా ఒక్క రాష్ట్రానికి చెందిన వాళ్ళు కాదు. ఇండియాలో అన్ని రాష్ట్రాల వాళ్ళు తమను తాము వేరు వేరుగా భావించుకున్నా, ఇక్కడ అందరూ భారతీయులే కదా అనిపించింది. భార్యా భర్తల్లో ఒకరు ఆంధ్ర అయితే, మరొకరు కర్ణాటక. ఒకరు పంజాబి అయితే, మరొకరు గుజరాతీ - ఇలా ఉన్నారు. ఒక్కొక్కరూ వస్తున్నారు. కొందరు కూర్చునీ, మరి కొందరు నిలబడీ మాట్లాడుకుంటున్నారు. చాలా మంది ఇండియన్స్ ఒకే దగ్గర కలవడం వల్ల అందరిలోనూ ఆనందం వెల్లి విరుస్తోంది. ఇల్లంతా పెళ్ళి జరుగుతున్నంత కోలాహలంగా ఉంది.

ఇంగ్లాండులోని ఇండియన్స్ స్ట్రీట్‌లా ఉంది. అందరూ భారతీయు లైనప్పటికీ వాళ్ళు మాట్లాడుకొనేది మాత్రం ఇంగ్లీషు. కారణం అందరూ వేర్వేరు రాష్ట్రాలకు చెందిన వాళ్ళు కావడం!

అందరికీ సాఫ్ట్ డ్రింక్స్, హాట్ డ్రింక్స్, ఎవరికి కావలసినవి వాళ్ళకు అందజేస్తున్న సురేఖ ఉమ పిలుపుతో ఒకసారి వెనక్కు తిరిగింది. అప్పుడే గుమ్మంలోనికి అడుగు పెడుతున్న ఒక జంట ఇంగ్లీష్ వాళ్ళ స్టయిల్‌లో ఒకరి నడుం మీద ఒకరు చేతులు వేసుకుని వస్తున్న వాళ్ళను చూడగానే అప్రయత్నంగా ముఖంలోకి రక్తం పొంగుకు వచ్చింది ఆమెకు. బలవంతంగా తనని తాను కంట్రోల్ చేసుకుంది.

"మిస్టర్ రావ్, మిసెస్ రావ్, వారి పాప దీప్తి" అని పరిచయం చేయగానే మనసులో మంటలు రేగుతున్నా మర్యాదగానే నమస్కారం చేసింది. రావ్ మాత్రం సురేఖను చూడగానే మిన్ను విరిగి మీద పడినట్లుగా అయిపోయాడు. తనను కరవడానికి పడగెత్తిన పాముని చూసినట్లు చూశాడు సురేఖను. అతని మొహంలో నెత్తురు చుక్కలేదు. సురేఖను చూడక ముందు ఉన్న ఉత్సాహం గాలి తీసిన బెలూన్‌లా చప్పబడిపోయింది. లేని ధైర్యాన్ని కూడతీసుకొని "మీరు... మీరు..." అంటూ అంతలోనే 'మీరు' అనకూడదని గుర్తుకి వచ్చి "నువ్వు... నువ్వు..." అని నీళ్ళు నములుతుంటే సురేఖే వాక్యం పూర్తిచేసింది.

"నేను సురేఖనే! మాది అమలాపురం. మా అమ్మగారు భారతీదేవిగారు. నాన్నగారు పరంధామయ్యగారు. అన్నయ్య పేరు జయకృష్ణ. మీకు గుర్తుండే ఉంటుందనుకుంటాను" అంది పెదవుల మీదికి చిరునవ్వును బలవంతంగా తెచ్చుకుని. మనసు మాత్రం నిప్పులు తొక్కిన కోతిలా గంతులు వేస్తూనే ఉంది.

"ఎప్పుడు వచ్చావు ఇక్కడికి?" అని ఆరాటంగా ప్రశ్నించగానే "వచ్చి నెలయింది. ఒక పని మీద వచ్చాను. బహుశా అది ఈ రోజుతో పూర్తవుతుంది. త్వరలోనే వెళ్ళిపోతాను." అంది.

"ఐ సీ." అంటూ వెళ్ళి నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు ఆనందరావు.

రావు భార్య కమల మాత్రం హుషారుగా తన భర్తకు తెలిసిన అమ్మాయి కాబట్టి సురేఖతో కబుర్లలోకి దిగింది. ఆ మాటల్లోనే తెలిసింది సురేఖకు. రావ్ మెడిసిన్ కాగానే రైల్వేలో టెంపరరీగా ఉద్యోగం వస్తే బెంగుళూరులో ఉండేవాడట. అక్కడ వాళ్ళిద్దరూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారట. ఇద్దరూ పేదవాళ్ళేనట. ఆనందరావుకి ఎఫ్.ఆర్.సి.ఎస్. చేయాలని కోరికగా ఉంటే అతనికి తెలిసిన బంధువులు డబ్బు సహాయం చేశారని చెప్పింది. వాళ్ళు ఇంగ్లండు వచ్చి రెండు సంవత్సరాలైందట. పాప అక్కడే పుట్టిందట. తనంటే తన భర్తకు ఎంత అపురూపమో వగైరా విశేషాలు చెప్పింది. ఆమె చెబుతున్న మాటలకు ఆవేశం పొంగుకు వస్తున్నా అణచుకొని ఆసక్తిగానే విన్నది సురేఖ.

డిన్నర్ చక్కగా ముగిసింది. రావ్ మాత్రం మూడీగా ఉండి అసలు ఏమీ తినలేదు. ఫ్రెండ్స్ జోక్ చేశారు. "ఏమయ్యా నీ భార్య పక్కనే ఉందిగా ఇంకా బెంగ ఎందుకు? కడుపు నిండా తిను" అని, ఆ మాటలకు అప్రయత్నంగా సురేఖవైపు చూశాడు ఆనందరావు. సురేఖ కళ్ళల్లో నిప్పులు చెరుగుతుంటే, రావు కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. ఇదేమీ తెలియని కమల మాత్రం పకపకా నవ్వుతూంది. ఆ నవ్వు తనమీద రాళ్ళు రువ్వుతున్నట్లుగా అనిపించింది రావుకు.

పార్టీ ముగిసింది. అందరూ సోఫాల్లో కూర్చుని ప్రిపరేషన్స్ చాలా బాగున్నాయని పొగుడుతూ ఐస్‌క్రీం తింటున్నారు. సురేఖ పాటలు బాగా పాడుతుందని తెలియగానే అందరూ ఆమెను చుట్టుముట్టారు. ఒక పాట పాడింది సురేఖ. అందరూ ఆమె గాన మాధుర్యానికి పరవశించిపోయారు 'ఎంత మంచి కంఠం' అనుకోకుండా ఉండ లేకపోయారు. అక్కడున్న పెళ్ళి కాని యువకులు అప్పుడే సురేఖ గురించి ఎంక్వయిరీ చేస్తున్నారు ఉమని. ఈమెను పెళ్ళి చేసుకోబోయేవాడు ఎంత అదృష్టవంతుడో కదా అనుకుంటున్నారు మనసులో. ఇప్పుడు అందరి దృష్టి సురేఖ మీదే ఉంది. ఇంకో పాట పాడమని రిక్వెస్ట్ చేశారు పాడింది. ఆ తరువాత కూర్చున్నదల్లా ఒక్కసారి లేచి నిలబడింది సురేఖ. ఉమవైపు ఒకసారి చూసింది. ఉమ కళ్ళతోనే ధైర్యం చెప్పింది. వణికే కాళ్ళను అదుపులోకి తెచ్చుకుంది. అది ఆమె జీవిత సమస్య! భగవంతుణ్ని ఒకసారి ధ్యానించుకొని చక్కని ఇంగ్లీషులో మొదలు పెట్టింది. పల్లెటూరి మొద్దు అని భావించిన సురేఖ అంత చక్కని ఇంగ్లీషు మాట్లాడుతుంటే రావ్ మాత్రం దిమ్మెరపోయి వింటున్నాడు. ఆమె ఇంగ్లండు వచ్చే ఉద్దేశంతో ఆంగ్లోఇండియన్ దగ్గర ఇంగ్లీషు నేర్చుకుందని పాపం అతనికి తెలియదు.

"డియర్, ఫ్రెండ్స్! అందరికీ నమస్కారాలు. ఇంత సేపూ నా పాటలు విని మెచ్చుకున్నారు. ఇప్పుడు నేను చెప్పబోయేది కూడా కొంచెం ఓపికగా వింటారని భావిస్తున్నాను" అనగానే అందరూ ఏమి చెబుతుందా అని ఆత్రంగా వింటున్నారు అంతటా నిశ్శబ్దం ఆవరించింది.

"నా పేరు సురేఖ అని ఉమ ఇదివరకే పరిచయం చేసింది. కాని నేను ఇంగ్లండు ఎందుకు వచ్చిందీ చెప్పలేదు. అదే ఇప్పుడు నేను చెప్పబోతున్నాను. మాది అమలాపురం. నేను ఇంటర్ వరకూ చదువుకున్నాను. లక్షాధికారుల ఇంట్లో పుట్టాను. కొందరు డబ్బు లేక బాధ పడతారు. డబ్బుండీ నేను బాధ పడ్డాను. ఒక్కత్తే కూతుర్ని. నేను పుట్టి బుద్దెరిగిన తరువాత, 'ఇది కావాలి' అని నోరు తెరిచి అడగలేదు. నాకు కావలసిన వన్నీ వాళ్ళే సమకూర్చేవారు. ఇంటర్‌లో చదువు మానేయమన్నారు. నాకూ పెద్దగా చదవాలని లేక మానేశాను. నాకు కావలసిన అన్ని వస్తువులతో పాటు వరుణ్ణి తేవాలని నాన్నగారు కంగారు పడ్డారు. 'అబ్బాయి డాక్టర్ కావాలి. గుణవంతుడు కావాలి.

పేదవాడైనా ఫరవాలేదు' అన్నారు అమ్మాయిని అపురూపంగా చూసుకుంటే చాలన్నారు. విమానాలు ఎక్కిస్తానన్నారు. విదేశాలకు పంపుతానన్నారు. అలాగే నాన్నగారి కోరికలకు సరిపడ్డ వరుడు దొరికాడు. నాకు మూడు ముళ్ళూ వేశాడు. లక్షల కొద్దీ కట్నం తీసుకున్నాడు. లక్షణంగా నన్ను తన భార్యను చేసుకున్నాడు. పెళ్ళికి ముందే తను ఇంగ్లండులో ఎఫ్.ఆర్.సి.ఎస్. చేసిన తరువాత నన్ను అక్కడికి తీసుకొని వెళతానని షరతు పెట్టాడు. నాన్నగారు సరేనన్నారు. కారణం నన్ను వెంటనే కాపురానికి పంపడం ఇష్టం లేక, నన్ను వదిలి ఉండలేక. మరి నా అదృష్టమో, నా భర్త దురదృష్టమో నాకు జ్వరం రావడంతో నా ప్రయాణం వాయిదా పడింది. నేను జ్వరంతో ఉండగానే నా భర్త విదేశాలకు వెళ్ళిపోవడం జరిగింది. నా పెళ్ళి అయిందని తెలిసి ఉమ చాలా సంతోషించింది. ఆమెకు నా పెళ్ళి ఫోటోలు పంపాను. వీలైతే అతన్ని తప్పక కలుస్తాననీ వాళ్ళు అప్పటికి స్కాట్లాండులో అతనికి దూరంగా ఉన్నారు కాబట్టి కుదరలేదనీ రాసింది. నా భర్త నాకు చాలా ఆత్మీయంగా ఉత్తరాలు రాసేవాడు. అవి చూసి మురిసిపోయేదాన్ని. కలల్లో తేలిపోయేదాన్ని. అమ్మానాన్నల సెలక్షన్ గొప్పదని గర్వించేదాన్ని. ఎప్పుడెప్పుడు భర్త దగ్గరకు వెళ్ళాలా అని ఆరాటపడేదాన్ని అతని ఉత్తరం వస్తే చాలు కాలు నిలిచేది కాదు. మనసు ఆగేది కాదు. గాలిలో తేలి పోతున్నట్లుండేది. నాన్నగారు అతని కిచ్చిన మాట ప్రకారం అతని తల్లిదండ్రులను చూస్తున్నారు. అతనికి ఎంత డబ్బు కావాలన్నా ఇంగ్లండ్‌లో ఉన్న ఆయన స్నేహితుడి ద్వారా సహాయం చేస్తున్నారు. కాని అది అపాత్ర దానం అని తెలియదు నా తండ్రికి.

"అయితే సడన్‌గా ఆరు నెలల క్రితం ఉమ స్కాట్లాండు నుంచి లండన్ హాస్పటల్‌కు వచ్చింది. నేను రాసిన ప్రకారం హాస్పిటల్‌లో నా భర్తను చూసి చాలా సంతోషించింది. కాని ఆ సంతోషం ఎంతో సేపు నిలువలేదు. అతనికి అదివరకే పెళ్ళయిందని, ఆరు నెలల పాప ఉందని వాళ్ళు ఇంగ్లండు నా పెళ్ళయిన నెలలోనే వచ్చారని తెలుసుకొని ఆ కబురు నాకు రాసింది. నేను నమ్మలేదు. అందుకు నా భర్త దగ్గర నుంచి వస్తున్న ఉత్తరాలే కారణం. నాకాళ్ళ కింద భూమి కదిలింది. కళ్ళలో గోదారి పొంగింది. ఎంత మోసం! ఎంత దగా! ఉమ అతన్నీ, నేను పంపిన ఫోటోలనూ, పేరునూ అన్నీ పరిశోధించి అతనూ, ఇతనూ ఒక్కడే అని నిర్ధారించింది. నాకు ధైర్యంగా ఉత్తరం రాసింది. అంతా నాశనమైందనుకున్న నన్ను నిలదొక్కుకునేలా చేసింది. అతను కేవలం డబ్బు కోసమే నన్ను పెళ్ళి చేసుకున్నాడని అర్థమైంది. ఎంతో ఉక్రోషం, ఆవేశం కలిగాయి. నన్ను నేను ఎంతో నిగ్రహించుకున్నాను. అమ్మా నాన్నలకు చెప్పకుండా అన్నయ్యకు చెప్పాను. ఆ సమయంలో అన్నయ్య బాధ పడినా మాఇద్దరికీ ఏ విధమైన సంబంధం లేనందుకు మాత్రం చాలా సంతోషించాడు. ఆ పెళ్ళి ఒక పీడకలగా భావించి మరిచి పొమ్మన్నాడు. నేను మరిచిపోయినా సంఘం మరిచిపోదుగా అతను చేసిన నేరానికి నేను శిక్ష అనుభవించాలి. ఇదెక్కడి న్యాయం? ఎంతో ఏడ్చాను.

తరువాత అన్నయ్యతో కలిసి ఆలోచించాను. ఉమ ఇంగ్లండ్ వచ్చి అతన్ని పర్సనల్‌గా కలవమని రాసింది. అందుకే నేను..." అని కొంచెం సేపు ఆగింది. అందరూ సురేఖ చెప్తున్నది ఆశ్చర్యంగా వింటున్నారు. అందరివంకా ఒకసారి చూసి తిరిగి మొదలుపెట్టింది సురేఖ.

"ఇంతవరకూ నాకు పెళ్ళయిందని చెప్పాను. నామెడలో మూడు ముళ్ళను వేసింది ఎవరో కాదు, ఈ పార్టీలో ఉన్న మిస్టర్ ఆనందరావు!"

ఆమాట అంటూంటే సురేఖ ముఖం ఎర్రబడింది. ఆవేశాన్ని అణుచు కుంటూందని ఆమె ముఖమే చెబుతూంది.

ఉమ మాత్రం ప్రశంసాపూర్వకంగా సురేఖను చూసింది.

మిగిలిన అందరూ ఆనందరావును గుచ్చి గుచ్చి చూస్తున్నారు. అవి ఆనందరావుకు చూపుల్లా కాక వాడి బాణాల్లా అనిపించాయి. పాలిపోయిన ముఖంతో తల దించుకున్నాడు. కమల అపరకాళిలా అయింది. భర్త నిజ స్వరూపాన్ని ఆమె నమ్మలేకపోతూంది. ఎవ్వరైనా దొరికే వరకూ దొరలే! ఇదంతా అబద్ధం అని ఎవ్వరైనా... ఎవరో కాదు తన భర్తే అరచి చెబితే బావుండును అని ఉంది. కాని అంత చలిలోనూ అతని గొంతు ఎండిపోయింది. అతని మౌనం, ఆ తల దించుకోవడం చూస్తుంటేనే తెలుస్తోంది సురేఖ చెప్పింది నిజమని. కమలకు ఒక్కసారి దుఃఖం ముంచుకువచ్చింది. సడన్‌గా తెలిసిన ఈ దుర్వార్తకు తట్టుకోలేకపోతూంది.

అందరూ ఆనందరావు మీద నుంచి సురేఖ మీదకు దృష్టి మరల్చారు. ఇంకా ఏమిః చెబుతుందో విందామని.

"ఇంతవరకూ నేను చెప్పింది విన్నారు. అది అబద్ధం కాదని మిస్టర్ ఆనందరావు గారిని చూస్తేనే తెలుస్తోంది. ఇంకొక్క చిన్నమాట" అంటూ తన మెడలో ఉన్న మంగళసూత్రాన్ని బయటకు తీసింది సురేఖ. చటుక్కున వాటిని రెండుముక్కలుగా తెంపింది. అందులో ఒకటి తీసుకెళ్ళి ఆనందరావు చేతిలో పెట్టింది. అతడు అప్రతిభుడై చూస్తున్నాడు. మాట్లాడదామన్నా నోరుకు పెగలడం లేదు. దోషి జడ్జిగారి ముందున్నట్లు ఉన్నాడతను. మరొక మంగళసూత్రాన్ని జాగ్రత్తగా తన పర్స్‌లో వేసుకుంది సురేఖ. అది ఆమె పుట్టింటివారు చేయించింది. అందుకే అతనికి ఇవ్వలేదు. ఇంతకాలం గుండెమీద ఉన్న బరువు తగ్గింది. మనసులో ఉన్న వేదన మాటల రూపంలో బయటకు రావడంతో మనసు తేలికగా ఉంది. ముఖంలోకి అనుకోకుండానే ఉత్సాహం వచ్చింది. ఇంతకాలం ఆమెలో ఉన్న ఆవేదన కమలకు ట్రాన్స్‌ఫర్ అయినట్టుంది. ఆమె ముఖం దిగులుగా ఉంది.

ఇంకా అందరూ నిశ్శబ్దంగానే ఉన్నారు. కమల కుర్చీలోంచి లేచి, సురేఖ రెండు చేతులూ పట్టుకుని "సురేఖా! నాభర్త తరుపున అడుగుతున్నాను. అతన్నీ, నన్నూ కూడా క్షమించు. అతను ఎవరో డబ్బు సహాయం చేస్తున్నారంటే నమ్మానుగాని, ఒక స్త్రీ మెడకు ఉచ్చు బిగించిన డబ్బు అని తెలిస్తే నీ స్థానంలో నేనిక్కడ ఉండేదాన్ని కాదు. మనదేశంలోని కొందరు మగవాళ్ళు, ఆడవాళ్ళను ఎన్నివిధాల హింసిస్తారో, ఎన్నివిధాల అన్యాయం చేస్తారో భారతనారిని నాకు తెలియంది కాదు. అన్నిరకాల అన్యాయాల్లోను ఇదో రకం అని ఇప్పుడు తెలిసింది. ఇంత మోసగాడికి భార్యనైనందుకు సిగ్గు పడుతున్నాను. నీవు ఇక్కడికి వచ్చి నా కళ్ళు తెరిపించావు. క్షమించమ్మా!'' అంటూ భోరుమని ఏడ్చేసింది. ఇద్దరూ ఒకరి నొకరు కొంచెం సేపు ఓదార్చుకున్నారు.

సురేఖ అంది - "ఆ మంగళసూత్రం తీసి అతని చేతిలో పెట్టడానికి ఇంత దూరం రావాలా అని మీరు అడగవచ్చు. ఇండియాలో నలుగురి ముందు కట్టించుకున్నాను. భారత స్త్రీని కాబట్టి దాన్ని ఎంతో పవిత్రంగా చూసుకున్నాను. దానితోపాటు నా భర్తను ఆరాధించాను. అతని భార్యగా ఎన్నో కలలు కన్నాను. ఎవరికీ ఏ విధమైన ద్రోహం చేయకుండానే నేను వంచిత నయ్యాను. ఇది అన్యాయం అని అరవాలనిపించింది. అలా అరిచినా వినే వాళ్ళుండరు. మా సంఘం స్త్రీనే నానామాటలు అంటుంది. అందుకే నలుగురిలోనూ కట్టిన తాళి నలుగురిలోనే తీయాలని నిర్ణయించుకున్నాను. అతన్ని ఇండియాకు రప్పించి ఈ పని చేయవచ్చు. కాని దాంతో అమ్మా నాన్నల ఆయువు తీరిపోతుందని తెలుసు. నాది రెండవ పెళ్ళి అయినా ఫరవాలేదనీ, స్త్రీకి జీవితంలో ఒక్కసారే పెళ్ళనీ నన్ను బలవంతంగా కాపురానికి పంపుతారు. అతనికి పెళ్ళయిందని నేను చెప్పినా నలుగురూ నమ్మాలిగా. దానికి సాక్షాలు నా దగ్గర లేవు. అందుకే నేను విన్నది ఎంతవరకూ నిజమో తెలుసుకోవాలని ఇంత దూరం వచ్చాను. అతను కట్టిన తాళి అతనికి ఇచ్చాను. ఇది ఇండియా అయితేనేం, ఇంగ్లండ్ అయితేనేం? ఇప్పుడు నాకు ఎంతో హాయిగా ఉంది. మిస్ సురేఖగా ఉన్నప్పుడు ఎంత హాయిగా ఉండేదాన్నో ఇప్పుడూ అలాగే ఉన్నాను. నా తల్లిదండ్రులకు నేను నచ్చచెప్పుకోగలను అన్న ధైర్యం వచ్చింది. ఇక సంఘమంటారా? అది భయపడే కొద్దీ భయపెడుతుంది. ఎదురు తిరిగితే తోక ముడుస్తుంది. అలాంటి సంఘాన్ని చూసి భయపడకూడదనే ఆత్మస్థైర్యం నాకు ఇంగ్లండ్ వచ్చిన తరువాత కలిగింది. ఇక్కడికి రాకముందు నాకు జరిగిన అన్యాయం ప్రపంచంలో ఏ స్త్రీకీ జరగదను కున్నాను. ఇక్కడి స్త్రీల జీవితాలను, కన్నీళ్ళను పరిశీలించే అవకాశం ఉమ ఈ నెల్లాళ్ళలోనూ కలిగించింది. అవన్నీ చూసిన తరువాత నాజీవితంలోని బాధ సముద్రంలో నీటిబొట్టులాంటి దనిపించింది. కాని అన్యాయం చేసే మగవాళ్ళు ఉన్నంతకాలం ఉచ్చుల్లో పడే స్త్రీలు ఉంటూనే ఉంటారు.

"చివరగా నా దొక్క మనవి. ఏ మగవాడూ కూడా భారత స్త్రీ తన చెప్పుచేతల్లో ఉంటుందని, తను చెప్పినట్లు వింటుందని, ఎలాంటి అన్యాయాలైనా చేయవచ్చని అనుకోకూడదు. ఆమెకూ మనసు ఉంటుందని, ఆమె బొమ్మ కాదని గ్రహించి భార్య మీద అధికారం చలాయించి, అన్యాయం చేసే బదులు ఆమెను మనసున్న మనిషిగా గౌరవించి తన కష్టసుఖాల్లో పాలుపంచుకునే అర్థాంగిగా భావించిననాడు నాలాంటి స్త్రీలు ఉండరు. ఈ ఆనందరావులాంటి మగవాళ్ళూ ఉండరు. ఇంటికి వచ్చి, ఉమ ఆతిథ్యాన్ని స్వీకరించి, ఓపికగా నా కథను విన్నందుకు అందరికీ మా కృతజ్ఞతలు" అంటూ కుర్చీలో నిటారుగా కూర్చుంది సురేఖ.

అక్కడి పెళ్ళికాని యువకులలో కొందరు ఆమెమీద, ఆమె వ్యక్తిత్వం మీద గౌరవభావం ఏర్పడి ఉమతో ఎలా రాయబారాలు చేయాలా అని ఆలోచిస్తున్నారు.

(ప్రభ, 01-07-87)

☆ ☆ ☆

# కష్టాల స్టేషనులో బండి ఆగదు

రైలు ఒక్క కుదుపుతో ఎవరూ ఊహించకుండా ఆగిపోయింది. గోదావరి నదిమీద ఉన్న బ్రిడ్జి సమీపిస్తున్నంతలో దూరంగా రెడ్ సిగ్నల్ కనబడితే డ్రైవరు ఆపేశాడు. అప్పుడే ట్రెయిన్‌లో ఆహారం తీసుకుంటున్న వారు అవి మీద ఒలికి ఒంటిమీద తొణికి అవస్థ పడుతున్నారు. కొంచెం సేపైన తరువాత అందరికీ మెల్లగా వార్త అందింది - బ్రిడ్జి దగ్గర చిన్న రిపేరు ఉందట. ఒక గంటవరకూ రైలు కదలదనీ, అక్కడే ఉంటుందనీ.

అంతే అందరూ మెల్లిమెల్లిగా కిందకు దిగిపోయేరు. ఆడవాళ్లందరూ లోపల ఉండిపోయారు. ఇంట్లో కాలు నిలువనట్లే మగవారికి ట్రైన్‌లోను కాలు నిలువలేదు. కంపార్ట్‌మెంట్స్‌లో నుంచి బయట పడ్డారు.

మగవాడు ఎక్కడున్నా సరే, కట్టేసినట్లుంటే భరించలేడు. అతనికి అంతా విశాలంగా కావాలి. 'ఇల్లో నారాయణమ్మా?' అంటూ ఇల్లు, ఇలాంటి కంపార్ట్‌మెంట్‌లు పట్టుకొని ఉండేది ఆడదే గాని, మగవాడు కాదు. మగవాడికి ప్రతిదానికీ మార్పు, విశాలం అన్న కోరికలతో పాటు అతని మనసూ విశాలంగానే ఉంటుంది.

బంగారాన్ని నీటిలో కరిగించి ఊరంతా స్ప్రే చేసినట్లు వెన్నెల మెరిసిపోతోంది. ఆకాశంలో పున్నమి చంద్రుడు వీరవిహారం చేస్తున్నాడు. గోదావరి అలలు వెన్నెలను ఆహ్వానిస్తూ ఎదలను తెరచి ఆహ్వానిస్తున్నాయి. ఎగిరెగిరి పడుతున్నాయి.

అలా మెల్లగా నడుస్తూ ఇసుకలోకి వచ్చేశారు దినేష్, చంద్ర, ఆనంద్, అనంత్. అందులో దినేష్, ఆనంద్ ఒక కాలేజీ వారు. చంద్ర, అనంత్ ఒక ఊరివాళ్ళు.

దినేష్, అనంత్ ఒక ఆఫీసువాళ్ళు నలుగురూ అదే ట్రెయిన్‌లో ప్రయాణం చేస్తున్నా ఒకరికి ఒకరు తెలియలేదు కాని ట్రెయిన్ ఆగిపోవడంతో అనుకోకుండా కలుసుకొని, ఒకరినొకరు పరిచయం చేసుకుని వెన్నెలను గాలిగా చేసికోవాలనే ఉద్దేశంతో ఒక పక్కగా వచ్చారు. "ఇక్కడ బావుంది" అంటూ ఒక చోట మెత్తని స్థలంలో కూలబడ్డాడు అనంత్. మిగిలిన వారు అనుసరించారు.

నమస్కారం మాష్టారూ! రండి ఇలా కూర్చోండి మీరూ ఇదే ట్రెయిన్‌లో ఉన్నారా?" అంటూ సంతోషంగా పలకరించాడు చంద్ర దయానందరావుగారిని.

"నీవా చంద్రం. బావున్నావా? మళ్ళీ ఎంత కాలానికి చూశానయ్యా నిన్ను? చాలా సంతోషంగా ఉంది. కులాసాగా ఉన్నావా." అంటూ పలకరించా రాయన.

"కూర్చోండి మాష్టారూ!" అంటూ ఆహ్వానించి మిగిలిన అందరినీ పరిచయం చేశాడు చంద్ర.

'నేనెందుకయ్యా మీ కుర్రకారు మధ్య? కర్ర సహాయంతో నడిచే స్థితిలో ఉన్నాను. మీరు మాట్లాడుకోండి. నేను దూరంగా కూర్చుంటాను" అన్నారాయన.

"అబ్బే లాభంలేదండి. కాలేజీలో మీరు పాటలు రాసి నాతో పాడించేవారు గుర్తుందా? ఇంత మంచి వాతావరణంలో నాలుగు కవిత్వం ముక్కలు చెప్పాలండీ మీరు." చంద్రం ఆయన్ని వదలలేదు.

"నీవూ రాసేవాడివిగా చంద్రం? నీవు చెబితే బావుంటుందేమో. నీకు ఆశు కవిత్వం అంటే ఇష్టం కదా!" అన్నారాయన.

"ఆశలన్నీ జీవితంలో తారుమయ్యేసరికి, ఆశు కవిత్వం కూడా పారిపోయింది మాష్టారూ. చదువుకునేటప్పుడు 'కురిసే వెన్నెల్లో మెరిసే గోదావరిలా' అంటూ పాడుకునే వాడిని. బ్రతుకూ అలాగే సాగుతుందనుకున్నాను. ఇలా నన్ను సాగదీస్తుందనుకోలేదు. ఆ రోజులే వేరండీ" ఆవేదనగా అన్నాడు.

మాస్టారు అక్కడ కూర్చున్న దగ్గరనుంచి వాళ్ళ నలుగురి మొహాలూ గమనిస్తూనే ఉన్నారు. వెన్నెల నీడలో అవి వెల వెలబోతూ నీలినీడలు అలుముకున్నాయి.

"అవేం మాటలు చంద్రం? యువకుడివి ముందు ముందు చాలా భవిష్యత్తు ఉందయ్యా నీకు."

"మీరు అలా అంటున్నారుగాని, మాస్టారూ, అదిగోచూడండి ఆ ట్రెయిన్ కింద తల పెట్టాలని ఉందండీ." గొంతులో బాధ ధ్వనించింది.

"అలాంటి ఆలోచనలు తలపెట్టకు చంద్రం. ఆ ట్రెయిన్‌లో ప్రయాణిస్తున్న వాళ్ళందరూ ప్రాబ్లమ్స్ లేనివారూ, ఆత్మహత్య చేసుకోవడానికి ట్రెయిన్ కింద తల పెట్టేవారు మాత్రమే ప్రాబ్లమ్స్ ఉన్నవారూ నంటావా? వాళ్ళకీ ఉంటాయి తలమునకలయ్యే సమస్యలెన్నో" ఓదారుస్తూ అన్నారాయన.

"మేం అలా అనుకోలేకపోతున్నామండీ" దినేష్ అన్నాడు.

ఆనంద్, అనంత్ కూడా కోరస్ పాడారు.

దూరంగా వరుసగా కనిపిస్తున్న స్ట్రీట్‌లైట్స్ ఆకాశానికి కట్టిన బంతిపూల తోరణంలా మనోజ్ఞంగా ఉన్నాయి. పిల్లగాలులు వెన్నెలతో సయ్యాట లాడుతూ మెల్లిగా వీస్తున్నాయి. ఇసుక బంగారం రంగులో మిల మిల మెరిసిపోతూంది. ఎవరో యూనిఫారంగా విసిరి ఆ నది ఒడ్డున ఆరబోసినట్లుగా ఉంది ఇసుక. చల్లగా, మెత్తగా వారికి హాయిగానే ఉంది. కాని మనసులే భారంగా ఉన్నాయి.

కాస్త ఇసుకను గుప్పెటలోకి తీసుకొని చూస్తూ దయానందరావుగారు అన్నారు "ఇంతకీ ఏమిటయ్యా నీ సమస్య?' అని.



దూరంగా చాలామంది ప్రయాణికులు గుంపులు గుంపులుగా నిలబడి రాజకీయాల గురించి కొందరూ, సినిమాల గురించి కొందరూ చర్చించుకుంటున్నారు. ఎక్కడో చర్చిలోని గంటలు తొమ్మిది కొట్టాయి.

"నాకు ఉద్యోగం లేదు మాస్టారూ. నాది పాత కథే. కొత్తదేమీకాదు. నేను ఈ దేశంలోని చాలా మందిలా నిరుద్యోగిని. జీవితంలో సెటిల్ కాలేదు. షటిల్ కాక్‌లా ఇటు ఇంట్లో వారి మాటలూ, అటు ఊళ్ళో వాళ్ళ మాటలూ వింటూ అటూ, ఇటూ నలిగిపోతున్నాను. నేను మూటలు సంపాదిస్తేగాని వారి మాటలు ఆగవండీ."

"మరి ఉద్యోగాలకు అప్లైచేయడంలేదా?"

"ఎందుకు లేదండీ? బ్రహ్మాండంగా చేస్తున్నాను. కాని ఇంటర్వ్యూలు వస్తున్నాయి కాని, ఉద్యోగాలే రావడం లేదు. మా నాన్నగారు అప్లికేషన్‌లు కొనడానికి, ప్రయాణాలకు డబ్బు ఇవ్వడానికి ఎన్నో మాటలంటున్నారు. తప్పు నాదాండీ?" అడిగాడు.

"ఆయనది కూడా కాదు. ఎందుకంటే మీ నాన్నగారి ఆర్థిక పరిస్థితి నీవు గమనించాలిగా!"

"నా తాపత్రయం అంతా ఆయనను ఆ స్థితినుంచి దాటించాలనేగా? ఇంట్లో అన్నం తింటూంటే కూడా అమ్మ మిగిలినవారు నేను అప్పనంగా తింటున్నట్లు మాట్లాడుతారు. ఉద్యోగం వస్తే నా సమస్యకు పరిష్కారం దొరుకుతుందండీ."

"ఏం దొరకదు పరిష్కారం. మొదట్లో అలానే అనుకున్నాను. నాకు మంచి ఉద్యోగం ఉంది. తరువాత పెళ్ళి పెళ్ళి అన్నారు. ఇంట్లోవాళ్ళు సరేనని, నా ఆదర్శాలను గౌరవించుకుంటూ దీప మెడలో మూడుముళ్ళూ వేశాను. ఆ మూడుముళ్ళూ ముళ్ళే అయి నా చేతులకు గుచ్చుకుపోయాయి. అంతవరకూ గచ్చునేల మీద ఉన్నట్లుండే నా బ్రతుకు, దీప రాకతో గాజు పెంకులమీద నివసిస్తున్నట్లు అయిపోయింది. అసలు జీవితంలో సమస్యలకు అంతుండదు. ఒకటి పోతే ఒకటి వస్తూనే ఉంది." బాధగా అన్నాడు అనంత్.

"ఏమిటీ. ఏమైనా కట్నం సమస్యలా?" అడిగాడు మాస్టారు.

"అది ఉండుంటే ఏ గొడవా లేకపోయేదండీ. మగవాడికి గొప్ప అదృష్టమైనా, దురదృష్టమైనా భార్యే అని ఆలస్యంగా తెలుసుకున్నాను. అంతే కాదు, వివాహం ఆనందదాయక మన్నది కూడా హాస్యాస్పదంగా అనిపిస్తుంది. ఇప్పుడు ఇది ఆవేదనతో చెబుతున్న ఆశు కవిత్వమండీ." ఏడ్వలేక నవ్వాడు అనంత్. తిరిగి తనే అన్నాడు - "మా పెళ్ళిలో కట్నం అనే మాటను అంటువ్యాధిలా అవతలకు తరిమేశామండి. కాని దీప దాన్ని మరో విధంగా అర్థం చేసుకుంది. కట్నం తీసుకోని నేను, నా వాళ్ళు అసమర్థులు. 'మా వాళ్ళు కట్నం ఇచ్చి ఇంకా మంచి సంబంధం చేయవలసింది' అంటుంది అస్తమాను ఆమెను ఎంత ప్రేమగా చూసినా అసంతృప్తే. ఆమెకోసం ఎంత డబ్బు ఖర్చుపెట్టినా విలువ లేదు. ఆ ఇంట్లో మేమిద్దరమే. కాని ఇరవైమంది మనుషులున్నంత గోలగా అరుస్తుంది. ప్రతి విషయంలోనూ నా లోపాలు వేలెత్తి చూపుతుంది. నా సహనాన్ని పరీక్షిస్తుంది."

"అసలు లోపం నీది కాదు అనంత్. ఆవిడకు అన్ని అవయవాలు సరిగానే ఉండి ఉండవచ్చు. గాని, నిన్ను అర్థం చేసుకుని, సంసారం చక్కదిద్దుకోవాలి అనే మనసు లేకపోవడమే ఆమెలోని పెద్ద లోపం. ఇది పైకి కనబడని పెద్ద అవయవ లోపం. చూడూ! నిమ్మకాయ అతిగా పిండితే చేదెక్కుతుంది. నీ ప్రేమా అలాగే తయారై ఉంటుంది ఆలోచించు" అన్నారు మాస్టారు.

"నిజమే అయ్యింటుంది మాస్టారూ. ఏమీ లేకపోయినా నాలో ఎన్నో తప్పులున్నట్లు నన్ను నిలదీస్తుంది. మా అమ్మగాని, మరెవ్వరు గాని నా తరపు వారు వస్తే తూర్పారబడుతుంది. ఇంకా విచిత్రమైన సంగతి ఏమిటంటే, తను అన్నదానికి నేను ఏదైనా ఎదురు తిరిగి అన్నానో ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించడం! చివరికి నన్ను కట్నం కోసం వేదించే మనిషిలా చట్టుప్రక్కల నిరూపించింది. రేపొద్దున్న తను అడిగిన ఏ చీర కొనకపోయినా ఆత్మహత్య చేసుకోగలదు. నన్ను జైల్లోకి తోయించగలదు. అసలే ప్రస్తుతం మన సంఘంలో కోడళ్ళను కాల్చి చంపే సంఘటనలు ఎక్కువకదా! కోర్టులు తప్పక ఆమెదే న్యాయం అంటాయి. ఇప్పుడనిపిస్తుంది. - ఆ కేసుల్లో

నిజానిజాలు తెలుసుకుంటే తప్పు అత్తలదే కాదు. కోడళ్ళది కూడా అని." అనంత్‌కి దుఃఖం వచ్చింది.

"ఆమెను అదిరించో, బెదిరించో చెప్పి చూశావా?" అడిగారు మాస్టారు.

దూరంగా రేడియోలో మంచి "పడుచుదనం రైలు బండి పోతున్నది?" అన్న పాట వినబడుతుంది.

"అన్నీ అయిపోయాయండి. బుజ్జగించడాలు, బ్రతిమాలడాలు, బెదిరించడాలు అన్నీ అయిపోయాయి."

"వాళ్ళవాళ్ళు ఉన్నవాళ్ళేనా? ఇష్టం లేకపోతే వెళ్ళిపొమ్మని చెప్పలేకపోయావా? నీ విలా నరకం అనుభవించడం ఎందుకు?" దయానందరావుగారు అన్నారు. ఆ మాట అనకూడదని ఆయనకు తెలుసు. కాని అనంత్ మనసు గ్రహించడానికి అన్నారు.

"లేదండీ. ఆ మాట నేను అనలేను."

"చాలామంచిది. ఆ మాటమీదే ఉండు దీప ఇప్పుడు నీ సొమ్ము. ఆమెను నీ దారిలోకి మలచుకునే విషయం నీవే ఆలోచించుకోవాలి. కాని ఒక్కటి గుర్తు పెట్టుకో. ఒక్కోసారి అతి మంచితనం ఎదుటివారికి చేతకానితనంలా కనబడుతుంది. 'కుళ్ళిపోతున్న కురుపుమీద వైద్యుడు జరిపే శస్త్ర ప్రయోగాన్ని హింస అని ఎవ్వరూ అనరు' అని శ్రీశ్రీ అన్నారు. ఒకరిని చెడు దారిలోనుంచి మంచి దారిలోకి మళ్ళించడానికి ప్రతి ఒక్కరూ అది గుర్తు పెట్టుకోవాలి. ఎవరు ఏం చేసినా ఎంతో నమ్మకంతో చేయాలి. నమ్మకమే మనిషిని సమర్థుణ్ణి చేస్తుంది."

"ఏం నమ్మకమో లెండి మాస్టారూ. నేను ఎంతో నమ్మకంతో, నేను ఎంతో సమర్థుడిననే అపోహతోనే ఉన్నాను. కాని ఇప్పుడు నా జీవితం అడకత్తెరలో పోకచెక్కలా అయింది." దినేష్ అన్నాడు.

"ఏం ఏమైంది?" మిగిలినవారు ఆత్రుతగా అడిగారు.

"నేను చాలాకాలం నిరుద్యోగిగా బ్రతికాను. ఎంతకాలం అంటే చెప్పలేను. చాలా విసిగిపోయాను. నా టాలెంటుకి, నా సర్టిఫికేట్స్‌కి ఎక్కడా విలువ లేకుండాపోయింది. తిరగని ఆఫీసు లేదు. అసలు అమ్మాయిల పెళ్ళిళ్ళకే చెప్పులు అరుగుతా యంటారు కాని, నాకు ఉద్యోగాల వేటకోసం జోళ్ళు అరిగిపోయాయి. కళ్ళు కాయలు కాచిపోయాయి. అయినా ఉద్యోగం దొరకలేదు."

"ఇప్పుడు నీవు చేస్తున్నది మంచి ఉద్యోగమే కదా!" అనంత్ అన్నాడు.

'టికెట్లు లేకుంటే ఇక్కట్లండి' పాట సాగుతూనే ఉంది.

"అవును మంచిదే కాని ప్రస్తుతం ముళ్ళకిరీటం మోస్తున్నంత ఘోరంగా ఉంది నా పరిస్థితి."

"ఏమైంది ఉద్యోగంలో చికాకులా?" మాస్టారు అడిగారు.

"ఉద్యోగం మంచిదేనండి. ఈ ఉద్యోగానికి చేరకముందు మా ఆఫీసరుగారు తన కూతుర్ని పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకుంటే ఉద్యోగం ఇస్తానన్నారు. వద్దంటే మళ్ళీ ఇలాంటి అవకాశం రాదు. ఇప్పటికే ఇంట్లో అందరం పస్తులుండే పరిస్థితి వచ్చింది. అసలే ఆస్తులు లేని వాళ్ళం ఉద్యోగం వదిలితే కుదరదని, ఆఫీసరుగారిని మభ్యపెట్టి ఉద్యోగంలో చేరిపోయాను. ఆఫీసరుగారి అమ్మాయి చదువుకుంటూంది. మరో రెండు నెలల్లో అది అయిపోతుందట. అప్పుడు పెళ్ళట. కాని నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఉద్యోగమైనా వదిలేయడానికి సిద్ధంగా ఉన్నాను గాని, మనసిచ్చిన అమ్మాయిని మోసం చేయలేను. ఇద్దరు అతివల మధ్య ఇరుక్కుపోయిన వాడిని నేను. మా ఆఫీసరు అమ్మాయి ఎవరినో ప్రేమించిందనీ చూచాయగా విన్నాను. కాని ఆ విషయం ఆయన దగ్గర ఎలా ప్రస్తావించను? మతిపోతుంది తలచుకుంటే' అన్నాడు దినేష్.

కొంచెంసేపు వెన్నెలకూడా వారి బాధల్లో భాగం పంచుకుంటూ అక్కడి నుండి తప్పుకుంది. కాస్సేపటికి చంద్రుణ్ణి కమ్మిన మబ్బులు తొలగిమళ్ళీ వెన్నెల విరబూసింది. ప్రకృతి అంతా వాసనలేని వెన్నెల పువ్వులా కనబడుతుంది.

ఆ ఒడ్డునీ, ఈ ఒడ్డునీ కలుపుతూ బ్రిడ్జి నిశ్చలంగా నిలబడి ఉంది. నదిలో నీరు ఎక్కువగా లేదు స్తంభాలు నీటిలో తడిసి తడిసి ఉన్నా, కలువకాడల్లా చెక్కుచెదరలేదు. వాహనాల బరువు మోస్తూ, అత్తింటి ఆరళ్ళకు అలవాటు పడిపోయిన కోడలిలా స్థిరంగా ఉంది బ్రిడ్జి.

దయానందరావుగారు కొంచెంసేపు ఆలోచనలో పడ్డారు. ఆనంద్ ఇంకా దీర్ఘాలోచనలో ఉన్నాడు. "ఏం బాబూ, ఆనంద్! అందరూ అన్ని సమస్యలూ చెప్పారు. నీవేం చెప్పవేం? నీకు సమస్యలు లేవా నాయనా?" అన్నారు.

"వాళ్ళ ముగ్గిరిలా నాది పైకి చెప్పుకోలేని సమస్య అండీ. నిజానికి నాకు సమస్య లేకపోవడం కాదు, చిన్న సమస్య లేదు. ఉన్నది చాలా పెద్దది."

"అంత పెద్ద సమస్యా బాబూ నీది? మరి నీది కూడా వినే అవకాశం ఇచ్చెయ్యి?" అన్నారు.

రైలు పట్టాలు బాగుచేస్తున్న చప్పుడు, ప్రయాణికుల రొద వారికి వినబడుతూనే ఉంది.

"నా బాధ చెప్పాలంటే చాలా సిగ్గుగా ఉంది మాస్టారూ! కాని మీలాంటి పెద్దవారి ముందు, ఈ స్నేహితుల ముందు ఆ విషయం చెప్పి నా బాధ దించుకోవాలని ఉందండీ."

"సందేహించకు నాయనా, నీ భార్యతో ఏదైనా కోట్లాటా? చెప్పు."

'అబ్బే. అదే కాదండి. నాకు అసలు పెళ్ళే కాలేదు. కాని, కుదిరింది. ఇప్పుడు పెళ్ళంటేనే భయం... భయం... భయం..."

"ఎందుకు ఆనంద్ అంత భయం. పెళ్ళి లాటరీ లాంటిదని వినడంవల్లా, లేక...?"

"అదేమీ కాదండీ, తెలిసో తెలియకో పెళ్ళికి ముందు ఒక తప్పు చేశాను. వయసు వేడిలో ఒక ఆడదానితో ఆమె బలవంతంమీదే కలిశాను. దానితో నాకు సుఖ..."

"అర్థమైంది. సుఖరోగాలు అంటుకున్నాయి. డాక్టరు దగ్గర కెళ్ళాలంటే సిగ్గు. పెళ్ళంటే భయం. పెళ్ళి వద్దంటే పెద్దలు వినరు. ఆరోగ్యం పాడైంది. అంతే కదూ?" అన్నారాయన.

"అవును మాస్టారూ! మీరు చెప్పింది నిజం." తల వంచుకొని అన్నాడు ఆనంద్.

"చక్కగా నవ్వేవాళ్ళే బండెక్కండి" అంటూంది రేడియోలో పాట.

"మీరు యువకులయ్యా! ఇలా ప్రతిదానికీ బాధపడుతూ కూర్చోకూడదు. దేశ భవిష్యత్తు అంతా మీ చేతుల్లో ఉంది. మీరు గతానికి వారసులే కాదు, భవిష్యత్తుకి సంరక్షకులు కూడా కావాలి. చీకటి ఉన్నప్పుడే దీపం వెలిగించాలి. అన్నిటికీ ధైర్యంగా నిలబడాలి. పుస్తకాలే కాదు. జీవితాలు కూడా చదవడం మీకు అందరికీ మొదలైంది కదూ?"

"అవునండీ" అన్నాడు చంద్ర.

"మనం విదేశీయుల నుంచి కేకులు, చాకెట్లు తినడం నేర్చుకున్నాం. పాంటూ, షర్టూ వేయడం నేర్చుకున్నాం. కాని వారిలో ఉన్న కష్టపడి జీవించడం, నిజాయితీగా సంపాదించడానికి సిగ్గు పడకపోవడం మాత్రమే నేర్చుకోలేదు. ఏ దేశం నుండైనా మంచిని గ్రహించడంలో తప్పు లేదు. కాని చెడును అనుసరించడం మాత్రం చాలా తప్పు. అక్కడివారు డాక్టరు కొడుకు వార్డుబోయ్‌గా చేసి సెలవుల్లో తమ చదువుకి కావలసిన డబ్బు సంపాదించుకుంటారు. ఆఫీసరు కొడుకు కూలిపని చేస్తాడు. న్యాయంగా చేసే పనిని తక్కువగా భావించకూడదు. అది ఎవరినీ హత్య చేయడం, దోచుకోవడం లాంటిది కాదు.

"చంద్రా! నీవు ఏ ట్యూషన్లు చెప్పుకొనో, సేల్స్ మేన్‌గా పని చేసో, ఆటో నడుపుకునో ఉద్యోగం దొరికేవరకు నీ ఖర్చులకైనా నీవు సంపాదించుకుంటే మీ ఇంట్లో

వారితో మాటలు పడే బాధ తప్పేది కదా! మన దేశంలో అంత ఈజీగా పార్ట్‌టైం జాబ్‌లు దొరకకపోవచ్చు. కాని కొన్నయినా తప్పక దొరుకుతాయి, తప్పకుండా.

"ఆనంద్! జరిగిందేదో జరిగింది. నువు సిగ్గు పడవలసింది తప్పు చేయడానికి ముందు. నిండా మునిగిపోయావు. తేలి రావడం నీ చేతుల్లో ఉంది. మంచిగా డాక్టరుకి చూపించుకొని, ఆరోగ్యం బాగుచేసుకుని పెళ్ళి చేసుకో. జీవితంలో మళ్ళీ తప్పు చేయకు. నీతి ఆడదానికే కాదు. మగవాడికీ కావాలి. అది చెప్పడం కోసమే రాముడి పాత్ర. ఆ పాత్రలోని ఔన్నత్యాన్ని గుర్తించాలయ్యా. విచ్చలవిడి శృంగారం మంచిది కాదని మన దేశం ముందునుంచీ దానికి దూరంగా ఉంది. విదేశీయులు ఆ విషయం పట్టించుకోలేదు. చిన్నతనం నుంచి సెక్స్‌కు అలవాటుపడిన వారు ఎయిడ్స్ వాత పడుతున్నారు. శీలానికి మనం ఇచ్చే ప్రాముఖ్యం ఎంత మంచిదో చూడండి.

"అనంత్! నీవు వినవయ్యా. ఐడిల్ మైండ్ ఈజ్ ది డెవిల్స్ వర్క్‌షాప్ అని వినే ఉంటావు. నీ భార్య పుట్టింట్లో నలుగురి మధ్య తగవులతో పెరిగి, పనిలో నలిగిపోతూ ఉండేదనుకుంటాను. ఇప్పుడు పనిలేక నీపైన పగ పట్టింది. ఆమె దృష్టిని చదువుపైకో, సంగీతం పైకో, ఉద్యోగం మీదకో మళ్ళించు. నీ జీవితం బాగుంటుంది.

"దినేష్ నీవూ బాధపడకు. ఎలాగూ ధైర్యంచేసి నీప్రేమ విషయం మీ ఆఫీసరుగారి అమ్మాయితో చెప్పేయి. మిగిలినదంతా ఆమె చూసుకుంటుంది. అటునుంచి నరుక్కు రావాలయ్యా సమస్యలను."

"చూడండ్రా! నీటికి ఉంది ఆటూ పోటూ. ఈ వెన్నెలకూ ఉంది కష్ట మనేది - అమావాస్య పేరుతో. ఈ ఇసుక చూడండి పెద్ద గాలి వస్తే గిరగిరా తిరిగి ఊపిరి తీసుకోనీయకుండా ఎగురుతుంది. ప్రాణం ఉన్న మనుషులం మనం మెదడుతో ఆలోచించి చక్కగా సమస్యలు పరిష్కరించుకోవాలి గాని, ఇలా దిగులు పడకూడదు."

"అసలు జీవితం అంటేనే కష్టాల సముదాయమని మనం అర్థం చేస్పుకుంటే, అప్పుడు సుఖం కలిగితే ఎంతో సంతోషంగా ఉంటుంది! అదిగో ట్రెయిన్ బయలుదేరే సమయమైంది లేవండి. ధైర్యంగా సమస్యలను పరిష్కరించుకుని, మీ జీవితాలను మీరే నందనవనం చేసుకోవాలి. తెలిసిందా?"

"చాలా బాగా చెప్పారు మాస్టారూ. మాకు ఎంతో శక్తి వచ్చేసింది. ఇక చూడండి మా జీవితాలనే "కష్టాల స్టేషన్లో బండి ఆగదు" అంటూ నలుగురూ నవ్వుకుంటూ, మాస్టారి తోడుగా ట్రెయిన్‌వైపు నడిచారు.

(ప్రభ, 20-09-89)

★ ★ ★

# నీతీ నీవెక్కడ

కంగారుగా కాలింగ్ బెల్ కొట్టాడు రాఘవ. ఆ కొట్టడంతోనే తెలుస్తుంది. అతనెంత ఆపదలో ఉన్నాడో, ఆత్రుతగా ఉన్నాడో. త్వరగా తెరుచుకోని తలుపు వైపు అసహనంగా చూశాడు. ఎవరో తలుపు తెరిచారు.

"డాక్టర్ రావు గారిల్లు ఇదేనాండి?" గాభరాగా అడిగాడు.

"మీకు ఆయనతో ఏం పని? లోపలకు రండి." మూర్తి అన్నాడు.

లోపలికి వచ్చి నిప్పుల మీద నిలబడినట్లు నిలబడ్డాడు. "సార్! రావు గారిని కలవాలండి. ఆయన ఇంట్లో ఉన్నారా?" రాఘవ అడిగాడు.

"ఏదైనా సీరియస్ కేసా?" మూర్తి ప్రశ్నించాడు.

"అవునండి. మేము ఊరు వెళుతుంటే మా అబ్బాయికి ఏక్సిడెంటులో తలకు దెబ్బ తగిలింది. రావు గారు ఇక్కడే ఉంటున్నారని గుర్తు వచ్చి వచ్చాను. చాలా సీరియస్‌గా ఉన్నాడు."

"మీరు..." ప్రశ్నించాడు.

"నేను... నేను.... రావు గారికి చాలా ద్రోహం చేసిన మనిషినే. అవినీతి నిరోధక శాఖలో పని చేసిన వాడిని."

"మరి ఇప్పుడు చేయడం లేదా?"

"లేదండీ... ఆ ఉద్యోగం వదిలేశాను... మూర్తిగారూ! ప్లీజ్ రావు గారికి నా మొహం చూపించలేను. ఆయన జీవితం నాశనం అయింది. నా వల్లనే అని ఒప్పుకుంటాను. రావు గారు చాలా మంచివారనీ, నిజాయితీపరులనీ తరువాత విన్నాను."

"గత జల సేతు బంధనం."

"ఒప్పుకుంటాను. అప్పుడు నా ఉద్యోగ ధర్మం అది. డాక్టర్లు పేషెంట్ల మీద కోపం, కష్టపెట్టుకోరండీ. వాళ్ళు ఉద్యోగానికి కళంకం రానివ్వరు. ఎంత కోపం ఉన్న పేషెంటు మీదైనా సరే ఉద్యోగ ధర్మాన్నే పాటిస్తారు. కాని నిర్లక్ష్యం చేయరు. ట్రీట్‌మెంట్ ఇవ్వకుండా వదిలేయరు. అదే ఆశతో వచ్చాను."

మూర్తి మాట్లాడలేదు.

"ఈ చుట్టు పక్కలే కాదు. చాలా దూరం వరకూ "న్యూరో" డాక్టర్లు ఎవరూ లేరు. రావు గారితో చెప్పండి ప్లీజ్..." నన్ను క్షమించమని. త్వరగా వచ్చి నా కొడుకుని

చూడమని చెప్పండి. 'నాకు ఒక్కడే కొడుకండి. రావు గారు ఇంట్లో ఉన్నారాండి?" ఆవేదనగా అడిగాడు రాఘవ.

అన్యమనస్కంగానే "ఆ" అన్నాడు మూర్తి. రాఘవ బాధగా మూర్తిని అర్థిస్తూనే ఉన్నాడు. అతను ఇప్పుడొక ఆఫీసరు కాదు. ఒక కన్న తండ్రి. పుత్ర భిక్ష పెట్టమని తాను సస్పెండ్ చేయించిన డాక్టరు దగ్గరకి వచ్చిన అతి మామూలు సగటు మానవుడు. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుంటే లోపలి నుంచి మెల్లిగా మాటలు వినబడ్డాయి.

"అమ్మా! నాకు పూలజడ కుడతానన్నావు. పూల దండ కొనవూ? నాన్నగారు తెస్తారన్నావు. అసలు తీసుకు రావడమే లేదు దండ." పాప ఏడుపు.

"ఉష్.. మెల్లగా... మామయ్య ఎవరితోనో మాట్లాడుతున్నాడు."

"మామయ్య అయితే నేను ఏదీ అడిగితే అది కొనిస్తారు. నీవు కొనివ్వవు. నేను మామయ్యనే అడుగుతాను." సతాయిస్తోంది ఆ పాప తల్లిని.

"వద్దు.... వద్దు... మామయ్యను అడగొద్దు..." కంగారుగా అంది.

"ఏమిటి రమా నీవు మరీను! చిన్న పిల్ల పూలు అడిగితే వద్దంటావు. మీ అన్నయ్యతో చెప్పి రప్పించవచ్చుగా?" ప్రేమతో కూడిన మందలింపు.

అంతలోనే నిశ్శబ్దంగా ఏడుస్తూ వెక్కిళ్ళు పెట్టిన శబ్దం మెల్లిగా వినబడింది.

రాఘవ ఆ విషయం పట్టించుకునే స్థితిలో లేడు. తన ధోరణిలో తాను బ్రతిమాలుతున్నాడు.

"మూర్తిగారూ దయయుంచి డాక్టరు గారిని త్వరగా పిలవండి. అదిగో మా అబ్బాయిని తీసుకుని వచ్చారు చూడండి. రక్తం తల నుంచి ఎలా కారుతోందో! ఇప్పుడు నాకు మరో ఊరు వెళ్ళడానికి సమయం కూడా లేదు. రావుగారు తప్ప నా కొడుకుని మరెవ్వరూ రక్షించలేరు. మీ రుణం ఉంచుకోనండి." అర్థింపుగా అన్నాడు రాఘవ కళ్ళలో నీళ్ళొక్కటే తక్కువ.

డబ్బులిస్తేనే డాక్టర్లు బాగా చూస్తారు. లేదంటే చూడరు అనే అభిప్రాయం పేషెంట్లలో చాలా మందికి ఉంటుంది. అందుకే డాక్టర్లకు బలవంతంగా డబ్బు ఇవ్వచూపుతారు. ఇప్పుడు రాఘవ కూడా అదే పరిస్థితిలో ఉండి అలాగే ఆలోచిస్తున్నాడు.

మూర్తి లోపలకు వెళ్ళే ప్రయత్నం ఏమీ చేయకపోవడంతో డబ్బులున్న కవరు తీసి బల్ల మీద పెట్టాడు.

"మూర్తి గారూ. ఎంత డబ్బు కావాలన్నా ఇస్తానండీ. నా కొడుకు ప్రాణం ముఖ్యం నాకు. ఆ కేసు విషయంలో నేను మాట్లాడి అది కొట్టించే ఏర్పాట్లు చేస్తాను. నాకు చాలా ఇన్‌ఫ్లూయెన్స్ ఉంది. నా వల్ల పోయిన ఉద్యోగం నేనే ఇప్పించి పెడతాను."

"మిమ్మల్ని నేను డబ్బు అడగలేదే?"

"ఏదో మా ఆతృత మాది. ప్లీజ్ త్వరగా పిలవండి డాక్టరు గారిని"

"రాఘవ గారు మీరు ఆపదలో వస్తే స్పీచ్ ఇస్తున్నామని అనుకోకండి. ఆ రోజు మా బావగారు - అదే రావుగారు పేషెంట్‌ని డబ్బులు అడక్కుండానే అతను బలవంతంగా చేతిలో పెట్టడం, వెంటనే మీరు రావడం ఫినాప్తలీన్ రాసిన నోట్లు పట్టుకుని నేరస్థుడిగా ముద్ర వేయడం జరిగింది కదా. ఆ నోట్లు ఆయనంటే గిట్టని వాళ్ళు చేతిలో పెట్టారు."

"నిజమండీ హాస్పిటల్‌లోని వారు వచ్చి చెబితే మేము ఇచ్చాము వాటిని."

"కాని అసలు డాక్టరుగారు డబ్బు పేషెంట్‌ని అడిగారా, లేదా అని గమనించారా? అందరూ మీలాగే ఆత్రుతపడో, అవసరం కొద్దో డాక్టర్‌ని డబ్బుతో కొనాలనుకుంటారు. హాస్పిటల్‌లో బ్లడ్‌లేకో, బెడ్ లేకోమరే కారణంతోనో ఆపరేషన్ పోస్ట్‌ఫోన్ అయితే డాక్టర్‌కి డబ్బు ఇవ్వలేనందువల్ల అనుకుంటారుగా. అసలు సంగతి గ్రహించరెందుకు?"

"అయితే ప్రభుత్వ ఆసుపత్రిలో డబ్బులు తీసుకునే వారు లేరంటారా?"

"ఈ దేశంలో పుట్టిన వాణ్ని లేరని ఎలా అనుకుంటాను? మీరు ఏనుగులను మానేసి ఎలుకలను పడుతున్నారు. డబ్బు తీసుకోకపోతే డాక్టరు తమని సరిగా చూడలేదనే అపోహ ప్రజల్లో ఉంటుంది. ఆ కారణం మీరాలోచించారా? నిజంగా రావుగారు అంతే సంపాదించి ఉంటే ఈ రోజుల్లో నా దగ్గర ఉండవలసిన అవసరం లేదు.

అంతలో పాప పరుగున వచ్చి "మామయ్యా! పూలదండ కొనివ్వవూ?" అని అడిగేసింది.

"అలాగే తల్లీ నీ వెళ్ళి చదువుకో" అని "ఆ అమ్మాయి నా చెల్లెలు కూతురు. మీరు నాకో సహాయం చేయండి. రావు గారిని పిలుస్తాను. ఒక పూల దండ తెప్పించండి."

వెంటనే రాఘవ ఆ పని మరొకరికి అప్పజెప్పాడు. మూర్తి లోపలకు వెళ్ళి రావుగారిని పిలవనందుకు అసహనంగా ఉంది. అయినా అవసరం అతనిది.

"చూడండి రాఘవగారూ - మీరు అవినీతిపరుల్ని పట్టుకున్నందుకు అబినందిస్తాను. కానీ ఇలా బలవంతంగా కక్ష కొద్దీ చేతిలో పెట్టి పట్టించిన వారిని కాదండీ వారి మీద నిందారోపణలు చేయకండి. డబ్బుల కోసం పీడించే వాళ్ళుంటారు. మీకు చేతనైతే వాళ్ళు అన్ని రంగాలలోనూ ఉన్నారు. వారిని శిక్షించండి. ఏ ప్రొఫెషనల్ జెలసీతోనో, ఏ పేషెంటైనా కోపంతోనో డాక్టరు మీద నిందారోపణలు చేస్తే గుడ్డిగా నమ్మేయకండి. ఆ అన్నట్లు నా స్పీచ్ అంతా దండుగ అనుకుంటాను. ప్రస్తుతం



మీరు ఆ డిపార్ట్‌మెంట్‌లో లేరు కదూ." అన్నాడు.

"అవునండీ. అయినా రావు గారి కేసు విషయంలో తప్పక గెలిపిస్తాను. నా తప్పు నేను ఒప్పుకుంటాను" అన్నాడు దృఢంగా.

ఇంతలో పూలు వచ్చాయి.

అవి మూర్తికి ఇవ్వబోతే - "ఇలా రండి" అంటూ లోపలకు తీసుకువెళ్ళి - "అదిగో రావు గారి ఫోటో. దానికి వేయండి. ఆ రోజు అన్యాయంగా మీ ద్వారా పేషెంట్ చేసిన పనికి - ఆ నిందకు తట్టుకోలేక హార్ట్ ఎటాక్‌తో పోయాడు మా బావ. సారీ మిమ్మల్ని చాలాసేపు కూర్చోబెట్టాను. మీ అబ్బాయిని తీసుకుని హాస్పిటల్‌కు పదండి. నేనూ న్యూరోలో ఎమ్.ఎస్. తీసుకున్నాను. ఈ కేసు నేనూ చూడగలను." అన్నాడు డాక్టర్ మూర్తి.

రాఘవ హతాశుడై రావు గారి ఫోటో వైపు చూస్తూ ఉండిపోయాడు.

(ప్రభ, 04-01-89)

☆ ☆ ☆

# సంక్రాంతి బహుమతి

"అన్నయ్యా!"

"ఏమిటమ్మా!"

"మరి... మరి..."

"ఊ చెప్పు"

"అలా మరి, మరి అంటే నాకెలా తెలుస్తుంది."

"నా కోరిక తీరుస్తావా?"

"తప్పకుండా. ఏమిటది. పండుగకు పట్టుచీరె కావాలా? బావగారికి మంచి బహుమతే ఇస్తాంలే. మొదటి పండుగ కదూ!"

"మరి ఏమిటమ్మా బావగారు ఊరిలో లేరా, నీవు ఒక్కదానివే వచ్చావు వచ్చి ఎంత సేపైంది."

"ఒక్కతినే వచ్చాను. ఎంత దూరం సామర్లకోట కాకినాడ, పదకొండు మైళ్లేగా. నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని ఒక్కతినే వచ్చాను. మరలా వెళ్ళిపోతాను."

"నిన్ను నేను దించుతానులే, స్కూటర్ మీద. అసలు సంగతి చెప్పు"

"నీవు ఈసారి పండుగకు మీ అత్తవారింటికి వెళ్లకు"

"అదేం. నీకు మీ వదిన సాయం, నీ భర్తకు నా సహవాసం కావాలా? అలాగేలే వెళ్లను."

"నా వుద్దేశ్యం అదికాదు. మా ఇద్దరికీ ఎవరితోడు అవసరం లేదు. మేము అస్తమానూ, వస్తూ పోతూనే వున్నాం."

"మరైతే ఎందుకు మేము ఎందుకు వెళ్లవద్దు. మా మామగారు మమ్మల్ని తీసికెళ్లడానికి వస్తామన్నారు. రమ్మన్నాము."

"క్రిందటి సంవత్సరం నీకేం ఇచ్చారు బహుమతి."

"నీకు తెలుసుగా, స్కూటర్. ఈ సంవత్సరం బహుశా బట్టలు, ఉంగరం ఇస్తారేమో, మీ వదిన చూచాయగా అంది."

"మరి మీ బావగారికి నీవేం ఇవ్వదలుచుకున్నావు. మొదటి పండుగ కదా, మీకు ఇది పెళ్లయిన తర్వాత"

"నీకు తెలుసుగా తల్లీ, నా స్కూటర్ అమ్మకానికి పెట్టి కొత్తది కొనిస్తానన్నానుగా" అమ్మ నాన్న కూడా అదే సలహా ఇచ్చారు"

"వదిన బాధపడదా? మరి"

"ఇవ్వకపోతే మీ ఆయన అలగరా. నా దగ్గర బాంక్ బేలన్స్ ఏమీలేదని నీకూ తెలుసుగా. నీ పెళ్లికి చేసిన అప్పుల సంగతి అవి తీరని సంగతీ నీకు తెలుసు. స్కూటర్ అమ్మడం తప్పనిసరి."

"అది తప్పు అంటున్నాను."

"మరెలా ఈ గండం గట్టెక్కడం."

"ఆ గండం సంగతి నాకు వదిలెయ్యి. మా ఆయన్ను నేను ఎలాగో మేనేజ్ చేస్తాను, పండక్కి రాకుండా. నీవు మాత్రం మీ అత్తవారింటికి పండుగకు వెళ్లవద్దు. తరువాత ఎప్పుడైనా మామూలుగా, ఆ యింటి మనిషిగా వెళ్లు. అల్లుడిగా వెళ్లకు."

"దాని వలన ఉపయోగం ఏమిటి."

"ఇదిగో ఈ గొలుసు చూడు. మా పక్కింటి ఆవిడది. ఆవిడది మీ అత్తగారి ఊరేకదూ, మీ అత్తగారు అల్లుడికి కూతురికి సంక్రాంతికి బట్టలు, బంగారం కొనడానికి చేతిలో డబ్బుల్లేక గొలుసు అమ్మేస్తుంటే మా పక్కింటావిడ కొనుక్కుందట."

"నిజంగా!"

"అవును. నిజమే. అందుకే నీవు పండక్కి వెళ్లకు. స్కూటర్ అమ్మకు. మా అన్నయ్య వెళ్ల లేదు కదా. మనమూ వెళ్లవద్దు. మనింట్లోనే హాయిగా పండుగ చేసుకొందాం అని నేను నచ్చజెపుతాను మీ బావగారికి. నీవు వెళ్లావంటే ఆయన్ను ఒప్పించలేను. మీ అన్నయ్య వెళ్లలేదా. అంటారు. ఎందుకన్నయ్యా అప్పులు చేసి కట్నాలు ఇచ్చి పెళ్లిళ్లు చేసింది చాలక ఇలా పండుగల పేరుతో మరింత అప్పుల పాలవ్వడం. ఇదిగో ఈ గొలుసు ఆవిడ దగ్గర నేను కొన్నాను. పండుగకు వదినకు బహుమతి ఇవ్వు. మీరు ఇక్కడే ఉండండి."

"మీ వారు, అదే బావగారు ఏమీ అనుకోరుగా."

"ఏమైనా అనుకున్నా పట్టించుకోవద్దు. అయినా నేను సర్దిచెబుతానులే అన్నయ్యా! మనకు స్వాతంత్ర్యం రావడానికి మనం ఇంగ్లీషు వాళ్లను వెళ్లగొట్టడానికి ఎంతో కష్టపడ్డాం. ఎందరో ప్రాణాలు కోల్పోయారు. ఇప్పుడు దేశంలోని అవినీతిని అప్పుల పాలుచేసే ఆచారాలను మనదేశం నుండి వెళ్లగొట్టడానికి మనం నడుంకడితే తప్పక సాధించగలం.

"ఇంగ్లీషువారు పరాయిదేశం నుండి వచ్చారు కాబట్టి, ఎలాగోలా వెళ్లగొట్టాం. కాని అవినీతికి ఇలాంటి ఆచారాలకు, సతీసహగమనం లాంటి, క్రూరత్వాలకు మనదేశమే పుట్టిల్లు. వాటిని ఎక్కడకు వెళ్లగొడతాం."

"అయితే ఎక్కడికీ వెళ్లగొట్టవద్దు. అవి ఎక్కడకు వెళ్లినా ప్రమాదమే. అందుకే వేళ్లతో సహా నరికేసి, ఆ దురాచారాలను మంటబెడదాం. ముందు మనం అడుగులువేస్తే వాటి వెనుక మరో రెండు, పది అలా వందలు, వేలు అడుగులు పడతాయి. ఏమంటావు."

"ఏమంటాను చెల్లీ నాకంటే చిన్నదానివి, ఆడదానివి, నీకులేని ఆటంకం నాకేమిటి? అలాగే కానిద్దాం. అదే మనకు సంక్రాంతి బహుమతి" అన్నాచెల్లెళ్లిద్దరూ చేతులు కలిపారు.

(ప్రభ, 31-12-87)

☆ ☆ ☆

# సన్‌ఫ్లవర్

కాలింగ్‌బెల్ మోగింది. వంటగదిలో పనిలో ఉన్న అనూష వచ్చి తలుపు తీసింది. సంతోషంతో 'ఓ, మీరా రండి. రండి' అంది.

"అరె నా పేరెలా తెలుసు మీకు? నిన్ననేగా మన పరిచయం బీచ్‌లో జరిగింది! నా పేరు మీరడగలేదు. మీ పేరు నే నడగలేదు. నా పేరు సమీర. అందరూ మీర అంటారు" అంది నవ్వుతూ.

"బావుంది. లోపలికి రండి" అనూష అంది.

"ఏమిటి బావుంది. నా చీరా? అబ్బే దీనికి చిరుగులేమీ లేవండి. నేను చిరుగులను జాగ్రత్తగా కుచ్చిళ్ళలో దాచేసి దోపేయలేదు. ఇది కొత్త చీరే" సమీర అంది.

నవ్వింది అనూష.

"కూర్చోండి" కుర్చీ చూపిస్తూ అంది అనూష. అక్కడ రెండు కుర్చీలు, చిన్న మోడా ఉన్నాయి. అనూష మోడాపైన కూర్చోబోతూ "కూర్చోండి. సమీరా" అంది.

"నేను లావుగా ఉన్న మాట నిజమే కాని, నాకు ఒక కుర్చీ చాలండి. మీరు ఆ చిన్న మోడా మీద కూర్చుని అవస్థ పడడం ఎందుకు ఈ కుర్చీమీద కూర్చోండి" అంటూ మరో కుర్చీ చూపించింది అనూషకు.

అనూష నవ్వుతూ సమీర పక్కన కూర్చుంది. ఇద్దరూ కబుర్లు మొదలుపెట్టారు.

"నిన్న బీచ్‌లో మీ పక్కన కూర్చున్నావిడ ఎవరు?" అనూష అడిగింది.

'ఓ ఆవిడా, అదే నల్లగా, ఎత్తుపళ్ళతో, పొట్టిగా ఉంది" నవ్వు పళ్ళబిగువున పెట్టి అంది సమీర.

ఎదుటివారి అందాన్ని అలా హేళన చేసి మాట్లాడడం విచిత్రం అనిపించింది అనూషకు.

ఆమె మనసు గ్రహించి సమీర - "నా మాటలు వేరుగా తలచకండి. అలా ఎందుకన్నాను అంటే, ఆవిడకు తను కాలేజీ బ్యూటీ నని గర్వం ఎక్కువ" అంది.

ఈసారి అనూష ఆశ్చర్యపోయింది - "నిజంగా?" అంది.

"అవును. నిజంగానే. ఆవిడ చాలాకాలం క్రితం ఇంజనీరింగు చదివింది. అప్పుడు లేడీస్ చాలా తక్కువమంది ఉండేవారు కదా! ఇంజనీరింగ్ కాలేజీలో ఇద్దరే ఆడవాళ్ళు ఉండేవారట. ఆ ఇద్దరిలో ఒకావిడకు బొల్లి ఉండడంతో, ఈవిడే కాలేజీ బ్యూటీ నని మురిసిపోయేదట."

ఈసారి అనూష నవ్వకుండా ఉండలేకపోయింది.

"మీరు చాలా సరదాగా మాట్లాడతారు. మీ ఇంట్లో వాళ్ళు అదృష్టవంతులు. ఎప్పుడూ ఇలా నవ్విస్తూ ఉంటారా? మీ ఇంట్లో ఎవరెవరు ఉంటారు?"

"మా ఇంట్లోనా? నాతో, నేను మాట్లాడేది వినిపించుకోకుండా తనకు తానే వాగేది రేడియో. నేను రింగ్ చేయకుండానే దానికి అదే మోగేది ఫోను. ఈ రెండింటితో పాటు నాకున్న తోడు టీ.వీ. నేను దానివైపు, అది నావైపు చూస్తూ ఉంటాం. అది ఆన్‌లో ఉన్నప్పుడల్లా."

"అయితే మీ ఇంట్లో మీ రొక్కరే ఉంటారన్న మాట."

"అరే. నేను అలా చెప్పలేదే. మా వారు కూడా ఉంటారు. ఆయన అప్పుడప్పుడు ఆ, ఊ - అని కూడా అంటుంటారు."

"అయితే ఆయనకు మౌనం ఇష్టమన్నమాట."

"అవును. మాట్లాడాలంటే కష్టం ఆయనకు."

ఇద్దరూ కాఫీలు తాగి అలా తోటలోకి వచ్చారు. అనూష వాళ్ళిల్లు సముద్రపు ఒడ్డున ఉండడంతో చాలా అందంగా సముద్రం కనబడుతూంది. కెరటాలు ఎక్కడికో వెళ్ళాలనెగసిపడుతున్నాయి. తమలో తామే గంతులేస్తున్నాయి.

"మీకు సన్‌ఫ్లవర్ అంటే ఇష్టమా. చాలా చెట్లు పెంచారే?" సమీర అడిగింది.

'అవును, పెళ్ళయిన ప్రతి స్త్రీ తన ఇంట్లో ఒక పొద్దుతిరుగుడు చెట్టు వేసికొని దాన్ని చూస్తూ మగవాడి నీతిని దానికి అన్వయించుకోవాలని నేనంటాను" ఆవేదనగా అంది అనూష.

ఆమె భావం సమీరకు అర్థం అయింది. అనూష తన భర్తకు విడాకు లివ్వాలని అనుకుంటోందని వింది. అనూష భర్త ఈమధ్య ఎవరిమీదో మనసుపడ్డాడని, అందుకే ఆమె భర్తతో తెగతెంపులు చేసుకోవాలని అనుకుంటుందని గ్రహించి, ఆమె దగ్గరకు వచ్చింది. కాని అనూషకు తెలియదు. తన భర్త మోజుపడేది సమీర మీదేనని.

"ఎందుకు అలా అంటున్నారు?" సమీర అడిగింది.

"నాభర్త నేను ప్రేమ వివాహం చేసుకున్నాం. ఆ ప్రేమ ఒక సంవత్సరం మాత్రమే ఉంది. ఆ తరువాత నేను పాతబడిపోయాను."

"నా స్నేహితురాలు ఒకామె ఉండేది. ఆమె చెప్పింది. తను వంట సరిగా చేయక, ఇల్లు నీట్‌గా పెట్టక బద్దకంగా ఉండేదట. దానితో ఆమె భర్త ఇల్లు చక్కగా పెట్టుకొని, వంట బాగా చేసే మరో ఆడదాని వెనుక పడ్డాడట. అందుకు భిన్నంగా నేను ఇంటిని

సర్దడం, వంటను చేయడం మొదలుపెట్టాను. దానితో నాకు ఎక్కువ తీరిక దొరికేది కాదు. ఎంతసేపు పనిలోనే శ్రద్ధ చూపించేదాన్ని. ఆయన నా పనికి, వంటకు ముచ్చటపడిపోయి, నా కొంగు పట్టుకుని వేలాడతారనుకున్నాను కాని మావారు ఖాళీగా ఉండి, చక్కగా గోళ్ళు పెంచుకొని, వాటికి రంగు వేసుకొని, ఎప్పుడూ ట్రిమ్‌గా కనబడే ఆడవాళ్ళంటే ఇష్టపడుతున్నారు. వాళ్ళ ఆఫీసులోనే పెళ్ళయిన ఒకావిడ అంటే ఇష్టపడుతున్నారని కూడా తెలిసింది. అసలు మగవాడికి కావలసింది మార్పుగాని, ఆడదాని ఓర్పు కాదు."

"అవతల ఆవిడకు ఇష్టమో, కాదో తెలుసుకున్నారా?"

"ఉహూ. నాకు అంత ఓపిక, తీరిక లేవు. నా భర్త నన్ను ఇష్టపడడం లేదంటే, ఆయన్ను పట్టుకుని వేలాడేంత తెలివితక్కువదాన్ని కాదు. ఏదో చదువుకున్నాను. నా కాళ్ళమీద నేను నిలబడగలను."

"నా స్నేహితురాలు ఒకామె ఇలాగే భర్త ఆకతాయి పనులు భరించలేక, ఆ ఇంట తనకు విలువలేదని భర్తకు దూరంగా వెళ్ళిపోయింది. చుట్టూ ఉన్న సమాజం ఆమెను రాబందుల్లా మాటలతో పీక్కుతినేసరికి, భర్త దగ్గరే నయం అనుకొని భర్త దగ్గరకు వెళ్ళిపోయింది."

"భర్త మరో ఆడదాని వెంట పడుతుంటే అది ఆకతాయితనమా?" ఆశ్చర్యంగా అడిగింది అనూష.

"అనూషా! ఈ సన్‌ఫ్లవర్ చూడు, తనున్న నేలను, చెట్టును మరచి ఆ సూర్యుడివైపు ఎలా తిరుగుతుందో. సూర్యుడున్నంతసేపూ అలా తిరుగుతుంది. దానికి అదో భ్రమ అంతే. చివరికి ఆ సూర్యుణ్ణి అందుకోనూలేదు. నేలను విడిచి వెళ్ళనూ లేదు. అయినప్పటికి అలా చూడడంలో అదో ఆనందం అంతే."

"అయితే, దానికీ-దీనికీ సంబంధం ఏమిటి?"

"మగవాడూ అంతే. తనున్న ఇల్లు, సంసారం విడిచి తాను వెళ్ళలేకపోయినా, పొద్దుతిరుగుడు పువ్వు సూర్యుడివైపు తిరిగినట్లే తానూ ఎదుటివారిని ఆకర్షణతో చూస్తాడు. కాని అవతలవారు అంత తేలికగా అందిపోతారా, లొంగిపోతారా? అవతలి స్త్రీలకు మాత్రం నీతి, నియమాలు ఉండవా? సన్‌ఫ్లవర్ నేలను, ఆకులను, కొమ్మలను విడిచి సూర్యుణ్ణి ఎలా చేరుకోలేదో, ఆ చెట్టు నుంచి తెగిపోతే ఎలా బ్రతకలేదో, అలాగే మగవాడూను. సంసార బంధంలో నుండి అంత త్వరగా బయటపడలేడు."

"ఏమో, నేను అంత దూరం ఆలోచించలేదు. నన్ను నిర్లక్ష్యం చేస్తున్నారనే భ్రమ పడుతున్నాను."

"నీవైపు ఎవరైనా మరో మగవాడు ఆకర్షితుడైతే అది అతని తప్పుగాని, నీది కాదుగా? మగవాడి మనస్తత్వమే అంత. చూపులతోనే మరో ఆడదాన్ని తినేయాలి అనే చిన్న కోరిక. కాని ఎదుటి స్త్రీలను మనం తక్కువ అంచనా వేయకూడదు. వాళ్ళూ అంత త్వరగా లొంగిపోరు." అంది.

"నిజమే చాలా బాగా చెప్పారు సమీరా? నిజంగా నా మనసులో బాధ తీసేశారు. ఇంకెప్పుడూ జీవితంలో నిరాశకు తావివ్వను. నా భర్తలో ఆ చిన్న విషయం తీసేస్తే మరో లోపం లేదు. మీకు చాలా థాంక్స్ మాటలతో బాధ పోగొట్టినందుకు" అంది.

"థాంక్స్ మీకే. అంత త్వరగా నన్ను అర్థం చేసుకున్నందుకు" అని అసలు విషయం చెప్పేసింది సమీర.

అనూష తేలిగ్గా గాలి పీల్చుకుంది.

(ప్రభ, 10-08-89)

☆ ☆ ☆

# ఉగాది శుభాకాంక్షలు

ఆకాశవాణి వార్తలు చదువుతున్నది అబద్దాల సత్యమూర్తి.

భారతదేశం కొత్త గ్రహాన్ని ప్రయోగించింది. ఈ గ్రహాన్ని కొత్త ప్రయోజనాలకోసం ప్రయోగించామని దీనిపేరు అత్తింటివారిని పీడించుకుతినే అల్లుడికి పెట్టిన 'దశమ గ్రహం' అనే పేరుకాదని, ధరల గ్రహమని, ప్రజలకు అందకుండా, చంద్ర మండలం దాటి సూర్యమండలంవైపు పయనిస్తున్న ధరలను అది పట్టి రాకెట్‌లో భూమిమీదకు తిరిగి తీసుకొనివచ్చే ప్రయత్నమని శాస్త్రజ్ఞులు చెప్పారు.

ఈ సంవత్సరం, ప్రపంచంలో అందరికంటే అతి తక్కువ హత్యలు, అనగా యాభై హత్యలను, నలభై దారిదోపిడీలు, ఇరవై అయిదు అఘాయిత్యాలు మాత్రమే చేసిన నరహంతకరావుకి నోబెల్ బహుమతి ఇచ్చారు. ఇతనికి 'శాంతి ఖడ్గ' అనే కత్తిని బహుకరించారు. ఇటీవల హైదరాబాద్‌లో ప్రపంచ శాంతికై ప్రార్థనలు జరుపుతున్న తరుణంలో ఈ సంఘ సభ్యులలో వారిలో వారికి బేధాభిప్రాయాలు వచ్చి జరిగిన కొట్లాటలో పదిమంది మరణించారు. పదిహేనుమంది గాయలతో హాస్పిటల్‌లో వున్నారు. ఆ ప్రదేశంలో రక్తం కాలువలే కాక వరదలైకూడా ప్రవహించింది.

నిన్నరాత్రి అమలాపురంలో రైలు, విమానం గుద్దుకోగా జరిగిన ప్రమాదంలో ఎవరూ మరణించలేనందుకు రోడ్డు రవాణాశాఖమంత్రి ఎంతో ఆశ్చర్యాన్ని వెలిబుచ్చి అంత పెద్ద ప్రమాదం జరిగినా, ప్రాణ నష్టం లేనందుకు ఎంతగానో విచారించారు. ఇలా జరగడం భారతదేశ చరిత్రలోనే ప్రథమం అని ఆవేదన చెందారు. ప్రాణ నష్టం జరగకుండా జనాభా సమస్య తీరనందున తాను రాజీనామా చేస్తానని వాపోయారు.

రేషన్ బియ్యంలోను, మామూలు బియ్యంలోనూ కూడా ఎక్కువ రాళ్ళుండడం, ఇటీవల గమనిస్తున్నామని, దానికి పరిష్కారం కనుగొన్నానని, బియ్యంలో రాళ్ళకు బదులు బియ్యాన్ని ఏరుకుని ఆనందంగా అన్నం వండుకోమని వ్యవసాయ శాఖామంత్రి ప్రజలకు విజ్ఞప్తి చేసారు. ఇదే పూర్వం రోజుల్లో అయితే సతీఅనసూయలు రాళ్లను బియ్యంలాగ మార్చి మరీ వంట చేసుకునేవారని, ఈ కాలంలో సతీ అనసూయలు కరువైన కారణంగా రాళ్లల్లో బియ్యం ఏరుకోవడం తప్పనిసరి అయిపోతుందని లేదంటే అసలు ఈ సమస్యే ఉద్భవించేది కాదని ఆయన కుమిలిపోయారు. బాధతో కూలిపోయారు.

రాష్ట్రంలో ఆఫీసులలో 'వర్క్ టు రూల్' ప్రవేశపెట్టిన కారణంగా, ఉద్యోగస్థులు చాలా నష్టపోతున్నారని, అయినప్పటికి తాను పదవిలో ఉండగా ఎవరూ చింతించవలసిన

అవసరం లేదని, అంతగా అయితే రోజుని ఇరవై నాలుగు గంటలనుండి, ఇరవై ఆరు గంటలు ప్రపంచ వ్యాప్తంగా చేయిస్తానని ముఖ్యమంత్రి అభయహస్తం ఇచ్చారు.

ఈ మధ్య హైదరాబాద్‌లో జరిగిన తెలుగు గోల మీటింగ్లో తప్పట్లు మారుమ్రోగడానికి కారణం ఆ ప్రసంగాలు, రాష్ట్ర పురోభివృద్ధి ఎంత మాత్రంకాదని, రాష్ట్రంలో దోమలు ఎక్కువైన కారణంగా ఆ మీటింగ్‌కు ఎక్కువ సంఖ్యలో అవి హాజరుకావడంవలన ప్రజలు వాటిని చంపుతూ చేసిన శబ్దాలని, అవి తప్పట్లు కావని ప్రజలు గ్రహించాలని ప్రతిపక్షాలన్నీ ఏక కంఠంతో విన్నవించాయి. అంతేకాదు ఈ సారి మీటింగ్‌లలోకి దోమలను రాకుండా చేయాలని, అప్పుడు నిజంగా అవి తప్పట్లో కాదో నిర్ణయించి ఆ తరువాత 'తెలుగు గోల' గర్వించాలని వారు కోరారు.

క్రిందటి నెల 'పరుగుల రాణి' పి.టి.ఉషను ఇంటర్వ్యూ చేసిన పిదప కొన్ని ఆశ్చర్యకరమైన విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఉషది, పూర్వం ఆంధ్రదేశమేనని, ఆవిడ చిన్నప్పుడు చాలాసార్లు ఉగాది పచ్చడికి జడిసి, అది తినకుండా ఇంట్లోనుండి పరుగుపెట్టి పెట్టి అలాగే రన్నింగ్ ప్రాక్టీస్ చేసానని కేవలం ఉగాది పచ్చడి మూలంగా తాను ప్రపంచ చరిత్రకెక్కానని ఆవిడ వక్కాణించారు. అందుకే ఉష ప్రతిరోజూ తన ప్రఖ్యాతికి గుర్తుగా ఉగాది పచ్చడి తింటారట. 'వేప పువ్వు దొరకని రోజులలో ఏం చేస్తారు?' అని విలేఖరులు అడిగిన ప్రశ్నకు సమాధానంగా 'ప్లాస్టిక్ వేపపువ్వులు వాడతాను' అని ఆవిడ చెప్పారు.

నిన్న ఆహారశాఖా మంత్రి మాట్లాడుతూ తనను యుద్ధం దగ్గరకి పంపించి వేయవలసిందిగా కోరారు. తాను ఆహారమంత్రిగా ఉన్నందువలన ప్రజలకు తిండి అందుబాటులో నుండుటలేదని అందుకే యుద్ధశాఖామంత్రిగా తనను నియమిస్తే అసలు యుద్ధమనేదే వుండదని ప్రధానిని ఆయన అడిగారు.

కుటుంబ నియంత్రణశాఖవారు 'భార్యా భర్తల్లో ఒకరు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుంటే ఒక అప్పడాలకర్రను, ఇద్దరూ చేయించుకుంటే రెండు కర్రలను బహుమతిగా ఇస్తామ'ని ప్రకటించారు.

కొద్దికాలం క్రితం ప్రవేశపెట్టిన వితంతువుల పింఛను వలన మగవారు, ఆడవారికి ఆస్తిహక్కు వలన ఆడవారు ఎక్కువగా మరణిస్తున్నందుకు తానేమీ బాధపడడం లేదని ఆ రెండుమార్గాలవలన ఫామిలీ ప్లానింగ్ ఎంతో అభివృద్ధి చెందుతుందని చీఫ్ మినిస్టర్ తెలియజేశారు.

మనదేశంలో పెట్రోలు ధర విపరీతంగా పెరిగినందున కార్లు, స్కూటర్లు అమ్మజూపినా ఎవరూ కొననందున ఎడ్లబండ్ల, గుర్రపుబండ్ల ఉత్పత్తి పెరిగింది. వాహనాలు కలవారు, తమ వెహికల్స్‌ను ఆ బండ్లకు కట్టి ప్రయాణం సాగిస్తున్నారు.

సంక్రాంతికి ముగ్గులు పెడుతూ వెళ్ళిన తమ భార్యలు ఉగాదికి తిరిగి వచ్చేసారని, వారి భర్తలు ఎంతో దు:ఖించారు. చాలాకాలంగా మనదేశంలో జరుగుతున్న క్రికెట్‌ను ఎంతో ఆసక్తిగా, ఆనందంగా వీక్షిస్తున్నానని, తరుచుగా భారతదేశం ఓడిపోవడం గమనిస్తున్నానని, దీనికి కారణం అందరూ కలసి ఒకే బంతి కోసం తన్నుకోవడమే కారణమని, కావున క్రికెట్ ప్లేయర్స్‌కి అందరికీ అన్ని బంతులు సప్లయ్ చేసిన ఎడల ఇటువంటి అవాంఛనీయమైన సంఘటనలు ఆపవచ్చని రాష్ట్ర క్రీడా మంత్రి ఉద్ఘాటించారు. వాతావరణం - ఆంధ్రరాష్ట్రంలో తరుచుగా తుఫానులు వచ్చి పంటలు పాడైపోవడానికి కారణం తాను ఎంతమాత్రమూ కాదని, అది కేంద్రం కుట్ర అని ఇప్పటికైనా ప్రజలు అది గ్రహించి, ఇటు తుఫానులమీద, అటు కేంద్రంమీద తిరగబడాలని ముఖ్యమంత్రి ప్రజలను, ఆడపడుచులను కోరారు.

ఈ సంవత్సరం వేపపూత సరిగా పూయకపోవడానికి కారణం కూడా తాను కానని, సోనియాగాంధీ కోపానికి వేపచెట్లు గురై పూత పూయడం మానడం వలన ఉగాది పచ్చడిలో వేపపూత తక్కువైందని ఆయన వాపోయారు.

ఉగాది సందర్భంగా "మనం ఆంధ్రులం ఈ మార్చి పద్దెనిమిదిన చేసుకుంటున్న తెలుగు ఉగాది పండుగ విషయం ఆంధ్రదేశంలో రహస్యంగా ఉంచాలని, లేదంటే పాకిస్తాన్ మనపై దండెత్తే అవకాశం వుందని' రాష్ట్ర ముఖ్యమంత్రి ఆంధ్రులకు తెలుగు శుభాకాంక్షలు అందిస్తూ ఉర్దూలో బోరుదర్శన్‌లో ప్రసంగించారు.

ఇప్పుడే అందినవార్త ఈ సంవత్సరం ఉగాది పచ్చడి తిని మరణించినవారిసంఖ్య పదిహేను, మతి తప్పినవారి సంఖ్య ఇరవై ఆరు, సన్యాసులలో కలసిపోయినవారి లెక్క ఇంకనూ తేలలేదు. అది వందలలోనుండవచ్చునని అంచనా.

వార్తలు ఇంతటితో సమాప్తం. ఇంతవరకూ ఈ వార్తలు విని ఇంకా క్షేమంగా మిగిలివున్నవారికి ఉగాది శుభాకాంక్షలు.

(ఆంధ్రభూమి డైలీ, 10-08-89)

☆ ☆ ☆

# రీ-సెర్చ్

యూనివర్శిటీ విజ్ఞాన ఖనిలా వెలిగిపోతుంది. అక్కడనుండి డిగ్రీలతో బయటకు అడుగుపెట్టే ఒక్కో స్టూడెంటు ఒక్కోలైటు కాగా సూర్యుని వెలుతురు, విజ్ఞానపు వెలుతురు విళితమై అమితమైన శోభగా కనిపిస్తుంది ఆ విద్యార్థులు చదివే చదువు ఆ గోడలకు కూడా వంట బట్టేసినట్లుగా ఠీవిగా ఉంటాయి అవి. విద్యార్థుల గోడు కూడా చాల ఉంటుంది అక్కడ.

అలాంటి గొడవలున్న ప్రొఫెసరుగారి దగ్గరకే స్టూడెంటుగా వచ్చింది వారుణి. గుప్తుల కాలం స్వర్ణయుగం అన్న పదాన్ని పట్టుకొని అసలు స్వర్ణయుగంలో మనుషులు బ్రతకాలంటే దేశంలో పరిస్థితులు ఎలా ఉండాలి. మనం కూడా ఈ యుగాన్ని స్వర్ణయుగం ఎందుకు చేసికోరాదు. అది మనుషుల చేతిలోనే ఉంది కదా అనుకుంటూ, అప్పటి పూర్వాపరాల పరిశీలించాలని రీసెర్చిలో చేరింది వారుణి. మధ్యలో'రు' అన్న అక్షరం తీసేస్తే ఆమె నిజంగా చదువుల వాణి. చాలా తెలివైనది, చురుకైనది. అందంలో మెరుపులాంటిది.

వారుణిని ప్రొఫెసర్ రావుగారు ఆదరంగానే ఆహ్వానించారు. ఆయన గురించి అందరూ చాల హెచ్చరికలు చేసారు వారుణికి. ఆయనకు అమ్మాయిల పిచ్చని, గురుదక్షిణగా శీలం ఇచ్చుకుంటేనే గాని కుదరదని, కలంతో ఎన్ని తెలివి తేటలు చూపించినా ఫలితం ఉండదని ఏవోవో చెప్పారు. భయంకంటే ధైర్యం అనే ఆయుధాన్ని ఆడది ధరించాలని వారుణి ఉద్దేశ్యం అందుకే పెద్దగా భయపడలేదు.

రావుగారు చాలా తెలివైన వారని, డిగ్రీల తెలివి కాక ఒరిజినల్‌గానే విజ్ఞానవంతులని మొదట్లోనే గ్రహించింది వారుణి. తన కంటే ముందు రీసెర్చిలో జాయిన్ అయిన అమ్మాయిని ఒకరోజు బలవంతంగా అనుభవిస్తే ఆ అమ్మాయి ఇంక ఆ అవమానం తట్టుకోలేక వెళ్ళిపోయిందట. పేరు సరళట. మరొక అమ్మాయిని తనకు లొంగితేగాని డిగ్రీ ఇవ్వనని బెదిరిస్తే ఆత్మహత్యా ప్రయత్నం చేసి ఎలాగో బ్రతికి బయటపడిందట. డిగ్రీలు ప్రొఫెసర్ల చేతిలో ఉన్నంతమాత్రాన స్టూడెంట్లను కీలుబొమ్మలను చేయడం న్యాయమేనా అని ఆలోచించసాగింది వారుణి. తనకంటే మందు జాయిన్ అయిన సంతోష్‌ని రావుగారు చులకనగా చూడడం గమనించకపోలేదు వారుణి. దానికి కారణం కూడా గ్రహించింది. అతను తక్కువ కులానికి చెందినవాడు కావడమే విజ్ఞానం అందించడంలో కూడా ఈ తేడాలా అనుకుంది.

ఆరోజు ఇంటికెళుతూ బస్‌స్టాప్‌లో చూసికొంది వారుణి. తను రావుగారి రూమ్‌లో ఇంటితాళం చెవి మరచిపోయినట్లు. ఇంట్లో అందరూ మేట్నీకి వెళతామంటే

తాను డూప్లికేట్ తాళం చెవి తెచ్చుకుంది. టేబుల్ మీద కూర్చుని ఏవో ఇంపార్టెంట్ పాయింట్స్ రాసుకుంటూ ఫేన్ గాలికి కాగితాలు ఎగిరిపోతున్నాయని పర్స్ తాళాలగుత్తితీసి పేపర్స్ మీద పెట్టింది. దీక్షగా వ్రాసుకుంటున్న ఆమెనే గమనించిన రావుగారు ఆమె తాళాల కోసం అక్కడే వెతకాలని అవి దాచినట్లు గమనించనే లేదు. సిటీబస్ దాటిపోతే మరొకటి మరో గంటవరకూ లేదనే ఆదుర్దాలో వాటి సంగతి మరచే పోయింది.

ఏం వారుణి మరలా వచ్చావేం అని పలకరించారు రావుగారు. అక్కడే కూర్చొని వెనక్కు వచ్చిన వారుణిని. ఇంటి తాళాలు మరచిపోయానండి' అంది. ఆయన ఒంటరిగానున్నారు ఆ గదిలో. కంగారుగా టేబుల్ అంతా వెతికింది. అవి దొరకలేదు. అయ్యో లేవండి మాస్టారు! ఇక్కడే పెట్టాను' అంది ఆందోళన కప్పిపుచ్చుకొని.

రీసెర్చిస్తూండెంటువి కదా! బాగా రీసెర్చి చేయి దొరక్కుండాపోవు అన్నారు నవ్వుతూ. పర్స్‌లో మరచి పోయేవేమో చూసుకో అన్నారు? మరలా ఆ తాళాలు ఆయన చూడలేదని వారుణి అనుకోవాలని ఆయన భావన.

రావుగారి ఎదురుగానే పర్స్‌లో సామానులన్నీ టేబుల్‌పై బొర్లించి, కంగారుగా మరలా ఎత్తేసింది. ఆ పర్స్‌లో నున్న సామానులు ఆయన కళ్ళలో పడనే పడ్డాయి. శానిటరీ నేప్‌కిన్స్ చూసి ఆయన ఉస్సురని నిట్టూర్చి ఆ తాళాలను మెల్లగా క్రిందికి వదిలేసి అవిగో అక్కడు న్నాయి అన్నారు. అమ్మయ్యా అనుకొని వాటిని వొంగొని తీసికుంటుంటే ఆమె జాకెట్టు లోపలి అందాలు చూడాలని ఆయన ప్రయత్నం చేసారు. అదేమీ గమనించనట్లు థాంక్స్ మాస్టారూ అని చెప్పివచ్చేసిందామె. ఆ నేప్‌కిన్స్ పర్స్‌లో ఎప్పుడూ ఉంటాయని ఆయనకు తెలియదు.

రానురాను రావుగారు సంతోష్‌ని అస్తమానూ తిడుతుంటే, సంతోష్‌పై చిరాకు పడుతుంటే వారుణికి అతనిపై జాలి మొదలైంది. దానితో సంతోష్ అంటే ఆమెకు తెలియకుండానే ఇష్టం కలగసాగింది. అతనితో కలిసి టీ తాగుతూ, ఒకటి రెండు సార్లు అన్నగారికళ్ళలో పడి ఇంట్లో వారి నోళ్ళల్లో పడి చీవాట్లు కూడా తిన్నది వారుణి. సంతోష్‌లో వాళ్ళుకు నచ్చనిది అతని కులం.

★ ★ ★

రావుగారితో వారుణి ఎన్నో విషయాలు చర్చించుతూ ఉంటుంది. ఆమెకు తోడేకొద్దీ బావిలో నీరు ఊరినట్లు, అన్నీ చదివేకొద్దీ జిజ్ఞాస, విజ్ఞానం పెరుగుతోంది. మరీ అంతలా చదివేయకు వారుణీ! కొన్ని స్వంత అభిప్రాయాలు, ఆలోచనలు, స్వంత నిర్ణయాలు కూడా ఉండాలి. ఎక్కువ పుస్తకాలు చదివి అభిప్రాయాలనే వంటపట్టించుకుంటే నీ మెదడు పని చేయడం మానేస్తుంది అన్నారు నవ్వుతూ.



ఆయన నవ్వులో ఏదో సమ్మోహనాస్త్రం ఉంది. సరళ దానికే పొంగిపోయి, లొంగిపోయి ఉంటుంది అనుకుంది వారుణి.

సార్! అసలు మంచిగా బ్రతకడానికి రామరాజ్యంలా దేశం ఉండడానికి 'చెడు అనవద్దు, వినవద్దు, కనవద్దు' అన్న ఒక్క మాటచాలదాండి. ఇన్ని వేదాలు, వాదాలు, గ్రంథాలు, శాస్త్రాలు, అస్త్రాలు ఎందుకండీ అని అడిగింది వారుణి.

'దైవచింతన, పాపభీతి ఇలాంటివి గ్రంథాలలోనూ, పురాణాలలోనూ ఉండి అవి కళ్ళకు కట్టినట్లు, మనసుకు హత్తుకునేటట్లు ఉంటేనే అందులో మంచిని కాస్తలోకాస్త గ్రహించడానికి మనిషి ముందుకు వస్తాడు' అన్నారు.

మనం సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, భూమిని ఇలాంటి వాటిని సృష్టించలేం కాని మంచిని సృష్టించి మంచి యుగాన్ని నెలకొల్పగలం కదండి. ఎందుకు ప్రయత్నించకూడదు అంది.

అది అంత తేలిక కాదు వారుణి అన్నారు రావుగారు.

ఎందుకు తేలికకాదో త్వరలోనే అర్థం అయింది వారుణికి. థీసీస్ విషయంలో సహాయం కావలసి వచ్చి తరచూ సంతోష్‌ని కలవడంతో ఇంట్లో పెద్ద గందరగోళం మొదలయింది. వేరే కులమతనితో ఆ కులకడమేమిటి అంటూ ఆంక్షలు మొదలుపెట్టారు, ఇంట్లో తన మాట ఎవరూ వినలేదు.

రావుగారి భార్య పోయినా ఆయన మరలా పెళ్ళి చేసుకోలేదు. వయసు నలభైకి నలభై అయిదుకి మధ్య ఉంటుంది. ఆయనకు ఇంట్లో వంటతను వండి పెట్టేసి వెళ్ళిపోతాడు. రావుగారికి ఆరోగ్యం విషయంలో శ్రద్ధ ఎక్కువ. హోటల్ మెతుకులు వేశ్యలతో పడకలు ఆయనకు పడవు. అందుకే తన స్టూడెంట్స్‌కి, ఫామిలీ లేడీస్‌కి లైన్ వేస్తూ ఉంటాడు. అందులో పడినవారు పడతారు. లేనివాళ్ళు లేదు.

వారుణి మాత్రం ఆయన దగ్గర ఎప్పుడూ మీరు ఏం అడిగినా ఇచ్చేస్తాను అనే ధోరణిలో ఉంటుంది. ఇంటి దగ్గరనుండి లంచ్ వస్తుంది ఆయనకు. వారుణిని కూడా తన రూములోనే కూర్చుని తినమంటారాయన. వారుణికి మొహమాటం. అయినా తను పాస్ అయ్యేవరకూ ఆయన చెప్పినట్లు వినాలి అన్నట్లు ప్రవర్తిస్తుంటుంది. ఆమె ప్రవర్తనకు ఈ అమ్మాయితో పెద్ద శ్రమ పడనక్కరలేదు. త్వరలోనే పడిపోతుంది వలలో అనుకున్నారు. సరళ గుర్తుకి వచ్చింది. సరళకు కొడుకు పుట్టాడని తెలిసింది. అది ఆమె ప్రోబ్లమ్. ఆ పిల్లాడితో తన తిప్పలు తను పడుతుంది. తనకు అనవసరం అనుకున్నారు. మెళ్ళో తాళి పడితేగాని, ఒళ్ళోకి పిల్లాడు రాకూడదు అని తెలియని అమాయకురాలు సరళ. అందుకే అబార్షన్ చేయించుకోలేదు. పిల్లలు పుట్టిన కన్నె కుంతి. అలాంటి ఆమె బ్రతుకులో ఉండదు కాంతి అని తెలిసే కొడుకుని కనింది. ఆ గొడవ నాకెందుకు అని మనసుని సమర్థించుకున్నారు.

వారుణికి చదివి చదివి తన మెదడంతా స్వర్ణయుగం చుట్టూనే తిరగసాగింది. ఒకరోజు రావుగారిని అడిగింది. 'సార్ మీరు డాక్టర్ కాకపోయినా డాక్టరేట్ ఉన్నవారు కదా, ఎమ్.బి.బి.ఎస్ డాక్టర్లు, రోగాలకు చికిత్స చేస్తారు. మీలాంటివాళ్ళు సంఘంలో చెడుకి చికిత్స చేయకూడదాండీ అని. ఆయన నవ్వేసి ఊరుకున్నారు. ఆమెను మాటల్లో పెట్టి మెల్లగా మీద చేయి వేసి, తన మొహాన్ని వారుణి మొహం దగ్గరకు చేర్చబోయారు. ఉలిక్కిపడి సర్దుకుని గట్టిగా దగ్గింది వారుణి. దానితో తుమ్ములు మొదలయ్యాయి నాకు ఎలర్జీ ఉందండి. అది దేని వలన వస్తుందో తెలియదు. సడన్‌గా వచ్చేస్తూ ఉంటుంది అంది. దగ్గు ఆపుకునే ప్రయత్నం చేస్తూ. ఆయన కాస్త వెనక్కి తగ్గారు. ఆ ఎలర్జీ ఆయనలోని సెక్స్ వాంఛని చూసి అని ఆయన అనుకోలేదు. మరలా సమయం కోసం వెయిట్ చేస్తున్నారు. ఆమె మతిమరుపు ఆయనకు వరంలా అనిపిస్తుంది.

★ ★ ★

చాలారోజుల తరువాత, ఆ రోజు ఇంటికి వెళ్ళిపోతుంటే సాయంకాలం తప్పక ఇంటికి వస్తావు కదూ అన్నారు రావుగారు, వారుణిని.

అలాగేనండి అంది. ఆయన ఎందుకు రమ్మంటున్నారో ఆయనకూ తెలుసు. వారుణికీ తెలుసు. ఇద్దరూ పైకి తేలలేదు. ఆరోజు వారుణి రిజల్ట్స్ తెలిసేరోజు.

రావుగారు అన్నారు 'వారుణి సాయంకాలం నాకు కాస్త పని ఉంది పోనీ డిన్నర్‌కి వచ్చేయి అన్నాడు. ముందు బిత్తరపోయినా, తత్తరపడకుండా తప్పకుండా మాస్టారు అన్నం పెడతానంటే ఆనందంగా పరుగెత్తుకుంటూ రానూ అంది. కళ్ళల్లో వెలుగు నింపుకొని.

రావుగారు ఆహ్వానించినట్లే సాయంకాలం అప్సరసలా తయారై వెళ్ళింది. తెల్లపట్టుచీర, తలనిండా మల్లెలు, ముత్యాలదండ మెడలో దరించి వెళ్ళింది. వారుణిని చూసిన ఆయన గుటకలు మింగారు. అన్నిటికీ సిద్ధమై వచ్చిందన్నమాట. ఆమెను పాస్ చేసిన సంగతి అప్పుడే చెప్పకూడదు. చెబితే చేయి జారిపోయే అవకాశం ఉంది అనుకున్నారు.

రావుగారు వారుణిని కూర్చోబెట్టి గబగబా స్నానం చేసివచ్చారు. వంటబ్బాయి టేబుల్‌మీద అన్నీ పెడుతుంటే తనూ సర్దింది వారుణి. 'ఇతను రాత్రిళ్ళు ఇక్కడే ఉంటాడా అని అడిగింది రావుగారిని. ఆమె భావాన్ని అర్థం చేసుకొని! లేదు టేబుల్ మీద అన్నీ పెట్టేసి వెళ్ళిపోతాడు. అన్నారాయన. తన కంటే వారుణికే తొందరగా ఉన్నది అనుకుని.

నేను వడ్డిస్తాను అంటూరావుగారికి కంచం పెట్టి తనూ ఒకటి పెట్టుకుంది వారుణి. అన్నీ స్పెషల్‌గా చేయించినట్లున్నారు. ఫ్రయిడ్ రైస్, చికెన్ ఫ్రైడ్ నోరూరిస్తుంది. ఘుమఘుమలాడి పోతున్నాయి వంటలు. ఆయన కంచంలో అన్నీ వడ్డించి తను మాత్రం కాస్త తెల్ల అన్నం పెట్టుకుంది. 'అదేం చికెన్ - ఫ్రయిడ్ రైస్ తినవా ఇష్టం లేదా?' అని ఆశ్చర్యంగా అడిగారాయన.

ఎందుకు ఇష్టం లేదు మాస్టారు బ్రహ్మాండమైన ఇష్టం. కాని ఒంట్లో బావులేక సాయంకాలం డాక్టరుగారి దగ్గరకు వెళితే 'జాన్‌డీస్' అన్నారు అంది అన్నంలో పెరుగ వేసుకుంటూ. జాన్‌డీస్ ఉన్న వాళ్ళతో సెక్స్‌లో పాల్గొంటే అంటుకుంటుందన్న విషయం తనకేమీ తెలియనట్లు.

రావుగారు నీరుగారిపోయారు ఆ మాటలకు. ఆ తరువాత వారుణి ఎంత చలాకీగా మాట్లాడినా, ఆయనలో చలనం లేదు, వారుణీ పాస్ అయ్యావు కంగ్రాచ్యులేషన్స్ అని చెప్పి వారుణిని వంటబ్బాయి ఉండగానే ఇంటికి పంపించేసారాయన.

ఆయనకు ఆరోగ్యం విషయంలో అసలే జాగ్రత్త ఎక్కువ అని వారుణికీ తెలుసు. అందుకే జాన్‌డీస్ అని అబద్ధమాడింది. ఇంటికి వెళ్ళి పాస్ అయిన సంతోషంలో స్వీట్‌కాక హాట్ తినింది వారుణి. దోసావకాయలో దోసెడు నెయ్యి వేసుకొని, చికెన్, ఆవకాయ అన్నీ కడుపునిండా తింది.

ఆ రోజు డైరీలో రాసుకుంది 'ఆడది శారీరకంగా అబల కావచ్చు కాని మానసికంగా మాత్రం సబల' అని.

రెండురోజుల తరువాత ఒక నిర్ణయానికి వచ్చి రావుగారి డిపార్టుమెంట్‌కి వెళ్ళింది వారుణి.

ఏం వారుణీ! ఇలా వచ్చావు. రీసెర్చి పూర్తయిందిగా. మరలా ఏం మర్చిపోయావు. డిగ్రీ కూడా వచ్చేసింది అన్నారు. రావుగారు వారుణిని చూసి.

వారుణి తన చేతిలోనుండి జారిపోవడం ఆయనకు అయిష్టంగా వుంది. ఆయన ఎదురుగా కూర్చున్న వారుణి పైట జారిపోయినా ఆయన పట్టించుకోలేదు ఈసారి.

యుగంలో ఏ లక్షణాలు ఉంటే అది స్వర్ణయుగం అవుతుంది అన్న దాని మీద రీసెర్చి పూర్తయింది సార్! కాని దాన్ని ఎలా ఆరంభించాలి అన్నది ఇప్పుడే మొదలైందండి అంది టేబుల్‌పై ఏదో వెతుకుతూ.

'అయితే వెతుక్కో, ఏం కావాలో ప్రతీదీ రీసెర్చి నీకు అలవాటేగా' అంటూ నవ్వారు. అక్కడ పుస్తకంలో ఒక ఫోటో చేతిలోకి తీసుకొని దొరికిందండి. దొరికింది అంది వారుణి సంతోషంగా.

'ఏది ఏం దొరికింది నన్ను చూడనీయ్' అన్నారు.

అదేనండి స్వర్ణయుగంలోని 'స'ని మరచిపోయాను. అది కాస్తా 'వర్ణయుగం' అయిపోయి సంఘంలో కుల, మత భేదాలు తల ఎత్తి పురోభివృద్ధికి ఆటంకం కలిగి, ఆ కులభేదమే కంకటం వలె కాళ్ళల్లో గుచ్చుకొని అడుగు, ముందుకి పడడంలేదండి. అంటూ ఫోటో ఆయనకు చూపించింది. అయితే సంతోష్‌ని పెళ్ళి చేసుకోడానికి, నిశ్చయించుకున్నావన్న మాట అన్నారాయన ఆనందంగా.

అవునండి ఇప్పుడే కాదనుకోండి. అంది సిగ్గుపడుతూ తలవంచుకుని. మంచిపని చేస్తున్నావు కాబట్టి తలెత్తుకోవాలి అన్నారు.

ఆ మర్నాడు వారుణి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళారు రావుగారు. రండి మాస్టారూ అంటూ ఆయిన్న ఎంతో ఆనందంగా ఆహ్వానించింది వారుణి.

'వారుణీ నీకు కావలసింది. నువ్వు వెతుక్కున్నావు. నాకు కావలసింది నేను వెతుక్కున్నాను. నా భార్య చనిపోవడానికి కారణం ఇండైరెక్టుగా మా అమ్మ కావచ్చు.

మా అమ్మ కట్నం ఎక్కువ తేలేదని ఆమెని చాలా వేధించింది. నేను పట్టించుకునే వాడిని కాదు. మనోవేదనతో ఆమె ఆరోగ్యం పాడై మంచం పట్టి మరణించింది. అందుకే ఈ సారి నా భార్యను అలాంటి మనోవేదనకు దూరంగా ఉంచుతాను అన్నారు.

'మాస్టారు మీరు పెళ్ళి చేసుకున్నారా? అంది ఆశ్చర్యంగా. లేదు స్వర్ణయుగం రావాలంటే వర్ణయుగమే కాదు, కర్ణయుగం కోడళ్ళను కాల్చిచంపే అగ్నికణ యుగం కూడా అంతరించాలి. మంచి పని చేయకుండా ఊరుకున్న వాడి కంటే చేసి కనీసం ఆ పనిలో విఫలమైనవాడు ఉత్తముడు అని నీవే అన్నావుగా. స్వర్ణయుగాన్ని మననుండి ప్రారంభిద్దాం. అది విఫలమో, సఫలమో కాలమే నిర్ణయిస్తుంది అంటూ కారులోనున్న సరళను, సరళ చేతిలోనున్న పిల్లవాడిని లోపలకు తీసికొచ్చారాయన. త్వరలోనే సరళ మెడలో మూడుముళ్ళు వేస్తానన్నారు. వారుణి కళ్ళల్లో ఆనందభాష్పాలు నృత్యం మొదలుపెట్టాయి.

(ఆంధ్రభూమి వీక్లీ, 06-12-90)

☆ ☆ ☆

# మిత్రులారా నేనిక్కడ మరి మీరెక్కడ

ఆ రోజు ఆదివారం. శ్రీమతి చేసిన స్పెషల్స్ కడుపునిండా తిని, భుక్తాయాసం తీర్చుకొని, టి.విలో వస్తున్న సినిమాను టి.వి రూమ్‌లో నున్న మంచం మీద అలవోకగాపడుకొని, శ్రీమతి కాళ్ళ దగ్గర కూర్చొని వుండగా, శ్రీమహావిష్ణువులా చిరునవ్వులు ఒలకబోస్తూ టి.వి. చూస్తున్నాడు రామం.

పిల్లలు శలవులకు అమ్మమ్మగారి ఊరు వెళ్ళారు. సుచిత్ర, రామంకి యిప్పుడు కావలసినంత ఏకాంతం. ఇంతలో కాలింగ్ బెల్ మోగడంతో సుచిత్ర విసుక్కుంటూ వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా ముప్పయి అయిదేళ్ళ వ్యక్తి నిలుచొని వున్నాడు. "రామం వున్నాడా అమ్మా... మర్యాదగా పలకరించాడు. ఆ ఏకవచన ప్రయోగంతో అతనెవరో భర్తకి బాగా కావలసిన వాడేనని అనిపించి భర్తను పిలిచింది. రామం బయటకు రాగానే ఒరే రామం అంటూ రామాన్ని కౌగిలించుకున్నాడు మూర్తి రామం పంచె జారిపోతున్నా పట్టించుకోకుండా. ముందు రామం బిత్తరపోయాడు ఎవరూ? అన్నాడు ఆశ్చర్యంగా.

"నేనురా, మూర్తిని. ఇంటర్‌లో క్లాస్‌మేట్‌ని. పల్లకిలో మన గ్రూప్ ఫోటో చూశాను. వెంటనే రెక్కలు కట్టుకుని వాలాను" అన్నాడు. అప్పుడు గుర్తొచ్చాడు రామానికి. "ఒరి నీవట్రా రా, రా" , అంటూ చేయపట్టుకొని ఆప్యాయంగా లోపలికి తీసికొని వచ్చి పరిచయం చేశాడు సుచిత్రకు. ఇంక ఇద్దరిలోనూ ఆనంద తరంగాలు తాండవమాడాయి. మూర్తికి అప్పటికి యిప్పటికి అవేపోలికలు. రామం మూర్తి ఒకే క్లాసులోని వారైనా, రామంకి అప్పుడు కొంచెంకొంచెం జుట్టు నెరసి ముసలి రూపంలోకి మారబోతున్నాడు. ఆ రోజంతా యిద్దరి కబుర్లకీ అంతే లేదు. తామిద్దరినీ కలిపిన పల్లకీని ఎన్నోవిధాల పొగుడుతున్నారు.

ఆ జ్ఞాపకాలన్నీ, మధురాతి మధురం అన్నట్లు ఎన్నో కబుర్లు, అమ్మాయిలను ఏడిపించడం దగ్గరనుంచి, మాష్టార్లకి పెట్టిన పేర్లతోసహా చెప్పుకొని చెప్పుకొని నవ్వుకొన్నారు. మూర్తికి ఇంకా పెళ్ళికాలేదు. ఉద్యోగమూ రాలేదు అంటే రామం బాధపడ్డాడు. మూర్తి అన్నాడు "రేపు నాకు యిక్కడే ఇంటర్వ్యూ వుంది. అంతలోనే పల్లకిలో మన కాలేజి ఫోటో పడింది. ఇంటర్వ్యూ వచ్చినదాని కన్నా నిన్ను చూస్తాను అనే సంతోషం నన్ను నిలువనీయలేదురా" అని.

ఇంక ఆ రాత్రి అయితే రామం, సుచిత్రను బ్రతిమాలుకొని పక్కగదిలో పడుకోబెట్టాడు. ఆమె బిక్కమొహం వేసింది. అయినా రామం లెక్క చేయలేదు. ఆరాత్రి తన ప్రేయసి సంగతులన్నీ అడిగి తెలుసుకున్నాడు రామం. ఆమెకు పెళ్ళయిందని,

ఇద్దరుపిల్లలు అని చెప్పాడు మూర్తి. ఇంకా ఎన్నో సంగతులు మాట్లాడుకున్నారు. ఒకటేమిటి వాటికి అంతులేదు. ఆ రాత్రంతా మాట్లాడుకుంటూనే ఉన్నారు. "ఓరేయ్ మూర్తీ నీకు మతిమరుపు ప్రొఫెసర్ అనే నిక్ నేమ్ ఉండేది, అయినా అన్ని సంగతులు బాగానే గుర్తున్నాయే" అన్నాడు రామం. "అది నిజమే అన్నీ నీవు గుర్తుచేస్తుంటే వరసగా గుర్తుకి వచ్చేసాయిరా మరీ అంతలా ఎలా మరిచిపోతాం, ఆ బంగారు బాల్యాన్ని" అన్నాడు.

ప్రొద్దున్నే లేచి శలవు పెట్టి మూర్తిని ఇంటర్వ్యూకి తీసికొని వెళ్ళాడు రామం. సుచిత్ర అంది 'మీ క్లాస్‌మేట్ అంటున్నారు, మీకంటే బాగా చిన్నవాడిలా కనబడుతున్నాడు." అని. ఆ దానిదేముంది కొందరు వయసుని మించి కనబడతారు, కొందరికి వయసే తెలియదు, మొహంలో, అది వాడి అదృష్టం," అన్నాడు నీరసంగా, ఆ అదృష్టం తనకి లేనందుకు. ఇంటర్వ్యూ అయిపోగానే మర్నాడు అంతా హైదరాబాదు చూపించాడు రామం, మూర్తికి, వద్దువద్దంటున్నా వినక. ఆ రాత్రి అందరూ మామూలుగానే నిద్రపోయారు. తెల్లవారి లేచి చూస్తే మూర్తిలేడు యింట్లో. యిల్లంతా వెతికారు. అనుమానం వచ్చి పర్స్ చూస్తే అందులో అయిదు వందలు లేవు తామెంత మోసపోయారో అప్పుడు గ్రహించుకున్నారు. మూర్తి అడ్రసు యివ్వలేదు, వారికి. సుచిత్ర అయితే లబోదిబోమంది. రామానికి మనసులో మంటగావున్నా భార్యముందు బయటపడలేదు. మరో పది రోజులు గడిచాయి.

ఆ రోజు వచ్చిన ఉత్తరాల్లో మూర్తి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. అమ్మయ్య అనుకున్నారు. విప్పి చదివారు ఆత్రుతగా.

...డియర్ రామం, నిన్ను మోసం చేసినందుకు ముందు నన్ను క్షమించు పల్లకిలో మీ కాలేజి ఫోటో చూసాను. నిజంగా నేను స్నేహితుడిని కాదు. నీ స్నేహితుని తమ్ముణ్ణి మా అన్నపేరు రామమూర్తి, నా పేరు కృష్ణ మూర్తి మీరు ఇంటర్ చదివేటప్పుడు నేను తొమ్మిదవ తరగతి చదివేవాణ్ణి. చిన్నవాడినైనా సరదాగానూ అన్నయ్య మీ కాలేజీ కబుర్లు అన్నీ నాతో చెప్పేవాడు. మీరు మా యింటి ప్రక్కన ఉండేవారు కదా, అందుకే నాకు అన్ని సంగతులూ తెలుసు. ఉద్యోగమూ లేదు, తిండీలేదు. హైద్రాబాద్‌లో ఇంటర్వ్యూ వచ్చింది. నా దగ్గర ప్రయాణానికే డబ్బు లేదు, ఇంక హోటల్‌కి ఎక్కడి నుండి తీసికొని రాను, డబ్బు. అంతలో పల్లకిలో మీ ఫోటో పడింది. ఇంచుమించుగా మా అన్నయ్యవి, నావి ఒకటే పోలికలు కాబట్టి నీవు నన్ను గుర్తించలేవని నాటకం ఆడాను. నాకు బొంబాయిలో మరో ఇంటర్వ్యూ ఉంది. దాని కోసం దొంగతనం చేయకతప్పలేదు. నిన్ను మోసం చేయకా తప్పలేదు. నిజానికి మా అన్నయ్య ఏక్సిడెంట్‌లో మరణించాడు. సంసార బాధ్యత నామీదపడింది. ఈ ఉద్యోగమూ దొరక్కపోతే అందరం ఉరేసుకొని చావాలి. అందుకే మనసుని చంపుకొని పర్స్‌లో డబ్బు తీసాను. అది నా జీతం అందగానే పంపించి వేస్తాను. సుచిత్రగారిని కూడ క్షమించమని చెప్పు.

అవినీతి మార్గాన్ని యిష్టపడని నేను, దొంగతనం చేసి, ఉద్యోగం సంపాదించాను. ఏమైతేనేం, మనిద్దరిని కలిపి, నాకు హైద్రాబాదు లోను, బొంబాయిలోను ఇంటర్వ్యూకి సరిపడా డబ్బు సంపాదించి పెట్టిన పల్లకికి, తద్వారా మీకు నా కృతజ్ఞతలు. చివరిగా నాదొక విన్నపం. నాలాగే మరి కొందరు రావచ్చు. ఎప్పుడో చిన్నప్పుడు చూసిన వాళ్లను గుర్తుపట్టడం కష్టంకావచ్చు నీకు. అందుకే అనాలోచితంగా అందర్నీ యింట్లోకి రానీయవద్దు. నీ స్నేహాన్ని నీలోనే దాచుకొని కొంచెం జాగ్రత్తగా ముందడుగు వెయ్యి. మొసళ్ళు ఉన్న నీటిలోనైనా క్షేమంగా బ్రతకవచ్చుగాని, నాలాంటి మోసగాళ్ళున్న నేలమీద బ్రతుకు దినదిన గండమే. మరోసారి క్షమించమని వేడుకుంటున్నాను. ఇప్పటినుండి

నీ ప్రియ మిత్రుడు

- మూర్తి

(పల్లకి, 03-07-86)

☆ ☆ ☆

# విభూతి మహిమ

నా స్నేహితురాలు శుభ వాళ్ళ అమ్మమ్మగారి ఊరు వెళదామని చాలా కాలంగా పోరుపెడుతోంది. అది పల్లెటూరు. పట్నంలో పుట్టి పట్నంలోనే పెరిగిన నాకు పల్లెలు చూడాలని చాలా కాలంగా ఆశ. ఆ ఆశ తీర్చుకోడానికి శుభ పునాది వేసింది. అందరమూ మా అంగీకారంతో తలో చేయి వేసి భవనాన్ని సిద్ధం చేశాము. ఆ భవనం పేరు "పిక్నిక్!"

మొత్తానికి చాలా సరదాగా అందరం బయలుదేరాం. ఆ పల్లెలో అడుగు పెట్టిన నా మనసు పురి విప్పిన నెమలిలా గంతులు వేసింది. చుట్టూ పచ్చని పొలాలు. ఎక్కడ చూసినా కొబ్బరి తోటలు - అక్కడి ప్రకృతి పచ్చని పట్టు పరికిణీ కట్టుకుని, చెట్టునే ఎర్రగా పండిన మిరప తోటలా ఎర్రని వోణి వేసుకుని, మిరప రైక తొడుక్కుని, పండిన నిమ్మ రంగు మేనితో, దానిమ్మ గింజలాంటి పలు వరుసతో మల్లెల్లాంటి నవ్వుతో బంతి పూల జడ వేసుకుని, చీకటి కాటుక దిద్దుకుని, వెన్నెల బొట్టు పెట్టుకుని, అమాయకత్వం నిజాయితీ మంచితనం జడ కుప్పెలుగా చేసుకుని ఆప్యాయతలనే నగలు సింగారించుకుని వయ్యారంగా నడుస్తున్నట్లు అనిపించింది.

నా చెవిలో ఆ కన్య గజ్జెల గలగల వినిపించింది.

అందులో అంతర్గతంగా నేను లీనమైపోయాను. నీలాల నింగిని అందుకున్నంత సంబరపడిపోయింది నా మనసు.

శుభ వాళ్ళ అమ్మమ్మ తాతయ్యల ఆదరణ, లేని వారి పట్ల వారి వితరణ, నన్ను ఊపిరి తీసుకోనివ్వనంత ఆనంద డోలికల్లో ముంచాయి. అదేదో వింత ప్రపంచంలా, ఆ ప్రపంచంలో అంతా ప్రశాంతతే అన్నట్లుగా ఊహించుకుంటున్న నా ఊహలను తల్లక్రిందులు చేస్తూ ఆరోజే ఒక సంఘటన జరిగింది. కమ్మని కల చెదిరిపోయింది. శుభ వాళ్ళ పని మనిషి కూతురికి వాంతులు, విరేచనాలు అవుతుంటే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళడం మాని ఆ ఊరి స్వాముల వారు అట - ఆయన దగ్గరకు తీసుకెళ్ళి విభూది ఇప్పించారు.

అసలు నాకు ఆ అమ్మాయిని చూస్తే కలరా ఏమో అన్నంత భయం వేసింది. డాక్టర్‌కి చూపించని వాళ్ళ మూర్ఖత్వం మీద - మూఢ నమ్మకం మీద చెప్పలేని ఆగ్రహం కలిగింది. పోనీ పనమ్మాయి అయితే చదువు లేనిది, చదువుకున్న శుభ కుటుంబం కూడా స్వామీజీ దగ్గరకు వెళ్లమని సలహా ఇస్తుంటే నాకు విపరీతమైన ఆశ్చర్యం వేసింది.

అదే విషయం అడిగితే అమ్మమ్మగారు ఇలా చెప్పారు - "ఏం చెప్పమంటావు. సీమా, మా పల్లెటూరి వారి సంగతి - దేశం ఎంత ముందుకి పోతున్నా ఈ మూఢ నమ్మకం వారిని వదలడం లేదు. మరి అదేమి చిత్రమో విచిత్రంగా ఆ స్వామీజీ ఇచ్చిన విభూదికే అన్ని రోగాలూ నయమవుతున్నాయి. నేను నా కళ్ళతో ఎన్నో కేసులు చూశాను. నీ కళ్ళతో నువ్వు చూస్తావుగా. ఆ పిల్ల చూడు ఎలా లేచి తిరుగుతుందో! మరి ఆ మహిమలు నమ్మకుండా ఎలా ఉండమంటావు. ఈ ఊరికి గవర్నమెంటు ఆసుపత్రి ఉందిగాని, అందులో డాక్టర్ ఎప్పుడూ ఉండడు. ఇక్కడికి ఎవరూ రావడానికి ఇష్టపడరు. ఒకవేళ వచ్చినా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవాలిగాని హాస్పిటల్ ఛాయలకు ఎవరూ వెళ్ళరు. విసుగెత్తి ఆ డాక్టర్లే ఊరు వదలి వెళ్ళిపోయారు. మాకు విభూది మహిమే మందులా పని చేస్తోంది" అని చెబుతుంటే ఆశ్చర్యపోయాను.

ఇప్పుడు ప్రస్తుతం ఉన్న స్వామీజీ మూడు సంవత్సరాలుగా అక్కడ ఉంటున్నారట. ఆయన చేతి విభూతి తీసుకున్న వాళ్ళందరూ ఆరోగ్యంగానే ఉన్నారట.

నాకు ఆ స్వామీజీని చూడాలనిపించింది. అందరం సాయంకాలం ఆయన మీదకు దండయాత్రకు బయలుదేరాం. అందరూ మామూలుగానే వచ్చారుగాని, నేను మాత్రం సి.ఐ.డి.లా ఆయన్ని పరిశీలించసాగాను.

చూడగా చూడగా ఆయన్ని ఎక్కడో చూసినట్లు అనిపించింది. ఆ ముఖ కవళికలు నాకు చాలా పరిచయం ఉన్నట్లు అనిపించసాగాయి. గడ్డాలు, మీసాలు నుదుట బొట్లు అడ్డు రావడంతో నాకు పోల్చుకోవడం కష్టంగా ఉంది. ఎంత ఆలోచించినా ఆయనెవరో గుర్తుకి రావడం లేదు.

అదే విషయం నా స్నేహితులతో చెబితే వాళ్ళు "నీవన్నీ అనుమానాలు" అంటూ కొట్టిపారేశారు నా మాటని.

ఆ స్వామీజీ ఎదురుగా చాలా మంది రోగులు ఉన్నారు. ఆయన ఇచ్చే విభూది కోసం పడిగాపులు పడి ఉన్నారు. ఆయన రోగులు చెప్పేది విని, మనసులో దేవుణ్ణి ధ్యానించి వాళ్ళ నుదుటను వీభూది బొట్టు పెట్టి అదే వీభూది కాస్త నోట్లో వేస్తున్నారు. "అసలు ఇలా మంత్రాలతో జబ్బులు నయమవుతుంటే - ఇంత సైన్స్ ఎందుకు, ఇన్ని మెడికల్ కాలేజీలు, ఇంత మంది డాక్టర్లు ఎందుకు?" అనిపించింది.

ఆయనతో మాకు ఇంటర్వ్యూ లభించింది. అందరూ ఏవేవో ప్రశ్నలు అడిగారు. నేను మాత్రం "మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుంది" అని అన్నాను. దాని కాయన చిరునవ్వు నవ్వారు. ఆ నవ్వును బట్టి పోల్చుకున్నాను. ఆయన మా పక్కింట్లో ఉండేవారు. చాలా కాలం పరిచయం మాది. ఇంటర్‌లో ఆయన ఉన్నప్పుడు నేను

తొమ్మిదో తరగతి చదివేదాన్ని చాలా సంవత్సరాల క్రితం విడిపోయినందున త్వరగా గుర్తించలేకపోయాను నేను ఆయన్ని.

అందరూ మాట్లాడుతుంటే మెల్లగా ఆ చుట్టుప్రక్కల పరిశీలించసాగాను. అప్పుడు దొరికాయి నాకు కొన్ని ఆధారాలు. దొంగ దొరికాడు. ఆయన రోగుల నోట్లో వేసే వీభూదితో ఇంగ్లీషు మందులు నూరి కలిపి వీభూది అంటూ మింగిస్తున్నాడు. ఆయన ఆ ఊరి గవర్నమెంట్ డాక్టరుగా వచ్చి - వాళ్ళతో తరిమివేయబడి వాళ్ళ మనస్తత్వాన్ని బట్టి స్వామీజీ రూపంలో ట్రీట్‌మెంట్ ఇస్తున్నాడు. "వారెవా" అనుకున్నాను.

(ప్రభ)

☆ ☆ ☆

# కర్ఫ్యూ

"ఏమండీ - ప్లీజ్ వెళ్ళకండి."

"నన్ను గాజులు తొడుక్కుని కూర్చోమంటావా?"

"నా గాజులు పగులగొట్టే పరిస్థితి తీసుకుని రావద్దంటున్నాను. ఆ గొడవల్లో ఎందరి తలలు పగులుతాయో."

"ప్రాణాలకు భయపడి ఇంట్లో ఉండమంటావా?"

"ఎందుకండి అల్లర్లలోకి వెళ్ళి - వాటిని ప్రోత్సహించి ఒకరి ప్రాణాలు తీయడం- మీ ప్రాణాలకూ సెక్యూరిటీ లేదు. ఆ తరువాత అంతా ప్రాణాలు అర చేతిలో పెట్టుకుని బ్రతుకు నెట్టుకుని రావడం."

"నేను ఎవరినీ చంపను మిగిలిన వారికి తోడు వెళతాను అంతే."

"ఏమండీ - ఎదుటి వారిని రాళ్ళతో కొట్టి, తాళ్ళతో మెడను కట్టి కాళ్ళతో నొక్కి పట్టి చంపినవాడే హంతకుడు కాదండి. పరోక్షంగా ఆ హత్యలను ప్రోత్సహించి హంతకునికి సహకరించిన వారూ హంతకులేనండి. నా మాట వినండి. ఆ గొడవలలోకి మీరు వెళ్ళకండి. ఇలాంటి వాటిని సపోర్టు చేసే వాళ్ళు లేకపోతే అసలైన వారు ఒక్క అడుగైనా ముందుకు వేయలేరండి. కత్తి కంటే పదునైనది "శాంతి!" ఆ దృక్పథం అవరచుకుంటే సంఘం, సంఘంలోని మనం నిశ్చింతగా ఉండగలమండి. ప్లీజ్ వెళ్ళకండి" ప్రాధేయపడింది విమల.

అతను కరగ లేదు. అతనిలో "కక్ష" ప్రవహిస్తోంది - రక్తానికి బదులు తమ పార్టీ వారిని ఎవరో హింసించారని, వారిని హింసించడానికి రాబందులై పైకి మాత్రం హంసల వేషం వేసుకుని కొందరు బయలుదేరుతున్నారు. ఆ సంగతి తెలిసిన విమల భర్తను బ్రతిమాలుతూనే ఉంది. అతను వినిపించుకోలేదు.

☆ ☆ ☆

"ఏయ్! విమలా తలుపు తియ్!" తలుపు దబదబా బాదాడు.

కంగారుగా విమల తలుపు తెరిచింది. భర్త బట్టలన్నీ రక్త మయం. అయోమయంలో పడిపోయింది. గబగబా బట్టలు మార్చుకుని - ఆ బట్టలను పెట్టెలో దాచుకున్నాడు. పోలీసులు వచ్చారు. ఇల్లు వెతికారు. అతను లేడని రూఢి చేసుకుని మిగిలిన రౌడీలను వెతకడానికి వెళ్ళారు. పోలీసుల కళ్ళు ఇలా ఎంత కాలం కప్పాలి అని విమల బాధపడింది.




విమలలో భయం, వణుకు మొదలయ్యాయి. జనార్ధనం కూడా వణికి పోతున్నాడు. అవతలి వారిని బెదిరించి, తమ పార్టీ గొప్పతనం గురించి హెచ్చరించి వచ్చేద్దామనుకున్నారు. ఆఖరికి ఆపుకోలేని ఆవేశంలో చాలా ప్రాణాలు పోయాయి.

మర్నాటికల్లా ఊరంతా కర్ఫ్యూ, గొడవలు, అల్లర్లు, కాలుతున్న బస్సుల మంటలు, చనిపోయిన వారి తాలూకు బంధువుల హృదయాల మంటలు, అన్నీ ఏకం అయ్యి ఊరంతా నివురుగప్పిన నిప్పులా అతి ప్రశాంతంగా ఉంది. కర్ఫ్యూ భయంతో ఎవరూ బయటికి రావడం లేదు. అంతా తమ ఇల్లు నేల మీద కాక సముద్రంపైనున్నట్లు భావిస్తున్నారు.

ప్రజలు భయపడి చస్తున్నారు. తప్పు చేసింది కొందరు. శిక్ష అనుభవించేది అందరూ.

కొట్లాటల చదరంగంలో జీవులే పావులయ్యారు.

"ఏమండీ - శారదకు జబ్బు తిరగబెట్టిందండీ."

"అయ్యయ్యో - ఇప్పుడా - ఇప్పుడేం చేయడం ఊరంతా కర్ఫ్యూ."

"ఫరవాలేదు. నా కూతురి ప్రాణాల కంటేనా నేను ఎలాగోలా వెళ్ళి ఏదో ఒక మందుల దుకాణం తెరవకపోరు మందు తెస్తానండి" ఏడుస్తూ అంది. వెంటనే ఆ మందు పడక పోతే ప్రమాదం అని వారికి తెలుసు.

"నీవా - ఇప్పుడా! బయట ఒక్క పిట్ట లేదు. ఒక కొట్టు లేదు. పైగా పోలీసులు నిన్ను తేనె చుట్టలా చుట్టుకుంటారు."

"అయినా ఫరవాలేదు."

"అంతటితో వదలరేవాళ్ళు.... వాళ్ళు..."

"అందరినీ దుర్మార్గంగా అంచనా వేయకండి. మీ లాంటి వాళ్ళు మంచి వాళ్ళ ముసుగులో ఉండి అందరినీ ముంచేయడంలా."

"సాధింపులకు సమయం కాదు కాని - నీవు వెళ్ళవద్దు. ఎలాగైనా నేనే వెళతాను."

"ఆ - మీరా? మీరు కనపడితే చాలు - కాల్చేస్తారు వాళ్ళు."

"ఏం చేయమంటావు విమలా? బయటకు వెళితే మన ప్రాణాలు దక్కవు. వెళ్ళకపోతే శారద, ప్రియమైన కూతురు దాని ప్రాణాలు దక్కవు. అసలు మందులన్నీ వెతుకు - అర్జంటుగా ఒక మాత్ర అయినా దొరుకుతుందేమో!"

"అమ్మయ్య! ఇదిగో దొరికిందండీ! దేవుడు రక్షించాడు. ఈ పూటకు ఎలాగో గండం గట్టెక్కినా రేపటికి మరొకటి సంపాదించాలి."

విమల కూతురితో మందు మింగించి రిలీఫ్‌గా కూర్చుంది.

ఊరంతా స్మశాన నిశ్శబ్దం ఆవరించి ఉంది. అయినా ఆవగింజంతయినా శాంతి లేదు. జనం ఊపిరి తీసినా ఊరి పడుతుందేమోనన్నంత టెన్షన్‌లో వున్నారు. ఎప్పుడూ రణగొణ ధ్వనులతో ఉండే ఊరు.' చడీ చప్పుడు లేకుండా ఉంది. అందరిలోనూ అణువు అణువునా భయం, ఆఫీసుల హడావుడి లేదు. శెలవులంటే ఇష్టపడే ఉద్యోగులు సైతం ఆ సెలవుని ఆనందంగా అనుభవించలేకపోతున్నారు. పట్ట పగలు కూడా అర్థరాత్రి నిశ్శబ్దం ఆవరించి ఉంది. పోలీసులు ఒక్కరే "మాకు భయం లేదు సుమా ప్రజలందరూ ఇళ్ళల్లో ఉన్నంత కాలం" అనుకుంటూ ధీమాగా తిరుగుతున్నారు.

"అయ్యయ్యో! శారదకు ఏమైందండీ! నాలుక బయటికి వచ్చేసింది. కళ్ళు తేలేసింది. అయ్యో- మందు రియాక్షన్ అండి. వెంటనే డాక్టరును పిలవాండి. ఎవిల్ ఇంజక్షన్ అర్జెంటుగా పడాలి."

"ఎలా! ఇప్పుడు?" అతని నరనరాల్లోను భయం. ఆమె ఆవేశంగా బయటకు పరుగు పెట్టబోతే పట్టుకుని ఆపాడు. ఆమెను ఆపగలిగాడు. కానీ కూతురి ప్రాణాలు ఆపలేకపోయాడు.

శారద శవం మీద పడి బోరుమంది విమల. ఆమె దుఃఖం ఆపశక్యం కావడం లేదు. "అయ్యో! తల్లీ- మమ్మల్ని విడిచి వెళ్ళిపోయావా? నిన్ను బ్రతికించుకోలేకపోయాం. ఇంకా ఈ కర్ఫ్యూ. ఈ అల్లర్లు ఎంత మందిని బలి తీసుకుంటాయో! నీ శవం తగులబెట్టడానికైనా మేము బయటకు వెళ్ళగలమా? నిన్ను ఆఖరి చూపు చూడడానికి ఎవరు వస్తారు తల్లీ! నీ నానమ్మ, అమ్మమ్మ, తాతయ్యలు, అక్క, అన్నయ్యలు ఎవరూ రాలేరు. ఎలా వస్తారు. బస్సులు, రైళ్ళు లేవుగా. నా ముద్దుల పట్టీ, నీది దిక్కులేని చావు అయిపోయింది తల్లీ! అందరూ ఉన్న అనాధవు అయిపోయావు. చిన్నా! నా కన్నుల్లో పెట్టుకోవాలనుకున్నాను కన్నా! నాకు కన్నీళ్ళు మిగిల్చిపోయావా శారదా? నన్ను ఎలా బ్రతకమంటావే? ఈ కడుపు కోతను ఎలా భరించమంటావే! కక్షలతో పుచ్చి పోయిన సమాజం, చచ్చిపోయిన నిన్ను బ్రతికించగలదా?" విమల అలా ఏడుస్తూనే వుంది - శారదకు అవేమీ వినబడకపోయినా.

కన్న కూతురు కళ్ళు మూస్తేనే కానీ - జనార్ధనం కళ్ళు తెరవలేకపోయాడు. ప్రాణం విలువ అప్పుడుగాని తెలియలేదు. కూతురి శవాన్ని చూస్తూ అనుకున్నాడు - పోయిన వారిని తీసుకుని రాలేకపోయినా ఇకపై ఇటువంటి అల్లర్లకు అజ్యం పోసి రాజ్యాన్ని అల్లకల్లోలం చేయకూడదని, రాబోయే యువతరాన్నైనా రక్తపాతం వైపు కాక శాంతి పథం వైపు నడిపించడానికి శాయశక్తులా ప్రయత్నించాలని.

విమల మాత్రం విలపిస్తూనే ఉంది. కన్నీరు మున్నీరుగా.

(ప్రభ, 22-02-89)

☆ ☆ ☆

# బ్లాక్ మెయిల్

సుధ మనసంతా విషంతో నిండినంత చేదుగా వుంది. హృదయమంతా బాధతో నిండిపోయింది. తెలియక చేసిన చిన్న పొరపాటు నాగుపామై తన బ్రతుకుపై పడగవిప్పి కాటువేయగలదని ఏనాడూ అనుకోలేదు. అందుకే ఆనాడు చాటుమాటుగా సంజయ్‌ని కలుసుకునేది. కాలేజీ రోజుల్లో తనంటే పడి చచ్చేవాడు. ఏ చిన్న జోక్ వేసినా పడి పడి నవ్వేవాడు. అలాంటి సంజయ్ అతను నవ్వుతూ తనను ఏడిపిస్తాడని కలలోకూడా అనుకోలేదు. తనతో ఏడడుగులు నడుస్తాడని భ్రమపడింది. మూడు ముడులు వేస్తాడని ఆశపడింది.బ్రతుకు ముళ్ళకంచె చేస్తాడని గ్రహించలేకపోయింది.

చాలామంది ఆడపిల్లలలాగే సుధకూడా తెలిసీ తెలియని వయసులో సంజయ్ ప్రేమలో పడింది. పొగడపూల-పల్లకిలో అతని సరసన పెళ్ళికూతురుగా కూర్చోవాలని అనుకుంది. అతని మాటలో మాట కలిపింది. అంతవరకూ బాగానే వుంది. రాతలో కలిపి సంజయ్‌కి ప్రేమలేఖలు వ్రాసింది. అవి ఇప్పుడు ఆమె తలరాతనే మార్చేసేటట్లున్నాయి. నల్లనివి నీళ్ళు, తెల్లనివి పాలు అనుకుని అతన్ని నమ్మినందుకు ఆ అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకుని తనకు లొంగిపొమ్మంటున్నాడు ఇప్పుడు సంజయ్ సుధను. సంజయ్ నిజస్వరూపం తెలియక అతనిని ప్రేమించింది. తీరా పెళ్ళిమాట ఎత్తేసరికి అంత ఎత్తున ఎగిరాడు.

నిన్నెవరు పెళ్ళాడతారు. నాతో కాక ఎంతమందితో తిరిగావో, ఎంతమందికి శరీరాన్ని అప్పగించావో. నీలాంటివాళ్ళను పెళ్ళిచేసుకోవాలంటే నేను వారానికో ఆడదాన్ని పెళ్ళాడాలి అంటూ నోటికి వచ్చినట్లు వాగాడు. అలా కోపంగా మాట్లాడడానికి కారణం సుధ అతనికి లొంగకపోవడమే. ఆమె శరీరపు పొంగులను మాటలతో పొగుడుతూ, కళ్ళతో కామిస్తూ ఏనాటికైనా లొంగకపోతుందా, కోరికలున్న ఆడదికదా అని ఆశపడ్డాడు. ఆమె అతనికి శారీరకంగా దగ్గర కాలేదని, కోపంతో రెచ్చిపోయాడు.

పెళ్ళయ్యేవరకూ మగవాళ్ళు ఆగలేరు. ముందుగానే సెక్స్ కావాలంటారు. ఆ కంగారులో ఆ కోపంలో ఏదో అన్నాడులే అని మొదట సరిపెట్టుకుంది సుధ. కాని అతనితో చాలామంది అమ్మాయిల స్నేహం. పైగా ప్రేమలేఖలుగాని, ఫొటోలుగాని చూపించి బ్లాక్‌మెయిల్ చేసి, వాళ్ల దగ్గరనుండి డబ్బు గుంజడం ఇవన్నీ చేస్తున్నాడని ఆలస్యంగా తెలుసుకుంది సుధ.

ఆ తరువాత అతని స్నేహానికి, ప్రేమకు గుడ్‌బై కొట్టేసి తండ్రి తెచ్చిన సంబంధానికి ఒప్పేసుకుంది. మరో నెలలో పెళ్లి ఉందనగా సంజయ్ సుధమీద దాడి ప్రారంభించాడు. దానితో ఆమె మొహం వాడిన కలువలా మారిపోయింది. ఆ ఉత్తరాలు పెళ్ళికొడుక్కి పంపుతానని బెదిరించాడు. ఒక్కసారి తన కోరిక తీరిస్తే ఆ ఉత్తరాలు తిరిగి సుధకు ఇచ్చేస్తానని అన్నాడు. పెళ్ళికాకుండా కన్నెగానైనా వుంటానుగాని



నీకుమాత్రం లొంగను అని తెగేసి చెప్పేసింది సుధ. దానితో ఆమెపై పగబట్టాడు. బట్టలు లేకుండా ఆమె శరీరాన్ని తాకలేకపోయినందుకు మండిపడుతున్నాడు.

సంజయ్ తనను వదలడని భయంవేసి ముందుగానే తనకు కాబోయే భర్తకు అన్ని విషయాలు ఏదీ దాచకుండా చెప్పేసింది సుధ. అతను దానిని పెద్ద సీరియస్‌గా తీసుకోలేదు. కల్మషం లేకుండా అంతా చెప్పినందుకు సుధను మరింత అభినందించాడు. సంజయ్ బెదిరిస్తున్నప్పుడు అదే విషయం సంజయ్‌కు చెప్పి, 'నా ఉత్తరాలు పెళ్ళికొడుక్కి పంపుకో, నాకేం అభ్యంతరం లేదు' అంది.

దానితో సంజయ్ రెచ్చిపోయి మీ అత్తమామలకు పంపుతాను. వయసులో వున్నవాళ్ళు ఆదర్శాలకు కట్టుబడి ఇలాంటివి పట్టించుకోకపోయినా పరువు అంటూ పాకులాడే ఆ పెద్దలు తప్పక ఈ పెళ్ళి కాన్సిల్ చేస్తారు అని కొత్తపాట మొదలు పెట్టాడు. దానితో మరింత భయం పట్టుకుంది సుధకు. పెళ్ళి దగ్గర పడుతుంటే ఆనందానికి బదులు ఆవేదన ఎక్కువవుతోంది.

ఆ పెళ్ళికాస్తా అయిపోతే సుధ తనకు దక్కదని సంజయ్ భయం. ఎలాగైనా ఆమెను పొందాలనే పట్టుదలతో వున్నాడు. సుధకు తన ఒంటిమీద మెత్తని పట్టుచీర కూడా ముళ్ళచీరలా అనిపిస్తుంది. కారణం ఆమె మనసును తొలిచివేస్తున్న సమస్య అలాంటిది.

ఏంచేయాలో పాలుపోవడంలేదు సుధకు. ఒక ప్రక్క పెళ్ళి దగ్గర పడుతుంటే అది ఆగిపోతుందేమోననే భయం ఎక్కువ కాసాగింది. ఆడదానికి శీలం అంటే ప్రాణం అని మగవాడు దానిమీదే దెబ్బకొట్టాలని చూస్తాడు. దానిని నాశనం చేసి పగ తీర్చుకుంటాడు. అలాంటి కక్ష అతనిమీదే తీర్చుకుంటే ఎలా వుంటుంది అన్న ఆలోచన వచ్చింది. సంజయ్‌ని సాయంకాలం పార్కుకి రమ్మంది. ప్రోగ్రాం ఫిక్స్ చేస్తుందని చాలా సంతోషంగా వచ్చాడు సంజయ్.

"సంజయ్, నీవు నేను వ్రాసిన ఉత్తరాలు బయటపెడితే నేనూ తెగిస్తాను. పెళ్ళి ఆగిపోతే ఆగిపోయింది. నీవు నపుంసకుడివని, అందుకే నిన్ను పెళ్ళి చేసుకోలేదని అందరికీ చెబుతాను. మగవాడు సిరి లేకపోయినా హాయిగా వుండగలడుగాని, మగసిరి లేకపోతే వుండలేడు, మగసిరి లేని మగవాడు, పెళ్ళికాకుండా తల్లి అయిన ఆడది సంఘంలో ఇన్‌ఫీరియర్ కాంప్లెక్స్‌తో తలెత్తుకుని తిరగలేరు. రేపు నీకు పెళ్లయి పిల్లలు పుట్టినా నా మాటలు నమ్మిన లోకం ఆ పిల్లలకు నీవు తండ్రివి కావు అంటుంది. ప్రజలు చెడుని వెంటనే నమ్మేస్తారు. కాబట్టి నీమీద నేనూ దుష్ప్రచారం చేస్తాను, నా పెళ్ళి ఆగిపోతే అంది.

అంతే ఏమనుకున్నాడో ఏమో ఆ ఉత్తరాలు ఆమె చేతిలో పెట్టి మెల్లగా జారుకున్నాడు సంజయ్, ఆమె పెళ్ళి చల్లగా, చక్కగా జరగడానికి కారకుడౌతూ.

(భూమి, 28-11-91)

☆ ☆ ☆

# ఆన్సర్

రామం మాస్టారు హాస్పిటల్‌లో ఉన్నారని తెలిసి చూడడానికి వెళ్ళాను. ఆయన్ని చూడగానే నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆయన సైన్సు మాస్టారు కాకపోయినా స్టూడెంట్సుకి అస్తిపంజరాన్ని చూపించవలసి వస్తే, తన అస్తిపంజరాన్నే చూపించే స్థితిలో ఉన్నారు. ఒకానొకప్పుడు ఉన్నత స్థితిలో ఉన్నాయనే. పరిస్థితుల ప్రాబల్యం వలన అలా అలా అయిపోయారు. ఇప్పుడు ఆయనకు కాన్సరట. ఎక్కువకాలం కాదుకాదు ఎక్కువ రోజులు బ్రతకరట. జీవితంలో అన్నిటికైనా ఘోరమైన విషయం మన చావు మనకు తెలియడమే. అందుకే కాబోలు సృష్టికర్త దానిని సీక్రెట్‌గా ఉంచాడు. అది ఎంత రహస్యమైనా అడపా, తడపా అనారోగ్యంతోనున్న కొన్ని కేసులకు డాక్టర్లు ముందుగానే చెప్పేస్తారు.

మాస్టారు ఎప్పటిలాగే నన్ను చూసినవ్వారు. 'మనం ఒక రోజు గడిపేసామంటే. ఒకరోజు చావుకి దగ్గరపడుతున్నామట. అందుకే బ్రతికినంతకాలం నవ్వుతూ బ్రతకాలి. ఏ రోజైనా నవ్వలేనినాడే చెడ్డరోజు. అమావాస్యలు అలాంటివి కాదు, చెడు రోజులు' అనేవారు. అందుకే కాబోలు ఒంట్లో ఓపిక లేకపోయినా నవ్వారు. లెక్కలు ఎంతో బాగా అర్థం అయ్యేటట్లు చెప్పే రామం మాస్టారు యిప్పుడు అతి కష్టంమీద ఆయన రోజులు ఆయన లెక్కించుకుంటున్నారు. ఆ లెక్క ఎంతకీ తేలడం లేదు. ఇంకా ఎంతకాలమో ఆయనకే తెలియడంలేదు.

లెక్కల్లో నూటికి నూరు రాకపోతే ఒప్పుకునేవారు కాదు. 'చదువులోని సబ్జక్టులలో ఒక లెక్కలకు మాత్రమే సుమా వందకు వంద తెచ్చుకునే అవకాశముంది. ఆ అవకాశాన్ని ఎందుకు జారవిడచుకుంటార్రా మూర్ఖుల్లారా' అని తిట్టేవారు.

లెక్కలు చేసేకొద్దీ బుర్ర పదునెక్కుతుంది. 'ముందు ఇందులోని కష్టమైన ప్రాబ్లమ్స్‌ని సాల్వ్ చేయిండి. జీవితంలో సమస్యలు కూడా సులువుగా పరిష్కరించుకునే నేర్పు ఏర్పడుతుంది, ఓర్పు వస్తుంది అనే మాస్టారు ఇప్పుడు ఇలా అయ్యారు.

నన్ను చూసి మెల్లగా మాట్లాడారు. 'చూడు శివం, మా అబ్బాయి ప్రభాకర్ నన్ను అపోలోకి తీసికెళతానంటున్నాడు. నాకు తోడుగా శలవు పెట్టి తానూ వస్తానంటున్నాడు. ఎందుకు నన్నిలా వదిలేస్తే ఒంటరిగా అపోలో గ్రహానికి వెళ్లిపోగలను. నాకు దారి తెలుసు. తోడు అవసరంలేదు. నాకు తెలుసు నేను మరికొద్ది రోజులకంటే బ్రతకనని. ఎందుకు చెప్పు వాడికీ తాపత్రయం. చెప్పులరిగేలా హాస్పిటల్ చుట్టూ తిరిగినా, నా ఆయుష్షు పెరగడం మాత్రం కల్ల అన్నారు. ఆయనకు అటువంటి పరిస్థితిలో కొడుకుని యిబ్బంది పెట్టడం ఏమాత్రం యిష్టం లేదు.

కన్నతండ్రిమీద మమకారం ఉండడం సహజమే కదండీ మాస్టారు అన్నాను.'

"నిజమేననుకో. వాడికి నేను విద్య తప్పించి మరే ఆస్తీ యివ్వలేదు. జీవితం చివరి దశలో ఉన్నాను అని అందరికీ తెలుసు. వాడు అప్పులు చేసి నన్ను అన్ని దిశలకూ, హాస్పిటల్స్‌కు తిప్పనక్కరలేదు అంటే వినడు" అన్నారు.

చాలావరకూ మధ్య తరగతి కుటుంబాలలో యిటువంటి సమస్యలు మామూలే!

"పోనీ, తన తృప్తికోసం తీసికెళ్లనివ్వండి మాస్టారు. లేదంటే తను జీవితాంతం బాధపడతాడు. పోనీ మీకు తోడుగా నేను వస్తాను" అన్నాను.

"ప్రభాకర్ జీవితాంతం బాధపడతాడు అని అనుకుంటే, నా ఆత్మ జన్మజన్మలకూ సంతోషించదు. ఇప్పటికే వాడు నాకు, వాళ్ళ అమ్మకు వేలకువేలు తగలేసాడు. నిజం చెప్పాలంటే మా వలన చాలా అప్పులు చేసాడు. ఇప్పుడు నన్ను తగలెయ్యడానికి కూడా మరలా ఎవరినో దేవిరించక తప్పదు. ఇప్పుడనిపిస్తుంది భీష్ముడికి ఉన్నట్లే మనకు కూడా ఎంతకాలం బ్రతకాలి అన్నదానికి వరం లేకపోయినా, ఎప్పుడు కావాలంటే అప్పుడు చనిపోయేలా వరం ఉంటే బావుండేది. నేను ఈ నిమిషంలోనే చనిపోయి ఉండేవాడిని' అన్నారు.

ఇంతలో ప్రభాకర్ భార్య కారేజి తీసుకొని వచ్చింది. ఆత్రంగా తిన బోయారు. కాని తినలేకపోయారు. మాస్టారుకి చేపలకూర యిష్టం అని అందరికీ తెలుసు. రోజూ సరదాగా వేలం వేసి మరీ చేపలను తెచ్చుకొని వండించుకొని తినేవారు. ఇప్పుడూ తినాలన్న ఆశ ఉన్నా తినలేకపోతున్నారు. ఆయనకు ఏమేం కావాలో అన్నీ పెట్టేయండి. ఇది చివరి స్టేజ్ అన్నారట డాక్టర్లు. నిజానికి చేపలకూర తినకూడదట. కాని ఆయన కోరికపై ఆవిడ వండుకొని వచ్చింది.

నేను మంచాన పడి మిమ్మల్నందర్నీ యిబ్బంది పెట్టేస్తున్నాను అన్నారు. ఆయన గమనించారు ఆవిడ చేతికున్న మట్టిగాజులు, అంటే బంగారు గాజులు తన ఖర్చులకోసం మార్వాడి దగ్గరకెళ్ళాయన్నమాట.

"ఛ! అదేం మాటండి మామయ్యగారూ, మీరు బావుండి, తిరగాలిగాని శ్రమదేముందండి అంది తన చేతులను ఆయనకు కనబడనీయకుండా వెనక్కు పెట్టి. అపోలోకు తీసికెళ్లడం అనవసరం అని డాక్టర్ చెప్పేసారు."

ఆ తరువాత నేను కొంచెం సేపు కూర్చొని వెళ్ళిపోయాను. కాని ప్రతిరోజూ రెండు పూటలా వెళ్ళి వస్తున్నాను. మరో నాలుగు రోజుల్లో మాస్టారు కోమాలోకి వెళ్ళిపోయారు. అదే లాస్ట్ స్టేజ్ అట. ఇక అలాగే ఆయన ప్రాణాలు పోతే పోవచ్చుట. కోమానుండి తేరుకున్నా బ్రతకడం మాత్రం జరగదట.



మాస్టారు కోమాలోనున్నా, నన్ను గుర్తుపట్టకపోయినా ఆయన దగ్గరకు వెళ్లడం మానలేదు నేను. ఎందుకంటే ఆయనమీద ఉన్న అభిమానం అలాంటిది. నాకు పుస్తకాలు కొనిపెట్టేవారు, అప్పుడప్పుడు ఫీజులు కట్టేవారు. ఆయన ఉన్న పరిస్థితులలో అది ఆయనకు కష్టమైన పనయినా, యిష్టంగానే చేసేవారు. నాకేనేమిటి, నాలాంటి వాళ్ళెందరో ఆయనకు రుణపడి వున్నారు.

ఆరోజు నేను వెళ్ళేసరికి మంచం దగ్గర చిన్న డిస్‌కషన్ జరుగుతోంది. డాక్టరుగారు మాస్టారిని యింటికి తీసుకెళ్ళిపొమ్మన్నారట. ఎందుకంటే మహా అయితే నాలుగయిదు రోజులకంటే ఎక్కువ బ్రతకరు ఆయన అని ఖచ్చితంగా చెప్పేసారు. నిజానికి మాస్టారిని డిస్‌చార్జి చేయకుండా ఉంటే ఆయన బ్రతికినన్ని రోజులు వాళ్ళకు ట్రీట్‌మెంట్‌కి నర్సింగ్‌హోమ్ ఛార్జెస్‌వలన డబ్బులు వస్తాయి. కాని ఫలానా హాస్పిటల్‌లో పేషెంట్లు చనిపోతున్నారు అనే చెడ్డపేరుని తట్టుకోడానికి వాళ్ళు సిద్ధంగా లేరు. అందుకే ఆయన ప్రాణం పోకముందే తీసికెళ్ళిపొమ్మంటున్నారు.

ప్రభాకర్‌కి తండ్రిని తీసికెళ్ళడానికి ఎటువంటి అభ్యంతరమూ లేదు. కాని వచ్చిన అభ్యంతరమల్లా ఇల్లుగల వాళ్ళతో. ఇంటి ఓనర్సుకి చాదస్తాలు, పట్టింపులు ఎక్కువ. ఇంటికి తీసికొస్తే యింట్లో ప్రాణంపోతే తరువాత ఇల్లు ఖాళీ చేయడమూ, శాంతి చేయడమూ వీటన్నిటికి మేము సిద్ధంగా లేము. పేషెంటుని అక్కడే ఉంచండి అని వాళ్ళు అంటారు. ఇటు ఓనర్సు యింటికి తీసుకురావద్దని, అటు హాస్పిటల్‌వాళ్ళు

త్వరగా రామంగారిని తీసికెళ్ళిపొమ్మని వారిద్దరి మధ్య రామంగారి ప్రాణం పోకముందే పోకచెక్కలా నలిగి పోతున్నాడు ప్రభాకర్.

అలాగే వాదనలతో రెండు పూటలు గడిచాయి. రెండు ప్రక్కలనుండి ఒత్తిడి అధికంగానే ఉంది.

ప్రభాకర్ ఎటూ నిర్ణయించుకోలేకపోతున్నాడు. అయినా అతని నిర్ణయంతో సంబంధంలేని సమస్య అది. బ్రతికున్నంతకాలం ఎంతో ఠీవిగా బ్రతికిన మాస్టారు శవంగా మారకముందే మాకొద్దు మాకొద్దు అని అనిపించుకుంటున్నారు. ఆయన పాఠాలు చెప్పేటప్పుడు మా యింటికి వచ్చి ట్యూషన్లు చెప్పండి అని ఎంతోమంది అర్థించినా ఆయన వెళ్ళలేదు. ఇప్పుడు ఆయన్ని ఇంట్లోకి తీసికొని రావద్దు అంటుంటే, నా మనసే గిలగిలలాడింది. యింక ప్రభాకర్ పరిస్థితి చెప్పేదేముంది.

ఇంక ఆయనకు స్వంత ఊరు వేరే ఏమీలేదు. అంతా విశాఖయే. స్వంత యిల్లూ సంపాదించుకోలేదు. మంచి మాస్టారు అన్న బిరుదు యిప్పుడు దేనికీ ఉపయోగపడడంలేదు.

ఆ మర్నాడు శుక్రవారం అనిపించి, శుక్రవారం ప్రాణం పోతే కూడా మరో ప్రాణి పోతుందట అంటూ లక్ష్మివారం రాత్రి ఆయన మంచం దగ్గర మరలా తర్జన భర్జనలు మొదలయ్యాయి. ఈయన చావడు మనల్ని బ్రతకనీయడు అన్న దూరపు చుట్టాల మూతి విరుపులు నా చెవులబడింది. మనసు బాధపడింది.

ఆఖరికి నర్సింగ్‌హోమ్ వాళ్ళ గొడవలు ఆగలేక గవర్నమెంటు హాస్పిటల్‌లో జాయిన్ చేయడానికి నిర్ణయించుకున్నాడు ప్రభాకర్. అక్కడ ఎన్ని చావులయినా వాళ్ళకు ఫర్వాలేదు. అదే పెద్ద శ్మశానం లాంటిది అన్న దృష్టితో ఇలా అనుకునే చివరి దశలో అక్కడకు చేర్చి దాని పేరు పోగొడుతున్నారు అన్న సంగతి మరచిపోయి.

చివరికి నేను ఒక నిర్ణయానికి వచ్చి చెప్పాను. 'ప్రభాకర్ నీవు ఏమీ అనుకోకపోతే మాస్టారిని మా యింటికి తీసుకెళతాను రేపు. మా యింట్లో ప్రాణం పోయినా నాకు పట్టింపులేదు. అభ్యంతరమూ లేదు. పైగా నాది స్వంత యిల్లు' అని. నేను నాస్తికుడిని. మనిషిలోని సద్గుణాలే దైవస్వరూపాలు అని గాఢంగా నమ్మినవాణ్ణి.

ప్రభాకర్ సరేననక తప్పలేదు. మాస్టారు మా యింటికి వస్తున్నందుకు నాకు సంతోషించాలో, విచారించాలో తెలియలేదు. నాకు హుషారుగానూ ఉంది. నీర్సంగానూ ఉంది. ఆ మర్నాడు హాస్పిటల్‌లో బెడ్ ఖాళీగా ఉంది. ఏమయ్యారు అని ఆరా తీస్తే, ఆ రాత్రి ఆయనకు సడన్‌గా కోమానుండి మెలకువ వచ్చిందట. బాగానే ఉన్నారట. ఆయనకాయనే డిస్‌చార్జిఅయి ఇంటికి వెళ్ళిపోయారట. రామంకి సడన్‌గా చలి జ్వరం రావడంతో రాత్రి పడుకోడానికి రాలేకపోయాడట. ఆయన కోమాలో ఉన్నారు కాబట్టి అంత అవసరం లేదు అని ఉండిపోయాడట.

అప్పుడే జ్వరంతోనే వచ్చిన ప్రభాకర్ చెప్పాడు ఆ విషయం. మాస్టారు యింటికి వెళ్ళలేదట. కంగారుపడ్డాడు ప్రభాకర్. తరువాత తెలిసింది ఆయన ఎలాగో ఓపిక తెచ్చుకొని, ఆటో ఎక్కి వెళ్ళిపోయారని.

ఆయన కోమాలో ఉండగా మంచం చుట్టూ అందరూ అనుకున్న మాటలు మాస్టారు వినలేదని అందరూ అనుకున్నారు పాపం. మాస్టారు తన జీవితపు చిక్కులెక్కను చివరికి పరిష్కరించి ఆన్సర్ చూపించారు. అది గుండెలను పిండివేసే పరిష్కారం. మాస్టారు తిన్నగా వెళ్ళి సముద్రంలో దూకేసారట. అంతకాలం చేపలను ఆహారంగా తీసుకున్న ఆయన ఇప్పుడు చేపలకు ఆహారం అయిపోయారు. ఎముకలు కూడా మిగలని, దహనానికి కూడా ఖర్చులు అవసరంలేని జీరో ఆన్సర్ అది.

(ఆంధ్రభూమి వీక్లీ, 15-11-90)

☆ ☆ ☆

# ఈ జీవితం నీది

బాబూ, శ్రావణ్,

నీ ఉత్తరం అందింది. నీవు నామీద మోపిన నేరాలన్నీ నిజాలే, అవి నీవు నేరాలు అని అనుకుంటే, అది నీతప్పు కాదు. అది తల్లిప్రేమ తప్పు "నేను కన్న కొడుకు గీసిన గీత దాటడు అన్న తృప్తినాకు జీవితాంతం కావాలి" అన్నదే నేను ప్రవర్తించినా, దాని వెనుక తప్పని సరి పరిస్థితులు చాలా వున్నాయి.

నిన్ను చిన్నప్పుడు తాతగారింటికి పంపి చదివించవలసి వచ్చినప్పుడు నీవు వెళ్ళుతూ ఇష్టం లేక కళ్ళలో నీళ్ళు నింపుకున్నావు అది అందరికీ తెలిసిందే కాని నాకళ్ళల్లో నీ మీద ప్రేమతో కారిన రక్తాన్ని నీవేకాదు ఎవరు గుర్తించలేదు. నాన్నగారికి అనారోగ్యం, ఇంటి బాధ్యతలు, నేను ఉద్యోగం చేయడం తప్పని సరైంది. అదే నీకు శిక్ష అయి నాకు దూరం చేసింది. అప్పుడు నీ పసి హృదయం ఎంతగా గాయపడిందో తెలుసు.

తరువాత ఇంటర్‌లో నీవు సైన్సు గ్రూప్ తీసుకుంటానంటే నేను మేథ్స్ తీసికోమన్నాను. అప్పుడు నీ హృదయములో రేగిన మంటలు నా హృదయాన్ని అంటుకున్నాయి. కాని సైన్సులో కాంపిటేషను ఎక్కువని మేథ్స్ అయితే ఇంజనీరింగు ప్రయివేటుగా నైనా చేరవచ్చునని నిన్ను ఇంజనీరుని చేయమని మీ తాతగారి కోరిక అని అదే తలంపుతో నీకు ఇష్టం లేక పోయినా బలవంతంగా మేథ్స్ తీసికునేటట్లు చేసాను.

ఇంజనీరింగు ఎంట్రన్స్ పాస్ అయిన తరువాత మెకానిక్‌లా, కంప్యూటర్ సైన్సెస్సా, ఎలక్ట్రానిక్సా అంటూ ఒక తతంగం.

నీకు ఇష్టం లేని ఊరిలో తీసికొనమన్నానని నీకు ఇష్టంగాని సబ్జెక్టు తీసుకో మన్నానని నామీద అలిగావు అన్నం మానేశావు ఆ సమయములో నీవు నిప్పుముట్టుకుని చస్తాను అన్న పసి పిల్లాడిలాగే కనబడ్డావు. కాని యుక్త వయస్సు వచ్చిన కుమారునిగా కనిపించలేదు. అంతే అప్పుడు నీవు ఓడిపోయావు.

తరువాత ఎమ్.డి. కి అమెరికా వెళతానని నీవు, వద్దని నేనూ చాలా వాదులాడుకున్నాం, నీవు ప్రతిసారి జీవితంలో నా మాటలకు విలువ ఇవ్వక తప్పడం లేదు. అటువంటి సమయంలో నీ మనసు ఎంత గాయపడుతుందో ఊహించగలను నీ వ్యక్తిత్వాన్ని పక్కకుపెట్టి నా మాటమీదే నడిచావు. ఈవిషయంలో నాకు మరో జన్మలో కూడా తృప్తి మిగిలేటట్లు చేసావు. దానికి నేను నిన్ను కన్నందుకు ఎంతో

గర్విస్తున్నాను. పిల్లలు తల్లిదండ్రుల మాటవింటే ఆ తల్లిదండ్రుల కెంత గర్వకారణమో నన్నడిగితే చెబుతారు.

కాని, కన్నా! నీవు జీవితంలో స్థిరపడడానికి చివరి మలుపు ఇది. ఉద్యోగం వచ్చేవరకూ నా మాట విన్నావు. ఇకపై కూడా వింటావు ఎందుకంటే మొదటినుండి నీకు అలా అలవాటయిపోయింది. నీవు నన్ను అనుమానించినట్లుగా నీ పెళ్ళి విషయంలో నేనేమీ ఆటంకాలు పెట్టను బాబూ! జీవితను నీవు ప్రేమించానని వ్రాసావు. నేను పెండ్లి అంగీకరించనేమో నని భయపడుతున్నావు. నీకా భయమేమీ అక్కరలేదు. ఇంత కాలం నిన్ను నా కంట్రోల్‌లో ఉంచానంటే నిన్ను కన్నతల్లిగా నాకు ఆ అధికారం ఉంది. అందులోని కష్టనష్టాలు మనిద్దరివే. కాని పెండ్లి విషయంలో నేను ఆటంక పెడితే అది అవతల మరో స్త్రీ జీవిత నాశనానికి కారణ మవుతుంది. ఆ అమ్మాయిని వద్దు అనే అధికారం నాకు లేదు. ఇంతకాలంగా చిన్నప్పటి నుండి నీకు ఇష్టం లేని పనులు చేయిస్తూ నీ కళ్ళల్లో సుడులు తిరిగిన నీళ్ళే చూసాను. ఆ నీళ్ళే ఇప్పుడు నీ పెండ్లితో పన్నీరు కావాలి. ఇకపై నీ జీవితమంతా నందన వనమే కావాలి.

ఇంతకాలం నీవు ఒంటరివాడవు కాబట్టి నీ జీవితం నాచేతులలో ఉంది. ఇకపై నీవు ఒక ఇంటి వాడివి అవుతావు, ఆ తరువాత నీ జీవితం నీదే సుమా జాగ్రత్త! నేర్చిన విద్యకే కాక నీ పుట్టుకకూ సార్థకత చేకూర్చు. నీ నిర్ణయంలో లోటుపాట్లకు నీవే బాధ్యుడవవుతావు కనుక బాగుగా ఆలోచించి నిర్ణయం తీసుకోగలవని ఆశిస్తున్నాను.

ప్రేమతో
నీ తల్లి.

ఉత్తరం చదివిన శ్రావణ్ కళ్ళ వెంట అప్రయత్నంగా నీళ్ళు చిందాయి. తల్లిమనసు ఎంతగా కొడుకు క్షేమం కోసం కొట్టుమిట్టాడుతుందో, తల్లి ప్రేమ ఎంత అపురూప మైనదో గ్రహించాడు. జీవితతో జీవితం పంచుకుని తల్లి ఆశీస్సులు పొందడానికి ప్రయాణమయ్యాడు.

(జయశ్రీ)

☆ ☆ ☆

# ఇదంతానీకోసమే

డియర్ సుజాత.

నాబాధ ఎవరితో చెప్పుకోవాలో అర్థంకాక, నీకు ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. నా పెర్సనల్ విషయాలు నీకు తప్ప, ఎవరికీ చెప్పనని నీకు తెలుసుకదా! పెదవి దాటితే పృధివి దాటుతుందన్న సామెత ఉంది. అది అక్షరాల నిజం. దయయుంచి నేను వ్రాసిన విషయం నీ మనసులోనే ఉంచుకో. ఎవరికీ చెప్పవద్దు. నా కాపురం నలుగురి నోళ్ళలోనూ పడి, నానడం నాకిష్టం లేదు.

మావారు, మోహన్‌గారు, నీవు నేను అనుకున్నట్లు శ్రీరామచంద్రులుకారు. క్రిందట సంవత్సరం నుండి మా మధ్య అన్నీ కలతలే. ఒకసారి కేంప్ నుండి వచ్చిన సూట్‌కేస్‌లో ఒక జాకెట్ దొరికింది నాకు. ఇంక నేను వివరంగా వ్రాయనవసరం లేదనుకుంటాను. మిగిలిన దంతా నీవే గ్రహించ గలవు. ఆ రోజు నుండి ఈ రోజు వరకూ నేను మనశ్శాంతిగా గడిపిన క్షణం కాని, కడుపునిండాతిని, కంటినిండా నిద్ర పోయిన రోజుగాని లేదు. ఇంక ఆడదానికి జీవితంలో అంతకంటే పనిష్మెంట్ ఏమికావాలి. ఏది కాకూడదు అని భగవంతుణ్ణి నేను కోరుకున్నానో, అదే నాకు ప్రసాదించాడు. నాకు ప్రశాంతి అన్నది లేకుండా చేసాడు దేవుడు.

ఆయన్ని అప్పుడే నిలదీసి అడిగాను. ఔనని గాని, కాదని గాని అనలేదు. ఆయన అబద్ధం ఆడరని తెలుసు. ఆ మౌనాన్ని అంగీకారంగా భావించుకున్నాను నేను. నా పై చూపే ప్రేమలో ఎటువంటి లోపమూ లేదు. కాని ఆమె సంగతి అడిగితే మాత్రం ఏ సమాధానం చెప్పరు. తరచుగా కాంప్‌ల కెళ్ళడం జరుగుతూనే ఉంది. అది కూడ ఆయన ఉద్యోగంలో తప్పనిసరి డ్యూటీ. ఆయన్ని కేంప్‌లకు వెళ్ళకుండా ఆపలేను. తను వెళ్ళిన తరువాత స్థిమితంగా బ్రతకలేను. నేను జీవితంలో అన్నిరకాల కష్టాలు అనుభవించి, ఇటీవలే ఏదో స్థిరపడ్డాను అని అనుకునే సరికి, దేవుడు నా జీవితంతో ఆటలాడుతున్నాడు. బహుశా యిక ముందు నేను బ్రతికే బ్రతుకు అంతాయిలా కుళ్ళికుళ్ళి కృశించి పోయి బ్రతకాలేమో.

నా మనస్సు ఎంత ప్రయత్నించినా దేనిమీద ఉండడం లేదు. అంతా మోహన్ గారి చుట్టూ, ఆయన నాకు చేసిన ద్రోహం చుట్టూ తిరుగుతూనే ఉంది. మనసుని కొంచెం కంట్రోల్ చేసికోవాలని వంటమనిషిని, తోట మాలిని మాన్పించి వేసాను. పని చేస్తున్నంతసేపు పని మీదే దృష్టి, పని కాగానే తిరిగి నా ఆలోచనలతో నాకు పిచ్చిపట్టేస్తుందేమో నన్నంత బాధగా ఉంది. అలాపిచ్చి పట్టినా బావుండును. మనసు ప్రశాంతంగా ఉండును, ఈ నరకం అనుభవించేకంటే. అమ్మో ఎందుకలా ఉన్నావు

అని పిల్లలు అడుగుతారు. వాళ్ళకు ఏం సమాధానం చెప్పను. ఇప్పటికి నా భార్యస్థానం దిగజారింది. కొంత కాలం పోతే, ఆవిడకు పిల్లలుపుడితే నా పిల్లలకు, తండ్రి ప్రేమ కూడ తరిగిపోవచ్చు. సుజాతా! నన్నేం చేయమంటావు చెప్పు. చచ్చిపోవాలని అనిపిస్తుంది. అంత ప్రేమగా ప్రాణంలో ప్రాణంగా నన్ను చూసుకునే మోహన్‌గారు యిలా మారిపోయారంటే, అసలు నమ్మబుద్ధి కావడం లేదు. ఇది కలయితే ఎంత బావుణ్ణు అని పిస్తుంది. కాని యిది కలకాదు, వాస్తవం అని నేను వ్రాస్తున్న ఈ ఉత్తరమే సాక్ష్యం. త్వరలో ఉత్తరం వ్రాయి. నన్నేం చేయమంటావు? మోహన్‌గారితో విడిపోయి విడిగా బ్రతకలేను. కలసి ఉండి ఈ కష్టాన్ని భరించలేను. ఉంటానిక.

కన్నీళ్ళతో
నీ లత.

☆ ☆ ☆

నా ప్రియమైన లతా!

ఈ ఉత్తరం చూసి, నీవు ఆశ్చర్యపోవచ్చు. నేను కాంప్‌కి వచ్చి పదిహేను రోజులయింది. మరో అయిదు రోజుల్లో పని పూర్తి చేసుకొని, నీ పుట్టిన రోజు నాటికల్లా నీముందుంటాను. ఈ సారి నీ కళ్ళలో కన్నీళ్ళకు బదులు, కాంతులే కనబడాలి సుమా!

లతా! నీకు తెలుసు. నీవంటే నాకెంత ప్రేమో, నేను పరాయి స్త్రీల వైపు, కన్నెత్తి చూడనని కూడ తెలుసు కాని, ఈ మధ్య నామనసెందుకు మారిందో, ఈ ఉత్తరం పూర్తిగా చదివితేనే అర్థం అవుతుంది. అప్పుడు నీ మొహంలో కనబడే, ఆనందాన్ని చూసి, నాకు పట్టుకోవాలనే ఉంది. కాని నీ దగ్గర నేనుండను, మరి. నీవు నిజంగా నా జీవిత భాగస్వామివి. నా కష్టాల్లో అన్నిటికంటే ఎక్కువగా, నీవే పాలు పంచుకున్నావు. ఆ రోజుల్లో నిన్ను సుఖపెట్టలేక పోయానని, నా యింటి బాధ్యతలన్నీ నీ నెత్తి మీద వేసానని, నీవు ఏనాడు విసుక్కోలేదు. మన బాధ్యతలన్నీ తీరిపోయాయి. నాకు మంచి ఉద్యోగం వచ్చింది. పిల్లలు కూడ పెద్ద వాళ్ళయ్యారు గత మూడు సంవత్సరాలుగా మనం చాల సంతోషంగానే ఉన్నాము.

నీకు అంతస్తుతో పాటు ఆడంబరాలు, ఆభరణాలు పెరిగాయి. ఈనాటికైనా నిన్ను సుఖ పెట్ట గలిగి నందుకు, నేను ఎంతగానో పొంగిపోయాను. కాని నా ఉత్సాహమంతా ఒక్క సంవత్సరంలో దిగిపోయింది. కారణం, హోదాతో పాటు నీకు బద్దకం, నన్ను పిల్లలను పని వాళ్ళ మీద అప్పుడప్పుడు వదిలేయడం జరుగుతుండేది. అయినా నేను బాధపడలేదు. కాని పేరుకి తగినట్టు లతలా ఉండే నీవు నీ పేరుకి అప్రతిష్ట తెచ్చావు. రోజు రోజుకీ నా సంపాదనతో పాటు, నీ శరీరం కూడ పెరిగి

పోసాగింది. నీవు నీ సంతోషంతో నీ శరీరం గురించి పట్టించుకునే స్థితి ఎప్పుడో దాటిపోయావు. నిన్ను చూస్తుంటే నాకు చాల బెంగగా ఉండేది. నిన్ను లతలాగనే చూడడం నాకిష్టం. మరో రూపంలో నాకిష్టం లేదు. రాను రాను నా పక్కన నిన్ను చూసిన వాళ్ళు, నిన్ను నా అక్క అంటున్నారని తెలిసి చాల బాధపడి అప్పటి నుండీ, డైటింగ్ అదీ మొదలు పెట్టావు గాని, ఏం ఫలితం లేకపోయింది. ఇలాగే మరో రెండేళ్ళు పోతే నీవు నా భార్యవు కాదేమోనన్న అనుమానం నాకే కలిగేలాంటి పరిస్థితి రావచ్చు.

శరీరం పెరగడంతో పాటు అందం తరుగుతుంది. అంతేకాదు, అనారోగ్యానికి అది మొదటి మెట్టు. లావయిన శరీరం అనాకారి తనానికి, అనారోగ్యానికి దగ్గర దారి అవుతుంది. నిన్ను పూర్వపు లతలా చేయడం, యిప్పట్లో అయ్యేపనిలా నాకనిపించడం లేదు. ఎందుకంటే మా అక్కయ్యలను, మా స్నేహితుల భార్యలను చూసిన నేను, సన్నగా ఉన్న వాళ్ళను లావు చేయవచ్చును గాని, లావుగా ఉన్న వాళ్ళను సన్నగా చేయడం చాల కష్టం అని ఎప్పుడో గ్రహించాను. నిన్ను నాకు నచ్చిన రీతిలో మలచుకోవాలంటే చిన్నప్పుడు నేను చదివిన కథ ఒకటి గుర్తుకి వచ్చింది. 'ఒక రాజుగారంటారు. ఆయనకు సుఖ భోగాలతో, శరీరం విపరీతంగా పెరిగి పోతుంది. రాజుగారికి, తిరిగి సన్నబడాలని కోరిక కలుగుతుంది. కాని రాజ వైద్యులు ఎన్ని మందులు ఇచ్చినా ఫలితం కనిపించడంలేదు. ఆఖరికి తన శరీరం తగ్గడానికి సరయిన మందు యిచ్చిన వారికి ఎన్నో మంచి, మంచి బహుమతులు యిస్తానని ప్రకటించారు. అయినా లాభం లేకపోయింది.

ఆఖరికి, ఆస్థాన జ్యోతిష విద్వాంసులలో ఒకాయన వచ్చి మహాప్రభూ, ఎందుకు మీరింత ఆందోళన పడతారు. సన్నబడాలని, 'ఒక నెల రోజులలో మీరు చనిపోతారు' అని చెబుతాడు. అంతే రాజుగారికి షాక్ తగిలినట్లవుతుంది. 'నీ జ్యోతిషం ఫలించకపోతే నీ తల తీయించి వేస్తాను అని ఆ పండితునితో రాజు అంటే, నా తల తీయించడానికి మీరు ఉండరు కదా అంటాడు ఆ పండితుడు. దానితో రాజుగారికి విపరీతమైన బెంగ పట్టుకొని నెల తిరిగే సరికి బక్కచిక్కి పోతాడు. కాని చనిపోడు. అర్థం అయిందికదూ! పండితులు రాజు గారికి యిచ్చిన మందు. ఆమందే నీ మీద ప్రయోగించాను. మైడియర్ లతా! నిన్ను ఇన్ని రోజులు బాధపెట్టి నందుకు నన్ను మనస్ఫూర్తిగా మన్నిస్తావు కదూ! ఆ జాకెట్ ఎవరిదో అంత మాత్రం గ్రహించలేక పోయావు. మూడేళ్ళ క్రితం నీవు కుట్టించుకొని, ఆ తరువాత టైట్ అయితే బీరువాలో మూలన పడేసిందే. అది దొరికితే, నేను కేంప్‌కి వెళ్ళేటప్పుడే దాన్ని పట్టుకుపోయాను. నీ అనుమానంతో అంత దూరం గ్రహించలేక పోయావు. చూస్తుంటే, మనస్సెంత కరిగి పోయేదో, నన్ను నేను ఎలా నిగ్రహించుకున్నానో మాటలలో నీకు ఎలా చెప్పగలను. నా కోరిక తీరే వరకూ పట్టుదలగా ఉండడానికి చాల కష్టపడవలసి వచ్చింది.

లతా! నేను వచ్చే కేంప్‌లలో నీవు ఊహించినట్లు గానే ఆడవారికి ఏమీ లోటు ఉండదు. నేను ఊ అంటే చాలు ఎంతో మంది సుందరాంగులను, పట్టుకొని వస్తారు. కాని నేను కేంప్‌లో ఉన్నప్పుడు నీకు నేను ఎంత దూరంలో ఉంటానో, నీవూ నాకు అంత దూరంలో ఉంటావు. నాలాగే నీవూ నిగ్రహం కోల్పోతే, నేను సహించగలనా? నేను సహించలేని అలాంటి పని చేస్తే నీవు సహించలేవని తెలిసి, తప్పటడుగు వెయ్యగలనా? నీతి అనేది ఆడదానికి ఎంత అవసరమో, మగవానికి కూడా అంతే అవసరం, అని నమ్మేవారిలో నేనొకడిని. ఎప్పటికీ నేను, నీ శ్రీరామచంద్రుడినే. ఇప్పటి కయినా అంతా, అర్థం అయిందా. ఈ ఉత్తరం చదివిన తరువాత నీ కళ్ళల్లో కనబడే మెరుపు చూడాలని చాల ఆరాటంగా ఉంది. నేను వచ్చే సరికి కాస్త దాస్తావు కదూ! ఉంటానిక.

నీ ప్రియాతి ప్రియమైన
మోహన్.

(పత్రిక, 25-10-87)

☆ ☆ ☆

# తృప్తి

నాకు పెళ్ళయిన దగ్గర నుంచి ముఖ్యంగా ఒక కోరిక ఉండిపోయింది. అది తీరే మార్గం మాత్రం కనబడలేదు. మావారి తీరే వేరు. అంతా సంసార తాపత్రయమే గాని, నేను కొత్త పెళ్ళికూతురిని, కొత్త భార్యను అన్న భావమే ఆయనలో లేదు.

అత్తింటివారిది ఉమ్మడి కుటుంబం. పైగా కాస్త పల్లెటూరు కావడంతో నేను ఆ ఇంటికి సముద్రంలోకి నీటిబొట్టులా మాత్రమే ప్రవేశించాను. ఆ ఇంట గుట్టు అనేది ఏమీ లేదు. అంతా బట్టబయలే. మా కొత్త జీవితంలో సరసాలు, సరదాలు, గిలిగింతలు, పులకింతలు ఏమీ లేవు.

మావారు మెడికల్ రిప్రజెంటేటివ్. ఎప్పుడూ ట్రిమ్‌గా తయారై వెళుతుంటారు. ఆయన వెళ్ళేటప్పుడు ఓ ముద్దు పెడతారన్న ఆశ ఏ కోశానా లేకపోయినా, కనీసం ఆయనకు టై కట్టాలనో, తిరిగి రాగానే బూట్లు విప్పాలనో, స్నానం చేసేటప్పుడు వీపు రుద్దాలనో ఇలాంటి కోరికలు ఎన్నో ఉండేవి నాలో. నిజానికి ఆ కోరికలకు ఖర్చులేదు. పైపెచ్చు అవి భార్యాభర్తలకు ఎంతో ఇష్టమైనవి కూడా. కాని ఆ చిన్నవి తీరడమే ఎంతో కష్టమైపోయింది.

మా ఇల్లు ఎప్పుడూ నిండా మనుషులతో గోలగోలగా ఉంటుంది. అటువంటి చోట నా కోరిక తీరడం కలలో మాట అని అర్థం అయింది. కొత్త దంపతుల కలయిక కూడా యాంత్రికమే ఆ ఇంట్లో.

ఇంతలో నీరజ్ పుట్టాడు. నాకు ఇప్పుడు నా భర్తతో ఒంటరిగా గడపాలి అన్న కోరిక కంటే నా కొడుకుతో తీరికగా ఆడుకోవాలి అనే ఆశ ఎక్కువైంది. నేనే ఉగ్గుపాలు పోయాలని, స్నానం చేయించాలని అనుకునేదాన్ని.

"నీవు చిన్నపిల్లవు, నీకు ఏమీ తెలియదు'' అంటూ మామగారి తల్లి అన్ని పనులూ చూసుకునేది. అలా అని నాకు అంతా తీరికే అనుకుంటే అదీ పొరపాటే. ఇంటి పనితో, వంట పనితో నీరజ్‌కు పాలు ఇవ్వడానికి తప్ప ఖాళీ ఉండేది కాదు. పక్క మీద రాత్రి పడుకోగానే అలసిన శరీరానికి నిద్రముంచుకు వచ్చి బాబును ముద్దులాడే అవకాశమే ఉండేది కాదు. మా అత్తగారు నన్ను అర్థం చేసుకునేవారు కాదు.

ధీరజ్ పుట్టేనాటికి మా అత్తగారి తల్లి మామగారి తల్లి పోవడంతో ధీరజ్ పని

కాస్త నేనే చూసుకోవచ్చనుకున్నాను. కాని మా ఆడబడుచు భర్తను పోగొట్టుకొని ఇంట చేరడంతో, ఆవిడ చాలా పెద్దది కావడంతో అన్నీ ఆవిడే చూసుకునేది.

బాబు విషయం ఆవిడ చూసుకుంటున్నందుకు నాకు సహాయంగా ఉంటున్నందుకు నవ్వాలో, ఏడవాలో తెలిసేది కాదు. బాబు పని నన్ను చూసుకోనిచ్చి, వంట ఆవిడ చేయొచ్చు కదా అన్న విషయం నా మెదడుని తినేసేది. మా పిల్లలిద్దరితోనూ మేమిద్దరం కలసి ఎక్కడికైనా, ఆఖరుకి పుణ్యక్షేత్రాలకైనా సరే వెళ్ళానలని అనుకునేదాన్ని కాని ఎప్పుడూ ఆ అవకాశమే రాలేదు. సినిమాలకు ఆడబడుచులు, మరుదులు; గుడులకు అత్తమామలు తోడు వచ్చేవారు.

విరజ పుట్టేనాటికి మా ఆడబడుచు ఇల్లు కొనుక్కొని వెళ్ళిపోయింది. అప్పుడే పాపను నేనే స్వయంగా నా చేతులతో పెంచుకుందా మనుకునేసరికి, నా ఆరోగ్యం దెబ్బతినడంతో పాప పని అంతా అత్తగారు చూసుకునేవారు.

అలాగే జీవితంలో ఏ ఆశా తీరకుండానే పిల్లలు పెద్దవాళ్ళయిపోయారు. మా పల్లె కూడా పట్టణం అయిపోయింది. అన్ని కోరికలను అణచివేసినా నేనూ, ఆయన, పిల్లలు కలిసి ఎవరికీ తెలియకుండా ఒక ఫామిలీ ఫోటో తీయించుకోవాలన్న కోరిక మాత్రం నాలో బలీయమైపోయింది. అది ఎప్పటినుంచో ఉన్నా ఆ అవకాశం వచ్చేసరికి మాతోపాటు ఎవరో ఒకరు కూర్చుండిపోయేవారు. మేము అయిదుగురం బయటకు వెళ్ళే అవకాశమే వచ్చేది కాదు. మావారు కూడా సంసారం పెద్దది కావడంతో సైడ్ బిజినెస్‌లు చేస్తూ సంపాదనలో పడి బిజీగా ఉండేవారు.

విరజకు పదేళ్ళ వయసులో మా ఆడపడుచులకు పెళ్ళిళ్ళయిపోయి వెళ్ళిపోతే, మా మరుదులు ఊరెళితే మావారిని బ్రతిమాలి, ఒప్పించి మా అత్తమామలకు మస్కా కొట్టి ఫోటో కోసం బయలుదేరాం. గుమ్మంలోనే చుట్టాలు ఎదురు కావడంతో ఆ పని ఆగిపోయింది. మా అత్తగారితో నా మనసులో మాట చెప్పడానికి భయం.

నాకు మాత్రం రోజు రోజుకీ మేము అయిదుగురం మాత్రమే కనీసం జీవితంలో ఒక్క రోజయినా ఇంట్లోనే ఉండాలనీ, అలాంటి స్వీట్‌హోమ్‌లోని స్వీట్‌ని కనీసం ఇరవై నాలుగు గంటలైనా ఆస్వాదించాలనీ అనిపించినా, అది గగనకుసుమమే అయింది. ఫోటో ఆశ తీరనే లేదు.

మా మరుదులు పెళ్ళిళ్ళయి వేరు కాపురాలు పెట్టేశారు ఉద్యోగాల వంకతో వేరే ఊళ్ళల్లో. నీరజ్ హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. మావారు నీరజ్‌కు మా ఊరికి ట్రాన్స్‌ఫర్ అయ్యేలా ప్రయత్నాలు, నేను కోడలి కోసం ప్రయత్నాలు చేస్తున్నాం. నాకు

అన్నివిధాలా అమ్మాయి నచ్చితే తాను ఫార్మల్‌గా వచ్చి చూసి తాళి కట్టేస్తానని నీరజ్ అనడంతో, హోటలులో తిండి నీరజ్‌కి పడకపోవడంతో అమ్మాయిల వేటలోనే నా ఆలోచనలు ఉండిపోయాయి.

మా అత్తమామలు సడన్‌గా తిరుపతి ప్రయాణం పెట్టుకున్నారు. అదే సమయంలో నీరజ్‌ని రప్పించి మాకు కనీసం కోడలు వచ్చి మా కుటుంబం ఆరుగురం అయ్యే లోపుగానైనా మా అయిదుగురం ఒక రోజన్నా ఆ ఇంటిలో స్వేచ్ఛగా ఉండి, ఒక ఫామిలీ ఫోటో తీయించుకోవాలన్న కోరిక తిరిగి మొలకెత్తింది.

నాకు చెప్పలేనంత ఆనందం కలిగింది. ఇప్పటికి నా కోరిక తీరుతున్నందుకు నీరజ్ పెళ్ళికి ముందే మేము అయిదుగురం ఫోటో తీయించుకోవాలి, మరి నేను, నా భర్త, నా పిల్లలు అనుకుంటూ దాన్ని చూసి జీవితాంతం నేను మురిసిపోవాలి. అది తీరుతుంది అనుకునేసరికి నా కాలు నేల మీద నిలవడం లేదు. మనసు దూదిపింజలా అయిపోయింది. ఈ కోరిక మా అత్తగారితో చెబితే ఆవిడే తీర్చేవారేమో! ఆవిడ మనసు మంచిదే. కాని ఎలా చెబుతాను? ఏమని చెబుతాను?

ఇంతలో నీరజ్ కోసం చూసిన ఒక అమ్మాయి నాకు చాలా నచ్చడంతో ఆ అమ్మాయిని చూడడానికి అర్జెంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చాను. ఒక పెళ్ళికి వెళ్ళి రెండు రోజుల్లో వస్తున్నానని టెలిగ్రాం ఇచ్చాడు నీరజ్.

నీరజ్ కోసం, మేము గడపబోయే రోజుల కోసం వేయి కళ్ళతో ఎదురు చూడసాగాను. భార్య, భర్త, పిల్లలు మాత్రమే ఉండే సంసారం, ఎంత మధురంగా ఉంటుందో ఊహించుకుంటున్నాను.

ఈ రోజే నీరజ్ వస్తాడు. మా అత్తమామలు ఈ రోజే ఊరెళ్ళారు. సాయంకాలానికి నీరజ్ రావాలి. అప్పటి వరకు నేను సంతోషాన్ని ఆపుకోలేకపోతున్నాను. నా గుండె పగులుతుందేమో అన్నంత ఆనందంగా ఉంది నాకు. నీరజ్ రానే వచ్చాడు. ఒంటరిగా కాదు. స్నేహితుని చెల్లి పెళ్ళికి వెళ్ళాడట. కట్నం తక్కువైందన్న కారణాన పెళ్ళి ఆగిపోతే ఆ మూడు ముళ్ళు తాను వేసేశాడట పెళ్ళికూతురి మెడలో.

అమ్మాయి బంగారు బొమ్మలా ఉన్నందుకు, నీరజ్ ఉన్నతంగా ఆలోచించి ఆమెను పెళ్ళాడి ఒక యువతి జీవితానికి దారి చూపినందుకు మరో సమయంలో అయితే ఎంతో సంతోషించేదాన్ని. కాని ఈ పనితో జీవితంలో తీరబోయిన నా కోరిక ఇక తీరం చేరక సముద్రంలో కొట్టుకుపోయిందని తెలిసి దుఃఖం వచ్చింది. నా దుఃఖాన్ని కంట్రోల్ చేసుకొని కోడల్ని మనస్ఫూర్తిగానే ఇంట్లోకి ఆహ్వానించాను - నా ఆశను సమాధి చేస్తూ, ఆ అమ్మాయి జీవితానికి మంచి పునాది వేస్తూ.

వెంటనే నీరజ్‌కి మా ఊరు ట్రాన్స్‌ఫర్ అయింది. అదే ఇంట్లో ఉంటానని తాను అన్నాడు. నేను తప్ప అందరూ పట్టుబట్టారు వాళ్ళు మాతోనే ఉండాలని. వాళ్ళు ఆ ఊళ్ళోనే వేరు కాపురం పెట్టాలని, నాకు తీరని ఆశలు నా కోడలికైనా తీరాలని, అందరినీ ఎదిరించి వాళ్ళను వేరే ఇంట్లో పెట్టేశాను. నేను అనుకున్నవి నా జీవితంలో ఏవీ నెరవేరకపోయినా, నాలా నా కోడలు బాధపడనందుకు, తన ఆశలు తీర్చుకునే అవకాశం కల్పించినందుకు నాకు ఎనలేని సంతోషం. నా కోరిక తీరినంత తృప్తిగా ఉంది.

(ప్రభ, 09-05-90)

☆ ☆ ☆

# డబ్బు

సూర్యుడు తూర్పున ఉదయించాడు. అదేమీ పెద్ద విశేషం కాదు. తల్లి పిల్లలను ప్రాణం కన్నా మిన్నగా ప్రేమిస్తుంది. అది అంతకన్నా పెద్ద విషయం కాదు. రేవతి కూడా అందరి తల్లులలాగే తన ముగ్గురి మగ పిల్లలను ఎంతో జాగ్రత్తగా పెంచింది. పిల్లల చిన్నప్పుడే భర్త పోవడంతో భర్త ప్రేమను కూడా పిల్లలకు తానే అందించింది. భర్త శ్రమను కూడా ఆమే పడి వారిని పెంచింది. వారినుండి ఆమె ఏమీ ప్రతిఫలం కోరలేదు. వారికోసం ఎన్ని బాధలు పడినా ఆమె ఏనాడూ బాధపడలేదు. కాని ఈనాడు, రేవతి వెక్కివెక్కి డొక్కలు ఎగసిపడేలా ఏడుస్తూంది. దిక్కులు పిక్కటిల్లేటట్లు ఏడవకపోయినా గుండెలు పగిలేటట్లు ఏడుస్తుంది. భర్త పోయిన తరువాత ఆ పెంకుటిల్లే ఆమెకు నీడను ఇచ్చింది. ఆ గదిలోని కుక్కిమంచమే ఆమెకు తోడయింది. చిరిగిన పరుపే శరీరాన్ని సేదతీర్చింది. ఆ దూది తలగడే ఆమె కన్నీటి వేదనను తనలో దాచుకుంది.

డాక్టర్లు ఆమెకు ఒంట్లో బాగులేని కారణంగా చాపమీద పరుపు, తలగడ లేకుండా పడుకోమని, అంటే అని ఉండవచ్చు. ఆమె మెడను సరిగా పెట్టుకోలేక కాదు, తన బాధను నోటితో కాక, కన్నీటితో తలగడకు చెప్పుకుందామన్న ఆశతో తలగడ వేసికొని నేలమీద పడుకుంది. పెద్ద కొడుకు విసురుగా వచ్చి తలగడ లాగేశాడు. ఆమె ఆరోగ్యంమీద అశ్రద్ధతో కాదు. ఆమె డబ్బు తన చేతికి ఇవ్వలేదనే కోపంతో. ఆ విసురుకు ఆమె తల నేలకి దబ్బున తగిలింది. ఆ దెబ్బ పట్టించుకోకుండా కొడుకు అక్కడినుండి కోపంగా వెళ్ళిపోయాడు. ఆమె ఆ దెబ్బకి తట్టుకోలేక కోమాలోకి వెళ్ళిపోయింది.

హాస్పిటల్‌లోని మెత్తని పరుపులు, తలగడ ఆమెకు సుఖాన్ని ఇవ్వలేకపోతున్నాయి. కోమాలో ఉన్నా కొడుకుల, కోడళ్ళ మాటలు ఆమెకి ఏదోలోకంలోనుండి వినబడుతున్నట్లు వినబడుతూనే ఉన్నాయి. "ఈ వయసులో అమ్మకి డబ్బంటే మరీ ఆశ ఏమిటి? అంతా కూడగట్టుకుని కూడా పట్టుకెళ్ళిపోతుందా ఏమిటి? ఎంత సంపాదించినా ఒక్కతే కదా వెళ్ళేది. ఇప్పుడీమె గుటుక్కుమంటే ఆ డబ్బు ఎక్కడ దాచిందీ, ఎవరి దగ్గర దాచిందీ తెలియదు" పెద్ద కొడుకు ఆవేదన అది. తల్లిమీద ప్రేమకంటే డబ్బుమీదే ప్రేమ ఎక్కువ అతనికి.

"మొన్న మా ఆవిడ ఆపరేషన్‌కి డబ్బు కావల్సివచ్చి రెండువేలు అడిగాను. రెండు రూపాయలు కూడా ఇవ్వలేదు" మరో కొడుకు.

"డబ్బు వడ్డీలకు తిప్పుతుంది. పొలంమీద పంట వస్తుంది. మిషను కుడుతుంది.

ఈ మధ్య గేదెను కొంది కదా పాలు, పెరుగు అమ్ముతుంది. అప్పడాలు కూడా వత్తుతుందట. మరి ఆ డబ్బంతా ఏం చేస్తుందో'' మూడో కొడుకు బాధగా మూలిగాడు.

కోడళ్ళు కూడా కొడుకులకు ఏమాత్రం తీసిపోరు. పుట్టింటినుండి నోట్లకు బదులు నోళ్ళు తెచ్చుకున్నారు. దానితోనే హాయిగా బ్రతికేస్తున్నారు. అత్తగారిని సూటీ పోటీ మాటలంటూ కోడళ్ళు ముగ్గురూ పిసినారి పేరమ్మ అని ఆవిడకు నిక్‌నేమ్ పెట్టి 'పి.పి' అని మాట్లాడుకుంటారు ఎప్పుడూ.

"ఇంతకీ మీ అమ్మగారు డబ్బు ఏంచేస్తున్నట్లు. కొంపతీసి ఎవరైనా...'' సంశయాత్మకంగా, ఆవిడ శీలాన్నే శంకిస్తూ అంది పెద్దకోడలు. భర్త చిన్నవయసులో పోయినప్పుడే పిల్లలకోసం సెక్స్ అనే మాటను కూడా భర్తచేతిలో వేసేసిన రేవతి, ఈ వయసులో అలా చేసిందంటే కొడుకులు నమ్మరు. కాని వారికిప్పుడు తల్లిమీద కోపంగా ఉంది. అందుకే ఆ మాటలో నిజం లేకపోయినా, వారు ఆమె మాటలను వారించలేదు.

"ఒకవేళ డబ్బంతా బంగారంలా ముద్ద చేసికొని మింగేసిందేమో, ఒకసారి ఎక్స్‌రే తీయిద్దామా?'' మరో కోడలు తెలివి ప్రదర్శించింది.

"ఇంతకాలం డబ్బంతా మీకు కాక ఎవరికి, అంతా నా మనుమలకే, నేను నా పిల్లలను డబ్బులేక ఎక్కువ చదివించలేకపోయాను. నా మనుమలకు చదువుకొనడానికి ఇబ్బంది ఉండకూడదు అనేది. అయినా ఏనాడు నయాపైసా విదల్చలేదు. మరి డబ్బంతా ఏం చేస్తుందో'' మూడో కోడలు మాటలవి. కోడళ్ళు తల్లిని ఏకవచనంలో సంబోధించడం కొడుకులు గమనించికూడా గమ్మున ఉన్నారు వారిని ఏమీ అనక.

రేవతి మనుమలకు ఏదో సంపాదించి ఇవ్వాలని పొదుపు చేయడం మొదలు పెట్టిన దగ్గరనుండి మాటలతో ఆమె గుండె తూట్లు పడుతూనే ఉంది. నవారు తెగిన మంచం, కుట్లు ఊడిపోయిన పరుపు, చింకి తలగడ, దానిపై తూట్లు పడిన గుండెతో రేవతి. మొదట్లో మనుమలకోసం పొదుపు చేయడం మొదలుపెట్టింది. నోరు కట్టుకుంది. చినిగిన బట్టలు కట్టుకుంది. అందరినుండీ బాణాల్లాంటి మాటలు మూట గట్టుకుంది. అయినా ఆమె పట్టిన పట్టు విడువలేదు. రానురాను ఆ డబ్బే ఆమె కళ్ళు తెరిపించడం మొదలు పెట్టింది. నా పిల్లలు ప్రేమిస్తున్నది నన్నా, డబ్బునా అన్న ఊహ రాగానే ఆమె ఎందుకో జ్వరపడిన రోగిలా అయింది. త్వరపడి డబ్బు పిల్లలకు ఇచ్చేయనందుకు మాత్రం సంతోషించింది.

జీవితం అంటే కష్టాలమయం. సుఖాలు వస్తే సంతోషించాలి. కష్టాలు వస్తే విచారించకూడదు. అన్నట్లు.

భర్త పోయిన తరువాత కడుపులో ఆకలిని, శరీరపు ఆకలిని కూడా చంపుకుంది రేవతి. తన పిల్లలు తింటుంటే ఆ నోరు తనదిగా భావించుకునేది. వారి కడుపు

నిండుతుంటే ఆ కడుపు తనదిగా అనుకుని తృప్తి పడేది. మునులు భక్తికోసం ఉపవాసాలు చేస్తే, ఆమె తన పిల్లల భుక్తి కోసం ఉపవాసాలు చేసేది. అది త్యాగం కాదు. పిల్లలపైనున్న అనురాగం. పిల్లలు తల్లి కడుపులో నున్నప్పుడు తల్లి ఉదరాన్నే గదిలా చేసికొని ఎంత క్షేమంగా ఉన్నారో, తండ్రిపోయినా అంతే క్షేమంగా ఉన్నారు. ఆమె వారిని పసిపాపలలాగే చూసింది. అలాగే పెంచింది. అడ్డాలనాడు, గడ్డాలనాడు ఒకేలా చూసింది. వాళ్ళు ఒక్కొక్కసారి "అమ్మా! నీకు మాకంటే ఈ ఇల్లు, ఈ మంచం, ఈ పరుపు, ఈ తలగడే ఇష్టం కదా!" అని తల్లితో వేళాకోళం ఆడేవారు, ఉడుక్కుంటూ.

"నిజమేనర్రా, అవి నాకు ఇచ్చిన ఆశ్రయం, మరెవ్వరూ ఇవ్వలేదు. నేను చనిపోతే నన్ను మట్టిమీద పడుకోబెట్టవద్దు. పరుపు, తలగడ వేయండి. ఈ మంచాన్ని కూడా కట్టెలుగా కొట్టి వాటితోనే కాల్చివేయండి. నా వేదన అంతా నా తలగడలోనే ఉంది. అది నా కన్నీరు అంతా భరించింది. నా వేదనను, మాత్రం నాతోనే కాల్చేయండి. మీ కోసం ఏమీ మిగుల్చుకోవద్దు" అనేది. "అమ్మా! అలాంటి మాటలు అనవద్దు. నీవు లేకుండా మేం ఉండలేం" అనే కొడుకులు ఇప్పుడు "నీవు చచ్చినా ఫరవాలేదు. డబ్బు ఎవరిదగ్గర దాచావో చెప్పు అంటున్నారు. డబ్బంతా, ఏ అనాధాశ్రమానికైనా ఇచ్చేయడం లేదుకదా? అన్నది వారి బాధ. వారికి ఇంకొక అనుమానం కూడా ఉంది. డబ్బు ఎవరిదగ్గర దాచిందో, అమ్మ చనిపోతే ఆ డబ్బంతా వారు తినేస్తారనే భయంకూడా ఉంది.

ఆమె ఏమైనా, చెబుతుంది గాని, డబ్బు ఎవరిదగ్గర దాచిందీ చెప్పడం లేదు. అడిగి అడిగి ఇల్లంతా వెతికి, వెతికి అలసిపోయారు. అంతకుముందు కూడా డబ్బుకోసం, ఏదో వంకపెట్టి, తల్లికి ఉత్తరాలు వ్రాసేశారు. దేవుడికి వ్రాసిన ఉత్తరాల్లా వాటి దగ్గరనుండి బదులు వచ్చేదికాదు. బండరాయి అని ఒకరు, జగమొండి అని ఒకరు తల్లిని అసహ్యించుకోవడం మొదలుపెట్టారు. "గాలి పీల్చడం, ఎలర్జీ అనుకుంటే మనిషి తన ప్రాణాన్ని నాశనం చేసికొనడమెలాగో, తల్లిని ఎలర్జీగా భావించడం, తమ పుట్టుకకు ద్రోహం చేసుకొనడం లాంటిదే" అమ్మకు మాకంటే డబ్బు ఎక్కువా అని అనుకుంటే, అదే మాట రేవతికూడా అనుకునేది. నా పిల్లలకు నాకంటే డబ్బు ఎక్కువా? అని. రేవతికి రానురాను డబ్బు విషయంలో పిల్లల తాపత్రయం చూసి ఆమెలో పట్టుదల మరీ పెరిగింది డబ్బు ఎక్కడ దాచిందో చెప్పకూడదని. డబ్బు ఇంట్లో లేదని తెలిసిపోయింది వారికి. 'ఎవరి దగ్గర దాచింది' అన్న మాటను, తారకనామంలా జపించడం మొదలుపెట్టారు. బంగారం, పొలంకూడా అమ్మేసి డబ్బుగా మార్చేసిందని తెలిసింది. ఎంత లేదన్నా అరవై, డెబ్బయి వేలపైనే ఉండాలి అని కొడుకుల అభిప్రాయం. ఒకవేళ ఏ బిందెలోనైనా వేసి భూమిలో కప్పెట్టిందా అని నేలంతా పరీక్షించారు. ఫలితం లేకపోయింది.

రేవతి హస్పిటల్‌నుండి డిశ్చార్జి అయిరాగానే ఎలా ఉన్నావు? అని ఎవరూ అడగలేదు. 'డబ్బెవరిదగ్గర దాచావు' చెప్పు. అడిగి తెస్తాం. హస్పిటల్‌లో చాలా ఖర్చయింది' అని మాత్రం అడిగారు. ఆవిడ గొంతు పోయిన దానిలా మాట్లాడలేదు. ఆ మౌనం కత్తి కంటే పదునుగా ఉండి, వారి సహనాన్ని కోసేసింది. అయినా రేవతి అదరలేదు, బెదరలేదు. 'ఆ డబ్బు మీకు గాక ఇంకెవరికి? అన్న భావంతోనే వారిని చూసింది. 'అమ్మా! ఎలాగైనా, ఆ డబ్బు మాకే కదా! ఇప్పుడే ఇచ్చేయకూడదా అని అడిగారు. వేదాంత ధోరణిలో ఒక నవ్వు నవ్వి ఊరుకుంది గాని ఆ డబ్బు ఎవరి దగ్గర దాచిందో మాత్రం చెప్పలేదు.

రేవతి ఆరోగ్యం అయితే బాగుపడింది గాని, కొడుకుల కోడళ్ళ ప్రవర్తనతో మనసు మాత్రం మరీ చెడిపోయింది. "నా పిల్లలు మరీ ఇంత డబ్బు మనుషులా? వారు ప్రేమించేది డబ్బునే కాని, నన్ను కాదా?" అన్నది ఆమె హృదయంలో గునపంలా గుచ్చుకుంటూనే ఉంది. ఇప్పట్లో వారికి డబ్బు విషయం చెప్పకూడదు అని మరీ గట్టిగా నిర్ణయించుకుంది.

చప్పటి, చల్లటి కాఫీ ఇచ్చేవారు కోడళ్ళు. కాఫీలో కొంచం పంచదార వేయండి అంటే 'పంచదార లేకపోతే ప్రాణం పోదులే' అనేవారు, ఆవిడకు వినబడేలాగ. మంచి చీర పెట్లోనుండి తీసిమ్మని అడిగితే, "ఇప్పుడు షోకులెందుకు" అంటూ చిరిగిన చీర ఇచ్చేవారు. నేలమీద పడుకున్నప్పుడు కొంచెం తలగడ ఇవ్వండి అంటే, 'అబ్బో ఎంత సుఖం కావాలో' అని హేళనగా నవ్వేవారు. ఆవిడ ఏది అడిగితే అది చండికలా చేసేవారు. అందుకే ఆవిడ డబ్బు విషయంలో చండిక అయిపోయింది. 'ఓ డబ్బూ! నీవెంత మంచిదానివే. నా కళ్ళు తెరిపించావు. నా కొడుకుల కోడళ్ళ నిజస్వరూపం చూపించావు' అని ఆ డబ్బుని తలుచుకుని మరీ మరీ మురిసిపోయేది. డబ్బిచ్చి ప్రేమ కొనుక్కోవడం ఆమెకు ఇష్టం లేదు. అందుకే ఎన్ని నిష్ఠూరాలైనా కష్టంగానే భరిస్తుంది.

కోడళ్ళు, కొడుకులు వెళ్ళిపోయారు. మళ్ళీ ఒంటరితనం. అయినా రేవతి బాధ పడలేదు. వాళ్ళు ఇంట్లో ఉన్నంతకాలం సూటీ పోటీ మాటలు, హేళనలు, వెక్కిరింతలు భరించింది. ఇప్పుడామెకు ప్రశాంతంగా అనిపించింది. పెద్దకొడుకు దగ్గరనుండి ఉత్తరం వచ్చింది.

'అమ్మా! ఈ వయసులో నీవు కృష్ణా, రామా అనుకుంటూ ఉండవలసింది పోయి డబ్బు, డబ్బు అంటున్నావు. డబ్బు నీకూడా వస్తుందా, పుణ్యం వస్తుందిగాని, నీ కోడలు దగ్గర నేనెంతో చులకన అయిపోయాను. మీ అమ్మకు డబ్బు పిచ్చి అని పదేపదే అంటూంటే, నేను ఏమీ సమాధానం చెప్పలేకపోయాను. అది నిజమేకదాయని' అని ఉత్తరం రాసేడు.

రెండో కొడుకు, 'అమ్మా! నీవు మాపై ఎంతో ప్రేమను చూపించేదానివి. ఆ ప్రేమంతా ఇప్పుడు ఏమైపోయింది. ఆ డబ్బుతోపాటు మాపై ప్రేమని కూడా, మాకెవరికీ తెలియకుండా ఇచ్చేసావా? పోనీలే! ఆ డబ్బు ఎవరికి ప్రాప్తమో వారికి వెళుతుంది. అయినవాళ్ళకు ఆకుల్లో, కానివాళ్ళకు కంచాల్లో అన్నది ఊరికే అనలేదు పెద్దలు. నీ కడుపున పుట్టింది మేము, నీ కష్టార్జితం అనుభవించేది ఒకరు. ఎవరి అదృష్టాన్ని ఎవరూ చెరపలేరు. ఇటువంటి తల్లి కడుపున పుట్టినందుకు విచారించడం తప్ప నీ నోటినుండి ఆ నిజం మాత్రం బయట పెట్టించలేం కదా మేము.'

చిన్నవాడూ అదే ధోరణిలో వ్రాసాడు. అన్నగార్ల అడుగుజాడల్లో నడుస్తున్నట్లు వారి భావాల్లో తన కలాన్ని ముంచినట్లు వ్రాశాడు. 'అమ్మా! చిన్నప్పుడు నీ కడుపున పుట్టినందుకు ఎంత పొంగిపోయామో, ఇప్పుడంత కృంగిపోతున్నాము. డబ్బు అంటే ప్రతి మనిషికీ ఆశ ఉంటుంది కాని, కన్నవారికి కాక వేరేవారికి, డబ్బుని ఇవ్వడం, అనేదానికి ఏం పేరు పెడితే బావుంటుందో నాకు తెలియదు. మేము నీకంత కానివాళ్ళం అయిపోయాం. మాకు ఒక్క కానీ కూడా ఇవ్వలేకపోతున్నావు. అమ్మా! మేము నీ కడుపున పుట్టినవాళ్ళం కాదా? మమ్మల్ని పెంచుకున్నావా? అని అనుమానం వస్తుంది. నా కష్టార్జితం మీకు కాక ఎవరికి అనే దానివి., ఇప్పుడు నీవు ఆ డబ్బు ఎవరి పరమో చేయడం, అన్న ఊహను భరించడం మా తరం కావడంలేదు'' ఉత్తరం అంతా ఆ విధంగానే సాగింది.

రేవతికి తన పిల్లలు ముగ్గురూ, తన కడుపునుండి పుట్టారా? లేక డబ్బు కడుపునుండి పుట్టారా అని అనుమానం వచ్చింది. అమ్మా అనడం లేదు వారు 'డబ్బు' అంటున్నారు. పెట్టినవాడు పెళ్ళి, పెట్టనివాడు చావు అంటే ఇదే కాబోలు అనుకుంది. ఉత్తరాలు చించేసింది.

మరో నెల గడిచింది. కొడుకులు ముగ్గురికి తల్లి సీరియస్‌గా ఉన్నట్లు టెలిగ్రామ్స్ వెళ్ళాయి. ముగ్గురూ, భార్యాబిడ్డలతో సహా పరుగున వచ్చారు. తల్లి కోసం కాదు. డబ్బు కోసం. వారు వచ్చేసరికి ఆవిడ కొనప్రాణాలతో ఉంది. పోతూ, పోతూ మంచాన్ని నాతో కాల్చేయండి అని వెర్రి సైగలు చేయడం మొదలుపెట్టింది. అసలు విషయం చెప్పనందుకు వారికి నిప్పులమీద నిలబడినట్లుగా ఉంది. యముడితో దెబ్బలాడి అయినా, ఆమె ప్రాణాన్ని ఆపి ఆ విషయం చెప్పించాలని ఉంది. తల్లిపై విసుక్కున్నారు. ఆవిడ మెల్లగా, 'ప్లీడరుగారి దగ్గర...' అనేసరికి యముడు ఆమె గొంతు నొక్కేశాడు.

అన్ని కార్యక్రమాలు ముగిసిన తరువాత, ప్లీడరుగారి దగ్గరకెళ్ళారు ముగ్గురూ. ముందుగా అందరినీ కూర్చోమని చెప్పి, డ్రాయరులాగి ఒక ఉత్తరం వారికి ఇచ్చారు ప్లీడరుగారు. తల్లి స్వదస్తూరీతో వ్రాసిన ఉత్తరం అది. సీలు చేసేసి ఉంది. ఆతృతగా విప్పారు.

"నాయనలారా! డబ్బు దాచి, నా మనుమలకివ్వాలనే ఆశతో ఎంతో పొదుపు చేశాను. తిండికి, బట్టకు కూడా ఖర్చు పెట్టుకోలేకపోయాను. అది కడుపుతీసి అని సరిపెట్టుకుని, కడుపు మాడ్చుకునేదాన్ని. 'మీ నోముల పంటలకోసం నా నోరు కట్టుకుని ఎంతో నిలవచేశాను. కాని ఆ డబ్బు నా కళ్ళు తెరిపించింది. లోకంలో, ప్రేమకు విలువ ఇమ్మని, డబ్బుకి కాదని నా పిల్లలకు నేర్పలేకపోయాను. కనీసం మీ పిల్లలకైనా నేర్పండి. ఈ పాపిష్టి డబ్బు నన్ను, నా పిల్లలను వేరు చేసినట్లే, రేపు మిమ్మల్ని, మీ పిల్లల్ని కూడా వేరుచేయవచ్చు. అందుకే మీరు కోపంగా అన్నా, అదే మాటను నిజం చేస్తూ నేను, నా డబ్బుని నాతోనే తీసికొని వెళుతున్నాను. మీకు నాపై ఎంత కోపం ఉన్నా, నా చివరి కోరిక తీరుస్తారనే నమ్మకం నాకుంది. నేను డబ్బు చెక్కు రూపంలో తీసుకెళ్ళడం లేదు, నిప్పు రూపంలో తీసికెళుతున్నాను నా కూడా. ఎలాగ అని ఆశ్చర్యపోతున్నారా? నా తలగడతో సహా. డబ్బంతా అందులోనే ఉంది. జీవితానికి కావలసింది డబ్బు ఒక్కటే కాదు అని గుర్తుంచుకోండి."

-మీ అమ్మ

(భూమి)

☆ ☆ ☆

# తప్పటడుగు

సుమతి ఇల్లంతా అసహనంగా తిరుగుతోంది. మరో మూడు రోజులలో ఆమె పెళ్ళి. కాని పెళ్ళికూతురిలో ఉండవలసిన హుషారు గాని, ఆనందంగాని ఆమెలో లేవు. మన దేశంలో డబ్బు లేక ఎందరో కన్నెలు కన్నెలుగానే మిగిలిపోతున్నారు. కాని సుమతి తండ్రి కుదిర్చిన సంబంధాన్ని అంగీకరించలేక పోయింది. అడగకుండానే అన్నీ అమర్చే తండ్రి, అడుగులకు మడుగులొత్తే పనివాళ్ళు. అడుగువేస్తే అరిగిపోయిందేమో అనుకునే తల్లితోపాటు, అందం, చదువు సౌశీల్యం గల సుమతి అనుకోకుండా నాగు ప్రేమలో పడిపోయింది, నాగు సార్ధక నామ ధేయుడని, ఆమెకు తెలియదు. ఎన్నో సినిమాలు చూసి, కథలు చదివి ప్రేమ అంటే గొప్ప అభిప్రాయాన్ని ఏర్పరచుకుంది. జీవితంలో ప్రేమ వివాహం తప్ప మరో వివాహం చేసికోకూడదనుకుంది. అందుకే కాలేజి దగ్గర క్యాంటీన్‌లో ఉండే నాగు ప్రేమలో పడింది. నాగు మొదట్లో ఆ విషయం అంతగా పట్టించుకోలేదు. కాని ఆమె అతని వెనక పడి పడి ముగ్గులోకి లాగేసింది. నాగు అక్కడికీ ఆమెకు చెప్పాడు తనకు ఆరునెలల క్రితమే పెళ్ళి అయిందని అయినా అతని మాటలు వినిపించుకోలేదు సినిమా యాక్టర్స్ అందరూ రెండో పెళ్ళి చేసుకుంటున్నారని, ప్రేమకు పెళ్ళిళ్ళు, పేదరికాలు అడ్డురావంది. తండ్రితో తన ప్రేమ విషయం చెప్పింది. అంతే ఆయన అగ్గిమీద గుగ్గిలం అయిపోయి, కాలేజి మాన్పించేసి, పెళ్ళి కుదిర్చేశాడు.

పెళ్ళి కొడుకు సుమంత్‌కి తన ప్రేమ విషయం చెప్పి, పెళ్ళి తప్పించుకోవాలని ప్రయత్నించింది. కాని తల్లి దండ్రులు ఆ పప్పులు ఉడకనివ్వలేదు, ఉపవాసాలు చేసింది. ఏడ్పులుఏడ్చింది. తండ్రి ఎన్ని విధాలు చెప్పినా ఆమెలో పట్టుదల ఎక్కువైందేగాని తగ్గలేదు. రహస్యంగా నాగుకి ఉత్తరం వ్రాసి పంపింది. ఎలాగయినా వచ్చేస్తాను గుళ్ళో పెళ్ళి చేసికుందామని. ఆ రోజు నాగు వస్తానని కబురు చేసాడు. సూట్‌కేసులో సీక్రెట్‌గా నగలు, బట్టలు సర్దుకుంది.

సాయంకాలం "నైటీ" వేసికోలేదే? అని తల్లిదండ్రులు అడిగితే సమాధానం చెప్పలేదు. నాగురాగానే వెళ్ళిపోవాలని ఆమె ఆలోచన.

రాత్రి - మేడమీద తన గదిలో కూర్చుని నాగు రాక కోసం కిటికీలో నుండి ఎదురు చూడసాగింది. నాగుకి సుమతి డబ్బుపై చాల ఆశ ఉంది. ఆ ఆశతోనే భార్య నోరు మూయించాడు. సుమతి నాగు రాకకోసం ఎదురు చూస్తూ, గేట్ చప్పుడుకై నిరీక్షిస్తూ అలా మంచంమీద వాలింది. తల్లి మంచి నిద్రలో ఉంది. తండ్రి ఊరిలో లేడు. ఇంతలో ఆమె నమ్మకాన్ని వమ్ముచేయకుండా గేటు చప్పుడయింది. అప్పుడే మెల్లిగా నిద్రలోకి జారుకున్న ఆమె ఉలిక్కిపడి లేచింది. గేటు అవతల నాగు టార్చిలైటు

మూడుసార్లు వెలిగించి ఆర్పేసాడు. అదే గ్రీన్ సిగ్నల్. అంతే యింకేమీ ఆలోచించలేదు. శబ్దం చేయకుండా అతన్ని చేరుకుంది. నాగు ఆమెను ఆప్యాయంగా పలకరించలేదు. అపేక్షగా సూట్‌కేస్ అందుకున్నాడు.

ఇద్దరూ రిక్షా ఎక్కి ముందుగా గుడికి వెళ్ళి దండలు మార్చేసుకున్నారు. ఆమె తనతో తెచ్చిన మంగళ సూత్రం అతనితో కట్టించుకుంది. అప్పుడు అమ్మయ్య అనుకున్న ఆ క్షణం ఎంత ఘోరమైందో క్రూరమైందో ఆమెకు తెలియదు. తెల్లవన్నీ పాలు అని నమ్మేసింది.

ఆ రాత్రికి రాత్రే అతను సుమతిని సైకిలు మీద ఎక్కించుకొని నాలుగు మైళ్ళ దూరంలో నున్న చుట్టాలింటికి, సుమతి తండ్రికి తమ ఆచూకి తెలియకుండా గతుకుల రోడ్డు మీద తీసికొని వెళ్ళాడు. తన బ్రతుకు ఆగతుకుల రోడ్డు కంటే ఘోరమౌతుందని ఆమెకు తెలియదు.

ఆమె ఆ యింట్లో కాదు, కాదు ఆ నరకంలో అడుగుపెట్టింది. నాగు ఆమెను ఆపాకలో, కుక్కి మంచంలో కూర్చోబెట్టి బయటకు వెళ్ళాడు. మంచంమీద మురికి దుప్పటి నూనె బట్టి తలగడ, మట్టి నేల, గుడ్డి దీపం చూసేసరికి సుమతికి భయం వేసింది. పొరపాటు చేసానా? అని మొదటిసారి అనుకుంది. కాదు కాదు అని తన మనసు తనే మెల్లగా జోకొట్టుకుంది.

ఒక ముసలమ్మ వచ్చి పిల్లా కూడుతింటావా? అని అడిగింది. ఆకలిగా ఉంది. తింటానని తల ఊపింది. సొట్టలుపడిన సత్తుగిన్నెలో చేయికడుక్కోండానే చేతితో అన్నం తీసిపెట్టింది. సుమతి గమనించేసరికి అది యింటింటికి వెళ్ళి అడుక్కు తెచ్చిన అన్నం అని గ్రహించింది. అంతే గతుక్కుమంది. బయట రౌడీలు తాగివచ్చి బండ బూతులు తిట్టుకుంటుంటే అవి వినడానకి కర్ణకఠోరంగా అనిపించింది. అన్నం తినలేదు. ఆ అన్నాన్ని చూస్తుంటే తన యింట్లో రకరకాల పదార్థాలతో నున్న డైనింగ్ టేబుల్ గుర్తుకి వచ్చింది. దుఃఖం, ఆకలి ఆమెపై దాడి చేసాయి.

శోభనపు పెళ్ళి కొడుకులా వస్తాడని ఊహించుకుంది. అలాగే నాగు వచ్చాడు. కాని ఆమె ఊహల్ని తారుమారు చేస్తూ తాగుబోతులా వచ్చాడు. నోటిలో చుట్ట, రాగానే ఏమే పిల్లా దోర మామిడిలాగున్నావు అంటూ తలుపైనా వేయకుండా ఆమె బట్టలన్నీ మోటుగా లాగేయడం మొదలు పెట్టాడు. బయటనుండి మరికొందరు తాగుబోతులు ఆదృశ్యం చూస్తూ వెకిలిగా అసహ్యంగా నవ్వుతున్నారు. ఒక్కసారి ఒళ్ళు, గుండె కూడా జలదరించాయి. సుమతికి ఆ పులి గుహలో నుండి పారిపోయి తండ్రి పాదాలపై పడిపోవాలని అనుకుంది. కాని, నాగు మోటుగా, నేలమీద ఆమెను అతి భయంకరంగా అనుభవించాడు.

ఆ కటిక నేలమీద అతని కరుకు శరీరం క్రింద అతి భయంకరంగా తలుపులు

కూడలేని ఆ గుడిసెలో క్రూరంగా బలి అయిపోయింది సుమతి. చుట్టకంపు తాగుడు కంపుకి ఆమెకి కడుపులో తిప్పి వెంటనే వాంతి అయిపోయింది.

"ఎన్నో నెలేపిల్లా, నేను ఎన్నో వోడిని" అన్నాడు నాగు. ఆమెకు శరీరంతో పాటు, మనసు తూట్లు పడింది. కాని అదంతా స్వయం కృతా పరాధమే! ప్రొద్దున్నే అక్కడనుండి పారిపోవాలని ప్రయత్నించింది. తను అక్కడ బందీ అని గ్రహించడానికి ఎంతో సేపు పట్టలేదు. అంతే వరుసగా మూడు రోజులు రాత్రనక పగలనక చాలమంది క్రూర మృగాలకు ఆహారం అయిపోయింది. ప్రాణం పోయినా బావుండును అని ఏడ్చుకుంది. నాగును ఎంతో బ్రతిమాలింది. యింటికి వెళ్ళిపోతానని లేడిని చూసి పులి నవ్వినట్లు నవ్వాడు. అమాయకంగా ప్రేమ అని నమ్మినందుకు జరిగిన ఘోరపరాజయం అది. దీపం తెలిసి ముట్టకున్నా, తెలియక ముట్టుకున్నా కాలక తప్పదు. మూడు రోజులుకి పెళ్ళి కూతురు ముస్తాబులో చుట్టాలమధ్య, స్నేహితుల మధ్య అపురూపంగా, అందంగా ఉండవలసిన సుమతి ఆ క్రూరుల మధ్య గెద్దనోట్లో కాకిపిల్లలా గిల గిలలాడిపోయింది.

ఇంక ఆ తరువాత తండ్రిదగ్గరకు వెళ్ళిపోవాలి అనే ఆలోచనను బలవంతంగా అదిమిపెట్టేసింది. నేను వచ్చేసిన తరువాత యిల్లు ఎలా ఉందో అని ఊహించు కోడానికి భయం వేసింది. బహుశా అది పెళ్ళి కాక శవం వెళ్ళిన యిల్లులా ఉండవచ్చు అనుకుంది బాధగా తాను శవంలా ఆ యింటి నుండి బయటకు వచ్చినా బాగుండేది. ఈ నరకం ఉండేది కాదు. అని వెక్కి వెక్కి ఏడ్చుకుంది. కాని ఆ యింటి నుండి నిజంగానే శవం వెళ్ళిందని ఆమెకు ఆరోజే తెలిసింది. ఒక విటుడు మిరపకాయ బజ్జీలు తెచ్చుకొని ఆమె ఎదురుగానే తాగుతూ తినడం మొదలు పెట్టాడు. మిరపకాయ బజ్జీలుకట్టి తెచ్చిన కాగితాన్ని యధాలాపంగా చూసింది.

"ప్రముఖ వ్యాపారవేత్త వరహాలరావుగారి అమ్మాయి కనిపించని కారణంగా ఆ అమ్మాయి పెళ్ళి ఆగిపోయింది. వరహాలరావు గారి భార్య ఉరిపోసుకొని ఆత్మహత్య చేసికుంది. అదే రాత్రి యింట్లో దొంగలు పడి వరహాలరావు గారి తలపగలకొట్టి యింట్లో మొత్తం విలువైన వస్తువులన్ని ఎత్తుకుపోయారు. ఆయన చావుబ్రతుకుల మధ్య హాస్పటల్ లోనున్నారు.

"ఇంక ఆ తరువాత చదవలేక పోయింది. బావురుమంది, బోరు మంది. గోడుగోడున గొల్లుమంది. అయినా ఉపయోగం ఏముంది. ఆ పేపరు చూసి తనను పంపేయమని నాగు కాళ్ళు పట్టుకొని ఏడ్చింది. అతను వెకిలిగా నవ్వాడు. సుమతి యింట్లోనుండి వచ్చిన గంటకే. సూట్‌కేస్ అంతా అతని పరమయింది. చీరలు కూడ అమ్మేసి అడుక్కునే వాళ్ళదగ్గర చీరలు కొనుక్కొచ్చి కట్టుకోమన్నాడు. సుమతిని ముక్కలుగా కోసికొని తినడం కాదుగాని, అంతకంటే ఘోరంగానే హింసిస్తున్నాడు

నాగు. భగవాన్! జీవితంలో తప్పేచేసాను. దానికి నా తల్లిదండ్రులను శిక్షించాలా? నేను వేసిన చిన్న తప్పటడుగుకు మొత్తం కుటుంబపు పరువుని, ఆస్థిని, ప్రాణాలను కూడా బలితీసుకున్నావా? నేను చేసిన తప్పుకు నేను ఎలాగు నాశనం అయ్యాను. నా తల్లిదండ్రులు ఏం చేసారు? అని మూగగా రోదించడం మొదలుపెట్టింది. అక్కడ కనీసం ఆత్మహత్య చేసికోడానికి కూడా అవకాశం లేదు. ఆ యింటిలోని బాధగా గుండె కోస్తున్నట్లుగా ఉంది సుమతికి.

నా ప్రాణం పోతే ఎంత బావుణ్ణు అని ఎన్నోసార్లు అనుకుంది. అన్నీ మనం అనుకున్నట్లు జరిగితే దేవుడు అవసరం ఉండదు అని ఎక్కడో చదివింది. అది నిజమే ననుకుంది. యిప్పుడు దేవుని ధ్యానం తప్ప తాను చేయగలిగింది ఏదిలేదు అని ఆ మూడు రోజులలో గ్రహించింది సుమతి.

ఆ రోజు నాగు తనని వ్యభిచార గృహానికి అమ్మకానికి పెడుతున్నాడని తెలిసి విలవిలలాడి పోయింది. ఈ ఊరిలో ఉండి ఎలాగైనా తప్పించుకోవచ్చు. తండ్రిని చూడవచ్చు అనుకుంటే యింక, మద్రాసుకో, బొంబాయికో వెళ్ళి పోతేఎలా? వద్దు తండ్రీ వద్దు అని దుఃఖించింది. హాయిగా భర్తతో హానీమూన్‌కి ఏ అమెరికాకో వెళ్లవలసిన తను, తను చేసిన పొరపాటు వలన వేశ్యగా అమ్ముడవబోతుంది. భగవంతుడా జీవితంలో పొరపాటున కూడ ఏ తప్పు చేయను, ఒక్క సారి నా తప్పు దిద్దుకునే అవకాశం యివ్వు అని దేవుడ్ని వేనోళ్ళ వేడుకుంది. పగిలిన గాజు అతకదు. ఒలికిన నీరు ఎత్తడానికి అవ్వదు అని ఆమెకు తెలుసు. అయినా ఏదో ఆశ, ఏదో విధంగా జీవితం నుండి, యింటి నుండి, కనీసం ఈ లోకం నుండి అయినా విముక్తి ప్రసాదించమని దేవుడ్ని అడుగుతూనే ఉంది. మరో జన్మంటూ ఉంటే పొరపాటున కూడ లక్ష్మణ రేఖ దాటను తండ్రీ అనుకుంది.

ద్రౌపతికి చీరలనిచ్చిన దేవుడు, ఏనుగును మొసలి బారినుండి రక్షించిన దేవుడు సుమతినీ రక్షించాడు.

నాగుకి హార్ట్ఎటక్ వచ్చిపోలేదు. ఆమెను రక్షించడానికి రాలేదు. కాని ఆమెకు నిద్ర నుండి మెలకువ వచ్చింది. ఒళ్ళంతా చెమటతో తడిసి ముద్దయిపోయి ఉంది. నాగుని మనసులో నుండి తుడిచేసి "అమ్మయ్య" అనుకొని, భగవంతునికి ధన్య వాదాలు చెప్పుకొని కిటికీ గట్టిగా మూసేసి, నైట్‌డ్రెస్ వేసికొని తల్లిని కావలించుకొని పడుకునే వరకూ భయం తగ్గలేదు సుమతికి.

(జయశ్రీ, 10-05-88)

☆ ☆ ☆

# భరతమాత నవ్వింది

కలెక్టరాఫీసు కళకళలాడుతుంది. అది ఇల్లు కాదు, కల్యాణ మండపమూ కాదు. అయినప్పటికి ఆ ఆఫీసు అతిథులతో, రంగురంగుల కాగితాలతో వింత శోభను విరజిల్లుతోంది. ఆ రోజు ఆగష్టు పదిహేను కావడమే ప్రత్యేకత.

పురప్రముఖులు అందరూ వచ్చేశారు. జండా వందన సమర్పణ కార్యక్రమం కలెక్టర్‌గారు చేస్తారు. పాతది చిరిగిపోయిందని ఈ సంవత్సరమే క్రొత్తగా తయారుచేసిన మువ్వన్నెల జండా, రంగురంగుల పూలను మూట కట్టుకొని, ఎవరికీ అందనంత ఎత్తులో ముద్దుగా గడను ఆనుకొని ముసిముసి నవ్వులు నవ్వుతోంది.

ఆ స్థలానికి మొక్కుబడిగా వచ్చినవారు కొందరు, భక్తితో వచ్చిన వారు కొందరు అందరూ వరుసలో మరి కొందరు తాత్కాలికంగా బొమ్మల్లా నిలబడ్డారు. కలెక్టర్‌గారు స్టేజి మీదకు వచ్చారు. ఇంకా ప్రోగ్రాము ప్రారంభం కాలేదు. అంతలోనే దూరంగా ఏదో కలకలం వినబడింది. అందరూ జండాను కాక అటువైపు చూడసాగారు. చాలా వింతైన, ఘోరమైన సంఘటనే అది. ఒక పిచ్చిది ఆకలి ఆకలి అంటూ దిసమొలతో నలుదిశలా పరుగు పెడుతోంది. ఆమెకు దేవుడిచ్చిన వరం పెద్ద జుట్టు, ఆ జుట్టే ఆమెకు బట్టలులా రక్షణ నిస్తున్నాయి.

ఆమె వెంట ఆమెను తరుముతూ బంధించాలని చాలామంది పరుగులు తీశారు. ఆమె చేతిలోని రాయితో తనను, వెంబడించినవారిని బెదిరించేసరికి భయపడి ఊరుకొని, సమయం కోసం కాసుకున్నారు.

ఆ పిచ్చిది పరుగుపరుగున వచ్చి జండా కర్రకు జేరబడి ఆకలి ఆకలి అని అరవసాగింది. ఆమెను పట్టుకోడానికి చాలామంది రాబోయారు. కాని కలెక్టర్‌గారి కనుసైగలో ఎక్కిడివారక్కడే ఆగిపోయారు.

ఆమె పిచ్చిది కాబట్టి, తన శరీరం మీద బట్టలు లేవన్న సంగతి గ్రహించుకోలేక పోయినా, ఆకలి మాత్రం ఆమెకు తెలుస్తూనే ఉంది. పిచ్చిది కదా అని ఆకలి వేయడం మానదు కదా! వెంటనే కలెక్టర్‌గారికి ఏమి స్ఫురించిందో ప్రోగ్రాముని, ఆ ప్రోగ్రాము యొక్క ఆర్డర్‌ని ఒక ప్రక్కకు పెట్టి జెండాను లాగేశారు. పూలు, రంగురంగుల పూలు ఆమె తలపై అక్షింతలులా పడ్డాయి. ఆ జెండాను క్రిందగా లాగారు. ఇటూ చూశారు. టేబుల్ మీద కత్తెర ఏమీ కనబడలేదు. కోటు జేబులోకి చేయి పోనిచ్చారు. ఆయన కారు తాళాల్లో నెయిల్ కటర్ లాంటిది ఉంది. ఆ నెయిల్ కటర్‌లో పోల్డింగ్ చేయబడిన చిన్న కత్తెర ఉంది. గబగబ ఆ కత్తెర తీసి జండాను తాళ్ళ నుండి వేరు

చేశారు. ఆ జండాను ఆమె మీద కప్పారు. అది అంతా అనుకోకుండా ఎవరూ ఊహించని విధంగా క్షణాల్లో జరిగిపోయింది. ఆమెపై ఆ జండా కప్పక ముందు, ఆమె మీద పడిన రంగురంగుల పూలను ఎవరూ చూడలేదు. ఆమె ఒంపు సొంపులనే చూడసాగారు. ఆమె అలా పిచ్చిది కావడానికి కారణం మగవాళ్ళే కావచ్చు. ఆమె మానాన్ని దోచుకున్న వాళ్ళే కావచ్చు. కానీ ఆ సమయంలో అందరూ తేలుకుట్టిన దొంగలే.

కలెక్టర్‌గారు మిగిలిన ప్రోగ్రాముని జాయింట్ కలెక్టర్‌కి అప్పజెప్పి ఆమెను కేంటీన్ దగ్గరకు తీసుకెళ్ళారు. ఆమెకు కడుపు నిండా తినడానికి పెట్టేసరికి పోయిన ప్రాణం వచ్చినట్లయింది. కలెక్టర్‌గారు ఆమెపై తన కోటే కప్పి ఉండేవారు కాని, ఆ కోటు కంటే ఆ పెద్ద మూడు రంగుల జండా రక్షణ చాలా ఇచ్చింది. ఆమె శరీరాన్నంతా కప్పింది. సంవత్సరానికొకసారి ఉత్సవ విగ్రహంలా బయటకు వచ్చే ఆ జండా తన జన్మకు సార్ధకత లభించినట్లు భావించుకుంది. గర్వంగా అందరి వైపూ చూసింది.

కలెక్టర్‌గారు అంతటితో ఊరుకోలేదు. ఆమెను కారులో పడుకోబెట్టించి, తాళాలు తీసుకొని కారు స్టార్ట్ చేశారు. కారు మెంటల్ హాస్పటల్ వైపు పరుగుతీయసాగింది. తాను ఎక్కడికి వెళుతుందో ఎవరు తీసుకొని వెళుతున్నారో కూడా తెలియని ఆ పిచ్చిది పకపకా నవ్వసాగింది. ఆమెను చూసి భరతమాత నవ్వింది, సంతోషంతో గుండెలు పగిలేలా. ఇన్నాళ్ళకు తన పుట్టినరోజుకి సార్ధకత లభించినందుకు, కలెక్టర్‌గారికి ఆమె స్త్రీలా కాక, ఒక తల్లిలా, చెల్లిలా, భార్యలా, కూతురిలా కనబడసాగింది.

జాతీయ జండా ఒక వస్త్రంలా ఒక స్త్రీకి ఉపయోగపడినందుకు, భరతమాతతో పాటు ఆ జండాను తయారుచేసిన పింగళి వెంకయ్యగారూ పకపకా నవ్వారు.

(ఆంధ్రభూమి డైలీ)

★ ★ ★

# హత్యకాని హత్య

ఐర్లాండు దేశంలో ఇన్నీస్‌కార్తి అనే ఊరిలో ఊరికి దూరంగా కొంచెం ఎత్తయిన కొండలాంటి అందమైన ప్రదేశంలోనున్న సైకియాట్రిక్ హాస్పిటల్ ఎంతో మనోహరంగా కనిపిస్తుంది. ఆ హాస్పిటల్‌ను చూడగానే ఇది ఇండియాలో ఉండవలసింది ఐర్లాండులో ఎలా ఉందబ్బా అనిపిస్తుంది. అక్కడివారు దానికి కారణంకూడా చెబుతారు. బ్రిటీష్‌వారు ఆ రోజుల్లో ఇటు ఇండియాను అటు ఐర్లాండును పాలించేటప్పుడు పొరపాటున ఇండియన్ ప్లాన్ ఐర్లాండులో కట్టారని, కాబట్టి ఆ దేశంలో అది అన్నిటికి భిన్నంగా కనిపిస్తుందని చెబుతారు.

ఆరోజు మావారు డబ్లిన్ వెళ్ళారు. ఐర్లాండు రాజధాని అయిన డబ్లిన్‌లో ఒక కేసు విషయంలో ప్రయాణం చాలా కష్టం. కార్లటైర్లు జారిపోతాయి. నాకు మనసంతా దిగులుగా ఉంది.

ఇంతలో మరొక ఊరునుండి అరుణ ఫోను చేసింది. ప్రసాద్ డబ్లిన్ నుండి రాలేదా? కోర్టులో కేసు గురించి పేపరులో పడింది. ప్రసాద్ ఇచ్చిన స్టేట్‌మెంటు చదివాను అంటూ. ఐర్లాండులో ఇండియన్స్ చాలా తక్కువమంది వున్నారు. చుక్కల్లో చంద్రుడిలా వున్నవారిని గుర్తుపెట్టుకోవడం కష్టమేమి కాదు.

మంచు కురిసినందుకు విపరీతమైన చలిగా వుంది. ఎన్ని హీటర్సు వున్నా చలి తగ్గడంలేదు. ఎలక్ట్రిక్ బ్లాంకెట్ ఆన్‌చేసి పిల్లలను నిద్రపుచ్చి, నేను కళ్ళు మూసుకున్నాను.

'మిసెస్ ప్రసాద్ నాతో డాన్స్ చెయ్యవూ?' అంటూ అమాయకంగా అడుగుతున్న షాన్ మొహం కళ్ళల్లో మెదులుతుంది. అంతకుముందు పదిహేను రోజుల క్రితం హాస్పిటల్‌లో ఒక ప్రోగ్రామ్ జరిగింది దానికి వెళ్ళాము మేము. సోషల్ వర్కర్స్ వచ్చి పేషెంట్స్‌నందర్ని ఆడిటోరియమ్‌లో సమావేశ పరుస్తారు. అప్పుడు వారుతెచ్చిన స్వీట్స్ కేడ్‌బరీస్, సిగరెట్స్ వారికి పంచుతూ, వారితో డాన్స్ చేస్తుంటారు. వారితో సరదాగా పాటలు పాడించి ఆ పాటలకు బహుమానం ఇస్తారు. ఇదంతా మెంటల్‌గా అప్‌సెట్ అయిన వారికి ఆహ్లాదం కలిగించడం కోసమే. ఆ డాన్సు జరుగుతున్నప్పుడు ఒక ప్రక్కగా నిలబడిన నన్ను షాన్ వచ్చి తనతో డాన్సు చేయమని అడిగాడు. అతనికేం తెలుసు ఇండియాలో అలా డాన్సులు చెయ్యరని. నాకు డాన్సు రాదని చెప్పి చిరునవ్వుతో తప్పించుకున్నాను. అతను డిసప్పాయింట్ అయ్యాడు. కొంచెం భయం కలిగింది. అసలే మెంటల్ పేషంట్. ఏ విధంగా రియాక్టు అవుతాడోనని, నేను తెచ్చిన కేడ్‌బరీ, సిగరెట్ పేకెట్ ఇచ్చేసరికి అతను మొహం ఇంత చేసుకొని నవ్వాడు.

అసలు షాన్‌కి, నాకు పరిచయం గమ్మత్తుగా జరిగింది. మేము క్వార్టర్సు ఖాళీలేని కారణంగా హాస్పిటల్‌లోనే సెపరేట్‌గానున్న ఒక ఫ్లాట్‌లో ఉండేవాళ్ళం. వేసవికాలం ఎండవచ్చినప్పుడు సరదాగా బయట కూర్చొని ఉండే ఒక రోజు షాన్ వచ్చి పలకరించాడు. 'మీరు ఇటాలియన్సా?' అంటూ. కాదు ఇండియన్స్ అని సమాధానం చెప్పేసరికి నా రంగు గురించి, చీర, నగలు గురించి, జడ గురించి కొంచంసేపు మెచ్చుకున్నాడు. రోజూ ఎండ వచ్చినప్పుడల్లా బయట నాతో కబుర్లు చెప్పేవాడు.

"ఎక్కడ సంపాదించావు ఈ తాతను" అని మావారు హాస్యాలాడేవారు.

షాన్ సన్నగా పొడుగ్గా ఉండేవాడు. అతను నల్లగా ఉండి, ఆ సూటు బదులు పంచె, లాల్చి కట్టుకుంటే అచ్చం మా తాతలాగే ఉంటాడు అనేదాన్ని.

షాన్ మాటలు గమ్మత్తుగా ఉండేవి. తన కొడుకు ఆఫ్రికాలో అయిదు సంవత్సరాలు ఉన్నాడట. అక్కడ వారితో కలిసి జీవించి, ఆ తిండి తినే సరికి అతని రక్తం పాడయిపోయిందట. నల్లరక్తం అయిపోయిందట. కాబట్టి యిపుడు ఆ రక్తం అంతా తీసేసి ఐరిష్ రక్తం ఎక్కించాలని చెప్పేవాడు.

షాన్ మాట్లాడే అలాంటి మాటలు వింటుంటే అతని అసలయిన పిచ్చితనం అర్థం అయ్యేది. ఆ హాస్పిటల్‌లో ఒక్క పిచ్చివాళ్ళే కాక వృద్ధులు కూడ ఉంటారు. ఆ నర్సుల ఓపిక చూస్తుంటే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. మట్టిలావున్న పేషెంటుని కూడ మల్లెపువ్వులా తయారుచేస్తారు. ఐర్లాండు దేశంలో నర్సులంటే ఎంతో గౌరవం. అదే మన దేశంలో అయితేనా? యిక చెప్పుకోనక్కరలేదు.

వేసవికాలం రెండు నెలలలో షాన్ నాకు మంచి ఫ్రెండ్ అయ్యాడు. అతన్ని సంతోషపెట్టడానికి, చిన్నచిన్న కానుకలు యిస్తుండేదాన్ని చక్కగా కబుర్లు చెప్పేవాడు. ఇండియా గురించి అడిగి తెలుసుకునేవాడు. పిల్లల్ని ముద్దు చేసేవాడు.

అటువంటి సమయంలో అతణ్ణి పిచ్చివాడని నమ్మబుద్ధి అయ్యేదికాదు. వేసవికాలం అయిపోగానే యధావిధిగా పేషెంట్స్‌ని లోపల బంధించేసేవారు. బయట మంచు, వర్షం కురుస్తుంటే విపరీతమైన ఈదురుగాలి వీస్తుంటే అసలు మామూలు వాళ్ళకే బయటకు రావాలనిపించదు. ఇంక లోపల టి.వి.తోనే కాలక్షేపం అంతా.

ఒకవారం క్రితం శ్రీవారు ఒకలేడీ పేషెంట్ యూరిన్ తీసుకొచ్చి ప్రెగ్నెన్సీ టెస్టు చేస్తున్నారు. నేను ఆశ్చర్యంగా చూస్తున్నాను. మేల్ పేషంట్సుకి, ఫిమేల్ పేషంట్సుకి వార్డులు విడివిడిగా వున్నా, మేల్ నర్సులు మగవారికి విడిగా వున్నా, ఈ పిచ్చివాళ్ళకు గర్భం ఎలా వస్తుందా? అని అనుమానం కలిగింది. ఏమాత్రం ఆడ, మగలను కొంచెం స్వేచ్ఛగా వదిలినా, ఇలా జరగడం మామూలే.

సాధారణంగా అలా పుట్టిన పిల్లలను దత్తత ఇచ్చేస్తారు.

ఇంతలో ఫోన్ మోగింది. మావారు ఫోన్ ఎత్తి మాట్లాడారు. వెంటనే ఫోన్ పెట్టేసి ఎంతో ఆతృతగా హాస్పిటల్‌లోకి పరుగెత్తారు. తరువాత సంగతివిన్న నాకు షాక్ తగిలినట్లయింది.

పుట్టుక అందరిదీ యించుమించుగా ఒకలాగే ఉంటుంది. కాని చావులు ఇన్ని రకాలు ఎందుకో తెలియదు. హత్యలు, ఆత్మహత్యలు, ఏక్సిడెంట్సు, రోగిష్టి చావులు, ఆకలిచావులు, అకాల మరణాలు ఒకటేమిటి, ఎన్నో రకాలు. కాని షాన్ వీటన్నిటికి భిన్నంగా, ఎవరూ ఊహించని విధంగా చనిపోయాడు.

మొన్నటి వరకూ ఆరోగ్యంగా వుండి, నవ్వుతూ కబుర్లు చెప్పిన షాన్ ఆ విధమైన చావుకు గురయ్యాడని విని భరించలేకపోయాను.

ఆ వార్డులో మేల్ నర్స్ టీ తాగడానికి కేంటీన్‌కెళ్లాడట. ఇంతలో అది కనిపెట్టిన షాన్ ప్రక్కనున్న మెంటల్ పేషెంట్ షాన్ దగ్గరకు వెళ్ళి 'అరే' నీవు స్నానం చేసి చాలా రోజులయింది. నీకు స్నానం చేయిస్తానురా, అని బాత్ రూమ్‌లోనికి తీసుకొనివెళ్ళి బలవంతంగా టబ్‌లో కూర్చోబెట్టి బాగా మగిరి ఉన్న హాట్‌వాటర్ టాప్ ఓపెన్ చేశాడట. చన్నీళ్ళ కుళాయి వదలలేదట. అంతే, నీరు బాగా మరిగి ఉన్నదేమో నీరసంగా ఉన్న షాన్ ఆ నీటిలో నుండి బయటపడలేక, అరవడానికి నోరు పెగలక అందులోనే ఉడికిపోయాడు. చాలాసేపు అంటే మేల్‌నర్స్ వచ్చేవరకూ.

తీరా నర్స్ వచ్చి చూసేసరికి ఏముంది?

షాన్ చావుబ్రతుకుల్లో ఉన్నాడు. ప్రసాద్‌గారికి జనరల్ సర్జరీలో అనుభవం ఉండబట్టి షాన్‌ని యింక జనరల్ హాస్పిటల్‌కు పంపలేదు.

అతికష్టంమీద ఒకపూట బ్రతికి హృదయ విదారకంగా కన్నుమూశాడు షాన్.

ఒక పిచ్చివాడి పిచ్చిపనికి ఒక నిండు ప్రాణం బలిఅయింది. కాని షాన్ అమాయకమైన మొహం నన్ను వెంటాడి, కబుర్లు చెబుతూనే ఉంది. ఆలోచనలలో నుండి తేరుకునేసరికి ఊరునుండి మావారు వచ్చారు. ఆయనను చూసి ఊపిరి తీసుకున్నాను.

(జయశ్రీ, 'నమ్మలేని నిజాలు శీర్షిక')

★ ★ ★

# ఒక దీపం వెలిగింది

"శ్యామలరావు ఎక్స్‌పైర్డ్, స్టార్ట్ ఇమ్మీడియట్లీ" అన్న టెలిగ్రాం ఆ ఇంట్లోని వారి నందరినీ ఒక్కసారిగా -- ఏ చిన్న సూచనగాని లేకుండా అనుమానం గాని రాకుండా వచ్చే తుఫానులా వచ్చి, శోక సముద్రంలో ముంచేసింది. అది నాలుగక్షరాలే ఉన్న నలుచదరమైన, గాలి వీస్తే మనం వదిలేస్తే ఎగిరిపోయే పలుచని కాగితమే కావచ్చు. కాని దానిమీదున్న ఆ నాలుగు పదాల సంగతి మమతను, భానుమూర్తిని, పార్వతిని, పరంధామయ్యను అంతులేని విచారానికీ, కొండంత దుఃఖానికీ, ఆకాశమంత ఆవేదనకూ గురిచేసింది.

ఆ చనిపోయింది ఎవరో కాదు. పరందామయ్యగారి అల్లుడు, భానుమూర్తి బావమరిది అయిన శ్యామలరావు. అందరి మనసులు శవంగా మారిన శ్యామలరావు మీద లేవు, ఇకపై శవంగా బ్రతకవలసిన ఆ ఇంటి ఆడబడుచు వినూత్నపై మళ్ళాయి. వారు బాధపడగలరు. ఏడవగలరు, ఎన్నో విధాల వినూత్నను ఓదార్చగలరు. కాని శ్యామలరావు ప్రాణాలు మాత్రం తీసుకొని రాలేరు. అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ మానవుని మేధకు అతీతమైనది అతనికిగాని, మరెవ్వరికీగాని అందకుండా, ఎవరితోనూ చెప్పకుండా వెళ్ళిపోయేదీ ప్రాణం ఒక్కటే! 'ఎన్నో సాధించాను' అనుకున్న మానవుడు, చంద్రమండలాన్ని చూసి వచ్చి, సూర్యమండలం ఎలా పోవాలా అని ఆలోచించే మానవుడు ఈ ప్రాణం సంగతి మాత్రం తెలుసుకోలేకపోతున్నాడు. ఆ విషయంలో అతను అసహాయుడే.అందరూ దుఃఖించి, దుఃఖించి, శ్యామలరావు చనిపోయిన కారణం తెలియక గబగబా నాలుగు బట్టలు సర్దుకొని, విషణ్ణ వదనాలతో, విచారం నిండిన మనసులతో ట్రెయిన్ ఎక్కారు. ఒకరినొకరు చూసుకున్నా పలకరించుకున్నా అందరిలోను దుఃఖం మాత్రమే పెల్లుబుకుతూంది. అదే వారి శరీరాలనన్నిటినీ ఆక్రమించుకొని, ఆకలి మాటగాని, సంతోషం మాటగాని ఎత్తనీయకుండా చేసేసింది. ఎప్పుడెప్పుడు ముమ్మిడివరం వెళదామా ఎప్పుడెప్పుడు వినూత్నను ఓదారుద్దామా అన్న తపనే అందరిలోను ఆక్రమించి ఉంది. ఆ ఇంటి గారాల ఆడబడుచు ఘోరంగా భర్తను పోగొట్టుకుంది అన్న ఆలోచన వారి శరీరాన్ని నిస్సత్తువగాను, నిస్త్రాణగాను చేసేసింది.

పార్వతి దుఃఖం అయితే పట్టశక్యం కాకుండా ఉంది. రైలు ప్రయాణం చేసే, కృష్ణా, గోదావరులు రైలు బ్రిడ్జి క్రింద నుంచి ఆమె కన్నుల్లోకి చేరివరదలై పొంగినట్లు, ఆ వరదల్లో ఆ కుటుంబాన్ని ముంచెత్తినట్లుగా ఉంది! ట్రెయిన్‌లో ఒకరిద్దరూ వారి

దుఃఖానికి కారణం తెలుసుకొని సానుభూతి చూపారు. సానుభూతి వల్లనూ, ఏడుపుల వల్లనూ చనిపోయిన ప్రాణం తిరిగివస్తే ఇక చెప్పేదేముంది!

పార్వతి, పరంధామయ్య, భానుమూర్తి ఆలోచనలు ఒక విధంగా ఉంటే, మమత ఆలోచనలు మరో విధంగా ఉన్నాయి. ఎందుకిలా అయింది? ఇకపై వినూత్న జీవితానికి దారి ఏది? నిండా ఇరవై సంవత్సరాలు లేని వినూత్న బ్రతుకు అప్పుడే చరమాంకానికి వచ్చేసిందా? ముందు ముందు ఎలా బ్రతుకుతుంది. అన్న ఆలోచనేగాని, శ్యామలరావు చనిపోయాడన్న బాధ ఆమెలో కించిత్తైనా కలగలేదు. కారణం శ్యామలరావు అంటే కోపం కాదు. అత్తగారింట్లో వినూత్న బ్రతుకును, దానికి కారణమైన శ్యామలరావుని తలచుకున్న నిర్లిప్తత.

ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిన అత్తగారికి బలవంతంగా మంచినీళ్ళు పట్టించింది మమత. అదే చేత్తో మామగారికి కూడా మంచినీళ్ళు అందించింది. ఆ మంచినీళ్ళతో ఆ కడుపులు తాత్కాలికంగా సేదతీరినా, ఆ మనసులకు బాధ మాత్రం మరింత ఎక్కువైంది. అలా జేరబడి కిటికిలో నుంచి చూస్తూంది మమత. వినూత్న గుర్తుకి వచ్చింది. ఆమె అత్తింటి గురించి చెప్పిన మాటలు చెవులో రొద మొదలు పెట్టాయి.

☆ ☆ ☆

"హాయ్, వదినా," వంటింట్లో పనిలో ఉన్న మమత కళ్ళు మూసింది వినూత్న. వినూత్న వస్తుందన్న సంగతి తెలియని మమత ఆశ్చర్యపోయింది.

"ఎప్పుడు రాక, కబురూ కాకర కాయి లేకుండా," అంది నవ్వుతూ. వినూత్నను చూసిన సంతోషం ఆమె మొహంలో తాండవిస్తుంది.

"కబురు చేయలేదుగాని, కాకర కాయి పంపానే, అందలేదా?" అడిగింది వినూత్న. వినూత్న ఆ ఇంటికి వస్తే తల్లికంటే కూడా ముందు పలకరించేది వదిననే. వదిన అంటే అంత ఆప్యాయత, అనురాగం ఆమెకు. మమత కూడా ఆ ప్రేమను, ఆదరణను వడ్డీతోను, చక్రవడ్డీతోనూ కలిపి ఆమెకు అందించేస్తూ ఉంటుంది వినూత్నకు. గబగబా కాఫీ చేసి ఆమెకు అందించింది మమత.

"మా తమ్ముడుగారు, మీ అత్త, మామగారు అందరూ కులాసానా? ఒక్క దానివే వచ్చావా?" అడిగింది మమత.

'ఒక్కదాన్నే ఏమిటి? ట్రెయిన్‌లో చాలా మంది తోడున్నారు." "చాలా మంది ఉన్నారులేవోయ్! వాళ్ళందరూ మా తమ్ముడి సాటి వస్తారా, మీ అత్తగారి సాటివస్తారా చెప్పు. వాళ్ళందరూ బాటసారులే!"

"నిజమే, వాళ్ళు నా భర్త సాటి, నా అత్తసాటి ఎందుకు వస్తారు? వాళ్ళందరూ

మంచి వాళ్ళు కాబోలు, మా అత్తింటి వారిలా నన్నొక్క మాట కూడా అనలేదు." నవ్వుతూ అంది.

వినూత్న కష్టాల్ని కూడా నవ్వుతూ భరించడం పెళ్ళైననాటి నుంచే అలవాటు చేసుకుంది. మూడుముళ్ళు పడిన తరువాత అంతకంటె గత్యంతరం లేదు మరి ఆమెకు.

మమత స్నానానికి నీళ్ళు పెట్టింది. స్నానం చేసి ఫ్రెష్‌గా తయారైవచ్చి మమతకు వంటలో సాయం చేయడానికి కూర్చుంది వినూత్న.

"లే తల్లి లే, ఇంత సహాయం చేసి, అంత దెప్పుతారు ఆడపడుచులు! నేను చేస్తానులే పని, నీవు వెళ్ళి అలా పుస్తకం పట్టుకొని కూర్చొని అందులో కథలు చెప్పు చాలు నాకు" అంది మమత. వినూత్నను ఏడిపించే ధోరణిలో.

కాని అసలు సంగతి అదికాదు. వినూత్నకు అత్త వారింటిలో, ఆ పల్లెలో క్షణం తీరిక ఉండదని తెలుసు. ఇక్కడైనా శరీరానికి కొంచెం విశ్రాంతి ఇవ్వాలని మమత ఆరాటం.

"ఏం, ఆడబడుచులను అంటారుగాని, వదినలు మాత్రం ఏం తక్కువ? మా ఆడబడుచు వచ్చి వెళ్ళింది. ఇక్కడ పుల్ల అక్కడ పెట్టింది కాదు అని రాగాలు తీస్తారు, సరిగమలు రాకపోయినా, కట్టెపుల్లల పొయ్యిలు ఇక్కడ లేకపోయినా." నిష్ఠురాన్ని గొంతులోకి కొని తెచ్చుకొంది వినూత్న. కాని అది హాస్యంగా అనిపించింది, నిష్ఠురంగా ధ్వనించలేదు మమతకు. బహుశా ఏమాటైనా తప్పు, ఒప్పు అనేది అనేవారి మనసు సంగతి ఎలా ఉన్నా అర్థం చేసుకునే వారి మనసుని బట్టి దాని అర్థం మారిపోతుందేమో! మన మనసులో మంచితనం ఉంటే, ఎదుటి వారు మాటలు, పనులు కూడా మంచిగానే కనిపిస్తాయి, లేకుంటే పచ్చ కామెర్ల వాడితంతే మరి!

వినూత్న పుస్తకం పట్టుకుని కూర్చుంది. కథ చదవబోయింది గాని మనసుకు కథ ఎక్కడం లేదు, తన కథ మీదికే మళ్ళుతుంది. ఊ అంటే చికాకుపడే విధవాడబడుచు, ఇంట్లో ఏ తప్పు జరిగినా కోడలి మీదకు నెట్టే మామగారు, అందరి తిట్లనూ సపోర్టు చేసే అత్తగారు, అన్నిటికీ మించి ఆ ఇంట్లో ఒక అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి నా భార్య అన్న సంగతి ఏ ఏక్సిడెంటులోనో మరచిపోయాడేమో' అనిపించే భర్త ఇవన్నీ సినిమా రీళ్ళలా, పుస్తకంలోని కథల్లా ఆమె ముందు కదలాడసాగాయి. అక్కడి నుంచి కదలనని మొరాయించాయి.

"ఇంతకీ పుస్తకంలో కథ చెప్పమంటావా? నా కథ చెప్పమంటావా?" అడిగింది వినూత్న.

"పుస్తకంలోది తరువాత నేను తీరిగ్గా చదువుకుంటానులే! ముందు నీ కథ చెప్పు, వినాలని చాలా కోరికగా ఉంది." మమత అంది.

"కడుపుతో ఉన్న వాళ్ళకు ఏదో తినాలని కోరిక ఉంది అంటారుగాని, కథ వినాలని కోరిక ఉంటుందా ఎవరికైనా?" మమత ఎత్తుగానున్న కడుపువైపు ఆనందంగా చూస్తూ అంది వినూత్న. మమతకు అయిదేళ్ళ శ్వేత ఉంది. ఇప్పుడు మళ్ళీ ప్రెగ్నెంటు.

"ఏమో, మళ్ళీ నీలాంటి ఆడపిల్ల పుడుతుందేమో అందుకే నీ కథ వినాలని కడుపులో ఉండే ఉబలాటపడుతూంది" అంది వేయించిన జీడిపప్పు పళ్ళెం వినూత్న ముందుకి తోస్తూ - వినూత్నకు ఆ జీడిపప్పు అంటే చాలా ఇష్టం అన్న సంగతి మమతకు తెలుసు.

"వద్దు. వద్దు. నాలాంటి ఆడపిల్ల మాత్రం వద్దు. నా జాతకం ఇంట్లో మరెవ్వరికీ రాకూడదు", కంగారుగా అంది వినూత్న.

నిజానికి వినూత్న జీవితం సంగతి మమత కొక్కదానికే తెలుసు. ఒకటి రెండుసార్లు భానుమూర్తి చెవిని వేసినా అతను దానికి అంతగా ఇంపార్టెన్స్ ఇవ్వలేదు. ఒకసారి పెళ్ళైన తరువాత, అన్నిటికీ సరిపెట్టుకోవాలి గాని, ఏ విషయంలోనైనా ఎవరుమాత్రం చేసేదేముంది?, అన్నట్లు ప్రవర్తించాడు గాని, అయ్యోపాపం చెల్లెలి బ్రతుకు అలా ఉందా అని కొంచెమైనా బాధపడలేదు. జాలి కూడా చూపలేదు.

భానుమూర్తి భావాలు, స్త్రీ విషయంలోని అతని అభిప్రాయాలు చూస్తుంటే ఏనాడో సతీ అనసూయ, సతీ సుమతి కాలంలో పుట్టవలసినవాడు గాని, ఈ కాలంలో పుట్టవలసినవాడు కాదు' అని చాలాసార్లు అనుకుంది మమత. సతీ సుమతి గాని మరెవరైనా పతివ్రత గాని భర్తను తట్టలో ఎత్తుకుని, వేశ్య ఇంటికి తీసికెళ్ళింది అన్న సంగతి విని, 'అహెూ, ఓహెూ' అనే భానుమూర్తి ఏ ఝాన్సీ లక్ష్మీభాయి గురించో, ఇందిరాగాంధీ గురించో చెబితే మాత్రం ముఖం ముడుచుకునేవాడు.

"మీ ఆయన పరిస్థితిలో మార్పు లేదా?" అడిగింది మమత. "ఉహూ మార్పులేదు. అంతేకాదు మార్పు రాదుకూడా" ఖచ్చితంగా అంది వినూత్న. 'పోనీ, నీవు ట్రై చేయలేకపోయావా, అతనికి దగ్గరవడానికి?" అడిగింది మమత. అలా అడిగింది గాని అది నిరుపయోగమని ఆమెకూ తెలుసు.

"మావిధవాడబడుచు ఆ అవకాశం ఇవ్వదుగా? నా భర్తతో నేనెంతో సుఖ పడిపోతున్నానని అనుకుంటుంది. తనకులేని సుఖం నాకు ఉండకూడదని ఆవిడ ఉద్దేశం. ఆవిడ భర్తపోయి విధవగా ఎలాగుందో, నేను భర్త ఉండీ విధవనని ఆవిడకు తెలియదు. పూలు పెట్టుకుంటే కోపం, తెల్లచీర కట్టుకుంటే కసి ఆవిడకు. కాని ఆ ఇంట్లో ఆ రెండింటి అవసరం లేదని వారికి మాత్రం తెలియదంటావా వదినా?" అడిగింది వినూత్న. భర్త అసమర్థతను గుర్తుకి తెచ్చుకొని.

"ఏమో తెలిసి ఉండవచ్చు, తెలియకపోవచ్చు. తెలిసినా బయటపెట్టుకోరుగా, చూస్తూ వాళ్ళ కొడుకు విషయం" మమత అంది.

"అవును, వాళ్ళ కొడుకు కాబట్టి ఎన్ని లోపాలున్నా బయటపెట్టుకోరు, కోడలు బయటనుంచి, ఏ జంతువు కడుపులో పుట్టి వచ్చిందని, తప్పులు చేయకపోయినా, తప్పులు నెత్తినరుద్ది మరీ అల్లరి పెడతారు. ఏమిటో వాళ్ళ మనస్తత్వం! పల్లెటూరు గనుక ఏ చిన్న కబురు అయినా ఇట్టే అన్ని ఇళ్ళకూ, తమాషాగా పాకిపోతోంది వదినా! ఆ ఇంట్లో నా సంగతులు నాకు తెలియకపోయినా ఊరివారందరికీ మాత్రం తెలుసు. ఏమిటో నేను ఎంత జాగ్రత్తగా ఉన్నా లేనిపోనివి, నా మనసులో లేని చెడ్డ ఆలోచనలు కూడ కల్పించి, కథలు అల్లి ఊరంతా టాం, టాం చేస్తారు. అందరూ నన్ను ఏ సెంట్రల్ జైల్లోనుంచో పారిపోయి వచ్చిన దోషిలా చూస్తారు గాని, ఆ ఇంటికి పుట్టింటిని వదులుకొని వచ్చిన స్త్రీలా చూడరు" వినూత్న కంఠం వణికింది.

"ఇది నీ ఒక్కదాని సమస్య కాదు విన్నూ, భారతదేశంలో ప్రతి ఇంటా, ప్రతీ కోడలికి ఉన్న సమస్యే. ఎవరో, ఎక్కడో, ఏ నిందలూ పడకుండా నిశ్చింతగా బ్రతికేవారుంటారు. అందరి స్త్రీల జీవితాలూ వడ్డించిన విస్తర్లు కాదు."

"వదినా! తప్పు చేయకుండా ఎందుకు మాటలు పడాలి?"

"తప్పు చేయకుండా నీవు మాటలు పడుతున్నావంటే అది నీ తప్పుకాదు, ఎదుటివారి ఆలోచనల లోపం. నీవు బంగారు కొండవి. నాకు తెలుసుకదా, నీ మనస్తత్వం. చీమకైనా హాని చెయ్యడానికి ఇష్టపడని దానివి. నీ నోటినుంచి ఇప్పటివరకూ ఒక్క పరుషమైన మాట కూడ వినలేదు నేను. నీలాంటిదాన్ని అర్థం చేసుకోలేక పోవడం వారి తెలివితక్కువతనం, బాధపడకు విన్నూ!" మమత ఓదార్పుగా అంది.

"పోనీ అందరి సంగతీ వదిలేయి, ఆయన కూడా ఆ సంగతి అసలు పట్టించుకోరు. నా బదులు, వారు ఒకమంచి పనిమనిషిని పెట్టుకొని ఉంటే బావుండేది" వినూత్న అంది.

"ఆ పనిమనిషికి జీతం ఇవ్వద్దూ?"

"నిజమే. బాగా చెప్పావు. పనిమనిషికి అయితే జీతం ఇవ్వాలి. జీతం ఇచ్చినా, దాన్నేదైనా అంటే ఎదురుతిరుగుతుంది. లేదంటే పని వదిలి వెళ్ళిపోతుంది. కాని భార్య మెడలో మూడుముళ్ళూ వేసికున్న నేరానికి ఆ ఇంటినుంచి పోలేదు కదా! అందుకే ఆమె అందరికీ అలుసైపోయింది. మాఆయనకైతే ఆ ఇంట్లో అన్ని వస్తువులలో నేనూ ఒకతెను అంతే! కాని ఆయన కొనుక్కున్న ఆ వస్తువులన్నిటినీ ఎంతో అపురూపంగా చూసుకుంటారు. ప్రాణం లేనివాటి మీద ఉన్న ఆపేక్షలో అరవయ్యో వంతు కూడా ప్రాణం ఉన్న తన భార్యనైన నామీద లేదు" బాధగా అంది వినూత్న.

నిజమే. అత్తింట్లో ఎన్ని ఆర్థిక, శారీరక, ఇబ్బందులున్నా, ఏ విషయంలో మనశ్శాంతి లేకపోయినా భర్త అనేవాడు భార్యను, దరి చేర్చుకొని చిన్న ఓదార్పుమాట పలికితే చాలు, ఆమె ఎన్ని బాధలనైనా మరిచిపోతుంది. వెయ్యి ఏనుగుల బలాన్ని తెచ్చుకుంటుంది. కాని దురదృష్టం కొద్దీ వినూత్నకు ఆ అవకాశం కూడా లేదు.

"వదినా ఒకమాట చెప్పనా, ఆ ఇంట్లో ఒకరికి నేనంటే ఎంతో ఇష్టం" నవ్వుతూ అంది వినూత్న.

వినూత్న నవ్వు చూసి తానూ నవ్వుతూ ఆశ్చర్యంగా "ఎవరబ్బా. ఇదివరకూ నాకెప్పుడూ చెప్పలేదే!" మమత అంది.

"మా కుక్క విక్కీ." నవ్వుతూ వినూత్న మాటవిని మమతకు ఎంతో బాధ కలిగింది.

"అది అందరినీ ఆప్యాయంగా నాకినట్లే నన్నూ నాకుతుంది. అందరినీ చూసి తోక ఆడించినట్లే నన్నూ చూసి ఆడిస్తుంది. బహుశా నేను ఆ ఇంటి కోడల్ని అని దానికి తెలియదేమో!" వినూత్న అంది.

"అవును అది జంతువు కదా! దానికి ద్వేషం అంటే ఏమిటో తెలియదు పాపం" మమత అంది. భానుమూర్తి రావడంతో సంభాషణ ఆగిపోయింది.

"ఏమే! విన్నూ, బావున్నావా?" ఆప్యాయంగా అడిగాడు మూర్తి.

భానుమూర్తికి తన చెల్లెలిలో పాతకాలంనాటి పతివ్రతలు అందరూ కనిపించి, ఆమెపై ప్రేమ వెల్లువలా పొంగుతూ వస్తుంటుంది అప్పుడప్పుడు. అంతేగాని పెళ్ళై మూడేళ్ళయినా, రెండున్నర సంవత్సరాలు పుట్టింట్లోనే ఉంచేశారు అనిగాని, ఆరునెలల క్రితం ఆమెను అత్తవారింటికి తీసికొని వెళ్ళినా ఇప్పటివరకూ ఆమెభర్త ఆమెను తాకలేదు అనిగాని అతనికి బాధలేదు. వినూత్న అన్నిటికి ఓర్చుకుంటూ కాపురం చేస్తోందని, ఈ కాలంలో పుట్టవలసినది కాదని, చెల్లెలంటే అతనికి అపురూపమైన భావన. అంతేగాని చెల్లెలు సంసార సుఖానికి దూరంగా ఉందని అతనికి ఏమీ బాధలేదు. పైగా పెళ్ళైన ఆడది ఎలాంటి కష్టమైనా భరించాలి అంటాడు. అత్తగారు మళ్ళీ ఏడుపు మొదలు పెట్టడంతో ఈ లోకంలోకి వచ్చిపడింది మమత, ఆలోచనలోనుంచి. తన కన్న కూతురు బ్రతుకు తన కళ్ళెదుటే భగ్నమైతే, ఏ కన్నతల్లి మాత్రం తట్టుకోగలదు? ఆవిడను ఓదార్చి, కొంచం మజ్జిగ ఇచ్చి మళ్ళీ పడుకోబెట్టింది మమత. భానుమూర్తి మెదడులో ఏ ఆలోచనలు ఉన్నాయోగాని, వాటిని బయట పెట్టడం లేదు. అలా రాయిలా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మళ్ళీ తన ఆలోచనలలోకి తాను వెళ్ళిపోయింది మమత. 'వదినా అత్తా ఒకింటి కోడలే అంటారు కదా! కాని నేను అది తప్పంటాను' వినూత్న మాటలు గుర్తుకి వచ్చాయి మమతకు.

"తప్పా! మరేం అంటారు?"

"అత్తా, ఆ ఇంటి కోడలేనంటాను. అత్తగారు కూడా ఒకానొకప్పుడు ఆ ఇంటికి కోడలుగానే వచ్చి ఉంటుంది కదా, తన లాగే ఆ ఇంటికి వచ్చిన కొడుకు భార్యపై ఎందుకు కసి పెంచుకుంటుంది?"

"ఏమో అడిగొస్తానుండు"

"ఎవరిని?"

"ఇంకెవరిని, మీ అత్తగారిని"

"ఒద్దుబాబోయ్, అంతపని చెయ్యకు. ఆవిడ నోటికి తట్టుకోలేవు. పైగా, ఇప్పుడు వెళ్ళడానికి నీకు ట్రెయిన్ కూడాలేదు."

"ఆవిడ నోటికి తట్టుకోలేనా? ఎందుకు తట్టుకోలేను. నాకూ ఉంది. నాలుగు అంగుళాల వెడల్పు నోరు అని చెప్పిమరీ వస్తాను"

"నీకుంది నాలుగంగుళాల వెడల్పు నోరేనా?"

"ఆ. నవ్వితే నాలుగుంగుళాలు, ఏడిస్తే ఏడంగుళాలు, ఆవలిస్తే ఆరంగుళాలు, మూతిముడిస్తే మూడంగుళాలు, నోరువిప్పి తిట్టు తిడితే..." అంటూ ఏదో చెప్పబోయింది.

"వద్దులే! నోరుంది కదా అని పారేసుకోకూడదు. దాన్ని అదుపులో పెడితేనే అందం, తిట్టాలంటే అందరూ తిట్టగలరు. మాటలు అందరూ అదుపులో పెట్టుకుంటేనే బావుంటుంది అనకూడనివి అన్నవారు, వినకూడనిది వినవలసి వస్తుంది మరి" వినూత్న అంది.

వినూత్నకు అర్థం కానిదల్లా ఒక్కటే తన ప్రవర్తనలో ప్రతి విషయానికి పెడర్థాలు తీసి, ప్రతిదానికీ సాధించడం, అలాంటి మనస్తత్వం ఉన్నవారి మధ్య బ్రతకడమూ కష్టమే, వారిని మెప్పించడమూ కష్టమే మరి!

"మీ ఆయన రోజూ రాత్రుళ్ళు ఎక్కడ పడుకుంటాడు."

"వాళ్ళ అమ్మపక్కలో. ఏనాడూ ఆవిడ నాదగ్గర పడుకోనివ్వదు. ఆయన కూడ అవకాశం తీసుకోడు."

"అమ్మ దగ్గర పడుకునేవాడిని పెళ్ళెందుకు?"

"పనిమనిషి ఖర్చు కలిసి రావడానికి, లోకానికి నేను మగవాణ్ణని చాటి చెప్పుకోడానికి"

"మగవాడు, భార్యను ఉసురు పెట్టినవాడు, పెళ్ళాన్ని బాధించినవాడూ మగవాడేనా. భార్యను సంతోషపెట్టి నేను మగవాడిని అని గర్వంగా చెప్పుకోవాలి. ప్రతి భర్త నీడలో

భార్య ఆదమరచి బ్రతకాలి గాని, అదురుతూ, బెదురుతూ, తుమ్మితే ఊడిపోయే ముక్కులా బ్రతికే బ్రతుకూ ఒక బ్రతుకేనా ఆడదానికి!" మమత అంది.

"పోనీ ఆయన్ని ఎలాగో ఒప్పించి ఒకసారి ఇక్కడకు తీసుకొని రాకూడదూ, ఎలాగైనా డాక్టరుకి చూపిద్దాం."

"అది అసలు అయ్యే పని కాదు. ఏమీ తెలియని వారికి మనం ఏదైనా చెప్పి ఒప్పించవచ్చు. అన్నీ తెలిసిన వారికి మనం ఏం చెప్పగలం? పైగా మా అత్తగారు పెళ్ళై మూడేళ్ళైనా పిల్లలు లేరని, నేను గొడ్రాలినని, ఎవరినైనా పిల్లల్ని పెంచుకుంటే మంచిదని ఊరంతా డప్పు లేకుండానే చాటింపు వేస్తుంది. నన్నే నిందలపాలు చేస్తుంది."

"ఈసారి నీవు డప్పు కొనివ్వు. ప్రకటనలో కొంచెం మార్పు చెయ్యమని చెప్పు"

"ఏం మార్పు చెయ్యమనాలి?"

"మా అబ్బాయి చేతకానివాడు. అందుకే పిల్లలు పుట్టడం లేదు అని."

"ఇంకేమైనా ఉందా? నాకు విడాకు లిచ్చి కొడుక్కి మరో పెళ్ళి చేస్తుంది. ఆవిడ ఏ పనైనా చేయగల సమర్థురాలు!"

"పెళ్ళి చేసుకొని నీవెంత సుఖపడుతున్నావో, ఆ రెండో ఆవిడా అంతే సుఖపడుతుంది. అందరూ నీలా నోరు మూసుకొని ఊరుకోరు. ఆవిడైనా మీ ఇంటివారి కళ్ళు తెరిపిస్తుంది." మమత అంది.

వినూత్న ఆ ఇంటి నుంచి వచ్చేయడానికి గాని, భర్త రెండో పెళ్ళి చేసుకొనడానికి గాని సుముఖంగా లేదు. ఎప్పటికైనా భర్త మారకపోతాడా, కష్టా లెంతకాలం ఉంటాయి అని ఆలోచిస్తుంది గాని, ఆ ఇంట్లో తన బ్రతుకు ఎలా ఉందో ఆమె అసలు ఆలోచించదు. ఆలోచించే తీరికా, ఓపికా ఆమెకు లేవు. అసలు ఆమెకు సెక్స్ అనుభవం తెలియదు. అందుకే అలా ఆమె భర్త ఆమె దగ్గరికి చేరకపోయినా అంతగా పట్టించుకోవడం లేదు కాని, పెళ్ళైన అందరు స్త్రీలలా తన జీవితం కాదని మాత్రం అప్పుడప్పుడూ బాధపడుతూ ఉంటుంది. మమతకు మాత్రం వినూత్నను చూస్తుంటే వయసుకి తగినట్లుగా మనసు, కోరికలు పెరగలేదేమో అనిపిస్తుంది.

మామగారు మంచినీళ్ళు అడగడంతో ఈ లోకంలోకి వచ్చింది మమత. మమత, ఆమె పేరుకు తగినట్లే అందరినీ మమకారంతో చూస్తుంది. సాధారణంగా ఎవరికో గాని పేరుకి తగిన గుణాలు రావు.

ఆడవారి విషయంలో భర్త మనస్తత్వం నచ్చకపోయినా, అతని మాట ప్రకారం నడచుకోవడం, అత్తమామలను కన్నతల్లిదండ్రుల వలె చూడడం ఆమెకు ఆమే సాటి. అసలు వదినా, మరదళ్ళ బంధం ఎంతో చక్కని బంధం. హాస్యాలతోనూ,

ఛలోక్తులతోనూ సరదాగా గడిపే బాంధవ్యం అది. ఒకరు ఒక ఇంటి నుంచి వచ్చినవారైతే, మరొకరు మరో ఇంటికి వెళ్ళవలసినవారు. మమతను, వినూత్నను చూస్తుంటే వదినా, మరదళ్ళంటే ఇలా ఉండాలి అనిపిస్తుంది. అస్తమానూ ఆడబడుచులమీద విసుక్కునే వదినలు, వదినల మీద నేరాలు చెప్పే ఆడబడుచులు ఉండే మన సంఘంలో వినూత్న, మమత లాంటివారు అరుదైనవారు, అపురూపమైనవారు.

ఆడబడుచు పుట్టింటికి వస్తేనే మొహం మాడ్చుకునే వదినలు కోకొల్లలు. వదినను చూడగానే, అన్నయ్యను కొంగుకు ముడేసుకుందని (ఆమె తన భర్తని వేసుకోవచ్చు కొంగునా, కొప్పునా కూడా ముడి) తమ నుంచి అన్నయ్యను వేరు చేసిందని, అన్నయ్య చిన్నప్పటిలా జడలు వేయడం లేదని, బడికి తీసుకొని వెళ్ళడం లేదనీ అలిగే చెల్లెళ్ళు, వదిన మనసుని విపరీతంగా నొప్పించే ఆడబడుచులు ప్రతి ఇంటా ఉన్నారు సాధారణంగా. ఎంతో అర్థం చేసుకొని ప్రవర్తించవలసిన వదినా మరదళ్ళు చిటపటలాడుతూ, నిప్పు లేకుండానే గంతులు వేస్తారు.

"మీ అమ్మగారా?" ఆ ప్రశ్నకు మమత ఉలిక్కి పడింది. "కాదండీ మా అత్తగారు" అంది ఆ ప్రశ్న అడిగిన పక్కావిడతో. ప్రజలలో మరో పెద్ద అనుమానం. ఆడవాళ్ళు అమ్మనే గాని, అత్తను ప్రేమగా చూడరని, ప్రేమగా చూసినా అది సవతితల్లి ప్రేమ లాంటిది అంటారు గాని, నిజమైన ప్రేమ అని ఎవరూ అంగీకరించరు. మరొకళ్ళను అంగీకరించనివ్వరు. పార్వతమ్మగారు కూడా వినూత్నను, మమతను వేరు వేరుగా చూడలేదు. వినూత్న పెళ్ళికి మూడు సంవత్సరాల ముందే మమత ఇంటి కొచ్చింది. మమతలోని మమకారం చూసిన పార్వతమ్మగారు, నేను పోయినా ఫరవాలేదు, వినూత్నను మమత తల్లిగా చూసుకుంటుందని అనుకున్నారు.

అమ్మ, అత్త అనే పదాలలో ఒక్క అక్షరమే తేడా ఉండి ఉండవచ్చు. కాని, వాటి స్వరూపాలలోను, స్వభావాలలోనూ నక్కకీ నాగలోకానికీ ఉన్నంత తేడా ఉంది. అమ్మగా తన బిడ్డలకు ఆప్యాయత పంచిపెట్టే తల్లి, అత్తగా తన కోడలిపై అనురాగం చూపదు. పైగా కొడుకుని తనవైపు తిప్పుకుందనే కోపంతో కోడలిని శత్రువుగా చూస్తుంది. 'కోడలు మాత్రం ఎవరు, నేనే గదా ఏరికోరి ఇంటికి తెచ్చుకున్నాను' అన్న సంగతి మరిచిపోతుంది.

ట్రెయిన్ ఒక్కసారి పెద్ద కుదుపుతో ఆగగానే నిద్రావస్థలోనూ, పరిసరాలను పరిశీలించడంలోనూ, ఎవరి ఆలోచనల్లో వారుండడంలోనూ మునిగి ఉన్న ప్రయాణికులు ఉలిక్కిపడ్డారు. ఒక్కసారిగా పెద్ద కలకలం బయలుదేరింది. ట్రెయిన్ కింద ఒక మనిషి పడ్డాడట. అతణ్ణి దాటుకొని ట్రెయిన్ చాలాదూరం వచ్చేసింది గాని, అతని మొండెం ఒకపక్క తల ఒక పక్కపడి ఉన్నాయి.

అందుకే ట్రెయిన్ ఆగిపోయింది. మమత, భానుమూర్తి వాళ్ళు ఎంత త్వరగా ఊరికి వెళ్ళాలని ఆలోచిస్తున్నారో, అంత ఆలస్యమవుతూంది పాపం వారి మనసులో ఆరాటం ఆ ట్రెయిన్ కేం తెలుసు? వినూత్న ఎలా ఉందో, ఇంకా రాలే దేమిటో అని ఎదురు చూస్తుంది కాబోలు అని మమత మనసు బాధగా మూలిగింది. తనకే శక్తి ఉంటే ఎగురుకుంటూ వెళ్ళి వినూత్నను ఒడిలోకి తీసుకోవాలని ఉంది మమతకు. ఆమెను కౌగిలించుకొని కరవుతీరా ఓదార్చాలని ఉంది.

అందరూ గందరగోళంగా మాట్లాడుకుంటున్నారు. ట్రెయిన్‌లో సగంమంది కిందకు దిగిపోయారు. శవం జేబులో ఉత్తరముందట. తిండిలేని కారణంగా, భార్యా బిడ్డలను పోషించలేని అసమర్థతకు, ఉద్యోగం దొరక్క విసుగు చెంది ఆత్మహత్య చేసుకుంటున్నానని, తన చావుకు ఎవరూ బాధ్యులు కారని, ఎవరిదైనా బాధ్యత ఉంటే, ఉద్యోగం ఇప్పించలేని గవర్నమెంటుదేనని రాసి పెట్టాడట. అందరూ అయ్యో పాపం అనకుండా ఉండలేకపోయారు. ఉత్తరం వెనుక నేను చనిపోతే నేను తినే తిండి కనీసం నా పిల్లలకైనా పనికి వస్తుంది అని కూడా రాశాడట. ఆ మాట మరింత బాధించింది అందరినీ.

పాపం చనిపోయేటప్పుడు ఎంత నరకం అనుభవించి ఉంటాడో తన భార్యా పిల్లలను విడిచి వెళ్ళడానికి అనుకుంది మమత.

అంత దుఃఖంలోను పార్వతి, పరంధామయ్యగారు "ఏమిటి సంగతి?" అని అడిగారు భానుమూర్తిని. సంగతి విని వారు కూడా నిట్టూర్చారు. కష్టం వల్ల బాధపడుతుంటే మరో బాధ ఆ పాత బాధను మరిపిస్తుందట. అలాగే ఆ శవాన్ని చూసిన పార్వతి, పరంధామయ్యగారు తాత్కాలికంగా అల్లుడి సంగతి పక్కన పెట్టి కుతూహలంగా అతని హిస్టరీ విన్నారు. అంతలోనే అల్లుడు గుర్తుకి వచ్చి గొల్లుమన్నారు మళ్ళీ.

మరో గంట తరువాత ట్రెయిన్ బయలుదేరింది నీరసంగా, విచారంగా. ఈసారి ట్రెయిన్ గమనంలో అంతకు ముందున్న ఆత్రుత, ఉరుకులు, పరుగులు లేవు. చనిపోయినతని ఆత్మ శాంతి కోసం ప్రార్థిస్తూ, మెల్లగా నడుస్తున్న ట్లనిపించింది మమతకు. అతని రక్తం తాగిన ఆ ట్రెయిన్ చక్రాలు స్పీడుగా నడవలేకపోతున్నాయి. 'నాకు బలైపోయావా మిత్రమా అనుకుంటూ కుంటుకుంటూ నడవసాగాయి. మళ్ళీ ట్రెయిన్ కదలగానే పార్వతి, వరంధామయ్యగారు ఏడ్చినందువల్ల వచ్చిన మగత నిద్రలోకి, భానుమూర్తి పుస్తకంలోకి, మమత తన ఆలోచనలలోకి వెళ్ళిపోయారు.

"వదినోయ్, వదినా!" వినూత్న హడావిడిగా వచ్చింది.

"ఏమిటమ్మా మరదలా ఏమిటి హడావిడి?" మమత అడిగింది.

"ఏమీ లేదు. మా శ్రీవారు నన్ను వెంటనే వచ్చేయమని టెలిగ్రామ్ ఇచ్చారు" అంది. 'శ్రీవారు' అన్న పదంలో హేళనను మమత గుర్తించకపోలేదు. పెళ్ళైన తరువాత శ్యామలరావు ఎప్పుడూ అత్తింటి గుమ్మం తొక్కలేదు. కాపురానికి వెళ్ళిన తరువాత ఒకసారి వచ్చిన వినూత్నను వెంటనే వచ్చేయమని టెలిగ్రామ్ ఇచ్చాడు. బహుశా భార్యలు ఎక్కువ కాలం పుట్టింట్లో ఉంటే అత్తగారి కథలు, భర్తల భాగోతాలు బయట పెడతారని భయం కాబోలు. కొందరు మగవారు భార్యలను పుట్టింటికి వెళ్ళనివ్వరు. వెళ్ళినా ఎక్కువ కాలం ఉండనివ్వరు.

"మీ శ్రీవారు నీమీద బెంగ పెట్టుకున్నారా?" మమత కూడా వెటకారంగానే అడిగింది వినూత్నను. పార్వతి, పరంధామయ్యలకు అల్లుడి సంగతి తెలియకపోవడంతో ఆ టెలిగ్రామ్ చూసి అల్లుడికి కూతురుపై గల ప్రేమ చూసి వారు మురిసిపోతున్నారు. నిజానికి అల్లుడు అసలు మగవాడు కాదు అన్న సంగతి వింటే వారి మొహాలు ఎలా ఉంటాయోనని ఆలోచిస్తున్నారు వినూత్న, మమత వారి సంతోషాన్ని చూసి.

"మా అత్తగా రున్నంత కాలం ఆయనకు నామీద బెంగగాని, ధ్యాసగాని ఉండదు. అది మాత్రం నూటికి నూరుపాళ్ళు నిజం." వినూత్న అంది.

"పోనీ ఆవిడను కొంత కాలం తీర్థయాత్రలకి పంపలేకపోయారా? అప్పుడైనా శ్యామలరావులో మార్పు ఏమైనా వస్తుందేమో!" మమత అంది. శ్యామలరావు సంగతి వినూత్న కంటే మమతకే పూర్తిగా అర్థమయింది. కాని, ఏదో ఆశ. ఇల్లు ఇరుకుగా ఉన్నందువల్లో అక్కగారికి, తల్లికి జడిసి భార్య దగ్గరకు రాని పిరికి మనస్తత్వం కలవాడేమో అని అనుకుంటూ ఉంటుంది. అదే నిజమై, అతనికి ఏదైనా ఊరు ట్రాన్స్‌ఫరై అతను, వినూత్న హాయిగా ఉంటే ఎంత బాగుణ్ణు' అనుకుంటుంది మమత. మమతకు తల్లిదండ్రులు గాని, తోబుట్టువులు గాని లేనందువల్ల అనాథాశ్రమంలో కొంత కాలం ఉండి చదువుకొంటుండగా భానుమూర్తి కళ్ళబడి ఆమెను ఇష్టపడి పెళ్ళి చేసుకోవడం జరిగింది. అత్తమామలను తల్లిదండ్రుల్లాగ చూసుకుంటుందామె.

"ఆవిడను తీర్థయాత్రలకు పంపితే ఇంకేమైనా ఉందా! ఆవిడకు వ్రతభంగమై పోదూ?"

"వ్రత భంగమా అదేమిటి?"

"కోడలిని కొడుకు దగ్గరకు చేరనీయకూడదనే వ్రతం ఆవిడ ఆచరిస్తుంది. దానిని ఎవరైనా ఉల్లంఘించ ప్రయత్నించారో ఉరిత్రాడు వేసేస్తుంది వారికి. ఆ వ్రతం ఆవిడ ఒక్కతికే కాదులే, వాళ్ళ విధవ కూతురు మహంకాళిక్కూడా వర్తిస్తుంది. బహుశా అందుకే తొందరపడి కొడుక్కి పెళ్ళి చేసి ఉంటుంది." వినూత్న అంది.

"నీవు నోరెత్తకపోతే ఎన్ని వ్రతాలైనా ఆచరిస్తారు!"

"వదినా! వారందరూ ఒకటి. నే నొక్కదాన్ని ఒకటి అక్కడ. వారిని ఎదిరించి

ఎలా నిలవగలను? అసలే కొత్త వాతావరణం, అంతా నిందలూ, నిష్ఠూరాల మయం. ఇక నాకు జీవితాన్ని గురించి, అందులోని సంతోషాన్ని గురించి ఆలోచించే తీరిక ఎక్కడిది చెప్పు?"

"వారందరూ ఒకటి, నీ వొకటి అన్న ప్రశ్న ఏమి టసలు? నిన్ను కూడా వారిలో ఒకదానిగా చేసుకోవాలనేగా నిన్ను కోడలిగా స్వీకరించారు."

"తప్పు. తప్పు. బ్లడ్ ఈజ్ థిక్కర్ దేన్ వాటర్. వారందరూ రక్త సంబంధీకులు, వారిలో వారికి ఎన్ని తప్పులున్నా చక్కగా సరిదిద్దుకుంటారు. నా రక్తం, నా గ్రూపు వేరుగా. అందుకే కలవనివ్వరు."

"మరి అత్తయ్యగారు నన్ను అంత ఆప్యాయంగా చూస్తారు కదా! మరి నా రక్తం మాత్రం వేరు కాదూ?"

"వదినా! అందరూ అమ్మలాంటి వాళ్ళే ఉంటే ఈ లోకం, ఈ సంఘం బాగుపడిపోవూ? ఇక సంఘంలో సమస్యలేం ఉంటాయి? పరిష్కారం దేనికైనా కావాలంటే ముందు సమస్యలంటూ ఉండాలిగా? అందుకే డబ్బు ఖర్చులేని, అతి తేలిక అయిన సమస్య అబల అయిన ఆడదాన్ని అణగదొక్కడమే."

"లోపల అంత బాధ పెట్టుకుని నవ్వుతూ ఎలా మాట్లాడుతున్నావు విన్నూ!" బాధగా అంది మమత, నవ్వుతున్న వినూత్నను చూసి.

"నవ్వకపోతే, మరేం చేయమంటావు? ఏడవమంటావా? ఏడ్చినందువల్ల సమస్యలకు పరిష్కారం దొరికితే నేనేమిటి, సమస్యలలో చిక్కుకున్న వాళ్ళందరూ పరిష్కారం సంగతి పక్కకు పెట్టి ఏడుస్తూ కూర్చుంటే పోలా, ఏ గొడవా ఉండదు."

వినూత్న మాటలకు ఆశ్చర్యంగా చూసింది మమత. ఇంతలో మమత కూతురు శ్వేత ఏడవడంతో వెళ్ళి ఎత్తుకుంది వినూత్న. శ్వేతను ఎత్తుకోగానే, ఒక విధమైన మాతృ ప్రేమ పొంగిపొరలుతుంది వినూత్నలో. అంతలోనే గొడ్రాలు అన్న అత్తగారి మాటలు వేయి గొంతుకలతో కర్ణకఠోరంగా వినబడ్డాయామెకు.

'భగవాన్! చేయని తప్పుకు శిక్ష కోడలిని తాకని కొడుకుని వెనకేసుకొచ్చి కోడలిని గొడ్రాలు అన్న ఆవిడ నోటిని ఏమనాలి. దాన్ని నోరు అని అంటే 'నోరు' అన్న మాటను అవమానించినట్లే అవుతుంది!

పరంధామయ్యగారు హడావిడిగా వచ్చి "రేపటికి టిక్కెట్లు దొరికాయి గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి, రేపు బయలుదేరుతున్నట్లు అల్లుడుగారికి టెలిగ్రామ్ ఇచ్చాను" అని చెప్పారు వినూత్నతో. వినూత్నలో ఏ భావమూ లేదు. అన్నిటికీ అలవాటు పడిపోయిన దానిలా నిర్లిప్తంగా ఉంది.

"బట్టలు సర్దేసుకుంటున్నావా?" మమత అడిగింది.

"నీవు సర్దిపెడతానంటే సర్దుకోను. లేదంటే నాకు తప్పదుగా!"

"నీ తరపున తినిపెట్టడం వచ్చుగాని, నాకు సర్దిపెట్టడం రాదు." మమత అంది.

"నీవలా అంటున్నావుగాని, నిజానికి నీకు అది కూడా చేతకాదు. నీవంతు తిండే నీవు పూర్తిగా తినలేవు. నా వంతు ఆహారం నీవేం తినగలవు?" అంది వినూత్న.

మమతను చూస్తుంటే తిండి తిన్నా, తినకపోయినా, ఏ చికాకులూ లేని ఇంట్లో సంతోషాన్ని భోంచేయవచ్చు అన్నట్లుంటుంది వినూత్నకు. 'సంతోషంగా జీవితం గడపడానికి కూడా పూర్వజన్మలో పుణ్యం చేసుకొని ఉండాలేమో. వదిన ఎంత పుణ్యం చేసుకుందో, నిశ్చింతగా బ్రతుకుతుంది' అనుకుంది వినూత్న. కాని, వదిన జీవితం భవిష్యత్తులో చాలా మలుపులు తిరుగుతాయని, అదీ తన కారణంగా అని ఆ సమయంలో ఆమెకు తెలియదు. తెలిసి ఉంటే కలలో కూడా ఆ ఊహ రానిచ్చేది కాదు. "రాత్రి మా మహంకాళి వదినను ఏవేవో నేను తిడుతున్నట్లు కల వచ్చింది. తిట్లు కాదు గాని, నా జీవితం ఏమిటి అని నిలదీసి అడుగుతున్నాను కలలో" అంది వినూత్న.

"కనీసం కలలోనైనా తెలివితేటలు ఉపయోగించావు. చాలా సంతోషం" అంది మమత. మనకు తెలియకుండానే మన మనసులో జరిగే సంఘర్షణ, ఆరాటం కలల రూపం ధరించడం మామూలే కదా!

"మావదినకు గాని నా కల సంగతి చెప్పానంటే ఇక చూస్కో తడాఖా, నన్ను దుమ్ము దులిపేస్తుంది - కలలో ఎందుకు ఎదిరించావంటూ" వినూత్న అంది. ఇంతలో మమత కూర్చున్న చోటినుండి లేచింది.

"ఎక్కడకు వెళుతున్నావు?" వినూత్న అడిగింది.

"మీ వదినగారికి టెలిగ్రామ్ ఇవ్వడానికి నీ కల గురించి" ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు. ఆ నవ్వులకు త్వరలోనే తెరపడుతుందని వారికి తెలియదు పాపం!

"టెలిగ్రామ్ ఎందుకు, ఈ మధ్య టెలిగ్రామ్‌లు అన్నీ ట్రెయిన్ వెళ్ళిపోయిన తరువాత, చనిపోయిన మనిషి గురించి ఇచ్చిన టెలిగ్రామ్‌లు ఖర్మనాటికి చేరుతున్నాయని నీకు తెలియదా? నేనే వెళ్ళి నా కల గురించి చెబుతానులే.'

"నీవైతే అబద్దం చెబుతావేమో?"

"ఏం అబద్దం చెప్పను. 'మహంకాళీ వదినగారూ, మిమ్మల్ని నేను తిట్టినట్లు నాకు కల రాలేదండి' అని మాత్రం చెబుతాను." మళ్ళీ నవ్వుకున్నా రిద్దరూ.

"వదినా! ఈసారి నీవూ, అన్నయ్యా మా ఊరు రావాలి సుమా?" అంది వినూత్న. వినూత్నకు అత్తవారింటికి వెళ్ళాలంటే దిగులుగానే ఉంది.

"అలాగే తప్పకుండా వస్తాం గాని, నీవు మాత్రం కాస్త నీ నోరు విప్పి వాళ్ళ లోపాలు కూడా గుర్తు చేస్తూఉండు. నీవలా గుర్తు చేయకపోతే తమంత మంచివాళ్ళు లేరని భావించుకోగలరు." మమత అంది.

"నీవు వస్తావుగా? నీ నోరు అద్దెకు తీసుకొని అప్పుడు ధైర్యంగా విప్పుతానులే! అప్పటివరకూ ఇలాగే ఉండనియ్యి" అంది.

కాని, ఆ సమయంలో వినూత్నను విధవగా చూడడానికి వెళ్ళవలసి వస్తుందని మమతకు తెలియదు. జరగబోయేది తెలియకపోవడమే సృష్టిలోని విచిత్రం.

మమత ఆలోచనల్లో ఉండగానే రాజమండ్రి వచ్చింది. అత్తమామలను జాగ్రత్తగా చేయిపట్టుకొని దింపింది మమత. వారు ప్రాణం లేని కట్టెల్లా ఉన్నారు ఆవేదనతో. మమత, భానుమూర్తి ఎలా నడిపిస్తే అలా నడిచేటట్లున్నారు గాని, కాలుతీసి కాలుపెట్టే శక్తి వారికి ఆ టెలిగ్రామ్ చూడగానే పోయింది.

బస్‌స్టాండుకి వెళ్ళి అమలాపురం బస్ రెడీగా ఉంటే అది ఎక్కేసారు. అమలాపురంలో మరో బస్ మారవలసి వచ్చింది. అలాగే బస్సు మారి, వాళ్ళు ముమ్మిడివరం చేరుకున్నారు అతి ప్రయాసతో. తీరా వాళ్ళు వెళ్ళేసరికి చాలా సమయం అయిపోయిందని, మర్నాడు శుక్రవారం వచ్చినందువల్ల శవదహనం జరిగిపోయిందని చెప్పారు వారు. వినూత్నను పట్టుకొని అందరూ బావురుమన్నారు. వినూత్న మాత్రం సుఖ, దుఃఖాలకు అతీతంగా అలా రాయిలాగే కూర్చుండిపోయింది గాని, ఆమె మనసులో ఎలాంటి ఆలోచనలు ఉన్నాయో ఎవరికీ అర్థం కాలేదు.

శ్యామలరావుకి కడుపులో నొప్పి వస్తే హాస్పిటల్‌కి తీసుకొని వెళ్ళడానికి ఆలస్యమైందట. ముమ్మిడివరంలో వాళ్ళ ఫామిలీ డాక్టరుగారు లేనందున టాక్సీలో అమలాపురం తీసుకెళ్ళారట. ఇంకా డాక్టరుగారు ఆపరేషన్ మొదలుపెట్టకుండానే అపెండిసైటిస్ బరస్ట్ అయి అతను అక్కడే ప్రాణాలు వదిలేశాడట. అప్పటి నుండి వినూత్న ప్రాణాలు తీస్తున్నారట వారు - ఆమె వచ్చిన వేళా విశేషం బాగులేదని.

ఏడుపుల కార్యక్రమం అయిపోయిన తరువాత మహంకాళి అందుకుంది. అందరికీ వినబడేలా - "నా తమ్ముడు దుక్కలా గుండేవాడు. ఈ మహాతల్లి కాపురానికి వచ్చింది మొదలు కడుపు నొప్పో, కడుపు నొప్పో అనేవాడు కాని, మేము ఏదో నొప్పిలే అనుకున్నాం. ఆఖరికి మాతమ్ముణ్ణి పొట్టన పెట్టుకుది మహమ్మారి. ఏ ముహూర్తాన మా ఇంట్లో కాలు పెట్టిందో గాని, వాడు ఒక్కనాడూ శాంతిగా బ్రతకలేదు. ఆఖరికి అందరినీ వదిలి వెళ్ళిపోయాడు" అంటూ రాగాలు తీసింది శ్యామలరావుకి అక్కలా

కాదు. ఏదో ఏడవడానికి అద్దెకు వచ్చినదానిలా. ఆవిడ అసలు తన సంగతి మరచిపోయింది. ఆవిడ కూడా అత్తింటికి వెళ్ళిన మూడు నెలలకే మొగుణ్ణి సాగనంపి పుట్టింటికి చేరింది. గురివిందలా ఇప్పుడు వినూత్నను సాధిస్తుంది. మనుష్యుల మనస్తత్వం ఎంత విచిత్రమైనది! తమకో నీతి, పరాయివారి కో నీతి.

అక్కడ ఉన్న రోజుల్లో పార్వతికి, పరంధామయ్యగారికి అల్లుడు సంగతి వారి ద్వారా, వారి ద్వారా తెలిసింది. అత్తగారూ, ఆడబడుచుల సూటీ పోటీ మాటలతో వినూత్న జీవితం. ఆ ఆరు నెలలు ఎలా సాగిందో సులువుగానే గ్రహించారు. ఆ తరువాత ఎప్పుడూ వాళ్ళు అల్లుడి చావు గురించి ఏడవలేదు. కూతురి బ్రతుకు గురించే దుఃఖించారు. అన్ని కార్యక్రమాలూ పూర్తి చేసుకొని వినూత్నతో బాటు తిరిగి వరంగల్లుకి ప్రయాణమై రాజమండ్రి చేరుకున్నారు. అక్కడ ట్రెయిన్ ఎక్కాలి. రాజమండ్రి బస్ స్టాప్‌లో బస్ దిగి రిక్షాల గురించి చూస్తున్నారు.

రిక్షాలో సామాను పెడదామని సామాను చూడగా అందులో వినూత్న సూట్‌కేస్ లేదు. ఆ చట్టుపక్కల వెతికారు. అందరినీ అడిగారు. కాని, ఏం లాభం, పోయిన వస్తువు దొరుకుతుందా! అల్లుడే పోగా లేంది ఇంక సూట్‌కేస్ లేకపోతే ఏమైందని సరిపెట్టుకున్నారు. ఆ సూట్‌కేస్‌లో ఆమె పెళ్ళినాటి పట్టు బట్టలు, నల్లపూసలు, మంగళ సూత్రాలు ఉన్నాయి. ఆ సూట్‌కేస్ పోవడంతో వినూత్న పెళ్ళి తాలూకు బంధం పూర్తిగా తెగిపోయింది. ఒంటరిగా కాలేజీ స్టూడెంట్‌లా ట్రెయిన్ ఎక్కింది. ఆ సూట్‌కేస్‌తో పాటు ఆ విచారం కూడా దొంగ పట్టుకొనిపోయినట్లున్నాడు. ఆమె మొహం తేటగా కనిపించింది.

ఇంటికి వచ్చిన తరువాత అందరి పలకరింపులు, పార్వతమ్మగారి ఏడుపులు నాలుగైదు రోజులు సాగాయి. వినూత్న కంటినుంచి ఒక్క కన్నీటి చుక్క కూడా రాకపోవడం మమత గమనించకపోలేదు. అసలు తమ ఇద్దరి మధ్యా ఏం బంధం ఉందని ఏడవాలో అర్థం కాలేదు వినూత్నకు. భర్త చనిపోగానే మహంకాళి అన్న మాటలతోనే అటూ, ఇటూ ఊగుతున్న ప్రేమ మంగళసూత్రంతో పాటే తెగిపోయింది. ఇక వారికి, నాకు ఏ విధమైన బంధం అనుకుంది వినూత్న.

భానుమూర్తికి శ్యామలరావు చనిపోయిన తరువాత చెల్లెలు మీద ప్రేమ రెట్టింపు అయింది. ఇప్పుడు ఇంకా ఆప్యాయంగా చూస్తున్నాడు చెల్లెలిని. అతనికి చెల్లెలి పేరుని మార్చేసి అనసూయ అనో, అరుంధతి అనో పెట్టేయాలనిపిస్తుంది. 'నా చెల్లెలు భర్త చేతకానివాడైనా కిక్కురుమనకుండా కాపురం చేసి వచ్చిన పతివ్రత' అని అందరికీ చాటి చెప్పాలనిపిస్తుంది కాని, అతనికి వినూత్న మనోవేదనతో గాని, ఆలోచనలతో గాని సంబంధం లేదు. ఆమెకు గుండు చేయించి, తెల్ల చీర కట్టించి, ఒక్కపూట భోజనం పెట్టించి, వంటింట్లో కూర్చోబెడితే ఇంకా ఎంతో సంతోషించేవాడు భానుమూర్తి.



తరాలు మారేకొద్దీ మనుషుల మనస్తత్వాలు, ఆలోచనా ధోరణులు మారతాయి. పాత తరంలోని మంచి పద్ధతి కొత్త తరానికి వింతగా అనిపించవచ్చు. మూర్తి ఆ కాలంలో పుట్టవలసినవాడు పొరపాటున ఈ కాలంలో పుట్టాడా అనిపిస్తాడు మమతకు. ఆ కాలంలో పుట్టినా, రాజారామోహన్‌రాయ్, వీరేశలింగం లాంటివారు అతణ్ణి మార్చి ఉండేవారేమో. ఇప్పుడు వారు రాసిన పుస్తకాలు తప్పించి, ప్రత్యక్షంగా ప్రభోదించి, ఆచరించేవారు కనబడడంలేదు. ప్రజలలోని బూజు పట్టిన భావాలను తమ ప్రవర్తనతో దులిపేవారు ముందుకి రావడం లేదు. ఆరునెలలు గడిచాయి. పార్వతమ్మ, పరంధామయ్యగార్లకు తమ కూతురి భవిష్యత్తు ముందు ముందు ఎలా అన్న దిగులు పట్టుకుంది. వినూత్న ఎప్పుడూ ఏదో దీర్ఘాలోచనలోనే ఉంటుంది. ఆమెకు భర్త పోయాడన్న బాధ కొంచెం కూడా లేదు. ఎంత కాలం అన్నగారికి భారంగా ఉండాలి అన్నది ఆమెకు తీరని సమస్య అయిపోయి కూర్చుంది.

★ ★ ★

వినూత్నలోని నిర్లిప్తత మమత గమనిస్తూనే ఉంది. ఏదైనా సరదాగా మాట్లాడినా నామకార్థంగా నవ్వుతుంది. గాని మనఃస్ఫూర్తిగా నవ్వడం లేదు వినూత్న. ఎలా

నవ్వుతుంది? కన్నెగా ఉండి కూడా మూడు ముళ్ళు వేయించుకున్న నేరానికి 'విధవ' అయింది. ముందు ముందు ఎలా బ్రతకాలి? అన్న ఆలోచనలు ఆమెను తినేస్తున్నాయి. అందుకే మమత వినూత్నను పెళ్ళి కాగానే డిస్‌కంటిన్యూ చేసిన ఇంటర్ పరీక్షలకు మళ్ళీ కట్టమంది. ఆ మాట విని పక్కన పిడుగు పడ్డట్లు చూశాడు మూర్తి.

"ఇప్పుడు దానికి చదువేమిటి? ఇంట్లో కూర్చోక!" భార్యతో అన్నాడు. "ఇప్పుడేమిటి? అప్పుడే అరవై వచ్చేశాయా? అసలు ఆమె జీవితంలో ఏం జరిగిందని, ఏం సుఖపడిందని? ఆమెకు అసలైన జీవితం అంతా ముందే ఉంది. వయసులో ఉన్న పిల్ల ముసలమ్మలా మూలపడి ఉండమంటే ఉంటుందా? ఎంతకాలం మనం అలా బంధించగలం?"

"వయసులో ఉంది కాబట్టే చదువులు, గిదువులు వద్దంటున్నాను. ఇంట్లోనే ఉండి ఏ అప్పడాలు వత్తుకుంటూనో, కుట్లు కుట్టుకుంటూనో కాలక్షేపం చేయమను. అంతేకాని చదువు సంగతి మాత్రం ఎత్తవద్దు." ఖచ్చితంగా చెప్పేశాడు మూర్తి. భర్త మనస్తత్వం తెలిసిన మమత ఆ మాటలకు ఆశ్చర్యపోలేదు.

"ఏదో కాలక్షేపం కోసం ఈ ఇంటర్ పూర్తి చేయనివ్వండి. ఖాళీగా ఉంటే ఆలోచనలన్నీ భర్తమీదకు వెడతాయి. వయసు అల్లరి పెడుతుంది. ఏదో చదువు ధ్యాసలో పడి ఆలోచనలు మరచిపోతుంది" అంది మమత.

కాని భానుమూర్తికి ఏమాత్రం చదువు చెప్పించడం ఇష్టం లేదు. చదువంటే ఇష్టం లేక కాదు. వంట చేసే ఆడవారికి చాకలిపద్దు చదువు చాలని అతని అభిప్రాయం. పైగా ఇప్పుడు ఇంటరంటారు. తరువాత బి.ఎ. అంటారు. ఆ తరువాత ఉద్యోగమంటారు. అంతవరకూ బాగానే ఉంది. కాని ఆ తరువాత మళ్ళీ పెళ్ళి అని ఎక్కడ అంటారోనని అతని భయం. భారత స్త్రీ మెడలో రెండవసారి తాళి కట్టించుకోవడం అన్న విషయాన్ని మాత్రం అతను ఎంతమాత్రం భరించలేడు. ఆ తలపుకే అతని ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులు పాకుతున్న ట్లనిపిస్తుంది. అతనికి సతీ సహగమనాలు, బాల్య వివాహాలు, విధవలకు జుట్టు తీయించి, తెల్ల చీర కట్టించడాలు అంటే ఎంతో ఇష్టం. వాటిని పురాణాల్లోని అన్ని నీతుల కంటే కూడా ఎంతో పవిత్రంగా భావిస్తాడు. అతను ఒక తరం వెనుక ఉంటే మమత ఆలోచనలు ఒక తరం ముందుంటాయి. విచిత్రంగా ఏమాత్రం ఆలోచనలలోగాని, పద్ధతులలోగాని పొత్తు కుదరని మమత, మూర్తులు భార్యాభర్తలు.

"విన్నూ చదువు సంగతి మరోసారి నా దగ్గర ఎత్తవద్దు" అంటూ విసవిసా బయటకు వెళ్ళిపోయాడు భానుమూర్తి. భర్తను ఒప్పించవచ్చనుకుంది కాని, మరీ ఇంత ఖచ్చితంగా మాట్లాడతాడని అనుకోలేదు మమత. ఇంక భర్తతో లాభం లేదని

అత్తమామల దగ్గర ఈ ప్రస్తావన తెచ్చింది. వాళ్ళు విముఖంగానూ లేరు, సుముఖంగానూ లేరు. అల్లుడు చావుతో కొట్టిన దెబ్బ నుండి కోలుకోలేకపోతున్నారు. ఏం చేసినా మమత దాని మంచికే చేస్తుందిలే అన్నట్టు వినూత్న బాధ్యతను మమతకే వదిలేశారు. వినూత్న మాత్రం దేన్ని గురించీ ఆలోచించడం లేదు.

"చూడండి, అత్తయ్యా! మీ అబ్బాయి నా మాట వినడం లేదు. వినూత్న చదువు విషయం మీరైనా చెప్పి చూడండి. పెద్దవారు అనే గౌరవంతోనైనా మీ మాట వింటారు" అంది మమత.

"ఈ తరంలో పుట్టినవాడే వినూత్న చదువు గురించి అంగీకరించలేకపోతుంటే ముందు తరంలో పుట్టిన మీ మామయ్య ఒప్పుకుంటారా, మమతా?" అంది పార్వతమ్మ.

నిజమేననిపించింది మమతకు. అయినా ఒకసారి ఆయనను కూడా అడిగి చూద్దాం అని మామగారి గది దగ్గరకు వెళ్ళింది. ఆమె అలా మెల్లగా వస్తే ఏదైనా ముఖ్య విషయం చెప్పడానికే వస్తుందని పరంధామయ్య గారికి తెలుసు.

"మామయ్యగారూ!" అని మెల్లగా పిలిచింది. ఆ గొంతులోనుంచి వచ్చిన ఆ పిలుపులో ఎంతో వినయం, పెద్దల పట్ల గౌరవం ఉట్టిపడింది.

"ఏమ్మా, మమతా! ఏం కావాలి?" అన్నారాయన.

"ఏమీ వద్దండి. అదే వినూత్న విషయం చెబుదామని..." అంటూ ఆగిపోయింది.

"వినూత్న విషయమా?" అన్నా రాయన. ఆ ప్రశ్నలోనే ఇంక దాని గురించి చెప్పేదేముంది. దాని బ్రతుకు బండలైంది కదా అన్న ఆవేదన తొంగిచూసింది.

"అవునండీ! ఇంట్లో అలా ఖాళీగా ఉంటే ఆలోచనలతో ఆమెకు సమయం గడవడం లేదు. పైగా అస్తమానూ ఏడుస్తూ కూర్చుంటుంది కదా!" అంది.

"అయితే ఏం చేద్దాం మరి? దేవుడికే దయ లేనప్పుడు మానవమాత్రులం మనమేం చేయగలం. దానితో కలసి బాధ పడగలం కాని, బాధను తీసేయలేం కదా, తల్లీ!" అన్నారాయన. ఆ గొంతులోని ఆవేదన మమతను కదిలించి వేసింది. అప్రయత్నంగా ఆమె కళ్ళలో నీరు తిరిగింది.

"అది కాదండి అలా ఒంటరిగా కూర్చుని బాధపడే బదులు ఇంటర్ పరీక్షలకు మళ్ళీ కట్టిస్తే బావుంటుందని నా ఉద్దేశం." అంది.

ఆ సలహా పరంధామయ్య గారికీ నచ్చింది. "బాగానే ఉంటుంది. మరి మూర్తిని అడిగినావా ఈ విషయం?" అడిగారాయన. ఆయనకు బాగా తెలుసు మూర్తి ద్వారా సాధించలేని పని మమత తన ద్వారా సాధిస్తుందని.

"అడిగానండి. ఆయన ఒప్పుకోలేదు" అంది.

ఆ ఒప్పుకోలేదు అన్న మాటకు పరంధామయ్యగారు ఆశ్చర్యపోలేదు. కారణం ఆయనకు కొడుకు మనస్తత్వం బాగా తెలుసు. ఆడది వంటింటి కుందేలై అణిగి మణిగి ఉండాలంటాడు మూర్తి. ఆ ఒక్క విషయంలోనూ తప్పించి మూర్తిని మరే విషయంలోనూ తప్పులు పట్టలేరు ఎవరూ.

"సరే. నేను చెప్పి చూస్తాలే" అన్నారు పరంధామయ్యగారు.

ఆ సాయంకాలం కొడుకుని పిలిచి అసలు విషయం చెప్పారు. భార్య దగ్గర వద్దు అని ఎంతో ప్రతాపం చూపిన మూర్తి తండ్రి దగ్గర నోరెత్తలేకపోయాడు.

"చూడరా, మూర్తీ! మేము ఎంతకాలం బ్రతుకుతామో మాకే తెలియదు. శ్యామలరావు చనిపోయాడన్న బెంగతో త్వరగానే ఈ లోకాన్ని విడిచి పెట్టేస్తామేమో! దానికి ఇంటర్ కాగానే ఏదో టీచర్ ట్రైనింగ్ అయిందనిపించి ఏ స్కూల్లోనన్నా వేస్తే దాని బ్రతుకు అది బ్రతుకుతుంది. నీవు ఎలాగూ తోడుగా ఉంటావనుకో. నీకూ ఆడపిల్లలు. ఎంతకాలం నీవు మాత్రం దాన్ని పోషించగలవు చెప్పు మన మధ్య తరగతి కుటుంబాల్లో మరో మనిషిని పోషించాలంటే సామాన్య విషయం కాదు."

"అయితే నేను వినూత్నను పోషించలేనంటారా?" ఉక్రోషంగా అన్నాడు మూర్తి.

"నా ఉద్దేశం అదికాదు. నీవూ ఆడపిల్లల తండ్రివి. ఈ రోజుల్లో ఆడపిల్లలకు ఎంతెంత డబ్బు అవసరం అవుతుందో నీకు తెలియంది కాదు కదా! వినూత్న పెళ్ళికి ఎంత ఖర్చు అయింది నీకు గుర్తుంది కదా! రేపు నీ పిల్లలకూ అలాగే అవుతుంది. వినూత్న ఏదో చదువుకుని ఉద్యోగం చేసినా నీకు చన్నీళ్ళకు వేణ్ణీళ్ళలా తోడుగా ఉంటుంది. అది మాత్రం ఇంకెవరికి పెడుతుంది. దానికి ఉన్నదీ నీ పిల్లలకే ఇస్తుంది కదా!" అన్నా రాయన.

చివరి మాట మూర్తిమీద బాగా పనిచేసింది. ఇప్పటికే తల్లిదండ్రులను, చెల్లెలిని పోషించలేక, చంటిపిల్ల స్మితకు పాల డబ్బాలు కొనలేక సతమతమవుతున్నాడు. తల్లిదండ్రులు ఆరోగ్యవంతులుగా ఉండగానే ఇంత ఖర్చవుతోంది. వారు పెద్దవారు. రేపు ఏ అనారోగ్యం వచ్చినా మందుల కంటూ బోల్డు డబ్బు కావలసివస్తుంది. భరించడం కష్టం కావచ్చు. ఆడపిల్లల పెళ్ళిళ్ళకు ఇప్పటి నుంచీ ఎంతో కొంత నిలవేస్తేనే గాని వాళ్ళు ఇల్లు కదలరు. వినూత్న పెళ్ళి ద్వారా ఆడపిల్ల పెళ్ళి ఎంత కష్టం అనేది మూర్తికి గ్రహింపుకి వచ్చింది. అందుకే వినూత్నను చదివించడం, ఉద్యోగం చేయించడం ఇష్టం లేకపోయినా తండ్రి సలహా ననుసరించి పరిస్థితుల ప్రాబల్యం వల్ల మూర్తి అవుననక తప్పలేదు. అతని అంగీకారం వినూత్నలోను, మమతలోను కొత్త ఉత్తేజాన్ని కలిగించింది. వినూత్న ఇంట్లో ఉండే చదవడానికి అంగీకరించాడు మూర్తి. పక్కనే ఉన్న లెక్చరర్

ఒకాయన ఒక గంట పాఠాలు చెప్పడానికి అంగీకరించాడు. ఆ లెక్చరర్ జస్వంత్. ఈ చదువుల వల్ల అంత ఉపయోగం లేదు. ఉద్యోగాలు అంత త్వరగా రావు అంటూ టైపుకి వెళ్ళమని సలహా ఇచ్చాడు.

టైపుకి వెళుతున్నప్పుడు రంగు చీరలు కడుతున్న చెల్లెలిపై ఇంత ఎత్తున లేచాడు మూర్తి. మమత అడ్డు తగిలింది. "పాపం వినూత్న భర్తపోయి అసలే బాధ పడుతూంది. ఆమె విధవ అని ఊరందరికీ తెలియాలా? అందరూ ఆమె మీద సానుభూతి, జాలి చూపించాలా? అందుకే నేనే రంగు చీరలు కట్టుకోమన్నాను" అంది. "అంతే కాదు, భర్తలేని పిల్ల అంటే తుంటరి పిల్లల దృష్టి వినూత్న మీదే ఉంటుంది. రంగు చీరలు కడితే ఎవరూ పట్టించుకోరు" అని నచ్చ చెప్పింది.

మూర్తి మరోసారి ఇష్టం లేకపోయినా తన మనసుని చంపుకున్నాడు. మమత ఊహించినట్లే టైపుకి వెళుతుంటే తుంటరి పిల్లల బాధ తప్పలేదు వినూత్నకు.

ఒక రోజు ఎవరో వినూత్నను క్రిష్టియన్వా ముస్లిమా అని అడిగారట. బొట్టులేని ఆమె నుదురు చూసి. ఆ సంగతి మమతతో చెప్పగానే బొట్టు పెన్సిలుతో సన్నగా పొడుగ్గా ఆమె నుదుటను బొట్టు దిద్దింది మమత. అలా దిద్దుతుంటే ఆమె చేతులు సన్నగా వణికాయి. కాని వినూత్నకు మనసే వణికిపోయింది.

తరువాత ఎప్పుడో వినూత్న నుదుట నున్న బొట్టు గమనించిన మూర్తి మరో అవతారం ఎత్తాడు కోపంతో. ఈసారి మమతకు భర్తకు సర్దిచెప్పడానికి చాలా కష్టపడవలసి వచ్చింది. మూడోసారి కూడా ఓటమిని అంగీకరించక తప్పలేదు మూర్తికి. కాని వినూత్నలోని ఈ మార్పులు మాత్రం అతని మనసులో ముళ్ళులా గుచ్చుకుంటూనే ఉన్నాయి.

మరో ఆరు నెలలు గడిచాయి. టైపు చాలా వరకూ వచ్చింది వినూత్నకు. ఇప్పుడు వినూత్న పెళ్ళికాని పిల్లలా నూతనోత్సాహంతో తిరుగుతోంది. ఆమెలోని సంతోషం ఆమె తల్లి దండ్రులకు కొంత మనశ్శాంతి ఇచ్చింది.

ఆరోజు టైపు నుంచి మొహం చిన్నది చేసుకొని వచ్చింది వినూత్న. "ఎందుకమ్మా, అలా ఉన్నావు ఎవరైనా ఏమైనా అన్నారా?" అడిగింది మమత.

"అవును వదినా! నేను విడోనని తెలిసి కొందరు నన్ను చిలక్కొట్టు అని పిలుస్తున్నారు. చిలక్కొట్టు చాలా రుచిగా ఉంటుంది అని ఇన్‌డైరెక్టుగా అంటున్నారు. వాళ్ళ దృష్టిలో నేను సెక్స్ గురించి తహతహ లాడి పోతున్నట్లుగా భావిస్తున్నారు" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది వినూత్న.

"ఊరుకో విన్నూ! మంచిగా మాట్లాడటం సంస్కార వంతుల లక్షణం. అలా

ఎదుటి వారిని కారణం ఉన్నా లేకపోయినా నిందించే వారిని సంస్కార హీను లనుకోవాలే గాని ఇలా బాధ పడతారా? భలేదానివి. లే, కళ్ళు తుడుచుకో, కాఫీ తాగు" అంటూ కాఫీ అందించింది.

ఏమిటో కొందరికి, తమకు సంబంధం లేకపోయినా, మాటలతో ఏడిపించడం సరదా ఏమో. లేదా వారు శాడిస్టులో. నోరుంది కదా అని ఎదుటి వారి మీద ఇష్టం వచ్చినట్లు ఉపయోగిస్తారు. వారి మానాన ఎదుటి వారిని బ్రతకనివ్వరు. తమలోని తప్పుల్ని దాచుకొని, ఎదుటి వారి తప్పుల్ని ఎత్తి చూపిస్తారు.

వినూత్నకు భర్తపోయి ఆమె ఉంటే ఇరుగు పొరుగుల సానుభూతితో మాట్లాడే సూటి పోటి మాటలు ఆమెను చాలా బాధించేవి. ఆమె తెల్ల చీర కట్టుకొని, బొట్టు లేకుండా, ఏడుస్తూ మూలనపడి ఉంటే అందరూ సంతోషించేవారు. ఆమె తన బ్రతుకు తెరువు కోసం పరీక్షలు వ్రాసి, టైపుకు వెళుతుంటే, 'టింగు రంగా అంటూ వెళుతుంది' అని వీధిలోని వారు గుస గుస లాడుకోవడం జరుగుతూనే ఉంది. ఇప్పుడు గుసగుసలాడే వారెవరూ ఆమెకు తిండి పెట్టరు. సమస్యలు వచ్చినా తీర్చరు.

"వదినా, ఎందుకో నాకు ఈ టైపుకి వెళ్ళాలనిపించడం లేదు. మానేయాలని ఉంది" అంది వినూత్న బాధగా.

"భలే దానివే. నీ అన్నయ్యతో యుద్ధం చేసి మరీ నిన్ను పంపిస్తున్నది మధ్యలో మానేయడానికా? చాల్లే తల్లీ. అన్నా, చెల్లీ ఒకటే నన్నమాట!"

"అబ్బా కాదు లెద్దూ, వదినా మరదలూ ఒకటి ఈ ఇంట్లో, ప్రస్తుతం అన్నా చెల్లెలూ బద్ధ శత్రువులు" అంది వినూత్న.

వినూత్న రంగు చీరలు కట్టి, బొట్టు పెట్టు కుంటున్న దగ్గర నుంచి, చెల్లెలితో మాట్లాడటం మానేశాడు మూర్తి. వినూత్న ఆ విషయం గమనించకపోలేదు.

"అసలు అత్తా కోడళ్ళు, వదినా మరదళ్ళు పూర్వ జన్మలో శత్రువులట! ఆ శత్రుత్వం పూర్తి చేసుకోడానికి ఈ జన్మలో బంధువులుగా పుడతారట నీకు తెలుసా వినూత్నా?" అడిగింది మమత.

"నాకెలా తెలుస్తుంది? నీవు నాతో ఎప్పుడు పోట్లాడలేదు, పైగా అమ్మతో కూడా పోట్లాడడం చూడలేదు. నేను చూడనిదాన్ని ఎలా నమ్మమంటావు? ఒకసారి ఇద్దరితో పోట్లాడితే నీవు చెప్పింది నమ్ముతాను" అంది వినూత్న.

"మీ ఇన్స్టిట్యూట్ పక్కన ఏదైనా ఇనిస్టిట్యూట్ ఉందేమో చూడు నేనూ వచ్చి జాయిన్ అవుతాను" మమత అంది.

"ఏ ఇన్స్టిట్యూట్ కావాలి నీకు?"

"దెబ్బలాటల ఇన్‌స్టిట్యూట్. ఎక్కడైనా ట్రైనింగ్ అయితే గాని నాకు చేత కాదు, పోట్లాడటం" అంది. ఇద్దరూ నవ్వుకున్నారు. వారిద్దర్నీ చూసిన వారెవరైనా స్నేహితురాళ్ళు అనుకుంటారుగాని వదినా, మరదళ్ళని అనుకోరు. వారి ఆత్మీయత అలాంటిది.

ఇంతలో భానుమూర్తి రావడంతో గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది వినూత్న. ఈ మధ్య అన్నగారికి ఎదురు పడడానికే భయపడుతుంది. మమత ఇద్దరి మధ్య వారధి కట్టాలని చూస్తుంది గాని అది ఇసక వారధే అవుతోంది చివరికి. అన్న గారి ముందుకి రావడానికి రంగు చీరలు, బొట్టే కాకుండా, తనకు పాఠాలు చెప్పే లెక్చరర్ మీద మనసు పారేసుకోవడం రెండవ కారణం. అందుకే తప్పు చేస్తున్నట్లు, తనలోతానే ఫీల్ అయి అన్నగారితో ఇదివరకటిలా ఫ్రీగా మాట్లాడలేకపోతుంది. తను చావడానికైనా అన్నగారు ఇష్టపడతాడు గాని, రెండో పెళ్ళికి మాత్రం అంగీకరించడని వినూత్నకు బాగా తెలుసు. మనసులో చాలా భయంగా ఉంది!

జస్వంత్ వినూత్న విషయంలో వట్టి పాఠాలు చెప్పడమే కాక, మరో అడుగు ముందుకి వేశాడని మమత గమనించింది. జస్వంత్‌కు వినూత్న విడో అని తెలుసు. ఇష్టపడి నిజంగా పెళ్ళి చేసుకుంటే తప్పేముంది అనుకుంది. కాని భానుమూర్తికి ఈ విషయం తెలియదు. తెలిస్తే ఇంక వినూత్నను తప్పక చీకటి గదిలో బంధించేవాడే.

ఒకటి, రెండు సార్లు మమత 'వినూత్నకు మరో పెళ్ళి చేస్తే ఎలా ఉంటుంది' అని భర్త అభిప్రాయం తెలుసుకోవాలని కదిపి చూసింది. మమత నోట్లో నుంచి మాట పూర్తిగా రాకుండానే, నిప్పులు తొక్కిన కోతి అయ్యాడు మూర్తి. ఎన్నో విధాలుగా నచ్చ చెప్పాలని ప్రయత్నించింది. 'దాన్ని చంపి, నేను జైలుకైనా వెళతాను గాని రెండవ పెళ్ళికి అంగీకరించను' అన్నాడు. భానుమూర్తికి చెల్లెలుకి రెండో పెళ్ళి చేయాలన్న తలంపు ఏ కోశానా లేదు. కాని జస్వంత్, వినూత్నల ప్రేమ మాత్రం రోజు రోజుకి చిగురిస్తుంది.

ఒకరోజు జస్వంత్, వినూత్న టైపు ఇన్‌స్టిట్యూట్ నుంచి కలిసి వస్తున్నారు. దారిలో కనబడిన కొందరు అల్లరి కుర్రవాళ్ళు ఇద్దరికీ సంబంధం అంటగట్టి, ఇన్ డైరెక్టుగా చాలా మాటలన్నారు. ఇంటికి వచ్చి వినూత్న ఏడుస్తూ కూర్చుంది. తమ సంబంధాన్ని ప్రపంచం నీచంగా చూడటాన్ని వినూత్న భరించలేకపోయింది. మమత ఓదార్పు, మంటమీద చల్లని నీరు చల్లినట్లవుతుంది ఎప్పుడూ వినూత్నకి.

భానుమూర్తికి అనుకోకుండా ఆరునెలలు బొంబాయికి ట్రెయినింగ్‌కి వెళ్ళవలసి వచ్చింది. వినూత్న గురించి మరీ మరీ భార్యకు జాగ్రత్తలు చెప్పి, భార్యను శ్వేతను, స్మితను విడువలేక విడువలేక విడిచి వెళ్ళాడు. కాని ఆ ఆరునెలల్లోనూ ఇంట్లో చాలా మార్పు వస్తుందని ఆ సమయంలో ఊహించలేదు. ఊహించి ఉంటే ట్రెయినింగ్ కాన్సిల్ చేసుకునే వాడు. చెల్లెల్ని విడచి వెళ్ళేవాడు కాదు.

వినూత్న, జస్వంత్‌ల ప్రేమ మరికొంత ముందుకి వెళ్ళింది. ఇంతలో జస్వంత్ తల్లిదండ్రుల దగ్గరి నుంచి ఉత్తరం వచ్చింది. ఒకసారి వచ్చి వెళ్ళమని. అసలు సంగతి తెలియని జస్వంత్ వెళ్ళాడు. తీరా వెళ్ళిన తరువాత పెళ్ళిచూపులు అన్నారు. అప్పుడు వినూత్న గురించి చెప్పాడు. వాళ్ళు ఒప్పుకోలేదు. చూస్తూ చూస్తూ పెళ్ళై భర్తపోయిన స్త్రీని యువకులు ఉడుకు రక్తం గనుక ముందుకి రావచ్చు. వారికి ఆశయాలు ఉండవచ్చు. కాని పెద్ద వారికి పిల్లల మీద ఎన్నో ఆశలుంటాయి. అందుకే జస్వంత్ తల్లిదండ్రులు ఈ పెళ్ళి చేసుకుంటే తమతో ఇంకేమీ సంబంధం ఉండదని చెప్పారు. అంతేకాదు వచ్చే నెలలో మరో అమ్మాయితో ముహూర్తాలు పెట్టేస్తున్నామని కూడా చెప్పారు. జస్వంత్ మమతతో ఈ విషయం చెప్పాడు. వినూత్నతో ఇంట్లో మాట్లాడితే బావుండదని పార్కుకి తీసుకొని వెళ్ళి అంతా చెప్పాడు. రిజిస్టరు మారేజి చేసుకుందామన్నాడు. పార్కులో జస్వంత్‌ని, వినూత్నను చూసిన ఒక కాలేజీ కుర్రాడు మర్నాడు కాలేజీ గోడలమీదే కాకుండా, పరంధామయ్యగారి ఇంటి గోడల మీద కూడా వారిద్దరి గురించి అసహ్యకరమైన పదాలతో పిచ్చిరాతలు రాశాడు. తెల్లవారేసరికి ఇంట్లో వారికి ఆ సంగతి తెలియక పోయినా, వీధి, కాలేజి, ఊరు ఊరంతా అల్లరి అయిపోయింది. ఒక పక్క తండ్రి తనకు వేరే అమ్మాయితో సంబంధం సెటిల్ చేస్తాననడం, మరొక పక్క గోడల మీద రాతలు వారిద్దర్ని వెంటనే పెళ్ళికి పురికొలిపాయి.

మమత అత్తమామలతో ఆ విషయం చెప్పింది. పైకి వారు వినూత్నకు రెండో పెళ్ళా అన్నారు గాని, ఎలాగోలా ఆమెకు పెళ్ళైతే గుండెల మీది నుంచి ఎంతో బరువు దిగుతుందని మనసులో ఉంది. భానుమూర్తికి ముందు రాయమన్నారు. అలాగే భయపడుతూనే ఈ విషయం ఉత్తరం రాసింది మమత. కాని ఆ ఉత్తరం వెళ్ళేసరికి భానుమూర్తి మరొక ఊరిలో ఉండడంతో అసలు చెల్లి పెళ్ళి సంగతే తెలియలేదు మూర్తికి. జస్వంత్ తండ్రి వస్తున్నానని ఉత్తరం రాశాడు. తండ్రి వచ్చేలోపుగా పెళ్ళి అయిపోవాలని, లేదంటే వేరే సంబంధానికి తండ్రి మాట ఇచ్చేస్తాడనీ, ఆ అమాయకురాలిని బాధ పెట్ట వలసి వస్తుందనీ జస్వంత్ తొందర చేయడంతో, భానుమూర్తి దగ్గరనుంచి సమాధానం రాకపోయినా, ముందు గుడిలో దండలు మార్పించేసి, ఆ తరువాత రిజిస్టరు మారేజి చేయించింది మమత.

భర్తకు మొదట్లో కోపం వచ్చినా, తరువాత చెల్లెలి బ్రతుకుని చూసి సరి పెట్టుకుంటాడని ఊహించింది గాని, ఆ పెళ్ళి తన జీవితాన్ని మారుస్తుందని ఆమె అనుకోలేదు. మోడులా ఉన్న ఒక చెట్టు చిగర్చడానికి దోహదం చేసింది మమత. ఇంక వినూత్న సంతోషం అయితే చెప్పనే అక్కరలేదు. కూతురి బ్రతుకు ఒక దారిన పడినందుకు పార్వతీ, పరంధామయ్యల సంతోషం అంతా ఇంతా కాదు. కొడుకు దగ్గర లేకుండా ఈ పెళ్ళి జరిగినందుకు బాధపడ్డా, కొడుకు దగ్గర ఉంటే పెళ్ళికే

ఒప్పుకోడని వారికి బాగా తెలుసు. కొన్ని రోజులు పోతే అతనే సరిపెట్టుకుంటాడులే అని మమత లాగే వారూ అనుకొని పొరపాటు పడ్డారు.

అప్పటి నుంచి భానుమూర్తి దగ్గర నుంచి ఉత్తరాలు రావడం ఆగిపోయాయి. పెళ్ళికి ముందే చెల్లెలి పెళ్ళి సంగతి విని ఉంటే ఉద్యోగం అయినా వదులుకొని వచ్చి పెళ్ళి ఆపి ఉండేవాడు మూర్తి. తనకు తెలియనివ్వకుండా పెళ్ళి చేసినందుకు మమత మీద పీకల వరకూ కోపంగా ఉంది మూర్తికి. తల్లిదండ్రుల మీద కూడా కోపంగానే ఉంది. కాని ఎక్కువ కోపం మమత మీదే. అందుకే ఉత్తరాలు రాయడం మానేశాడు. పెళ్ళికాగానే జస్వంత్‌కి ట్రాన్స్‌ఫర్ కావడంతో వినూత్న, జస్వంత్ ఆ ఊరినుంచి వెళ్ళిపోయారు. భర్త దగ్గర నుంచి ఉత్తరాలు రాక చాల కంగారు పడసాగింది మమత. ఎలా ఉన్నారని టెలిగ్రాం ఇచ్చింది. దానికేమీ సమాధానం రాలేదు. ఆఫీసుకి ఫోన్ చేయించింది. అక్కడి నుంచి బాగానే ఉన్నాడు, రోజు ఆఫీసుకి వస్తున్నాడు అని వాళ్ళు కబురు చెప్పగానే 'అమ్మయ్య' అనుకుంది గాని, మనసంతా దిగులుతో నిండిపోయింది భర్త ప్రవర్తనకు.

ఇక వచ్చిన తర్వాత మెల్లిగా మనసు మార్చి కోపం పోగొట్టవచ్చు అనుకుంది మమత. ట్రయినింగ్ పీరియడ్ పూర్తి అయినా భానుమూర్తి రాకపోవడంతో మళ్ళీ కంగారు మొదలైంది ఆమెకు.

మళ్ళీ ఆఫీసుకి వెళ్ళి వాకబు చేస్తే ఒకనెల సెలవు పెట్టి అటునుంచి అటే పుణ్యక్షేత్రాలు తిరిగి రావడానికి వెళ్ళాడని ఆఫీసువాళ్ళు చెప్పారు. ఎప్పుడూ కనీసం సినిమాకి కూడా మమతను తీసుకొని వెళ్ళకుండా ఒంటరిగా వెళ్ళే అలవాటు లేని మూర్తి నెల్లాళ్ళు సెలవు పెట్టి ఒక్కడూ, పుణ్య క్షేత్రాలు చూడడానికి వెళ్ళాడంటే మమతకు నమ్మకం కలగలేదు. పార్వతి, పరంధామయ్య మాత్రం మమత ఏంచెబితే అదే నమ్మేస్తున్నారు. వినూత్న పెళ్ళి కావడంతో వాళ్ళిప్పుడు నిశ్చింతగా ఉన్నారు. ఎక్కువగా పురాణ పఠనంతోనే కాలక్షేపం చేస్తున్నారు ఇద్దరూ.

ఆ నెల గడచింది. అప్పటికి వినూత్న పెళ్ళై నాలుగు నెలలయ్యాయి. ఆ దంపతులు పాతవారైపోయారు గాని, మూర్తిలోని కోపం మాత్రం ఇంకా కొత్తగానే రగులు కుంటోంది ఒక రోజు సడన్‌గా ఇంటికి వచ్చాడు. భర్తను చూసిన మమతకూ, కొడుకుని చూసిన తల్లిదండ్రులకూ ఆనందం పెల్లుబికింది. కాని వారి సంతోషం ఎంతోసేపు మిగలలేదు. మూర్తి పిల్లలతో తప్పించి ఇంట్లో భార్యతోగాని, తల్లిదండ్రులతో గాని మాట్లాడలేదు. ఏదో కోపంలో ఉన్నాడు అనుకుని ఊరుకున్నారు. మమత ఎంత ప్రాధేయపడినా అతను పలకలేదు, ఉలకలేదు. కోపం ఇంకా తగ్గలేదని గ్రహించింది మమత. పిల్లల్ని మాత్రం ఇదివరకటి కంటే ఆప్యాయంగా చూస్తున్నాడు మూర్తి.

కనీసం భార్యను 'ఎలా ఉన్నావు' అని ప్రశ్నించలేదు. తల్లిదండ్రులను మొక్కుబడిగా పలకరించాడు. ఒకరోజు సడన్‌గా వినూత్న, జస్వంత్ ఊరి నుంచి వచ్చారు. జస్వంత్ తల్లిదండ్రులకు జస్వంత్ మీద కోపం పోయిందట. వాళ్ళ ఊరు రమ్మని పిలిస్తే అక్కడకు వెళ్ళి ఇటు వచ్చారు. వినూత్నకు మార్నింగ్ సిక్‌నెస్. అసలు ఏ పనీ చేసుకోలేకపోయింది. ఏంతిన్నా వాంతులై పోతున్నాయి. అందుకే తల్లిదండ్రులను తీసుకొని వెళ్ళడానికి వచ్చింది. పార్వతి, పరంధామయ్యగారికి కూతురి సంసారం ఎలా ఉందో చూడాలని కుతూహలంగానే ఉంది. పైగా కొడుకూ, కోడలూ ముభావంగా ఉంటున్నారు. తాము కొంతకాలం దూరంగా ఉంటే వాళ్ళు దగ్గరవుతారని వాళ్ళిద్దరూ కొడుకును అడిగారు. మూర్తి ఏ భావం బయటపడకుండా "వెళ్ళండి" అన్నాడు. అసలు కొడుకు మనసులో ఉన్న సంగతి వారికి తెలియదు.

వినూత్న, జస్వంత్ మూడురోజులున్నారు మమత దగ్గర. ఈ మూడు రోజులు అసలు ఇంటి మొహమే చూడలేదు మూర్తి. ఎక్కడున్నాడో, ఏమి తిన్నాడో అని తల్లడిల్లిపోయింది మమత. ఆమె ప్రేమ, అనురాగం అతను అర్థం చేసుకుంటే కదా! జరిగింది మరచి పోవడానికి!

వినూత్న వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత ఇంటికి వచ్చాడు గాని అతని ప్రవర్తనలో మాత్రం ఏవిధమైన మార్పులేదు. వినూత్న వెళ్ళి మమతకు ఉత్తరం రాసింది.

"వదినా నేను అక్కడ ఉన్న మూడు రోజులు నీవు నోరు విప్పి చెప్పకపోయినా పరిస్థితి అర్థం చేసుకున్నాను. నా వల్ల నీ జీవితం అలా అవుతుందని నేను కలలో కూడా ఊహించలేదు. వదినా, భర్త పోయిన నన్ను నీవెంతో ఆదరించావు. ఎండిపోతున్న చెట్టుకు దయతో నీరు పోసి చిగురించడానికి దోహదం చేశావు. నాకు పునర్జన్మను ప్రసాదించావు. నీవే లేకపోతే అమ్మ, నాన్న, అన్నయ్య అసలు నా వివాహం సంగతే ఆలోచించేవారు కాదు. నేను జీవితాంతం విధవగానే బ్రతికేదాన్ని. అలాగే తోడు లేకుండా ఒంటరిగానే కన్ను మూసేదాన్ని. నాకు ఈ జన్మలో నీవు చేసిన మేలు చెప్పడానికి నా నోరు, రాయడానికి ఈ చేతులు చాలవు. కాని వదినా, ఒక మాట ఒక దీపం వెలగడానికి మరో దీపం ఆరిపోకూడదు. అలా జరిగిన నాడు వెలిగిన దీపం వెలుగుకు విలువలేదు. నా గురించి నీ జీవితం నాశనమైందని తెలిసి నేను శాంతిగా బ్రతక గలనా? అన్నయ్య తప్పక మారతాడని ఆశిస్తున్నాను. ఏ కారణం చేతనైనా మారకపోయినా నీకు నేను తోడు ఉన్నానన్న సంగతి మరచిపోవద్దు. నీ సుఖాన్ని కోరే నీ వినూత్న."

ఆ ఉత్తరం చూసి అప్రయత్నంగా మమత కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి. ఆ పెళ్ళి జరిపిస్తున్న సమయంలో ఆ జంటను కలిపే ముహూర్తం, తమ జంటను విడదీసి ఒంటరి వారిని చేస్తుందని మమత అనుకోలేదు. విధి ఎంత విచిత్రమైనది. అనుకోనివి

అలా జరిగి పోతూనే ఉంటాయి. కొన్ని సంఘటనలు కన్నీటి ప్రవాహానికి నాంది పలుకుతూనే ఉంటాయి.

భానుమూర్తి ఇప్పుడిప్పుడు మాట్లాడుతున్నాడు భార్యతో. ఆ మాటలు ప్రేమతో వచ్చినవి కావు. కోపంతోనూ, కసితోనూ ఉంటాయి.

ఆఫీసు నుంచి వచ్చిన భానుమూర్తికి కాఫీ తెచ్చి ఇచ్చింది మమత. "అక్కడ పెట్టి వెళ్ళు" ఎవరో పరాయి దానితో అన్నట్లే అన్నాడు. కాలం ఎలాంటి గాయాల్ని అయినా మాన్పుతుంది. ఎటువంటి సమస్యలనైనా పరిష్కరిస్తుంది అంటారు. కాని ఆ కాలం మమత వైపు కన్నెత్తి కూడా చూడడం లేదు. మూర్తి మనసులో మార్పు తీసుకొని రావడం లేదు. బొంబాయి నుంచి వచ్చిన దగ్గరనుంచీ భార్య చేతి వంట తినడం లేదు. కేవలం పిల్లల కోసం మాత్రమే ఇంటికి వస్తున్నారు.

ఒకరోజు స్మితకు ఒంట్లో బావుండలేదని డాక్టరు దగ్గరకు తీసికొని వెళ్లింది మమత. డాక్టరు గారు స్మితను చూసి మందులు రాసిచ్చిన తరువాత "ఏమ్మా! మూర్తి ఆరోగ్యం ఎలా ఉంది? కడుపు నొప్పి తగ్గిందా? మందుల కోసం మళ్ళీ రానేలేదు. వస్తాడని చూశాను. ఇవిగో ఈ మందులు కూడా వాడమని చెప్పు" అని కొన్ని మందులు మమతకు ఇచ్చాడాయన. అసలు మూర్తికి ఒంట్లో బావుండనట్లే తెలియదు. ఇక ఆయన కేం జవాబు చెబుతుంది? ఏం చెప్పాలా అని ఆలోచిస్తూండగా ఇంతలో ఫోన్ మ్రోగడంతో ఆ టాపిక్ వదిలేశా డాయన. అమ్మయ్య అనుకుంది. మనసు వేదనతో నిండిపోయింది. ఆరు నెలల నుంచి అదే పరిస్థితి ఉన్నప్పటికీ, కథ పాతదే అయినప్పటికీ, బాధ మాత్రం ఏ రోజుకారోజు కొత్తగానే కలుగుతూంది మమతకు. మొదటి నుంచీ భార్యను నిర్లక్ష్యం చేసే మనస్తత్వం అయితే అంతగా బాధపడలేక పోయేది ఆమె. కాని భార్యను పువ్వులా చూసుకునే మూర్తి ముల్లులా మారిపోయాడు.

డాక్టరు గారిచ్చిన మందులు ఆ రాత్రి ఇవ్వబోయింది మమత. ఆశ్చర్యంగా ఆమెను చూశాడు. "ఇవన్నీ, డాక్టరుగారి దగ్గరి నుంచి నిన్నెవరు తీసుకొని రమ్మన్నారు?" విసుగ్గా అన్నాడు. ఎప్పుడైనా తలనొప్పి వస్తే చాలు భార్య ఒడిలో తల పెట్టుకొని విక్స్ రాయించుకొని, ఆమె చేత్తో ఇచ్చిన టాబ్లెట్ వేసుకొని పడుకునే మూర్తికి ఇప్పుడు ఆమెను చూస్తేనే శత్రువుని చూసినట్లు ఉంటూంది.

"మీకు ఎమీబియాసిస్ ఉందని డాక్టరుగారు చెప్పారు. చూడండి రోజు రోజుకీ ఎలా నీరసించి పోతున్నారో, మందులు వాడక" అంది. ఈ మధ్య భర్త వేరే గదిలో పడుకోవడంతో అతనికి అసలు అనారోగ్యంగా ఉందనే ఆమెకు తెలియలేదు.

"నేను నీరసిస్తే నీకేం? ఏమైతే నీ కెందుకు?" నిష్ఠురంగా అన్నాడు.

"మీకు ఒంట్లో బావుండకపోతే నే బాధపడకపోతే మరెవరు బాధ పడతారు?" బాధ నిండిన గొంతుతో అంది, నీరు నిండిన కళ్ళను తుడుచుకుంటూ.

"నేను చనిపోయినా ఫరవాలేదు. భర్తపోయిన ఆడవాళ్ళు తిరిగి పెళ్ళి చేసుకోవచ్చని వినూత్న ద్వారా నిరూపించావుగా?" కసిగా అన్నారు.

ఆ మాటలకు చెప్పుతో చెంపమీద ఎడా పెడా వాయించి నట్లనిపించింది మమతకు. యిలాంటి సూటిపోటీ మాటలు చాలా అంటున్నాడు మూర్తి ఈ మధ్య.

తనని ఎంత తప్పుగా అర్థం చేసుకున్నాడు! భార్య ద్వారా చెల్లెలి బ్రతుకు బాగుపడింది అని సంతోషించడానికి బదులు, చెల్లెలు స్థానంలో భార్యను ఊహించుకొని ఎంత నరకం అనుభవిస్తున్నాడు! ఆమెకు ఎంత నరకం చూపిస్తున్నాడు! బాధతో సముద్రంలా ఎగసిపడే మనసుని అదుపులో పెట్టి అనునయంగా అంది.

"ఏ స్త్రీ కూడా భర్త పోవాలని, తను మరో పెళ్ళి చేసుకోవాలని అనుకోదండి. వినూత్న ఖర్మ కొద్ది శ్యామలరావు చనిపోయాడు. పైగా ఆమె కన్యగానే ఉంది కదా. జస్వంత్ ముందుకి వచ్చాడు కాబట్టి మళ్ళీ పెళ్ళి చేసుకుంది. అదే సంఘటనను మనకు అన్వయిస్తే ఎలా చెప్పండి?" ఆమె గొంతు వేదనగా పలికింది.

"ఏం వినూత్నకు పట్టిన కర్మే నీకూ పట్టదని గ్యారంటీ ఏమిటి? నీవు మళ్ళీ పెళ్ళి చేసుకోవని నమ్మకం ఏమిటి? జస్వంత్ లాంటివాడే మరొకడు తారసపడతాడు. నేను పోయినా ఫరవాలేదు నీకు" అన్నాడు. ఒక్కొక్క మాటా ఒక్కొక్క గునపంలా తగిలి ఆమె గుండెల్ని పిండి చేసింది.

అయినా చెదిరిన మనసును కూడదీసుకొని భర్తలో మార్పు తేవాలనే ఉద్దేశంతో-

"చూడండి, వినూత్నకు నాకు పోలికేమిటి? ఆమెకు పిల్లలు లేరు. నాకు పిల్లలున్నారు. ఆమె, నేను ఒకటేనా? ఏ భారత స్త్రీ కూడా భర్త పోవాలని, తను మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనీ అనుకోదు. ఎన్ని ఒడిదుడుకులు ఉన్నా సరిపెట్టుకుంటుంది. తనకు తనే సర్ది చెప్పుకుంటుంది. అందులో పిల్లలున్న స్త్రీ మరో పెళ్ళి గురించి అసలే ఆలోచించదు. అయినా రాని చెడ్డ రోజులను గురించి ఆలోచించి మీ ఆరోగ్యం పాడు చేసుకోకండి" అంటూ బ్రతిమాలుతూ టాబ్లెట్, మంచినీళ్ళు అందివ్వబోయింది. గ్లాసును విసిరికొట్టాడు మూర్తి. ఆ గ్లాసులో నుంచి ఒలికిన నీరు తన కంటి నుంచే వచ్చినట్లు ఫీల్ అయింది మమత.

ఆ సాయంకాలం ఆఫీసు నుంచి వస్తూ, వస్తూ వంట మనిషిని వెంటబెట్టుకొని వచ్చిన మూర్తిని చూసి అవాక్కైపోయింది మమత. వంట మనిషిని పెట్టుకునే అవసరం లేదు. అంత ఆర్థికస్తోమతు కూడా వారికి లేదు. అయినా భర్త ఆ పని ఎందుకు చేశాడో అర్థం అయింది. తన చేతివంట తినడం ఇష్టం లేదన్న మాట అనుకుంది. వంట మనిషి మూర్తి సహాయంతో వంట గదిని ఆక్రమించేసింది. మమత ప్రాణం లేని

బొమ్మలా, తన ఇంట్లోని మార్పును మౌనంగా, మూగగా చూస్తుంది. మనసులో బాధ మాత్రం తుఫాను హోరులా ఉంది. వడగళ్ళ వానలా ఉంది. మంచం మీద పడి మౌనంగా రోదించింది.

ఆమె రోదన అతని చెవిన పడినా, ఆమె వేదన అతని మనసుకి అర్థం అయినా మమత అంత బాధ పడవలసిన అవసరం ఉండేది కాదు. ఆ ఇంట ఒక దీపం వెలిగింది. దానివల్ల మరో దీపం అలిగింది. అప్పుడు వినూత్న బాధపడేది ఇంట్లో, ఇప్పుడు ఆ బాధ మమతకు ట్రాన్స్‌ఫర్ అయింది.

మంచి నిద్రలో నుంచి ఉలిక్కిపడి లేచాడు మూర్తి. కంగారుగా పక్కగదిలోనికి వెళ్ళి మమత మంచం వైపు చూశాడు. పిల్లలు తల్లి పక్కన నిశ్చింతగా నిద్రపోతున్నారు. తమని కన్న తల్లిదండ్రుల హృదయాలలో నున్న అగాధం ఆ చిన్నారి మనసులకు తెలియదు.

వారిని చూసి 'అమ్మయ్య' అనుకొని, వారిద్దరిని తీసుకువెళ్ళి తన పక్కన వేసుకొని పడుకున్నాడు. తిరిగి తన కన్న కలను తలచుకుంటే వణుకు పుట్టింది. తను చనిపోయాడు. మమత మరో యువకుణ్ణి పెళ్ళి చేసుకుంది. అతనికి శ్వేత, స్మిత అంటే ఇష్టం లేదు. సహనానికి మారు పేరైన ఆడదే తన సవతి పిల్లలను భరించలేదు. అలా భరించే వారు అరుదుగా ఉంటారు. అటువంటిది పిల్లలున్న తల్లిని పెళ్ళి చేసుకున్న మగవాడు సవతి పిల్లలను భరిస్తాడా? చీటికి మాటికి వాళ్ళను కొడుతున్నాడు. ఏమైనా అంటే మమతకు కూడా తిడుతున్నాడు. అతన్ని మంచి చేసుకోవడం కోసం మమత కూడా పిల్లల్ని కొడుతూంది, తిడుతూంది. అతని ఎదురుగా కొట్టి, కొట్టి పక్కగదిలో ఒంటరిగా పడుకో బెడుతుంది వాళ్ళను. వాళ్ళు 'అమ్మా, నాన్న' అంటూ గోల పెట్టి ఏడుస్తున్నారు. కాని మమత వెళ్ళడం లేదు. తండ్రి లేని పిల్లలు, తల్లి ఉన్నా లేని స్థితిలో ఉన్న ఆ పసివారు హృదయవిదారకంగా ఏడుస్తున్నారు. ఆ ఏడుపు, వాళ్ళ ఘోష రాళ్ళను సైతం కదిలించే విధంగా ఉంది.' అదీ కల! తన మనసులో నిగూఢంగా ఉన్న భయంకరమైన భావాలకు ప్రతిరూపాలే ఆ కల అని అతను అనుకోలేకపోయాడు. ఈ రోజు ఇది కల. రేపు అది నిజమవుతుందని అతని మనసు నొక్కి చెబుతూంది.

పిల్లల ఏడుపులు, ఇద్దరి గొంతులు, వందలై, వేలై, లక్షలై, కోట్లయి అతని చెవుల్లో మారుమోగసాగాయి. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది, మనసంతా మమత పట్ల అసహ్యంతో నిండిపోయింది. అతని ఆలోచనలు మెదడును పిండేస్తున్నాయి. ఒకవేళ ఏ కారణం చేతనైనా తను చనిపోతే మమత నిజంగా అలాగే చేస్తుందా? ఎందుకు చేయదు? వినూత్నకు చేసిందిగా మరో పెళ్ళి! అలాగే తనూ చేసుకుంటుంది. మమతకు ఇంకా వయసుంది. అందముంది. పిల్లలు చిన్న వయసులోనే పుట్టేశారుగాని, ఇంకా ఆ వయసుకి పెళ్ళి కాని కన్నె లెందరో ఉన్నారు సంఘంలో. ఇంత కాలం

తనను ప్రాణంలా చూసుకున్న మమత రేపు ఆ యువకుణ్ణి కూడా అంత ప్రేమగానూ చూసుకుంటుందా? తన అణువులో అణువుగా కలసిపోయిన, ఆ తరుణి మరో యువకుడి ఒడిలో....! అంతే ఇంక, ఊహించలేకపోయాడు!

ఆ పెళ్ళేదో జరిగి పోయినట్లుగా భావిస్తున్నాడు భానుమూర్తి. పిల్లల గురించి ఆలోచన ఎక్కువై పోయింది. మమత హాయిగానే ఉంటుంది. కొత్త భర్త సంసారం, కొత్త సరసాలు, కాని పిల్లలు మాత్రం తండ్రిలేక, ఉన్న తల్లి ప్రేమను పొందలేక తల్లడిల్లిపోతారు. అది తలచుకొని కుమిలిపోయాడు. అవన్నీ కేవలం ఊహలేనని, ఎంత మాత్రం నిజం కావని అతనికి కొంచెం కూడా అనిపించ లేదు. అందుకే ఆ రోజే పిల్లలిద్దరినీ ఒక అనాథాశ్రమయంలో చేర్పించి వచ్చాడు. హాస్టల్లో పెట్టే వయసు కాదు వారిది. చుట్టాలెవరూ దగ్గర వారు లేరు. వినూత్న దగ్గర పెట్టడం అన్న తలపే లేదు అతనికి. అందుకే అనాథాశ్రమంలో పెట్టి, రోజూ వెళ్ళి చూసివస్తున్నాడు. వారికి స్పెషల్‌గా డబ్బు ఇస్తూ, స్పెషల్‌గా ఒక ఆయాను ప్రత్యేకంగా నియమించే ఏర్పాటు చేశాడు. కానీ అన్నీ ప్రత్యేకంగా చూసినా, వాళ్ళు అమ్మానాన్నల ప్రేమను అందివ్వలేరు కదా!

పిల్లల్ని ఎప్పుడైతే భానుమూర్తి హాస్టల్లో పెట్టాడో మమతకు మతిపోయింది. ఏమిటి భర్త ప్రవర్తన! ఎప్పటికైనా మారతాడు అని ఆశగా ఎదురు చూస్తుంటే, రోజు రోజుకీ మితిమీరి పోయి ఆఖరికి పిల్లల్నే దూరం చేశాడు. పిల్లలు ఎక్కడున్నారో చెప్పమని, ఒక్కసారి చూపించమని ఎంతో ఏడ్చింది, బ్రతిమాలుకుంది. అయినా అతను కరగలేదు. తల్లీ, తండ్రీ ఎవరో తెలియని మమత అనాథాశ్రమంలో పెరిగింది. తల్లి, తండ్రి ఉన్న శ్వేత, స్మిత కూడా అనాథాశ్రమంలోనే పెరుగుతున్నారు, పరిస్థితుల ప్రాబల్యం వల్ల!

"ఏమండీ, పిల్లలను ఒక్కసారి చూపించండి, మీకు పుణ్యం ఉంటుంది" అని వేడుకుంది ఒకరోజు మమత.

"ఎందుకు, వాళ్ళు నీ రెండవ పెళ్ళికి అడ్డు రాకుండానే నేను దూరం చేశాను" అన్నాడు. ఈ మధ్య అనవసరమైన అనుమానాలతోనూ, అనారోగ్యంతోనూ అతను రోజు రోజుకీ క్షీణించిపోతున్నాడు. మమత అది గమనిస్తూనే ఉంది. కాని అతను ఆమె మనసు అర్థం చేసుకునే స్థితిలో గాని, తన ఆరోగ్యాన్ని చక్కదిద్దుకునే స్థితిలో గాని లేడు.

"నేను కలకాలం మీ నీడనే బ్రతకాలనుకుంటున్నానండీ. మీరు ఊహించినది జరగాలని నేను కోరుకోవడం లేదు, ఒక వేళ అలా జరిగినా నా దురదృష్టం వల్ల, నేను రెండో పెళ్ళి చేసికోనని ప్రమాణం చేసి చెబుతున్నాను. నన్ను నమ్మండి, పిల్లల్ని తీసుకురండి" అని ఎంతో వేదనతో అడిగింది. చివరి మాట పలికేటప్పుడు ఆమె కంఠం రుద్ధమైంది.

"ఎందుకు పిల్లల మీద ప్రమాణం? నాతో పాటు వాళ్ళు కూడా చచ్చిపోతే

అసలు అడ్డనేదే ఉండదనా?" నిష్ఠూరంగా ఉన్నాడు. అతని నోటి నుంచి వచ్చినవి మాటలే గాని, అవి ఆమెకు ములుకుల్లా సూటిగా హృదయానికి తగిలి గాయం చేశాయి. భర్త మాటలకు ఎలా సమాధానం చెప్పాలో, అతనికి ఎలా నచ్చ చెప్పాలో అర్థం కావడం లేదామెకు. అటు తిప్పి ఇటు తిప్పి, ఎలా మాట్లాడినా, ఏం మాట్లాడినా ఆమెనే అంటున్నాడు. మాటలతోనే ఇంట్లో మారణహోమం సృష్టిస్తున్నాడు. ఇంత కాలం భర్త ఎంత మూడీగా ఉన్నా, భర్త నీడన, పిల్లలతో అలాగే కాలం గడుపుతోంది మమత. వినూత్నకు కొడుకు పుట్టాడని కబురు వచ్చినా వెళ్ళలేదు ఎవరూ.

లేని ధైర్యం తెచ్చుకొని తిరిగి అంది. "పోనీ మీకు అంత నామీద నమ్మకం లేకపోతే, మీకంటే ముందు నేను ప్రాణాలు తీసుకుంటాను లెండి. ముందు పిల్లల్ని ఇంటికి తీసుకు వచ్చేయండీ!" అని. "అయ్యో! నీవెందుకు ప్రాణాలు తీసుకోవడం, ఇంకా ఎన్ని విధవా వివాహాలు చేయాలో, ఎన్ని సన్మానాలు పొందాలో పైగా నీవు కూడా విధవా వివాహం చేసుకుని అందరికీ మార్గదర్శకురాలివి కావద్దూ?" హేళనగా, కోపంగా భర్త అంటుంటే తల తీసుకువెళ్ళి రోట్లో పెట్టుకోవాలన్నంత బాధ కలిగింది మమతకి. ఇక భర్తతో వాదించి లాభం లేదనుకుంది. మరో మూడు నెలలు భర్తలో మార్పు కోసం, పిల్లల కోసం ఎదురు చూసింది. అలమటించి, అలమటించి అలసిపోయింది. తన పిల్లలిక తన కళ్ళబడడం కల్ల అని గ్రహింపుకు రాగానే ఒక నిర్ణయానికి వచ్చింది మమత. మమతలు పంచే ఆమె మనసు ఆ మమతలని తుంచుకోడానికే నిర్ణయించుకుంది.

పిల్లలు లేని ఆ ఇంట్లో ఉండబుద్ధి కావడం లేదు. భర్త నిరాదరణను తలచుకొని ఆ ఇంటిలో నిలబడలేక పోయింది. ఇంట్లో పనికూడా ఏమీలేక, పిల్లలమీద బెంగతో, పిచ్చి ఆలోచనలతో రోగిష్టిదానిలా తయారైంది. మంచం మీద నుంచి లేస్తే లేచేది, లేదంటే అన్నం, స్నానం కూడా లేకుండా అలాగే మంచాన్ని అంటి పెట్టుకొని ఉండేది. తిన్నావా, తాగావా అని అడిగే నాథుడు ఆ ఇంట్లో ఉన్నా, అడగడం లేదు. వంట మనిషితో వంట చేయించుకొని మూర్తి తినేసి ఆఫీసుకు వెళ్ళి పోయేవాడు. అత్త మామలకు ఇక్కడ జరుగుతున్న సంగతులేమీ తెలియవు.

భర్త ఎంత చీదరించుకున్నా, ఎంత హేళనగా మాట్లాడినా, అన్నిటినీ ఓర్చుకొని, అతనిలో మార్పు తీసుకొని రావాలని ప్రయత్నించి విరక్తి చెందింది మమత. పిల్లలు లేక పోవడం, వారి ఆచూకీ చెప్పకపోవడం ఆమెలో రోజు రోజుకు దుఃఖాన్ని పెంచి, జీవితం మీద ఆశను చంపేస్తూ వచ్చాయి. అసలు మమత అలాగే చనిపోయినా కూడా పట్టించుకునే స్థితి లోలేడు మూర్తి. అతనికి మమత అంటే అంతకోపంగా ఉంది. నోట్లోపెట్టదుగాని లేకపోతే నమిలి మింగే సేవాడే కోపంలోనూ, కసిలోనూ!

★ ★ ★



ఆ ఉత్తరాన్ని పదే పదే చదువుతున్నాడు మూర్తి. చదివే కొద్ది గుండె బరువెక్కి పోయింది. చెప్పలేని దిగులు కలిగింది. ఏదో ఆమెను ఏడిపిస్తున్నాను అని అనుకున్నాడు గాని ఆమె అంత పని చేస్తుందని అనుకోలేదు. పైన ఎటువంటి సంబోధనా లేదు.

"మీరు చనిపోతే నేను మరో పెళ్ళి చేసుకుంటానేమోనన్న దిగులు మీకు అక్కర లేదు. మీ అనుమానం తీరడానికి మీ కంటే ముందు నేనే చనిపోవాలని నిర్ణయించుకున్నాను. బహుశా పిల్లలు త్వరలో తల్లి లేని వారు కాబోతారని దేవుడికి తెలుసు ననుకుంటాను, అందుకే వారికి ఒకదారి ముందుగానే చూపించాడు. ఎప్పటికైనా నా నిష్కల్మషమైన ప్రేమ నా పిల్లలను కాపాడుతుంది. దేవుడనే వాడు ఉంటే నేను ఏదైనా పుణ్యం చేసుకొని ఉంటే అది నా పిల్లలకు రక్షణగా ఉంచమని నేను కోరుకునే కోరిక మన్నిస్తాడని అనుకుంటున్నాను. నన్ను పెళ్ళి చేసుకొని మీ బ్రతుకును పాడు చేసుకున్నారు. రెండో సారి అయినా, పాతభావాలకు అద్దం పట్టే అర్ధాంగిని చేపట్టి మీ జీవితం సార్ధకం చేసుకోండి. మమత, శ్వేత, స్మితలను పీడకలగా మరచిపోండి. నా నిర్ణయం మీకు ఆనందాన్ని కలిగిస్తుందనే ఉద్దేశంతోనే నేను వెళ్ళిపోతున్నాను. నా చావు మీకు ఏ మాత్రం సంతోషం కలిగించినా, మీరు నా మెడలో వేసిన మూడు ముళ్ళకు సార్థకం చేకూరినట్లే. భారత స్త్రీ కడసారి వరకూ తన భర్తకు ఆనందాన్ని, అనురాగాన్ని పంచాలనే ప్రయత్నిస్తుంది. నేను ఈ దేశంలో పుట్టిన స్త్రీని. నా ప్రాణాలు ఎక్కడ ఎలా పోతాయన్నది మాత్రం నేను చెప్పలేను. ప్లిలల విషయంలో ఇది ఘోరమైన అత్యంత క్రూరమైన సంఘటన అయి నప్పటికీ, దీనికి ఇంత కంటే పరిష్కారం లేదు. నా గురించి వెతికించ వద్దు. పిల్లల దగ్గరకు వెళితే మీ అమ్మపై నుంచి ఆశీర్వదిస్తుందని చెప్పండి."

చేతిలోని ఉత్తరం రెపరెప లాడుతూంది. మమత ఇల్లు వదిలి వెళ్ళిపోయి పది రోజులైనా ఆ పది రోజులలోనూ దాన్ని పదివేల సార్లు చదువుకున్నాడు మూర్తి. ఆమె కోసం వెతకని స్థలం లేదు. బాధపడని నిమిషం లేదు. ఆమె జాడ కోసం చేయని ప్రయత్నం లేదు. మమత నిజంగా చని పోయిందా? "అమ్మో అలా జరగడానికి

వీలులేదు. పిల్లలు తల్లి లేని వారు కావడానికి వీల్లేదు" అని అతని మనసు ఘోషించింది. కాని అదంతా గత జల సేతు బంధనం. మనసు మూగగా రోదిస్తోంది. తలచుకుంటే గుండెలు బద్దలవుతున్నాయి. భార్య చూపించిన ప్రేమంతా అతనికి గుర్తు వచ్చింది. పశ్చాత్తాపంతో అతని హృదయం కుమిలిపోతుంది. ఆ ఇంట్లోని ప్రతీ వస్తువు మమత గురించి మౌనంగా, దీనంగా, మాటలు రానట్లు చూస్తున్నాయి.

పోలీసు రిపోర్టు ఇచ్చాడు. పేపర్లలో వేయించాడు. కాని ఫలితం లేదు. వినూత్న దగ్గరకు వెళ్ళాడు. కారణం విన్న ఆమె గొల్లుమంది. అన్నగారిని ఆవేశంతో ఎన్నో మాటలంది. ఇప్పుడు మూర్తి ఆ మాటలకు బాధపడటం లేదు, తన ప్రవర్తనకు సిగ్గు పడుతున్నాడు. మమత అన్నిరోజులు, పిల్లలు లేక ఎంత మనోవేదనను అనుభవించిందో అర్థం చేసుకో గలుగుతున్నాడు. లేనప్పుడు ఆ విలువ రెట్టింపవుతుంది. ఆఖరికి మంచం పట్టేశాడు మూర్తి భార్యా వియోగంతోనూ, ఆమె ఆచూకీ తెలియక పోవడంతోనూ. అతని అనారోగ్య స్థితి గురించి కూడా పేపర్లో వేయించాడు. అయినా మమత రాలేదు అంటే, నిజంగా ఆమె బ్రతికి లేదేమో అని అనుమానం కలిగింది. ఆ అనుమానం అతనికి స్థిమితం లేకుండా చేసేసింది. మమత వెళ్ళిపోయింది అన్న సంగతి తెలియగానే మూర్తి తల్లీ, తండ్రీ వచ్చేశారు. వాళ్ళు రాగలిగారు గాని కోడలిని రప్పించలేక పోయారు.

మూర్తి మమతను ఆమె ప్రేమను తలుచుకొని క్రుంగిపోతున్నాడు. ఎప్పుడూ పిల్లలను పట్టుకొని బావురుమంటున్నాడు. అతని మొహంలో చావుకళ తప్పించి మరేమీ కనబడటంలేదు. మనిషి మనోవ్యథవల్ల ఆనవాలు పట్టలేనంతగా మారిపోయాడు. ఉద్యోగానికి సెలవు పెట్టేశాడు. తిండి, నిద్రలేక పిచ్చివాడిలా మమత కోసం వెతుకుతున్నాడు.

తాను చేసుకున్న స్వయం కృతాపరాధ ఫలితాన్ని అనుభవిస్తున్నాడు. పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నా, భార్య జాడ మాత్రం తెలియలేదు. 'దీనికంతటికీ నీవే కారణం, నీ ప్రవర్తన వలనే, నీ నిరాదరణ గురించే, మమత నీకు దూరమయింది' అని అంతరాత్మ అతన్ని నిలదీసి మరీ హేళన చేస్తోంది. అంతరాత్మను మభ్య పెట్టుకోలేక పోయాడు. 'నన్ను మన్నించు మమతా, నీవు ఎక్కడున్నా త్వరగా వచ్చేయి' అని వేలసార్లు అనుకున్నాడు. ఆఖరికి మమత సంగతి తెలియకపోవడంతో నిజంగా చనిపోయిందేమో ఆమె మరణానికి నేను కారణం అన్న వ్యథతో హాస్పిటల్ పాలయ్యాడు.

★ ★ ★

ఇంట్లో నుంచి వెళ్ళిన మమత తిన్నగా తను పెరిగిన అనాథాశ్రమానికి వెళ్లింది. ఆ ఆశ్రమం చూడగానే పుట్టింటికి వచ్చినంత సంతోషం కలిగింది మమతకు. పెళ్ళైన

తరువాత మరలా అక్కడ అడుగు పెట్టవలసి వస్తుందని ఆమె ఊహించలేదు. వినూత్న పెళ్ళికి ఆమె బాధ్యత వహించక పోయినట్లైతే అక్కడకు తిరిగి రావలసిన అవసరం ఉండేది కాదు. వరలక్ష్మమ్మగారు మమతనుచూసి ముందు సంతోషించారు. తరువాత ఆమె చెప్పిన సంగతులు విని చాలా బాధ పడ్డారు. మమత కోరిక ప్రకారం నాగపూర్‌లోని మరో అనాథాశ్రమానికి ఆమెను పంపించారు. అక్కడి వారు పిల్లలను చూడడానికి ఎవరైనా కావాలని రాశారు. ఇంతలో మమత కోరిక విని "కొంతకాలం అక్కడ ఉండు - ఈ లోపుగా నీ భర్త పశ్చాత్తాపపడితే నీ భర్త దగ్గరకు వెళ్ళిపోవచ్చు" అన్నారావిడ.

"అమ్మగారూ! నా భర్త మారతాడనే ఆశ నాకు లేదు. ఆయన మారినా నా మనసు మారుతుందో లేదో నాకే తెలియదు. దయతో నా ఆచూకీ ఎవరికీ తెలియనీయకండి" అని బ్రతిమలాడింది. ఆవిడ సరేనన్నారు. తరువాత మూర్తి ఆవిడ దగ్గరకు రానూలేదు, ఆవిడ మమత వివరాలు మూర్తికి చెప్పనూ లేదు.

మరో సంవత్సరం గడిచింది. ఈ సంవత్సరంలోనూ మమత తన కుటుంబం గురించి ఆలోచించడానికి టైం లేనంత బిజీ అయిపోయింది. కావాలనే పని ఎక్కువ కల్పించుకునేది. బాగా అలసిపోయే వరకూ పని చేసేది. అప్పుడు పక్కమీద వాలేది. ఏ ఆలోచనా రాకుండానే నిద్రపట్టేసేది. ఎంతకీ నిద్రపట్టనిది మూర్తికి మాత్రమే. మూర్తి ప్రవర్తన మమత మనసును రాయిలా చేసేసింది. తన ప్రేమను భర్త అపార్థం చేసుకున్నాడని, రెండో పెళ్ళికి సిద్ధపడే స్త్రీగా తనను భావించాడనే ఊహ రాగానే ఎంతో అవమానంగా ఫీల్ అయ్యేది. అంతే భర్త ఆలోచనలకు ఫుల్‌స్టాఫ్ పెట్టేసేది. పిల్లలు గుర్తుకి వచ్చేవారు. వెంటనే అక్కడ ఉన్న పిల్లని ఎవరినో ఒకరిని ఎత్తుకునేది. అది అనాథాశ్రమం మాత్రమే కాదు. అందులో వికలాంగులకూ, ఆడవారికీ, మగవారికీ కూడా వేర్వేరు సంస్థలున్నాయి. ఒక మహనీయుడు కట్టించిన ఆశ్రమమది. చనిపోయినప్పుడు కూడా తీసుకొని వెళ్ళలేని డబ్బుని, భూమి మీదే ఎంతో సద్వినియోగం చేసిన ఆ మహనీయుణ్ణి ఎన్నోసార్లు తలచుకొనేది. అలాంటి మహనీయులే తన పిల్లలని కాపాడాలని మనస్సులో దేవుణ్ణి ప్రార్థించేది. భర్త తన కోసం చాలా ప్రయత్నాలు చేస్తున్నాడని ఆమెకు తెలియదు. తాను అక్కడ ఉన్నట్లు అసలు భర్తకు తెలియపరచాలనే అనుకోలేదు మమత.

ఒక రోజు సీరియస్‌గా ఆఫీసులో కూర్చుని పనిచేసుకుంటున్న మమత ఎవరో ఒకతను రావడంతో అతన్ని పూర్తిగా గమనించకుండా ఏంపని అని అడిగింది. ఇద్దరు పిల్లలను అనాథాశ్రమంలో చేర్పించాలి అన్నాడు. "తల్లీ తండ్రీ ఎవరో తెలియదా" అడిగింది. "తల్లీ, తండ్రీ ఉన్న అనాథలు వారు. తల్లీ, తండ్రీ విడిపోయారు" అన్నాడు. తన పిల్లల్లా అన్నమాట అని మనసులో అనుకుంది. "నన్ను కూడా వికలాంగులలో చేర్చుకోండి" అన్నాడు.

"మిమ్మల్నా! మీకు అవసరం లేదుగా?" ఆశ్చర్యంగా అడిగింది.

"పైకి కనిపించే అవయవాలన్నీ సరిగానే ఉన్నాయి. కాని ఎవరికీ కనబడని, మనస్సు మెదడు లేని వికలాంగుణ్ణి. అందుకే నా భార్యను ఇంట్లో నుంచి వెళ్ళగొట్టాను" అన్నాడు బాధగా.

అప్పుడు పరిశీలనగా చూసింది. తన కెదురుగా కూర్చున్న మూర్తిని. మనిషి గెడ్డం, మీసాలతో బక్కగా ఉంటే ఆనవాలు పట్టలేకపోయింది. అతని కంఠస్వరం కూడా అనారోగ్యం వల్ల మారిపోయింది.

ఆశ్చర్యానందాలతో "మీరా!" అంది.

"అవును మమతా, నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. మామూలుగా కాదు, పశ్చాత్తాపంతో. ఒకవేళ నీవు చనిపోయినా స్వర్గానికి కూడా వచ్చేసేవాడినే. నన్ను క్షమించవూ?" అన్నాడు.

ఆమెకు ఒక్కసారిగా చాలా సంతోషం కలిగింది భర్తలోని మార్పుకు. అతని ఆరోగ్యం తలుచుకుని మరింత విచారం కలిగింది. గుమ్మంలో వరలక్ష్మమ్మగారు పిల్లల్నిద్దర్నీ ఎత్తుకొని నవ్వుతూ మమత వైపు చూశారు. ఒక్కపరుగుతో వెళ్ళి పిల్లలిద్దరినీ కావలించుకొంది. అంతకాలం దాగిన ప్రేమ ఒక్కసారి వెల్లువలా పొంగి వారిని చుట్టేసింది.

"నేను అనుకోకుండా మూర్తిని కలిసి ఉండకపోతే ఈ సరికి నీ మీద బెంగతో చనిపోయిఉండేవాడు" అన్నారు వరలక్ష్మమ్మగారు.

మమతకు సంతోషంతో మాట్లాడడానికి మాటలే కరువయాయి. అప్రయత్నంగా ఆవిడ కాళ్ళకు నమస్కరించింది. మూర్తి భార్యను అనుసరించాడు. పిల్లలు అయోమయంగా ఇది నమ్మలేనట్లు అమ్మానాన్నలవైపు చూసి అమాయకంగా నవ్వారు.

(ప్రభ, 'పెద్దకథ', 15-10-86)

☆ ☆ ☆

# వంచన

"ఫాదర్ సీరియస్ - స్టార్ట్ ఇమ్మీడియట్లీ" వైదేహి.

టెలిగ్రాం చూసి దుఃఖంతో ఒరిగిపోయింది సుప్రియ. ఆమెకు ఏం చేయాలో తోచలేదు. తండ్రి ఎలా ఉన్నాడో, ఏమిటో? భర్త ఏమంటాడో? ఈ విషయం చెబితే వెళ్ళడానికి అంగీకరిస్తాడో, లేదో!

ఒక్కటి కాదు - ఆ టెలిగ్రాం అన్ని ప్రశ్నలను మోసుకొచ్చిందా అన్నట్లు ఆమె ఆలోచనలనిండా ప్రశ్నల్నే!

ఏమైతే అదే అయిందని, శోకభారాన్ని పక్కకు నెట్టి భర్తకు ఫోన్ చేసింది. పెళ్ళయిన దగ్గరనుంచి ఆమెకు ప్రతి సమస్యకు నిలదొక్కుకోవడం అలవాటైపోయింది.

శంకర్ ఫోన్ ఎత్తాడు. టెలిగ్రాం విషయం విని అతను ఆందోళన చెందాడు. "బట్టలు సర్ది ఉంచు. వెంటనే బయలుదేరుదాం. సెలవు పెట్టి వచ్చేస్తాను. ప్రియా! ఏడుస్తున్నావా? ఏం ఫరవాలేదు. మీ నాన్నగారు బాగానే ఉంటారు." ఫోన్‌లోనే ఓదార్పు వచనాలు పలికాడు.

ఆ మాటలతో అసలు ఆ టెలిగ్రాం రాలేదు అన్నంతగా మనసు తేలికైపోయింది సుప్రియకు. బట్టలు సర్దుతుంటే మనసు గతంలోని ఒక్కో సంఘటననూ గుర్తు చేస్తుంది.

"సుప్రియా! నా గొంతులో ప్రాణం ఉండగా ఈ కులాంతర వివాహానికి ఒప్పుకోను. తెలిసిందా? నీవు ఎవరి కూతురివో కాస్త గుర్తు తెచ్చుకో. శంకర్ ఎంత మంచివాడైనా కాని, ఆ మంచితనం నీ మెడలో మూడు ముడులు వేయడానికి అర్హత కాదు. రేపటినుంచి నీవు కాలేజీకి వెళ్ళవద్దు. పేదవాడినైనంత మాత్రాన ఎవరిని బడితే వాళ్ళను చేసుకోవడానికి నేను ఎంతమాత్రమూ అంగీకరించను. పెళ్ళి విషయంలో నిర్ణయం తీసుకునేది నీవు ఒక్కదానివే కాదు. పెళ్ళి చేసుకునేది నీవైనా అది కుదర్చవలసిందీ, చేయవలసిందీ నేను!"

తండ్రి గొంతు చెవుల్లో గింగురుమంది సుప్రియకు.

'అయ్యో నాన్నా! ఎలా ఉన్నావు? ఈ జన్మలో నీ గొంతు మళ్ళీ వింటానా? నన్ను ఎన్నయినా తిట్టు నాన్నా నాకు ఫరవాలేదు. నీవుమాత్రం క్షేమంగా ఉండు.' మనసు వేదనతో మూలిగింది. అది గతాన్ని వదిలి రావడంలేదు.

గుడిలో శంకర్‌తో పెళ్ళి జరుగుతూ ఉంది. ఊరి వాళ్లందరూ వచ్చారు - ఒక్క

ఆదినారాయణ తప్ప. కొంతమంది మనస్ఫూర్తిగా వచ్చారు. కొంతమంది అక్కడ ఏం తమాషా జరుగుతుందో చూడడానికి వచ్చారు. మొత్తానికి కన్న తల్లిదండ్రులు రాలేని లోటు తప్ప, మిగిలిన వన్నీ యథావిధిగా జరిగాయి.



"నన్ను కాదని పెళ్ళి చేసుకొని, మరలా నా గుమ్మం ఎలా ఎక్కావే? ముందు నా కళ్ళముందు నుంచి వెళ్ళు. నన్నిలా మనశ్శాంతిగా బ్రతకనివ్వు. తండ్రిని కాదన్న నీకు నా దీవెనలు మాత్రం ఎందుకు? వెళ్ళిపో త్వరగా!"

తండ్రి మాటలకు జడిసి శంకర్ చేయి పట్టుకొని వచ్చేసింది. వెనక్కి తిరిగి చూస్తే తండ్రి కళ్ళతో తన కళ్ళు కలిశాయి.

ఆయన కళ్ళలోని నిప్పులు, తన కళ్ళలో నీళ్ళు.

పెళ్ళయిన ఆరేళ్ళలో రెండు పురుళ్ళూ భర్త దగ్గరే పోసుకుంది. అత్తగారు కన్నతల్లి అయింది. భర్త సమస్తమూ అయ్యాడు. ఆమె కన్నవారికి దూరమైనందుకు భార్యను కనుపాపలా చూసుకున్నాడు శంకర్ - పుట్టింటికి వెళ్ళాలి. అనే తలంపు కలగకుండానే. అపురూపంగా లాలించేవాడు.

మొదటి పురుడు పోసుకుని అత్తవారింటికి వెళ్ళినప్పుడు బిడ్డ, భర్తతో సహా గుడికి వెళ్ళింది సుప్రియ. అదే సమాయానికి తల్లీ, తండ్రీ వచ్చారు.

"వైదేహీ! మనం గుడికి తరువాత వద్దాం, పద. దేవుడు ఎప్పుడూ అక్కడే ఉంటాడులే. ఏదో మనసు ప్రశాంతంగా ఉంటుందని గుడికి వస్తే మనకు ఇక్కడా చుక్కెదురే!"

కోపంగా తమవైపు చూస్తూ తల్లిని లాక్కెళ్ళిపోతున్న తండ్రిని చూస్తే చెప్పలేని దుఃఖం వచ్చింది సుప్రియకు. శంకర్ అనునయంతో ఆ బాధ మరిచిపోగలిగింది.

చెల్లెలు పెళ్ళికి కనీసం పెళ్ళి కార్డు కూడా పంపలేదు. మనసు గిల గిల లాడింది. అయినా తమాయించుకుంది. చెల్లెలు వెళ్ళిపోతుందని తెలిసి, స్టేషన్‌కి వెళ్ళింది. అప్పటికి రెండవ బిడ్డ పుట్టాడు. చెల్లెలు ఆప్యాయంగానే పలకరించి, కన్నీళ్ళు పెట్టుకుంది. చెల్లెల్ని ఒక్కగసురు గసిరి, సుప్రియను చికాకుగా చూసి చిందులు తొక్కాడు ఆదినారాయణ.

తండ్రికి తనపైన కోపం పోనందుకు ఎంతో బాధపడింది సుప్రియ. ఆమె టెలిగ్రాం చూసిన తరువాత ఆమె కళ్ళముందు ఎన్నో సన్నివేశాలు కదలాడాయి. ఇప్పుడు తల్లి టెలిగ్రాం ఇచ్చింది బహుశా తండ్రికి తెలియకుండా ఇచ్చిందేమో! తీరా వెళ్ళిన తరువాత తండ్రి తనను ఇంట్లో అడుగు పెట్టడానికి నిరాకరిస్తే? తనకు పరవాలేదు, శంకర్ బాధపడడూ?

ఆ ఆలోచన రాగానే ఆమెలో మరింత దిగులు ఎక్కువైంది. ఇప్పుడు తన తండ్రి అనారోగ్యం కంటే, అక్కడి ఆదరణ ఎలా ఉంటుంది అని భయపడసాగింది.

భర్త రావడం, ప్రయాణం కావడం అన్నీ కలలోలా జరిగిపోయింది. అంత దుఃఖంలోనూ భర్త ఓదార్పే ఆమెకు కొండంత ధైర్యాన్ని ఇచ్చింది.

భయంగా ఇంటి ముందు దిగింది సుప్రియ.

ఆమెను చూసిన తల్లి బావురుమంది.

ఆరు సంవత్సరాల తరువాత ఆ ఇంట్లో అడుగుపెడుతుంటే కాళ్ళు వణికాయి, మనసు చెదిరింది. కోమాలో ఉన్న తండ్రిని చూసి గొల్లుమంది. అది పల్లెటూరు. తండ్రి అక్కడ బాగుపడతాడా అని భయం కలిగింది.

వైదేహి కూతురికి ఒక ఉత్తరం అందించింది - "మీ నాన్నగారు నీ కిమ్మన్నారు" అంటూ.

ఉత్తరం చదువుతుంటే తండ్రి మాట్లాడుతున్నట్లే అనిపించింది సుప్రియకు.

"అమ్మా! సుప్రియా! నీకు ఈ ఉత్తరం రాయడానికి తండ్రిగా తగనమ్మా! చివరి దశలోనైనా అసలు నిజం చెప్పకపోతే దేవుడు కూడా నన్ను క్షమించడు తల్లీ! నిజానికి నీ పెళ్ళి విషయంలో నా కున్న అభ్యంతరం కులం కానేకాదు తల్లీ! వేదాలు చదివిన నేను, అంతా దేవుడి సృష్టి, అందరం సమానులమే అన్నది నేనెరుగనిది కాదు. ఈ పెళ్ళికి నేను అంగీకరిస్తే ఎంతో ఖర్చు చేయవలసివస్తుంది. అంగీకరించకపోయినా శంకర్ నిన్ను చేసుకొని, ప్రాణంలా చూసుకుంటాడని తెలుసు.

"పెళ్ళికి అందరూ వచ్చారు. మేము తప్ప. వాళ్ళు వస్తే వాళ్లకు ఖర్చు కాదు. నేను వస్తే నిన్ను కలుపుకుంటే ఎంతో ఖర్చు అవుతుంది. కలుపు మొక్కలా నిన్ను

పెళ్ళి వంకన బాధ్యతల నుంచి తొలగించేశాను కాని, కడుపుతీపి నుంచి మాత్రం కాదమ్మా! నీ పిల్లలను చూడాలని ఎంతో ఆరాటపడేవాడని. మిమ్మల్ని ఇంటికి ఆహ్వానిస్తే అంతా కాకపోయినా, కొంతలో కొంతైనా తండ్రిగా నీకు ముట్టజెప్పాలి. చెల్లి పెళ్ళితో అప్పులపాలైన నేను, విరిగిన పాలలా తయారయ్యాను. ఇంకా నీకేం పెట్టగలను. నీవూ, శంకర్ ఏమీ అనుకోకపోయినా, నీ అత్త మామలు సరిపెట్టుకున్నా, చూసేవారికీ, మా మనసులకూ అది బావుండదు కదా! చెల్లితో సమానంగా నిన్ను చూడడం న్యాయం కదా! పెళ్ళికి పిలిస్తే మీకు మంచి బట్టలైనా కొనలేనేమో అని పిలవలేదు.

"ఏదో వంకన మిమ్మల్ని చూస్తూ తృప్తి పడుతూ వచ్చాను. మీరు ఎక్కడికి వెళితే అక్కడికి వచ్చేవాడిని గుర్తుందా? అది కోపం కాదు తల్లీ, నీపైన ప్రేమ. ఇంతకాలం 'కులం' అన్నపదాన్ని అడ్డం పెట్టుకున్నాను. కాని అది కులం కాదు, ధనం. పెళ్ళిళ్ళలో డబ్బు ప్రసక్తి లేనినాడు నాలాంటి తండ్రులకు ఇలాంటి నరకయాతన ఉండదు. నన్ను మన్నించమ్మా! - నీ తండ్రి."

మౌనంగా ఉత్తరం భర్తకు అందించింది. అది చదివి అన్నాడు శంకర్ - "సుప్రియా! మీ నాన్నగారి బట్టలు సర్దు. టాక్సీలో మన ఊరు తీసుకెళదాం. అక్కడ బాగుచేయిద్దాం. ఇలాగే ఆయన ఏమైనా అయనట్లయితే ఆయన ఆత్మకు శాంతి ఉండదు" అన్నాడు.

ఆ గుడిలోని దేవుడు తన భర్త రూపంలో ఉన్నాడనిపించింది సుప్రియకు.

(ప్రభ, 13-12-81)

☆ ☆ ☆

# ఉగాదికి ఉచితం!

ప్రముఖ వైద్య శిఖామణి డాక్టర్ సలహాలరావుగారు ఉగాది సందర్భంగా పేషెంట్లకు అవకాశవాణిలో ఉచిత సలహాలు ఇస్తున్నారు. ఆయన ట్రీట్‌మెంట్లోని విశేషం ఏమిటంటే మందులు వాడకుండానే, జబ్బు తగ్గే మార్గం చెబుతారు. రోగులకు ఇటు డబ్బు ఆదా. అటు మెడిసిన్స్ రియాక్షన్ ఇస్తాయన్న భయమూ ఉండదు. సలహాలరావుగారిని పరిచయం చేస్తున్నారు కుమారి శ్రీమతి.

శ్రీ: నమస్కారం డాక్టరు గారు!

డా: నమస్కారమండి.

శ్రీ: ఈ రోజు మీరు అవకాశవాణికి రావడం నిజంగా మా శ్రోతల అదృష్టమండి. ఉత్తరాలు అసంఖ్యాకంగా వచ్చాయి. అందులో కొన్ని మాత్రమే చదువుతానండి. మొదటిది "నాకు పిప్పళ్ళు ఉన్నాయి. వాటి వలన చాలా చికాకుగా ఉంది. అవి ఊడే మార్గం చెప్పమని ఒకాయన అడుగుతున్నారండి"

డా: అందమైన అమ్మాయి వెనుక పడండి. పళ్ళు సునాయాసంగా ఊడిపోతాయి.

శ్రీ: అదీ అయిందటండి. ఆ అమ్మాయి పళ్ళు రాలగొట్టలేదు సరికదా, పెళ్ళి చేసుకుంటావా అని అడిగిందట.

డా: అయితే ఆ అమ్మాయి విషయం మీ ఆవిడతో చెబితే, మిగిలినది ఆవిడే చూసుకోగలరు.

శ్రీ: నాకు జలుబు ఎక్కువగా ఉంది. ఎన్ని మందులు వాడినా ముక్కులోనుండి నీరు కారడం తగ్గడంలేదు. అంటున్నారండి.

డా: అయితే ఈసారి రుమాలు వాడి చూడండి తగ్గిపోతుంది.

శ్రీ: డాక్టరుగారూ నాకు చెముడండి. అది అందరికీ తెలిసిపోతుందని సిగ్గుగా ఉందండి. అని వ్రాసారండి.

డా: వెరీ సింపుల్. మీకు కనబడిన వారందరితోనూ, ముందుగా మీరే నాకు చెముడులేదు అని చెప్పేయండి.

శ్రీ: సార్ మా ఆవిడ చాలా లావుగా ఉంటుందండి. నా ప్రక్కన అక్కలా ఉంటుంది. దయుంచి ఆవిడ సన్నబడే మార్గం చెప్పమని కోరుతున్నారండి ఒకతను.

డా: ఏదో విధంగా ఒకరోజు పనిమనిషిని మాన్పించేసి, మీ ఆవిడను బట్టలుతుకు తున్నప్పుడు భానుప్రియలాగ, అంట్లు కడుగుతున్నప్పుడు అశ్వనీలాగ, గదులు

ఒత్తేటప్పుడు గౌతమిలాగ, రుబ్బురోలు దగ్గర రజనీ లాగ ఉన్నావని పొగిడేయండి. అంతే ఆవిడ పనిమనిషి పేరెత్తరు. త్వరలో సన్నబడిపోతారు.

శ్రీ: డాక్టరుగారు నేను నల్లగా ఉంటానండి. తెల్లగా కనబడే మార్గం చెప్పమంటున్నారండి.

డా: మీరు ఎల్లప్పుడూ నల్లని దుస్తులు ధరించండి. ఆ దుస్తులముందు మీరు కాస్త తెల్లగా కనబడగలరు.

శ్రీ: నాకు రాత్రుళ్ళు భయంకరమైన కలలు వస్తాయండి. రాక్షసులు వెంట బడుతున్నట్లు, ఎవరో నన్ను ముక్కలు ముక్కలుగా కోస్తున్నట్లు, మా ఆవిడ వంటచేస్తున్నట్లు వచ్చి చాలా భయంగా ఉంటుందండి. ఆ కలలు తగ్గే మార్గం అడుగుతున్నారండి.

డా: మీరు రాత్రంతా పూర్తిగా మెలకువగా ఉండడానికి ప్రయత్నించండి అసలు కలలు మీ దరికి చేరవు.

శ్రీ: సార్! నాకు దురదండి. అదితగ్గే మార్గం దయుంచి శలవీయండి అని వ్రాసారండి.

డా: గోళ్ళు బాగా పెంచుకోవాలండి. గోళ్ళు పెరగడానికి మంచి ఆహారం తీసుకోండి.

శ్రీ: అయ్యో! నా కళ్ళు సరిగాలేవండి. సినిమాకు వెళితే సినిమా రెండుగా కనిపిస్తుంది. ఏం చేయమంటారంటున్నారండి.

డా: సినిమాకు వెళ్ళేటప్పుడు రెండు టికెట్స్ కొనుక్కోండి మీ ప్రోబ్లమ్ సాల్వ్ అయిపోతుంది.

శ్రీ: సార్ నాకు ఫిట్స్ వస్తున్నాయండి. అందరూ నవ్వుతున్నారు. వాళ్ళు నవ్వకుండా ఉండాలంటే ఏం చేయాలండి.

డా: అవి ఫిట్స్ అని చెప్పకండి. బ్రేక్ డాన్స్‌లో రెండవ భాగమైన షేక్ డాన్స్ అని మీ స్నేహితులకు, నవ్వేవాళ్లకు చెప్పండి. దీనికి బాధ పడనవసరంలేదు.

శ్రీ: మావారికి బి.పి. అస్తమానం డౌన్ అయిపోతూ ఉంటుంది. అది ఎక్కాలంటే ఏం చేయాలి. అని సలహా అడుగుతున్నారండి ఒకావిడ.

డా: తన కొలీగ్‌కు ప్రమోషన్ వచ్చిందని చెప్పండి. వెంటనే రైజ్ అయిపోతుంది బి.పి.

శ్రీ: నాకు ఫామిలీ ప్లానింగు ఆపరేషన్ అన్నా, మందులు మింగాలన్నా భయం అండి. మరి ఇంక పిల్లలు కలగకుండా ఉండాలంటే ఏం చేయమంటారని అడుగుతున్నారండి.

డా: మీ శ్రీవారికి జీవితాంతం దూరంగా ఉండండి. మీకు ఏ భయమూ ఉండదు.

శ్రీ: చివరగా ఒక ప్రశ్న అండి డాక్టరుగారూ! మీరు ఉగాది సందర్భంగా ఈ సలహాలు ఇస్తున్నారని తెలిసి చాలామంది ప్రేక్షకులు అసలు ఉగాది పచ్చడి తినకుండా ఎగ్గొట్టాలంటే ఏం చేయాలి, నివారణోపాయాలు, ఎగ్గొట్టే మార్గాలు చెప్పమని అడుగుతున్నారండి.

డా: దీనికి చాలా రకాల చిట్కాలున్నాయండి. ప్రొద్దున్నే లేచి ముందుగా మీరే ఉగాది పచ్చడి తయారుచేసి, మీ ఆవిడతో తినిపించండి. ఆ పచ్చడి కాస్త పాకం పట్టారంటే ఆవిడ నోరు అంటుకుపోయి, మిమ్మల్ని తినమనడానికి నోరురాదు. పైగా చేసిన వాళ్ళు తిన్నారా లేదా అన్నది ఎవరూ అడగరు. కాబట్టి మిమ్మల్ని తినమని బలవంతం చేసే వాళ్ళుండరు. రెండవది- అర్జంటుగా రాజకీయాలలో చేరిపోయి, ఏదో కారణంతో నిరాహారదీక్ష శిబిరంలో చేరిపొండి. ఆ రోజంతా అక్కడే ఉండండి- మూడవది ఒక రోజుముందుగా కడుపునొప్పని హాస్పటల్‌లో అడ్మిట్ కండి. నాలుగవది- ఉగాది రోజు ప్రొద్దున్నే మీ ఆవిడతో పోట్లాట పెట్టుకొని, మాట్లాడడం మానేయండి, అయిదవది...

శ్రీ: మరి మనం వెళ్ళొద్దాం డాక్టరుగారు. ఇంతసేపు మా శ్రోతలకు చక్కని సలహాలు ఇచ్చారు. మీకు, శ్రోతలకు కూడా ఉగాది శుభాకాంక్షలండి. నమస్కారం.

డా: నమస్కారం.

(ఆంధ్రభూమి డైలీ, 13-12-81)

☆ ☆ ☆

# మందు

సాయం సంధ్య ప్రశాంతంగా ఉంది. పిల్లగాలులు నాట్యం చేస్తున్నాయి. నన్నజాజులు పాటలు పాడుతున్నాయి. చెట్ల కొమ్మలు నిశ్శబ్దంగా మద్దెల వాయిస్తున్నాయి. లేతరెమ్మలు తమ సింగారాన్ని నీరెండ అద్దంలో నిమిషనిమిషానికి చూసుకుంటున్నాయి.

అక్కడ స్థలమంతా యిసుకపోస్తే చాలనంత, ఎంత జరిగినా చాలనంత జనంతో నిండి ఉంది. ఆ స్థలములో ఏ అన్న దానమూ జరగడంలేదు. ఏ అన్నా స్పీచ్ యివ్వడంలేదు. అక్కడ ఏ సినిమా యాక్టర్లూ లేరు. అది శతదినోత్సవం అంతకన్నా కాదు.

వేదికపై స్వామీజీ గొంతు మైకులేకున్నా ఖంగుమంటోంది. ఆయన మాటలతోనే మనుషులపై మత్తు మందు జల్లేస్తున్నారు. మంచి మాటలు మళ్ళీ మళ్ళీ వల్లిస్తున్నారు. స్వామీజీకి దగ్గరగా, మరీ దగ్గరగా కూర్చోవాలని జనాలు ఒకరినొకరు తోసికుంటున్నారు.

మాటనేర్పు వల్ల ఎవరూ స్వామిజీలు, బాబాలు కాలేరు. వాళ్ళలో ఏదో అతీతమైన శక్తి ఉండవలసిందే. అదే తమ పరిజ్ఞానానికి భుక్తి కూడ చూపుతుంది. ఈ స్వామి చాలా మహిమ కలవారని అందరూ అంటారు. మాటలు వెన్నెల పూసలు.

ఖాకీ బట్టలు వేసికున్నా కఠినంగా మాట్లాడితేగాని దొంగతనం చేసిన మనిషిని పట్టుకోలేరు. కాషాయవస్త్రాలు ధరించిన వారు లలితంగా మాట్లాడితేగాని, మనసుని ఆకట్టుకోలేరు. 'మీరందరూ, ఈ తోపిడి, ఈ తొక్కిసలాటలో కూడ ఇంత ఓపిగ్గా ఎందుకు కూర్చున్నారో నాకు తెలుసు. మీలో చాలామందికి అనారోగ్యం వల్లనో, ఆస్తి వల్లనో, మరే రకమైన చికాకుల వల్లనో, మనశ్శాంతి కరువై, బ్రతుకు బరువై ఉండవచ్చు. పరిస్థితులు మద్దెలదరువై బాధలు చేరువై, మిమ్మల్ని వాయించేస్తూ ఉండవచ్చు.

మనశ్శాంతి బజారులో దొరకదు. అది మీ హృదయపు అంతరాంతపు లాకర్లో భద్రంగా ఉంటుంది. అది భద్రం, భద్రం అనుకంటే, మీ జీవితం నరకం అవుతుంది. దాన్ని వెలికితీయండి చిలికి వెన్నెతీయండి. మీ జీవితంలో సున్నాలే కనబడవు. కన్నాలే అగుపడవు.

మనిషికి అన్ని ఆస్తులకన్నా గొప్పనిధి మనశ్శాంతి. తపస్సు చేసిన వారందరూ, అశాంతి, తమస్సు నుండి వెలుగు చూసి, స్వర్గానికి దారి చూపమనే అడిగారు.

స్వామీజీ ఉపన్యాసం అలాగే సాగిపోతుంది. చాలామంది అక్కడికక్కడే ఆయనకు సాగిలబడిపోతున్నారు. ఎవరి పిచ్చి వారి కానందం, అన్న ధోరణిలో ఉన్నారంతా,

అక్కడ అందరూ స్వామీజీ భక్తులేకాబట్టి ఒకరినొకరు పరిహసించుకోవడం లేదు.

మూర్తికి మాత్రం అక్కడ అంతా, అసహనంగా, అసహజంగా ఉంది. అదే మాట, స్నేహితుడు రతన్‌తో అన్నాడు.

'ఇక్కడకు వచ్చిన వారిలో చాలా మంది నీలాగ ముందు వితండవాదం చేసిన వారే. స్వామీజీ మహిమ తెలిసి తండోప తండాలుగా యిప్పుడు భక్తులయ్యారు. ముందు నీవు లెంపలేసుకో. ఆత్మశుద్ధితో రావాలి యిక్కడకు' అన్నాడు.

'నీకు వేయనా లెంపలు' అనలేక, అంటే కొంపలు మునుగుతాయని, తనకు తానే వాయించుకున్నాడు. మూర్తి మనసులో యిష్టంలేకపోయినా.

అక్కడ గ్రూప్‌డాన్స్ చేస్తున్నంత గోలగా ఉంది. అన్ని స్టేషన్లు కలిసిపోయిన రేడియో శబ్దంలా ఉంది వాళ్ళ మాటలతీరు. మబ్బులు మాత్రం పైనుండి నిశ్శబ్దంగా స్వామీజీ మాటలు వింటున్నాయి. చుట్టుప్రక్కల చెట్లు ఆయన చెప్పింది విని తలాడిస్తున్నాయి.

మూర్తికి ఆ గొడవకు, గోలకు తలంతా దిమ్మగా ఉండి, పోటెక్కిపోతుంది. కూర్చుని, కూర్చుని నడుంపీకేస్తుంది. నరాలన్నీ లాగేస్తున్నాయి. అనారోగ్యపు బోటులో ప్రయాణిస్తున్న ప్రయాణికుడిలా ఉన్నాడు. ఆ నీళ్ళు జబ్బుల జలం పడినా ప్రమాదమే.

స్వామీజీ ప్రసంగానంతరం, భక్తులను కొందరిని మాత్రమే, పేర్లతో పిలుస్తున్నారు. వాళ్ళు పరమానందంతో 'స్వర్గద్వారాలు తెరుచుకున్నాయి రా రమ్మంటున్నంత సంతోషంగా, పరవశంతో వెళుతున్నారు. పేర్లు పిలిచిన వారినందరినీ ఒక గదిలోకి తీసికెళ్ళారు. ఆ తరువాత అందరికీ ప్రసాదం పంచారు. ఆ ప్రసాదం దేవలోకపు అమృతం అన్నట్లు భక్తులు తింటున్నారు.

స్వామీజీ చాలామందికి పర్సనల్‌గా సలహాలు ఇస్తారు. కలతలు తొలగిస్తారు. నలతలు బాగు చేస్తారు. అయినా ఫీజు తీసికోరు. అక్కడ హుండీ ఉంటుంది. యిష్టమైన వాళ్ళు ఇష్టమైనంత వేయవచ్చు. లేనివాళ్ళు మానేయవచ్చు కూడ. డబ్బు దగ్గర పట్టింపు లేకపోయినా, గిట్టింపుకి కొదువలేదు.

'నా పేరు కూడ పిలుస్తారన్నావుగా' నిష్ఠూరంగా అన్నాడు మూర్తి రతన్‌తో.

'నీవు నమ్మకంతో రాలేదురా. నా బలవంతం మీద వచ్చావు. నేను ఎందుకు వచ్చాను యిక్కడకి. నీబాధను స్వామీజీతో పోగొట్టించాలనే తపనతోనే కదా! పొగ గొట్టంలో దూరిన మనిషిలా ప్రవర్తిస్తావేం. గుర్రాన్ని నీళ్ళ దగ్గరకు తీసికెళ్ళగలం గాని, నీళ్ళు తాగించలేం కదా! అలా ఉంది నీ పని. నిన్ను ఇక్కడకు తీసికొని రాగలిగాను గాని, నీలో భక్తిని నింపలేకపోయాను.'

'సారీ... రా'

'లే, లే, మరలా రేపు రావచ్చులే.'

ఇద్దరూ ఉసూరుమంటూ బయలుదేరారు. ఆ రద్దీలో కూర్చోవడంతో కొద్దిగా ఉండే తలనొప్పి కేజీలకొద్ది పెరిగి, రాను రాను ఎక్కువయిపోయింది.

ఇరుకు యిళ్ళల్లో కదలడానికి వీలులేని జనాలు, ఇలా రోడ్డుమీదపడి ఉరుకులూ, పరుగులూ పెడుతున్నారా అని అనిపించింది మూర్తికి. ఆ జనాల్ని చూస్తుంటే, వీధిలో లైట్లు కొన్ని వెలుగుతున్నాయి. కొన్ని శలవులో ఉన్న ఉద్యోగుల్లా వెలగడంలేదు. వెలగపండు లాంటి చంద్రుడిని మేఘాలు మోహాలతో కౌగిలించుకున్నాయి. ఆ సభకు భక్తి ఉన్నవారు వచ్చారు. మూర్తి లాంటివారూ వచ్చారు. స్ఫూర్తితో కొందరు, ఆర్తితో కొందరు వచ్చారు.

కష్టం రానంతసేపు దేవుడిని లెక్కచేయని మనుషులు కూడ, చిన్న అవాంతరం, జీవితంలో కలిగితే, అది ఏదో విధంగా రూపుమాపుకోవాలని చూస్తారు.

ఆ మర్నాడు మూర్తి, రతన్ మరలా వచ్చారు. ఆ రోజు అంతకు ముందు కంటే ఎక్కువమంది జనం ఉన్నారు. కొందరు భక్తితో ఊగిపోతున్నారు. మరికొందరు నిర్లిప్తంగా హాజరయినట్లు ఉన్నారు మూర్తిలాగే.

ఆ జనాన్ని చూసి చిరాకు పడ్డాడు మూర్తి.

ఆ చిరాకు చూసి రతన్‌కు మరింత చికాకు కలిగింది. అయినా మెల్లిగా అన్నాడు.

'చిరాకుపడకు. వారి కోరికలు తీరబట్టేకదా, అన్ని పనులు, టి.వి. ప్రోగ్రాములు, యిళ్ళదగ్గర పిల్లల్ని కూడా వదలివేసివచ్చారు' అని.

అసహనంగా జనం మధ్యలో కూర్చున్నాడు మూర్తి. గాలిలేని కదలని బస్‌లో నిలబడినట్లు ఫీల్ అవుతున్నాడు. అస్తమాను వాచీ చూసుకుంటున్నాడు.

'ఏదో నా కోసం వచ్చినట్లు ఆ విసుగేమిటో కోపాన్ని పైకి ప్రదర్శించలేక లోలోపల గొణుక్కున్నాడు రతన్. రతన్‌కి కాలు విరిగి హాస్పిటల్‌లో నున్నప్పుడు మూర్తి కుటుంబం, రతన్ కుటుంబానికి అన్నివిధాల సహాయం చేసింది. ఇప్పుడు మూర్తి అనారోగ్యంతో ఉంటే, డాక్టర్ల మందుల వలన నొప్పులు తగ్గకపోవడంతో, స్నేహితునికి ఉపకారం చేయాలని తీసికొని వచ్చాడు. కాని మూర్తి విసుగు చూస్తుంటే ఒంటికి కారం రాసుకున్నటుంది రతన్‌కు. మంట భరించక తప్పడంలేదు.

ఇద్దరూ ఎవరి ఆలోచనలలో వాళ్ళుండగా, మూర్తికి స్వామీజీ నుండి పిలుపు వచ్చింది. లాటరీ టికెట్ ఫలితాలు ఎనౌన్స్ చేసినట్లుగా ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

అదృష్టరేఖ తలుపుతట్టింది, ఆలస్యం చేయబోక, పరుగుపెట్టేయిక' తనలోతానే అనుకున్నాడు మూర్తి.

ఆలస్యమైతే రైలు దాటిపోతుంది అన్నట్లుగా పరుగుపెట్టారు. భక్తులు అందరూ వెళ్ళిపోయిన తరువాత, మూర్తికి స్వామీజీతో ఇంటర్వ్యూ మొదలయింది.

'ఏమిటి నాయనా, నీ బాధ. ఆ చెప్పొద్దులే. అన్నీ నేనే చెబుతాను. నీ ఆరోగ్యం బాగులేదు. రకరకాల డాక్టర్లని చూసావు. రకరకాల మందులు వాడావు. అయినా తగ్గలేదు. అవునా' స్వామీజీ ధ్యానంలోనే అడిగారు.

ఆ సమయంలోనే ఆయన మూర్తికి తన పుట్టుపుర్వోత్తరాలు తెలిసిన తండ్రిలా అనిపించారు. ఆశ్చర్యపోయాడు మూర్తి.

'అవును స్వామి మీరు సర్వాంతర్యాములు. మీకు తెలియని దేముంది' అప్రయత్నంగా అనేశాడు. అప్పుడే భక్తి విత్తనం మొలకవేయడం మొదలు పెట్టింది. పిలకలు రావడమే తరువాయి.

'మూర్తి చేయించుకోని టెస్టు లేదు, తీయించుకోని ఎక్స్రే లేదు' ఫ్రెండు సరిగా చెబుతాడో లేదోననే భయంతో, రతన్ అంటుండగా.

'నేను అడిగింది మూర్తిని' అన్నారు స్వామి.

'తప్పయిపోయింది స్వామి' రతన్ చెంపలు వాయించుకున్నాడు.

'నాకు నాలుగు సంవత్సరాల క్రితం తల నొప్పి ప్రారంభమయింది. మొదట్లో తేలిగ్గానే తీసికున్నాను. రానురాను మెడనరాల్లో బాధ, కడుపులో మంట, కళ్ళు మంట...''

'డాక్టర్లు ఏ జబ్బూ లేదన్నారు అవునా? జబ్బు దానికదే తగ్గిపోతే డాక్టరు గొప్పతనం. లేదంటే అనారోగ్యవంతుని దురదృష్టం.

అవును స్వామి. నేను వెళ్ళని డాక్టరు లేరు. వాడని మెడిసన్ లేదు. అన్ని రకాల టెస్టులు, షుగర్, బి.పి. స్కానింగ్, కళ్ళ పరీక్ష, పళ్ళ పరీక్ష, యూరిన్ టెస్ట్, లివర్ టెస్ట్ ఒకటేమిటి శరీరంలోని అన్ని భాగాలకు టెస్టులు అయిపోయాయి'

'అదేదో నీ శరీరానికి కాదు, మరో శరీరానికి టెస్టులు చేసినట్టుగా, నీ వ్యాధులకు కారణం దొరకలేదు కదూ!'

'అవును స్వామి. ఆఖరుకి మద్రాసు అపోలోకి కూడా వెళ్ళాను. ఆఫీసులో పనిచేయలేక పోతున్నాను. ఇంట్లో ఆలిని సమర్ధించలేక పోతున్నాను. చికాకుల్లో తప్పులెక్కలు వ్రాసి, ఆఫీసరుతో చీవాట్లు తింటున్నాను. ఆ కోపంతో నాక్రింది వాళ్ళను చీవాట్లు పెడుతున్నాను'

మనసు విప్పి అంతా చెప్పేశాడు మూర్తి.

'ఎండలోనిలబడి సూర్యుణ్ణి తప్పించుకోవడం కుదరదు కదా! స్వామిదగ్గర ఇంక దాచేదేముంది' అనుకున్నాడు మూర్తి.

స్వామీజీ విభూది తీసి మూర్తి నుదుటను పెట్టి అది అలాగే పట్టి ఉంచి కాసేపు కళ్ళు మూసుకున్నాడు. ఆయన అలా చేసే సరికి మూర్తి జీవితపు స్కానింగ్ కనిపించేసిందాయనకు.

'ఎక్క వలసిన రైలు ఎక్కకుండా వేరే రైలు ఎక్కి మీ ఊరు రాలేదంటే ఎలా నాయనా' ఆయన మాటలు పూలవలె మెత్తగా, నిద్రమాత్రవలె మత్తుగా, గమ్మత్తుగా అనిపించాయి.

'స్వామీ, మీరే నాకు సరైన దారి చూపాలి' అన్నాడు. అక్కడ కూర్చున్న కొద్దీ, అతనిలో భక్తి చుక్కలు చుక్కలుగా సైలైన్ ఎక్కిస్తున్నట్లు ఎక్కిపోయింది.

'నీకు శని ప్రభావం చాలా ఉంది బాబు. అంతకు మించి నీ శరీరంలో నీవు భయపడినట్లుగా, ఏ కేన్సరూ లేదు. నిన్ను దేవుడు తప్ప, ఏ డాక్టరు బాగు చేయలేడు. రేపు దశమి మంచిరోజు. ఇదిగో ఆంజనేయదండకం, గాయత్రీ జపం,ఈ పుస్తకాలు తీసుకొని, రోజులో వీలైనన్ని సార్లు చదువు.

ఎలా చదవాలీ అంటే ఒక గంటలో పరీక్షకు వెళ్ళబోయే విద్యార్థిలా చదవాలి. నీ మనసే నీకు సాక్షి. అనారోగ్యం ఎగిరిపోయే పక్షి. అలా నెల్లాళ్ళు చేసి, ఆ తరువాత నేను ఇక్కడకు వస్తాను. అప్పుడురా!

ఒక్కమాట. దేవుని స్తుతించిన నోటితో ఎవరినీ దూషించకూడదు. నిందించకూడదు. అలాచేస్తే, నీలో చిత్తశుద్ధి నశించి, నీవు అనుకున్నది సాధించలేవు. వెళ్ళిరా, నాయనా! మరొక్కమాట. తన కోపమె తన శత్రువు అన్న చిన్న మాట మరువకు. నీతోటి వారిని ప్రేమించు. దేవుణ్ణే ఎప్పుడూ ధ్యానించు'

మూర్తి ఆయనకు నమస్కరించి హుషారుగా అక్కడినుండి కదిలాడు. అప్పుడే తన నొప్పులన్నీ మాయం అయినట్లు ఫీల్ అయ్యాడు. అతని మొహంలోని కాంతి చూసి రతన్ ఆశ్చర్యపోయాడు. రతన్‌తో అన్నాడు మూర్తి.

'చాలా థాంక్స్ రతన్! ఇన్నాళ్లు మందులు మింగి మింగి డబ్బు, ఆరోగ్యం కూడ తగలేసుకున్నాను. శని ప్రభావం అని తెలిసికోలేకపోయాను. నీ దయ వల్ల నాకు జ్ఞానోదయం అయింది. సూర్యుడి లాగే అజ్ఞానము ఏరోజుకారోజు మరుగున పడిపోకూడదు. అలా అయితే అది అజ్ఞానమే.

నెల తిరగేసరికి ఆ ఊరికి స్వామీజీ వచ్చారు. మూర్తి, రతన్ కూడా వచ్చారు.

మూర్తి ఏ నొప్పి లేకుండా పరిపూర్ణ ఆరోగ్యవంతుడిలా ఉన్నాడు. నిండు

పూర్ణచంద్రుడిలా వెలిగిపోతున్నాడు.

మూర్తిని చూసి స్వామీజీ ఒక్క చిరునవ్వు మాత్రం నవ్వారు. ఆ చిరునవ్వు లోని అర్థాలు ఆ గడ్డానికే తెలుసు. ఆ నవ్వులోని పరమార్థాలు ఆ పెదవులకే తెలుసు.

మనసులో ఇలా అనుకున్నారు స్వామీజీ.

నాలో ఏ రోగమూ లేదు. ఉన్నా దేవుని మహిమ వలన అది పోయింది అన్న అతని నమ్మకము, ఆ నమ్మకంతో మరే ఆలోచనలూ మనసులోకి రానివ్వకపోవడంతో, సగం నయమయ్యాడు. కోపగించుకోడానికి టైములేక, దేవుని నామస్మరణంలోనే గడపడంతో మెదడుకి అలసట లేక అన్ని నొప్పులు తగ్గిపోయి, మిగిలిన సగం అనారోగ్యం కూడ పోయింది. దేవుని మహిమకంటే శాంతగుణమే అన్ని మందుల కంటే మంచి మందు' అని.

ఆయన ఉపన్యాసంలో సారాంశం ఎప్పుడూ ఒక్కటే.

కోపం - మెదడుకి శాపం.

అతిగా ఆహారం - ఆరోగ్యానికి లోపం.

శాంతం - సుఖం అనంతం.

(జాగృతి, 13-10-94)

☆ ☆ ☆

# ట్రీట్‌మెంట్

పేషెంట్సు చాలామందిని చూసి విసుగ్గా ఉంది డాక్టర్ శ్రీరామ్‌కి. ఆఖరి పేషెంటు రావు. అమ్మయ్య ఈయన్ని చూసి పంపించేసి యింటికి వెళ్ళి పోవచ్చు అనుకున్నాడు, ఇంతలో రాధ వచ్చింది.

"ఆ కుర్చీలో కూర్చోండి" శ్రీరామ్ అన్నాడు రాధ బిడియంగా కూర్చుంది. తలవంచుకొని ఏదో వ్రాసుకుంటూ "చెప్పండి ఏమిటి మీ ప్రాబ్లం" అన్నాడు.

రాధ మాట్లాడలేదు. "చెప్పండి డాక్టరు దగ్గర సిగ్గుపడితే ఎలాగ?" అన్నాడు తలెత్తకుండానే.

"నిజానికి నాకు అనారోగ్యం ఏమీ లేదు" అంది మెల్లగా.

"అనారోగ్యంగా లేదా? అయితే యిక్కడికి ఎందుకు వచ్చారు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నేను - నేను" నసిగింది గాని చెప్పలేదు.

"ఊ. చెప్పండి" అంటూ తలెత్తి చూసాడు, డా॥శ్రీరామ్. "అందగత్తే" అనుకున్నాడు మనసులో.

"నేను. స్లిమ్‌గా అవ్వాలి. దానికి ఏం చేయమంటారో అడ్వయిజ్ యిస్తారని"

"ఓ అదా." అంటూ ఫక్కుననవ్వి కూర్చొని ఉన్నా కూడా మంచి పొడగరి లాగ అనిపించింది. లావు సన్నం కాకుండా ఉంది. వయసు దాదాపు పాతిక ఉండవచ్చు. పసిడి బొమ్మలా మెరిసి పోయింది రాధ. ఈసారి పరీక్షగా చూసిన తరువాత ఆమె మీద నుండి కన్ను తిప్పుకోవడం కష్టమైన శ్రీరామ్‌కి అందాల్ని అప్రీషియేట్ చేయకుండా ఉండలేక పోయాడు.

ఆమె హైట్, వెయిట్, ఏజ్ అడిగాడు. సమాధానం చెప్పింది.

"మీరు మరీ అంత లావుగాలేరు. మరీ స్లిమ్‌గా కావాలంటే 10 పౌనులు తగ్గాలి. అయినా మీరు యిప్పుడు కొంత మాత్రమే లావుగా వున్నారు. అదయినా మీకు నిండుగానే ఉంది గాని, వికారంగా లేదు" అన్నాడు.

"కాని మావారికి మరీ సన్నగానే ఉండడం యిష్టమండి"

"మీవారేం చేస్తారు"

"దుబాయ్‌లో యింజనీరు"

"అయితే యిక్కడ లేరన్నమాట"



"లేరండి. వెళ్ళి సంవత్సరం అయింది. మరో మూడు నెలల్లో వస్తారు. ఆయనకు అనారోగ్యంగాఉన్నా, లావుగా ఉన్నా యిష్టం ఉండదు. ఆయన వెళ్ళినదగ్గర నుండి ఏమీతోచక, తినడం, నిద్రపోవడంతో, వెయిట్ ఈ మధ్య మరీ పెరిగాను. డైట్ చేద్దామన్నా నా వల్ల కావడం లేదు. మొన్న నా ఫోటో పంపిస్తే నేను లావయ్యానని, గుర్తుపట్టేసి తను వచ్చేసరికి సన్నగా ఉండాలని వ్రాసారు. ఆయన మాట కాదనలేను. ఆఫ్‌కోర్స్ సన్నగా ఉండడం నాకూ యిష్టమేలెండి."

"కాని, మీరు యిలా ఉంటేనే బావున్నారు. ఇంక పెరగకుండ ఉంటేచాలు"

"అందరూ అలాగే అంటారు. కాని మీరందరూ, మావారి కళ్ళతో చూస్తే నేనేదో రోడ్డురోలరులా కనబడతాను" అంది. ఈసారి ఆమె కళ్ళలో పూర్తి బెదురు పోయింది. ఆమాటలకు నవ్వాడు శ్రీరామ్.

"అయితే నేను చెప్పినట్లు చేయండి అని డైటింగ్, ఎక్సర్‌సైజ్ అంతా చెప్పాడు.

"అలాగే పనిలోపని నా హెల్త్ కూడ జనరల్ చెకప్ చేయండి." అంది.

సరేనని యూరిన్, బ్లెడ్ టెస్టులు అన్నీ వ్రాసి యింకా ఆమెకు ఏమేమి టెస్టులు చేయాలో అన్నీ చేసి "రిపోర్టు కోసం రేపురండి" అన్నాడు.

మర్నాడు రాధ వచ్చింది. ఆ రోజు మరింత హుషారుగా ఉందామె.

"రిపోర్టులన్నీ చూసాను. మీరు శరీరం మీద చూపించిన శ్రద్ధ ఆరోగ్యం మీద చూపించడంలేదు" అన్నాడు.

"అంటే" ఆశ్చర్యంగాను, భయం గాను అడిగింది రాధ.

"నేను చెప్పిందివిని కంగారు పడకండి. మీకు జాన్‌డీస్ ఉంది. నీళ్ళు శుభ్రంగా లేకపోతే జాన్‌డీస్ వస్తుంది."

ఆ మాట విని మొహం నల్లగా మాడిపోయింది.

"మీరేం కంగారు పడకండి. రెండు నెలల్లో తగ్గిపోతుంది" అని మందులు వ్రాసి యిచ్చాడు శ్రీరామ్. ఆహారంలో నూనె, ఉప్పు అసలు తగలకూడదు. మజ్జిగ అన్నం మాత్రం తినండి ఎక్కువగా" అని, మిగిలిన యిన్‌స్ట్రక్షన్స్ కూడా యిచ్చి, "మీరు కంగారుపడి నాటు వైద్యుల దగ్గరకు వెళ్ళకండి, అవి అంత మంచివికావు. పైగా రియాక్షన్ వస్తుంది." అన్నాడు శ్రీరామ్.

రాధ ఏడుపు మొహంతో వెళతానని లేచింది.

"మీవారు వచ్చేసరికి తగ్గిపోతుంది లెండి, బాధపడకండి. అప్పుడప్పుడు వచ్చి బ్లడ్, యూరిన్ చెక్ చేయించుకోండి" అన్నాడు.

రాధ నెల పదిహేను రోజులు అలాగే చేసింది. అంతా చూసి చాలా వరకూ తగ్గిపోయింది. పథ్యంచాలా బాగా చేసారు. మరో పదిహేను రోజులలో నయమయి పోతుంది. అన్నాడు శ్రీరామ్.

మరో పదిహేను రోజుల తరువాత వచ్చి, యూరిన్ టెస్ట్‌కి యిచ్చింది రాధ. "డాక్టరుగారూ, మావారు పదిరోజుల్లో వస్తున్నారు. అప్పటికి తగ్గిపోతుందాండీ. ఈ సంగతి వింటే చాలా చిరాకు పడతారు" అంది ఆందోళనగా. జాన్‌డీస్ వస్తే భార్యాభర్తలు కలవ కూడదంటారు. అదీ ఆమె అసలైన భయం. తన గురించి కాదు భర్త గురించి.

శ్రీరామ్, చిర్నవ్వు నవ్వి, "మీకిప్పుడు పూర్తిగా తగ్గిపోయింది. కాని తగ్గింది జాన్‌డీస్ కాదు. వెయిట్, ఇప్పుడు మీవారు చాలా సంతోషిస్తారు. వెళ్ళి బరువు చూసుకోండి" అన్నాడు శ్రీరామ్ వెయింగ్ మిషన్ చూపిస్తూ "అంటే" అర్థం కాక ఆశ్చర్యంగా అడిగింది రాధ.

"మీకు నిజానికి జాన్‌డీస్ కాదు. మీకు యిచ్చినది మల్టీ విటమిన్ టేబ్‌లెట్స్ మాత్రమే. డైటింగ్ పేరున నోరు కట్టుకోవాలంటే చాలా కష్టం. అందుకే మీకు జాన్‌డీస్ అన్నాను. మీరు నిజంగా నా మీద నమ్మకం ఉన్నవారు కాబట్టి, మరో డాక్టరు దగ్గరకు వెళ్ళకుండా నా పరువు నిలబెట్టారు. నా నాటకం ఫలించింది" అన్నాడు.

"నిజంగానా డాక్టర్" సంతోషంగా అంది.

"మీ ఋణం తీర్చుకోలేనండి" అంది మరలా. ఆమెలో ఎంతో ఆనందం, బరువు తగ్గాను అన్నదానికన్నా జబ్బులేదు అన్న సంతోషం. ఆమెను నిలువనీయలేదు. ఏడు మల్లెల ఎత్తు ఉన్న రాధ, డాక్టర్ గారికి మరోసారి థాంక్స్ చెప్పి, గాలిలో తేలిపోతున్నట్లు యింటివైపు దారితీసింది.

(ఆంధ్రపత్రిక, 07-01-87)

★ ★ ★

# పుట్టిల్లు

అమ్మా!

నేను అమ్మమ్మగారి ఊరినుంచి హాస్టల్‌కి వచ్చిన తరువాత ఈ ఉత్తరం వ్రాయకుండా వుండలేకపోతున్నాను. నేను ఆ పల్లెటూరిలో ఎంతో ఎంజాయ్ చెయ్యవచ్చని, పట్నం వాతావరణానికి కొన్ని రోజులపాటయినా దూరంగా హాయిగా వుండాలనే ఉద్దేశ్యంతో వచ్చాను. అనుకున్నట్లుగానే బయట ప్రశాంతమైన ప్రకృతి సిద్ధమైన వాతావరణం, చక్కని సీనరీస్ చూసి చాల చాల ఎంజాయ్ చేశాను. కాని నాకు నచ్చనిదల్లా ఆ ఇంటిలోని వాతావరణమే. ఊరి బయట కలుషితంగా లేదుగాని, ఇంటిలో బ్రతుకుతున్న మీలో చాల కల్మషం వుంది. ఈ విషయం వ్రాయడానికి నాకు చాలా విచారంగా వుంది.

అమ్మా! ప్రతీ స్త్రీ పుట్టిల్లు అనేది ఆత్మీయత పంచి, అలసటను తీర్చే విశ్రాంతి గృహం కావచ్చు. కాని అస్తమాను స్త్రీలు పుట్టిల్లు పుట్టిల్లు అంటూ ఎందుకు దాని వెంట బడి అక్కడివారికి విశ్రాంతి లేకుండా చేస్తారో అర్థంకాదు. మనం ఉన్నన్నాళ్ళూ అత్తయ్యల చాకిరీ, అమ్మమ్మ హడావిడి. నీది, పిన్నిది అజమాయిషీ నాకు నచ్చలేదు. నీకు అది పుట్టిల్లే కావచ్చు. కాని అది అత్తయ్యల స్వంతిల్లు కదా. ఏడాదికి ఒక్కసారే కదా అంటూ నెలల తరబడి అక్కడ ఉండి ఏడాదికి సరిపడా అక్కడ నుంచి రాబట్టుకోవడం ఒక విధంగా వారి నుండి రక్తం పీల్చుకోవడం లాంటిదే!

పిన్ని, నీవు కలసి అమ్మమ్మనుగాని మామయ్యలను గాని ఊపిరి తీసికోనివ్వలేదు. నిజమే! తాతయ్య వున్నప్పుడు మీకు చాల పెట్టారు. మామయ్యలు కూడా అప్పుడు తాతయ్య పెట్టినంత పెట్టకపోయినా, వారికి వున్నదాంట్లో అంతో, ఇంతో పెట్టినా మీలో తృప్తి అనేది ఏకోశానా కనబడలేదు నాకు. "నాన్నవుంటే అందరికీ యిలాంటి బట్టలే పెట్టేవాడా!'' అని నీవు, పిన్ని, పెద్దమ్మ చాటుకి వెళ్ళి ముక్కులు చీదుతోంటే నిజంగా నాకు చాల చిరాకు వేసింది. ఈ రోజుల్లో ఒక మనిషికి మరొక మనిషి వుంటేనే భారమనిపిస్తుంది. అటువంటిది ఒక ఫామిలీ మీద పుట్టిల్లు అన్న పేరుతో మరికొన్ని ఫామిలీలు వెళ్ళిపడితే అవతలి వారికి శారీరకం గాను, ఎకనామికల్‌గాను ఎంత శ్రమో ఆలోచించరెందుకు? వెళ్ళవచ్చు. ఉండవచ్చు కొంతైనా తప్పులేదు. కాని అత్తయ్యలకు మీరు మీ ఇంట్లో పని చేసుకున్న దాంట్లో, అంతా కాకపోయినా కొంతయినా సహాయం చేస్తే అత్తయ్యలు కూడా సంతోషించేవారు కదా! చిన్న చిన్న ఖర్చులు కూడా మామయ్యల మీద రుద్దకపోతే మీరు మంచి హోదాల్లోనే ఉన్నారు కదా, కొన్ని కొన్ని మీ ఖర్చులు మీరు చేసుకుంటే మామయ్యలకు ఎంత రిలీఫ్‌గా ఉండేదో ఆలోచించరెందుకు?

నాకు తెలిసినంతవరకు మీ అక్కచెల్లెళ్ళు అందరూ పుట్టిల్లు అంటూ అక్కడి నుంచి చాలవరకు తెచ్చుకొని ఇంతో అంతో సంపాదించుకున్నారు. అత్తయ్యలు మాత్రం ఆడబడుచులకు ధారపోస్తూ వాళ్ళ పెళ్ళయిన దగ్గరనుంచి ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న సామెతలో వున్నారు. ఇది చాలా అన్యాయం అమ్మా!

మనం అందరం పాశ్చాత్యుల వేషభాషలు ఎన్నో అనుకరిస్తున్నాము. వారు వాడే పరికరాలు వాడుతున్నాం. వాళ్ళు మాట్లాడేభాష మాట్లాడుతున్నాంగాని, వారి లోని మంచి గుణాలను స్వీకరించలేక పోతున్నాం. కట్నాలు మానడం లేదు, కుల మతాలు వదలడంలేదు, మూఢాచారాలు విడవడం లేదు. ముఖ్యంగా పెళ్ళయిన స్త్రీలు వాళ్ళ బ్రతుకులు వాళ్ళు బ్రతుకుతూ పుట్టిల్లు పేరుతో పీడించి పీడించి మరీ పెట్టించుకుంటున్నారు.

అమ్మా! మీ పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. పెళ్ళీళ్ళ వయసుకి వచ్చారు. ఇప్పుడు మీరు ఆలోచించవలసింది మీ పిల్లల విషయం. వారిని మంచిదారిలో పెట్టడంగాని, మీ పుట్టింటి నుంచి ఏమి తెచ్చుకోవాలని కాదు. నీవు ఎంతసేపు ఒక తల్లికి కూతురుగానే ఆలోచిస్తావుగాని, ఇద్దరు కూతుళ్ళుకు, ఇద్దరు కొడుకులకు తల్లిగా ఆలోచించవు కదా. ఇకపై పుట్టింటిని దెప్పడం ధ్యాస వదిలేసి నీ పిల్లలపై ధ్యాస నిలిపితే అందరికీ బాగుంటుంది. ఒక వేళ నీవు ఆ పని చెయ్యలేని నాడు నా పెళ్ళయిన తరువాత నేను చేసి చూపిస్తాను. పురుళ్ళపేరిట పుట్టింటికి వచ్చి నీ శరీరం గుల్లచెయ్యను. ఫార్మాలిటీస్ పేరుతో అస్తమానూ వచ్చి నాన్నగారి పర్స్ ఖాళీ చెయ్యను. తెలిసిందా? అమ్మా ఈ ఉత్తరంలోని సంగతి నీకొక్కదానికే కాదు చెప్పుతుంట. నీలాంటి వారు ఆంధ్ర దేశంలో ఆడబడుచులు వేలాది మంది వున్నారు. అందులో ఎవరు మారినా సరే నా ఉద్దేశ్యం ఫలించినట్టే. నేను తప్పు ఏదయినా వ్రాసి వుంటే క్షమించమ్మా!

ప్రేమతో
నీ చిత్ర

(ఆంధ్రజ్యోతి వీక్లీ, 18-03-89)

☆ ☆ ☆

# ఏ కులమూ నీదంటే?

చిరంజీవి సునీల్‌కు

నీ పెళ్ళి విషయం చెప్పడానికే నేను ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. నీవు ఈ మధ్య నిర్లిప్తంగాను, నీరసంగాను ఉండడానికి కారణం తెలిసింది. నాలుగురోజుల క్రితం అనూజ మనింటికి వచ్చింది. ఆ అమ్మాయి చెప్పింది విని ఆశ్చర్యపోయాను. నీవింత పిరికివాడివనుకోలేదు.

నీవు అనూజను ప్రేమించినట్లు చెప్పి ఉంటే నీవు మనస్తాపానికి గురికాకుండా ఈ పెళ్ళి జరిపించేదాన్ని. ఇప్పటికైనా ఆ అమ్మాయి ధైర్యం చేసి ఇంటికివచ్చి సంగతులన్నీ చెప్పింది. అనూజ ధైర్యం చేసి ఉండకపోతే టేంక్‌బండ్‌లో మరో శవం తేలేది.

అనూజలోని అందాన్ని, మంచితనాన్ని సంస్కారాన్ని చూసి నీవు ప్రేమించావు. ఆ తరువాత కులం సంగతి తెలిసి మధనపడ్డావు. నిప్పులు కడిగే ఇంటిలో పుట్టిన నీవు మన ఇంటి ఆచార వ్యవహారాలు పూజలు పునస్కారాలు అన్నీ తెలిసి ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకొంటానని చెప్పలేక, నీ మనసు మార్చుకోలేక నీవెంత వేదన అనుభవించావో గ్రహించగలను. కానీ ఇన్నాళ్ళ తాతగారి సాహచర్యంలో ఆయనను నీవేమీ అర్థం చేసుకొనలేదని బాధపడుతున్నాను.

తాతగారు రామశాస్త్రిగారు నిష్ఠాగరిష్ఠాపరులే. నిప్పులను కడిగేవారేగాని, జీవితంలో తప్పులు చేసినవారుకారు. గాంధీగారి అనుయాయులు. ఆయన అడుగుజాడల్ని రామపాదుకలు అన్నంత గాఢంగా నమ్మారు.

ఇక నా సంగతి చెబుతాను. నేనెవరో, నా పుట్టుక ఎలాంటిదో దేవుడికి, తరువాత నాకు, మీ నాన్నగారికి, తాతయ్యకు మాత్రమే తెలుసు. ఇప్పుడు నీవు నాలుగవ వాడివవుతావు. మా నాన్నగారు తాతగారి పొలంలో పనిచేసేవారు. ఎంతో నమ్మకంగా పనిచేసే మా నాన్నగారంటే ఆయనకు ఎంతో ఇష్టం. మా నాన్నగారి నీతి, నిజాయితిని చూసి ఆయన ఎంతో అబ్బురపడేవారట. నా చిన్నతనంలోనే మేమందరం ఉండే పల్లెటూరికి దొంగల ముఠా వచ్చి నానా హింసలు పెట్టి, ఆడవారిని చెరచి, మగవారిని కట్టేసి ఆస్తంతా ఎత్తుకు పోతుంటే మా నాన్నగారు రామశాస్త్రిగారి కుటుంబ సభ్యులను తన ఇంట్లో దాచి ఇంటికి కాపలా ఉండి చివరికి దొంగలతో జరిగిన పోరాటంలో ప్రాణాలు వదిలారట. ఆయన ఒక్క ప్రాణం పోయిందిగాని ఒక కుటుంబం మొత్తం రక్షించబడింది. నన్ను తాతగారు పెంచారు. ఆ పల్లెటూరు తాతగారు చేసిన పనికి ఆయన్ని ఆ కుటుంబాన్ని వెలివేసారు. ఆ కారణంగా ఆ వూరు వదిలి వచ్చి పట్నంలో స్థిరపడిపోయాం అందరం.

తక్కువ కులంలో పుట్టిన నన్ను ఆయన అనాధగా చూడలేదు. తన ఇంటి మనిషిలాగే చూసి చివరికి ఆయన కొడుక్కే ఇచ్చి పెళ్ళిచేసారు. అటువంటి మంచితనం మూర్తీభవించిన తాతగారికి మనవడిగా నీవెంతో గర్వించాలి. అంతేగాని తాతగారికి భయపడి అనూజకు అన్యాయం చెయ్యాలి అని అనుకున్నావా? ఇప్పుడు నన్నుచూసి చెప్పు. నేను వేరే కులం అమ్మాయిని అంటే నీవు నమ్ముతావా? మతంలో ఏముంది కులంలో ఏముంది అంతా మనిషి యొక్క నడవడిలోను, సంస్కారంలోనూ ఉందిగాని. పేదవాడిని తీసుకొనివచ్చి విద్యాబుద్ధులు చెప్పించి, ఉద్యోగం ఇప్పించి చూడు అతడు ఒకప్పటి పేదవాడులాగ అనిపించడు. అడుక్కునేవాడికి అదేపనిచెయ్యి అతడూ అంతే.

ప్రతివాడికి సమృద్ధిగా డబ్బుండి, రెండు పూటలా కడుపునిండితే అతను శుభ్రంగా ఉంటాడు. చక్కగా చదువుకొని విద్యనార్జిస్తాడు. సంస్కారం పెంచుకుంటాడు. అందుకే వారిని ద్వేషించకూడదు. దోషమంతా పేదరికానిదే. చేతినిండా డబ్బుండి, ఆ డబ్బుని ఇంకా పెంచాలనే దురాశతో ఆ డబ్బు ఆశచూపించి దురాగతాలు చేయించే దుర్మార్గులే అసలైన కులం తక్కువవారు. మనిషి పుట్టుక కాదు ప్రధానం. మంచితనం, మానవత్వం.

ఇప్పటికైనా నా ఉత్తరంలోని సారాంశం అర్ధమైందనుకుంటాను. నీకు అనూజతో పెళ్ళి నిశ్చయించి ఉత్తరం వ్రాస్తాను. ఆనందంగా ఉండు. నీ వలన ఒక అమాయకురాలైన ఆడపిల్ల మోసపోలేదనే నిజం నాకెంతో సంతోషాన్ని కలిగిస్తుంది. తాతగారి ఆస్తితో పాటు ఆయనలోని మంచిగుణాలుకూడా నీకు రావాలి. వాటిని నీవు ఆచరణలో పెట్టాలి. అప్పుడే మన ఇల్లు కళకళలాడుతుంది. ఉంటామరి. ప్రేమతో

- అమ్మ

(ఆంధ్రభూమి వీక్లీ)

☆ ☆ ☆

# వ్యసనం

డియర్ మంజుల

నీవు నామీద అలిగిపుట్టింటికి వెళ్ళిపోయావు. ఇది ఏదో ఒక రోజు జరుగుతుందని నేను ఊహిస్తూనే ఉన్నాను. ఊహించి కూడా ఎందుకు ఊరుకున్నారు. ఎందుకు నన్ను ఉపేక్షించి, శిక్షించారు అని అంటావా? దానికి నాదగ్గర సమాధానం లేదు. భార్యాభర్తలు అన్న తరువాత ఒక సంసారం ఏర్పడిన తర్వాత ఏవో లోటుపాట్లు ఉండక తప్పవు. జీవితంలో మనం ఎన్నో విషయాలకు ఎడ్జస్టు కాక తప్పదు. ఉద్యోగం చేస్తుంటే ఆఫీసులోను, ఆపీసరుతోను కొన్నింటికి ఒడంబడి ఉండాలి. అలాగైతేనే ఉద్యోగం చేయగలం. అలాగే జీవితం కూడా ఒక ఆఫీసనుకోవాలి అప్పుడే కలసి బ్రతకగలం.

నేను అప్పుడప్పుడు డ్రింక్స్ తాగుతానని, ఎప్పుడూ సిగరెట్స్ తాగుతానని, అవి రెండూ నాకన్న పెద్ద వ్యసనాలని నీవు రోజూపోరు పెట్టేదానివి. నన్ను నీ ఇష్టం వచ్చినట్లు నీకు అనుకూలంగా మార్చాలని శతవిధాల ప్రయత్నించి విఫలమయ్యావు. నేను ఆ వ్యసనాలకి ఎలా దూరంగా ఉండలేనో నీ ప్రేమకూ, నీకూ కూడా దూరంగా ఉండలేను. నిన్ను ప్రాణాధికంగా ప్రేమించడం నాకున్న పెద్ద వ్యసనం. అది నాకట్టెతోనే మట్టిలో కలవాలిగాని ఇంకే విధంగానూ పోదు అన్నది నూరు శాతం నిజం.

అసలు వ్యసనం అంటే ఏమిటో తెలుసా? మందు, మగువ, విందు, పొగ ఇలాంటివే వ్యసనాలు అనుకుంటే చాలా పొరపాటు. ఈ వ్యసనాలు ఉన్నవాళ్లు ఎవరి ఆరోగ్యాలు వారేపాడు చేసుకుంటారుగాని దాని వలన ఇతరులకు ఇబ్బంది ఉండదు. కాని కోడళ్ళను రాచిరంపానపెట్టే అత్తలు, భార్యలను శాడిస్టు మెంటాలిటీతో వేధించే భర్తలు, తెలివైన స్టూడెంట్సుని కూడా పాస్ చేయని ప్రొఫెసర్లు, ఎవరైనా బాగుపడుతుంటే ఓర్వలేని వారు, డబ్బు సంపాదన అంటే పడిచచ్చేవాళ్ళు వీళ్ళందరూ వ్యసనపరులే వీరి వలన ఇతరులకు నష్టాలు కలుగుతాయి.

వారుమాత్రం ఏకష్టం లేకుండా హాయిగా ఉంటారు. ఎదుటివారిని హింసించడం వ్యసనం కాదా? దాని నుండి వారిని బయటపడమను, అసలు బయటపడరు. అవతలి వారిని బాధపెట్టడానికి భయపడరు. దురదృష్టం కొద్ది అన్ని మంచి గుణాలు ఉండి, ఒకే చెడ్డగుణం గల నాలాంటి వారు మాత్రమే వ్యసన పరుల లెక్కలోకి వస్తున్నారు. కాని మిగిలినవారు, తప్పుకొని తిరుగుతున్నారు.

వేలెడు కూడా లేని సిగరెట్టుకు నేను బానిసనై పోయానని, నీవు ఎన్నిసార్లు నన్ను సాధిస్తూ బాధిస్తూ ఏడ్చావు. నిజం చెప్పాలంటే అందరి దృష్టిలో నున్న చెడు

అలవాట్ల సంగతి అలా వదిలెయ్యి: అసలు అవసరాన్ని మించి అన్నం ఎక్కువగా తినడం వ్యసనం కాదూ: నీవు నీ వయస్సును, ఎత్తుని మించి బరువు పెరుగుతున్నావు. ఎన్నోసార్లు స్వీట్లు, అన్నము తగ్గించమని చెబితే విన్నావా? బాబోయ్ అన్నము, స్వీటు లేకుండా బ్రతకలేను అని అంటూ రెండు పూటలా కడుపు నిండా తింటూ శరీరాన్ని పెంచుకుంటున్న నీవు షుగర్, బి.పిలు లాంటి వ్యాధులను ఆహ్వానించి నీ ఆరోగ్యము పాడు చేసుకోవడం లేదు? అన్నం మత్తు పదార్థము కాదా నేనేనా సిగిరెటు ద్వారా ఆరోగ్యము పాడు చేసుకుంటున్నది. నీవు తిండి ద్వారా హెల్త్ నిర్లక్ష్యం చేయడం లేదా కాని లోకం దృష్టిలో నీవు వ్యసనపరురాలవు కావు. ఆకలి వేసినప్పుడు కడుపు నిండా తిండి తినకుండా ఎలా ఉండలేవో ఆశ కలిగినప్పుడు సిగరెట్లు తాగకుండా నేను ఉండలేను. అది గతం.

మంజా! ఇకపై మనమిద్దరం ఒకరి మాటకు ఒకరు విలువ నిచ్చుకుంటూ పూర్తిగా మనము వ్యసనాల నుండి బయటపడకపోయినా కనీసం మన ఆరోగ్యము కోసం మన సుఖ సంసారంలో మొదటగా అలవాట్లను కొద్దిగా తగ్గిద్దాం. ఆ తరువాత అవి తప్పక మనల్ని మంచి దారిలో నడిపిస్తాయని ఆశిద్దాం. మనుషులలో నున్న పెద్ద వ్యసనం ఏమిటో తెలుసా? తమ తప్పులు దాచుకొని ఎదుటివారి తప్పుల్ని ఎత్తి చూపడం అసలైన ఈ వ్యసనం. ఈ వ్యసనం నుండి మనిషి బయట పడితే ఎంత బావుంటుంది.

డియర్! నీవు శనివారం గోదావరికి బయలు దేరుతున్నావు. నేను స్టేషన్‌కి వస్తున్నాను, ఆదివారం నుండి కొత్త జీవితాన్ని మనసారా ఆహ్వానిద్దాం.

ఉంటాను మరి.

శ్రీనాధ్ - నీనాధ్

(జయశ్రీ)

☆ ☆ ☆

# ఓ భర్త కథ

"ఏమండీ! పెళ్ళయిన తరువాత అబ్బాయి చాలా మారిపోయాడండి. అసలు మన గురించి ఏమీ పట్టించుకోవడం లేదు. రత్నంలాంటి మనసు వాడిది. రాయిలా అయిపోయింది" వాపోయింది కామేశ్వరి.

"ఇప్పుడు మనకేం తక్కువయిందనీ?" శంకరం సాగదీశాడు - 'ఈ ఆడవాళ్ళు ఇంతే సుమా' అన్నట్లు.

"ప్రస్తుతం ఏమీ కాలేదనుకోండి. ఇప్పటి నుండి మనకు దూరంగా డబ్బు పంపకుండా అనిల్ అలవాటు అయిపోతే ముందు ముందు ఎలాగండి?" గండిపడిన గోదారిలా ఉంది ఆమె మనసు.

శంకరం ఏమీ మాట్లాడలేదు. ఆలోచనలో పడ్డాడు. నాలుగు రోజుల తరువాత అనిల్ దగ్గర నుండి మూడు వందలు మనియార్డరు వచ్చింది. అది చూసి సంబరపడిపోయింది కామేశ్వరి. కొడుక్కి తల్లిదండ్రుల విలువ గురించి నీతి బోధలు చేస్తూ ఉత్తరం రాసినట్లు భర్తకు చెప్పలేదు. దాని ఫలితమే ఆ మనియార్డరు అని కామేశ్వరికి అర్థం అయింది.

రోజులు గడుస్తున్నాయి. నెల నెలా డబ్బు వస్తూనే ఉంది. అనిల్ ఢిల్లీలో పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. మనియార్డరు వేరే ఆయన పేరు మీద వచ్చింది. ఆయన ఉత్తరం కూడా రాశారు - "మీకు డబ్బు పంపుతుంటే మీ కోడలు అనిల్‌ని నానా మాటలూ అంటుందట. అందుకే ఇకపై నా పేరు మీదే పంపుతాను" అని. ఆ ఉత్తరం రాసి నాయన శంకరం స్నేహితుడు. ఢిల్లీలో వ్యాపారం చేస్తున్నాడు.

ఆంధ్రాకి, ఢిల్లీకి ఆ పేట నుండి ఈ పేటకు తిరిగినట్లు తిరుగుతాడు.

అనిల్ చెల్లెళ్ళు ఇద్దరూ పెళ్ళిళ్ళు చేసుకుని స్థిరపడిపోయారు. అన్నయ్య దగ్గరకు వెళ్ళాలనిగాని, అన్నయ్య మాకు ఏమీ పెట్టడంలేదనిగాని పట్టించుకోరు. అలాంటి శిక్షణ ఇచ్చాడు పిల్లలకు శంకరం. అనిల్ ఏ రెండేళ్ళకో ఒకసారి వచ్చి ఒక రోజు ఉండి, అత్తగారి ఊర్లో ఎక్కువ రోజులు ఉండి వెళ్ళిపోతాడు. అదే సమయంలో చెల్లెళ్ల కూడా వచ్చి అన్నయ్యను చూసిపోతూ ఉంటారు.

కొడుకు డబ్బు రహస్యంగా పంపుతున్నాడు కాబట్టి, ఆ విషయం గురించి మాటల్లోగానీ, ఉత్తరాల్లోగాని బయటపెట్టవద్దని మొదటే భార్యను ఆదేశించాడు శంకరం. దానితో ఆవిడ డబ్బు విషయం ఎత్తదు కొడుకు దగ్గర. ఆ విషయం కోడలికి తెలిస్తే వాళ్ల కాపురంలో కలతలు వస్తాయని శంకరం భయం.



అప్పుడప్పుడు కూతుళ్లు పురుళ్లకు వచ్చినా, మరే ఖర్చు అదనంగా తన మీద పడ్డా ఉత్తరం రాస్తుంది కామేశ్వరి కొడుక్కి. అదీ కొడుక్కి మాత్రమే అర్థం అయ్యేట్లు. ఆ నెలలో ఆ ఖర్చులకు సరిపడా మనియార్డరు వస్తుంది. ఆ డబ్బుతో పెద్దగా అవసరం లేకపోయినా, కొడుకు తమ నుండి  దూరం కాలేదు అనే భావనను ఆ డబ్బు కలిగిస్తుంది. ఎంతో తృప్తిగా, ఆనందంగా మెరిసే భార్య కళ్లను చూడడమంటే శంకరానికి ఎంతో ఇష్టం.

తన సంసారాన్ని ఎంతో అపురూపంగా చూసుకుని, ఎంతో సహనంతో చిన్న విషయంలో కూడా విసుక్కోకుండా పైకి తీసుకుని వచ్చిన భార్య అంటే ప్రాణానికి ప్రాణం శంకరానికి. ఒకవేళ ఆ బాధ్యతలో అపోహలున్నా తనే సమర్థించుకునేవాడు శంకరం. వారిద్దరి జీవితంలో అలా సమర్థించుకునే అవసరం శంకరానికి రాలేదు. భార్యను ఏ చిన్న విషయంలోనూ కూడా నొప్పించే పరిస్థితి శంకరానికీ రాలేదు. ఇద్దరూ ఆది దంపతుల్లాగే కాపురం చేశారు.

చిన్న చిన్న విషయాల్లో భార్య సలహా పాటించాలి. పెద్ద వాటిల్లో భర్త సలహా పాటించాలి అన్నది ఇద్దరికీ తెలుసు. అందుకే వారి జీవితంలో కలతలు, కన్నీళ్లు అసలు ప్రవేశించనే లేదు.

సంవత్సరాలు జరుగుతున్నాయి. కామేశ్వరికి అనారోగ్యంగా ఉంది. మందులకు డబ్బు ఎక్కువ పంపుతున్నాడు అనిల్. ఆమెను పసిపిల్లాడుగా చూసుకుని లేచి తిరిగేట్లు

చేశాడు శంకరం. కొడుకు చూడడానికి రానేలేదు. కూతుళ్లు వచ్చి ఒకసారి పరామర్శించి వెళ్లిపోయారు.

నట్టింట్లో జబ్బు నయమై తేలికగా తిరుగుతున్న భార్యను చూసి పరమానందం పొందాడు. శంకరం మనసులో అనుకున్నాడు, "నా అర్ధాంగీ! నీవు మిగిలిన కాలమంతా ఇలా సంతోషంగానే గడపాలి. నీ సంతోషమే నా ఆయుష్షు పెంచుతుంది. నీవు నా భార్యగా ఏనాడూ బాధపడలేదు. ఒక తల్లిగా మాత్రం నేనుండగా నీవెందుకు బాధపడాలి? అందుకే అనిల్ పంపుతున్నట్లుగా నా స్నేహితుడు డబ్బు నెల నెలా పంపేటట్లు నేను ఏర్పాట్లు చేశాను. నా స్నేహితునికి ఆ డబ్బు నేనే ఇస్తున్నాను!"

కొడుకు డబ్బు పంపడానికి కుదరదు అని రాసిన ఉత్తరం ఎన్నో ఏళ్ళ క్రితమే చింపేశాడు శంకరం.

(ప్రభ, 30-06-93)

☆ ☆ ☆

# సంక్రాంతి కానుక

వాకిట్లో ముగ్గులు వేస్తున్న కళిక టాక్సీ హారన్ విని గబగబ అక్కడి నుంచి లేచి, చీర సవరించుకుంది.

టాక్సీకి డబ్బులు ఇచ్చి లోపలికి వస్తున్న అక్క కార్తీకను, బావ సుమన్‌ను నవ్వుతూ పలకరించింది. "ఇప్పుడేనా రావడం?" అంటూ.

"లేదు వచ్చి చాలాసేపైంది. కొంచెంసేపు ఎందురింట్లో కూర్చుని వచ్చాం." సుమన్ మాటలకు ముందు ఆశ్చర్యపోయి, ఆ తరువాత ఆ మాటలోని హాస్యం గ్రహించి ఫక్కున నవ్వింది.

రక్మిణి, గోపాలకృష్ణయ్య వచ్చి కూతురినీ, అల్లుడినీ సాదరంగా లోపలికి ఆహ్వానించారు.

"మీ మామగారికి ఒంట్లో బావుండ లేదు నాయనా. అందుకే స్టేషనుకి రాలేక రవిని పంపంచారు" అంది రుక్మిణి. "ఆ దానిదేముంది లెండి" అంటూ మామగారి ఆరోగ్యం గురించి అడిగాడు సుమన్. ఎందుకీ మర్యాదలు అన్న ధోరణిలో.

"ఆరోగ్యాని దేముంది? పరిస్థితులు అన్నీ సక్రమంగా ఉంటే అదే బావుంటుంది. అనుకోకుండా కంపెనీ ఎత్తేసి ఉద్యోగం పోవడంతో, ఈయన బెంగ పెట్టుకున్నారు. ఈ వయసులో రావలసిన కష్టం కాదిది" ఆవేదనగా అంది రుక్మిణి.

"ఏమిటే పిల్లలు ఇంట్లోకి రాగానే నస మొదలు పెట్టావు?" గోపాలకృష్ణయ్యగారు భార్యను మందలించారు.

కార్తీక పెళ్ళి అయి పది సంవత్సరాలు అయినా ఏ పండక్కీ, ఆఖరికి మొదటి పండక్కి కూడా కూతురూ, అల్లుడూ అత్తింటికి రాలేదు. మొదటి సంక్రాంతికి స్వయంగా గోపాలకృష్ణయ్యగారు వెళ్ళి పిలిస్తే "మా చెల్లి, బావగారు వస్తున్నారండీ, వాళ్ళకి కొత్తగా పెళ్ళయింది" అంటూ మర్యాదగానే మామగారిని పంపించేశాడు సుమన్. ఆ తరువాత ప్రతీ సంవత్సరం వీళ్ళ పిలవడం, వాళ్ళు రాకపోవడం, బట్టలు కొనుక్కోమని గోపాలకృష్ణయ్యగారు డబ్బు పంపడం జరుగుతూనే ఉంది. అలా అని మామగారి మీది కోపం లేదు సుమన్‌కు. వీలైనప్పుడు "వస్తున్నాం" అని ఉత్తరం రాయకుండానే కార్తీకను తీసికొని రావడం, రెండు రోజులుండి వెళ్ళిపోవడం చేస్తున్నాడు. ఈ పండక్కు మాత్రం మామగారు ఉత్తరం రాయలేదు రమ్మని. సుమన్ "మేము వస్తున్నాం పండక్కి" అంటూ తనే రాసి వచ్చేశాడు.

ఎప్పుడూ ఎన్ని పండగలకి పిలిచినా రాని అల్లుడు తనకు తానే పిలవకుండానే వచ్చేసరికి ఇంట్లో అందరికీ ఆశ్చర్యంగా ఉంది.

సుమన్, కార్తీకల కాఫీలు, స్నానాలు, టిఫిన్లు అయ్యాయి. అది పల్లె కాదు. పట్టణం కాదు. పల్లె వాసనలు పోగొట్టు కోలేక, పట్టణం పద్ధతులు రాబట్టు కోలేక అటూ ఇటూ ఉన్న ఊరు అది. సుమన్, కార్తీకలను పలకరించడానికి చుట్టు పక్కల వారు రావడం మొదలు పెట్టారు. వారితో కార్తీక అప్పుడే భర్తను మరిచిపోయి, కబుర్లు మొదలు పెట్టింది.

"ఏమోయ్, మరదలు మాణిక్యమా క్షేమమేనా?" సుమన్ పలకరించాడు మళ్ళీ కళికను. ఆమె అప్పుడు స్నానం చేసి వచ్చింది.

"ఏం క్షేమమో, బావగారూ! కిందటి సంవత్సరం సంక్రాంతికి తలనొప్పి, ఉగాదికి నడుం నొప్పి, దసరాకు కాళ్ళు నొప్పి, దీపావళికి కళ్ళు నొప్పి, ఇదిగో సంక్రాంతికి మీరు వస్తారని పిండి వంటలు చేసి చేసి ఒళ్ళంతా నొప్పులే."

"అయితే వంటకాలన్నీ నీవు వండావన్న మాట! అందుకే అప్పుడే నాకు కడుపులో తిప్పుతూంది. నూనెతో వండావా, ఆముదంతో వండావా తల్లీ? రేపు పెళ్ళయితే మా తమ్ముడికి ఇలా వండి పెడితే గోవిందా గోవిందా! ఏదో పెళ్ళయిన వాడని మీ అక్కచేతి అడ్డమైన తిండీ తిని ఇలా రాయిలా అరిగించుకున్నాను గాని, అదే మరొకడైతేనా...?"

"ఈసరికి ఆ అడ్డమైన తిండీ తినలేక తనే వండుకోవడం నేర్చుకునే వాడే పాపం!"

కళిక మాటలకు ఇద్దరూ నవ్వుకున్నారు.

లోపల రుక్మిణి వంటల హడావిడిలో ఉంది. కళిక పట్టు లంగా ఓణీతో, జడ కుచ్చులతో, నిండుగా నగలతో, అసలైన తెలుగు ఆడపడుచులా అందంగా మెరిసి పోయింది.

కబుర్లు అయిన తరువాత "ఏమిటి, మా చెల్లిని ఏడిపిస్తున్నారు?" అంటూ వచ్చింది కార్తీక.

"ఇంకానయం మీ చెల్లిని ఏడిపించడమే? నీవు అందర్నీ ఏడిపిస్తూ ఉండు, నీకు త్వరగా పెళ్ళవుతుంది. మొగలి పువ్వు వంటి మొగుడు వస్తాడు అని జ్యోతిష్కుడు చెప్పాడట. అందుకే, ఆ ప్రతాపం నా మీద చూపెడుతూంది." నవ్వుతూ అన్నాడు.

"మొగలి పువ్వంటి మొగుడు ఘాటుగా ఉండి, గుచ్చుకుంటాడు. పైగా చుట్టూ నాగులు తిరుగుతాయి." కళిక అంది.

"మరెలాంటివాడు కావాలి? నా లాంటి మంచివాడు, అందమైనవాడు కావాలా?" ఉడికిస్తూ అన్నాడు సుమన్.

"ఛ, ఛ. నీ లాంటి డబ్బా రేకుల వాడా?" తీసిపారేసింది కళిక.

"పోనిలే. నాలాంటి వాడు వద్దంటే, మెల్లకన్ను కుంటి కాలు వాడు వస్తాడు. మరి అవి నాకు లేవుగా?" అన్నాడు.

"మనిషి అవకరంగా ఉన్నా ఫరవా లేదు. మనసు అవకరంగా లేని వాడిని చూడు బావా చేసేసుకుంటాను" అంది కళిక.

☆ ☆ ☆

ఆ మర్నాడు భోగి. కార్తీక, కళిక చాలా హడావిడిగా ముగ్గుల పుస్తకాలు, ముగ్గు పిండి, రంగులు పట్టుకొని తిరుగుతున్నారు.

ఊరంతా ముగ్గులతో ముచ్చటగా ఉంది. అందరూ రోజా రకరకాల ముగ్గులు వేసేస్తున్నారు. ఒకరి ముగ్గులు చూసి ఒకరు పోటీగా మరింత పెద్దవి వేస్తున్నారు. ఈ సంవత్సరం అక్క రావడంతో కళికకు మరింత హుషారు వచ్చింది. రాత్రి ఎనిమిది అయ్యేసరికి గబగబా భోజనాలు కానిచ్చి అక్కా చెల్లెళ్ళిద్దరూ ముగ్గు పిండి పట్టుకొని వాకిట్లోకి చేరారు. చాల పెద్ద వాకిలి అది. ఎన్నయినా ముగ్గులు వేసుకోవచ్చు.

సుమన్‌కు అత్తింటి భోజనం కమ్మగా, రుచిగా ఉంది. భుక్తాయాసంగా ఉంది. వరండాలో మామా, అల్లుళ్ళు కబుర్లలో పడ్డారు. కార్తీక తమ్ముళ్ళు రవి, రాజు మరి కొంత మంది స్నేహితులతో కోడి పందాల కబుర్లలో పడ్డారు. ఎప్పుడూ ఇల్లు విడిచి బయటకు రాని ఆడంగులంతా, ముగ్గుల వంకన వాకిళ్ళలోకి చేరారు.

"మామయ్యగారూ! అత్తయ్యగారు కార్తీకకు రాసిన ఉత్తరం చేరింది. కళిక పెళ్ళి కుదిరినందుకు సంతోషం." సుమన్ అన్నాడు.

"ఏం సంతోషం నాయనా? పరిస్థితులు ఇలా తారుమారు అవుతాయని ఎవరూ అనుకోలేదు. కళిక ఎంతో ఇష్టపడిన సంబంధం ఇది. అప్పట్లో పెద్దమ్మాయికి ఇచ్చినంత కట్నం చిన్నమ్మాయికి ఇవ్వలేక పోతామా అనుకున్నాం. కాని ధరలు ఇలా పెరుగుతాయని, నా ఉద్యోగం ఇలా ఊడుతుందని అనుకున్నామా? మధ్యవర్తి ద్వారా వాళ్ళు కార్తీకకు ఇచ్చినంత కట్నం ఇవ్వమని అడుగుతున్నారు. వాళ్ళు అన్యాయంగా ఏమీ అడగడం లేదు. నిజానికది న్యాయం కూడాను.

ఆయన గొంతులో ఆవేదన, చేతిలో డబ్బు లేని నిస్సహాయత మాటల్లో బయటకు వచ్చాయి.

"అసలు అప్పుడు మేం కట్నం ఇంత కావాలి అని డిమాండ్ చేయకుండానే మీరు ఇచ్చారు." సుమన్ అన్నాడు.

"అవుననుకో. అప్పుడు నా దగ్గర డబ్బుంది. ఆడ పిల్లకు ఇచ్చే ఆస్తి అదే కదా!

పైగా కట్నం ఇవ్వడం వలన ఆడపిల్ల అత్తింటిలో నిశ్చింతగా ఉంటుంది అనుకున్నాను."

"ఆ డబ్బు మీకు నేను తిరిగి ఇచ్చేస్తాను. కళిక పెళ్ళికి ముహూర్తాలు పెట్టించండి." మర్యాదగా అన్న ఆ మాటలు షాక్ కొట్టినట్లయింది గోపాలకృష్ణయ్యకు. "కళిక పెళ్ళి కట్నం గురించి వాయిదా పడిందని సుమన్‌కి తెలుసన్న మాట" అనుకున్నారు.

"ఏమిటి బాబూ! నీవంటున్నది. నేను ఇచ్చిన డబ్బు నాకు తిరిగి ఇచ్చేస్తావా?" ఆశ్చర్యంగా అన్నారాయన.

"పోనీ మీరు ఇచ్చింది కాదు. నా కష్టార్జితమే ఇస్తాను. తప్పంటారా? ఆనాడు కట్నం రూపంలో మీరు ఇచ్చిన డబ్బు నా చెల్లెళ్ళు పెళ్ళికి, నా తమ్ముడి చదువుకి సరిపోయాయి."

"అది కట్నం కాదు బాబు. నా కానుక."

"మీరు ఏమన్నా సరే. మీరు కట్నం రూపంలో ఇచ్చిన కానుకను అయినా మీకు తిరిగి ఇవ్వగలను. గాని, భార్య రూపంలో ఇచ్చిన కానుకను మాత్రం నా జీవితాంతం పదిలంగా నా దగ్గరే దాచుకుంటానండి. అందులో సందేహం మాత్రం ఏమీ లేదు."

"అంటే?"

"అంటే ఏముంది. మీరు నాకు భార్యగా ఇచ్చిన కానుక కార్తీక. ఒక్కో కోడలు ఒక్కో ఇంట్లోకి అడుగు పెడితే ఆ ఇల్లు ఆమె స్వార్థంతో ముక్కలవుతుంది. అదే మంచి కోడలు అడుగు పెట్టిన ఇల్లు ఎంతో అభివృద్ధి చెందుతుంది. మీరు కార్తీకను పద్దెనిమిది సంవత్సరాలు పెంచి ఆమె వల్ల ఏమీ లాభం పొందకుండానే నాకు అప్పగించారు. నా అదృష్టం కొద్దీ, ఆమె వల్ల నా కుటుంబమూ, నేనూ ఎంతో లాభం పొందాం.

"తను వచ్చిన తరువాత మా కుటుంబంలో ఏ విధమైన కలతలు, కలహాలు రాలేదు. పైగా తను అందరికీ నిచ్చెనలా ఉపయోగపడింది. నా ఇద్దరు చెల్లెళ్ళ పెళ్ళికి, నా తమ్ముడు చదువుకీ ఎంతగానో సహకరించింది. నా తల్లిదండ్రులను, బంధుమిత్రులను ఎంతో గౌరవంగా చూస్తుంది. కార్తీకను చూసి మా పెళ్ళికి ముందు పెళ్ళయిన మా చెల్లెలు ఎంతో నేర్చుకుంది. కార్తీక రాక ముందు అత్తింట్లో అందరినీ ఎదిరించి పుట్టింటికి వచ్చేయడం చేసేది అస్తమానూ. అటువంటిది కార్తీక ప్రవర్తన మా చెల్లెలిలో ఎంతో మార్పు తెచ్చి తన అత్తింటి వారిని ఆదరణతో చూడడం మొదలు పెట్టింది."

"అదంతా మీ మంచితనం బాబూ! మా అమ్మాయి మీ అందరికీ మంచిగా కనబడుతోందీ అంటే, మీలో కూడా మంచితనం ఉండబట్టే కదా! ఎదుటి వారిలో మంచిని గుర్తించాలంటే ముందు మన మనసుల్లో మంచి ఉండాలి సుమన్!"

"అది సరే లెండి పెళ్ళికి ముందు నాకు ఎలాంటి భార్య వస్తుందో, నా ఇంటిని ఎలా చక్క బెడుతుందో అనే భయం నాకుండేది. ఎందుకంటే నా స్నేహితుడు స్వార్థపరురాలైన భార్యతో, సంసారం నరకం చేసుకుని రోజూ ఇంట్లో భార్యకు, తల్లికి, అక్కాచెల్లెళ్ళకు పడకపోవడంతో ఆ గోల భరించ లేక ఎటూ ఎవరినీ సమర్థించ లేక పిచ్చివాడై పోయాడు. అందుకనే నేనంటున్నాను కార్తీకను చేసుకున్న నేను చాలా అదృష్టవంతుడిని అని.

"పెళ్ళయిన తరువాత సాధారణంగా మనలాంటి మధ్య తరగతి కుటుంబాల్లో కోడలు కొంత కాలం ఆర్థికంగా కొంత నష్టపోతుంది. శారీరకంగా కొంత కష్ట పడుతుంది. దాని వల్ల పెద్దగా నష్టం లేక పోయినా కుటుంబానికి మాత్రం ఎంతో లాభం ఉంటుంది. మధ్య తరగతి కుటుంబం కొడుకు, కోడలు పడవకు చుక్కాని లాంటివారు. వారు సరిగా లేకపోతే అది గందరగోళమే."

"అది నిజమే ననుకో"

"చూడండి మామయ్యగారూ! పెళ్ళి కాని అబ్బాయిలకూ, మన దేశంలో కట్నంతో సహా వచ్చే ఆడపిల్లలకు ఏ విధంగానూ లోటు లేదు. కాని భార్య మంచితనంతో వచ్చినందువల్ల కుటుంబానికి ఎంతో మేలు జరుగుతుంది. మగవాడికి భార్య అన్ని విధాలా సహకరిస్తే అతని జీవితం నందనవనమే అవుతుంది. చికాకులతో, ఇంట్లో అల్లరులతో అటు ఉద్యోగానికి న్యాయం చేయలేక పోవడం, ఇటు అతను స్థిమితాన్ని కోల్పోవడం జరుగుతుంది. కార్తీక వల్ల నేనూ, నా వారూ అందరం ఎంతో హాయిగా ఉన్నాం. ఉన్నతంగా పైకి వచ్చాం. ఆడపిల్ల అత్తింట్లో మంచిగా ఉందంటే ఆ గొప్పతనం ఆమెదే కాదు. ఆమె తల్లిదండ్రులది కూడా. పెళ్ళయిన మూడో నాడే వేరే కాపురం పెట్టి, అత్తింటి వారిని గుమ్మం ఎక్కనివ్వని వారిని మనం ఎంతో మందిని చూస్తున్నాం. నేను అలా లేనందుకు ఎంతో సంతోషిస్తున్నాను. కార్తీక లాంటి అమ్మాయిని భార్యగా ఇచ్చినందుకు ఎంతో కృతజ్ఞుణ్ణి మీకు.

"బాబూ, డబ్బు దేముంది? ఈ రోజుండవచ్చు. రేపు లేకపోవచ్చు. కాని నీ లాంటి మంచి మనసున్న భర్తను పొందడం కార్తీక అదృష్టం కూడా. కోడల్ని కాల్చి చంపే ఈ రోజుల్లో మీరందరూ ఆమెను అభిమానించడం సంగతి."

"మామయ్యగారూ! కళిక విషయంలో మీరు దిగులు చెందకండి మరో చెల్లి ఉంటే నేను పెళ్ళి చేయనా? మీకు ఇలా అనుకోకుండా కావడం వల్ల నేను సహాయం చేస్తాను అంటున్నాను గాని మరెందుకూ కాదు. కార్తీక నా చెల్లెళ్ళను అపురూపంగా చూసుకొని పెళ్ళి చేయగా నేను కార్తీకకు ఉన్న ఒకే ఒక చెల్లి పెళ్ళి చేయకూడదా?"

"బాబూ! నీవు ఈ కాలంలో పుట్టవలసి వాడివి కాదు." ఆనందంతో నీరు తిరుగుతుండగా అన్నా రాయన. ఆయనకు కళిక పెళ్ళి గురించి కంటి మీద కునుకు



రావడం లేదు. అటువంటిది దశమ గ్రహం అని పేరున్న అల్లుడు అలా అంటుంటే ఆయనకు చాల ఆనందంగా ఉంది.

"సుమన్! నిజంగా నీ ఋణం తీర్చుకోలేను. ఎలాగో ఏదో చేసుకొని, లేకపోతే అబ్బాయిలకు ఉద్యోగం రాగానే నీ అప్పు తీర్చేస్తాను అన్నారు గోపాలకృష్ణయ్య.

"మీరు ఇవ్వడం నేను పుచ్చుకోవడం సంగతి తరువాత చూడొచ్చులెండి" అన్నాడు సుమన్ దృఢంగా.

☆ ☆ ☆

పండగ వెళ్ళగానే సుమన్, కార్తీక ప్రయాణమయ్యారు. "మరదలు మాణిక్యమా! నీకు ఎలాగో పెళ్ళి కావడం లేదుగా? ఏ మొగుడూ దొరక్కపోతే అక్క మొగుడే గతి అట. నన్ను పెళ్ళాడతావా?" అన్నాడు సుమన్.

"నీ కంత కోర్టుకి వెళ్ళి ఉద్యోగం వదులుకోవాలని సరదాగా ఉంటే ఛండాలం పని చెయ్యి, అంతే గాని నన్ను పెళ్ళి చేసుకోవద్దు."

"అబ్బ ఇంత కాలం పండుగలకు రాకుండా, ఈ పిండి వంట మరదలితో హాస్యాలు చాలా మిస్ అయిపోయాను సుమా! ఎలాగోలా పెళ్ళి చేసుకో కళికా, మళ్ళీ వచ్చే సంవత్సరం కొత్తల్లుడిలా వస్తా ఇంటికి." ఏడిపిస్తూ అన్నాడు.

"బావా, నీవు కొత్తల్లుడిలా కాదు, జీవితాంతం ఈ ఇంటికి అల్లుడిలా రా" అంటూ సుమన్ కాళ్ళకు నమస్కరించింది కళిక.

"ఏయ్ ఏమిటిది? లే" ఆప్యాయంగా లేవనెత్తాడు. ఆమె కళ్ళల్లో చూసి అన్నాడు। "ఏమిటి కళికా, ఎందుకీ కన్నీరు?" అని.

"ఇది కన్నీరు కాదు బావా, పన్నీరు. బావా బావా పన్నీరు! నిజ జీవితంలో కన్నీరు తుడిచి పన్నీరు నింపావు. నీ ఋణం తీర్చుకోలేను. పండుగలకు అల్లుళ్ళకు ఇస్తారు కానుక. కాని నీవు ఆచారానికి రివర్స్‌గా మాకే మంచి సంక్రాంతి కానుక ఇచ్చావు. నా జీవితాన్ని నిలబెట్టావు." కృతజ్ఞతా పూర్వకంగా అంది.

"ఇందులో నా గొప్పతనం ఏమీ లేదులే. అంతా మీ అక్కదే. మా ఇంటికి వచ్చి, తన మంచితనం అనే మత్తు అందరి మీద జల్లేసి మమ్మల్ని బానిసల్ని చేసేసింది. ఇప్పుడు మేం, మంచితనానికి ఎడిక్ట్ అయిపోయాం. మమ్మల్ని ఎవరూ రక్షించలేరు."

"దేవుడు చల్లగా పది కాలాలపాటు నీ లాంటి అల్లుళ్ళను ఆశీర్వదిస్తాడు బావా!" అంది ఆనందంగా కళిక.

(ప్రభ, 25-06-86)

☆ ☆ ☆

# సవితితండ్రి

లండన్‌లోని గ్రేట్ ఆర్మండ్‌స్ట్రీట్ ఎప్పటిలాగే మామూలుగానే ఉంది. కాని ఆ స్ట్రీట్‌లో ఉన్న సిక్ చిల్డ్రన్ హాస్పిటల్‌లో పని చేస్తున్న స్వాతి మనసు మాత్రం ఎంత మామూలుగా ఉండాలని ప్రయత్నించినా ఉండలేకపోతోంది. హాస్పిటల్‌లో అంతగా పని లేకపోవడంతో కిటికీని ఆనుకొని బయటకు తొంగి చూసింది స్వాతి. బయట ప్రకృతి చాలా ఆహ్లాదంగా ఉంది. కాని లోపలున్న స్వాతి మాత్రం చాలా ఆవేదనతో ఉంది. బయట కురుస్తున్న మంచు ఆమె శరీరాన్ని గాని, మనసును గాని చల్లబరచలేక పోతున్నది. పైగా మంటలు రేపుతున్నట్లనిపించింది స్వాతికి.

వాసన లేని మల్లెరేకులను ఆకాశంలో నుండి ఎవరో ఆర్టిస్టిక్‌గా విసురుతున్నట్లు కనబడుతుంది మంచు కురుస్తుంటే. కింద అంతా నేల కనబడకుండా పాలసముద్రం చిలికితే వచ్చిన తెల్లని వెన్నలా మంచు పరుచుకొని కన్నుల పండుగగా ఉంది. ఆ అందమైన మంచువానను, నేలమీద పరుచుకున్న తెల్లని మంచు తివాచీని చూస్తుంటే భగవంతుడిచ్చిన రెండు కళ్ళు చాలవనిపిస్తుంది. కాని ప్రస్తుతం స్వాతి ఆ అందాన్ని చూసి ఆనందించే స్థితిలో లేదు. ఆమె రెండు కళ్ళూ వర్షించడానికి సిద్ధంగా ఉన్న మేఘాల్లా ఉన్నాయి. మంచువల్ల కలిగిన చల్లదనం, మనసులో తాపాన్ని ఎంతమాత్రమూ చల్లబరచలేకపోతోంది.

తాను ఏం పాపం చేసిందని భాస్కర్ అలా ప్రవర్తిస్తున్నాడో అర్థం కాలేదామెకు. తన జీవితం ఏ మలుపు తిరుగుతుందో ఆమె ఊహించలేకపోతోంది. సవతి తల్లికి ఇష్టం లేదని తెలిసి తను భాస్కర్‌ని రిజిస్టర్ మారేజి చేసుకొని పుట్టింటితో బాంధవ్యాన్ని బలవంతంగా తెంచేసుకుంది. అత్తింట్లో అందరిలానే ప్రవర్తించింది. తను, భాస్కర్ మెడిసిన్ పూర్తిచేసి ఉన్నారు. ఇద్దరికీ ఉద్యోగాలు లేవు. కాని పరిస్థితుల ప్రాబల్యం వల్ల త్వరగా పెళ్ళి చేసుకొనవలసి వచ్చింది. అందుకే ఉమ్మడి కుటుంబమైన అత్తింట్లో ఎన్నో అవహేళనలను భరించింది. 'స్వాతి పుట్టింటి వాళ్ళు రారు' అనగానే కొంత చులకన, కట్నం తీసుకొని రాని కోడలు అనేసరికి మరింత చులకన అయిపోయిందామె అత్తింట్లో. అసలే ఉద్యోగం లేని తాను వాళ్ళకు భారం కాకూడదని ఇంటి భారాన్నంతా నెత్తిన వేసుకొంది. ఇంట్లో తనని ఎంత ఇల్‌ట్రీట్ చేసినా భర్తకు తెలియనిచ్చేది కాదు. నా భర్త కోసం ఎన్ని కష్టాలు, నిష్ఠురాలైనా భరించాలి అన్నదే ఆమె ధ్యేయం. అలాంటి బాధలతోనే ఒక పాపకి తల్లి అయింది.

పాప పుట్టిన వేళావిశేషమో ఏమో, భాస్కర్‌కి ఇంగ్లండులో ఉద్యోగం వచ్చింది. వెంటనే భాస్కర్ వెళ్ళిపోయాడు. మరో సంవత్సరం వరకూ స్వాతికి వెళ్ళడానికి కుదరలేదు.

ఆర్థిక సమస్యల వల్ల ఇండియాలోనే ఉండిపోవలసి వచ్చింది. పైగా స్వాతికి పరీక్షలు రాయవలసి వచ్చి వెంటనే భర్త దగ్గరకు వెళ్ళలేకపోయింది. పరిస్థితులన్నీ చక్కబడగానే శిల్పను తీసుకొని భాస్కర్ దగ్గరకు వెళ్ళిపోయింది. భర్తకోసం తన అభిరుచుల నన్నింటినీ మార్చుకొంది. అతనికి పొట్టి జడ ఇష్టం అని నాగుపాము లాంటి బారెడు జడను బాబ్డ్ హెయిర్ చేసేసింది. చీరెలు మాని ఫాంటు, షర్టు, మేక్సీలు వేసుకుంది. స్లీవ్‌లెస్ బ్లౌజ్ అంటే చాలా అసహ్యం తనకి. అయినప్పటికీ భర్తకోసం అదీ భరించింది. లిప్ స్టిక్... ఒకటేమిటి అన్ని రకాలుగాను భర్తకు అనుగుణంగా తయారయింది స్వాతి. తాను తన కోసం బతకడం మరచిపోయింది పూర్తిగా.

స్వాతి అందంలో లోపం లేదు - అలంకరణలో లోపం లేదు. అయినా ఆమె జీవితంలో ఈ అపశ్రుతి ఎలా పలికింది? ఎక్కడ జరిగింది పొరపాటు? మైనపు ముద్దలాగే అతనికి చేరువైంది. అతను తనకు కావలసిన రీతిగానే మలచుకొన్నా డామెను. అయినా ఆమె జీవితం ఎందుకిలా అయింది? బహుశా లోపం ఆమెది కాదేమో! అతని మనసుదేమో. కొత్త రుచుల కోరే తుమ్మెదలాంటి మగవాడి మనస్తత్వం మగువలకు పెద్ద శాపం.

భాస్కర్ ఈమధ్య స్వాతిని నిర్లక్ష్యం చేస్తున్నాడు. కారణం సులువుగానే గ్రహించింది స్వాతి. అతను మరో ఆకర్షణలో పడ్డాడు. శీలానికి విలువ లేని, చిన్న తనం నుండి సెక్స్ మీదే ధ్యాస ఉండే పాశ్చాత్య దేశంలో ఉన్నారు వారు. బలహీన మనస్తత్వాలు త్వరలో బలి అయిపోయే పరిస్థితులున్నాయి అక్కడ. ఏ దేశ మేగినా, ఎందు కాలిడినా మన సంస్కృతినీ, సంప్రదాయాల్నీ మరచిపోతే ఎలా? ఒకరి నుంచి మంచినే గ్రహించాలి గాని, చెడును మాత్రం కాదు. తన కళ్ళముందే భాస్కర్ తన గర్ల్ ఫ్రెండ్‌తో సరసాలాడడం, తాగి తందనాలాడడం, రాత్రి క్లబ్‌కి వెళ్ళి డాన్స్ చేసి రావడం - ఇవన్నీ సహించలేకపోతోంది స్వాతి. ఆ ఇంట్లో ఉన్న అన్ని వస్తువులలోనూ ఆమె కూడా ఒకటి అన్నట్లుంది భాస్కర్ ప్రవర్తన. అంతేగాని ఆమె కూడా మనిషనీ, తన పిల్లలకు తల్లి అనీ, తను చేసేది తప్పనీ గ్రహించే స్థితిని దాటేశాడు. ఆ విషయం ఆలోచించే కొద్దీ ఆ బాధ నామె భరించలేకపోతూంది. గుండె గుప్పెడే కావచ్చు. బాధ మాత్రం కొండంత. తను అతనికి ఏం తక్కువ చేసిందని అలా చేశాడు. అతనికి ఆ విషయం ఎంతో చిన్నదిగా అనిపించవచ్చు. కాని అన్ని విధాలా భర్తనే నమ్ముకున్న భార్యకు అదెంత నరకం? అది ఈ మగవాళ్ళకెలా అర్థమవుతుంది? స్వాతి మనసు స్థిమితాన్ని కోల్పోతోంది రోజు రోజుకి.

ఒక్కొక్కసారి స్వాతికి ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది. భర్తను మార్చే ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు. తాను ఈ పరిస్థితిని భరించలేదు. ఏది దారి? మనశ్శాంతి లేని జీవితం. అన్నీ ఉన్నా అనుభవించలేని జీవితం. ఏమిటో భాస్కర్

ప్రవర్తన తలుచుకుంటేనే తనకు ఎంతో అవమానంగానూ, చిన్నతనంగానూ ఉంది. అతనిలో పరివర్తన కలగడం అన్నది కలలో మాటే. ఆ ఇంట్లో తనకు విలువ లేదు. విలువ లేని చోట నిలవరాదన్నది ఆమెకు అస్తమానూ గుర్తుకి వస్తుంది. భగవాన్! నాకు ఆత్మహత్యే రాసిపెట్టావా? నా ఎదురుగా భాస్కర్ ఆమెను వివాహం చేసుకుంటే భరించగలనా అనుకుంటూ ఎంతో విలపిస్తుంది స్వాతి మనసు. ఆ బాధ అతనికి వినిపిస్తే కదా! తెలిసి తప్పు చేసే వారిని ఎవరూ తప్పించలేరు. కాలమే వారికి గుణపాఠం చెప్పాలి.

☆☆☆

హాస్పటల్‌లో పని అయిపోవడంతో ఇంటికి వెళ్ళడానికి బయటకు వచ్చింది. మంచు పడడం తగ్గింది కాని, చలి ఎక్కువగా ఉంది. ఇల్లు హాస్పిటల్‌కి దూరం, డాట్‌సన్‌ని బయటకు తీసి స్టార్ట్ చేసింది. మంచు రోడ్డంతా ఉండడంతో టైర్లు మంచుమీద నుండి జారుతున్నాయి. జాగ్రత్తగా డ్రైవ్ చేస్తూంది. మనసులో ఆలోచనలు మాత్రం ముళ్ళలా గుచ్చుకుంటూనే ఉన్నాయి. రోజూ ఎన్నో ఏక్సిడెంట్‌లను చూస్తూంది. ఒక్క ఏక్సిడెంట్‌తో తను ఈ లోకాన్ని వదలివెళ్ళి పోవాలన్నంత ఆవేశం కలిగింది స్వాతి మనసులో. అదుపు తప్పుతున్న కారునీ, మనసునీ అదుపులో పెట్టడానికి కేసెట్ ఆన్ చేసింది. తన కిష్టమైన పాట వస్తూంది. “ఈశా, మహేశా అమ్మను ఒక్క సారి చూపరాదా, రమ్మని నీవైనా అడుగరాదా, పాపను నాపైన జాలి లేదా.” పాటలోని భావంతో ఆమె మనసంతా ఒక విధమైన స్పందనకు లోనైంది. అంతకుముందు తనలో ఉన్న తలంపు ఆ పాటతో తుడిచిపెట్టుకుపోయింది. వెంటనే తన సవతి తల్లి గుర్తుకు వచ్చింది స్వాతికి. తన పిల్లలు తనలా తల్లిలేని పిల్లలు కాకూడదు. సవతితల్లి బాధలు పడకూడదు - వాళ్ళకు తల్లీతండ్రి తనే అయి పెంచాలనుకుంది.

తల్లిలేని లోటు స్వాతికి బాగా తెలుసు. ఎవరి తల్లిదండ్రులనైనా చూసినప్పుడు మనసు ఎంతో విలపించేది. తల్లులు ఎంత మంచివారు కదా అనిపించేది. నిజమే - లోకంలో చెడ్డపిల్ల లుండవచ్చు. కాని చెడ్డ తల్లులుండరు. పిల్లలకు తండ్రి ప్రేమకంటే తల్లిప్రేమ ఎంతో ముఖ్యం. ఏ పిల్లలకైనా తండ్రి ఎవరో తెలియకపోవచ్చు. కాని తల్లి మాత్రం తప్పక ఒక్కతే అయి ఉంటుంది. వేశ్య దగ్గరకు విటులెందరో వెళతారు. తనకు పుట్టిన పిల్లలకు తండ్రెవరో తెలియదు. కాని తాను తల్లిగా తన పిల్లలపై ఎంతో ప్రేమ కురిపిస్తుంది. ఎంత కురూపి అయినా, పేదరాలైనా తల్లి తల్లే! చిన్నప్పుడు స్వాతి తల్లి చనిపోయినప్పుడు తండ్రి తనని మరపించాలని ఎన్నో బొమ్మలు తెచ్చేవాడు. ఏదీ వద్దు - అమ్మే కావాలి అనేది. ఏమిచ్చినా ‘అమ్మ కావాలి - అమ్మకావాలి’ అన్న మాట తప్ప మరొకటి వచ్చేది కాదు స్వాతి నోటి నుంచి. అస్తమానూ ‘అమ్మా - అమ్మా’ అంటూ చనిపోయిన తల్లిని గుర్తుకి తెచ్చుకొని ఏడ్చేది. స్కూలుకి పంపిస్తే

పుస్తకాల నిండా 'అమ్మ కావాలి - అమ్మ కావాలి' అని రాసేది. ఏం చేస్తే అమ్మ తిరిగి వస్తుందో, తనను ఆప్యాయంగా ఎత్తుకుంటుందో ఆ పసిమనసుకు అర్థమయ్యేది కాదు. నిద్దట్లో ఉలిక్కిపడి లేచి 'అమ్మా' అని ఏడ్చేది. తల్లిని తలుచుకుని రోజు రోజుకి కృశించిపోయేది. స్వాతి తండ్రికి స్వాతిని చూసి ఏం చెయ్యాలో తోచేది కాదు. అందుకే అర్జంటుగా రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఇంట్లో మరో మనిషి ఉంటే తాత్కాలికంగా నైనా స్వాతి తల్లిని మరవవచ్చని అతని ఊహ.

కాని శకుంతల మాత్రం 'నేను సవతి తల్లినే సుమా' అన్నట్లు ప్రవర్తించేది. చూడడానికి స్వాతికి అక్కలా ఉండేది. కాని స్వాతి అంటే ఎంతో అక్కసు. వచ్చింది తల్లి స్థానంలో కాని శకుంతలను చూస్తే స్వాతి పులిని చూసినట్లు భయపడింది. కట్న కానుకలు తేలేని శకుంతల ఆ స్థానంలో కసి, కోపాలు మాత్రం తీసుకొని వచ్చింది. శకుంతల స్వాతి పాలిట శాపమే అయింది గాని, ఏమాత్రం ఆ పసిదానికి శాంతిని కలిగించలేకపోయింది. స్వాతి వయసుతో పాటు అమ్మ కావాలన్న కోరిక కూడా పెరగసాగింది. ఏ పిల్లలను చూసినా తనకు తల్లిలేని లోటు కొట్టవచ్చినట్లనిపించేది. దేవతలు, రాక్షసులు పాలకడలిని చిలికినప్పుడు అమృతంతో పాటు అమ్మ కూడా వచ్చి ఉంటుంది. అందుకే అమ్మ అంత అమృతమయి - కన్న తల్లి ఉన్న వాళ్ళు కల్పవృక్షం ఉన్నవాళ్ళే అనుకునేది. అమ్మ గురించి వెక్కి వెక్కి ఏడ్చేది. దిక్కులన్నీ వెతికేది. భగవంతుడా! పిల్లలకు తల్లి ప్రేమను దూరం చెయ్యాలనుకుంటే తల్లితో పాటు పిల్లల్ని కూడా తీసుకొని వెళ్ళిపోగాని వారిని ఒంటరిగా భూమి మీద వదలవద్దు అనుకునేది.

వయసు వికసించిన మొదట్లో అసలు పెళ్ళే చేసుకోకూడదనుకొంది. ఎందుకంటే ఏ కారణం చేతనైనా పిల్లలు పుట్టిన తరువాత తను చనిపోతే తన పిల్లలు తనలా దిక్కులేని వారు కాకూడదు అని ఆమె ఉద్దేశం. కాని భాస్కర్ ఆమె ఉద్దేశాలను తారుమారు చేసి తనని, తల్లిలా లాలించాడు. చివరికి మెడలో తాళి కట్టాడు. చివరకు ఇద్దరు పిల్లలు పుట్టిన తరువాత ఆ తాళి ఆమెను ఎగతాళి చేసింది. ఆమె బతుకులో మనశ్శాంతి లేకుండా చేసింది.

★ ★ ★

భాస్కర్ హాస్పటల్‌కు వెళ్ళడానికి తయారవుతున్నాడు. స్వాతి అంటే ప్రేమ ఉంది. కాని డోరతి ఆకర్షణ నుండి తప్పించుకోలేక పోతున్నాడు. స్వాతి సాత్వికురాలు, భక్తురాలు. అద్దం దగ్గరకు వెళ్ళాడు. 'నీవు స్వాతికి అన్యాయం చేస్తున్నావు' అని తన ప్రతిబింబం తనని వెక్కిరిస్తున్నట్లయింది. అద్దం మీద అందమైన అక్షరాలతో స్వాతి రాసిన అక్షరాలను ఒక్కసారి చదువుకున్నాడు. ఆ మాటలు చదివాక అద్దం ముందు



అర నిముషం కంటే ఎక్కువ సేపు నిలబడలేకపోయాడు. వెనక్కి తిరిగి స్వాతివైపు చూశాడు. విచిత్రంగా స్వాతి విచారంగా కనిపించలేదు భాస్కర్‌కి. స్వాతి ముత్యంలా మెరిసిపోతూంది. రోజూ తన గురించి, తన ప్రవర్తన గురించి దిగులుపడి, దగా పడిన ఆడదానికి ప్రతీకలా ఉండే స్వాతేనా ఈమె? అని ఆశ్చర్యపోయాడు.

అంతలోనే ఆ రోజు ప్రోగ్రాం గుర్తు వచ్చిందతనికి. ఆ రోజు శుక్రవారం. డోరతితో కలసి ఆ వీకెండ్‌కి షిప్‌లో ఐర్లాండు వెళ్ళాలని అనుకున్నారు. అక్కడ డోరతి చెల్లెలుంది. డోరతికి షిప్ ప్రయాణం అంటే ఎంతో ఇష్టమట. పైగా భాస్కర్ ఫ్రెండ్ సుమంత్ ఐర్లాండు నుంచి అమెరికా వెళ్ళిపోతున్నాడు. షానన్ ఎయిర్‌పోర్ట్‌లో కలవాలి అతణ్ణి. షిప్పు ప్రయాణం మహా అయితే ఆరేడు గంటలుంటుంది. ఖర్చు మాత్రం ఆరేడువేల దాకా ఉంటుంది. ప్లెజర్‌టిప్ కదా! బోయ్ ఫ్రెండ్ ఎంత బాగా ఖర్చు పెడితే అంత ప్రేమ ఉందని అనుకునే అతివల మనస్తత్వం గల దేశంలో ఉన్నాడు తను. బాంక్ బాలన్స్ చూసుకున్నాడు. స్వాతిపై అతని ప్రేమలాగే ఆ బాలన్స్ కూడా మెల్ల మెల్లగా తరిగిపోతోంది. 'ప్చ్!' అనుకుంటూ మెల్లగా నిట్టూర్చాడు. ఇండియాలో ఉన్న తల్లి తండ్రులు, వారి పేదరికం లీలగా భాస్కర్ మనసులో మెదిలాయి. అది క్షణకాలం మాత్రం. బలవంతంగా మనసుని మరోవైపుకి మరల్చుకొని ఓవర్‌కోట్ వేసుకొని, గ్లవ్స్ తీసుకుని కారుషెడ్ వైపు నడిచాడు భాస్కర్.

యదాలాపంగా హాస్పిటల్‌కు వెళ్ళాడు భాస్కర్. అది సిక్ చిల్డ్రన్ హాస్పిటల్ కాబట్టి అందరూ చిన్నపిల్లలే పేషెంట్లు. భాస్కర్ ఛీఫ్ (కన్సల్టెంట్)కి భాస్కర్ అంటే ఇష్టమే గాని, 'ఒక ఇండియన్‌తో ఎందుకు ఆపరేషన్‌ను చేయించాలి' అనే కుత్సితపు మనస్తత్వం కలవాడు. 'ఇండియన్స్‌కి ఏమీ రాదు' అనుకునే వారిలో అతడు మొదటివాడు. అగ్రకులానికి చెందిన భాస్కర్‌ని, ఇంగ్లండులో అతని ఛీఫ్ ఇండియాలోని హరిజనుణ్ణి అగ్రకులం వారు చూసినట్లు చూస్తాడు. అయినా అన్నిటికి ఇష్టపడి అక్కడ ఉద్యోగం చేస్తున్నాడు. కష్టమైనా భరించాలి మరి!

ఆ రోజు వచ్చిన రెండు కేసులూ చేసేసరికి మనసు ఎంతో వికలమయింది భాస్కర్‌కి. ఉదయం కలిగిన హుషారంతా 'హుష్ కాకీ' అన్నట్లు ఎగిరిపోయింది. గాలి తీసిన బెలూన్‌లా అయిపోయింది మనసు. ఇండియాలో సవతి తల్లుల గోల అయితే ఇక్కడ సవతి తండ్రుల బాధ. ఒక అబ్బాయికి సంవత్సరం ఉంటుంది వయసు. సవతి తండ్రి వేడి వేడి నీళ్ళ టబ్‌లో ముంచి తీశాడు ఆ అబ్బాయిని. పాపం! శరీరం అంతా కమిలిపోయి ప్రాణం మాత్రం మిగిలి ఉంది. మరోపాప పసిడి బొమ్మలా ఉంది. రెండున్నర సంవత్సరాలుంటాయి. ఒళ్ళంతా సిగరెట్‌తో కాల్చిన బొబ్బలు. రెండూ ఒకే రకం కేసులే. ఇద్దరూ సవతి తండ్రులే. కాని క్రూరత్వంలో కొంచెం తేడా - అంతే! మనిషిగా పుట్టి మనిషినే హింసించే మనస్తత్వం గల మనుషులు. ప్రియురాలు కావాలి గాని, ఆమె పిల్లలు వద్దు అనే మామూలు మనుషులు, మనసులేని మనుషులు.

భాస్కర్ మనసు చేదు తిన్నట్లుగా అయింది ఆ పాపల బాధ చూస్తుంటే. కాని తను అక్కడ వారి కింద ఉద్యోగి మాత్రమే! తన మనసులోని భావాలు, హృదయంలోని బాధలు ప్రదర్శించకూడదు. ఆ పిల్లల తల్లులు జరిగింది చెప్పడానికి భయపడుతున్నారు. జరిగింది జరిగినట్లు చెబితే పోలీసు కేసు అవుతుంది. ఆ తరువాత కోర్టులు, సంసారంలో కలతలు - కథ మళ్ళీ మొదటికి వస్తుంది. మరో భర్తను వెతుక్కోవలసి వస్తుంది. కన్నపిల్లలను విడవలేరు. కట్టుకున్న వాడి బారి నుంచి వారిని తప్పించలేక తల్లడిల్లిపోతుంటారు. ఏ దేశంలోనైనా తల్లి తల్లే! అందుకే ఆ పిల్లల బాధలను కళ్ళతో చూసి కన్నీరు కారుస్తూ భరిస్తున్నారు. అది వారికి గుండెకోతే. గుండె కత్తితోనే కొయ్యనక్కర లేదు. జరిగిన సంగతి మాత్రం చెప్పడానికి ఆ తల్లులు ధైర్యం చెయ్యడం లేదు.

తరతరాలుగా పాశ్చాత్యులకు సవతి తండ్రుల బాధ ఉంటూనే ఉంది.

ఇండియాలోని పిల్లలకు సవతి తండ్రుల బాధ లేదు గాన స్త్రీలకు మాత్రం భర్త దగ్గర విలువ లేదు. తన భర్తనే అన్ని విధాల నమ్ముకున్న స్త్రీకి భారతదేశపు భర్త ఇచ్చేది అనురాగం కాదు. చాలా వరకు ఎలా అణగదొక్కాలి అనుకోవడం. భార్య ఎక్కడికి పోతుందిలే అన్న భావం అతనికి భార్య మీద సర్వాధికారాలు ఇస్తుంది. 'అయ్యో - నన్నే నమ్ముకొంది. ఎంతో అపురూపంగా చూసుకోవాలిఅని దలచిన మగవాడు నిజంగా మొనగాడే మరి. భర్త అంటే గౌరవం చూపించే భారత స్త్రీలకు భర్త తనను నిరసిస్తే నరకమే జీవితం. పాశ్చాత్య స్త్రీలకు పిల్లలతో నరకం జీవితం.

భాస్కర్ హాస్పటల్ నుంచి ఇంటికి వచ్చేసరికి స్వాతి ఇంకా రాలేదు. సెంట్రల్ హీటింగ్ ఆన్ చేసి బట్టలు మార్చుకొని కేసెట్ ఆన్ చేశాడు. తెలుగు పాటలంటే పిచ్చి ప్రాణం భాస్కర్‌కి. ఆ పాటలు వింటూ ఇంత సేపు ఇండియాలో ఉన్నట్లు భ్రమ చెందుతాడు. మనసు భావోద్వేగంతో చలిస్తుంది.

పంచ వన్నెల రామచిలుక వచ్చింది. ప్రక్కనున్న చెట్టుమీద వాలింది. దాన్ని వన్నెలకే భ్రమసెను, వగలు చూసి మురిసెను, గోరింక మనసే మారింది. ఆ పాట పాడుతున్నది గాయని కాక స్వాతి పాడుతోందేమో అన్నంత అనుమానం వచ్చింది భాస్కర్‌కి. పొద్దున్న హాస్పిటల్‌లోని ఆ పిల్లల కేసులు - ఇప్పుడు ఆ పాట భాస్కర్ మనసుని ఏదో తెలియరాని సందిగ్ధంలో పడేశాయి. పొద్దుట కలిగిన హుషారు కొంచెం కూడా లేదు. అప్రయత్నంగా డోరతికి ఫోను చేశాడు - తాను ఈ వారం ఐర్లెండు రావడం లేదు ఏమీ అనుకొనవద్దని. ఆమెకు కోపం వస్తుందని తెలుసు. కాని ఆ ఫోను చేసిన తరువాత గాని భాస్కర్ మనసు కుదుట బడలేదు. స్వాతిని చాలా బాధ పెట్టాను అని మొదటిసారి అనుకున్నాడు.

కలత నిద్రలో ఉన్న భాస్కర్ నవ్వులు వినబడడంతో కళ్ళు తెరిచాడు. సిటింగ్ రూమ్‌లో స్వాతి గొంతుతో పాటు మరొక మగవాడి గొంతు వినబడుతోంది. బెడ్‌రూమ్ నుండి వెళ్ళి చూశాడు. స్వాతి తల తిప్పి కూడా చూడలేదు. మిస్టర్ ఒకేలీ మాత్రం 'హాయ్!' అని తప్పనిసరిగా పలకరించి టీ తాగడంతోనూ, టి.వి చూడడంలోనూ మునిగిపోయాడు. స్వాతి తన దగ్గరున్న తాళంచెవితో లోపలకు వచ్చిందన్న మాట. ఇద్దరి దగ్గరా రెండు తాళాలుంటాయి. స్వాతి, ఒకేలీ సరదాగా నవ్వుకుంటుంటే తన తలమీద నిప్పులు కురుస్తున్నట్లు ఫీల్ అయ్యాడు భాస్కర్. తను అతి చల్లని మంచులో కూరుకుపోతున్నట్లు భావిస్తున్నాడు. నిజానికి ఖండాలు అయింది శరీరం కాదు - మనసు. స్వాతి ప్రవర్తన వింతగా అనిపించింది భాస్కర్‌కు. స్వాతి, మిస్టర్ ఒకేలీ కలసి బయటకు వెళ్ళిపోయారు. ఒకేలీ కూడా అదే హాస్పిటల్‌లో పని చేస్తున్నాడు.

ఆ రోజు డోరతితో క్లబ్‌కి వస్తానని చెప్పాడు భాస్కర్. వస్తానని చెప్పినందుకు వెళ్ళాడు. శరీరం ఆటోమెటిక్‌గా డాన్స్ చూస్తోంది గాని, మనసు మాత్రం పిచ్చి ఆలోచనలతో కుప్పిగంతులు వేస్తోంది. అతని మనసులోని ఘర్షణ ముఖంలో ప్రతిఫలిస్తూనే ఉంది. డాన్స్ కాగానే డోరతి విడాకుల గురించి అడిగింది. అంతకు ముందే స్వాతికి విడాకులిచ్చి డోరతిని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు భాస్కర్. ఆ నిర్ణయం భాస్కర్ మనస్ఫూర్తిగా చేసుకోలేదు. అందులో డోరతి బలవంతమే ఎక్కువ ఉంది. డోరతి అపురూప సౌందర్యవతి కావచ్చు. కాని సంసారం సుఖంగా ఉండడానికి సౌందర్యం ఒక్కటే కారణం కాదుగా? ఎందుకో డైవర్సు ప్రస్తావన విసుగ్గా అనిపించింది భాస్కర్‌కి. విసుగుని పైకి కనబడనీయకుండా 'తరువాత చూద్దాంలే' అని దాటేశాడు మాటను. ఇండియన్స్ అంటే డబ్బు బాగా సంపాదిస్తారనీ, చెడ్డ అలవాట్లు ఉండవనీ, ఆడవారిని సుఖపెడతారని అక్కడి యువతులు ఇండియన్స్ అంటే మోజు పడతారు. కాని భర్తలను బట్టలలాగే మార్చే ఆ స్త్రీలు మన భారత స్త్రీలకు ఎందులో సాటి? క్లబ్ నుంచి ఇంటికి వచ్చేసరికి రాత్రి ఒంటిగంట అయింది. స్వాతి ఒంటరిగా

అమాయకంగా శిల్పను, శ్వేతను చెరో పక్కను వేసుకొని ఎలక్ట్రిక్ బ్లాంకెట్ కప్పుకొని నిద్రపోతోంది. ఆమె మోహం ప్రశాంతంగానే కనిపించింది భాస్కర్‌కి! కొంపతీసి స్వాతిగాని ఒకేలీ ప్రేమలో పడలేదు కదా అన్న అనుమానం చిన్నగా మొదలై ఎవరెస్టు శిఖరం అంత ఎత్తు కెదిగిపోయింది. మనసంతా అస్థిమితంగా అయిపోయి ఆ రాత్రి నిద్రే పట్టలేదు భాస్కర్‌కి. అప్పుడుగాని స్వాతి ఇన్నిరోజుల నుంచీ పడుతున్న ఆవేదన అర్థం కాలేదు. పిల్లలిద్దరినీ స్వాతి పక్క నుండి తన పక్కకు జరుపుకుని, ఆప్యాయంగా వారి మీద చెయ్యేసి పడుకుంటే గాని మనసు నెమ్మది పడలేదు భాస్కర్‌కి. పిల్లలని వేరే గదిలో పడుకోబెట్టే అలవాటు వాళ్ళు చెయ్యలేదు. ఇంగ్లండులో ఉన్నా వాళ్ళు ఇండియన్సే. పగలంతా హౌస్‌కీపర్ చూస్తుంది వాళ్ళను. స్వాతి హాస్పిటల్ నుండి రాగానే ఆమెను పంపించేస్తుంది ఇంటికి. హౌస్‌కీపర్‌ని పెట్టుకోవడం ఖర్చుతో కూడిన పని. మరి ఉద్యోగం చేసే వాళ్ళకు తప్పదు కదా!

ఈమధ్య డోరతి మరీ విసిగిస్తోంది భాస్కర్‌ని. వీకెండ్స్‌కి ఎక్కడికైనా వెళదామంటుంది. డైవర్సు సంగతి ఏం చేశావంటుంది. డైవర్సు ఇవ్వడం అంటే కాఫీ తాగడం లాంటిదని ఆమె భావన. స్వాతి భాస్కర్ సంగతి పట్టించుకోవడం పూర్తిగా మానేసింది. ఒకేలీతో తరుచు కనిపిస్తోంది. హాస్పిటల్‌లో తాను చేసిన తప్పునే తన భార్య చేస్తుంటే భరించలేకపోతున్నాడు భాస్కర్. స్వాతి మనసు ఎలా మార్చాలో అర్థం కావడం లేదు. నిజంగా స్వాతి ఒకేలీకి చేరువైతే తనేం చెయ్యాలి? తను ఎలాగోలా బ్రతుకుతాడు. కాని శ్వేత, శిల్పల సంగతి? వాళ్ళు సవతితండ్రి బారిన పడవలసిందేనా? స్వాతి అలా చెయ్యదు అని మనసుకి ఎంత సర్దిచెప్పుకోవాలనుకున్నా ఏమో పరిస్థితులు ఎలా దారితీస్తాయో అని భయంగా ఉంది. తను శ్రీరామచంద్రుడిలా ఉండేవాడు భారతదేశంలో. ఇంగ్లండు రాగానే మనసు మారిపోయి డోరతి వెనుక పడలేదూ? అలాగే స్వాతి వెళుతుంటే ఆ పిల్లల స్థానంలో శ్వేత, శిల్ప కనపడుతున్నారు భాస్కర్‌కు. ఇద్దరూ విడిపోయి పిల్లలు తల్లి దగ్గరున్నా, తండ్రి దగ్గరున్నా సవతి తల్లి బాధో, సవతి తండ్రి బాధో తప్పదు కదా! భాస్కర్ మనసు పరిపరి విధాల పోతూంది.

కాని స్వాతి ఒకేలీ వెనక పడడం ఒక పెద్ద నాటకమని, భాస్కర్‌ని మార్చడానికి చివరి అస్త్రంగా చీకట్లో బాణంవేసి అది తగులుతుందో, లేదో తెరవెనుక ఉండి చూస్తుందనీ భాస్కర్‌కి తెలియదు. భాస్కర్ ఎదురుగా ఒకేలీతో కలసి విరగబడి నవ్వుతుంది. షాపింగులకు వెళుతుంది. పిల్లలను ఒకేలీ దగ్గర చనువుగా విడుస్తుంది. ఒకేలీకి మాత్రం స్వాతిని చూస్తే ఇండియన్స్ మీదుండే గౌరవభావం తప్ప మరేమీ లేదు. అతనికి స్వాతిని ఒక సోదరిని చూసినట్లే అనిపిస్తుంది. స్వాతి ప్రవర్తన, డోరతి సతాయింపు రోజు రోజుకి భాస్కర్ మనసుని నేలమీద నిలబడకుండా చేస్తున్నాయి.

స్వాతి రోజు రోజుకీ చాలా హుషారుగా తయారవుతోంది. అంతకుముందు

కుమిలిపోతూ, తనని ఎంతో బ్రతిమాలుతూ ఉండే స్వాతి అంత సరదాగా ఉండడం భాస్కర్‌కి ఎనిమిదో వింతలాగే అనిపిస్తూంది. ఆమె అతణ్ణి బ్రతిమాలినప్పుడు లెక్క చెయ్యని వాడు స్వాతిలోని సంతోషం చూసి కలా, నిజమా అని నమ్మలేకపోతున్నాడు. తనతో తీరిగ్గా మాట్లాడడానికి కూడా ఆమె అవకాశం ఇవ్వడం లేదు భాస్కర్‌కి. దానికి తోడు ఎంత జాగ్రత్తగా చూసినా ఆ హాస్పిటల్‌లోని పసిపిల్లలిద్దరూ చనిపోయారు. ఆ సవతి తండ్రులెంత సంతోషించి ఉంటారో గాని, భాస్కర్ మనసు మాత్రం విలవిలలాడి పోయింది. ఆ పిల్లలు తన పిల్లలే అన్నంత దిగులుపడ్డాడు. త్వరగా మనిషి కాలేక పోయాడు. స్వాతి మనసు ఎంతో సున్నితం. అయినప్పటికీ ఆ పిల్లల చావును పెద్దగా పట్టించుకోలే దామె. ఆ ప్రవర్తనకు మరింత విస్తుపోయాడు భాస్కర్.

ఆ రోజు స్వాతి ఒకేలీని డిన్నర్‌కి పిలిచింది. డిన్నర్‌కి పిలుస్తున్నానని భాస్కర్‌తో చెప్పింది. భాస్కర్‌తో ఆ చిన్న మాట మాట్లాడడమే ఎంతో సంతోషం కలిగించింది అతనికి. కాని ఒకేలీని తలుచుకోగానే మనసు బాధగా మూలిగింది. అంతకు రెండు రోజుల క్రితమే డోరతి ఫోన్ చేసింది, ఐర్లాండు వెళదామని. ఇకపై వీకెండ్స్‌కి రానని ఖచ్చితంగా చెప్పేశాడు భాస్కర్. ఇప్పుడు అతని కళ్ళకు డోరతి తనను పట్టుకున్న పిశాచంలా కనబడుతూంది. రెండవ పిశాచం ఒకేలీ. అది తాను తీసుకున్న గొయ్యి అని అతనికి తెలియసాగింది. ఒకేలీని స్వాతి ఎందుకు డిన్నర్‌కు పిలిచిందో ఒకేలీ వచ్చిన తరువాత గాని తెలియలేదు భాస్కర్‌కి. ఒకేలీకి అమెరికాలో మంచి ఉద్యోగం వచ్చిందట. ఎప్పటికైనా అక్కడే సెటిల్ అవ్వడం అతనికి ఇష్టమట. ఆ మర్నాడే అమెరికా వెళ్ళిపోతున్నాడట. ఆ సంగతి విన్న భాస్కర్ హృదయం దూదిపింజలా అయిపోయింది. సంతోషంతో శరీరం గాలిలో తేలిపోతున్నట్లు భావించాడు. ఇంతకుముందు ఒకేలీ ఎప్పుడూ తన పిల్లలకు సవతి తండ్రిలాగే కనిపించేవాడు. వాళ్ళను కాల్చిన సిగరెట్‌తోనూ, వేడినీళ్ళతోనూ, హంటర్‌తోనూ హింసిస్తున్నట్లే భావించేవాడు భాస్కర్. ఇప్పుడు ఒకేలీ ప్రయాణం సంగతి విని అతనికి ఎంత ఆనందం కలిగిందంటే ఎవరెస్టు ఎక్కినంత. ఫేవరిట్ ఏక్టర్ని కలసినంత. ఇండియాలో భార్యాపిల్లలతో చెవర్లెట్‌లో తిరిగినంత! అది చెప్పలేని ఆనందం.

భారత స్త్రీ తొంభై తొమ్మిది శాతం తప్పు చెయ్యదు అని భాస్కర్‌కి తెలుసు. అయినప్పటికీ స్వాతి మీద అనుమానం తన మంచికే జరిగింది డోరతికి దూరమయ్యాడు. తన భార్యకు దగ్గరయ్యాడు. తన చిన్న సంసారం సంతోషంగా ఉంటే అది మగవాడి గొప్పతనమే కదా! తన భార్యనూ, పిల్లలనూ ప్రేమగా, ఆదరంగా చూసుకోవడంలో ఉన్న ఆనందం అది అనుభవించే వారికే తెలుస్తుంది.

ఆ శుభోదయం వేళ సూర్యుడు ఉదయించాడు. సూర్యుడు ఉదయించాడు కాబట్టే అది శుభోదయం అయింది. పాశ్చాత్యులకి సూర్యోదయం ఎంతో కన్నుల

పండుగ. మనం నిండు పున్నమినాడు పొందిన అనుభూతిని వాళ్ళు సూర్యుణ్ణి చూసి పొందుతారు. భాస్కర్, స్వాతి, శిల్ప, శ్వేత హీత్రూ ఎయిర్‌పోర్ట్‌లో ఒకేలీకి వీడ్కోలు ఇవ్వడానికి వేచి ఉన్నారు. వారి మొహంలో తుఫాను తరువాత కలిగిన ప్రశాంతత. ప్రపంచంలో ఇకపై మమ్మల్ని ఎవరూ వేరు చేయలేరు అన్న నిశ్చింత తాండవమాడుతున్నాయి. ఒకేలీ వారి దగ్గర వీడ్కోలు తీసుకొని విమానమెక్కేశాడు. ఇంటికి వెళదామని వెనక్కి తిరిగిన స్వాతికి ఒక దృశ్యం కనపించి మోచేత్తో భర్తను ఆ దృశ్యం చూపించింది. డోరతి తన కొత్త బోయ్‌ఫ్రెండ్‌ని కిస్ చేస్తున్న దృశ్యమది. భాస్కర్ మొహంలో మబ్బులు కనిపించాయి. అదీ ఒక్క నిమిషమే. ఇంతకాలం అలాంటి ఎంగిలి పెదవులనేనా అమృతంలా ముద్దాడాను అన్న భావం అతని మనసులో మెదిలింది. వెంటనే డోరతి తలంపులను ఐరిష్ సీలోకి విసిరేసి స్వాతి చెయ్యి పట్టుకుని హుందాగా పిల్లలతో ముందుకి నడిచాడు.

పిల్లలను ట్యూబ్ ట్రెయిన్ ఎక్కించాలని ఎప్పటి నుంచో అనుకుంటున్నాడు. ఆ రోజు వారిని అండర్ గ్రవుండ్ ట్రెయిన్ ఎక్కించాడు. ఎన్నో అడుగుల లోతున బయటి ప్రపంచానికి సంబంధం లేకుండా తిరిగే ఆ భూగర్భ రైళ్ళను ఎన్నిసార్లు చూసినా తనివి తీరదు భాస్కర్‌కి. మనిషి మేధ ఎంత గొప్పదో కదా అని అనుకోకుండా ఉండలేడు. షాప్‌కి వెళ్ళి స్వాతికి ఒక మంచి చీరె కొన్నాడు. అందరూ కలసి ఇండియన్ హోటల్‌కి వెళ్ళి ఇడ్లీ, సాంబారు, ఉప్మా, పెసరట్ తిని ఆనందంగా ఇంటికి చేరారు.

ఇప్పటికీ భాస్కర్‌కి నోరు విప్పి చెప్పలేని పసిపిల్లలు, తల్లి చేసుకొన్న రెండవ పెళ్ళికి సవతి తండ్రి హింసించే హింసలకి గురి అవుతూ అమాయకంగా ప్రాణాలు వదిలే సన్నివేశం కళ్ళలో మెదలుతుంటుంది. తప్పు చేసేది ఒకరు. ప్రాయశ్చిత్తం అనుభవించే వారొకరు. భగవాన్! ఆ పసిపిల్లలను సవతి తండ్రుల బారి నుండి రక్షించు అనుకుంటాడు రోజూ తన ప్రార్థనలో.

(ప్రభ, 25-06-86)

☆ ☆ ☆

# ఉన్నత శిఖరాలు

ఎవరెస్టు ఎక్కాలనుకునే వారికి, కాళ్ళల్లోబలం, చేతిలో స్టిక్, కొన్నితాళ్ళు, వీపున ఆహారపుమూట అవసరం కావచ్చు. కానికొందరు మంచి మనసుతోనే అవేమీ అవసరం లేకుండానే ఉన్నతశిఖరాలను అధిరోహించగలరు.

"అన్నయ్యా"

"ఏం రా ఏం కావాలి" తమ్ముడు మనసులో మాట చెప్పడానికి అనుమానిస్తున్న తీరు ఆనంద్‌కి అర్థమయిపోయింది.

"మరి, మరి" ఆగిపోయాడు, ఊ, చెప్పు మరి అంటే నాకే అర్థం అవుతుంది.

"మరి, మా ఫ్రెండ్స్ అందరూ పార్టీ అడుగుతున్నారు" మెల్లగా అన్నాడు సునంద్. దాని అర్థం తెలుసు, ఇలా పార్టీలంటూ ఏదో ఖర్చులు పెట్టుకోవడం, భార్య వస్తువులో, తన తలో తాకట్టుపెట్టడం, అలవాటే ఆనందుకు.

నిజానికి సునంద్ దగ్గర డబ్బులేక కాదు. అతను హైద్రాబాదులో మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. ఇంకాపెళ్ళి కాలేదు. ఖర్చులు లేవు, అయినా అన్నగారి దగ్గర గారాలుపోయి, డబ్బు గుంజడం మానలేదు. వినయంగా డబ్బులు అడిగితే, తనంటే ఎంత గౌరవం అనుకుంటాడు ఆనంద్. కాని అసలు సునంద్ మనసులోకి గాని ఆనంద్ వెళ్ళిచూస్తే అది పచ్చి అబద్ధం అని అర్థం అయిఉండేది.

అన్నగారి ఆర్థిక ఇబ్బందులు ఏమీగ్రహించడు సునంద్. వారిద్దరూ అయిదు సంవత్సరాల తేడాతో మాత్రమే జన్మించారు. మనస్తత్వాలలో మాత్రం, నింగికి, నేలకు ఉన్నంత తేడా ఉంది.

'అలాగేరా, ఎంతవుతుంది. అయిదువందలు చాలా? ఆప్యాయంగా తమ్ముడ్ని అడిగాడు, తాను డబ్బుకోసం ఎంత మధన పడుతున్నాడో సునంద్‌కి తెలియనివ్వడు. సునంద్‌కి తెలుసని అతనికి తెలుసు.

"సరిపోతాయి" అన్నట్లు తలూపాడు సునంద్.

"నేను డబ్బు రేపు ఇస్తాను. నీవు పార్టీ అరేంజిమెంట్స్ చూసుకో. ఏం ఫరవాలేద్దులే అని భుజం మీద కండువా వేసికొని వెళ్ళిపోయాడు. తమ్ముడికి ఏవిధమైన మనస్తాపం కలగకూడదని, అన్నగా అతను భావిస్తాడు.

కాని సునంద్ అన్నగారి గురించి అసలు ఏమి ఆలోచించడు. ఆనంద్ చెప్పులు, చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకు అప్పులు చేయడానికి, తమ్ముడిని చదివించడానికి అప్పులు చేయడానికి

తనని జాగ్రత్తగా నడిపించి చాలా సహాయం చేశాయి. ఎండలో, వానలో బయటకు వెళ్ళినపుడు ఆనంద్‌కు తోడునీడగా ఉంటాయి. అప్పుకోసం నీర్సంగా బయటకు బయలుదేరాడు ఆనంద్. అన్నగారి మాట విన్న సునంద్ హుషారుగా ఈల వేసుకుంటూ, ఖరీదయిన బట్టలు ధరించి, సెంటుస్ప్రే చేసికొని, ఫ్రెండ్స్‌కి ఈ సంగతి చెప్పుదామని నేలమీద కాలునిలవనట్లు బయటకు బయలుదేరాడు సునంద్. అదే రోడ్డు మీద అప్పుదొరకని ఆనంద్ కాళ్ళు భారంగా యింటివైపు దారితీసాయి.

ఆనంద్ తల్లిదండ్రులు ఆనంద్‌కి ఇరవై సంవత్సరాలురాగానే పుణ్యక్షేత్రాలు దర్శించుతామని వెళ్ళి, నదిలో కొట్టుకుపోయారు. తల్లిదండ్రులతోపాటు ఆనంద్‌లోని ఆనందం సుఖం, శాంతి కూడా ఆ నదిలోనే కొట్టుకుపోయాయి. పేరుమాత్రం నామకార్థంగా ఆనంద్‌గా నిలిచిపోయినది. ఆనంద్ భార్య సుగుణ, పేరుకు తగినట్లు సుగుణాలరాశి. ఆనంద్ తల్లిదండ్రులు చనిపోయేసరికి సునంద్‌కి 15 సంవత్సరాలు, సునీతకు పదమూడు, అనితకు పదకొండు వారు ముగ్గురు తన కడుపున పుట్టని కన్నపిల్లలు అయిపోయారు. అప్పటికి అమలాపురంలో అయిదు ఎకరాల పొలం ఉండడానికి పెంకుటిల్లు మాత్రమే ఉన్నాయి. చదువుకిసున్నా చుట్టి చిన్న ఉద్యోగానికి శ్రీకారం చుట్టాడు ఆనంద్. ఆ తరువాత చెల్లెళ్ళ పెళ్ళిళ్ళ కోసం తమ్ముడి చదువుకోసం ఆనంద్, సుగుణ ఎన్ని విధాల తిప్పలుపడ్డారో, వారికి భగవంతుడికి మాత్రమే తెలుసు. ఆనంద్ తోడబుట్టిన వారికి రవ్వంతయినా తెలియదు.

అప్పుదొరకని ఆనంద్‌కి ఆపదలో ఆదుకునే గుడిలోని దేవతలా సుగుణ మాత్రమే కన్పిస్తుంది. రక్తసంబంధీకులు అయిన తమ్ముడు చెల్లెలు తనపరిస్థితి అర్థం చేసికొన లేకపోయినా రిక్తహస్తలతో నున్న ఆనంద్‌ని సుగుణ ఎప్పుడూ ఓదారుస్తూనే ఉంటుంది. తన ఒంటి మీద నగలు వలచియిస్తూనే ఉంటుంది. ఆమెకు చదువు లేకపోయినా అందాలరాశే. పెళ్ళయిన దగ్గరనుండి, మరిది చదువుకో, ఆడబడుచుల పెళ్ళిళ్ళకో ఒక్కొక్క వస్తువూ మాట్లాడకుండా మార్వాడి దగ్గరకు చేరుతున్నా ఆమెలో మాత్రం శాంతం సహనం కొంచమైనా పోలేదు. బంగారం ఆమెను వీడిపోయినా, ఆమె చిరునవ్వే ఆమెకు పట్టుచీరలు, ఆమె సహనం, ఆనందమే ఆమెకు ఆభరణాలు. ప్రోగుచేసుకున్న బట్టి కాదు. త్యాగం చేసిన దాన్ని బట్టి వ్యక్తులు గొప్ప వారవుతారట. త్యాగం చేయడం ఉన్నతుల లక్షణం. అందినంతవరకూ అందుకోవడం అధముల గుణం.

శాంతం, సహనం కలవారు ఎప్పటికీ వివేకవంతులే. వారి విజ్ఞానాన్ని కొలవడానికి యూనివర్శిటీలు డిగ్రీలు లేవంతే.

ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కిన గ్రూపులో సునంద్ కూడ ఉన్నాడు. అతను క్షేమంగా తిరిగివచ్చిన సందర్భంగా తామెవరికీలేని అదృష్టం, సునంద్‌కి కలిగిన శుభ ముహూర్తాన స్నేహితులందరూ పార్టీ పార్టీ అని గొడవచేశారు. ఆ గొడవతో ఆనంద్‌ని డబ్బు

అడిగాడు సునంద్. అతని దగ్గర డబ్బు లేక కాదు అన్న గారి దగ్గర లాగాలని. ఇద్దరి చెల్లెళ్ళ పెళ్ళికి రెండు ఎకరాలు అమ్మేసాడు ఆనంద్. మిగిలిన మూడెకరాలు ఇద్దరికీ చెరో ఎకరంన్నర వస్తుంది.

ప్రతీ సంవత్సరం పంటపొలాలలో ఎంతో పెట్టుబడి, అటు ఎన్ని యిబ్బందులు పడినా, వరదలో తుఫానులోవచ్చి పంటలు కొట్టుకుపోయినా అవన్నీ ఆనంద్ ఒక్కడే భరించేవాడు. తమ్ముడ్ని ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం నీవాటా డబ్బు తీసేసుకోరా అనేవాడు అబ్బే వద్దన్నయ్యా నీ దగ్గర డబ్బు తీసికొనడమేమిటి అంటూనే ఆదాయానికి రెట్టింపు డబ్బు అన్నదగ్గర ఏదో వంకన గుంజడం, అన్నయ్యతో గుంజీలు తీయించడం అలవాటు చేసికున్నాడు సునంద్. ఈ పద్ధతే అతనికి లాభదాయకంగా ఉంది. తన చదువుకి చెల్లెళ్ళ పెళ్ళికి అయిన ఖర్చులు, యింటికి పెద్దవాడు కాబట్టి అన్నయ్యే భరించాలి. ఆ విషయంలో అన్నగారు రాద్ధాంతం చేయదలుచుకోలేదు. బాధ్యతలను, బాధలను ఆనందంగానే స్వీకరించాలి.

ఆ రాత్రి వీధిగదిలో సునంద్, స్నేహితులతో ఆనందంగా పార్టీ చేసికుంటున్నాడు. ఆ పార్టీకి కావలసిన డబ్బు కోసం గాజు కుదువ పెట్టిన సుగుణచేతులు బోడిగా ఆనంద్‌కి తాంబులం అందించాయి. ఎడంచేతికి యింకొక్క గాజు మాత్రం మిగిలింది. మిగిలిన ఆ ఒక్క బంగారు గాజుని సవరిస్తూ "నీవు ఏ అవసరం కొద్ది మార్వాడి దగ్గరకు పరుగెడుతావో" అని అనుకున్నాడు ఆనంద్ భార్య కళ్ళలోకి బాధగా చూస్తూ. అతని కళ్ళల్లో చెల్లెళ్ళు మెదిలారు. వారి ఆడబడుచులను శత్రువులుగాను చూసేవారు, అన్నగారి దగ్గర అన్ని లాంఛనాలు గుంజుతారు. ఎప్పుడూ ఒంటినిండా నగలతో, పట్టుచీరలతో ఉండే చెల్లెళ్ళు గుర్తుకి రాగానే చెల్లెళ్ళపై ఈర్ష్యకలగ లేదు ఆనంద్‌కి. వారు ఆ స్థితిలో ఉన్నందుకు సంతోషమే కలిగింది. కాని భార్యను తలచుకొని మనసంతా జాలితోనూ, కృతజ్ఞతతోను నిండిపోయింది.

కాని సుగుణ మాత్రం తన కుటుంబం కోసం, భర్త సంతోషం కోసం అదొక బాధ్యతగా భావిస్తుంది కాని కించిత్ అయినా బాధ పడదు. పరోపకారం గురించిగాని, నీతి వాక్యాలుగాని ఆమె చిన్నప్పుడు చదువుకోలేదు, కాని ఎవరిలోను లేని పరోపకార బుద్ధి నీతి శుద్ధిలామెలో వున్నాయి. ఆ యింటికి ఆమె కోడలిగా వచ్చింది. నిచ్చెనలా ఉపయోగపడింది. ఆమె నేల మీదనే ఉండిపోయింది.

"సుగుణా, నిన్ను చాలా బాధ పెడుతున్నాను కదూ" వేదనతో నిండిన గొంతుతో అన్నాడు.

"భలేవారే! మీ సంతోషమే నా సంతోషం ఈ నగలు కొంచెం అందాన్నీ పెంచితే పెంచవచ్చుగాని ఆనందాన్ని పంచలేవుగా? మీరు సంతోషంగా ఉంటే నాకంతేచాలు.

అదే నాకు సంతృప్తి మీరు మనసుని చంపుకొని అప్పుల కోసం వెళ్ళే బదులు నా వస్తువులు మీకు ఆ శ్రమను తప్పిస్తే నాకు అంతకంటే ఏం కావాలి చెప్పండి. మీరేమి బాధ పడకండి అని ఓదార్చింది.

భర్తకు అంతకంటే మంచి భార్య ఎక్కడ దొరుకుతుంది, సుగుణ మనసుని మంచితనాన్ని దేనితో పోలిస్తే సరిపోతుంది. ఎప్పుడు ఎత్తిపొడుపులు, ఎడమొహం పెడమొహంగాని లేని ఆ యింట్లో ఆ దంపతులు హాయిగా ఉన్నారు. డబ్బు లేకపోయినా ఆర్థిక యిబ్బందులకు తట్టుకోలేకపోయినా.

బయటగదిలో గ్లాసులు సీసాలు గలగల లాడుతున్నాయి, లోపల సుగుణ బోడిచేతులు మట్టిగాజులతో గలగల లాడుతున్నాయి. ఆ రెండు శబ్దాలకి ఆనంద్ మనసు గిలగిలలాడుతోంది కాని ఆ గాజుల శబ్దాన్ని జల తరంగిణి లాగే భావించింది సుగుణ. సంతృప్తిని మించిన సుఖం ఏముంది ఎక్కడ ఉంది. ఎక్కడో లేదు ఎదలోనే ఉంది.

హైదరాబాద్‌లో సునంద్ బ్యాంక్ బ్యాలన్సు పెరుగుతున్నాయి. ఇక్కడ ఆనంద్ అప్పులు పెరుగుతున్నాయి. సునీత, అనిత అప్పుడప్పుడు హైదరాబాద్ చూడాలనే ఉద్దేశంలో చిన్నా దగ్గరకు వెడతారు. ఒంటరి వాడు కాబట్టి హోటల్లోనే భోం చేస్తారు. వారి ఖర్చుతోనే వెళ్ళేటప్పుడు మాత్రం సునంద్ తప్పక చెల్లెళ్ళకు పట్టుచీరెలు కొంటాడు. అదీ అన్నగారి దగ్గర ఏదో వంకన డబ్బులాగి మాత్రమే. ఆ పట్టు చీరలు చూసి ఎంత మురిసి పోతారు వారు పెద్దన్నయ్య చిన్నప్పటి నుంచి పెంచి పెళ్ళి చేసిన జోరు పురుళ్ళు పోసిన పద్ధతి ఏమి గుర్తురావు వారికి చిన్నన్నయ్య పెట్టిన పట్టుచీరే వారు పదిలంగా చూసుకుంటారు. పవిత్రంగా భావిస్తారు. అన్నయ్య ఎయిర్‌పోర్టు చూపిస్తే విమానం ఎక్కి ఊరేగినంతగా భావించి మురిసిపోతారు. పెద్దన్నయ్య దగ్గరకు అవసరాలు తీర్చుకోడానికి మాత్రమే వెళ్ళి లాంఛనాల పేరుతో మరింతలాగి వచ్చేస్తారు, పైగా ఆ పల్లెటూరిలో బోరుబాబు, చిన్నన్నయ్య త్వరగా పెళ్ళి చేసికుంటే బావుణ్ణు శలవులకు హైదరాబాదు రావచ్చు అని అనుకుంటారు, చిన్నన్నయ్య మనస్తత్వం వెనుకనున్న నీచత్వం వారికి అర్థం కాదు. అర్థం చేసుకొనడానికి ప్రయత్నించరు కూడ. ఇత్తడిని కేజీ చింతపండుతో తోమినా ఒకరోజు మెరుస్తుంది, రెండురోజులు మెరుస్తుంది. మూడవ రోజు యధావిధిగా మారిపోతుంది. బంగారం అలా కాదు మెలికతిరిగినా మట్టిలో పెట్టినా విలువ తరగదు, మెరుపుపోదు.

పెద్దన్నయ్య అమలాపురంలో ఆప్యాయంగా పెట్టిన తాటి ముంజులు, కొబ్బరి బొండాలు కన్నా, చిన్నన్నయ్య చూపించిన మ్యూజియమ్ గొల్కొండలకే వారు ప్రాధాన్యతనిస్తారు. మొదటి దానిలో అనురాగం ఉంటే రెండవ దానిలో ఆడంబరం

ఉంది. ఆనంద్ వారికి తన రక్తాన్ని ధార బోసి వారి జీవితాలను పూలబాట చేసాడు. సునంద్ పై పై కబుర్లతోనే వారికి కడుపు నింపేసాడు. మంచి నీళ్ళు దాహం తీరుస్తాయిగాని ఆకలి తీర్చవు అని వారు గ్రహించుకోలేదు!

ఒక్కొక్కసారి నేను చేతగాని వాడిని దాని బంగారం అంతా అమ్మేస్తున్నాను అంటాడు ఆనంద్. ఆ మాటలకు అడ్డుపడి చేతకాని వారు కాదు చేవున్న వారు కాబట్టే మీ తమ్ముడికి చెల్లెళ్ళకు మంచిజీవితాన్ని ప్రసాదించారు. తోబుట్టువులను, పట్టించుకోకుండా తమ స్వార్థంతాము చూసుకునేవారే అసలయిన చేతకానివారు. మీరెందుకు అవుతారు అంటుంది సుగుణ. ఆమె కొవ్వొత్తిలా కరిగిపోతున్నా చిరునవ్వులు చెరగనీయదు అంతటి మహోన్నత వ్యక్తి. ఒంటినిండా బంగారం ధరించిన ఏస్త్రీకి సాటివస్తుంది. ఏ పడతికి సమాన మౌతుంది. ధనం ఈ రోజు ఉండవచ్చు రేపు పోవచ్చు. కానీ మంచితనం మనకి ఎప్పుడు తోడుగా ఉంటుంది. అది ఎవరూ దొంగిలించలేనిది కూడ.

అన్నయ్యా అంటూ రాగాలు పోతూ వదిన వంటి మీద బంగారం కొంత కరిగించేసాడు సునంద్ స్వార్థంతో. మేం ఆడపిల్లలం, మా పెళ్ళిళ్ళ సంగతేమిటి? అని ప్రశ్నించకుండా కొంత పొలానికి, మరి కొంత బంగారానికి కాళ్ళువచ్చాయి, ఆ ఇంటిలో వాళ్ళు అత్తవారిళ్ళకు ఆలోటు లేకుండా వెళ్ళారు. అనిత సునిత వాళ్ళ అత్తింటి వారు తల్లి దండ్రిలేని పిల్లలని వారినేమి అనరుగాని, వాళ్ళు వచ్చేది ఎందుకు వదులుకోవాలి అని పెద్దన్నగారిని అడిగి పట్టుకెళ్ళుతుంటారు. అమ్మానాన్నలు సంపాదించిన 5 ఎకరాలు ఉన్నదని వారి ధీమా అది పిల్లల్ని పెట్టడం లేదని పెళ్ళిళ్ళకు రెండెకరాలు అమ్మి వేయవలసి వచ్చిందని వారికీ తెలుసు. అప్పుడప్పుడు పంటలు పండవని కూడ తెలుసు. సునంద్ ఎప్పుడు తనని ఆ వస్తువు లేదు ఈ వస్తువు లేదు అని అన్నగారికి ఫిర్యాదు చేసి, గారాముపోయి అన్నగారితో కొనిపించుకుంటాడు గాని అన్నగారికి ఉన్నవి రెండే జతలనిగాని అన్నగారు ఎలా తింటున్నారో ఎలా ఉంటున్నాడో అనిగాని గ్రహించడు.

తమ్ముడు సిటిలో ఉద్యోగం చేస్తున్నాడు. మంచిగా ఉండకపోతే ఎలా అని పట్టెడు జాలి కురిపిస్తాడు తమ్ముడిమీద. ఆ జాలే సుగుణ మెడలోని బంగారాన్ని బలి తీసుకుంటుంది. ఆ దంపతులు మంచితనానికి ఫలితం వంచనకే అనుభవిస్తున్నారు పైగా ఏమీ తెలియని వారిలా మసలుకొంటున్నారు.

తమ్ముడు హైదరాబాదు వెళ్ళి పోతున్నాడు, పండక్కి వుండమంటే వుండడం లేదు అందుకే ఆనంద్ తమ్ముడికి బట్టలు కొనాలనుకున్నాడు. ప్రతీ సంక్రాంతికి సునంద్‌కి, అనితకి, సునీతకి తప్పక బట్టలు కొంటాడు ఆనంద్. సుగుణకీ, తనకీ లేక పోయినా అమ్మా నాన్న ఉంటే మరింత గారంగా చూసేవారు కదా ప్రతి పండక్కి

బట్టలు కొనేవారు కదా అని ఆనంద్ భావిస్తాడు, నిజానికి అమ్మానాన్నను పోగొట్టుకొని ఆనందు లాంటి అన్నయ్యను పొందిన వారెంతో అదృష్టవంతులు, తల్లిదండ్రులు ఉన్నా అంత బాగా చూడలేక పోయేవారు ప్రేమలేక కాదు. ఆర్థిక యిబ్బందులు వలన, తన సుఖం చూసికొని ఆనంద్ ఎప్పుడూ తమ్ముడు, చెల్లాయిల సుఖం గురించే ఆలోచిస్తాడు. సుగుణ ఒంటిమీద రెండు వస్తువులు మార్వాడి దగ్గరకు వెళుతుంటే మరో వస్తువు పుట్టింటివారు పెడుతుంటారు. ఆమెకు వస్తువులన్నీ మొదట కుదువకే వెళతాయి. తరువాత విడిపించుకోవచ్చు అనేవాడు ఆనంద్. కాని అవి చివరికి అమ్మేయవలసి వచ్చేదికాని, ఏనాడు విడిపించేశక్తి సంపాదించ లేక పోయాడు ఆనంద్.

ఆనందు, సునందు బజారులో నడుస్తున్నారు. సునంద్ చదువు ఏనాడు స్థిరంగా చదవలేదు. బి.ఎ. అయిన తరువాత బి.ఎల్ అన్నాడు. దానికి అన్ని ఫీజులు కట్టి, కాలేజీలో చేర్పించిన తరువాత బి.ఎల్ వద్దు ఎమ్.ఎ చేస్తాను అన్నాడు. అన్నగారు తమ్ముడు అడిగిన కోరికను ఏనాడు "వద్దు" అనే రెండక్షరాల పదంతో నిరుత్సాహ పరచలేదు. బహుశా ఆ పదం ఆనంద్‌కి పలకడం రాదేమో.

ఎమ్.ఎ అయిన తరువాత ఢిల్లీ వెళ్ళి ఎమ్.ఫిల్ అన్నాడు. పి.హెచ్.డి. అన్నాడు. కాని ఏ డిగ్రీ లేకుండా, డబ్బంతా వృధా చేసి వెనక్కి వచ్చి, హైద్రాబాదులో ఉద్యోగంలో స్థిరపడ్డాడు. ఆ చదువుకి అయిన ఖర్చుకి లెక్కవేస్తే చిత్రగుప్తుని చిట్టా తయారయ్యేదే. పట్టాలు ఏమీ అతనికి రాకపోయినా ఆ డబ్బు గురించి ఆనంద్ ఏనాడు పట్టించుకోలేదు తమ్ముడ్ని రెట్టించనూలేదు.

అన్నదమ్ములిద్దరూ బజారులో నడుస్తున్నారు. ఇంతలో ఒక కుష్టురోగి అడుక్కుంటూ వారిదారికి అడ్డుపడుతున్నాడు. చిల్లర కోసం జేబులో చేయిపెట్టి వెతుకుతున్నాడు ఆనంద్. ఇంతలో ఆనందు అనుకోని సంఘటన జరిగిపోయింది. దూరంగా వెళ్ళమన్నా వెళ్ళని ఆ కుష్టురోగిని బలంగా ఒక్క తన్ను తన్నాడు సునందు. అంతే అతను వెళ్ళి అల్లంత దూరాన పడ్డాడు.

ఆనందు హతాశుడై ఆశ్చర్యంగా తమ్ముడి వైపు చూసాడు నమ్మలేనట్లు. తమ్ముడిలో వింత ప్రవర్తన అతనికి ఆశ్చర్యాన్నే కాదు అసహ్యాన్ని కూడా కలిగించింది. ఆ సమయంలో మొదటి సారి ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన సునంద్ కాళ్ళు ఒక రోగిని అవతలకు నెట్టాయి. అతని తలనుండి రక్తం కారుతుంటే ఆనంద్ హృదయం గిలగిలలాడింది.

ఎందుకురా అలా చేశావు అంటూనే రిక్షాను పిలిచి ఆ కుష్టురోగిని హాస్పిటల్‌కు తీసికెళ్ళాడు. అతను రోగిస్తే అయినా ఒక మనిషి బ్రతుకుపై తీపి ఉన్న మామూలు మనిషి అని అతని భావన.

అన్నయ్యా నీవుండు వాళ్ళకు అలాగే కావాలి. ఈ అడుక్కునే వాళ్ళను రోగిస్టువాళ్ళను షూట్ చేసేస్తేగాని మనదేశం బాగుపడదు. వెధవ ఇండియా దేనికి పనికిరాకపోయినా అడుక్కునే వాళ్ళను పెంచడానికి పనికి వస్తుంది అన్నాడు. ఆనంద్ తమ్ముడిని చెల్లిళ్ళను ఆదుకోకపోతే వారి ఆస్తి ఏ మామయ్యలో చిన్నాన్నలో అపహరిస్తే వారేం అయిపోయివుండే వారో అనే ఆలోచన సునందుకి రాదు వెధవ ఇండియా అంటూ రోజు తిట్టే సునంద్ ఇండియాలోనే బ్రతుకుతున్నాడు. కన్నతల్లిని ఉన్న దేశాన్ని చీదరించుకునే మనిషి ఎవరెస్టు ఎక్కితే ఏం గొప్ప.

సునంద్ కాళ్ళలో కండబలంతో ఎవరెస్టు ఎక్కివచ్చాడు కాని ఆనందు మంచిమనసుతో మానవత్వంతో ఆ పర్వతం ఎక్కలేక పోయినా ఆకాశాన్ని అంటివచ్చాడు కాని అది ఎవరికి కనబడదు. ఆ రోజు సుగుణ చేతికున్న చిట్టచివరి గాజు మార్వాడి దగ్గరకు పాత వస్తువులున్న చోటికి వెళ్ళిపోయింది. ఆ రోగి ట్రీట్‌మెంట్ కోసం ఆనందు సుగుణలకు ఏ మాత్రం బాధలేదుపైగా అది మంచికీ ఉపయోగపడినందుకు చాలాతృప్తి గా ఉంది.

(జయశ్రీ, నవంబర్ 88)

☆ ☆ ☆

# భయం

వెలుగును మింగి ఇంకా ఆకలి తీరని బెబ్బులిలా చీకటి ఊరంతా పరుచుకుని వుంది. భయం బోర విడుచుకుని వాడవాడలా సంచరిస్తుంది.

వీధిలో పిట్టలేదు. కదలడానికి సాహసించే చెట్టులేదు. అంధకారాన్ని అలంకరించుకున్న ప్రకృతి, నల్లని చీకటి అంధకారం క్రింద నలిగిపోతూ సూర్యదేవుని ఆగమనానికి ఆత్రపడుతుంది.

ఉమ తలుపులన్నీ ఒక్కసారి సరిగా వున్నాయోలేదో, వేసానో లేదోనని మరలా చూసుకోవడం అది పదవసారి. ఎన్నిసార్లు చూసుకున్నా అదృశ్యశక్తి ఏదో ఆ తలుపులను తెరచి తనను కబళించి వేస్తుందనే భయం హృదయాలనుండి తొలగడంలేదు. ప్రక్కింటివారి అమ్మాయి లత తన భర్త స్థానంలో తన మంచం మీద ఆదమరచి ఒళ్ళు మరచి నిద్రపోతోంది.

భర్త రామం కేంపుకెళ్ళాడు. అతను కేంపుకెళ్లడం, తను ఒంటరిగా పడుకోవడం గత పదేళ్ళుగా జరుగుతున్నదే అయినా ఇప్పుడు పరిస్థితి మారింది. భర్త ఉన్నప్పుడు తెలివి తప్పినట్లు నిద్రపోయే ఉమ, భర్త ఊరిలో లేనప్పుడు కళ్లు తెరుచుకుని ఆలిచిప్పల్లా వుంచి పడుకుంటుంది. భర్తే నిద్ర మాత్ర ఆమెకు. అందుకే భర్త లేనప్పుడు నిద్రరాదు.

రాత్రి పన్నెండయింది. గడియారం టిక్కు టిక్కు మనకపోయినా ఉమ హృదయం గడియారంలాగే శబ్దం చేస్తోంది. ఈ శబ్దాన్ని మరపిస్తూ గజ్జెల శబ్దం మెల్లమెల్లగా దగ్గరకు రాసాగింది. ఒళ్లంతా చెమటతో తడిసిపోయింది. గుండెను గుప్పెటలో దాచుకోవాలన్నంత భయం.

ప్రక్కన లత వున్నా భయం తగ్గడం లేదు. గత నెల్లాళ్లుగా అవే చప్పుళ్ళు. ఆ ఇంటిలోకి వచ్చి ఏడాది అయింది. ఇంటివాళ్ళు ఎక్కడో వుంటారు. ప్రక్కింటి వాళ్ళు ఉమను కన్నబిడ్డలాగే చూసుకుంటారు. లత అక్కా అక్కా అంటూ రామం లేనప్పుడు తన వెనకే వుంటుంది.

దూరం నుండి తెల్లని దుస్తులలో స్త్రీ పరుగెడుతున్నట్లు, వుండి వుండి వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు, కిటికీలో నుండి కనబడుతుంది. అంత అర్ధరాత్రి ఆడది బయట తిరుగుతుందా! ఆ తలపు రాగానే ఉమ గొంతు తడారిపోయింది. ఎవరో గొంతును నులుముతున్నట్లు భ్రమ. ఊపిరాడకుండా చేస్తున్నట్లు అశాంతి.

ఆ విషయం భర్తతో మొదటి నుండి చెబుతున్నా నాస్తికుడైన రామం అసలు పట్టించుకోలేదు. "ఇన్ని సంవత్సరాల నుండి నీవు ఒంటరిగా పడుకోలేదా" అంటూ



అడిగాడు. పిల్లలు లేకపోవడంతో ఒంటరితనమే తన స్నేహం, పిల్లలు, సహచరులు అయిపోయారు. తనకు వినిపించే చప్పుళ్ళు, తలుపు తడుతున్నట్లు వుండే శబ్దం. స్త్రీ ఏడుపు వీటన్నిటి గురించి ప్రక్కవాళ్ళతో చెబితే వాళ్ళు కాస్త అర్థం చేసుకున్నారు.

'మీరు రాకముందు ఇక్కడ ఒక అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. ఆశలు తీరక చనిపోయింది. బహుశా ఆ అమ్మాయే తిరుగుతుందేమో, బ్రతికున్న వాళ్లను చూసి భయపడాలిగానీ, చనిపోయినవాళ్లు మనల్నేం చేస్తారు. కావాలంటే రామం ఊరిలో లేనప్పుడు మా లతని పడుకోబెట్టుకో అన్నారు. అలాగే పడుకోబెట్టుకుంటుంది. అయినా భయం తగ్గడం లేదు. భర్త ఊరిలో ఉన్నప్పుడు ప్రశాంతంగా నిద్రపోతుంది. ఆ రాత్రి ఏం జరిగేది కూడా ఉమకు తెలియదు.

మెయిన్‌గేటు తాళం పక్కింటి వాళ్ల దగ్గర ఉంటుంది. గోడకే కాలింగ్ బెల్ ఉంటుంది. రామం మధ్య రాత్రిలో కేంప్ నుండి వస్తే లత వాళ్ల నాన్నగారే తలుపు తీసి లతను పక్కింటికి పిలుచుకుపోయారు రామం రాగానే. లత అందంగా, అమాయకంగా వుంటుంది. ఉమను అక్కా అని పిలిస్తే ఎంతో ఆనందంగా ఉంటుంది ఉమకు.

ఉమకు రాత్రయ్యేసరికి రోజురోజుకి భయం ఎక్కువైపోతోంది. ఆ శబ్దాలూ, గజ్జెల చప్పుళ్లు, ఏడుపులు ఆమెకు కీకారణ్యంలో, జంతువుల మధ్య తాను ఒంటరిగా వున్నట్లు భావించుకుంటుంది. తలపులే పులులై తన మీద దూకుతున్నట్లుగా అనిపిస్తుంది. ఆ గది మృత్యుగృహంలా, మంచం శ్మశానవాటికలా, పరుపు శవపేటికలా కనిపిస్తుంది.

లత తల్లిదండ్రులు చాలా మంచి వారు. ఎవరో భూతవైద్యుడ్ని తీసుకుని వచ్చి ఏవేవో చేయించారు. ఉమకు ఎంతో ధైర్యం చెబుతూనే వున్నారు. అయినా ఉమలో భయం తగ్గడం లేదు.

రామానికి చెబితే ఉమ మీదే విరుచుకుపడుతున్నారు. కాంపులతో అలసిపోయి ఇంటికి వస్తే ఒక సరదా లేక ఇలా భయం పరదా వేసుకుంటావు అని విసుక్కుంటున్నాడు. ఉమకు అయోమయంగా వుంది.

రామం ఊరిలో లేనప్పుడు నిద్ర మాత్రలు వేసుకున్నా, నిద్రరావడంలేదు. రాత్రిళ్లు కనిపించే దెయ్యం తనను రా! రా! అని పిలుస్తున్నట్లే వుంది. తను చనిపోయిందా! ఆ దెయ్యంలాగే తను మరో దెయ్యమై అందరినీ ఏడిపిస్తుందా! ఆ ఊహ రాగానే శరీరమంతా వణకడం ప్రారంభించింది.

ఉమ భర్తతో మరో ఇల్లు చూడమని పోరు పెట్టడం మొదలుపెట్టింది. లత నాన్నగారు నారాయణగారు వేరే ఇల్లు చూసుకుంటున్నారని తెలిసి 'వద్దు తల్లీ' ఎక్కడకూ వెళ్లవద్దు. ఇక్కడే వుండండి. ఈ ఇల్లు చాలా మంచిది. ఈ ఇంట్లో వున్నవాళ్లందరూ తల్లులయ్యారు. చంటిబిడ్డలనెత్తుకున్నారు. కొత్త ఇల్లు కట్టుకున్నారు. నీ కడుపు పండేవరకు ఇక్కడే వుండండి అని ఎంతో చెప్పాడు. ఎంత చెప్పినా ఉమకు ధైర్యం చాలడంలేదు. రాత్రి అవుతుందంటే భయం. చీకటిని చూస్తే నీరసం, గుండె దడ, కాళ్లు వణుకుడు. పులి కోరల్లో చిక్కుకున్న మేక పిల్లలా గిలగిలలాడిపోతుంది ఆ ఇంట్లో.

భర్త ఎంత చెప్పినా వినకపోయేసరికి తానే ఇళ్ల వేట ప్రారంభించింది. ఆఖరికి ఒక ఇల్లు ఫిక్స్ చేసేసింది కూడా. ఆ ఇల్లు ఎలాంటిదో కనుక్కుంది. ముందే ఆ చుట్టప్రక్కల ఈ మధ్య ఎవరూ చనిపోలేదని నిర్ధారించుకున్నా తరువాతే ఇల్లు మారింది ఉమ.

లత, లత తల్లిదండ్రులు ఉమ వెళ్లిపోతుంటే బిక్కమొహం వేసారు.

మరో వారం తరువాత లతను చూడాలనిపించి వచ్చింది ఉమ. నారాయణగారు అన్నారు.

"ఉమా! నన్నొక విషయంలో క్షమించమ్మా. ఆ దయ్యంలా యాక్ట్ చేసి నిన్ను బెదిరించింది నేను. కారణం ఏమిటి అంటావా! రామం మా లత వెనకపడడమే. నీకు చెప్పలేక పోయాను.

అది అసలే అమాయకురాలు. ఎప్పుడైనా లొంగిపోవచ్చు. ఇది మా సొంత ఇల్లు. మేము కదలలేం. అందుకే నీవే ఇల్లు మారిపోయేటట్లు చేసాను. నీ భర్తను ఒక కంట కనిపెట్టుకో తల్లీ!" అన్నారు.

ఈసారి దెయ్యం రూపం భర్త ప్రవర్తనలో కనబడి భయం ఇంకా ఎక్కువయింది ఉమలో. కానీ ఈ భయం వెనుక ఒక ధైర్యం వుంది. భర్తను దారిలోకి తెచ్చుకోవాలనే తెగువ వుంది.

(ఆంధ్రభూమి వీక్లీ, నవంబర్ 88)

★ ★ ★

# సమస్య

"రేఖా! రేఖా!"

"ఆ... ఆ... వస్తున్నా ఏమిటండి?"

"నీకో గుడ్ న్యూస్. ఏమిటో చెప్పుకో చూద్దాం"

"ఏమై ఉంటుందబ్బా! నాకుగాని ఉద్యోగం వచ్చిందా! వచ్చినా ఆర్డర్స్ ఇంటికి రావాలిగా"

"అదికాదోయ్, ఇంక నీవు ఆర్డర్స్ కోసం ఎదురు చూడాల్సిన పనిలేదు."

"అయితే తెలిసిపోయింది, మీకు లాటరీ తగిలి ఉంటుంది"

"లాటరీ లాంటిదే అనుకో. నీకు నాటకాల సంగతి తెలియదు. పెద్దగా ఇంట్రెస్టు లేక నీవు వాటిని చూడడానికి రావుగాని, ఈ రోజు నా నటన అదిరిపోయిందని అందరూ ఏక కంఠంతో అరిచారు."

"అదే నా శుభవార్త?"

"ఉండుమరి. అనుకోకుండా నాటకాన్ని ఒక ప్రొడ్యూసరు చూడడం జరిగింది. నన్ను సినిమాల్లో బుక్ చేసుకుంటానన్నారు."

"అయ్యో అదా సంగతి."

"అదేం? అలా నీరుగారిపోయావు. ఎగిరి గంతేస్తావనుకున్నాను."

"ఊ. చాల్లేండి. నాటకాల వంకన ఇప్పటికే ఇల్లు సరిగా చేరడం లేదు. ఇంక సినిమాల్లోకి వెళితే..."

"రేఖా, నీకు సంతోషంగా లేదూ, మనకిక ఎకనమికల్ ప్రాబ్లమ్స్ ఉండవు."

"అవి ఉండవుగాని, మిగిలినవి చాలా ఉంటాయి."

☆ ☆ ☆

"రేఖా. నేను మద్రాసు వెళుతున్నాను. పదిరోజుల్లో వచ్చేస్తాను."

'మీకు ఈ సినిమాలు ఎందుకండీ? ఉన్న ఊరిలో ఇద్దరం ఉద్యోగం చేసికుంటే హాయిగా బ్రతకలేమా?"

"అదే వద్దంది. సిరి వచ్చి తలుపు తడితే, తలుపులు బిడాయించుకొని కూర్చోమంటావా? దేవుని దయ వలన సినీఫీల్డులో నిలదొక్కుకోగలిగితే ఇంక చూడు మన జీవితం మూడుపువ్వులు ఆరుకాయలు.

"నాకంట్లో మీ కోసం కాయలు కాస్తా."

"ఎందుకు? అందరం మద్రాసు మకాం మార్చేస్తాముగా"

☆ ☆ ☆

"ప్లీజ్ రేఖా, నేను చెప్పేది విను అర్థం చేసుకో"

"ఏమి అర్థం చేసుకోవాలండీ! మీపేరు మార్చుకున్నారు. నాకు అభ్యంతరం లేదు. కానీ, మీకు ఇంకా పెళ్ళికాలేదని, పెళ్ళిఅయిందని తెలిస్తే హీరో ఇమేజ్ దెబ్బతింటుదని ఎవరో సలహా ఇచ్చారని అబద్దం ఆడతారా మీకు మనసెలా ఒప్పిందండి?"

"ఒప్పలేదనుకో. నా అర్ధాంగివి నీవే అర్థం చేసుకోకపోతే నన్ను ఇంక ఎవరు అర్థం చేసుకుంటారు చెప్పు? పైకి వెళ్ళాలంటే మరి ఇలాంటివి తప్పవు. నా జీవితాశయం నెరవేరే సమయంలో నీవు అడ్డుపడతావా? రేఖా, మరలా ఇలాంటి అవకాశం మనకు వస్తుందంటావా? కొన్ని సినిమాల్లో నటించి పేరు తెచ్చుకున్న తరువాత అప్పుడు మెల్లగా నిన్ను అందరికీ పరిచయం చేస్తానులే. ఈలోపుగా పిల్లల్ని ఊటిలో చేర్పుదాం."

"బాబోయ్ వాళ్ళులేక. మీరూ సరిగ్గా రాక నేను ఉండలేనండి."

"మీ అమ్మ తోడుందిగా"

"నాకు కావలసింది అమ్మ కాదండి. నా పిల్లలకు అమ్మగా నేను తోడుండడం."

"నా బంగారు తల్లివికదూ! పరిస్థితులు అర్థం చేసుకోడానికి ప్రయత్నించు. పిల్లలు నీ దగ్గర ఉంటే మన విషయం తెలిసిపోతుంది. నిన్ను మద్రాసు తీసుకెళతానుగాని, నా భార్యగా చెప్పను."

"ఎంత ఖర్మ వచ్చిందండి?"

"ఆ ఖర్మే మన పాలిట కల్పవృక్షం."

☆ ☆ ☆

"ఏమండి, మీరు ఏక్ట్ చేస్తున్న షూటింగ్ చూడాలని ఉందండి"

షూటింగ్‌కి వస్తావా? సరేగాని ఒక అభిమానిలా, మనకు ముందు పరిచయం లేనట్లు రావాలి"

"మీ భార్యనై ఉండి, మీ పిల్లలకు తల్లినై ఉండి అనామకురాలిగా రానా?"

"ప్రతీదానికి అలా అర్ధాలు తీయకు. ఈ రెండు సంవత్సరాలలో ఎంత పేరు, డబ్బు వచ్చిందో చూడు. అసలు ఇలాంటి జీవితం కలగన్నామా"

"అవును ఇలాంటి ఎడబాటు జీవితం కలగనలేదు. ఇద్దరం హాయిగా కలిసి ఉందామనుకున్నాం. షూటింగుల వంకన మీరు రోజులతరబడి వేరే ఊరిలో ఉంటారు. పెళ్ళాం, పిల్లలు అక్కరలేదు. అభిమానులకు, సినీఫీల్డ్కి మీరొక హీరో. నా జీవితానికి మాత్రం జీరో. సినిమాల్లో హీరోయిన్‌కి రక్షణ కల్పిస్తారు. విలన్లను, హీరోయిన్ జోలికి వస్తే చితకబాదుతారు. ఇక్కడ నేను వంటరిగా ఏ నిమిషం ఎలా ఉంటుందోనని బిక్కుబిక్కుమంటూ, మా అమ్మను తోడుగా పెట్టుకొని ఉండాలి. ఏదైనా ప్రమాదం జరిగితే ఆమె మాత్రం ఏం చేయగలదు? మగదక్షత లేని వాళ్ళం అయ్యాము. సినిమాల్లో హీరోయిన్‌ని క్షణం విడిచి ఉండలేని మీరు, నాతో క్షణం గడపలేకపోతున్నారు. నేను గడపదాటి రాలేకపోతున్నాను."

"అయామ్ సారీ రేఖా. బయట తిరిగే మగవాడికి, పైగా ఉన్నత శిఖరాలు ఎక్కేవారికి బోల్డు సమస్యలు ఉంటాయి. మరి భార్యలే అర్థం చేసుకోవాలి."

☆ ☆ ☆

"ఏమండీ, ఈ పేపరులో వార్తలు చూసారా?"

"ఏమిటివి?"

"మీరు నాదగ్గరకు అప్పుడప్పుడు వస్తుంటే మన ఇద్దరికీ అక్రమ సంబంధం అంటగట్టారు. ఎంతటి దుస్థితి వచ్చిందండి కట్టుకున్న పెళ్ళాంతో తాళి కట్టిన మొగుడికి అక్రమ సంబంధం అంటగట్టించుకోవాల్సిన పరిస్థితి వచ్చింది. భగవంతుడా !"

"వాళ్ళు అలాగే రాస్తారు లెద్దూ?"

"మీకు ఇది ఆషామాషీగా ఉందా? నేనూ రేపటినుండి మీ చుట్టంలాగే షూటింగులకు వచ్చేస్తాను."

"అది అందరూ చూడడానికి బాగుండదు. పైగా నీవు ఎదురుగా వుంటే నేను సరిగా ఏక్షన్ చేయలేను. హీరోపోర్షన్ నుండి విలన్‌కి దిగిరావాలి"

"ఇప్పుడు మీరు విలన్ కాదేమిటి? సినిమాకు కాదులెండి. పెళ్ళానికి విలనే. అబ్బ చూడండి ఈ ఫోటోలు ఎంత దరిద్రంగా ఉన్నాయో. చూస్తేనే అసహ్యం వేస్తుంది. మిమ్మల్ని మరో ఆడది ముద్దు పెట్టుకుంటే ఆ సీన్‌లు చూస్తుంటే ఉరేసుకోవా లనిపిస్తోంది."

"తప్పు. మరో ఆడది నన్ను ముద్దు పెట్టుకోలేదు, కౌగిలించుకోలేదు"

"మరి ఈ ఫోటోలు?"

"నేనే ఆవిణ్ణి ముద్దుపెట్టుకొని కౌగిలించుకున్నాను" నవ్వుతూ అన్నాడు.

"మీకు నవ్వు ఎలా వస్తుందండీ. పైగా ఇది చూడండి. మీరు ఈ హీరోయిన్‌ని పెళ్ళి చేసుకోబోతున్నట్లు వ్రాసారు. నా గొంతు కోసేసారండి మీరు."

"మన వివాహం కాలేదనడం ఎంత తప్పో, అదీ అంతే తప్పు. సినిమా వాళ్ళమీద అలాంటి వార్తలు మామూలే. అందులో నిజాలు చాలా తక్కువ."

"మీరు మరీ అంతక్లోజ్‌గా ఏక్ట్ చేయడం బాగుండలేదు." "నాకూ బావుండలేదు. చేయకపోతే హీరో వర్షిష్ ఉండదు. హీరో అనే నా స్థానం నిలబెట్టుకోడానికి నాకు పెళ్ళి కాలేదని అబద్ధమాడకా తప్పలేదు. అలా క్లోజ్‌గా ఆడవాళ్ళతో ఏక్ట్ చేయడమూ తప్పలేదు. ప్రస్తుతం నెంబర్‌వన్ హీరోస్థానంలో ఉన్నాను. మరి దాన్ని భద్రంగా కాపాడుకోవాలి కదా!"

"ఏమండి, ఇప్పటికి సంపాదించింది చాలు. ఇంకా ఈ సినిమాలు మానేయ్యండి. పిల్లల్ని తెచ్చుకొని హాయిగా ఉందాం."

"తారా మండలానికి వెళుతున్న విమానాన్ని మధ్యలో వెనక్కు తిప్పేయ మంటావా? నా వల్ల కాదు."

☆ ☆ ☆

దినకర్ దినేష్‌గా మారి ఏడుసంవత్సరాలైంది. ఈ ఏడు సంవత్సరాలలోనూ హీరోగా చాలా పేరు తెచ్చుకున్నాడు. భార్యాబిడ్డల్ని అజ్ఞాతంలోనే ఉంచేసాడు.

ఊటీకి షూటింగ్‌కి వచ్చాడు దినకర్.

పిల్లలు అక్కడ ఉన్నారని తెలుసు.

షూటింగ్‌లో మంచి డ్యూయెట్‌లో యాక్టుచేస్తున్నాడు.

ఇంతలో ఎక్కడినుండో ఇద్దరు పిల్లలు "డాడీ" అంటూ పరుగెత్తుకువచ్చారు.

దినకర్‌తో పాటు అందరూ ఆశ్చర్యంగా వారివైపుచూసారు. అందరిముందు వాళ్ళను పిల్లలుగా అంగీకరించక తప్పలేదు. వాళ్ళను రహస్యంగా పంపింది భార్యేనని దినకర్‌కు తెలియదు. తెలిసే అవకాశమూలేదు.

ఆ మర్నాడు పెద్ద అక్షరాలతో పేపర్లో దినకర్ పెళ్ళి సంగతి, పిల్లల సంగతి పడింది.

అంతేకాదు దినకర్‌ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్న హీరోయిన్ మా ఇద్దరిదీ స్నేహం మాత్రమే అని ప్రకటించింది.

ఆ రోజు డైరీలో ఇలా వ్రాసుకుంది రేఖ "ఇంతకాలానికి నాకు తృప్తిగా ఉంది. ఆయన నటించవలసిన హీరోపాత్ర చేజారిపోయిందని, అంత బాధపడి అబద్ధాలు

ఆడితే నిజ జీవితంలోని భార్యపాత్ర, ఆస్థానం జారిపోతుంటే నేనెంత బాధపడాలి? ఎవరి స్థానాలను వాళ్ళు నిలుపుకోవడంలో ఇద్దరం తాపత్రయపడ్డాం. ఆడవాళ్ళు డబ్బుకే విలువ ఇస్తారు అని మగవాళ్ళు అనుకోవడం ఎంతపొరపాటు? నా మొగుడు నాకే స్వంతం అనుకోవడంలోనే ఆడదానికి ఎనలేని ఆనందం ఉంది. తొంభైశాతం మగాళ్ళు ఆ ఆనందాన్ని భార్యలకు అందనివ్వరు. మగవాడికి బయటి ప్రపంచంలో బోలెడు సమస్యలుంటే భార్యకు భర్తే ఒక పెద్ద సమస్య. భర్త అనే ఆ సమస్యను తెలివిగా ఆకట్టుకుంటూ, ఆటంకాల వరదలకు ఆనకట్టకట్టుకుంటూ! జీవితం నందనవనం చేసుకోవాలి! అని.

(ఆంధ్రభూమి మంత్లీ, నవంబర్ 1998)

★ ★ ★

# అసలు రహస్యం

విశాల్ మెడికల్ రిప్రజెంటేటివ్. విశాల్‌కు చాలామంది డాక్టర్లుతో పరిచయం ఉంది. ముఖ్యంగా ప్రయివేట్ నర్సింగ్ హోమ్‌లో వుండే డాక్టర్లతో మరీ ఎక్కువ పరిచయం, స్నేహం కూడా ఉన్నాయి విశాల్‌కు.

విజయవాడలో ప్రాక్టీసు చేస్తున్న జయంత్, గిరిధర్‌ల నర్సింగ్‌హోంలు ప్రక్క ప్రక్కనే వున్నాయి. ఇద్దరితోనూ ఉద్యోగధర్మాన్ని మించి సన్నిహితత్వముంది. విశాల్‌కు - ఆ రోజు ఎప్పటిలాగే ముందు జయంత్‌కు మందులు ఇచ్చేసి, ఆ తరువాత గిరిధర్‌కు ఫిజిషియన్ శాంపిల్స్ ఇవ్వడానికి వెళ్ళాడు - ప్రతి ఫిజీషియన్ శాంపిల్ మీద "అమ్మకానికి కాదు" అనే ముద్ర ఉందో లేదో జాగ్రత్తగా పరిశీలించి మరీ ఇచ్చాడు. జయంత్ ఎం.యస్ చేసి ప్రాక్టీసు పెట్టుకున్నాడు. అతనికి కేసులు అంతంత మాత్రంగానే వస్తాయి. వచ్చిన కేసుని పట్టిన పేషెంట్‌ని మాత్రం ఒకటి రెండురోజులు ఆలస్యం అయినాసరే జాగ్రత్తగా ఇంటికి పంపుతుంటాడు జయంత్.

గిరిధర్ ఆపరేషన్ చేసిన ప్రతి పేషెంటుని జయంత్ కంటే మరింత జాగ్రత్తగా చూస్తాడు. ఎందుకంటే గిరిధర్ ఎం.బి.బి.యస్ మాత్రమే చదివాడు - ఎం.ఎస్ చేసిన జయంత్ నర్సింగ్‌హోమ్ తన ప్రక్కనే ఉండడంతో పేషంట్ల విషయంలో మరింత శ్రద్ధ వహిస్తాడు గిరిధర్.

ఎప్పటిలాగే విశాల్, జయంత్‌కు గిరిధర్‌కు మందులు ఇచ్చేసి ఎదురుగా నున్న హోటల్‌లో కూర్చున్నాడు. అక్కడకు ఆ నర్సింగుహోమ్స్‌లోని పేషెంట్లుకూడ రావడంతో ఆ హోటలు ఎప్పుడూ బీజీగానే ఉంటుంది.

ఆ హోటల్‌లోనే జయంత్, గిరిధర్‌లపై కామెంట్స్ చాలామంది పేషెంట్లలా నోటినుండి యథాలాపంగా చాలాసార్లు విన్నాడు విశాల్.

జయంత్ ఎమ్.ఎస్‌లో గోల్డు మెడల్ వచ్చినవాడు చాల తెలివైన వాడని విశాల్‌కి తెలుసు.

పేషెంట్ల మాటల ప్రకారం జయంత్‌కంటే గిరిధర్ బాగా ఆపరేషన్ చేస్తాడని ఆ హాస్పటల్‌లో త్వరగా బాగయిపోవచ్చనే అభిప్రాయం ప్రజలలో వున్నట్లు గ్రహించాడు.

తనలాంటి మెడికల్ రిప్రజెంటేటివ్స్ ఇచ్చిన మందులు ఇద్దరు డాక్టర్లు పేషెంట్లకు అమ్మేస్తారన్న సంగతి ఎన్నోసార్లు తెలుసుకున్నాడు విశాల్ ఆ హోటల్‌లోనే.

ఒకరోజు జయంత్ తీరికగా ఉంటే తనమనసులోని అనుమానం బయటపెట్టాడు విశాల్.

జయంత్ ఒకటి అడుగుతాను, చెప్పు అడిగానని ఏమీ అనుకోవుగా. ప్రారంభించాడు మాటలు.

"ఏమీ అనుకోనులే అడుగు విశాల్" జయంత్ అన్నాడు. నీవు సర్జరీలో డిగ్రీ తీసుకున్నావు. గిరిధర్ వట్టి ఎం.బి.బి.యస్. తోనే నీ కంటే బాగా ఆపరేషన్లు చేస్తున్నట్లు వింటున్నాను అది ఎంత వరకు నిజం అన్నాడు.

జయంత్ నవ్వేసి ఊరుకున్నాడు. "ఏదో పెద్దవాళ్ళలో చేతి చలవ అనే మూఢనమ్మకం వుంది. గిరిధర్ విషయంలో అది నిజమని నమ్మమంటావా? విశాల్ అడిగాడు మరలా" చూడు విశాల్ కూచిపూడి నృత్య ప్రదర్శన జరుగుతుంటే ఏకొద్దిమందో వెళతారు డబ్బుకూడ ఎక్కువకాదు. కాబరే డ్యాన్సు చూడటానికి వందలకొద్ది వెళతారు. వేలకొలది డబ్బువస్తుంది. అంతలో కూచిపూడి నృత్యం విలువ తగ్గిపోయినట్లేనా?

"దానికి దీనికి సంబంధం ఏమిటి?"

"ఉంది కాబట్టే చెబుతున్నాను. ఇలాంటివి బయటకు చెప్పకూడదనుకో. నా దగ్గరకు వచ్చిన పేషెంట్ల కంటే గిరిధర్ దగ్గరకు వచ్చిన పేషెంట్లు త్వరగా బాగవుతారని ఆపరేషన్ బాగా చేస్తాడని నా కంటే ఎక్కువ సంపాదిస్తాడని అందరికీ తెలుసుకాని, ఎవరికీ తెలియని అసలు రహస్యం... నేను పేషెంటుకి డిసీజ్ ఉంటేనే ఆపరేషన్ చేసి, ఎంత క్రిటికల్ అయినా బాగుచేసి పంపుతాను. గిరిధర్ ఆపరేషన్ అవసరం లేక పోయినా ఏవోరెండుకుట్లేసేసి, అదేదో పెద్దజబ్బుని, నిరూపించి వాళ్ళను పంపిస్తాడు. అనగానే విశాల్ నోరు వెళ్ళబెట్టాడు.

(జయశ్రీ, ఏప్రిల్)

☆ ☆ ☆

# కాగితం పులి

నిర్మల, నాగేష్‌ల పెళ్ళి అయి పదేళ్లపైనే అయింది. పిల్లలు మాత్రం కలుగలేదు. మొదట పిల్లలు లేకపోవడమే హాయి అనుకున్న వారిద్దరికీ, రాను రాను ఆ సమస్య రాయిలాగ గట్టిపడిపోయింది. దాన్ని కరిగించే శక్తి వారికి లేదు.

నాగేష్ అయితే మగవాడు కాబట్టి హాయిగానే వున్నాడు. కాని, నిర్మల తనకు పిల్లలు లేకపోవడం శాపంలా భావించుకుని, కుమిలిపోసాగింది. దానికితోడు కొత్తగా భర్త, అత్తగారి సాధింపులు ఎక్కువయ్యాయి. హాస్పిటల్‌కు వెళ్ళి అన్ని పరీక్షలు చేయించుకుంది. నీలో లోపం లేదు, నీ భర్తను కూడ పరీక్షించాలి. ఒకసారి హాస్పిటల్‌కు రమ్మని డాక్టరుగారంటే, ఆ విషయం భర్తతో చెప్పింది. గయ్‌మని తాడంత ఎత్తున లేచాడు నాగేష్. మగవాడిలో లోపం ఏమిటి? లోపాలన్నీ ఆడదానిలోనే వుంటాయి అన్నాడు, కోపంగా.

నిర్మల నిస్సహాయురాలైంది. భర్త ఎన్నివిధాల చెప్పినా వినడని, తన బ్రతుకు ఇకపై అంతేనని ఇంకా దిగులు పడసాగింది. భర్త, అత్తగారు మాత్రం రోజు రోజుకీ సూటీపోటీ మాటలు ఎక్కువ చేశారు. అంతటితో ఊరుకోక కొత్త పదంకూడ మొదలుపెట్టింది. ఆ పదం పదునుగా నిర్మల గుండెల్లో గుచ్చుకుంది. మందులేని గాయం అయింది. ఆ పదం పేరు మరో పెళ్ళి. ఆ మాట వినగానే గజ గజ వణికిపోయింది నిర్మల. తాను చేయని నేరానికి శిక్ష పడబోతుంది. అదీ చిన్న శిక్ష కూడ కాదు. చాల పెద్దదే.

కొడుక్కి రెండవ పెళ్ళిచేస్తే ఆ రాబోయేకోడలికి పిల్లలు పుడతారా లేదా అని అత్తగారు ఆలోచించడంలేదు. నిర్మల వలన తమకు వంశాంకురం కలగడంలేదని మాత్రమే తలుస్తుంది. భర్తను బ్రతిమాలి, బ్రతిమాలి ఇంక లాభం లేదని అత్తగారిని వేడుకుంది, భర్తకు మరోపెళ్ళి చేయవద్దని. కాని ఆ ఇద్దరి గుండెలు కండకు బదులు బండతో చేయబడ్డాయి. అందుకే నిర్మల రోదన అరణ్యరోదన అయింది. ఎన్ని విధాల వారి మనసు మార్చాలని చూసినా వారు ఆమెను లెక్కచేయలేదు.

రెండవ పెళ్ళికి ఒప్పుకో, లేదంటే విడాకులివ్వు అని ఆమెను వేధించడం మొదలు పెట్టారు. ప్రతినెలా ఆమెకు భయమే. ఆ మూడురోజులు మరీ ఘోరమైన మాటలతో బాధిస్తున్నారు. భర్త హేళనపూరితమైన నవ్వు ఆమె భరించలేకపోతోంది. "భగవంతుడా, ఏదో విధంగా నన్ను తల్లినిచేయి స్వామి. ఆ తరువాత నేను చనిపోయినా ఫరవాలేదు నన్ను మాతృమూర్తిగా చనిపోనివ్వు. గొడ్రాలిలా వద్దు. అని దేవుడిదగ్గర ఏడ్చుకునేది. భర్త, అత్తగారు అంటున్నారని కాకపోయినా ఆమెకూ తల్లినవ్వాలనే కోరిక గాఢంగా

వుంది. తల్లి కాలేని బ్రతుకు వ్యర్థంగా అనిపిస్తుందామెకు. భర్తలోనే లోపం అని గ్రహించుకుంది. కాని ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి.

తనతప్పు తాను తెలుసుకొని భర్త ఎదుటివారిమీద నింద సులువుగానే వేస్తున్నాడు. ఆమధ్య నిర్మలకు తెలియకుండా హాస్పిటల్‌కు వెళ్ళి పరీక్ష చేయించుకొని వచ్చాడు. అతనికి పిల్లలుపుట్టరు అని తేలింది. ఆ విషయం భార్యకు తెలిస్తే, తేలిగ్గా చూస్తుందనే ఉద్దేశంతో ఆమె దగ్గర దాచి అహంకారంతో ఆమెను మాటలు అనడం మానలేదు.

పిల్లలులేని తల్లికూడా మనసున్న మనిషేననీ ఆమెను రోగిలా దూరంగా వుంచి ద్వేషించవలసిన పనిలేదని నాగేష్ గ్రహించడములేదు. ప్రతి స్త్రీ పిల్లలకోసం పరితపిస్తుంది. అదిలోకం అర్థంచేసుకోదెందుకో. ఇంట్లోవారే అర్థం చేసుకోనప్పుడు ఇక లోకానికి ఏం పట్టింది.

నిర్మల ఫ్రెండ్ ఒకామె డాక్టరుంది. ఆమెద్వారా భర్తలోని లోపమని తెలిసిపోయింది నిర్మలకు. తాను ఆ విషయం చెప్పినట్లు నాగేష్‌తో చెప్పవద్దంది డాక్టర్ వీణ. నిర్మల బాగా ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. కావాలంటే ఆ రిపోర్ట్సుద్వారా తానే భర్తను అవమానించి కోర్టుకువెళ్ళి విడాకులు తీసుకొని మరో పెళ్ళి చేసుకోవచ్చు. కానీ ఆ మరోపెళ్ళి అనేమాట ఆమె కలలో కూడ తలవదు. తమ ఇద్దరి విషయములో కూడా.

ఆరోజు భర్త కాంప్‌కి వెళ్ళాడు. అనుకోకుండా పీరియడ్స్ వచ్చేసరికి అత్తగారికి తెలియకుండా ఆ మూడురోజులు జాగ్రత్తపడింది. భర్తవచ్చి "ఏం ఈనెల ఇంకా మూలకు చేరలేదు" హేళనగా అన్నాడు. దానికి ఆమె మనస్సు చివుక్కుమన్నా ఎంతో నిగ్రహించుకుంది.

"ఏమో, శుభవార్త వింటారేమో" అంది నవ్వుతూ, ఆ శుభవార్త అన్నమాటకు ఉలిక్కిపడ్డాడు నాగేష్. అయినా ఉలికిపాటు కప్పిపుచ్చుకొని "రాళ్ళకు పూలు పూయడం, నీకు పిల్లలు పుట్టడం అటు సూర్యుడు ఇటు ఉదయించినా జరగదు అన్నాడు. ఆమె బాధపడింది. కాని పైకి గంభీరంగానే వున్నాడు.

తరువాత నెల పీరియడ్స్ పోస్టుపోన్ కావడానికి వీణ దగ్గరనుండి మందులు తెచ్చుకొని భర్తకు తెలియకుండా వాడింది నిర్మల. "ఏమండీ నిజంగా శుభవార్తేనండి. మీరు తండ్రి కాబోతున్నారు" అంది ఆనందం మొహానికి పులుముకొని "ఆ చూద్దాంలే" అన్నాడు నాగేష్ చికాకుగా, ఏం మీకు సంతోషంగా లేదూ. పిల్లలు అని కలవరించారుగా, అంది, అతను మాట్లాడలేదు.

ఆ రాత్రి భర్త, అత్తగారు ఎంత మెల్లిగా మాట్లాడినా అవి నిర్మల చెవిలో పడ్డాయి. "అమ్మా! నిర్మల నెలతప్పానంటుంది. నాకు పిల్లలు పుట్టరని నీకు తెలుసుగా. నిర్మల ఏదైనా తప్పు..."

"అబ్బే అటువంటిదేమీ లేదురా, నేనసలు ఎక్కడికి బయటకు కూడా వెళ్ళనుగా. రాత్రిళ్లు నాకసలు నిద్రపట్టదాయె" అంది.

అత్తగారు తనను శంకించనందుకు సంతోషించింది నిర్మల. కాని ఆ మర్నాటినుండి "కులట" అన్నరీతిలో మాటలు మొదలయ్యాయి. నిర్మల అదరలేదు, బెదరలేదు. "నిజంగా నెల తప్పావా? నా ద్వారానా, మరెవరిద్వారానయినానా?" అని నీచంగా మాట్లాడడం మొదలు పెట్టాడు నాగేష్.

"నాలోను లోపంలేదు. మీలోనూ లోపములేదు. నెలతప్పడంలో విశేషం ఏముంది. ఏ కారణంచేతనో ఇన్ని సంవత్సరాలు ఆలశ్యము అయిందిగాని దేవుడు నా మొర ఆలకించాడు ఇప్పటికి" అంది నిర్మల.

"దేవుడుకాదు నీమొర ఆలకించింది. మరో మొగుడెవరో" అని కొట్టడానికి మీదమీదకు రాబోయాడు నాగేష్. "అదేమిటండీ అలాగంటారు, మీరేకదా పిల్లలు, పిల్లలు, మరోపెళ్ళి మరోపెళ్ళి అని కలవరించారు. తీరా తండ్రికాబోతూ అలా అంటారేమిటి?" అంది.

నెల తప్పితే అలా అనక మరెలా అనమంటావు. చెప్పు వాడెవడో చెప్పు అంటూ మరలా చేయెత్తబోయాడు.

ఆగండక్కడ, ఒక్కసారి గర్జించింది నిర్మల. కాగితం పులి ప్రాణం పోసికొని సడన్‌గా తనమీదకు ఉరికినట్లనిపించింది నాగేష్‌కు. ఆవేశంతో అంది నిర్మల. "మీకు పిల్లలు పుట్టరని తెలిసికూడ ఏమీ చేయలేక మీరంటున్న మాటలన్నీ అనవసరంగా పడ్డాను. మీ తప్పు మీరు ఒప్పుకోవాలని నాటకం ఆడాను గాని, నిజానికి నేను గర్భవతిని కాను. మీ భార్యగా వున్నంతకాలం నేను తల్లిని కాలేను అని తెలుసు అందుకే మీకు విడాకులిచ్చి లోపం మీదేనని కోర్టులో నిరూపించి నేను మరో పెళ్ళి చేసుకుంటాను. అప్పుడు మీరు ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకున్నా, ఎంతమంది పిల్లలకు తండ్రి అయినా నాకు అక్కరలేదు, అనవసరం కూడా" అంది.

నాగేష్, అతని తల్లి ఆ మాటలకు కిమ్మనకుండా తలలు వంచుకున్నారు. ఆ మర్నాడు తమ జీవితంలో ఏమీ జరగనట్లుగా, "నిర్మలా మనం గుడికి వెళదాం పద" అన్నాడు నాగేష్. మారుమాట్లాడకుండా భర్తవెంట వెళ్ళింది నిర్మల. మొదట భార్యను గుడికి తీసికొనివెళ్లి, ఆ తరువాత దగ్గరలోనున్న అనాధాశ్రమానికి తీసికెళ్ళాడు. "నిర్మలా

నన్ను మనస్ఫూర్తిగా క్షమించు. పిల్లలు లేకపోతే లోటేకాని, అదే జీవితంకాదు, జీవితంలో మనకు అందని వాటినిగురించి, ఆలోచించకుండా, సాధ్యమైతే మరో విధంగా మనం ఆ బాధను మరచిపోవచ్చు. మనం పిల్లలను పెంచుకుందాం. ఇకపై మనజీవితంలో నిష్ఠూరాలు, నిందలు ఉండవు. నన్ను నీ భర్తగా కాకపోయినా ఒక వికలాంగుడిగా అయినా చూడు" అన్నాడు. "ఛ! అదేమిటండి నాకు మీ తరువాతే ఎవరైనా" అంటూ ఆనందంగా నవ్వి, అనాధాశ్రమంలో అడుగుపెట్టింది నిర్మల, భర్తచేయి పట్టుకొని.

(జయశ్రీ)

☆ ☆ ☆

# కరుణ

"అమ్మగారూ!"

"ఏమిటే రంగీ, ప్రొద్దునే ఇంత తీరిగ్గా వచ్చావు." పుస్తకంలో నుండి తలెత్తకుండానే రంగి గొంతు గుర్తుపట్టి అడిగింది కరుణాదేవి.

"అమ్మగారూ! మీరేమి అనుకోనంటే... అనుకోనంటే..." ఊ ఏమిటో సంగతి చెప్పు. సనుగుడు బేరం నీకు అలవాటేగా. విషయం ఏమిటి?" అంది.

"మీరు దయతో ఇప్పించిన మిషను మీద మీకు రెండు నేప్‌కిన్స్ కుట్టి తెచ్చానమ్మగారు. మీ జాకెట్లు అవీ నేను ఎలాగూ కుట్టలేనండి. ముందుగా మీకు ఇవి ఇచ్చిగాని నేను మరే పనీ చేయలేనండి. ఏదో కృష్ణునికి కుచేలుని కానుకలాగా. వద్దనకండి అమ్మగారూ" ప్రాధేయ పూర్వకంగా అంది రంగి. అప్పుడు తల పైకెత్తి రంగిని చూసి నవ్వింది కరుణ. "ఏమిటే పిచ్చిదానా! ఏవీ ఇలా ఇవ్వు. బావున్నాయి. జాగ్రత్తగా పనిచేసికొని, పిల్లాడిని చదివించుకో"

"అలాగేనమ్మగారూ! అంతా మీ చలవండి"

"చలవా లేదు, నీ మొహం లేదు. ఇదిగో వీటి ఖరీదు పది రూపాయిలు తీసుకో" డబ్బులు ఇవ్వబోయింది. "అమ్మమ్మ! ఎంత మాటండి. దేవుడికి ప్రసాదంలాగా తెచ్చానండి. డబ్బులు వద్దండి."

"నీకు మిషను ఇచ్చింది దాని మీద బట్టలు కుట్టి డబ్బు సంపాదించుకోమని గాని, ఇలా గిఫ్ట్‌ల వంకన నీ శ్రమనువృథా చేయమని కాదు. తీసుకో" అనగానే మారు మాట్లాడకుండా డబ్బులు అందుకొని ఆవిడకు నమస్కరించి వెళ్ళిపోయింది రంగి.

"కరుణమ్మగారూ!"

"ఆ, ఆ. వచ్చావా, కమలా. నేను కబురు చేశాను అందిందా. నేను చెప్పిన పని చేశావా?"

"అమ్మగారూ, మీరు పని చెప్పడం చేయకపోవడమూనా? ఇదిగోనండి పిల్లదాన్ని కూడా తీసికొచ్చానండీ"

"చూడు కమలా. ఏ దిక్కూలేని నిన్ను మీ ఆయన పెళ్ళి చేసుకున్నాడు. రెండవ పెళ్ళే అనుకో. అయినా నీకు ఏం లోటు చెప్పు. బంగారంలా చూసుకునే భర్త. ఆ పసిపిల్ల నిన్ను ఏం చేసింది. స్వార్ధంతో వాళ్ళ అమ్మమ్మ వాళ్ళింటికి తరిమేశావు. ఆ ముసలాళ్ళు ఈ రోజుంటారు, రేపు పోతారు. పైగా వాళ్ళకు వాళ్ళే సంపాదించుకొని

తినలేకపోతున్నారు. ఇంక ఆ పిల్లను ఏం చూస్తారు చెప్పు. ఆ పిల్ల బాధ్యత నీది కదూ!"

"అవునండీ అమ్మగారూ! తప్పయి పోయిందండీ. మీ మాటలు నా కళ్ళు తెరిపించాయండీ"

"ఈ మాటలు ఈ రోజుతో సరికాదు. ఎల్లకాలం వుండాలి. దేవుడు మనల్ని మనుషులుగా సృష్టించింది ఎదుటి వారిని ప్రేమగా చూడాలని"

"నిజమేనమ్మగారూ! మా వలన ఏం ఉపయోగముందని మీరు అందరినీ అంత ప్రేమగా చూసి అందరి కడుపులూ నిండే మార్గం చూపుతున్నారు. ఏ బంధమూ, మా వలన ఏ చిన్న లాభం లేకుండానే మాకు ఎన్నో విధాల సహాయాలు చేస్తున్నారు కదా, నా భర్త వలన జీవితంలో ఏ లోటూ లేని నేను, నా భర్త కూతురిని చూడక పోవడం అన్యాయమేనమ్మా. అందుకే మీ మాట విని వెంటనే పిల్లను తెచ్చేసుకున్నానమ్మగారూ,"

"మంచి పని చేశావే నిజంగా. నీకు పిల్లలు పుట్టినా సరే, ఆ పిల్లను పెద్ద కూతురిలాగే చూడాలి."

"అలాగేనండి."

☆ ☆ ☆

కాయగూరల మనిషి ప్రత్యేకంగా మంచి కాయగూరలు తెచ్చి ఇస్తుంది కరుణకు. కాయగూరల దుకాణం పెట్టుకోడానికి కరుణే సహాయం చేసింది.

"అమ్మ! మా చెల్లికి కూడా ఏదైనా సహాయం చేస్తానన్నారు కదా! అందుకే తీసుకొచ్చానండి. ఇంటరు వరకు చదువుకుందండి" అంది కాయగూరల మనిషి.

"అలాగా, ఈ అమ్మాయేనా?" అడిగింది.

"నమస్కారమండి. నా పేరు నిర్మల. ఇంటరు పాసయ్యాను. ఏ చిన్న ఉద్యోగం ఇప్పించినా చేస్తానండి"

"నీకు ఇంకా చదువుకోవాలని వుందా?"

"వుందండి. కాని ఎలా కుదురుతుందండి. మా అమ్మ, నాన్న అకస్మాత్తుగా చనిపోయారండి. ఎవరు చదివిస్తారండి" ఆవేదనగా అంది.

"నేను చదివిస్తాను చదువుకుంటావా?"

"తప్పకుండా, తప్పకుండా శ్రద్ధగా చదువుకుంటానండి" ఆ అమ్మాయి కళ్ళల్లో మెరుపు.

☆ ☆ ☆

కరుణ తండ్రి చాలా పేదవాడు. చిన్నప్పుడు తినడానికి తిండి వుండేది కాదు. అనుకోకుండా అదృష్టం తిరిగి బిజినెస్‌లో కోటీశ్వరుడయ్యాడు. అందుకే కూతురికి తన జీవితం గురించి బోధించి దాన ధర్మాలు చేయడం అలవాటు చేశాడు. కరుణ మహిళా మండలి సభ్యురాలు కూడా. తన ఫ్రెండ్స్‌తో ఎన్నో ఫండ్స్ కలెక్ట్ చేసి ఎందరికో మిషన్లు, టైపు మిషన్లు లాంటివి పంచి పెడుతుంది.

ప్రత్యేకంగా తన పుట్టిన రోజునాడు, తన తండ్రి పుట్టిన రోజునాడు పేదలకు అన్నదానం చేస్తుంది. తండ్రి చనిపోయిన రోజు ఉపాధి కల్పనా కార్యక్రమాలు చేపడుతుంది. తండ్రి కోరిక మేరకు పేదింటి వాడైన శంకర్‌ని, అతని చదువుకే ప్రాధాన్యత ఇచ్చి పెళ్ళి చేసుకుంది.

బిజినెస్ వ్యవహారాలలో క్షణం తీరిక వుండదు శంకర్‌కి. ఆ రోజు కరుణ తండ్రి చనిపోయిన రోజు. ఎంతో మంది వచ్చారు. దానాలు గ్రహించి వెళ్ళారు కూడా.

అలసటగా కూర్చుని పేపరు చూస్తుంది కరుణ.

"అమ్మగారూ!'

"ఆ. ఏమిటి? ఎవరు నీవు?" తలెత్తకుండానే అంది. "నాకు మీ ఇంట్లో ఆయా ఉద్యోగమైనా ఇప్పించండి తల్లీ. లేదంటే కాయగూరల దుకాణమైనా పెట్టుకుంటానండి సహాయం చేస్తే. ఏదో విధంగా నా కాళ్ళ మీద నేను నిలబడాలి" ప్రాధేయపూర్వకంగా అంటోందొక ముసలామె.

ఎక్కడో విన్న గొంతులా అనిపించి పేపరు అడ్డం తీసి చూసింది.

పెళ్ళయిన కొత్తలో ఏదో చిన్న కారణాన తమ దగ్గర నుండి కూతురు దగ్గరకు వెళ్ళిపోయిన అత్తగారు. వాళ్ళు ఇల్లు మారడంతో అది కొడుకు ఇల్లు అని తెలియని ఆ తల్లి.

తాను ఎంతో మందికి సహాయం చేస్తున్నా అత్తగారిని నిర్లక్ష్యం చేసిన ఆ కోడలు - ఒకరినొకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు. ఇంతకాలం అత్తగారిని నిర్లక్ష్యం చేసి, చేసిన దానాలు అర్థం లేనివనిపించాయి కరుణకు. ఆవిడను లోపలికి మనస్ఫూర్తిగా, సాదరంగా ఆహ్వానించి తండ్రి ఫోటో వైపు చూసింది కరుణ తనను క్షమించమన్నట్టు.

తండ్రి ఫోటో చిరునవ్వులు చిందించింది.

(వనితాజ్యోతి, నవంబర్ 99)

☆ ☆ ☆

# కిళ్ళీ

అక్కడ గుంపులు గుంపులుగా జనం ఒకే చెట్టుకు పూసిన రకరకాల పూలగుత్తుల్లా ఉన్నారు.

ఆ ప్రాంతమంతా ఎక్కడచూసినా కేరింతలు కోలాహలం, సందడీ రాజ్య మేలుతున్నాయి.

డిమ్‌లైట్స్ వెలుగులో 'డిన్నరు' ఏర్పాట్లు బ్రహ్మాండంగా, హాస్యంగా ఉన్నాయి.

భోజనానికి వచ్చిన అతిథులందరూ సూప్, స్నాక్స్ తీసుకుంటున్నారు. కొందరు గలగలా మాట్లాడేస్తూంటే మరికొందరు గంభీరంగా పోజులిస్తున్నారు.

ఆ రోజు పౌర్ణమి.

ముందుకు వెళ్ళబోతోన్న చందూ కాళ్ళు టక్కున ఆగిపోయాయి!

వంటకాల ఘుమఘుమ వాసనలు పోతోన్న ప్రాణాన్ని కట్టిపడేసేలా చేశాయి. నాల్గు రోజుల నుండి అన్నం తినలేదేమో కడుపులో ప్రేవులు లెక్కోడ్తున్నాయి.

పరుగెత్తుకు వెళ్ళి చేతికి చిక్కింది తినేద్దామా అనే తొందర అతణ్ణి నిలువనీయడంలేదు.

కాని అతణ్ణి ఆహ్వానించే వాళ్ళెవరూ లేరక్కడ. కనీసం అతడు ఆయింటి నౌకరో, చాకరో అయినా అవితినే అదృష్టం దక్కేదేమో!? లేదా ఆ ఇంట ఓ కుక్కైనా ఆ రుచి చూసేవాడేమో కాని ఆ ఇంటితో అతనికి ఏ విధమైన బంధమూ, సంబంధమూ లేని అనాథ బాలుడు.

రెండు రోజులుగా ఆకలితో అలమటిస్తోన్న చందూ కల్లోనైనా కమ్మగా భోంచేద్దామంటే.... నిద్రే రావడం లేదు. కుళాయిల్లో నీరు కూడా దొరకడం లేదు.

ఏ ఇంటికెళ్ళినా ఆ రెండు రోజుల నుండీ 'ఛీ పో' అన్న బాటలే అతనికి ఎదు రవుతున్నాయి.

ఆ క్రోటన్ ఫెన్సింగు దగ్గర నిలబడి 'అన్నం పెట్టండయ్యా' అని అడ గాలనుకున్నాడు. కాని గాలివాటానికి పెరిగే తనని దొంగ అంటారు తప్పించి ఆకలిని గుర్తించరని తెలుసు.

కొందరు భోం చేయడానికి ఇంకా ప్లేట్లే తీసికోవడం లేదు. 'బఫే' కాబట్టి ఎవరికి ఇష్టమైనప్పుడు వాళ్ళు వెళ్ళి తింటున్నారు.



'అబ్బ! వాళ్ళకు ఇంకా ఆకలి వేయడం లేదు! నాకైతే ఎంత ఆకలి వేసేస్తోందో' అనుకున్నాడు.

అప్పుడే తినడం ముగించిన వాళ్ళని చూసి, 'అయ్యో! అప్పుడే అయిపోయిందా? నేనైతే ఇంకా ఎంత తినేవాడినో'' అనుకున్నాడు.

తన ముందున్న స్వర్గం తనను నిర్లక్ష్యం చేస్తున్నట్లూ, తనా స్వర్గాన్ని అందుకోలేకపోతున్నట్లూ, అందుబాటులో ఉన్నది చేజారిపోతున్నట్లూ నిస్తేజమైన కళ్ళతో చూస్తున్నాడు.

రెప్ప వేస్తే ఎక్కడ ఆ వంటకాలను చూసే అదృష్టాన్ని కోల్పోతానో అన్నట్లు రెప్పవేయకుండా, కదలని శిల్పంలా చూస్తున్నాడు.

ఒక్కో గిన్నీ ఖాళీ అవుతోంది. మరో గిన్నె నిండుగా ఆ టేబిల్ మీదికి చేరుతోంది.

'దేవుడా! ప్రేవులు మెలితిప్పి, స్పృహ తప్పే ఆకలిని ఎందుకు సృష్టించావు. అమృతం తాగే నీకు ఆకలి బాధేం తెలుసు? కనిపించని దేవుణ్ణి తిట్టుకున్నాడు.

ఎందుకో ఒక్క ఉదుటున ఆ ఫెన్సింగ్ దూకివెళ్ళి ఇక కంచం నిండా అన్నాన్ని దొంగిలించాలనిపించింది చందూకి.

కాని అలా చేస్తే ఆకలి బాధకు దెబ్బల బాధకూడా తోడవుతుందని ఊరుకున్నాడు.

మెల్ల మెల్లగా జనం పలచబడుతున్నారు. ప్లేట్లు ఖాళీ అవుతున్నాయి. చందూ కడుపు ఆకలితో నకనకలాడిపోతోంది.

ఇక అక్కడ ఉంటే ఇహ లాభం లేదని, అందరూ బయటకు వెళ్ళే దారిలో నిలబడి 'ఆకలవుతోంది ఏమైనా పెట్టండి' అని అడిగాడు.

వాళ్ళలో ఏ ఒక్కరికైనా జాలితలచి లోపలికి పంపక పోతారాని ఆశించాడు. కాని వాళ్ళెవ్వరూ అతణ్ణి ఏమంత పట్టించుకోలేదు!

కడుపు నిండా భోం చేసిన వాళ్ళు కిళ్ళీ వేసికోడానికి కడుపులో ఖాళీలేక దాన్ని చేతితో పట్టుకొని వెళుతున్నారు.

వాళ్ళలో ఒక పాప 'ఆకలి' అని అడుగుతోన్న చందు చేతిలో కిళ్ళీ వేసింది.

ఆ వెనకే వచ్చిన చాలామంది చందూ చేతిలో కిళ్ళీలుంచారు.

దేవుని గుడిలోని ప్రసాదంలా వాటిని బాగా తినేశాడు చందూ ఆకలి కాస్త తగ్గింది.

పొట్ట పగిలేలా తిన్న వాళ్ళకి ఆజీర్తి చేయకుండా పనికొచ్చే కిళ్ళీ ఆకలితో ఉన్న చందూ కడుపు నింపడానికి పనికి వచ్చింది.

(అమృత్‌కిరణ్)

☆ ☆ ☆

# పెళ్లయితే

వినోద్ బాగానే చదువుకున్నాడు.

ఆపై మంచి ఉద్యోగంలోనూ స్థిరపడ్డాడు. ఆడది పెళ్లిలోను, మగవాడు ఉద్యోగంలోనూ స్థిరపడతారని ఎక్కడో చదివినట్లున్నాడు. ఎంతసేపైనా ఉద్యోగం తాపత్రయమే గానీ, పెళ్లి తాపత్రయం లేదు.

ఎవరైనా 'పప్పన్నం ఎప్పుడు పెడతావు వినోద్' అని అడిగితే ఈరోజే పెడతానని కుక్కర్‌లో పప్పు పెట్టేసేవాడు. వంట చేసుకుని తినడం, ఉద్యోగం చక్కగా నిర్వర్తించడం, సెలవుల్లో చుట్టాలిళ్లకు ఊర్లు తిరిగి రావడం లాంటివి తప్ప పెళ్ళి అనేది ఆడదానికి ఎంత అవసరమో, మగవాడికీ అంతే అవసరం అన్నది గుర్తించనే గుర్తించడు. పెళ్లి టాపిక్ ఎత్తితే ఆముదం తాగిన మొహం పెట్టడం, ఆమడదూరం నిలబడడం అలవాటు చేసుకున్నాడు.

ఎవరైనా గుచ్చి గుచ్చి పెళ్లి ఎప్పుడు చేసుకుంటావు వినోద్ అని అడిగితే మొదట్లో విసుక్కునేవాడు. ఇప్పుడయితే కాస్త తెలివిగా జవాబులు చెబుతున్నాడు. "నాకు మంచానికి రెండువైపులనుంచి దిగడం ఇష్టం. వైఫ్ వస్తే అది కుదరదు" అనో, "వైఫ్ అంటే నైఫ్. నాకు కత్తులు అంటే భయం" అనో, "నేను సుఖంగా వుండడం ఇష్టంలేక నరకంలో తోయాలనుకుంటున్నారా? అదేమీ కుదరదు" అనో జవాబులు చెబుతున్నాడు.

అవి పెళ్లి దాటవేయడానికే తప్ప మరెందుకూ పనికి రావడంలేదు.

పెళ్లికాని వారు పెళ్లి అనే స్వర్గంలోకి వెళ్లడానికి ఆత్రపడతారు. తీరా పెళ్లయి అది నరకం అని తెలుసుకుని అందులోనుండి బయటపడే మార్గం కోసం వెతుక్కుంటారు. పెళ్లి జిగురులా అతుక్కునే రెండు బాధామయ కాగితాలు, అవి ఊడిరావు, కలసి వుండలేవు. ఒంటరితనంలో ఒక వెలితి జంటగా వుండడంలో ఒక కలత అనుకుంటూ ఏవేవో అభిప్రాయాలను మనసు అనే మట్టిలో గట్టిగా పాతేసుకున్నాడు.

అలాంటి అభిప్రాయాలతో మరో అయిదేళ్లు గడిచాయి. ఎద్దు ఎప్పుడూ ఒక ప్రక్కకు పడుకోలేదు. కాలం ఎప్పుడూ ఒకేలా నడవలేదు అన్నట్టు వినోద్‌లో కాస్త మార్పు వచ్చింది.

కానీ అప్పటికే ముదిరిన బెండకాయ అని వినోద్ చుట్ట ప్రక్కలవారు ఐ.ఎస్.ఐ. ముద్ర వేసేసారు. దానితో తనకు పెళ్లయ్యే యోగం లేదేమోనని నిద్రకు దూరమయ్యాడు



వినోద్. నాకు సంబంధాలు చూడండి అని ఎవరికీ చెప్పలేక పోతున్నాడు. ముదిరిన బెండకాయి కూడా విత్తనాలకు పనికి వస్తుంది కదా అనుకుంటున్నాడు.

మొత్తానికి వినోద్ పెళ్ళిచూపుల ప్రహసనం మొదలుపెట్టాడు. ఆడ పిల్లల తల్లిదండ్రుల సహనాన్ని పరీక్షించ సాగాడు. పెళ్ళి చూపుల పేరు చెబితే చాలు మహా సరదాపడి పోతున్నాడు. కారణం ఆడపిల్ల తరపువారు పెళ్ళికొడుక్కి, అతని తరపువారికి ఇస్తున్న మర్యాద.

వాళ్ల హడావుడి, చేతులు కట్టుకుని నిలబడే తీరు చూస్తుంటే ఆహా! మన దేశంలో మగవాడికి, పెళ్ళికాకముందు ఎంత విలువ అని ఆశ్చర్యపోతున్నాడు.

మగ మహారాజు అని మురిసిపోతున్నాడుగానీ పెళ్లయిన తరువాత మగవాడు కదలలేని ఫ్లవర్‌వాజ్‌నీ, భార్య పువ్వులరూపంలో నెత్తిమీద కూర్చుంటుందని, వాజమ్మను చేస్తుందని తెలియదు పాపం.

ఒక పెళ్లి చూపుల్లో అమ్మాయికంటే అమ్మాయి తల్లి బావుందన్నాడు. కానీ ఆవిడకు పెళ్లయిపోయిందిగా! ఇప్పుడు పెళ్ళిచూపులు రుచి మరిగిన వినోద్ అందమైన పిల్లలు కనబడినా ఏదో వంక పెడుతున్నాడు. పేరయ్యకూ విసుగు వస్తోంది. అయినా బేరం పోగొట్టుకుంటే అతనికే నష్టం. అందుకే లోపల మండుతున్నా పైకి అతి వినయం చూపిస్తున్నాడు.

వినోద్ పెళ్లి కుదరని టెన్షన్‌లో సిగరెట్లు ఎక్కువ తాగుతున్నాడు. నిద్రపట్టని రాత్రిళ్లు ఓపిగ్గా, ఓ పెగ్‌తో సరిపెట్టుకుంటున్నాడు.

'పెళ్లి కుదరడం ఇంత కష్టమా'? అని చాలాసార్లు అనుకున్నాడు వినోద్.

వినోద్ గురించి ఎంక్వయిరీ చేసినవాళ్లు అబ్బాయికి బేడ్‌హేబిట్స్ వున్నాయని

వెనక్కి వెళ్లిపోయారు కొందరు. ఎవరైతే వెనక్కి వెళ్లిపోయారో ఆ ఇంటి సంబంధాలే అన్ని విధాలా నచ్చాయి వినోద్‌కి. దురదృష్టంకొద్దీ వినోద్‌కి నచ్చిన సంబంధాలు అవతలి వాళ్లకు నచ్చడంలేదు.

'మగాడు నచ్చడమేమిటి? పాంటు చొక్కా వేసుకున్న మగాడిని చూసి ఏ ఆడపిల్ల తల్లిదండ్రులైనా తల్లక్రిందులు తపస్సుచేసి వరం పొందినట్లు సంబరపడిపోయి వాళ్ల అమ్మాయిని ఇచ్చేస్తారు' అని అనుకునే వినోద్ ఆ అభిప్రాయం తప్పని అర్థం చేసుకున్నాడు.

పెళ్లయి పిల్లలతో ఆనందంగా వున్నవారిని చూస్తుంటే వినోద్‌కి వళ్లు మండుతుంది. వాళ్లను ఎలాగోలా విడగొట్టాలని చూస్తున్నాడు.

పెళ్లిళ్ల పేరయ్య వినోద్ గురించి, అతని మంచితనం గురించి చాలా కోతలు కోసి ఒక సంబంధం చూపించాడు. ఆ అమ్మాయికి ఇరవై ఏళ్లు. వినోద్‌కి ముప్పయి. ఆ సంబంధం అన్ని విధాల నచ్చిందిగానీ అమ్మాయి వయస్సు కనీసం ఇరవై రెండు సంవత్సరాలయినా వుంటే బాగుండునని, మరీ పదేళ్ళ వయస్సు తేడా బాగుండదని, ఆ సంబంధం వద్దని చెప్పేసాడు వినోద్. ఆ అమ్మాయి పేరు భాను.

మరో రెండేళ్లు గడిచాయి. భానుకి ఇరవై రెండేళ్లు వచ్చాయి. వాళ్లు వినోద్‌కి కబురు పెట్టారు. మా అమ్మాయికి ఇరవై రెండేళ్లు వచ్చాయి పెళ్లిచేసుకొమ్మని. వెంటనే ఒప్పేసుకున్నాడు వినోద్. మొత్తానికి వినోద్ పెళ్లి అయిపోయింది.

"మొదటిరాత్రి మన మధ్య రహస్యాలు వుండకూడదు. నీకు ఏమైనా రహస్యాలు వుంటే చెప్పు. దంపతుల మధ్య రహస్యాలు వుండకూడదు." అన్నాడు వినోద్.

భాను నెమ్మదిగా తల వంచుకుని "ఈ నెక్లెస్ ఎదురింటి ఆవిడది. గాజులు పక్కింటావిడవి." అంది. ముందు బిత్తరపోయినా తరువాత ఫక్కున నవ్వేసాడు వినోద్.

భాను కూడా నవ్వుతూ "ఈ వస్తువులు నావే! ఏదో జోక్ గుర్తుకొచ్చి మీకు అలా చెప్పాను అంతే! గతాలు, వాటి అనుభవాలు మనకు అనవసరం. ముందు మనం సంతోషంగా బ్రతకడానికి ఎలా మసులుకోవాలో తెలుసుకుందాం. ఒకరినొకరం అర్థం చేసుకుంటూ ఆనందంగా బ్రతుకుదాం. నాకు నవ్వులు, పువ్వులు ఇష్టం. మీరు ఇష్టపడితే సంతోషిస్తాను." వినోద్ భానుని మనసారా హత్తుకున్నాడు. మనసు హాయిగా అనిపించింది.

(ఆంధ్రభూమి వీక్లీ, 16-02-95)

★ ★ ★

# సవతి కూతురు

"అమ్మా!"

"మొన్న నీవు నా దగ్గరకు వచ్చి వెళ్ళావు. నా సంసారం, దాని ఉన్నతి, నేను బ్రతుకుతున్న రీతి చూసి నీ కళ్ళలో వెలిగిన మతాబులు నేను మరిచి పోలేకపోతున్నాను. అలాగే నీవు నా సవతి కూతురు సుష్మవైపు చూసిన చూపు, ఆమెను ప్రేమగా చూడవద్దని నాకు చేసిన హితబోధ, అర్థింపు కూడా మరువలేకున్నాను"

"అమ్మా! నేను అతి సామాన్యమైన - మధ్య తరగతికి దిగువనున్న కుటుంబంలో పుట్టాను. నాకున్న అదృష్టం అందం. నా వరం అణకువ. ఈ రెండే నన్ను ఈ ఇంటి ఇల్లాలిని చేశాయి. మనమున్న పరిస్థితిలో నీవు నాకు పెళ్ళి కాదుకదా, సడన్‌గా ఏ ఏక్సిడెంట్‌లోనో చనిపోతే కనీసం చావును కూడా జరిపే స్థితిలో లేవు. ఇలా రాశానని బాధపడకు. నిజాలలో ఎప్పుడూ వ్యధలే ఉంటాయి. సుధలు, మధుర కథలు ఉండవు.

"తోటలో పూసిన పూలన్నీ దేవుని గుడిలోకి వెళ్ళవు. కొన్ని ఆడవారి జడలోకి మెడకు ఉరి బిగించుకొని, మరి కొన్ని రసికుల కౌగిలిలోకి కన్నీరు నింపుకొని వెళతాయి. ఏ ఒక్క దానికో పూర్వజన్మ సుకృతమో, ఈ జన్మలో చేసిన వ్రత ఫలితమో దేవుని పాదాల చెంతకు వెళ్ళే యోగం కలుగుతుంది. అలాంటి యోగం కలిగిన పువ్వులాంటి స్త్రీని నేను, ప్రస్తుతం.

కలలో కూడా ఇంతటి ఐశ్వర్యాన్ని మనం అనుభవించడానికి కాదు కదా, తలవడానికి కూడా తగని చోట పుట్టాం. అటువంటి ఇంట్లోని నాకు ఏ దేవుడో కరుణించి మోహన్‌కు భార్యనయ్యే అదృష్టం కలిగించాడు. అమ్మా! పెళ్ళి, ఐశ్వర్యం మాత్రమే కాదు ఆడదానికి కావలసింది. ప్రేమ కూడా. అది నిండుగా నాకు దొరికింది.

"అందుకే నా జీవితం కనులపండువుగా ఉంది. జీవితంలో నేను ఇంతటి అదృష్టవంతురాలిని అవుతానని ఏనాడూ అనుకోలేదు. నా జీవితంలో అసలైన అదృష్టం ఈ పెళ్ళి, ప్రేమో కాదు. మోహన్ మంచితనం. నడి సముద్రంలో ఈత రాక ఈదులాడుతున్న మనని ఓడలా నిల్చి ఆదుకొని నీడ నిచ్చాడు. నాన్నగారికి మంచి వైద్యం, తమ్ముడికి పెద్ద ఉద్యోగం, చెల్లిలి పెళ్ళి, ఇల్లు తాకట్టు నుంచి విడిపించడం. ఇవన్నీ మనకు ఈ జన్మలో జరిగేవేనా? మోహన్ లేకపోతే ఇప్పటికి మనం ఎలా ఉండేవాళ్ళమో ఊహించు. నాన్నగారు దగ్గుతూ, నేను ఉద్యోగాల వేటలో అలసిపోతూ, తమ్ముడు రౌడీ ఫ్రెండ్స్‌తో కలసి రోడ్లు సర్వే చేస్తూ, చెల్లి ఇంటి పనిలో సతమతమవుతూ చిరిగిన బట్టలతో, తరిగిన ఓపికతో ఉండేవారం.

"అకస్మికంగా మన జీవితంలో ఇంత మార్పు రావడానికి కారణం మోహన్ కాదమ్మా సుష్మ ! అసలు సుష్మ లేకపోతే మోహన్ నన్ను చేసుకునే వారా? ఆయనకు కోటిమంది కాసులతో సహా దొరికేవారు. సవతితల్లి సరిగా చూడదని, నా మంచితనం వల్ల, సుష్మను జీవితాంతం ప్రేమగా చూడగల ననే నమ్మకం వల్ల నన్ను చేసుకున్నారు. ఆయన నమ్మకాన్ని వమ్ము చేయలేను. మన కుటుంబ పరిస్థితులు ఇంత మంచి దశకు రావడానికి కారణం సుష్మే అమ్మా. అలాంటి సుష్మకు నా స్వార్థంతో అన్యాయం చేయలేను. నాకు పిల్లలు పుట్టనీ, ఈ లోకం తలకిందులు కానీ, నాలో ఊపిరి ఉన్నంత వరకూ సుష్మను అత్యధికంగా ప్రేమిస్తాను. ఆ చిన్నారి తన తల్లిని పోగొట్టుకున్న దౌర్భాగ్యానికి, మన కింత భాగ్యం కలిగింది. ఇప్పుడు నేను మోహన్ ఇల్లాలిగా అధికారం చలాయించలేను. చలాయించినా, మోహన్ ఏమీ చేయలేరు. కాని మన జీవితాల్ని అన్ని విధాలా ఆదుకోవడానికి కారణం కేవలం ఆ తల్లిలేని పిల్లే. ఆ అమ్మాయిని నేను ప్రేమగా చూడడం కోసం మోహన్ నాతో అనంతమైన అనురాగానికి కట్టుబడి, మీ కెంత డబ్బు పెట్టుబడి పెట్టారు! ఇదంతా సుష్మ భిక్షే నమ్మా! ఆ పసి దానిమీద నీవు కక్ష పెట్టుకొని నాకేమీ నూరిపోయొద్దు. నీవు నాలాగే సుష్మను ప్రేమించగలిగితే ఎంతో సంతోషిస్తాను. ప్రేమతో నీ కుమార్తె మాధురి."

(ప్రభ)

☆ ☆ ☆

# అభాగిని

అది ఒక క్లాస్ రూమ్. ఆ రూమ్‌లో దాదాపు 60 మంది విద్యార్థులున్నారు. అందరూ అన్నికులాలకు చెందినవారు. ఒక్కొక్కరూ ఒక్కొక్క ఇంటి వారసులు. అందరూ రకరకాల మనస్తత్వాలు, వేరువేరు గుణాలు కలిగినవారు. ఎవరి తెలివితేటలు వారివే. ఎవరి పరిజ్ఞానం వారిదే. ఎవరి మార్కులు వారివే. తెలివిగలవారున్నారు. తెలివి తక్కువవారున్నారు. అటూ ఇటూ కాని వారున్నారు. ఎవరు ఏ కులానికి చెందిన వారయినా, అందరూ భారతీయులే. అందరూ ఒక క్లాసువారే. వారందరి ధ్యేయం ఒక్కటే.

"చదువు, చదువు, చదువు చదువు కల్పతరువు," అంటూ ఎప్పుడూ శాంతంగా చిరునవ్వులతో బోధించే ఆ క్లాస్‌టీచర్ పేరు శారద. ఆమెలో సరస్వతీదేవికున్నంత ఓర్పు. పిల్లలను క్రమశిక్షణలోను, మంచిపద్ధతిలోనూ పెట్టగలిగిన నేర్పు ఉన్నాయి. ఆమెకు ఆ స్కూలు సిల్వర్ జూబిలీ సందర్భంగా మంచి టీచరుగా గుర్తించి గోల్డుమెడలు ఇచ్చింది. ఆ స్కూల్లో ఆవిడంటే అందరికీ ఇష్టమే.

శారద ప్రేమించి వేరేకులం అతన్ని పెళ్ళి చేసుకున్నందుకుగాను అటు అత్తింటికీ, ఇటు పుట్టింటికీ దూరమయింది. స్నేహితులే ఆత్మీయులయ్యారు. శారద భర్త చావుతోకూడ చుట్టాలు దరిచేరారు. వారికి కష్టాల్లోవున్న తమ బిడ్డ కంటే కులాలుముఖ్యం. శారద తనకు తానేధైర్యం చెప్పుకొంది. తనచేయి తప్ప తన కన్నీరు తుడిచేసాధనం మరొకటి లేదని గ్రహించుకుంది. ఆశలన్నీ కొడుకుమీదే పెట్టుకొని, గుండెరాయి చేసుకొని, స్కూలునే ఆలయంగా భావించుకొని బ్రతుకసాగింది.

ఆరోజు సోషల్ పాఠం చెబుతోంది శారద, అందరికీ అర్థం అయ్యేలా చక్కగాబోధిస్తుంది. ఎదురుగా బోర్డుమీద భారతదేశ చరిత్ర, ముఖ్యమైన ప్రదేశాలు ఏయే వస్తువులకు, ఏయే రాష్ట్రాలు ప్రసిద్ధి పొందాయో, అన్ని వివరంగా చెప్పి, మరలా పిల్లలను ప్రశ్నలువేసి అడిగి ఇంకా వివరంగా బోధిస్తుంది. చివరగా అంది. "మనం ఉండేది భారతదేశం. మనం - అందరము భారతీయులము. ఈ దేశం గౌతముడు, గాంధీజీ పుట్టినపుణ్యభూమి. అహింస అనేది మన నినాదము. అక్రమాలను చేయకూడదనేది మన ఆశయము. అన్యాయాలు జరగకుండా చూడటం మన ధ్యేయము. ఇప్పుడు మీరు బాలలు రేపటి పౌరులు మీరే. మనదేశ భవిష్యత్తు మీ మీద ఆధారపడి వుంది. యువత తలచుకుంటే చేయలేనిదంటూ ఏమీ లేదు.

మీరు బాగా చదువుకోవాలి. విద్య నేర్చుకోవడము కష్టంగానీ దానిఫలితాలు ఎంతో ప్రయోజనకరముగా వుంటాయి. ఉత్తమవ్యక్తిని రూపొందింపజేయడమే విద్య పరమార్థము....

మీరు మంచిగా చదువుకొని పెద్దగా అయిన తర్వాత దేశంలో అక్రమాల్ని, అన్యాయాలను అరికట్టాలి.

మీరు ఈదేశంలో పుట్టినందుకు ఈ దేశమే గర్వించాలి. ముఖ్యముగా కులమతాలు రూపుమాపాలి" అని బోధించింది -

చివరిమాట అంటుంటే ఆమెకంఠము సన్నగా వణికింది. తమ బంధువులు తనుకట్టించుకున్న తాళిగురించి "వెలి" అనేసారు. వరంయొక్క అర్థాన్ని సార్ధకము చేశారు అనుకుంది మనసులో.

శారద కంఠములో వణుకును పిల్లలు గ్రహించలేకపోయినా శారద కొడుకు అశోక్ మాత్రం గమనించాడు - అశోక్‌ని ఆదర్శ పురుషుడిలా తయారుచేయాలనేది శారద ధ్యేయం.

అప్పుడే కన్నతల్లిగా సార్ధకమవుతుంది అని శారద ఎప్పుడూ అనుకుంటుంది.

ఒక సంవత్సరము తర్వాత శారద మరలా గోడమీద భారతదేశ పఠము గీసింది. ఎక్స్‌ప్లెయిన్ చేస్తోంది అది క్లాసు రూముకాదు చిన్నగది. అది పాఠశాల కాదు, పిచ్చాసుపత్రి. అక్కడ వున్నది పిల్లలూ కాదు - ఈగలు, దోమలు. శారద పకపకా నవ్వుతోంది.

తన చేతిరక్తముతోనే భారతదేశ పఠము గీసింది.

"పిల్లలూ శ్రద్ధగావినండి. ఇందులో ఈప్రదేశము అమ్మాయిలను యెత్తుకుపోయి విదేశాల్లో వేశ్యలలాగా అమ్మేస్తారు.

ఆపైనున్న రాష్ట్రములో తక్కువ కులంవార్ని ఎక్కువ కులమువారు కాల్చిచంపేస్తారు.

ఇదిగో ఈపక్కనున్న రాష్ట్రములో నరరూపరాక్షసులు తిరుగుతుంటారు. వీళ్ళు కోడల్ని కిరోసిన్ పోసి కాల్చేస్తారు -

మొత్తం దేశమంతటా పరిశీలిస్తే ఈదేశంలో మనము పొందని కరువు కాటకాలూ, కత్తిపోట్లు, నిరుద్యోగుల ఆకలి చావులు, మానభంగాలూ, అన్యాయాలు, అక్రమాలన్నీ పుష్కలముగా దొరుకుతున్నాయి - ఈ దేశంలో పుట్టినందుకు మనమెంతో గర్వించాలి, పొంగిపోవాలి, తర్వాత కృంగిపోవాలి."

"ఆఁ అన్నట్టు పిల్లలూ అసలయిన సంగతి చెప్పడం మరచాను చూడండి. యీప్రక్క రాష్ట్రంలో మరో ముఠా ఉంది. అది పిల్లలను ఎత్తుకుపోయేది జాగ్రత్తసుమా?"

ఎవరిమాటా వినవద్దు. ఎవర్నినమ్మవద్దు - నమ్మేరో నిండా మునిగి పోయారన్నమాటే - మాఅశోక్ కూడా అలాగే మునిగిపోయాడుగా - తేలివచ్చాడుగాని

నాచేతిలో చచ్చాడు అహోహో మా అశోక్ చచ్చిపోయాడు - అశోక్‌ని ఎవరో చంపలేదు - నేనే, నేనే నా చేతులతోనే చంపేసాను ఈ చేతులతోనే గోరుముద్దలు తినిపించాను - ఈ నోటితోనే కథలన్నీ వినిపించాను. ఆఖరికి గొంతు పిసికి చంపాను. కాదు కాదు, అబ్బో నాముద్దులకొడుకుని నేను గొంతుపిసికి చంపగలనా? అందుకే స్లీపింగ్ టాబ్లెట్స్ ఇచ్చాను. తెల్లారేసరికి చచ్చి ఊరుకున్నాడు భలే చచ్చాడుకదూ.

సైలెన్స్ సైలెన్స్ ఏమిటా అల్లరి -ఎందుకు రామూ నీవు నిలబడ్డావు. పాఠం అర్థం కాలేదా? అశోక్‌ని ఎందుకు చంపాను అనిఅడుగుతున్నావా, మంచి సందేహమే వచ్చింది. చెబుతాను పిల్లలందరూ జాగ్రత్తగా వినండి మరలా మరలా అడగకండే మరలాచెప్పను. ఇప్పటికే పోలీసులకు, ఇరుగుపొరుగువారికి చెప్పి అలసి పోయాను.

ఆరోజు పాపం అందరిలాగే స్కూలుకివెళ్ళాడు. కానీ అందరితో పాటు తిరిగిరాలేదు. రాత్రి ఏడుగంటల వరకూ చూసి ఆశోక్ ఫ్రెండ్స్ అందరి ఇళ్ళకు వెళ్ళి అడిగాను - అందరూ ఒకటే సమాధానం.

స్కూలు విడిచిపెట్టినతరువాత చూసాం. ఆ తరువాత ఏమయ్యారో తెలియదని, ఆరాత్రి పోలీసు కంప్లయింట్ యిచ్చాము. పేపర్లలో వేయించాను. అయిదురోజులు నిద్రాహారాలు లేక నిమిషం శాంతిలేక క్షణమొక యుగంలా, అశోక్ కోసం ఎదురుచూశాను అప్పుడు నేను పడ్డబాధ వర్ణించలేను. ఉన్న ఒక్కగానొక్క కొడుకు నా ఆశాదీపం ఏమైపోయాడోనని తల్లడిల్లి పోయాను. అప్పుడే చుట్టాలవిలువ తెలిసింది. ఒకరిద్దరు ఫ్రెండ్స్ తప్పించి నిజానికి నాకెవరూ లేరు - భర్తలేని నన్ను ఆడవాళ్ళు అనుమానంగాను, మగవాళ్ళు ఆశగాను చూస్తున్నారని తెలిసి అందరికీ దూరంగా బ్రతుకుతున్నాను, ఇటు పోలీసుస్టేషనుకి అటు ఫ్రెండ్స్ ఇళ్ళకు శవంలాగే తిరిగాను. బాబు, బాబు అంటూ పిచ్చాసుపత్రినుండి పారిపోయి వచ్చినట్లు వెతికాను -

అయ్యో భగవాన్! నా బిడ్డను ఏం చేశారు నేనుజన్మలో ఏం కోరను తండ్రీ నా బిడ్డను నాకు కనీసం శవరూపంలోనైనా చూపించు అని ఏడ్చాను - అయిదురోజుల తరువాత నా ఊపిరి ఊడిపోయేవేళ ఊడిపడ్డాడు అశోక్. అయోమయంగా, బిత్తర చూపులు చూస్తూ బెదిరిపోతూ, భయపడి ఒణికిపోతున్నాడు -

అశోక్‌ని ఎవరో ఎత్తుకుపోయారు - వారిదగ్గరనుండి ఎలాగో తప్పించుకొని వచ్చాడట - అమ్మా, నన్ను విడిచి పెట్టవద్దు ఆ రాక్షసులు నన్ను చంపేస్తారు అని వచ్చినదగ్గరనుండి ఒకటే ఏడుపు.

నా బాబు నాకు దొరికిన సంతోషం కంటే వాడిని ఎలా రక్షించుకోవాలా అనే తపన ఎక్కువైంది నాలో. పోలీసులకు మరలా చెప్పాను, వారి ద్వారా నాకు రక్షణ దొరుకుతుందన్న ఆశలేదు నాకు - నా బ్రతుకు ఎందుకిలా అయింది అంటూ మధ్య మధ్యలో వెక్కి వెక్కి ఏడుస్తూ అంతలోనే ఫక్కుననవ్వుతూ.

సైలెన్స్ - సైలెన్స్ అని అరుస్తూ గోడ మీద ఏదో వ్రాస్తూనే వుంది శారద కారుతున్న రక్తంతో.

ఆ, ఎక్కడ వరకూ చెప్పాను. ఇదిగో ఈ స్థలంలో వాడిని ఎత్తుకుపోయారట. ఈ స్థలంలో దాచారట, ఈ రూటుగుండా పారిపోయి వచ్చాడట జాగ్రత్తగా పాయింట్స్ నోట్ చేసికోండి, ఈ విధంగా అశోక్ రావడం అయితే వచ్చాడుగాని, మనషిమాత్రం మనలో లేడు. వుండుండి కెవ్వున అరిచే వాడు. "అమ్మా, వాళ్ళు వచ్చేస్తున్నారు. నా కళ్ళు పీకేస్తున్నారు. నా కాళ్ళు నరికేస్తున్నారు. నన్ను రక్షించమ్మా రక్షించు అంటూ గొల్లున ఏడ్చేవాడు, గోలపెట్టేవాడు మనిషి అంతా నీటిలో ముంచి తీసినట్లు తడిసిపోయేవాడు, భయంతో శరీరం చల్లగా అయిపోయేది ఇటు డాక్టర్ దగ్గరకు అటు పోలీసుల దగ్గరకు పరుగుపెట్టడంతోనే సరిపోయేది నాకు. ఎక్కడకు వెళ్ళినా. ఆఖరికి బాత్‌రూమ్‌కి వెళ్ళినా నన్ను వదిలేవాడుకాదు. ఉద్యోగానికి సెలవుపెట్టేసాను. రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి పెద్ద వారి అండదండలు భర్త నీడకు నోచుకోని జీవితం నాది. ఆ దుండగులు వాడి కోసం వెంటాడుతున్నారని అర్థం అయింది నాకు. వాడిని చూస్తూ చూస్తూ వాళ్ళకు మరలా అప్పగించగలనా?

ఒకరోజు బజారుకు వెళ్ళాం. అసలే బెదురు బెదురుగా వున్న అశోక్ ఎవరినో చూసి కెవ్వున అరిచాడు. ఏమైందని అడిగేసరికి అప్పుడే అతను జనంలో కలిసిపోయాడు వాళ్ళు ఎలాగయినా అశోక్‌ని తిరిగి పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నారు. వాళ్ళ రహస్యాలు అశోక్‌కి తెలుసునని వారి భయం. పోలీసులకు ఈ విషయం చెప్పాను. అశోక్ కలవరింతలు మానలేదు. అమ్మా అదిగో ఇనుపఊచ కాల్చి నా కళ్ళలో పెట్టేస్తున్నారు గుడ్డివాణ్ణి చేసి అడుక్కోమంటున్నారు. కత్తితెచ్చి నా కాళ్ళు నరికేస్తున్నారు. కుంటివాణ్ణి చేసి జేబులు కొట్టేయమంటున్నారు. అమ్మా అక్కడ నాలాంటి వాళ్లు చాలామంది వున్నారు. నన్ను ఎత్తుకొని పోతారు. హింసిస్తారు అంటూ హృదయ విదారంగా ఏడుస్తూనే వున్నాడు. నా గుండెను మామూలుగా కోస్తూనే ఉన్నాడు.

ఆ మర్నాడు కిటికీలో నుండి ఒకచీటి పడవేసి వుంది "మర్యాదగా లొంగిపో లేదంటే శిక్ష అనుభవిస్తావు" అని వుంది. ఆ చీటి చూసి మరింత వణికిపోయాడు. వాడి బాధ చూసి తల్లిగా ఒక నిర్ణయానికి వచ్చాను. వాళ్ళు మరలా ఏదో విధంగా అశోక్‌ని పట్టుకెళ్ళడం, బాధలు పెట్టడం ఖాయం. ఆ దుండగుల చేతిలో నరక యాతనపడేకంటే, నా కొడుకు నాకళ్ళెదురుగా చనిపోవడం నాకు ఇష్టమే వాడికి స్లీపింగ్ పిల్స్ ఇచ్చాను. నేనూ వేసికున్నాను. చావు పిరికి వాళ్ళ లక్షణం అని మీకెన్నోసార్లు చెప్పాను కదా పిల్లలూ! కాని చావడానికి చంపడానికి చాలా ధైర్యం కావాలి అని అప్పుడే తెలిసింది. మీరందరూ మీ కన్నతల్లుల్ని వెళ్ళి అడగండి నేను చేసింది తప్పని ఏతల్లి అయినా గుండెల మీద చేయి వేసికొని చెప్పమనండి ఏ తల్లయినా ఎంతో అల్లారు ముద్దుగా పెంచుకున్న తన పిల్లలను గూండాలచేతకి అప్పజెప్పుతుందా వాళ్ళు బాధలు

పెడుతుంటే సహించగలదా? తన కళ్ళెదురుగా చనిపోయినా కన్నతల్లి సహిస్తుందిగాని తమ పిల్లలు వేరొకరి చేతిలో బాధలు పడితే సహించలేదు.

అదృష్టం కొద్ది అశోక్ చనిపోయాడు. నేను చావలేదు. ఏదేశంలోనూ ఏ కన్న తల్లీ చేయని పనిచేసాను. నా కొడుకుని నా చేతురాలా చంపుకున్నాను. ఇప్పుడువాడు లేడన్న దిగులు లేదునాకు పైగా అభం శుభం తెలియని నాబాబు ఆ దుండగుల చేతిలో అల్లల్లాడి పోలేదని ఆనందంగా ఉంది. నేను అశోక్‌ని చంపడం అది నా తప్పే అని మీరంటే నేను ఒప్పుకోను. ఆ తప్పు నాదికాదు. ఈ దేశానిది. ఎందరో నాలాంటి అభాగ్యులు దురదృష్టవతులయిన కన్నతల్లులు ఇలాంటి దురాగతాలకు బలయిపోతూ తమపిల్లలినీ దొంగముఠాలకు వేశ్యాగృహాలకు బలియిస్తూ ఎంతగా కుమిలిపోతున్నారో ఏవిధంగా కృశించిపోతున్నారో ఎలా జీవశ్చవంలా బ్రతుకుతున్నారో ఎవరయినా ఆలోచించారా?

మన దేశంలోని నాయకులు ఏం చేస్తున్నారు. ఇలాంటి ఎన్నో రకాలయిన అన్యాయాల్ని అరికట్టలేని మన దేశంలో మనం బ్రతికేస్తున్నాం, మనుషుల్లా కాదు మనసులేని మానుల్లా, నాయకులు ఓట్లు అడిగి గెలవగానే సరికాదు. మనిషికి కావలసింది వాగ్దానాలుకాదు. మాటలను చేతలలో పెట్టడం మనిషి సంఘంలో ఎంత శాంతిగా బ్రతుకుతున్నాడు అని ఆలోచించాలిగాని, మాకు ఓట్లు వేసి, మీ పాట్లు మీరు పడండి అనడం సబబు కాదు. మీ పరిపాలనలో ప్రజలు చాలా సుఖంగా ఉన్నారు అని అనుకున్ననాడు మాత్రమే మన నాయకులు గర్వించాలి గద్దెనలంకరించాలి. దేశంలో సమానత్వము నెలకొన్ననాడు, అమాయకులయిన ప్రజలు ఇన్ని అగచాట్లు పడరు. అందరికీ తిండి బట్ట దొరికిననాడు "కూటి కొఱకు కోటి విద్యలు అంటూ నాలాంటి అభాగ్యుల పిల్లలను అపహరించరు. నిరుద్యోగ సమస్యను నిర్మూలించి ప్రజలందరికి కనీసం కడుపునిండా తిండి ఇవ్వగలిగిన దేశంలో నాలాంటి తల్లులు కొడుకులను హత్య చేసే అవసరము ఉండదు. ఉన్నవాడే ఇంకాసంపాదిస్తూ, లేనివాడు మరింత నీరసిస్తూ దేశం ఉంటే అన్యాయాలు, అక్రమాలు ఎవరెస్టు ఎక్కక ఏం చేస్తాయి?

శారద ఉద్వేగంతో ఆవేదనతో చెప్పి చెప్పి సొమ్మసిల్లి పడిపోయింది. ఎక్కువగా మాట్లాడినందువలన కాదు, చేతి నుండి రక్తం గోడమీద బొమ్మలు గీసిగీసి ధారగా ప్రవహించి, ఆ గదంతా రక్తమయం చేసినందువలన ఆమె ప్రాణం అనంత వాయువుల్లో కలిసేవరకు ఆమె అలా అరుస్తూనే ఉంటుంది. అంతకంటే ఏం చేయగలదా అభాగిని.

(జయశ్రీ, జూన్ 1989)

★ ★ ★

# రక్తమా నీదేకులం?

"గాలికి, వానకు, వరదకు, ఆకలికి, బాధకు, భాషకు - వేటికీ కులం లేదు. అన్నీ అందరికీ సమానమే. ప్రకృతి, ఎండ, నీడ - అన్నీ మనుషుల నందరినీ సమానంగానే చూస్తాయి. కాని, మనిషి మాత్రం తక్కువ కులం వాడైన తన తోటి మనిషిని సమానంగా చూడలేడు." చదవడంలో లీనమై పోయిన తన కళ్ళు ఎవరో వెనుక నుంచి మూయడంతో ఒక్కసారి ఉలిక్కిపడింది సమీర. ఈ కొంటె పని ఎవరిదో కూడా తెలుసు. రవికి తప్పించి ఎవరికి ఉంది ఆ అధికారం? తన సుతిమెత్తని చేతులతో అతని చేతులు తప్పించబోయింది. తన కళ్ళ మీదున్న ఆ చేతుల్ని ఆ నిమిషంలో అవే పెదవులన్నట్లు కళ్ళతోనే మనసులో ముద్దు పెట్టుకుంది. తన మెడలో మూడు ముళ్ళు వేసిన అతని చేతులు, తనతో ఏడడుగులు నడిచిన ఆ కాళ్ళు, తన శరీరంలో శరీరం అయిన అతని మేను, అన్నింటికీ మించి రక్తమాంసాలతో కాక వెన్నతోను, మంచితనంతోను చేసిందా అనిపించేంతటి అందమైన, ఆదర్శవంతమైన అతని హృదయం, దేవుడంటే ఇలాగే ఉంటాడా అనిపించే విధంగా ప్రేమతో మైమరపించే అతని ప్రవర్తన ప్రపంచంలో దేనికీ సాటిరావు.

రవి తన చేతులు తీసి మెడ మీదుగా ఆమె గుండె మీద వేసి, బుగ్గ మీద ముద్దు పెట్టుకున్నాడు. "ఏమిటోయ్, పతిదేవుడు వచ్చి పది నిమిషాలైనా ఆ వారఫలాలు తెగ చదివేస్తున్నావు. నీవు పుట్టిన నక్షత్రమేమిటో తెలియదన్నావు. అన్నిటిలో ఏ రాశి బాగుంటే అదే ఈ వారానికి నీకు అన్వయించుకుంటున్నావా?" అని సరదాగా అన్నాడు. నిజమే. సమీరకు తను ఎప్పుడు పుట్టిందో కూడా తనకే తెలియదు. నిరక్షరాస్యులైన తన తల్లిదండ్రులు సంక్రాంతికి ముందు వచ్చిన పౌర్ణమినాడు అంటారు. సంవత్సరం అంతకంటే తెలియదు. సర్టిఫికేట్‌లో ఉజ్జాయింపుగా తనే వేసేసుకుంది. తల్లిదండ్రులు ఎంత చదువు లేని వారైనప్పటికీ చాలా కష్టపడి తనను ఇంటర్ వరకూ చదివించారు. తరువాత మెడిసిన్ ఒక మహానుభావుడు చదివించాడు. అంతటితో ఊరుకోలేదు. అతని కొడుకుని ఇచ్చి వివాహం చేసి ఆ ఇంటికి అధికారిని చేశాడు. రవి తండ్రికి చదువంటే మహా ఇష్టం. సమీరకున్న అత్యంత తెలివితేటలు చూసి ఆయన ఎంతో మురిసిపోయారు. మురిసిపోయి ఊరుకోలేదు. తన కొడుకుతో చెప్పి ఆయన కోడలిగా చేసుకున్నారు. కులం గురించి ఆయన తలవలేదు. కారణం ఆయన కూడా కులాంతర వివాహం చేసుకోవడమే.

విధి ఎంతో విచిత్రమైంది. కూలి పని చేసుకునే వాడి కడుపున పుట్టిన సమీర కోటీశ్వరుడి కోడలైంది. సమీర మామగారు సమీర తెలివితేటలకే ప్రాధాన్యం ఇచ్చారు.



ఆయనకు ఎంత డబ్బున్నా తన భార్యా, కూతురూ సరైన వైద్యం లేక మరణించడం ఆయన జీవితంలో పెద్ద అశనిపాతం. అందుకే సమీరకు చదువు మీద ఉన్న దీక్షతో పాటు ఆమె వినయ విధేయతలు, అందచందాలు ఆయనను బాగా ఆకర్షించాయి. ఆమె తన మాట విని, ఆ పల్లెలో ప్రాక్టీసు పెడుతుందనే నమ్మకం కలిగి ఆమెను చదివించారు. అంతేకాదు, అలాంటి అన్ని మంచి లక్షణాలున్న అమ్మాయిని మరొకరి చేతులలో పెట్టడం ఆయనకు ఇష్టం లేదు. మొదట్లో సమీరను కోడలిని చేసుకునే ఉద్దేశం లేదాయనకు. కాని, రవి ఇష్టపడుతున్నాడనీ, ఆమె అతనికి దూరంగా వెళ్ళిపోవాలని ప్రయత్నిస్తోందనీ తెలిసి కొడుకు మనసుకు నచ్చినట్లుగా ఆమెను కోడలిగా చేసుకున్నారు. రవికి భార్యంటే పంచప్రాణాలు. బ్రహ్మదేవుడు తన కృషికి నిదర్శనంగా ఆమెను సృష్టించినట్లు భావిస్తాడు రవి. కులం, పేదరికం అతని మనసులోని ప్రేమకు అడ్డు రాలేదు. రవి ఆమె అందాన్ని ఎంతగా ఆరాధిస్తాడో, ఆమెలోని మంచి తనానికి, సంస్కారానికి అంతగానూ అభినందిస్తాడు. హాస్పటల్ పని, ఇంటి పని కూడా ఇద్దరూ సమానంగా చేసుకుంటారు.

ఆరేళ్ళ హరిత "మమ్మీ, ఆకలి" అంటూ స్కూలు నుంచి పరుగెత్తుకు వచ్చింది. హరితకు, రవికి టిఫిన్ పెట్టి, తాను తీసుకుంది సమీర. హరితను చూస్తుంటే తన

చిన్న నాటి రోజులు గుర్తుకు వస్తాయి ఆమెకు. ఆ వయసులో తను అ, ఆ లు దిద్దుకుంటూ, తమ్ముణ్ణి ఆడిస్తూ అమ్మా, నాన్నా పని నుంచి వచ్చేసరికి చిరిగిన గౌనుతో చీమిడి ముక్కుతో వచ్చీ రాని వంట సిద్ధం చేసి ఉంచేది. అప్పుడప్పుడు సెలవుల్లో తండ్రి పని చేసే మేడకు వెళ్ళి తండ్రితో పాటు తోటకు నీళ్ళు పెట్టి, చెట్లకు చుట్టూ గట్టు కట్టేది. ఆ పువ్వులను చూస్తూ మైమరచిపోయేది. ఇంటి యజమానురాలు అప్పుడప్పుడూ సంతోషంగా ఇచ్చే డబ్బులతో పుస్తకాలు కొనుక్కొనేది. గౌనులుమానేసి ఆ మూడంతస్తుల మేడ చూసి ఆ మేడలోని వారు మేడపై నుంచి చందమామను అందుకుంటారు కాబోలు' అని సమీర చిన్నారి హృదయం భ్రమపడేది. చందమామను పేదవారికి, గొప్పవారికి కూడా అందదని, అది అందరికీ సమానంగా చల్లదనాన్ని ఇస్తుందని, దానికి తర తమ భేదాలు లేవని, ఆ భేదాలన్నీ ఆ ఇంటిలోని వారికే అని ఆ పసిమనసుకు తెలియదు. ఆ ఇంటిగలావిడ అప్పుడప్పుడు చిల్లర డబ్బులిచ్చినా సమీర చిరిగిన గౌను చూసి చీదరించుకునేది.

రవి గబగబ తయారై అప్పుడే గేరేజ్‌లో నుంచి కారు తీసి హారన్ కొట్టాడు. ఉలిక్కిపడి హరితకు 'టా టా' చెప్పి ఉరుకులు పరుగులతో కారులో కూలబడింది సమీర. రవి చెయ్యి ఒకటి సమీర మీద, మరొకటి స్టీరింగ్ మీద వేశాడు. ప్రశాంతి నర్సింగ్ హోమ్ ముందు కారాగింది. పేరుకి తగినట్లుగానే ప్రశాంతంగా ఉంది ఆ హాస్పిటల్ వాతావరణం కూడా. రకరకాల పూల చెట్లు చల్లని గాలికి సుతారంగా తలలూపుతూ అందరినీ రమ్మని ఆహ్వానిస్తుంటే, శాంతిస్వరూపులై, తెల్లని దుస్తులు ధరించిన సిస్టర్స్ చిరునవ్వులతో పేషెంట్స్‌ని రిసీవ్ చేసుకుంటున్నారు. 'సహృదయంతో సేవలు చేస్తాం. చిరు నవ్వులతో రోగిని చూస్తాం. మంచి మాటలతో ధైర్యం చెబుతాం. ఆపైన మందులు ఇస్తాం' అంటున్నట్లున్నారు ఆ హాస్పిటల్‌లోని స్టాఫ్ అంతా! మానవ సేవే మాధవ సేవకు ప్రతిరూపం ఆ హాస్పిటల్ "డబ్బుతో కొనలేనిది, దేవుణ్ణి ఎదిరించి సాధించలేనిది ప్రాణం. దానిని జాగ్రత్తగా కాపాడడం మావన ధర్మం" అంటారు రవి, సమీర.

ఆ హాస్పటల్‌లో ధనానికి కంటే ప్రాణానికి విలువ ఎక్కువ. 'ఎవరు మీరు, ఏ పుట్టుక మీది, ఏ కులస్థులు, ఎంత ధనవంతులు' అన్నది వారికి అనవసరం. అందరూ ప్రాణులే! అందరికీ ఆకలి దప్పులు, బాధ, భయం, ప్రాణంపై తీపి - అన్నీ సమానమే అన్నది వారి అభిప్రాయం.

ఆ మర్నాడు రవి ఏదో ఆపరేషన్ ఉందంటూ థియేటర్‌లోనికి వెళ్ళిపోయాడు. సమీర అవుట్ పేషెంట్స్‌ని చూస్తుంది. పేషెంట్స్‌ని చూడడంలో నైతేనేమి, వారికి బ్రతుకు మీద ధైర్యం కలిగించడంలో నైతేనేమి సమీర చాలా నేర్పరి. పెదవులపై చిరునవ్వు మాయకుండానే పని చేస్తుంది. విసుగు, విరామం అన్న మాటలు ఆమె జీవితంలో

ఎప్పుడూ వినలేదేమో. వాటి అర్థాలు కూడా తెలియవేమో అన్నట్లు ప్రవరిస్తుంది. అందర్నీ ఓపిగ్గా చూసి పంపించేసింది. ఇంక పేషెంట్సు ఎవరూ లేరు. రవి దగ్గరకు ఆపరేషన్ థియేటర్‌లోకి వెళదామనుకున్నంతలో ఎమర్జెన్సీ కేసు ఒకటి వచ్చింది. ఒక అమ్మాయిని స్పృహలేని స్థితిలో తీసుకొచ్చారు. కేస్ చూడగానే అర్థం అయింది. అబార్షన్ కేస్ అని. అటువంటివి చాలా మమూలే. బహుశా పెళ్ళి కాకుండానే గర్భవతి అయి ఉంటుంది. ఏ నాటు మందో వేసినట్లున్నారు. కేస్ కొంచెం సీరియస్ కండిషన్‌లోనే ఉంది. "ఈ అమ్మాయి తరపు వారెక్కడ" అని అనేసరికి ఒక నలభై అయిదు సంవత్సరాలావిడ తల వంచుకొని నిలబడి ఉంది. "మీరేనా ఈ అమ్మాయి తల్లి?" అని సమీర అడిగేసరికి తల పైకెత్తిన ఆవిడ సమీర ముఖం చూసి ఒక్కసారి పడగ విప్పిన పాముని చూసినట్లు అప్రయత్నంగా అడుగు వెనక్కి వేసింది. ఆవిడ మొహం చూసిన సమీర కూడా కరెంట్ షాక్ తిన్నట్లయింది. "మీరు... మీరు... నువ్వు... నువ్వు... మీరావికదూ" అంది అతి కష్టంగా. ఆవిడ మాటలు తడబడుతున్నాయి. సమీరను నమ్మలేనట్లు, ఇది అసంభవం అన్నట్లున్నాయి ఆవిడ చూపులు. 'ఇది ఎలా జరిగింది? నేల మీదుండే చెక్కబొమ్మ ఆకాశంలోని చందమామ ఎలా అయింది? ఎప్పుడయింది?" అంతా అయోమయంగా, అపనమ్మకంగా ఉందావిడకు. ఆశ్చర్యంగానూ ఉంది. తెలిసిన అమ్మాయే కాబట్టి తన కూతురును బ్రతికిస్తుందని ఆనందంగానూ ఉంది. ఓడలు బండ్లు, బండ్లు ఓడలవుతాయని వాళ్ళ అమ్మ చెప్పగా విన్న ఆవిడ ఇప్పుడు దాన్ని నిజంగా అనుభవిస్తూంది.

సమీరకు ఆవిడకు సమాధానం చెప్పే అవకాశం కూడా లేదు. ముందు పేషెంటుని చూసింది. కావలసిన ట్రీట్‌మెంట్ ఇచ్చింది. కాని అమ్మాయి చాలా బలహీనంగా ఉంది. రక్తం ఎక్కించవలసి ఉంది. అప్పుడు బయటకు వచ్చి ఆవిడను చూసింది. పట్టుచీర తప్ప కట్టని చిన్నప్పటి తమ ఎదురింటి మేడ ఆవిడ తనని చీదరించుకుని, చివరికి పురుగుని చూసినట్లు చూసి ఆ రోజున తరిమి కొట్టినావిడ ఇప్పుడు పాత చీరలో తన ఎదురుగా నేలమీదనే. తనని దేవతలా భావిస్తూ, చేతులు జోడించి, ఆ చేతులతోనే తన చేతులు పట్టుకొంది. "ఇవి చేతులు కావు - కాళ్ళు అనుకోండి" అన్న భావం నీరు నిండిన ఆమె కళ్ళలో కనబడింది సమీరకు.

"చూడండి, నేను మీరానే. పెళ్ళయిన తరువాత మావారు నా పేరుని సమీరగా మార్చారు. అప్పటికీ, ఇప్పటికీ ఇంకో తేడా కూడా ఉంది. అప్పుడు మీ ఇంటి చెట్లకు సేవ చేశాను. ఇప్పుడు రోగులకు సేవ చేస్తున్నాను. అది సరే! మీ అమ్మాయిని చూశాను. అమ్మాయికి ప్రాణగండం తప్పింధి కాని..." అటూ సంశయాత్మకంగా ఆగిపోయింది సమీర. అలా ఆగిపోవడానికి కారణం ఆమె డబ్బు తీసుకొని రాలేదు అని కాదు - ఆవిడ మనస్తత్వాన్ని చిన్నప్పుడే కాచి వడబోసి గ్రహించడమే.

"చెప్పమ్మా చెప్పు. ఏం చెయ్యాలో చెప్పు" అంటూ ఆత్రతగా అడిగింది వరలక్ష్మి. ఆవిడ మొహంలో 'ఇప్పుడు గంగలో దూకమంటే దూకుతాను. నిప్పుల్లో నడవమంటే నడుస్తాను' అన్న భావం కనిపించింది సమీరకు. కాని, ఆ రోజు ఆవిడ గదులు తుడిచిపెట్టమని అడిగిననాడు - ఆవిడ తుంటరి తనయుడు చెయ్యి పట్టుకున్నాడని చెంగు లాగాడని పిర్యాదు చేస్తే ఎంత చండాలంగా మాట్లాడింది! ఆవిడ తన కొడుకుని సపోర్టు చేసుకున్నందుకు సమీర బాధపడలేదు. తనపై నింద వేసినందుకే కుమిలిపోయింది. "నీవే వాడిమీద పడి ఉంటావు. పైగా ఏమీ ఎరగనిదానిలా నాకు నంగనాచి కబుర్లు చెబుతున్నావు. మీ సంగతులు నాకు తెలియవు అనుకోకు. షోకులకు డబ్బు కావాలి. అమ్మా, అయ్యా తెచ్చింది తిండికే సరిపోదు. అందుకే డబ్బున్న కుర్రాళ్ళమీద వలవిసిరి, డబ్బు గుంజుతారు. మీ కులం వాళ్ళకు శీలం పోయినా ఫరవాలేదు. షోకులు తీరితే చాలు." అంతే. ఆ మాటలతో ఆనాడు చేతిలోని చీపురుని కూడా అలాగే వదిలేసి ఏడ్చుకుంటూ పరుగెత్తుకొని ఇంటికి వెళ్ళిపోయింది. అప్పటికి పదిహేను సంవత్సరాలు సమీరకు. సెక్స్ అన్న పదమే తెలియదు. కాని విచిత్రంగా ఆ విషయాలన్ని జోడించి, బాగా జాడించిందావిడ. ఆ తరువాత సమీర జీవితం ఎంతో మారినా, ఆనాటి ఆవిడ మాటలను, అహంకారాన్ని మాత్రం మరచి పోలేదు ఇప్పటికీ.

ఆ పల్లెటూరిలో దేవాలయంలోని దేవుడితో సమానంగా వైద్యశాలలోని దంపతులైన ఆ డాక్టర్లు పేషెంట్లని చూస్తున్నారని, వారు తప్పించి ఆ చుట్టప్రక్కల మంచి డాక్టర్లు ఎవరూ లేరని అందరితోపాటు వరలక్ష్మికి తెలుసుగాని, ఆ డాక్టరే 'మీరా' అని మాత్రం తెలియదు. కాలదన్నినరాయి తలకు మూలరాయి అవుతుందని అంతకన్నా తెలియదు.

"మీ అమ్మాయికి రక్తం కావాలి. ఆ గ్రూప్ రక్తం ఒకే ఒక సీసా ఉంది. అది వెంటనే ఇవ్వక పోతే అమ్మాయి బ్రతకడం కష్టం కాని..." అంటూ మరలా ఆగిపోయింది సమీర."అమ్మా! మీరమ్మా! నా దగ్గర పైసా లేదు. అమ్మాయి ఉద్యోగం చేసి మమ్మల్ని బ్రతికిస్తూంది. అది చస్తే దానితో పాటు మేమూ చావాలి. నీ ఋణం ఎలాగోలా తీర్చుకుంటాను. దాని ప్రాణం కాపాడు తల్లీ." అంటూ ఘొల్లుమంది. "మీరు తప్పుగా అర్థం చేసుకున్నారు. నాకు డబ్బు ముఖ్యం కాదు - ప్రాణం ముఖ్యం. ఆ రక్తం ఒక రిక్షావాడు అమ్ముకున్నాడు. ఆ కులాన్ని, ఆ పేదవారిని చీదరించుకునే మీరు ఆ రక్తం మీ అమ్మాయికి ఎక్కించమంటారా అని అడుగుతున్నాను" అంది సమీర.

ఆ మాటలు అలా కాకుండా వేరేలా అనిపిస్తున్నాయి వరలక్ష్మి మనసుకు. 'ఆ నాడు నన్ను కులం తక్కువదానిని కాబట్టి గుణం తక్కువదానివి అన్నారు. నేను అప్పుడు ఏ తప్పు చేయకపోయినా నిందలు పడ్డాను. మరి ఇప్పుడు మీ కూతురిని ఏ కులంలో చేర్చమంటారు? చదువూ సంధ్యా లేక, తాగి తందనాలాడే మీ అబ్బాయిని

ఏ మతంలో చేర్చమంటారు? డబ్బు లేనివారిని దరిద్రులుగా భావించే మిమ్మల్ని ఇప్పుడు ఏ పేరుతో పిలవమంటారు? మనిషి సంస్కారాన్ని బట్టి విలువ ఇవ్వండి - సంపదను బట్టి కాదు. మనిషిలోని రాక్షసత్వాన్ని, నీచత్వాన్ని వెలివేయండి - కులాన్ని కాదు. నీకుంటే నీవు తింటావు. నాకుంటే నేను తింటాను. అంతేగాని లేని వారిపై చులకనభావం, ఉన్న వారిపై ఉన్నత భావం పెంచుకోవడం చాలా తప్పు. మానవత్వంతో మసలేవారే నిజమైన ఉన్నతులు" అన్నట్లున్నాయి.

"చచ్చిన పామును ఇంకా చంపకు, తల్లీ మంచి మనుషుల విలువ ఇప్పుడే కాదు, నా జీవితంలో విధి వక్రించిననాడే తెలుసుకున్నాను" అంటూ కన్నీరు తుడుచుకుంది వరలక్ష్మి. ఆవిడ కది కన్నీరైనా, అది మనసు మార్పుతో వచ్చిన కన్నీరు కాబట్టి, అది పన్నీరుగానే భావించి ఆవిడ భుజంపై చేయి వేసి, చిరునవ్వుతో ధైర్యం చెప్పింది సమీర.

'మాటలు రాని మృగాలు సైతం కలసి మెలసి జీవించేను - మాటలు నేర్చిన మానవజాతి మారణహోమం సాగించేను' అన్న మాట చెవుల్లో మారుమ్రోగుతూంది సమీరకు.

(ప్రభ, 23-04-86)

☆ ☆ ☆

# పరిష్కారం

"అమ్మా! నీవేమీ అనుకోనంటే నాదొక చిన్న మాట" ప్రమోద్ తల్లితో అన్నాడు.

వంట గదిలోకి వెళ్ళి ఆమె స్టౌ మీద తాలింపు వేస్తున్నదల్లా వెనక్కి తిరిగి "ఏమిటి నాయనా" అంది ఆప్యాయంగా.

"నేను ఒకమ్మాయిని ప్రేమించాను. ఆమెను..." ఇంకా మాట పూర్తి చేయకుండానే ఆశ్చర్యంగా చూసింది కొడుకు వైపు.

"పెళ్ళిచేసుకుంటావా?" ప్రశ్నించింది. "అవునమ్మా ఎంత త్వరలో మా పెళ్ళి అయితే అంత మంచిది" ప్రమోద్ మాటల్లో ఏ విధమైన తొణుకూ, బెణుకూ లేదు. అతను మాట్లాడే తీరుకి ఆశ్చర్యపోయింది సావిత్రి. తనతో మాట్లాడేది తన కొడుకు కాక మరెవరో అనిపించింది. ఆమెకు ఆ నిమిషంలో "నీకు మతి వుండే మాట్లాడుతున్నావా?" అడిగింది.

"అవునమ్మా మతి వుంది కాబట్టే ధైర్యంగా చెప్పగలుగుతున్నాను. ఆ అమ్మాయి ఇప్పుడు గర్భవతి" అన్నాడు. అదేదో నాకు ఉద్యోగం వచ్చింది అన్నంత తేలికగా అన్నా, సావిత్రికి పక్కన పిడుగు పడినట్లయింది.

"బాబూ! నీవు చెప్పేది నిజమని నమ్మమంటావా? అన్నయ్యకే ఇంకా పెళ్ళి కాలేదు. అన్నయ్యకు సంబంధాలు చూస్తున్నాం కదా, ఇంకా కుదరడం లేదు. నీవింకా చదువుకుంటున్నావు, నీకిప్పుడు పెళ్ళా. నీకు చదువు ముఖ్యమనిపించలేదా? అమ్మాయిల వెంట పడ్డావు" కొడుకు ఈ మధ్య ఆలస్యంగా రావడంతో అలా అడిగింది.

"అమ్మా! పొరపాటు జరిగిపోయింది. అది వెనక్కి తీసుకోలేనిది. ఈ యింట్లో ఎవరు ఔనన్నా, కాదన్నా కూడా మా పెళ్ళి జరిగి తీరుతుంది. నా వలన ఒక అమ్మాయి అన్యాయం అయిపోవడం సహించలేను"

"నీవేకాదు, నేనూ సహించలేను' అంది సావిత్రి. ఆవిడకు పొరపాటున కాలు జారి గర్భవతి అయ్యి, యింట్లో చెప్పలేక ఆత్మహత్య చేసికున్న తన కూతురు కళ్ళల్లో మెదిలింది. అప్పటికే ప్రమోద్ చాలా చిన్నవాడు. అతనికి ఆ సంగతి అంతగా తెలియదుగాని, సావిత్రి కళ్ళల్లో ఎప్పుడూ ఆ దృశ్యమే కదలాడుతూ వుంటుంది.

'భగవంతుడా! ఈ యింటికి ఏమి శని పట్టిందయ్యా. ఉన్న ఒక్క కూతురూ ఉరి పోసుకొని చనిపోయింది. మరలా ప్రమోద్ కూడా అదే దారిలో నడుస్తున్నాడా? ఈ యింటిని ఏమి చేయదలచుకున్నావయ్యా?' అని కనిపించని దేవుణ్ణి అడిగింది.



మెల్లగా అంది "మీ నాన్నగారు వచ్చిన తరువాత ఆలోచిద్దాం." అని. "అమ్మా ఆలోచించడం కాదు. ఔననిపించాలి." అన్నాడు ధృడంగా.

సాయంకాలం భర్త వస్తూనే సంతోష వార్త తెచ్చాడు. పెద్ద కొడుకు వినోద్ వెళ్ళి చూసి వచ్చిన సంబంధం, వారు అడిగినంత కట్నం యివ్వడానికి ఒప్పుకున్నారని, వచ్చే నెలలో ముహూర్తం అని. కాని సావిత్రి ఆ వార్త విని సంతోషించే మూడ్‌లో లేదు. చిన్న కొడుకు సంగతి భర్త చెవిలో ఎలా వేయాలా అని ఆలోచిస్తోంది.

"ఏమిటి సావిత్రీ, మాట్లాడకుండా ఆలోచిస్తున్నావు?" అన్నాడు సూర్యం. ఇంక చెప్పక తప్పలేదు. ప్రొద్దున్న ప్రమోద్ అన్న మాటలు చెప్పింది.

ఆనందాన్ని ఒక ప్రక్కకు పెట్టి ఆలోచనలో పడ్డారాయన.

"సరే, పెద్దాడి పెళ్ళి కానివ్వు ముందు. ఆ తరువాత అలాగే ఆ విషయం ఆలోచిద్దాం" అన్నారు. కొడుకు ఖచ్చితంగా ఆ అమ్మాయి తన వలన గర్భవతి అయిందని చెబుతుంటే 'వద్దు' అనే కుటిల మనస్తత్వం ఆయనలో లేదు.

మర్నాడు పెద్ద కొడుకు వినోద్‌తో ఈ విషయం చెప్పింది సావిత్రి. "అయితే తమ్ముడు గ్రంథసాంగుడయ్యాడన్నమాట" చిత్రంగా నవ్వాడు. ఇంతలో ప్రమోద్ తాను చేసికోబోయే అమ్మాయి ఫోటో తెచ్చి చూపించాడు తల్లికి, అన్నగారికి. అది చూసి గతుక్కుమన్నాడు వినోద్. ఎందుకంటే ఆ అమ్మాయి మాలతి. తన స్నేహితుని చెల్లెలే. బాగా తెలిసిన అమ్మాయి.

"ఒరేయ్ తమ్ముడూ నీవు ఎవరినైనా చేసుకోగాని, ఆ అమ్మాయిని మాత్రం వద్దు. అంత మంచి కేరెక్టర్ కాదు" అన్నాడు వినోద్.

"ఆరు నూరయినా, నూరు ఆరయినా మా పెళ్ళి మరో వారంలో జరగబోతోంది. నీ పెళ్ళి వరకూ కూడా ఆగేది లేదు. అలా ఆగితే ఈ లోపుగా మాలతికి పురుడు

కూడా వచ్చేస్తుంది. అప్పుడు చేసికొనవలసింది బారసాల గాని పెళ్ళి కాదు'' అని చెప్పాడు ప్రమోద్.

"పోనీ ఆబార్షన్ చేయించేయ్'' అతి మామూలుగా అన్నా అతని కంఠం వణికింది. "వీల్లేదు. ఈ వంశాంకురం నాశనం కావడానికి వీల్లేదు'' అన్నాడు ప్రమోద్ ఆవేశంగా. కొడుక్కి ఏమైనా పిచ్చి పట్టలేదు కదా అని ఆశ్చర్యంగా చూసింది సావిత్రి. ఇప్పుడు ఆమెకి పిచ్చి పట్టే పరిస్థితి ఏర్పడింది. మరో నెల్లాళ్ళలో పెద్ద కొడుకు పెళ్ళి. ఇంకో వారంలో చిన్న కొడుకు పెళ్ళి. ఆవిడకి పంజాబు సమస్యకన్నా కఠినతరమైనదిగా అనిపించింది.

ప్రమోద్ అన్నయ్య పెళ్ళి అయ్యేవరకూ ఆగమని తల్లి దండ్రులు చాలా బలవంతం చేశారు. ప్రమోద్ మాత్రం యింట్లో నుంచి అయినా వెళ్ళిపోతానుగాని, వారంలో పెళ్ళి జరగవలసిందే అని పట్టుబట్టాడు. వినోద్ తల్లి దండ్రులకు ఎలాగైనా తమ్ముడి పెళ్ళి ఆపమని, ఆ అమ్మాయి మంచిది కాదని నూరిపోస్తునే వున్నాడు. సావిత్రి, సూర్యం ఎంత పోరు పెట్టినా ప్రమోద్ వారి మాట వినడం లేదు. మరో నాలుగు రోజులు గడిచాయి. పెళ్ళి దగ్గరకు వస్తోంది. గుళ్ళో సింపుల్‌గా పెళ్ళిచేసి కుంటానని చెప్పి ప్రమోద్ పెళ్ళి బట్టలు తెచ్చి తల్లికి చూపించాడు. ఆవిడకు యింటిలోని పరిస్థితి సంకటంగా వుంది. చెప్పలేని దుఃఖం వచ్చింది. నలుగురి నోళ్ళలోనూ పడాలి అని భయం పట్టుకుంది. కొడుకు కోరిక ఉడుంపట్టులాగే కనిపించింది.

వినోద్ మాత్రం తమ్ముణ్ణి ఈ పెళ్ళి చేసికోవద్దని చిందులు తొక్కడం, తమ్ముణ్ణి ఈ పెళ్ళి నుంచి మాన్పించలేకపోతున్నారని తల్లి దండ్రుల మీద చిరాకుపడడం మాన లేదు. ప్రమోద్ యింట్లో ఎవరి మాటా వినే స్థితిలో లేడు. అతని మనసంతా యిప్పుడు మాలతి మాలతి అని కలవరిస్తోంది. మాలతికి పుట్టబోయే బిడ్డ మీదే పరిభ్రమిస్తోంది. తను చేసేది తప్పు అని అతను అనుకోవడం లేదు. అందులో ఒప్పు వుంది కాబట్టే చాలా ధైర్యంగా యింటిలో అందరినీ ఎదిరించాడు. మాలతి మెడలో మూడు ముళ్ళు వేయడానికి నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం తిరుగులేనిది.

ఆ రోజే పెళ్ళి. కాని యిల్లు అప్పుడే శవం వెళ్ళిన యిల్లులాగ వెలవెలబోతుంది. ఆ ఇంట్లో ప్రమోద్‌కి తప్ప మరెవ్వరికీ మనసు మనసులో లేదు. గునపాలతో బాదుతున్నట్లుగా మిగిలిన ముగ్గురూ ఫీల్ అవుతున్నారు.

మరో గంటలో ముహూర్తం అనగా, ప్రమోద్ పెళ్ళి బట్టలు తీసికొని వెళ్ళాలని బయలుదేరబోతున్నాడు. "అమ్మ, నేను బీరువాలో పెట్టిన బట్టలు కనిపించడం లేదు'' అన్నాడు కంగారుగా. "ఏమో నాకేం తెలుసు'' అంది సావిత్రి నిర్లిప్తంగా. అలా అంది కాని, ఆమె మనసు ఆగక తనూ వెతికింది. ఇల్లంతా వెతక సాగారు. ఒక ప్రక్క

ముహూర్తం దగ్గర పడుతుంది కాని బట్టలు దొరకడం లేదు. ఇంక ప్రమోద్ అన్నాడు.

"పోనీలే అమ్మా! బట్టలు లేకపోతే పోతేనేం పెళ్ళికి ముఖ్యం వధూవరులుగాని, యివేమీ కాదు. అమ్మా దయ వుంచి నా పెళ్ళికి మీరిద్దరూ రండి' అని చివరలో తల్లి దండ్రులను బ్రతిమాలాడు.

తాము వెళ్ళక పోయినా పెళ్ళి ఎలాగూ అవ్వక తప్పదు. ఇంక వెళ్ళితే నష్టం ఏముంది అని యిద్దరూ బయలుదేరారు. వినోద్‌ని కూడా రమ్మని అడగాలని అన్నగారి గదిలోకి వెళితే అన్నగారు యింట్లో లేరు. "వీడెప్పుడూ యింతే, సమయానికి ఇంట్లో ఉండడు" తల్లి వినోద్ మీద విసుక్కుంది.

తీరా గుడిలోనికి వెళ్ళిన తరువాత అక్కడ ఆశ్చర్యకరమైన విషయం వారిని తికమత పెట్టింది. గుడిలో మాలతి, వినోద్ పెళ్ళి బట్టలతో కూర్చొని వున్నారు. "ఇదేమిటి? ఎనిమిదో వింత చూస్తున్నట్లు తల్లి దండ్రులు ఆశ్చర్యపోయారు. వారికి ఈసారి నిజంగానే మతిపోయింది.

"అమ్మయ్య" అనుకున్నాడు ప్రమోద్ ఎంతో తేలికైన హృదయంతో. "అమ్మా, నాన్నా! అన్నయ్య, వదినల మీద అక్షింతలు వెయ్యండి. మాలతి గర్భవతి అయింది నా వలన కాదు. అన్నయ్య వలన. అన్నయ్య ఎక్కువ కట్నం యిచ్చే అమ్మాయి గురించి చూస్తూ మాలతిని చేసికోనన్నాడట. మాలతి నా దగ్గర చెప్పి ఏడ్చింది. మాలతి చాలా మంచి అమ్మాయి. అన్నయ్యకోసం ఈ నాటకం ఆడక తప్పలేదు. ఏ అన్నగారూ, తన ద్వారా గర్భవతి అయిన అమ్మాయిని తమ్ముడు పెళ్ళి చేసికొనడం, యింట్లో తనెదురుగానే తిరగడం సహించలేడు. అందుకే అన్నయ్య ఆఖరి నిమిషంలో మంచి నిర్ణయం తీసికున్నాడు"

"చాలా మంచి పని చేశావురా ప్రమోద్. మరి మాలతిని అన్నయ్య పెళ్ళి చేసుకొనకపోతే ఏం చేసేవాడివి" అని తండ్రి అడిగాడు.

"పెళ్ళి మాత్రం చేసికొని వుండేవాడిని కాదు. మన ఇంట్లోకి తెచ్చి వుండేవాడిని మాలతిని. అన్నయ్య ద్వారా మోసపోయిన మాలతిని మనం అయినా ఆదుకోకపోతే అసలు మానవత్వానికే విలువ ఉండదు."

ఇంతలో పెళ్ళి జరిగిపోయింది. మాలతి, వినోద్ సిగ్గుపడుతూ తల్లి దండ్రుల కాళ్ళకు నమస్కరించాడు. మాలతి, ప్రమోద్ కాళ్ళకు కూడా నమస్కరించింది.

"వద్దు వద్దు చిన్నవాడిని" అన్నాడు ప్రమోద్. "కాదు నాకు దేవుడివి" అంది సంతోషంగా నవ్వుతూ మాలతి. ఇప్పుడు ఆమె ప్రమోద్‌కు వదిన.

(వనితాజ్యోతి, డిసెంబర్ 87)

☆ ☆ ☆

# మోసం

ప్రకృతి కన్య వసంతాన్ని సింధూరంలా సింగారించుకున్నది. నాగేష్ కోసం ఎదురుచూస్తుంది మనోహరి.

వెనుక నుండి చడీ చప్పుడు లేకుండా ఎప్పుడు వచ్చాడో నాగేష్ మనోహరి కళ్ళు మూసాడు ఒక్క క్షణం కళ్ళల్లో చీకట్లు కమ్మాయి మనోహరికి. ఆ చీకటిలోనే ఆ స్పర్శవలన వింత వెలుగు వచ్చిందా నేత్రాలకి.

నాగేష్‌పై చిరుకోపం నటించింది మనోహరి, అదీ కొంచెం సేపే! ఆ తరువాత అతని లాలనలో కరిగిపోయింది. తల్లికి ఒంట్లో బావుండలేదట. అందుకే ఆలస్యం అయిందట.

అదీ నాగేష్ చెప్పిన కారణం. తల్లిని అతిగా ప్రేమించినవాడు భార్యను అంతకంటే ఎక్కువ ప్రేమిస్తాడు అని మనోహరి అభిప్రాయం. అందుకే నాగేష్ తన భర్త కాబోతున్నందుకు ఆనందించింది.

నాగేష్ నీవు అస్తమానం ఇలా పార్కులకు రమ్మంటావు, నాకెంత భయంగా వుందో తెలుసా? అంది మనోహరి.

'ఎందుకు భయం మనం కాబోయే భార్యాభర్తలమేగా'

'అవునుగాని, ఇంకా కాలేదుగా'

'పెళ్ళికి ముందే ఇలా తిరగకపోతే పెళ్ళయిన తరువాత థ్రిల్ వుండదు తెలుసా? ఈ మధుర జ్ఞాపకాలు, మన జీవితంలో ఎప్పటికీ తియ్యగా నిలిచిపోవాలి. ముందు ముందు మన మధ్య ఏవైనా పొరపొచ్చాలు వచ్చినా, ఈనాటి రోజుల్ని మన కళ్ళల్లోని ఆశల్ని గుర్తు చేసుకుంటూ వాటిని అవలీలగా తీసి, అవతల పారేయొచ్చు.'

'అందుకేనా పెళ్ళి వాయిదా వేస్తున్నావు?'

'అందుకు కాదనుకో' ఇద్దరూ లేచారు.

☆ ☆ ☆

"ఎందుకో నాకు తెలుసు" విద్య అంది మనోహరితో "ఎందుకు? నాగేష్ పెళ్ళి వాయిదా వేస్తున్నాడు" భయంగా అడిగింది మనోహరి.

"అతను మరో అమ్మాయిని పెళ్ళి చేసుకోడానికి పెళ్లి చూపులకు వెళ్ళాడు తెలుసా?"

"నేను నమ్మను" గట్టిగా అరచింది. మనోహరి.

"నీవు గొంతు చించుకున్నా అది పచ్చి నిజం. ఆ అమ్మాయి ఎవరో కాదు నేనే"

"నువ్వా?" ఆశ్చర్యంగా అడిగింది.

'అవును, పెళ్ళి చూపుల్లో చూసే వరకూ నాకూ తెలియదు నీ ప్రేమికుడు నిన్ను నీకు తెలియకుండానే మోసం చేస్తున్నాడని. అంతేకాదు సుమా, నాగేష్ చాల మంది అమ్మాయిలను చూస్తున్నాడు. ఎవరు ఎక్కువ కట్నం ఇస్తే వాళ్ళను కుదుర్చుకోవాలని ఆశ పడుతున్నాడు. నిన్ను ప్రేమించానని అన్నట్లే, మరో అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. ఉద్యోగం చేసే వాళ్ళనే ప్రేమిస్తాడు. ఎందుకంటే అతను అన్నిటి కన్నా డబ్బును ఎక్కువ ప్రేమిస్తాడు కనుక."

హతాశురాలయింది మనోహరి.

"అయితే ఇంతకాలం నన్ను ప్రేమించానని నా వెనకాల తిరగడం అంతా నటన అంటావా?"

"ఖచ్చితంగా అంతే సుమా, నీవు బాధపడకు. పైగా సంతోషించు ఎందుకంటే నీ పెళ్ళికి ముందే అతని మోసం బయట పడినందుకు."

గాయపడిన మనోహరి హృదయం బాధగా మూలిగింది.

పెళ్ళి చూపుల్లో అతను నన్ను గుర్తించలేదు. ఎందుకో తెలుసా? నాగేష్ స్నేహం దొరికాక నీవు చాలా వరకూ మమ్మల్నందర్నీ వదిలేసావు. పైగా ఏనాడూ నాగేష్‌కి మమ్మల్ని పరిచయం చేయలేదు తిరిగి అంది విద్య.

'నిజమే అదీ ఒకందుకు మంచిదయింది'

☆ ☆ ☆

'అయితే నాగేష్ నీవు పెళ్ళి చూపుల కోసమని ఊరు వెళ్ళావన్న మాట' మనోహరి అడగింది.

నేను పెళ్ళి చూపులకెళ్ళడం ఏమిటి? నీకు పిచ్చి పట్టిందా? మా అమ్మగారి ఊరు వెళ్ళాను' బుకాయించాడు, నాగేష్ మనోహరిని.

'నాకు నాఫ్రెండ్ విద్య చెప్పింది. అబద్ధాలాడకు నిన్నునమ్మి మోసపోయాను కోపంగా చూసింది మనోహరి.'

'నీవు కోపంలో అందంగా వుంటావని, నేను అన్నానని ఈ విధంగా నాపై నేరం మోపి కోపం తెచ్చుకోకు' ఆమెను నవ్వించబోయాడు.

ఆమె నవ్వలేదు. అతని మాటలూ నమ్మలేదు.

నాగేష్ మాట మార్చాలని చూసాడు. మనోహరి ఆ విషయం వదలలేదు. ఆఖరికి నాగేష్ నిజం చెప్పక తప్పలేదు. నిజమే నేను మా అమ్మమ్మ బలవంతంమీద విద్యను చూడవలసి వచ్చింది. నీవు బాధ పడతావని చెప్పలేదు' అన్నాడు.

మరి విద్యతో తాను నచ్చిందని, పెళ్ళిచేసుకుంటానని చెప్పావట.

'అది మాత్రం అబద్ధం'

'అది ఒక్కటే ఏమిటి? నీవు ఇంతవరకు చెప్పినవన్నీ అబద్ధాలే. నన్ను ప్రేమించడమూ అబద్ధమే'

పోనీలే పొరపాటు జరిగిపోయింది. ఇప్పుడు చెప్పు, మనం ఎప్పుడు పెళ్ళి చేసుకుందాం.

☆ ☆ ☆

'నేను చచ్చినా ఈ పెళ్ళి చేసుకోను' తెగేసి తల్లిదండ్రులతో చెప్పేసింది మనోహరి.

'అదేమిటే అలా అంటావు ఆ అబ్బాయిని ప్రేమించానన్నావు. అతనితో కలిసి షికార్లకు తిరిగావు. ఉత్తరాలు రాశావు. ఉత్తముడు అన్నావు. ఇప్పుడెందుకు ఇలా మారిపోయావు' తల్లి అడిగింది.

'అతను మోసగాడని తెలిసింది. అమ్మా! ఇప్పుడు మీరు ఎవరిని చూపించి పెళ్ళి చేసుకోమంటే వాళ్ళనే చేసికుంటాను. నాగేష్‌ని మాత్రం చేసికోను.'

అన్నీ నీ నిర్ణయాలేనా, ముందు అతనితో తిరగొద్దు అంటే తిరిగావు. ఇప్పుడు అతన్ని చేసికోమంటే చేసికోనంటున్నావు. ఒకరితో పెళ్ళి వరకూ వచ్చి అది ఆగిపోతే నిన్ను ఎవరు చేసికుంటారు.

పోనీ, పెళ్ళి కాపోతే ఇలా ఉండిపోతాను. అతను నన్ను ప్రేమిస్తూనే, పెళ్ళి చూపులకు వెళుతున్నాడట.

'సరేలే ఇకపై అతన్ని దూరంగా ఉంచు. నాగేష్ విషయం తెలియని మామయ్య ఏదో సంబంధం ఉందని ఈ రోజే ఉత్తరం వ్రాసాడు. వాళ్ళను తీసికొని రమ్మని వ్రాస్తాను' కూతుర్ని వూరడించింది తల్లి. వారం తరువాత వాళ్ళు వచ్చి మనోహరిని చూసుకున్నారు.

పెళ్ళి కొడుకు ఎలా వున్నాడు? దారికాచి అడిగాడు నాగేష్ మనోహరిని.

'నీకు అనవసరం' - కోపంగా అంది మనోహరి.

'అయ్యో అలా అంటే ఎలా? నీవు అనుకున్నట్లుగా నేను అనుకోవడం లేదే,

నేను నిన్ను తప్ప ఎవరినీ పెళ్ళాడబోవడం లేదు.'

'నేను మాత్రం నిన్ను చేసుకోబోవడం లేదు'

'నీవు నన్ను చేసికుంటావు. నాతో కలిసి తిరిగావు. ప్రేమ లేఖలు రాసావు. నీలాంటి దాన్ని ఈ దేశంలో ఎవడు పెళ్ళి చేసుకుంటాడు, నీకు పసుపుతాడు యోగం లేదు.'

'ఎవడో ఒకడు రాక పోడులే'

'ఎవడూ రాడు, వచ్చినా రానివ్వను, నీ పెళ్ళి ఎలా ఆపాలో నాకు తెలుసు'

మనోహరి సన్నగా కంపించింది.

'నేను అసలు పెళ్ళే చేసికోను'

'ఎందుకు కన్నెలా ఉండిపోవాలి? నేను ఉన్నానుగా ఎలాగు ఇద్దరం కలిసి తిరిగాం. చాలామంది కళ్ళల్లో పడ్డాం. నిన్ను వదులుకోవడానికి నేను సిద్ధంగా లేను. నీవు మరొకరికి దక్కడానికి వీలులేదు.

'నీకు మాత్రం దక్కను'

'ఎలా దక్కవో నేను చూస్తానుగా'

☆ ☆ ☆

'నీవు నాకు ఎన్ని పెళ్ళి సంబంధాలు చెడగొట్టినా ఫరవాలేదు. నేను నిన్ను మాత్రం పెళ్ళిచేసుకోను' నిష్కర్షగా చెప్పేసింది మనోహరి.

ఈ మధ్య నాలుగైదు సంబంధాలు వస్తే పని గట్టుకొని వాళ్ళకు మనోహరి మీద చెడ్డగా చెప్పి పెళ్ళి వరకూ రాకుండా చేసాడు నాగేష్.

ఆ విషయం తెలిసిన మనోహరికి, అతని మీద ద్వేషం మరింత పెరిగింది. అతను అదేం పట్టించుకోలేదు. తనను వద్దన్న మనోహరి తనుతప్ప గతిలేదని తననే పెళ్ళాడాలి అదీ అతని పంతం. మొండి నిర్ణయం.

'నీ నిర్ణయం మారదా' ఫోన్ చేసి అడిగాడు నాగేష్ మనోహరిని.

'ఈ జన్మలోనే కాదు. గుర్తుంటే వచ్చే జన్మలోకూడా మారదు' ఖచ్చితంగా చెంపకొట్టినట్లు చెప్పేసింది.

'ఏమిటీ ఈ మధ్య కనబడటం మానేసావు. ఉద్యోగం మానేసావా? నాకు భయపడుతున్నావా?'

'నీకు భయపడి మాత్రం కాదు'

'మొన్న మరలా ఏదో సంబంధం వచ్చినట్టుంది'

'నీ దయవలన అదీ తప్పిపోయింది'

'వెరీగుడ్ నా. సత్తా ఇప్పుడైనా తెలిసిందా'

'తెలిసింది, సత్తు రూపాయని'

'ఆ సత్తురూపాయే త్వరలో నీ మొగుడవుతాడు'

'ఇంపోజిబుల్'

'ఇదిగో చూడు మనోహరి. నీ వెంత నన్ను చీదరించుకున్నా లాభం లేదు. నీకు ఈ మధ్య పెళ్ళి సంబంధాలు రావడం మానేసాయి. అప్పుడే మూడేళ్ళు గడిచిపోయి ఇద్దరి యవ్వనం వృథా అయిపోతుంది. నీకోసం నేను మంచి ఉద్యోగాన్ని కూడా వదులుకొని ఇక్కడ ఉండిపోయాను.

అలాగే ఉండిపో, కానీ నా గురించి ఆశపడకు. ఆఖరికి ఏ మనవలున్న ముసలాడినన్నా చేసికుంటాను గాని, నిన్ను మాత్రం చేసికోను'

'అదిసరే మీ ఇంటికి ఈ మధ్య అప్పుడప్పుడు అతనెవరో వచ్చి పోతున్నాడట ఎవరూ నీ ప్రియుడా?'

ప్రియుడు అన్న పదం నీ మోసంతోనే మరిచిపోయాను. నీవు ఎవరినో ఉంచుకున్నావని అందరూ అనుకుంటున్నారు. అప్పుడప్పుడు నీవు ఊళ్ళు వెళుతుంటే నెలల కొద్దీ ఉండిపోతుంటే లోకం రకరకాలుగా మాట్లాడుకుంటుంది. అయినా ఫరవా లేదు. నీపై నాకు నమ్మకం ఉంది. నీవు నిప్పులాంటిదానివని తెలుసు. నాకే లొంగని దానివి పెళ్ళి కాకుండా మరొకడకి లొంగుతావంటే నేను నమ్మను. ఇప్పటికైనా మించిపోయింది లేదు, నిన్ను చేసికోడానికి నేను రెడీ, ఎవ్వర్ రెడీ! రెడీమేడ్ మొగుడిలా నేనుండగా, నీకెందుకీ కన్నె బ్రతుకు, కన్నీటి బ్రతుకు.

'నా బ్రతుకేం బ్రహ్మాండంగా వుంది'

'అలా అనుకొని తృప్తి పడు'

'నా గొడవ నీకు అనవసరం'

'అమ్మమ్మా! నీ దగ్గర నుండి గ్రీన్ సిగ్నల్ వచ్చే వరకూ నిన్ను వదల్ను. వయసు పెరిగి పోతుంది. కోరికలను అదుపులో పెట్టుకోలేక పోతున్నాను'

'నీవు ఎక్కువ కట్నం ఇచ్చే అమ్మాయిని పెళ్ళాడు'

'అబ్బా, ఆశ అలా అయినా నా అడ్డుతొలగిపోతేనీవు పెళ్ళాడేద్దామనుకుంటున్నావా మరొకరిని కుదరదు'

ఆమె నోట మాటరానిదానిలా నిలబడిపోయింది.

★ ★ ★



'మనోహరీ, ఏమిటి అలా చిక్కిపోయావు. ఈమధ్య శలవు పెట్టి ఊరెళ్ళావు. అప్పటి నుండీ నీలో చాలా మార్పు కన్పిస్తుంది. పెళ్ళికావట్లేదని బెంగా?

'అవును'

'అయితే, మరి నన్ను చేసుకోవచ్చుగా'

'అది అసాధ్యం అని చెప్పానుగా'

'చూసావా, నా ప్రతాపంతో నీకు ఈ మధ్య సంబంధాలు కూడా రావడం మానేసాయి'

'పోతే పోనీ'

'ఏం చూసుకొని నీకు అంత ధైర్యం'

'నిన్ను చూసుకొని మాత్రం కాదు'

☆ ☆ ☆

హలో మనోహరీ ఏమిటీ నిన్న బీచ్‌లో ఎవరో చంటి పిల్లనెత్తుకొని కనిపించావు. కొంపదీసి పెళ్ళయి పిల్లలున్నవాడిని ఉంచుకున్నావా ఏమిటి? రెండో పెళ్ళి వాడిని గాని పెళ్ళాడబోతున్నావా? చాలధైర్యంగా ఉన్నావు"

'ఏం నీకు అభ్యంతరమా!"

నాకెందుకు, నీకు అలాంటి వాడు తప్ప మంచివాడు ఎక్కడ దొరుకుతాడు? చెడిపోయావని అందరికీ చెప్పానుగా, అఫ్‌కోర్స్ నిజం నాకు తెలుసనుకో'

ఇంక ముసుగులో గుద్దులాట ఎందుకు నిజం చెప్పేయనా?

అయితే నన్ను చేసికోడానికి నిర్ణయించుకున్నావన్నమాట.

కాదు నీవు చూసింది నేను ఉంచుకున్నవాడిని కాదు. అతను నాతో జీవితం పంచుకున్నవాడు. నాకు ఐదేళ్ళ క్రితమే పెళ్ళిఅయింది. ఇద్దరి పిల్లల తల్లిని నేను. మావారు అదే విద్య అన్నగారు. నా గురించి అన్నీ తెలిసి చేసుకున్నారు. ఎక్కువగా బిజినెస్ టూర్‌లమీద ఫారెన్ తిరుగుతుంటారు. అప్పుడప్పుడు వచ్చేవారు. ఇప్పుడు ఇక్కడే బిజినెస్ చేయబోతున్నారు. పెర్మనెంట్‌గా నాపిల్లలు ఇన్నాళ్ళు మా అమ్మ దగ్గర వేరే ఊరిలో వున్నారు. ఈ విషయం నా క్లోజ్ ఫ్రెండ్స్‌కు మాత్రమే తెలుసు. నీకు తెలియకుండా జాగ్రత్తపడ్డాను.

'ఎందుకు'

నీవు నన్ను మోసం చేసావు. ఈ విధంగా నిన్ను నేను మోసం చేసాను. ఈ అయిదేళ్ళలో నేను హాయిగా సెటిల్ అయ్యాను. నీవు అప్పటి నుండి ఏ చదువూలేక, ఉద్యోగం లేక, పెళ్ళి, పిల్లలూ లేక నా వెనుక తిరుగుతూ నీ జీవితాన్ని వృధా చేసికోలేదా. చివరికి నేనూ దక్కలేదు. మంచి ఉద్యోగం దక్కలేదు. ఇదే మోసానికి మోసం. ఆమె చెప్పడం ఆపింది.

నాగేష్ చేతిలో ఫోన్ జారిపోయింది.

(ఆంధ్రభూమి వీక్లీ, 17-02-99)

☆ ☆ ☆

# తీర్పు

ఆ అబ్బాయి పేరు త్యాగరాజు. మా ఇంట్లో గది ఖాళీగా ఉంటే అద్దెకొరకు వచ్చాడు. వయసులో వున్న అబ్బాయి. పైగా పెళ్ళికానివాడు. మా ఇంట్లో పెళ్ళికి ఎదిగిన అమ్మాయి ఉంది. ఇల్లు అద్దెకు ఇవ్వడానికి చాలా తటపటాయించాను. తన మాటలతో నా అనుమానాలన్నీ పటాపంచలు చేసేశాడు. అంతకీ పిచ్చిపిచ్చి వేషాలు వేస్తే అప్పుడే ఉద్వాసన చెప్పవచ్చు అనుకున్నాను. ఆయన ఊరిలో లేనప్పుడు గది అబ్బాయికి అద్దెకిచ్చినందుకు దూర్వాసులే అయ్యారు.

రానురాను రాజు ప్రవర్తనతో మా అందరితో బాగా కలిసిపోయాడు. చాలామంచి పిల్లవాడు అని ముద్ర వేయించుకున్నాడు. ఇప్పుడు మా అమ్మాయి సీమను ఆ అబ్బాయి దగ్గరకు వెళ్ళకుండా ఆంక్షలు పెట్టడంలేదు మేము. పైగా మా అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే బావుండును అనే ఆశ నాలో మొలకలెత్తింది. ఆ మొలకపై తొలకరి వాన పడినట్లు మావారు 'సై' అంటే ఇంట్లో అందరం కలిసి 'సైసై' అన్నాము. పైగా మెల్లగా ఆ విషయం కదిపాము కూడా.

మా కోరిక విని పాములా బుసకొట్టలేదు. రాజు సీమను చేసుకోవడానికి తనకు అభ్యంతరం లేదుగానీ తను ఫారిన్ వెళ్తున్నానని, పాస్‌పోర్ట్ సిద్ధంగా వుందని, వీసాకోసం ట్రై చేసుకోవడానికి హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వచ్చానని, విదేశాలకు వెళితే ఇప్పట్లో తిరిగిరానని చెప్పాడు.

సీమ విదేశాలకు వెళ్లడం మాకు ఇష్టంలేదు. సీమ మా పెద్దమ్మాయి. మాకు ఆరోప్రాణం. హైదరాబాద్‌లోనే పెర్మనెంట్ ఉద్యోగంచేసే అబ్బాయికే చెయ్యాలని, మా అమ్మాయి మా కళ్ళముందే ఉండాలని, ఆ అమ్మాయి కళ్ళల్లో కన్నీళ్ళు చూడకూడదని మా ఆశ. దానితో ఇంక రాజు విషయం వదిలేసి వేరే సంబంధాలు చూడడం మొదలు పెట్టాము.

మా బస్తీలో ఫణి అనే అబ్బాయి వున్నాడు. తల్లి తండ్రి సంపాదించిన ఆస్తిని తాగి తందనాలాడుతూ నింపాదిగా కరిగించేయడమే అతని ఉద్యోగం. ఎప్పుడూ స్టేట్‌రౌడీని, స్ట్రీట్‌రౌడీని అని బాహాటంగా చెప్పుకుంటూ గూండాల్లా, గుండుపిక్కల్లా వున్న మరో నలుగురిని వెంటేసుకుని తిరుగుతూ ఉంటాడు. ఆ ఫణి ఎలా తిరిగితే, ఏం చేసుకుంటే నాకెందుకుగానీ మా అమ్మాయి సీమను పెళ్ళి చేసుకుంటానని అడిగినప్పటి నుండి నాకు భయం పట్టుకుంది.

మేము పిల్లను ఇవ్వమన్నాము. దానితో పాములా పగబట్టాడు ఫణి. సీమకు వచ్చే సంబంధాలన్నీ చెడగొట్టడం, నాకు ఎవరు ఎదురు చెబుతారు అని తొడకొట్టుకోవడం మొదలుపెట్టాడు.



హాయిగావున్న మా కుటుంబంలో అలజడి మొదలై ఆగని జడివానలా మమ్మల్ని చికాకుపరచసాగింది. బాధ పెరగసాగింది. ఏమీ చేయలేని స్థితిలో రాజు వెళ్ళి వాళ్ళకు వార్నింగ్ ఇచ్చివచ్చాడు. దానితో వాళ్ళు రాజుని చాటుగా కాస్త ఘాటుగా కొట్టేసి పారిపోయారు. అయినా రాజు చెక్కుచెదరలేదు. సినిమా హీరోలా దెబ్బలు తగిలిన వెంటనే వాళ్ళను ఎదిరిస్తూ బెదిరిస్తూనే వున్నాడు. వాళ్ళజోలికి వెళ్ళొద్దు రాజూ. అనవసరంగా నీమీద కక్ష కడతారు. మా వలన నీవు శిక్ష అనుభవించొద్దు. సీమ రాత ఎలా ఉందో అలా జరుగుతుంది అని చిలక్కి చెప్పినట్లు చెప్పాను. కానీ రాజు వినలేదు. సీమకు ఇనప కవచంలా నిలబడ్డాడు. ఏ తల్లి కన్నబిడ్డో మా కోసం అలా తాను నష్టపోతుంటే నా ప్రాణం గిలగిలలాడసాగింది.

ఆ విషయమే అంటే 'ఏమిటాంటీ అలా మాట్లాడతారు. అందరూ ఇలా పిరికి వాళ్ళలా ప్రవర్తిస్తుంటే అలాంటి దుండగులు రెచ్చిపోక ఏం చేస్తారు.

ప్రాణాలకు భయపడితే ఆనాటి గాంధీనుండి ఈనాటి రాజీవ్‌గాంధీ వరకు అలా దేశసేవ చేయగలిగేవారా? మహా నాయకులకు ప్రతిక్షణం మృత్యుభయమే. అయినా వాళ్ళు పిరికివాళ్ళలాగా ఇంట్లో కూర్చున్నారా? పునాదుల్లోని రాళ్ళు మేము అనాథల్లాగా సమాధి అయిపోతున్నాము అనుకుంటే భవనం నేలమీద నిలుస్తుందా? అలాగే సంఘంలో ఒకరు బలి అయినా వేలమంది రక్షింపబడితే ఎంత మంచి జరుగుతుంది. వాళ్ళు నా ప్రాణాలు తీసినా ఫరవాలేదు. సీమకు అన్యాయం జరగకూడదు' అన్నాడు.

కానీ రాజు తలచినట్లు అన్యాయం జరగకుండా ఆగలేదు. సీమకు రాజే మంచి సంబంధం తెచ్చి నిశ్చితార్థం జరిగేవరకు శ్రమపడ్డాడు. దానితో వెర్రెక్కిపోయిన ఫణి

బృందం ఒకరోజు పెళ్ళి నాలుగు రోజులుందనగా రాజు ఊరిలో లేని సమయం చూసి సీమను బలవంతంగా చెరిచేశారు. ఆమె నుదుటన వ్రాసిన అందమైన రాతను క్షణాల్లో చెరిపేశారు. ఆ ఘాతుకం మాకు పెద్ద అఘాతం. పిడుగుపాటు. సీమతో సహా అందరం ఘొల్లుమన్నాం.

రాజు ఊరినుండి వస్తూ వాళ్ళు పారిపోవడం చూశాడట. సీమను తానే తీసుకొని వచ్చాడు. ఆ వార్త అప్పుడే అందరికీ చేరి పెళ్ళి ఆగిపోయింది. ఆ ముహూర్తానికి సీమ మెడలో అందరిముందు ధైర్యంగా రాజు మూడుముళ్ళూ వేశాడు. అప్పుడు ఊరి వారందరూ నోళ్ళు మూసుకున్నారు. సీమ దుఃఖంలో ఉంది కాబట్టి ఆర్భటాలు వద్దు అన్నాడు రాజు.

ఫణిపై బలవంతంగా కేసు పెట్టించాడు రాజు.మేము వద్దన్నా అతను వినలేదు. కేసు పెట్టక తప్పలేదు. మరో నెల గడిచింది. సీమ గర్భవతి, రాజులో విషాదం, ఆనందం కూడా. అబార్షన్‌కు రాజు అంగీకరించలేదు. రోజులు గడుస్తున్నాయి. కేసు ఒక కొలిక్కి రావడంలేదు. రాజు తనకు వీసా సిద్ధమైందని, ఒక నెలలో వెళ్ళిపోవాలని చెబుతున్నాడు. రాజుని విదేశాలకు వెళ్ళకుండా ఆపాలని మేము ఎన్ని ప్రయత్నాలు చేసినా అతను వినలేదు.

ఈలోపుగా తన తండ్రి అధికారంతో డబ్బుతో కేసును మాఫీ చేయాలని ప్రయత్నాలు చేస్తున్నట్లు రాజుకి తెలిసి ఉగ్రుడయ్యాడు. అలాంటి వాళ్ళకు పబ్లిక్‌గా శిక్షపడితేగానీ రెండోవానికి భయం ఉండదని రాజు వాదన. ఆ వాదనలో నిజం ఉన్నా మా ఆవేదన మాది. ఒకరోజు సడన్‌గా రాజు కోపంతో ఫణిచెయ్యి నరికేశాడు మరలా అతుక్కోనివిధంగా. అవతలివాళ్ళు రుద్రులై రాజు తల పచ్చడి చేశారు. సీమకు తాళితెగి వెచ్చని కన్నీరే తోడయింది. తరువాత రాజు డైరీలో ఉత్తరం దొరికింది.

“సీమా! కోర్టులమీద కంటే సాక్ష్యాన్ని తారుమారు చేసేసి మంచిమీద తారుపూసే మనుషులమీద నమ్మకంలేక మరో ఆడపిల్లకు అన్యాయం చేయకుండా ఫణి చెయ్యి నరికేశాను. కోర్టు ఇప్పట్లో న్యాయమైన తీర్పు ఇవ్వదని నేనే ఆ తీర్పు ఇచ్చాను. రేప్ వలన నీకు గర్భం వస్తే ఆ బిడ్డకు నేనే తండ్రిని కావాలని నీ మెడలో తాళి కట్టాను తప్ప మరో ఉద్దేశం లేదు. వాళ్ళు నన్ను చంపేస్తారని తెలుసు. నా ఆస్తి పుట్టబోయే బిడ్డకు వ్రాశాను. నేను హైదరాబాద్ వచ్చింది ట్రీట్‌మెంట్ కోసం. నా వీసా పేరు కేన్సర్. నాకు బ్రతకడానికి మరో పదిహేను రోజులు మాత్రమే గడువుంది. వెళ్ళిపోయే ముందు ఒక మంచి పనిచేశానని తృప్తిగా వుంది.

(ఆంధ్రభూమి డైలీ, 17-02-99)

☆ ☆ ☆

# ఓపెన్ సీక్రెట్

ధీరజ్ ఇంకా కాలేజీలో అడుగుపెట్టలేదు గాని, యవ్వనంలోకి మాత్రం అడుగుపెట్టేసాడు.

అమ్మాయి గొంతులా అంతవరకూ మృదువుగా నున్న గొంతు సంవత్సరం క్రితమే మోటుగా మారిపోయి నీవు మొగవాడివి సుమా అని గుర్తుచేసింది. ధీరజ్ మాట్లాడుతూంటే అతని గొంతు మారడంవలన ఇంట్లోని వారే ఎవరో మాట్లాడ్తున్నట్లు భ్రమచెందారు చాలాసార్లు.

ఆడపిల్ల యవ్వనంలోకి వచ్చే ముందు అందరికీ చాటింపు వేసికొని మూలన కూర్చుంటుంది. పైట వేసికుంటుంది. మగవాడికి అలా చాటింపు వేసికునే ఛాన్సలేకపోయినా అతనిలోనూ మార్పులు వస్తాయి.

ఇప్పుడిప్పుడే ధీరజ్‌కి మొలకెత్తుతున్న విత్తనాల్లా నూనూగు మీసాలు వచ్చి, అతనిలో వింత సోయగాల్ని తెచ్చి పెట్టాయి. మనిషి బాగా ఎదిగాడు, మెదడు ఇంకా ఎదిగింది.

అతని పెరుగుదల అందరికీ కనిపిస్తుందిగానీ, ఆలోచనలోని పెరుగుదల అతని కొక్కనికే తెలుస్తుంది. ధీరజ్ తండ్రి సుందరం ధీరజ్‌ని గమనిస్తున్నాడు. ఎందుకంటే ఆ వయసు ప్రభావం ఎలా ఉంటుందో అతనికి తెలుసుకాబట్టి. ఆడపిల్లను వయసులోనే కాదు, ఆ తరువాత కూడా కాపలా కాయాలంటారు. కంటికి రెప్పలా చూడాలంటారు. కాని ఒక కూతురుకి మాత్రమే తండ్రి అయి, ముగ్గురు కొడుకులను కన్న సుందరానికి ఆడపిల్లకంటే కూడా మగపిల్లాడికి మరింత కాపలాకాయాలని, ఎంతో శ్రద్ధగా పెంచాలని తెలిసివచ్చింది. ఆడపిల్లది ఏముంది చదువు అబ్బినా, అబ్బకపోయినా ఒక అయ్య చేతిలో పెడితే బాధ్యత తీరుతుంది. ఆ తరువాత బాధ్యత అంతా భర్తదే. కాని మగపిల్లవాడు సరయిన మార్గంలో పయనించపోతే అతని బ్రతుకు నాశనం అయిపోతుంది. చదువు వంటబట్టకపోతే చెడు అలవాట్లుకు లోనైతే జీవితపథమే ముళ్ళకంచెలా మారుతుంది. అందుకే సుందరం ధీరజ్‌ని గమనిస్తూనే ఉన్నాడు.

ధీరజ్ స్టయిల్‌లో మార్పు, మాటలో మార్పు, మనిషిలో మార్పు, అన్నిటికంటే ఆలోచనలలో చెప్పలేని విచిత్రమైన మార్పు వచ్చేసాయి. బయట ఫ్రెండ్స్ అందరూ సీక్రెట్‌గా సెక్స్ గురించి మాట్లాడుకుంటుంటే చెవులు మాస్టారు చెప్పే పాఠాల కంటే గూడ, ఆ మాటలనే వినసాగాయి.

ఇంట్లో సుందరం సెక్స్ అన్న మాటగాని, దృశ్యంగాని ధీరజ్ దగ్గరకు చేరకుండా ఎంత జాగ్రత్త పడుతున్నాడో, అంతకంటే ఎక్కువగా ఫ్రెండ్స్ దగ్గర వాటి సంగతులు



వింటున్నాడు ధీరజ్. ఆ వయసులో పిల్లలు వినగూడనిది వింటే, చూడకూడనివి చూస్తే స్టిమ్యులేట్ అయి తమని తాము కంట్రోలు చేసికోలేరు.

ధీరజ్‌కి ఇప్పుడు అయిదేళ్ళ పసిడి కూడా అజంతా చిత్రంలాగ, ముసలిది కూడా కోణార్క శిల్పంలాగా, కురూపి అయిన స్త్రీ అయినా కోమలిలాగ కనిపిస్తున్నారు. తప్పు అతని ఆలోచనలది, కళ్ళది కాదు. వయసుది మాత్రమే. అలా కనబడడానికి కారణం కేవలం వాళ్ళు ఆడవాళ్ళు కావడం ఒక్కటే. ఆడవారి అందాలన్నీ పిండుకొని తాగేయాలన్న తపన ఎక్కువైపోయింది రోజురోజుకి. తనకంటే చిన్న వారిని ఏదో చెయ్యాలని, లేదా కనీసం ముద్దు అయినా పెట్టుకోవాలనే కోరికను అదుపులో పెట్టుకోడానికి చాలా కష్టపడవలసి వచ్చింది.

ధీరజ్‌కి అసహనంగా ఉంటుంది. తిండి మీద, చదువు మీద ధ్యాస అంతగా ఉండడం లేదు. అకారణ కోపం వస్తుంది అందరి మీద. శరీరం, బుర్ర కూడా అతనికి తెలియకుండానే ఏమిటోలా అయిపోతున్నాయి. ఏమీ చేయలేని, ఎవరికీ చెప్పుకోలేని అశక్తత. ఆడవారిని చూస్తే చాలు ఎదలో ఏదో చెప్పలేని గుబులు, ఆపై దిగులు.

సినిమాలోని జంటలను చూస్తుంటే డ్యూయెట్లు పాడుతుంటే చక్కలిగిలి పెట్టినట్లుంటుంది. అందులోని కౌగిలింతలు చూస్తుంటే ధీరజ్‌కి ఒళ్ళంతా పులకింతలు కలుగుతున్నాయి. ఒళ్ళంతా కళ్ళు చేసుకొని ఆ సన్నివేశాన్ని చూడాలనే తపన ఎక్కువై పోతోంది. టి.వి.లోని క్రికెట్ లాంటి ఆటలు చూస్తుంటే ఆ ఆటకంటే ఆడ మగ ఆడే ఆట చూడాలనే ఉబలాటం. ఎవరైనా ఆలుమగలు గదిలో పడుకుంటే లోపల ఏం జరుగుతుందో చూడాలనే ఆరాటం. ఆడవాళ్ళు స్నానం చేస్తుంటే ఆ సన్నివేశం చూడాలని మనసులో పోరాటం. బెడ్‌రూమ్‌లవైపే అతని కళ్ళు ఎప్పుడూ ఉంటున్నాయి.

సుందరం అక్క, బావ వచ్చారు. వారు రాగానే ధీరజ్ తల్లిదండ్రులు వారి గది కూతురికి అల్లుడికి ఇచ్చి చెరో చోట పడుకుంటే వారిని చూసి పిచ్చిగా నవ్వుకున్నాడు

ధీరజ్. నాకు పెళ్ళయిన తర్వాత ఎంత ముసలాడిని అయినా నా భార్యకు దూరంగా ఉండను అనుకున్నాడు. అక్క, బావతో పోట్లాడుతుంటే అయ్యో ఈమెకు పని లేదా, ఎందుకు బావను దూరం చేసికుంటుంది అనే తలంపు కలిగింది. వదిన పుట్టింటికి వెళితే అన్నయ్యను వదిలి రోజూ జరిగే ఆ అనుభవాన్ని దూరంగా వదిలి అన్నయ్య ఎలా ఉండగలుగుతున్నారు అనే ఆలోచన ధీరజ్ బుర్రని తినేస్తుంది. చిన్నన్నయ్యకు పెళ్ళి సంబంధాలు చూస్తుంటే అతను ఇప్పుడే పెళ్ళి చేసుకోను అంటున్నాడు. అయ్యో ఆ పెళ్లి నాకు చెయ్యండి. అన్నయ్య పిచ్చివాడు, కోరికలు లేనివాడు పెళ్ళి వద్దంటున్నాడు. నేనైతే అనను. నాకు పెళ్ళి చేసెయ్యండి' అని అరవాలనిపిస్తుంది.

సుందరం కొడుకులోని భావాలను, మార్పులను కనిపెడుతున్నా ఏమి చేయగలడు. ఆ కోరిక కొంత కాలమే ఉంటుంది, ఒకటి రెండు సంవత్సరాలుపోతే, పెద్దరికం వస్తే అలాంటి సెక్స్ గురించి ఆవేదన ఉండదని ఆయనకు తెలుసు. కాని ధీరజ్ అతని ఫ్రెండ్స్‌లో ఆ అనుభవం తెలిసికోవడానికి ఒక వేశ్య దగ్గరకు వెళ్ళడానికి సిద్ధపడుతున్నాడని తెలిసి మతిపోయిందాయనకు.

ఆ రోజు రాత్రి యధాలాపంగా తల్లిదండ్రుల మాటలు వినడానికి కిటికీ ప్రక్కనక్కాడు ధీరజ్. వాళ్ళు ప్రేమ డైలాగులు చెప్పుకుంటారని అతని పిచ్చి ఊహ.

"చిన్నప్పుడు నా స్నేహితుడొకడు ఉండేవాడు. వాడికి పదేళ్ళ నుండి సెక్స్ అంటే మహా ఇష్టంలే. కాలేజీకి రాగానే ఒక వేశ్య దగ్గరకు వెళ్ళాడు. అనుభవం సంగతి దేవుడెరుగు..."

"రోగాలు అంటుకొని ఉంటాయి అవునా?" తల్లి అంది. "అవును అవి మాటలు కాదు, భయంకరమైనవి ఆ వయసులో కోరిక సహజమనుకో. మనల్ని మనం కంట్రోల్ చేసుకోవాలి. అగ్గి బాగుందని ఇష్టమని ముట్టుకుంటే కాలకుండా ఉంటుందా? వాడికి జబ్బులంటుకున్న విషయం అటు ఇంట్లోను, ఇటు డాక్టర్‌తోనూ చెప్పడానికి సిగ్గుపడి, పాపం ఆత్మహత్య చేసుకున్నాడు."

"అయ్యో పాపం"

•'పాపమే మరి. ఏ వయసులో ఆ ముచ్చట. ఆ వయసులో చక్కగా చదువుకొని పరీక్షలో ఫస్టు రావాలని ప్రయత్నించాలిగాని, కోరిక కలిగిందని అలాంటి పని చెయ్యడమేనా, ముందు చదువుకోవాలి. అదే కదా జీవితానికి బంగారు బాట. పెళ్ళయిన తరువాత కావలసినంత అనుభవించవచ్చు జీవితాన్ని"

"అయితే మీరు కూడా ఎప్పుడైనా..."

"ఛ... ఛ... నేను శ్రీరామచంద్రుడినే. కోరికను కంట్రోలు చేసుకోలేని మూర్ఖుడిని కాదు. నా మొట్టమొదటి అనుభవం నా భార్యతోనే జరిగింది. అనుకుంటే! ఎంత గొప్పగా ఉంటుందో శీలం ఆడదానికే కాదు, మగవాడికీ అవసరమే."

"మీరు చాలా మంచివారు"

"నేనే కాదు నా పిల్లలూ మంచివారే. మనసు చదువు మీద భవిష్యత్తు మీద లగ్నం చేస్తే మనసుని, శరీరాన్ని అదుపులో పెట్టుకోవచ్చు. తెలుసా."

ఆ మాటలు ధీరజ్‌ని ఉద్దేశించి అన్నారని ధీరజ్‌కి తెలియదు గాని అవి అతనిపై చాలా ప్రభావం చూపాయి. మర్నాడే మనసుని, వయసుని కంట్రోల్‌లో పెట్టుకుని పుస్తకం పట్టుకోవడం మొదలు పెట్టాడు.

(ఆంధ్రభూమి మంత్లీ, 17-02-99)

☆ ☆ ☆

# బ్యూటీ క్లినిక్

“ఆడపిల్లకు మంచి భర్త దొరకకపోతే ఆమె జీవితం ఒక్కటే నాశనం అవుతుంది కాని, మధ్యతరగతి కుటుంబాలలో మగవాడికి మంచిభార్య దొరకకపోతే, అతనిని అర్థంచేసుకొని కుటుంబానికి సహకరించకపోతే ఆ కుటుంబం అంతా కష్టాల పాలవుతుంది”. ఈ అభిప్రాయం వీరేశ్వరరావు గారిదొక్కరిదేకాదు. మధ్య తరగతి కుటుంబంలోని ప్రతీ తండ్రిదీ కూడా. కొడుకులను తమ కడుపు మాడ్చుకుని పెట్టుబడి పెట్టి ఒక ఉన్నత స్థానములో నిలబెడతారు. తమని ఆదుకుంటారని భావిస్తారు పెళ్ళయ్యేవరకూ ఏకొడుకయినా మంచిగానే ఉంటాడు. పెళ్లయిన తరువాత కూడా ఆ కుటుంబం అలాగే ఉందంటే, అది కోడలి గొప్పతనమే, ఆమె మంచితనమే.

సుధాకర్ భార్య ప్రమద కట్నం బాగానే తెచ్చింది. వీరేశ్వరరావుగారు కాని, భార్య సుమిత్ర గాని అసలు కట్నం గురించి వత్తిడి చేయలేదు. కారణం వాళ్ళు ఆడపిల్లలను కన్న తలిదండ్రులు. కుటుంబం మంచిది ప్రమద తల్లి ఓర్పుమంతురాలు. ఇప్పటికీ అత్తింటివారిని ఆదరముతో చూస్తుంది. తల్లిలాగే పిల్ల బుద్ధిమంతురాలు అనే భ్రమతో ప్రమదను కోడలిగా చేసుకున్నారు. ప్రమద తండ్రిమాత్రం వీరేశ్వరరావుగారు అడగకుండానే కట్నం ఇచ్చారు.

ప్రమద వచ్చిన తరువాత అత్తింటివారిని చులకనగా చూడడం మొదలుపెట్టింది. ఆమెకు డబ్బుంది అనే అహం ఎక్కువ. అంత అందగత్తెకాదు లావుగా, కొద్దిగా ఎత్తుపళ్ళతో, వంకర ముక్కుతో ఉంటుంది. అయినప్పటికీ ఆమె ముఖంలో ఒక విధమైన కళ ఉంది. అందుకే అనాకారిలా కనబడదు. అందముగా, తెల్లగా మెరుపుతీగల్లా ఉన్న ఆడబడుచులను చూసి, ఆమెకు అసూయ కలిగింది. దానితో వారంటే మరీ చిరాకు. వారికి పెళ్ళి సంబంధాలు వస్తేచాలు ఈ పేదవాళ్ళకు పెళ్ళవుతుందా అనుకునేది.

సుధాకర్‌కి చదువంటే చాల ఇష్టం. ఏవో పరీక్షలు వ్రాస్తూ, ఆఫీసుపనిలో బిజీగా ఉంటూ, ఇంటి విషయాలు అంతగా పట్టించుకోడు. చిన్నప్పటినుండి అన్నీ తల్లి తండ్రి ఎలా చూసుకునేవారో ఇప్పుడు అలాగే చూసుకుంటారు అనుకున్నాడు. ప్రమద ఒక్కతే కదా ఇంట్లో ఎక్కువయింది దాని గురించి పెద్దగా ఆలోచించవలసింది ఏముంది అని తలచాడు.

కాని ప్రమద అలా అనుకోలేకపోయింది- పెళ్ళయినతరువాత కూడా పెద్దవాళ్ళ పెత్తనం ఏమిటి అని విసుక్కునేది. భర్తకు ఏవేవో చెప్పాలని చూసింది. అతను అవి సీరియస్‌గా తీసుకోలేదు. వంటంతా అమ్మ చూసుకుంటుంది. ఇంట్లో ప్రమదకు కావలసినంత స్వేచ్ఛ ఉంది, హాయిగానే ఉంది ప్రమద అనుకుంటున్నాడు. ఆమెలో స్వార్థం అతను గ్రహించలేదు.

అనుకోకుండా, పెళ్ళయిన మూడవ నెలలోనే సుధాకర్ ఐ.ఎ.ఎస్. పాస్ కావడంతో ట్రయినింగ్ కాగానే, అందరూ సంతోషంతో పోస్టింగ్ వచ్చిన ఊరుకి మకాం మార్చేశారు. తమతో వస్తున్న అత్తింటివారిని చూసి ముఖం చిట్లించింది ప్రమద. తమ కొడుకు అంత ఉన్నత స్థితికి వచ్చేసరికి తల్లిదండ్రులకు పరమానందముగా ఉంది. సుధాకర్ చాలా బిజీ అయిపోయాడు. భార్యను అన్ని ఫంక్షన్స్‌కు తీసికెళ్ళేవాడు. బ్యూటీ క్లినిక్‌కు వెళ్ళి తన రూపు మొత్తం మార్చేసుకొని ఇప్పుడు చాలా అందముగా తయారయింది, ప్రమద ఇప్పుడు అందగత్తెల కోవలోకి వచ్చేసింది. సుధాకర్ కూడ భార్య, తనతో ఫంక్షన్స్‌కి రావలసి ఉంటుందని బట్టలు, నగలు ఎక్కువే కొన్నాడు. కొడుకుని కోడలిని చూసి, ఎంతో మురిసి పోయేవారు వీరేశ్వరరావు దంపతులు. సుధాకర్ చెల్లెళ్ళయితే, వదిన అందానికి ఇంకా మెరుగులు దిద్దాలని ప్రయత్నించేవారు. వారి పనులకు మాటలకు విసుక్కునేది వారిమీద ప్రమద.

రాను రాను ప్రమద ప్రవర్తన విపరీతం కాసాగింది. పనివాళ్ళమీద వంకపెట్టి అందరిని తిట్టేది. తను తెచ్చిన డబ్బుతినే ఆ ఇంటిలోనివారు పుట్టినప్పటినుండీ పెరిగినట్లు మాట్లాడేది. మొదట్లో ప్రమద తెచ్చిన కట్నం అసలు వారు వాడలేదు. సుధాకర్‌కి కలెక్టర్ ఉద్యోగం రావడంతో హోదా పెరిగి, ఫర్నిచర్ కోసం, బట్టలు, వస్తువుల కోసం డబ్బు వాడక తప్పలేదు. దానితో ఆ కుటుంబం అంటే లోకువయింది ప్రమదకు.

ప్రమద చిరాకులు, పరాకులు చిటపటలు ఎక్కువ కావడంతో కోడలి మనసు అర్థం చేసుకొన్న అత్తమామలు, ఆడబడుచులు సుధాకర్‌కి ఆ విషయాలు ఏమీ చెప్పకుండానే మన ఊరిలో ఉంటే చెల్లెళ్ళకు సంబంధాలు వెతకవచ్చు ఇక్కడ అలా కుదరడం లేదుకదా అంటూ మర్యాదగా, మకాం మార్చేసారు. ఇంట్లో సంగతులు మాత్రం సుధాకర్‌కి ఏమీ తెలియవు.

ప్రమద ఇంతకాలం గాలిలేని ఇంట్లో ఉన్నట్లు అప్పుడే ఆ ఇంటిలోకి గాలి ప్రవేశించినట్లు హాయిగా ఊపిరి పీల్చుకుంది. వాళ్ళు ఇంత కాలం ఆ కుటుంబంలో తన భర్త ఒక్కడే మంచివాడు, తెలివైన వాడు అన్నట్లు మిగిలిన వారందరూ దద్దమ్మలు, దరిద్రులు, దయ్యాలు అన్నట్లు మాట్లాడేది. మాటలతో వారిని బాధించేది.

వాళ్ళు వెళ్ళిన తరువాత వాళ్ళు రాసే ఉత్తరాలు భర్తకంట బడకుండా చింపేసేది. సాధ్యమయినంతవరకూ భర్తను బిజీగా ఉంచేసి, తల్లిదండ్రుల విషయాలు ఎత్తనిచ్చేది కాదు. ఒకసారి తండ్రికి బాగులేదు అని ఉత్తరం వస్తే ఆరోజు క్లబ్‌లో ఫంక్షన్ ఉందని తండ్రికి బాగులేదన్న ఉత్తరం చూస్తే భర్త వెళ్ళిపోతే, తను క్లబ్‌లో ప్రయిజ్ డిస్ట్రిబ్యూషన్ చేసే అవకాశం పోతుందని భయపడి ఆ ఉత్తరం కూడ మాయం చేసింది. కోడలి మనస్తత్వం ఎరిగిన అత్తమామలు కొడుకు ఎందుకు రాలేదో గ్రహించారు. ఈసారి కొడుకుకి కాక కోడలికి వ్రాసారు ఉత్తరం.

చిరంజీవి ప్రమదకు.

అత్తమామలు ఆశీర్వదించి వ్రాయుట. ప్రమదా! మేము అక్కడ ఉండగా నీ మనస్తత్వాన్ని నీ మాటల ద్వారాను, నీ ప్రవర్తన ద్వారా గ్రహించాము. ఇంట్లో నీ భర్త ఒక్కడే మంచివాడు మేము చెడ్డవాళ్ళం, పేదవాళ్ళం అనే అభిప్రాయం నీకుంది. సుధాకర్ పుట్టిన వెంటనే ఐ.ఎ.ఎస్. ఆఫీసరు కాలేదు. వాడు ఈ స్థితికి రావడానికి మా ఆస్థి అంతా ఫణంగా పెట్టాము. వాడిలో మంచితనం ఎవరి రక్తంలోనుండి రాలేదు. మారక్తం పంచుకు పుట్టాడు. ఆ మంచినతం, తెలివితేటలు మారక్తంలోనివే. సుధాకర్‌ని అంత మంచివ్యక్తిగా తీర్చి దిద్దడానికి మేము ఎంత శ్రమపడ్డామో, నీకు పిల్లలు పుట్టి వారిని పెంచితే తెలుస్తుంది. ఆ విషయం అనుభవంవలన తెలియాలిగాని, మాటల వలన కాదు. భర్త ప్రేమను ఆకట్టుకునే మార్గం అందం ఒక్కటే కాదు, అత్తింటివారినీ ఆప్యాయంగా చూడడంకూడ. సుధాకర్ ఇప్పుడు బిజీలో నీ స్వార్థపూరితమైన మనసు అర్థం చేసుకోలేక పోయినా ఎప్పుడో ఒకప్పుడు నిజం గ్రహిస్తాడు. వాడు నిజం గ్రహించాలి అంటే మేము ఒక్కమాట చెబితేచాలు కాని, మాలో అంత నీచబుద్ధి లేదు. నీవు చిన్నదానివి. అందుకే తెలియక స్వార్థపూరితంగా ఆలోచిస్తున్నావని మేము అనుకుంటున్నాము. ఇప్పటికయినా మమ్మల్ని మనుషులుగా, నీ భర్తకు పుట్టుకనిచ్చిన తల్లిదండ్రులుగా గుర్తిస్తే సంతోషిస్తాము. నీవు మాకు డబ్బు పెట్టకపోయినా ఫరవాలేదు. నీచంగా మాత్రం చూడవద్దు. ఆ నీచభావన అలాగే ఎక్కువ చేసికొని నీ భర్తకు దూరం కావద్దు. ఒకసారి మనసు విరిగితే అతకడం కష్టం. సుధాకర్ మనసు విరగ్గొట్టకు.

ప్రమదా, నీవు బ్యూటీక్లీనిక్‌కి వెళ్ళి పొడవు జుట్టును వంకీలుగాను, నల్లని మొహాన్ని బ్లీచింగ్‌తో తెల్లగాను, ఎత్తుపళ్ళను డెంటిస్ట్ సహాయంతో క్లిప్స్ వేసికొని అందమైన పలువరుసగాను, ప్లాస్టిక్ సర్జరీతో ముక్కును తిన్నగాను చేసికొని డైటింగ్‌తో సన్నగా అయి, అందంగా తయారయ్యావు. అలాగే నీ మనసుని ఏదైనా మార్గంద్వారా అందంగా చేసికొని అందరినీ ఆదరించడం నేర్చుకో తల్లి. మంచి పేరు తెచ్చుకో. ఇట్లు నీ అత్త మామలు. ఆ ఉత్తరమే ప్రమద మనసుకి మంచి బ్యూటీ క్లినిక్ అయింది.

(జయశ్రీ, ఆగస్ట్ 1980)

☆ ☆ ☆

# ఇది కథ కాదు

క్రిస్‌మస్ న్యూఇయర్ వెళ్ళిపోగానే గాలి తీసిన బెలూన్‌లా అయిపోయింది ఊరంతా. బయట మంచు పడుతూంది. లత కిటికీ దగ్గర నిలబడి పరధ్యానంగా ఆలోచిస్తూంది. మనస్సంతా దిగులుగా ఉంది. శారద వ్రాసిన ఉత్తరం గురించి ఆలోచిస్తూంది. మల్లె పువ్వులు చిదిమి గాలిలోకి విసిరినట్లుగా ఉంది కురుస్తున్న మంచు. చెట్లులోని ఆకులు కనబడకుండా విరబూసిన తెల్లని నంది వర్ధనం చెట్టులా ఉంది. కురిసిన మంచు. నేలంతా పాల సముద్రం పొంగినట్లు ఉంది చూడడానికి. వాకిట్లో నిన్నను కట్టిన స్నోమేన్ ఒంటరిగా నిలబడి ఉన్నాడు. ఈరోజు కురుస్తున్న మంచు స్నోమేన్ ముక్కు, చెవులు అన్నీ కప్పేస్తూంది. స్నోమేన్‌ని చూస్తుంటే చలిలో గొబ్బెమ్మలు పెడుతున్న చెల్లెళ్ళు కళ్ళల్లో మెదులుతున్నారు. లత వాళ్ళుండే ప్రక్క ఫ్లాట్‌లో నలుగురు అమ్మాయిలు ఉంటున్నారు. వాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంకా పెళ్ళిళ్ళు కాలేదు. సరదాగా మంచులో స్నోమేన్‌ను కట్టి నిన్నంతా చాలా హుషారుగా గంతులు వేశారు.

కాలింగ్‌బెల్ మోగడంతో ఉలిక్కిపడి తలుపు తీసింది లత. ఎదురుగా ప్రక్క ఫ్లాట్‌లోని అమ్మాయి కేత్‌లిన్. లోపలికి రమ్మంటూ ఆహ్వానించింది. కేత్‌లిన్‌తో ఆమె బాయ్ ఫ్రెండు స్టీ వెన్స్ కూడా వచ్చాడు. అతనిని పరిచయం చేసింది కేత్‌లిన్. కాసేపు ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పుకున్నారు. 'ఈరోజు స్టీవ్‌ని ఇచ్చటకు ఎందుకు తెచ్చానో తెలుసా? ఈరోజు మాకు ఎంగేజుమెంట్ అయింది. షాప్‌కి వెళ్ళి ఎంగేజు మెంట్ రింగ్ కొనుక్కొని, అచ్చటే నా వ్రేలికి పెట్టాడు స్టీవ్. నీకు చూపించాలని వచ్చాను.' అంది చేతి ఉంగరం చూపిస్తూ. 'అలాగా? చాలా సంతోషం. మరి పెళ్ళి ఎప్పుడు?' అడిగింది లత. 'అప్పుడే కాదు మరో అయిదు సంవత్సరాలన్నా పోవాలి. ఈ లోపుగా మేము మా ఇంటికి కావలసినవన్నీ కొనుక్కొని, తరువాత గాని పెళ్ళి చేసుకోము. నా జాబ్ కూడా పర్మనెంటు కావాలి' అంది. ఇంతలో ఫోను మ్రోగింది. భర్త ఫోను చేశాడు హాస్పిటల్ నుండి తను ఆలస్యంగా వస్తానని, ఏక్సిడెంటు కేసులు చాలా ఉన్నాయని, రవి, నీవు భోంచేయమని చెప్పాడు. అలాగే అంటూ ఫోను పెట్టేసి వచ్చింది. 'కేతీ, మీరు మీ టీ (సప్పర్) పూర్తి చేసేశారా?' అని అడిగింది. 'లేదు, లతా, ఇప్పుడు వెళ్ళి తీసుకుంటాం' అంది. 'టీ టైము అయింది కదూ! ఈరోజు నాతోతీసుకుంటారా? రావు ఇప్పుడే రానని చెప్పారు' అంది. లత వాళ్ళింట్లో భోజనం అంటే చాల ఇష్టం కేత్‌లిన్‌కి. "ఏమంటావు" అన్నట్లు స్టీవ్ వైపు చూసింది. అతను సరే నన్నాను. ఇంట్లో డ్రింక్సు ఏమీ లేవు. గబగబ ఎదురింటికి ఫోను చేసింది - 'మోరన్' మీ డేవిడ్‌ను ఒకసారి పంపగలవా? చిన్న పనుంది, అంటూ. డేవిడ్ రాగానే ఆ అబ్బాయిని పంపి

డ్రింక్సు తెప్పించింది. డేవిడ్‌కు పన్నెండు సంవత్సరాలుంటాయి. వాళ్ళ అమ్మకు పెళ్ళి కాకుండానే పుడితే, ఆ అబ్బాయిని వాళ్ళ అమ్మమ్మ, తాతయ్యల దగ్గర వదిలేసి, మరో దేశం వెళ్ళి అచ్చట ఒకతనిని పెళ్ళి చేసుకొని స్థిరపడి పోయింది. డేవిడ్ ఇచ్చట అమ్మమ్మ, తాతయ్యల దగ్గర ఉంటాడు. స్కూలుకి వెళ్ళడు. అల్లరిగా రోడ్ల వెంట తిరుగుతుంటాడు. ఎవరికి ఏ పని కావలసినా చేసి పెడతాడు. పాపం, ఆ అబ్బాయి అంటే లతకు ఎంతో జాలి. అస్తమానం పిలిచి, చేరదీసి, అవీ ఇవీ పెడుతూంటుంది.

లత టేబిల్ మీద అన్నీ అరేంజ్ చేస్తుంటే కేత్‌లిన్ కూడా వచ్చి అన్నీ సర్దింది. ఫైర్ ఆరిపోతూంటే బొగ్గులు వేసింది. కేత్‌లిన్ అలా చేస్తుంటే శారద వ్రాసిన ఉత్తరం గుర్తుకి వచ్చి మనస్సు కలుక్కు మంది లతకు. 'ఇంటి పనంతా ఒక్కదాన్ని చేయలేకపోతున్నాను. నీవు ఉన్నప్పుడు మనిద్దరం సరదాగా చేసే వాళ్ళం. ఇప్పుడు ఒంటరి దాన్నయి పోయాను. అత్తయ్య ఎంత పని చేసినా ఇంకా ఏమీ చెయ్యలేదని సాధిస్తూనే ఉంటారు. ఎవరూ ఏ పని ముట్టుకోరు. అక్కా! నీవు గుర్తు కొచ్చినప్పుడల్లా నాకు చాలా ఏడుపు వస్తుంది' అంటూ వ్రాసింది తోడి కోడలు శారద. టేబిల్ మీద అన్నీ సిద్ధం కాగానే అందరూ కూర్చున్నారు. 'చికెన్ బిరియానీ తింటావా' అని అడిగింది స్టీవ్‌ను. కావాలన్నాడు. లత చేతితో తింటుంటే తను కూడా చేతితో తినాలని మొదలు పెట్టి, అలవాటు లేని వేళ్ళు వంగక అవస్థలు పడుతూ క్రింద, మీద అన్నం చల్లుకుంటుంటే నవ్వు వచ్చింది లతకు.

☆ ☆ ☆

'మీరు ఇందాక సిగరెట్టు తాగలేదు. ఇప్పుడు డ్రింక్సు తాగడం లేదు. నాకు ఆశ్చర్యంగా ఉంది అన్నారు. 'మాకు అలవాటు లేదు' అంది లత. 'అన్నట్లు చెప్పడం మరిచాను. మీరు కేత్‌లిన్‌కి చీర కట్టి తీసిన ఫోటో చాలా బాగుంది' అన్నాడు మెచ్చుకోలుగా! 'అలాగా! చాలా థాంక్స్' అంది చిన్నగా నవ్వుతూ. 'మీరు డాన్సులకు వెళ్ళరా?' తిరిగి తనే ప్రశ్నించాడు స్టీవ్. 'ఉహూఁ' అంటూ తల అడ్డంగా తిప్పింది లత. 'సిగరెట్సు, డ్రింక్సు తాగరు. డాన్సులకు వెళ్ళరు. మీరు మరి ఏ విధంగా లైఫ్ ఎంజాయ్ చేస్తారు.' అమాయకంగా స్టీవ్ అడుగుతుంటే, ఉమ్మడి కుటుంబాలలో ఏ ఆత్మీయతకూ నోచుకోక, మర వలె ప్రొద్దస్తమానూ పనిచేస్తున్న శారద లాంటి స్త్రీలు కళ్ళల్లో మెదిలారు లతకు. భోజనం కాగానే లత గిన్నెలు కడుగుతుంటే, అవన్నీ బట్టతో తుడిచి ఒక ప్రక్క పెడుతూంది కేతీ. సిటింగ్ రూమ్‌లో టెలివిజన్‌లో కౌబాయ్ సినిమా వస్తుంటే రవి, స్టీవ్ గన్స్ తీసుకొని, డిస్కుండిస్కుం అంటూ ఆడుకుంటున్నారు. స్టీవ్ కూడా చిన్న పిల్లాడిలా రవితో సరదాగా ఆడుతుంటే నవ్వు వచ్చింది లతకు.

☆ ☆ ☆



మంచు కురవడం తగ్గినా రోడ్డు మీద మంచు తరగలేదు. కారు టైర్లు జారిపోకుండా కంకర, మట్టి చల్లుతున్నారు రోడ్లమీద. అప్పుడప్పుడు మంత్రిగారి పర్యవేక్షణలాగ సూర్యుడు వచ్చి వాతావరణాన్ని చూసి, 'ఈ చలికి నేను తట్టుకోలేను' అంటూ మబ్బుల చాటుకి పోతున్నాడు. 'సూర్యుడా!' నీవు లేకే కదా మాకీ చలి' అంటూ మంచుతో బరువెక్కిన చెట్లు సూర్యుని వైపు దీనంగా చూస్తున్నాయి. లత, భాస్కరరావు ఆరోజు పెళ్ళికి వెళ్ళారు. హాస్పిటల్‌లో ఎవరిదో ఒక నర్సు పెళ్ళి అయితే పిలిచారు. రవిని ప్రక్కింట్లో వదలి వెళ్ళారు. పెళ్ళి ఒక గంటలో అయిపోయింది. అటు నుండి అటే వాళ్ళు హోటల్లో అరేంజి చేసిన డిన్నరుకి వెళ్ళి ఇంటికి వచ్చేశారు. పెళ్ళంటే పది రోజుల ముందు నుండి ఇంటి దగ్గర అలసి పోయే పెద్ద వాళ్ళు గుర్తుకి వచ్చారు. పెళ్ళికి వెళ్ళినా ఏదో గుడికి వెళ్ళి వచ్చినట్లుంది గాని, పెళ్ళి హడావిడేమో కనిపించలేదు లతకి. ఇంటికి రాగానే రవిని తీసుకొని శారా వచ్చింది. 'చాల థాంక్స్, శారా! రవి ఏమైనా అల్లరి చేశాడా?' అని అడిగింది. 'లేదు. చాలా బుద్ధిగా ఉన్నాడు.' అంటూ, 'ఈ రోజు ఎవ్లిన్ పుట్టినరోజు. రాత్రికి పార్టీ ఉంది. నీకు చెప్పమంది. తను తరువాత వచ్చి పిలుస్తానంది అంది. 'సరే! తప్పకుండా వస్తాం' అని చెప్పి శారాను పంపించి వేసింది.

ప్రక్కఫ్లాట్‌లో చాలా హడావిడిగా ఉంది. అందరూ డాన్స్‌కి వెళ్ళి రాత్రి పదకొండుకి ఇంటికి వచ్చారు. రాగానే ఎల్లిన్ వచ్చి స్వయంగా లతను తీసుకెళ్ళింది. ఎల్లిన్ 21వ పుట్టిన రోజు. ఎప్పుడూ పుట్టిన రోజుకి పార్టీ ఇవ్వదట. ఇరవయొకటి అందరూ స్పెషల్‌గా చేసుకుంటారు కాబట్టి తను పార్టీ ఎప్పుడూ పుట్టిన రోజుకి పార్టీ ఇస్తూంది. అందరూ తాళంచేతులు ప్రజెంట్ చేస్తున్నారు. అప్పటి నుండి ఎల్లిన్ చిన్న తనం వదలి పెద్దరికంలో అడుగు పెట్టినట్లన్న మాట. లత తను తెచ్చిన లేపాక్షి పెయింట్, ఒక సెంటు, రావి ఆకుమీద పెయింట్ చేసిన రాధాకృష్ణుల బర్త్‌డే గ్రీటింగు ఎల్లిన్‌కు ప్రజెంట్ చేసింది. అందరూ ఇచ్చిన ప్రెజెంటేషన్స్ కన్నా లత ఇచ్చిన రావి ఆకు గ్రీటింగు అందరిని ఆకర్షించింది. 'ఆకుమీద ఎంత చక్కగా పెయింట్ చేశారో! మే మెప్పుడూ ఇలాంటివి చూడలేదు.' అని అందరు అంటుంటే చాలా గర్వం కలిగింది లతకు. 'డాక్టర్ రావు రాలేదేం' అని శారా అడిగింది. 'వాళ్ళ కన్సల్టెంటు సెలవులో ఉన్నారట. హాస్పిటల్ పనంతా రావు ఒక్కరే చూసుకోడంతో ఖాళీ ఉండడం లేదు. ఏదో కేసువస్తే హాస్పిటల్‌కు వెళ్ళారు. హాస్పిటల్ నుండి రాగానే వస్తానన్నారు.' అంది లత.

బెర్నాడేట్ అందరికి ఫలహారాలు పెడుతూంది. కేక్‌లు, బిస్కట్లు, హాట్ డ్రింక్సు, సాఫ్ట్ డ్రింక్సు - ఎవరికి ఏం కావాలో అందిస్తూంది. హాలంతా గెస్టులతో నిండి ఉంది. అందరూ జంటలు జంటలుగా ఉన్నారు. కాని అందులో ఎవరికీ పెళ్ళికాలేదు. అందులో ఏ జంటా లేకుండా ఒంటరిగా ఉన్నది బ్రీజు ఒక్కతే. బ్రీజు వచ్చి లత ప్రక్కన కూర్చుంది. అందరూ బాయ్ ఫ్రెండ్సుతో ఉన్నారు. నీవు ఒక్కదానివే ఒంటరిగా ఉన్నావు, బ్రీజు అంటూ పలకరించింది లత. సమాధానంగా చిరునవ్వు నవ్వింది. బ్రీజు చదివిన స్కూల్లో వాళ్ళ టీచరు వయసులో ఉన్నప్పుడు ఎవరినో ప్రేమించిందట. పెళ్ళి చేసుకోకుండానే కొంత కాలం ఆమెతో తిరిగి తరువాత వేరొకామెను పెళ్ళిచేసుకున్నాడట. అప్పటి నుండి ఆ టీచరుకి మగ వాళ్ళంటే అసహ్యం. అదే పిల్లలకు బోధించేదట. ఆ కారణంతో బ్రీజుకు మగవాళ్ళంటే ఇష్టం ఉండదు. అసలు పెళ్ళి చేసుకోను అంటుంది. ఎవరయినా మగవాళ్ళు సరదాకి తన మీద చెయ్యి వేసినా ఇష్టం ఉండదు బ్రీజ్‌కు. డాన్సులకు వెళ్ళినా అమ్మాయిలతోనే డాన్సు చేస్తుంది. 'నీ జుట్టు బాగుంటుంది, లతా! మాలాగ ఎందుకు వదిలేసుకోవు. జడ వేసుకొని అందాలన్నీ అందులో బంధించేస్తున్నావు నీవు' అంటుంది. 'నీవు స్కర్టు వేసుకుంటే చూడాలని ఉంది' అని అంటూంటుంది అప్పుడప్పుడు. 'సరేగాని, అందరూ కనిపిస్తున్నారు. సుసన్ కనబడడం లేదేం అని అడిగింది లత బ్రీజును. సుసన్ గురించి అడగ్గానే ముఖం మాడ్చుకుంది బ్రీజు. దగ్గరగా జరిగి రహస్యం చెబుతున్నట్లు 'అబార్షన్ చేయించుకోడానికి ఇంగ్లండు వెళ్ళింది' అంది. సుసన్‌కు మొదట్లో ఒక అబ్బాయితో ఎంగేజ్‌మెంట్ అయింది. అది జరిగిన కొద్ది రోజులకు వేరొక అబ్బాయితో పరిచయమయి మొదటి అబ్బాయి పెట్టిన ఎంగేజుమెంటు

రింగు ఇచ్చేసింది. ఇప్పుడు ఈమె ప్రెగ్నెంట్ అని తెలియగానే ఆ అబ్బాయి తన దారి తను చూసుకున్నాడట. ఎవరి మాటలయినా ఇట్టే నమ్మేసి అందరికీ లొంగిపోతుంది సుసన్. ఐర్లాండ్‌లో ఫామిలీ ప్లానింగు లేదు. రోమన్ కేత్‌లిక్ దేశం గురించి ఆ మాట ఎవరూ ఎత్తకూడదు. అందుకని సుసన్ లాంటి అమ్మాయిలు రహస్యంగా ఇంగ్లండు వెళ్ళి అబార్షన్ చేయించుకుని వస్తుంటారు. చాలామంది అమ్మాయిలు ఇంగ్లండు నుండి పిల్స్ తెప్పించుకొని వాడతారు, ప్రెగ్నెంట్ కాకుండా.

ఎల్లిన్ వచ్చి 'ఒకపాట పాడు, లతా' అంది. అప్పటికే అందరూ తలొక పాటా పాడేశారు. నిజానికి లతకు పాటలు రావు. 'నీఫైర్‌కు టర్ఫ్ (పిడకలు) అయిపోయిందా' అని అడిగింది లత ఎల్లిన్‌ను. 'ఎందుకలా అడుగుతున్నావు?' ఆశ్చర్యంగా ప్రశ్నించింది ఎల్లిన్.

'ఆఁ ఏం లేదు. నేను పాట పాడితే గాడిదలు టర్ఫ్ బండితో సహా వచ్చి మీ ఇంటి ముందుంటాయి' అనేసరికి అందరూ ఫక్కున నవ్వారు. నవ్వడం ఆపుచేసి అంది ఎల్లిన్. 'నేను సీరియస్‌గా అడుగుతున్నాను. ఒక పాట పాడు, ప్లీజ్'. 'నేను సీరియస్‌గా చెబుతున్నాను. నాకు ఇంగ్లీషు, ఐరిష్ పాటలు రావు. మా భాషలో పాడానంటే మీరందరూ నేను మిమ్మల్ని తిడుతున్నానని అపోహపడతారు.' భయం నటిస్తూ లత అంటూంటే, అందరూ లత వైపు నవ్వుతూ చూస్తున్నారు. బెర్నాడేట్ వచ్చి లత ప్రక్కన కూర్చుంది అలసటగా. 'చాలా అలసిపోయావు, బెర్నీ. నేను కొంచెం హెల్ప్ చెయ్యనా, అని అడిగింది లత. 'థాంక్స్' వద్దు. పనంతా అయిపోయింది. అంది. అందరూ డ్రింక్సు చాలా తాగేస్తున్నారు. ఇంతలో జెర్రీ అనే అబ్బాయి వచ్చి లతకు ఎదురుగా కూర్చున్నాడు - 'మీ దేశం గురించి కొన్ని సందేహాలు ఉన్నాయి. నాకు, చెప్పగలరా? అంటూ ఏమిటన్నట్లు చూసింది లత. 'మీ దేశంలో పెళ్ళిళ్ళు ఎలా చేసుకుంటారు' అని అడిగాడు. అంతా వివరించి చెప్పింది లత. 'ఒకరి కొకరు తెలియకుండా, ముందు పరిచయం లేకుండా ఎలా పెళ్ళి చేసుకుంటారబ్బా' అంటూ ఆశ్చర్యపోయాడు. సమాధానంగా శారా అందుకుంది. లతా, రావు కూడా అలాగే తల్లిదండ్రుల ఇష్టప్రకారం పెళ్ళి చేసుకున్నారట. వాళ్ళను చూస్తుంటే ఎంతో ముచ్చటేస్తుంది. మన దేశంలో ఎంత ఒకరి నొకరు అర్థం చేసుకొని పెళ్ళి చేసుకున్నా చివరి వరకూ కలసి ఉండేది తక్కువకదా' అంది. నిజమే నన్నట్లు చూశాడు జెర్రీ. నిజానికి మిగిలిన దేశాలతో పోలిస్తే ఐర్లండులో డైవర్సులు తక్కువ. పెళ్ళయిన స్త్రీ చాల వరకూ తన భర్తతోనే ఉంటుంది. ఒకసారి పెళ్ళయిందంటే ఇంక బాయ్ ఫ్రెండ్సుని దూరంగా ఉంచుతుంది. కొందరు పెళ్ళికాని అమ్మాయిలకు పిల్లలు పుడితే రహస్యంగా దత్తత ఇచ్చేస్తారు. పిల్లలు పుట్టిన అమ్మాయి అనేసరికి బాయ్ ఫ్రెండ్సు కొంచెం స్నేహం చెయ్యడానికి వెనుకంజ వేస్తారని వాళ్ళ భయం. కొన్ని కొన్ని విషయాల్లో ఎంత విచ్చలవిడిగా తిరిగినా, వాళ్ళ భయాలు వాళ్ళ కుంటాయి. ఈ విషయంలో భారత స్త్రీలతో పోల్చవచ్చు వాళ్ళను.

'మీ దేశం చాలా పేదదట కదూ. మీరు రాకముందు ఈ ఊరిలో మరొక ఇండియన్స్ ఉండేవారు. వాళ్ళు చెప్పారు. వాళ్ళకు మీ దేశం అంటేనే ఇష్టం ఉండదట. ఫారిన్ కంట్రీస్ అంటేనే ఇష్టమట' అని జెర్రీ అడుగుతుంటే మనస్సు చివుక్కుమంది లతకు. తన దేశం గురించి ఎదుటి వారి దగ్గర తక్కువగా చెప్పుకున్న వారెవరో తెలియదుగాని, అటువంటి వాళ్ళున్నారంటే ఎంతో బాధ కలిగింది లతకు. 'చూడు జెర్రీ, మా దేశం మీరందరూ అనుకున్నంత పేదదేమీకాదు. ఎటొచ్చీ జనాభా ఎక్కువ గురించి కష్టం. ఐర్లండు చాలా చిన్నదేశం. మా దేశంలో ఒక రాష్ట్రమంత ఉంటుంది. మీ దేశ జనాభాలో మూడు వంతులు విదేశాలలో ఉన్నారు. ఒక వంతు మాత్రం మీ దేశంలో ఉన్నారు, విదేశాలలో ఉన్న ఐరిష్ ప్రజలందరూ వెనక్కు తిరిగి వస్తే మీది మాత్రం పేదదేశం అయిపోదు. ఇప్పుడు మాత్రం ఇచ్చట టింకర్సు (అడుక్కుచేవారు) లేరా?' అని లత అడుగుతూంటే 'నాకేం తెలుసు. మీ ఇండియన్స్ చెప్పారు.' అని అన్నాడు జెర్రీ నాది తప్పుకాదు సుమా అన్నట్లు. దానికి తోడు టి.వి.లో ఎప్పుడూ 'ఇండియాలోని ఒక గ్రామం అంటూ బట్టలులేని వాళ్ళను, అడుక్కునే వాళ్ళను, ఆరుబయట అన్నం తినేవాళ్ళను చూపిస్తుంటే, ఇండియా అంటే అదే కాబోలు అనే అభిప్రాయం ఏర్పరచుకున్నారు వాళ్ళు. వాళ్ళ అభిప్రాయాన్ని తొలగించాలని ఇండియా గురించి, దేశ పరిస్థితులు అన్నీ వివరించి చెప్పింది లత వాళ్ళకు.

మెల్ల మెల్లగా అందరూ విపరీతంగా తాగేస్తున్నారు. కొన్ని జంటలు ఒక మూలకు పోయి ముద్దులు పెట్టుకుంటున్నారు. కొందరు ఒకరి ఒళ్ళో ఒకరు కూర్చుని సరసాలాడు కుంటున్నారు. ఎల్లిన్ బోయ్ ఫ్రెండయితే అదే బెడ్‌రూమ్ అనుకొని తాగిన మైకంలో ఎల్లిన్‌ను మీదకు లాక్కుంటున్నాడు. ఇంచుమించుగా ఇద్దరూ శృతిమించి పోతూంటే అసహనంగా ఉంది లతకు ఆ వాతావరణం. ఇంతలో రావు రావడంతో అందరికి గుడ్‌నైట్ చెప్పి భర్తతో బయటకు వెళ్ళి తేలిగ్గా గాలి పీల్చుకుంది.

ఇంటికి వచ్చింది కాని, పెళ్ళి కాకుండా విచ్చలవిడిగా తిరిగే ఆ పెళ్ళికాని జంటలు గురించే ఆలోచిస్తుంది. వారిని తలచుకుంటేనే అసహనంగా ఉంది. అప్రసన్నంగా ఉన్న భార్య ముఖం చూచి 'ఏం? పార్టీ బాగాలేదా' అని అడిగాడు భాస్కరరావు. 'పార్టీ బాగానే ఉంది. కాని వాళ్ళ పద్ధతి చూడండి ఎలా ఉందో? నాకు అచ్చట ఉండాలనిపించలేదు. అందరిలోనూ ఆ ముద్దులూ అవీ చూస్తుంటే నాకు చిరాకు అనిపించింది' అంది లత. తిరిగి తనే అంది 'ఇప్పుడు వారు అలా ప్రవర్తిస్తున్నారా? చూడండి, చివరికి. అందులో ఎన్ని జంటలు వివాహం వరకూ వెళతాయో? మరి కొన్ని రోజులకు మరో బాయ్ ఫ్రెండుని వెతుక్కుంటారు' లత విసుగ్గా ముఖం పెట్టి అంది.

'పిచ్చిలతా! నీవు అలా ఆలోచిస్తే ఎలా చెప్పు? అది వారి దేశ పద్ధతి. దానికి వారేం చేస్తారు. తల్లిదండ్రులు ఒక వయసు వచ్చే సరికి వాళ్ళను వదిలేస్తారు. మరి

వారి భర్తలను వాళ్ళే వెతుక్కుని పెళ్ళి చేసుకోవాలి. ఇటువంటి సమయంలో ఎందరో ఆడవాళ్ళు మోసపోతూ ఉంటారు, పాపం. పదమూడు సంవత్సరాలకే తల్లులు కాబోతున్న బాలికలున్నారు. పెళ్ళికాని తల్లులు ఎంతో మంది ఉన్నారు. తమ బిడ్డకు తండ్రి ఎవరో తెలియని ఆడవాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళకు కూడ మన లాగే చక్కగా కాపురం చేసుకోవాలని ఉంటుంది. కాని ఎంతో మంది ఆకర్షణకు లోబడి, ఎటూ నిర్ణయించుకోలేక కొందరు, మగవారి పలాయనంతో కొందరు, బలవంతంగా అనుభవింపబడి కొందరు, ఇలా ఎన్నో రకాల ఆడవాళ్ళ ఉన్నారు ఈ సంఘంలో. కొందరి జీవితాలను కదిలిస్తే కన్నీరు తప్ప ఏమీ ఉండదు. ఒక్కొక్కసారి వారి జీవితాలు చూస్తే ఎంతో జాలి వేస్తుంది. నీవేమో వారి మీద చిరాకు పడతావు' అన్నాడు భాస్కర్. భర్త అలా చెపుతుంటే 'అందరి రాతలు రాసేది ఆ దేవుడు. ఆడదాని రాతరాసేది మగవాడు' అన్న పాట గుర్తుకి వచ్చింది లతకు. ఏ దేశంలోనైనా మగవారి ద్వారా మోసపోయిన ఆడవారిని తలచుకొని.

(ప్రభ, 12-04-78)

☆ ☆ ☆

# రాజకీయం

నన్ను నాలుగు రోజుల్లో విడుదల చేస్తారు. నా మంచి ప్రవర్తనకు ఈ వార్త ఒక మచ్చు తునక. నాకు పసిడి కానుక.

ఈ విషయం విన్న నాటి నుండి నా మనసు నిలవడం లేదు. ఎప్పుడెప్పుడు నా రత్తిని, నా కూతురు లక్ష్మిని చూస్తానా అని ఆరాటంగా వుంది.

ఇంతకాలం రాళ్లలాగ కనిపించిన ఈ జైలు గోడలు ఇప్పుడు పూలలాగ అనిపిస్తున్నాయి. ఖైదీలు అందరూ ఆత్మీయులుగా ఉద్యోగస్థులు అందరూ అభిమానుల్లా అగుపిస్తున్నారు.

నెలరోజుల నుండి రత్తి, లక్ష్మి రావడం లేదు. నేను వారి గురించి బాధపడుతున్న తరుణంలో మంచి శుభవార్తను అందజేసారు జైలు అధికారులు నాకు.

అయిదు సంవత్సరాల క్రితం ఒక మామూలు కూలీని నేను. పిరికివాణ్ణి. ఎవరు ఏది చెబితే అది చెయ్యడం, నాకు న్యాయమనిపించిందే చెయ్యడం బాగా అలవాటు నాకు.

రాను రాను నాలో మార్పెలా వచ్చిందో నాకే తెలియదు. గొర్రెల మందలో కలిసిపోయాను. మందు కొట్టడం మొదలుపెట్టాను. బర్రెను కొట్టినట్లు యజమాని కొట్టినా, నా తప్పు లేకపోయినా తట్టుకున్నాను.

మా ఊరిలో పేరు పడిన రాజకీయ పార్టీలు రెండు. ఒకదాని పేరు 'వందేమాతరం', మరో దానిపేరు 'జాతీయజెండా'. మొదటి దాని నాయకుడు నాయుడుగారు, రెండవదాని నాయకుడు మూర్తిగారు.

నేను చిన్నప్పటి నుండి మూర్తిగారి దగ్గర పనిచెయ్యడంతో, ఆయనంటే అభిమానం నాకు. దానితో జాతీయ జెండా పార్టీ అంటే కూడ అభిమానం పెరిగింది. ఎలక్షన్లు వస్తుంటే గొడ్డులా పనిచేయడం, దుడ్డుకర్ర పట్టుకుని యజమానికి కాపలా కాయడం, ఇదే నా డ్యూటీ.

వందేమాతరం పార్టీవాళ్లు మా వాములు తగలబెడితే, మేము వాళ్ల గుడిసెలు తగలబెట్టాం. నష్టపరిహారం గవర్నమెంటు కాస్త, మా యజమానులు మరికాస్త ఇచ్చారనుకోండి. 'మేము రోడ్డున పడ్డా, మా యజమాని మీద చిన్న బెడ్డ కూడ పడకూడదు' అది మా సిద్ధాంతం. రాద్ధాంతాలెన్ని చేసినా, రాళ్ళు ఎన్ని రువ్వుకున్నా, మా యజమాని పువ్వులా నలగకుండా వుండాల్సిందే.



మమ్మల్ని ఆయన పోషిస్తున్నందుకు, ఆయన ఉప్పు మేము తింటున్నందుకు, రుణం తీర్చుకోవాలి కదా! క్రితం సారి ఎలక్షన్ల టైములో మా పార్టీయే గెలిచింది. ఆ కొట్లాటలో నా తలకు గాయం అయింది. మూర్తిగారే దానిని బాగు చేయించారు.

లారీల్లో మనుషులు రావడం, మీటింగులకు అటెండు కావడం, దానికి మాకు కష్టపడకుండానే కూలి ముట్టడం అలవాటైంది. కూలి పనిలోనుండి మెల్లగా మా యజమానికి బాడీగార్డులా చేరి, ఆ ఇంట జాలీగా తిరిగాను. మా యజమాని ఇంటిలోని జాబిలి. ఆయనకు ఆపద రాబోతుంటే నా ప్రాణాలను మబ్బులుగా చేర్చి ఆయన్ని కప్పేస్తాను. అదీ నా తత్వం. ఈ విషయంలో నాకు నా తోబుట్టువు అడ్డు వచ్చినాసరే అతనిపై పెంచుకుంటాను శత్రుత్వం.

ఈసారి ఎలక్షన్లు వచ్చినప్పుడు నాయుడుగారు, మూర్తిగారు కత్తులు కత్తులు నూరుకున్నారు. చిత్తుగా ఆ పార్టీవాళ్ళు, ఈ పార్టీవాళ్ళు తన్నుకున్నారు. బాంబులు వేసుకున్నారు. దాడులు చేసుకున్నారు.

నాయుడుగారికి, మూర్తిగారికీ మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనేంత వైరం పెరిగింది. మైకుల్లో ఒకరినొకరు తిట్టుకోవడం, ఈసడించుకోవడం అగ్గి మీద గుగ్గిలం కావడం జరిగాయి. ఆయన్ని ఈయన, ఈయన్ని ఆయన చంపించివేయాలనే ప్రయత్నాలు జరిగాయి. ఆ ప్రయత్నంలో నేను మూర్తిగారిని కంటికి రెప్పలా కాపాడాను. ఎండకు నీడనయ్యాను, వానకు గొడుగునయ్యాను, చలికి రగ్గునయ్యాను.

మూర్తిగారు ఎవరిని కొట్టి రమ్మంటే వాళ్ళను కొట్టాను. ఏది తగులబెట్టమంటే అది తగుల బెట్టాను. నిప్పుల్లో దూకి చావమన్నా, నీళ్ళు తాగి ప్రాణాలు విడవమన్నా

నేను సిద్ధమే. ఆయన ఉప్పు తిన్నందుకు తప్పొప్పులు గురించి ఆలోచించను. మూర్తిగారు చెప్పింది వేదం. ఆచరించడమే నాకు ఆమోదం.

ఎలక్షన్లలో చాలా రక్తపాతం జరిగింది. ఎందరో గాయపడి నిరాశ్రయులయ్యారు. ఎవరు ఏమైనా మా యజమానులు ముందు బావుండాలి. వాళ్ళు బావుంటేనే కదా మేము బావుండేది. లేదంటే మా పని అంతే.

మా గూడెంలో కూడా అందరం రెండు పార్టీలుగా విడిపోయాం. ఒకరంటే ఒకరికి పడదు. మా గూడెం ఒక యుద్ధ భూమిలా తయారయింది.

మూర్తిగారు నాయుడుగారిని కొట్టి రమ్మని కొందర్ని పురమాయించారు. అందులో మొదటి వాడిని నేను. ముందుకు ఉరికాను. నా రక్తం పొంగింది. అణువు అణువు రగిలింది.

నాయుడుగారి మీద జరిగిన దాడిలో ఆయనకు గాయాలు తగల్లేదు గానీ, ఆయన బాడీగార్డుకు తగిలాయి. నేను అరెస్టయ్యాను. రెండు సంవత్సరాలు జైలుశిక్ష వేసారు. అది పూర్తయింది.

నేను విడుదల అయి బయటకు వచ్చాను. ఇంతకాలం మూర్తిగారు నా భార్యను, పిల్లను చూస్తున్నందుకు నా చర్మంతో ఆయనకు చెప్పులు కుట్టించడానికి సిద్ధమే.

నేను ఊరిలోకి వస్తుంటే అందరూ నన్ను పురుగుని చూసినట్లు చూస్తున్నారు. ఇంటి దగ్గర రత్తి, లక్ష్మి లేరు. వారం క్రితమే వాళ్ళిద్దరినీ నాయుడుగారి పార్టీవాళ్ళు అనుభవించి, అవమానించి ఊళ్ళో నుండి తరిమేసారట. నా రక్తం సలసల కాగిపోయింది. మూర్తిగారికి చెబుదామని ఆ ఇంటివైపు దారి తీసాను.

దూరంగా కోలాహలం, రణగొన ధ్వని వినబడుతున్నాయి. బహుశా రెండు పార్టీల వాళ్ళ గొడవలు ఇంకా తీరక కొట్టుకొని, బాంబులు వేసికుంటున్నారు కాబోలు అనుకున్నాను. నాయుడుగారి పార్టీవాళ్ళందర్నీ పొడిచేయాలన్నంత ఆవేశం వచ్చింది.

నేను అనుకున్నట్లు అది కొట్లాట కాదు, పెళ్ళి. మూర్తిగారి అమ్మాయి పెళ్ళి. ఆ హడావిడి అంతా బాంబులు కాదు, దీపావళి మందుగుండు సామగ్రి. మూర్తిగారి అమ్మాయి పెళ్ళనగానే నాకు ఆనందం కలిగింది. కాని ఆ ఆనందం ఒక్కసారే ఎగిరిపోయింది. కారణం పెళ్ళికొడుకు నాయుడుగారి అబ్బాయి.

మా గూడెంలో కయ్యం, యజమానుల్లో వియ్యం.

(ఆంధ్రభూమి వీక్లీ, 31-08-95)

☆ ☆ ☆

# తప్పెవరిది?

నేను ఇటీవలి కాలంలో ఊరిలో లేకపోవడం వలన ఈ మధ్య సంగతులేమీ తెలియదు.

ఊరినుండి రాగానే ముందుగా తెలిసిన విషయం నిర్మల భర్తతో విడిపోయింది అన్న సంగతి విని చాలా బాధ కలిగింది.

ఒక స్త్రీ భర్తతో విడిపోయింది అంటే ఆమె ఎంతగా మనసులో క్షోభ అనుభవించి ఉంటుంది. శోభలేని సంసారంలో ఎందుకు ఇమడలేక పోయిందో ఒక ఆడదానిగా నేనూ అర్థం చేసుకోగలను.

నిర్మల బజారులో కనబడింది. నిర్మలతోపాటు నిర్మల స్నేహితురాలు సరోజ కూడా ఉంది. ఇద్దరూ సంతోషంగా నవ్వుతూ షాపింగ్ చేస్తున్నారు. నిర్మలలో అసలు బాధా వీచికలు కనబడలేదు నాకు. నిర్మలంగానే ఉంది. నన్ను చూడగానే వికసించిన కుసుమంలా నవ్వింది.

నాకు నిర్మల ఎంత ప్రాణస్నేహితురాలో, నిర్మలకు సరోజ కూడా అలాగే. సరోజకు నాకు మాత్రం పెద్దగా పరిచయం లేదు.

సరోజ మూడేళ్ల కూతురు పుట్టిన రోజు షాపింగ్ చేస్తున్నారు ఇద్దరూ.

పుట్టిన రోజున నన్నూ రమ్మని ఆహ్వానించారు ఇద్దరూ.

సరోజ తరపున పెద్దలా మరీ మరీ చెప్పింది నిర్మల. బజారులో పిలుస్తున్నందుకు ఏమీ అనుకోవద్దంది సరోజ.

సరేనని అప్పుడే ఆ పాపకు చిన్న గిఫ్ట్ కూడా కొనేశాను వెళ్ళాలనే ఉద్దేశంతో. మరలా బజారుకి వెళ్ళడానికి బద్ధకం వేస్తుందనే భయంతో.

పుట్టినరోజు పార్టీ చాలాచక్కగా జరిగింది. సరోజ భర్త అనుకోకుండా అర్జంటుగా కేంప్‌కి వెళ్లవలసి రావడంతో పుట్టినరోజు పార్టీకి లేరట. ఆ లోటు తప్పించి అక్కడ మరేలోటు జరగలేదు.

ఇంటికి వెళుతూ వెళుతూ అనుకోకుండా గోడవైపు చూశాను.

అక్కడ సరోజ, వాళ్ల పాప, సరోజ భర్త కలిసి తీయించుకున్న ఫోటో ఉంది.

అది చూడగానే అవాక్కయ్యాను. నోటమాట రాలేదు. ఎందుకంటే సరోజ భర్త మరెవరో కాదు. నిర్మల భర్తే.



మొన్నటినుండి నిర్మలను భర్తతో ఎందుకు విడిపోయిందో అడుగుదామనుకుంటూనే ఊరుకున్నాను.

ఎందుకంటే ఆమె మనసుని బాధ పెట్టినట్లవుతుందని. ఇప్పుడు అడక్కుండా ఉండలేకపోయాను.

అప్పుడు తీరిగ్గా చెప్పింది. నిర్మల తను ఎందుకు విడిపోయిందో! 'మరి నీకు సరోజ అంటే కోపం లేదా' ఇంత సంతోషంగా ఆమెతో ఎలా తిరగగలుగుతున్నావు' అని అడక్కుండా ఉండలేకపోయాను.

భారత స్త్రీ సవతిని తప్ప మరి ఎంతటి బాధనైనా భరించగలదు. భర్త ప్రేమను మరొకరితో పంచుకోడానికి కలలో కూడా ఇష్టపడదు.

అటువంటిది నిర్మల తన భర్తతో సరోజకు పెళ్ళి చేయడమేకాక సరోజతో ఎప్పటిలాగే ప్రాణానికి ప్రాణంగా మసులుతుంది. తన దీపం ఆరిపోతున్నా ఆ వెలుగులో మరో దీపాన్ని వెలిగించింది.

నేను అడిగిన దానికి చక్కటి సమాధానం చెప్పింది నిర్మల.

"అసలు సరోజ ఏం తప్పు చేసింది?

తప్పు చేసింది మురళి!

నా స్నేహితురాలు నాకోసం ఇంటికి వచ్చింది. ఆ సమయంలో నేను ఆపరేషన్ థియేటర్‌లో ఉన్నానని మరో రెండు గంటల వరకూ ఇంటికి రానని తెలుసు.

ఆమెకు కూల్‌డ్రింక్‌లో మత్తుమందు కలిపి అనుభవించి, ఆమెని పెళ్ళికాని తల్లిని చేశాడు.

సరోజ అంతా నాతో చెప్పి నన్ను అబార్షన్ చేయమంది.

మామధ్య అడ్డులేకుండా దూరంగా వెళ్ళిపోతానంది.

కానీ నేను ఒప్పుకోలేదు. పుట్టబోయేది ఆడపిల్ల అని తెలుసు. అయినా అబార్షన్ చేయకుండా కోర్టుకెళ్ళకుండా నలుగురి పెద్దలముందు మేమిద్దరం విడిపోయి సరోజనిచ్చి పెళ్ళి చేశాను.

తప్పు మురళి చేస్తే సరోజను ఎందుకు వెలివేయాలి?

ఆమె అలా జరగాలని కోరుకోలేదే?

అలా జరగకపోతే ఆమె తన బావతో హాయిగా ఉండేది పెళ్లి చేసుకొని!

మురళివల్ల ఆమె బ్రతుకు నాశనం అయింది.

పుట్టబోయే పిల్లకు తండ్రి 'ఫలానా' అని చెప్పుకోలేక చెత్తకుప్పల మీద పారేసి, జీవితాంతం ఏడ్చే స్థితి పట్టకుండా కేవలం ఆ పాపకు తండ్రి ఫలానా అని చెప్పడం కోసం ఈ పెళ్ళి చేశాను.

నా పిల్లలకు ఎలాగూ మురళే తండ్రి. భర్తతో సంబంధం ఉన్న మరో ఆడదాన్ని అసహ్యించుకొని ఇటు స్వజాతికి శత్రువులం అవుతున్నాం.

అలా అని మగజాతికి దేవతలలాగ మిగలడం లేదు.

అటూయిటూ మనమే నష్టపోయి మనకు మనమే శత్రువులం అయిపోయి రెండు ఆడ జీవితాలను నరకం చేసుకొంటున్నాము.

అలా అని ఇలాంటి పెళ్లి ప్రోత్సహించడం నా మతం కాదు.

నేను మురళితో ఎలాగూ కాపురం చేయలేను. సరోజ అయినా చేయనివ్వు.

ఆమె నాకు ద్రోహం చేస్తే శత్రువు. నా కుటుంబం వల్ల నష్టపోయింది కాబట్టి ఇప్పుడు ఇంకా ప్రాణం నాకు అంది.

నేను నిట్టూర్పు విడిచి ఊరుకున్నాను.

(ఆంధ్రభూమి డైలీ)

☆ ☆ ☆

# ఇదండీ నా వాదన

నేను ఒక డాక్టర్ని.

గవర్నమెంటు డాక్టర్ని.

'వద్దువద్దు బాబోయ్, సర్కారు దనాఖానకు' అని పాడే పాటను నిజం చేస్తూ, పాడెకు రోజులో ఎక్కువ బేరాలు కుదురుస్తూ, అవినీతికి మారుపేరుగా, డబ్బే ప్రధానం అన్న తీరుగా డాక్టర్లుంటారని ప్రజల అభిప్రాయం.

డాక్టరంటే ముఖ్యంగా ప్రభుత్వ అస్పత్రిలోని డాక్టరంటే, భగవంతుని మరో అవతారమనో, అల్లావుద్దీన్ అద్భుతదీపంతో ప్రాణాలు పోసేస్తాడనో, తెల్లకోటు బాబా అయిపోయి, విభూతితో కాళ్ళు లేని మనిషిని కూడా నడిపించేస్తాడనో, అబ్రకదబ్ర అంటూ శవాన్ని కూడా బ్రతికించేస్తాడనో ఆశతో కొందరు అమాయక ప్రజలు మా దగ్గరకు వస్తుంటారు. పస్తులున్నవారు కూడా డాక్టరుకి శిస్తు కట్టాలనే నమ్మకంతో వుంటారు.

కాని నిజానికి అవన్నీ అపోహలే. డాక్టరు కూడా అతి మామూలు మనిషి.

రోగం ఉన్న మనిషికి సరయిన సమయంలో సరయిన ట్రీట్‌మెంట్ ఇచ్చి రోగాన్ని తరుముతాడు అన్నది తిరుగులేని సత్యం.

కాని యమ ధర్మరాజు దగ్గర అప్పటికే బుక్ అయిపోయి, జబ్బు ముదిరిపోయిన కేసును వాళ్ళు ఏమీ చేయలేరన్నది కూడా ఇంకా తిరుగులేని సత్యం.

నేను సర్వీసులో కొన్నివేల ఆపరేషన్లు చేసాను. నాతో ఆపరేషన్ చేయించుకొని, బ్రతికి బట్టకట్టి భూమిమీద నూకలు చెల్లకుండా అనారోగ్యాన్ని తరిమికొట్టి ఇంటికి సంతోషంగా వెళ్ళే పేషెంట్లు అంటే నాకు చాలా ఇష్టం. ఒక్కో పేషెంటు, నేను ఎక్కుతున్న ఉన్నత శిఖరాలకు ఒక్కో మెట్టులాంటివారు. అంతేకాదు నా తల్లిదండ్రులు సరైన సమయంలో ట్రీట్‌మెంట్ అందక కన్నుమూసారు. దానితో నేను బ్రతికే ప్రతీ పేషెంటులోనూ నా తల్లిదండ్రులను చూసుకొంటాను అని చెబుతూ వుంటాను. నేను చనిపోయిన మా అమ్మా నాన్నల పేరుమీద హాస్పిటల్ నుంచి డిశ్చార్జి అయిన పేషెంట్లకు బట్టలు కొని ఇస్తాను. ఇది చాలా సంవత్సరాలుగా జరుగుతూనే వుంది. మరి బట్టలు వారికి కొనడం నా బలహీనత. దానిని జయించలేను. అంతమందికి బట్టలు కొనాలంటే జమీందారులైనా బికారులు కావలసిందే. అందుకే అడ్డదారిన ప్రయాణం మొదలుపెట్టాను. పేషెంట్ల దగ్గర డబ్బు తీసుకొని నా తల్లిదండ్రుల ఆత్మశాంతికి వాళ్ళకు బట్టలు

క్కొంటాను. నేను పేషెంట్ల దగ్గర డబ్బులు తీసుకొంటున్నానని కంప్లయింట్స్ వెళ్ళాయి నా మీద. మరి తప్పు చేసినప్పుడు సంజాయిషీ ఇచ్చుకోవడమో, శిక్ష అనుభవించడమో తప్పదు కదా! ఇదేమీ ఆషామాషీ కాదు కదా!

మరి నా వాదన, పేషంట్ల వేదన వినండి. నన్ను అర్థం చేసుకోండి. అర్థం నాకు ముఖ్యం కాదండి. ప్రజ్ఞ కావాలండి. అతినీతి మనదేశంలో అన్నిచోట్లా వుంది. కోట్లాది ప్రజలు అవినీతిని ఊపిరిగా చేసుకొని బ్రతుకుతున్నారు. గవర్నమెంటు హాస్పిటల్లో డబ్బుకి ప్రాధాన్యత ఇచ్చి, డబ్బివ్వని రోగికి ఊపిరి తీస్తున్నారని, స్మశానానికి తోస్తున్నారని అందరూ అంటారు. కాని ఇది ఏ ఆరుశాతమోగాని, నూరు శాతం నిజం కాదు. ఏ పనయినా నెగ్లెక్ట్ చేయవచ్చుగాని, జబ్బుని ముదరబెట్టకూడదు అన్నది డాక్టర్లకు బాగా తెలుసు. కాని చాలా సంగతులు పేషెంట్లకే తెలియవు. అమాయకులు కొందరు నాటుమందులు వాడో, తెలిసీ తెలియని వైద్యం చేయించుకునో, చివరి దశలో హాస్పటల్‌కు వస్తారు. వస్తాదులలాంటివారు కూడా రోగాలు ఎక్కువ చేసుకొని పీనుగులాగ వస్తారు. హాస్పిటల్‌కు బెడ్‌లేకో, బ్లడ్ లేకో, ఆక్సిజన్‌లేకో మరే కారణంతోనైనా ఆపరేషన్ వాయిదా పడితే డాక్టర్లకు డబ్బు ఇవ్వలేదనే ఆపరేషన్ చేయడం లేదు అని భావించుకుంటారు నేను ఆపరేషన్‌లో సక్సెస్ అయ్యాను గాని, వారిలో నుండి ఆ భావనను తొలగించడంలో సక్సెస్ కాలేకపోయాను. వాళ్లలో ఆ అభిప్రాయం బాగా నాటుకుపోయింది. దానితో మెంటల్‌గా అప్‌సెట్ అయి, డాక్టర్లకు డబ్బు ఇవ్వజూపుతారు. డబ్బు తీసికొనకపోతే డాక్టరుకి తమమీద ఇంటరెస్ట్ లేదని భావించుకుంటారు. అలా భావించుకొని హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయి వెళ్ళిపోయి, ప్రైవేటు హాస్పటల్‌లో తలలు తాకట్టుపెట్టి, వేలకువేలు బిల్లులు కట్టి ట్రీట్‌మెంట్ చేయించుకునేవారిని నేను ఎంతోమందిని చూసాను. డబ్బున్నవాళ్ళయితే ఫరవాలేదు. తిండిలేక ఎండిన వారుకూడా అలా చేస్తుంటే నాకు బాధ కలుగుతుంది. ప్రభుత్వ ఆసుపత్రి ఉండికూడా వాళ్ళు ఎందుకు ప్రైవేటు హాస్పిటల్‌కు వెళ్ళాలి.

డాక్టరుకు కావలసింది రోగులను చూడటంలో నేర్పే కాదు. ఓర్పుకూడా. అది వారి జబ్బు తగ్గించడంలో మంచి తీర్పు ఇస్తుంది. డాక్టరు చిరునవ్వుతో మాట్లాడితే సగం జబ్బు తగ్గిపోయినట్లే భావిస్తాడు పేషెంటు. డాక్టరు పేషెంటు దగ్గర డబ్బు తీసుకుంటే పూర్తిగా నయమైపోయినట్లు తలుస్తాడు. ముందు పేషెంట్‌కు కావలసింది మందు కాదు నమ్మకం. ఆపై ధైర్యం. నేను డబ్బు తీసుకొనకపోవడం వలన ఎంతోమంది రోగులను జారవిడుచుకుంటున్నాను. నాకేమీ వైద్యం రాదనే అపవాదు పొందాను మొదట్లో. అలా జారవిడిచినా, నా జీతం నాకు వచ్చేస్తుంది ఫరవాలేదు. కాని నేను చదివిన చదువుకి, చేస్తున్న ఉద్యోగానికి న్యాయం చేయాలిగా. డబ్బు లేని పేషెంట్లు

ప్రైవేటు హాస్పటల్‌లో బిల్లులు కట్టలేక ప్రాణాలు పోయినా బావుండును అనే స్థితికి రాకుండా, వాళ్ళ తృప్తి కోసం వాళ్ళ దగ్గర వందో, రెండు వందలో తీసుకుంటాను. కాని ఆ డబ్బు నాకు తేలును గుప్పిట్లో పెట్టుకున్నట్లు ఉంటుంది. అందుకే వాళ్ళు ఎంత ఇస్తే అంత ఖరీదుతోనే నా తల్లిదండ్రుల పేరున వాళ్ళకు బట్టలు కొని నేను తృప్తిపడుతూ వుంటాను. పేషెంట్లను జారవిడుచుకోవడం నాకు ఇష్టం ఉండదు. అసలు బాగయితే పేషెంటు ఎంతో సంతోషిస్తాడుగాని, చేసిన డాక్టర్ ఆ పేషెంట్‌ని చూసి ఇంకా సంతోషిస్తాడు. నిజానికి నాకు తల్లిదండ్రులు లేనేలేరు. నేనొక అనాథను. పేషెంట్ నాడి చేతిమీద కాదు. సెంటిమెంట్ మీద ఉంటుంది. అందుకే నేను వారి దగ్గర డబ్బు తీసుకొని వారికే ఖర్చు పెడతాను. ఇదండీ నా వాదన.

(ఆంధ్రభూమి మంత్లీ)

☆ ☆ ☆

# లెక్క

"బావగారూ! ఏడు ఒకట్ల ఏడు కదా! అది అందరికీ తెలిసిందే. కాని ఏడును తొమ్మిది చేయడం ఎలాగో చెప్పండి చూద్దాం. అప్పుడే సుమా, మీకు సంక్రాంతి బహుమతి లభించేది" అంటూ అల్లరి మొదలు పెట్టింది మరదలు.

నిజం చెప్పొద్దూ, నీరజ అడిగిన దానికి నా లెక్కల బుర్రను ఎంత ఉపయోగించినా ప్రయోజనం లేకపోయింది. రకరకాలుగా ఆలోచించాను. ఏవేవో వరుసలు ఏడు ఒకట్ల ఏడును తొమ్మిది చేయాలని చూశాను. కాని కుదరడం లేదు.

నీరజ 'సంక్రాంతి బహుమతి' అంది. సంక్రాంతికి కానుకలు ఎందుకో నాకు అర్థం కాలేదు. రోజా లాంటి సరోజను కట్నం లేకుండానే పెళ్ళి చేసుకున్నాను. వాళ్ళ స్థితిగతులు నాకు ముందే తెలుసు. ఆ అక్కసుతో అమ్మ వాళ్ళ దగ్గర నుంచి, లాంఛనాల పేరున చాలా లాగి, పెళ్ళి ఘనంగా చేయించి పరోక్షంగా అసలు, వడ్డీ కూడా గుంజింది. ఆ విషయం నాకు చాలా బాధ కలిగించింది.

పండక్కి వచ్చి మా అత్త, మామల చేత ఖర్చు పెట్టించడం ఇష్టం లేదు. వాళ్ళు బాధపడతారని వచ్చాను. వాళ్ళతో ఏ ఖర్చూ పెట్టించవద్దని సరోజతో ముందే చెప్పాను.

పెళ్ళయిన తరువాత ఇదే మా అత్తింటికి రావడం నేను. ఆ ఇల్లు చిన్నదైనా అందరిలోనూ ఎప్పుడూ ఆనందం కనబడుతుంది. చిర్రు బిర్రులు లేవు. ఒకరి మీద ఒకరు జోక్స్ వేసుకుంటూ, చిరిగిన బట్టలను కూడా "ఇవి కొన్నప్పుడు కొత్తవే కదా" అని వేసుకుంటూ బాధపడని మనస్తత్వాలు వారివి. భోజనాలకు అందరూ సమయానికి వచ్చేయాలి. అది నియమం. దాంతో ఊరు మీద బలాదూరు తిరిగే అవకాశం మా బావమరుదులకు లేదు. తినడానికి పెద్దగా వంటకాలు లేకపోయినా, విందు భోజనం ఆరగిస్తున్నంత సంతోషంగా తింటారు.

బూరెలు తినడానికి నేను తటపటాయిస్తుంటే - "లోపల పూర్ణం ఉంది, బావగారూ, బాంబు ఏదీ లేదు" అంది నీరజ.

అందరూ నవ్వేశారు.

మా ఇంట్లో అయితే అన్నంలో విషం ఉన్నట్లే మొహాలు పెట్టి తింటాం మేము. ఇక్కడిలా వేడి వేడి పదార్థాలుండవు. ఎప్పుడో పొద్దున్న వంటావిడ వండి టేబుల్ మీద పెట్టేస్తే ఎవరికి వీలున్నప్పుడు వాళ్ళు తింటాం. రసంలో నీరసం కలుపుకుని మరీ తాగుతాం మేము.

కావలసినంత ఆస్తి ఉంది మాకు. కాని అందులో ఆనందం లేదు. అందర

తలో గదిలో ఉంటాం. ఎవరికి వారే యమునా తీరే. మా అమ్మ మహిళా సంఘానికి అధ్యక్షురాలు. చాలా బిజీ. మే మందరమూ బద్ధకస్థులమే! ఏనాడూ అందరం కలసి ఎక్కడికీ వెళ్ళం. ఎవరి స్నేహాలు వారివి. అవి ఎలాంటివి అన్న పట్టింపు ఎవరికీ ఉండదు. కుటుంబం అంతా కలసి సంతోషంగా ఇలా గడపవచ్చు అని నాకు మా అత్తవారింటిలోనే తెలిసింది.

తెల్లారి లేచి రోజూ ముగ్గులు వేసే నీరజకు మా చెల్లిలా ఒళ్ళు పెంచుకుని ఎక్సర్‌సైజులు చేయవలసిన అవసరమే లేదు. నోరు కట్టుకోవలసిన అవసరం అంతకన్నా లేదు.

సినిమాకు సరదాగా అందరం నడిచి వెళ్ళాం.

"బావగారూ! మా ఊళ్లో రోడ్లు వేసిన తరువాత రోలరు వాడరండీ! మా లాంటి వాళ్లందరం నడిచి దాన్ని నునుపు చూస్తాం. అందుకే మా శరీరాలు ఆరోగ్యంగా, నున్నగా ఉంటాయి" అంది నీరజ.

నీరజ నోటికి తాళం వేయాలని మా అత్తగారు ప్రయత్నించినా లాభం లేకపోయింది.

ఇంటికి వచ్చిన తరువాత చూసిన సినిమా మీద జోక్స్ వేసుకుని నవ్వుతూ భోం చేస్తుంటే నాకు చెప్పలేని ఆనందం కలిగింది.

"పాపం, ఆ హీరోయిన్ ఎంత పేదదో కదా అయినా రెండు వేల ఖరీదు మించిన చీర కట్టుకుంది" అని ఒకరంటే, "పిచ్చాసుపత్రి నుంచి హీరో హీరోయిన్స్ తప్పించుకుని వచ్చేశారేమో! అందుకే ఆ పిచ్చిగంతులు" అని మరొకరు. ఇలా రకరకాల జోక్స్ వేశారు.

సినిమాను సీరియస్‌గా తీసుకోకుండా దాన్ని వీళ్లు ఎంత చక్కగా ఆనందం క్రింద వినియోగించుకుంటున్నారు! సినిమాలు మనో వికాసానికి పనికి రాకపోయినా, మానసోల్లాసానికి పనికివచ్చా యనిపించింది. నీరజ మాటల్లో ప్రత్యేకత ఏమిటంటే హిందీ, ఇంగ్లీషు, తెలుగు కలిపి 'మమ్మీజీ, పితాశ్రీ, అక్కాజీ" అంటూ మాట్లాడుతుంది.

ఆ మర్నాడు సంక్రాంతినాడు నీరజ - "బావగారూ! మీరు టూ ఇన్ వన్ అడిగారట కదా! మీ అమ్మగారు రాశారు. ఇదిగో చూడండి - బావుందో, లేదో చెప్పండి" అంటూ ఒక బరువైన పేకెట్ పెట్టింది.

మా అమ్మ తెలివిగా ముందే ఉత్తరం రాసిందని అప్పటివరకూ నాకు తెలియదు. నేను ఈ పెట్టె విప్పలేదు. ఎందుకంటే తీసుకోవడం నాకు అయిష్టం. విప్పే వరకూ నీరజ ఒప్పుకోలేదు. తీరా విప్పిన తరువాత చూస్తే అందులో పెద్ద రాయి తప్ప ఏమీ లేదు. సరదాగా నవ్వేశాను.

ఖరీదైన టూ ఇన్ వన్ లేకపోవడమే మంచి దనిపించింది.

"మీరు నేను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేదు కదూ! అందుకే ఈ బహుమతి!" అంది నీరజ నవ్వుతూ.

ఆ తర్వాత మా అత్తగారు మా మరదలిని కోప్పడుతూ నిజమైన టూ ఇన్ వన్ తెచ్చారు.

నా మనసు చివుక్కు మంది. వాళ్ళు అది కొనడానికి అప్పు దొరకక షాపు వాడి దగ్గరే అప్పు పెట్టి తెచ్చారని నేను గ్రహించాను. మాకు కొన్న బట్టలూ ఖరీదైనవే!

ఈ సంక్రాంతి నా జీవితంలో ఎంతో సరదాగా గడిచింది.

రైలెక్కుతుంటే నీరజ నా చేతిలో ఏదో చీటీ పెట్టింది. కూర్చున్న తరువాత విప్పి చూశాను.

"బావాజీ! ఏడు ఒకట్ల ఏడును తొమ్మిది చేయడం ఎలాగో చెప్పలేకపోయారు. ఓడిపోయారండీ! పూర్తిగా ఓడిపోయారు. నిజానికి నాకూ తెలియదులెండి జవాబు. అడ్డదారిలో అయితే ఏడు అంకెను తొమ్మిదిగా దిద్దవచ్చు. ఆ అడ్డదారులు మన కెందుకు లెండి! సరైన దారి ఒకటుంది. ఏడును తొమ్మిది చేయాలంటే 'ఏడు(పు)ని నౌ(నవ్వు) చేయవచ్చు - హిందీ అక్షరంతో. తెలుగు, హిందీ భాయీ భాయీ కదండీ! హాయి హాయిగా నౌ చేసేసుకుందాం ఏమంటారు? ఇదే నాకు తెలిసిన లెక్క. ఈ జీవితం చాలా చిన్నది. దాన్ని సాధ్యమైనంతవరకూ ఆనందంగా గడవడానికే ప్రయత్నించాలి" అని ఉంది అందులో.

ఇంటికి వచ్చి సూట్ కేస్ తెరిచిన సరోజ - "ఇదేమిటండీ, టూ ఇన్ వన్ పెట్లో పెట్టా నని నీరజ సరదాగా ఇచ్చిన రాయిని పెట్టారు. మరిచిపోయారా?" అంది.

"కావాలనే పెట్టాను. మరచిపోయి కాదు. ఆ టూ ఇన్ వన్ షాపులో ఇచ్చేయమని మీ నాన్నగారికి రాయి" అన్నాను.

సరోజ మొహం చూసి , 'సంక్రాంతి తరువాత శివరాత్రి కదా, దీపావళి ఎలా వచ్చిందా' అని ఆశ్చర్యపోయాను. మరి ఆమె కళ్లలో కాంతులే అవి నా జీవితానికి వెలుగునిస్తాయి.

"బహుమతేదీ?" అని మా అమ్మ అడిగితే "బస్సులో బరువెక్కువై బస్సు కదలకపోతే అది తీసి వారికి తిరిగి ఇచ్చేశాను. అప్పుడే బస్సు కదిలింది" అని చెప్పాను.

(ప్రభ)

☆ ☆ ☆

# కానుక

దీపూ! మామయ్య తెచ్చిన సంబంధం వాళ్ళు కబురు పెట్టారు. నీవు వాళ్ళకు నచ్చావట. నీ ఉద్దేశ్యం కూడా చెబితే ఏ విషయమూ వాళ్ళకు కబురు పెడతాను" అంది అన్నపూర్ణ.

"నీ యిష్టం అమ్మా! నీకు ఏది మంచిదని తోస్తే అది చెయ్యి. నీవు ఏం చేసినా నాకు అంగీకారమే. ఏ సంబంధమైనా పరవాలేదు. ఆ రాబోయేవాడు నీ బాధ్యతలు కూడా స్వీకరించే వాడయి వుండాలి. అది ముఖ్యం నాకు" అంది దీపిక.

"అదేమిటే, షరతులూ అవీ మగపిల్లాడి తరపువాళ్ళు పెట్టవలసింది పోయి, నీవు పెడుతున్నావేమిటి?" ఆశ్చర్యంగా అంది అన్నపూర్ణ కూతురువైపు అపురూపంగా చూస్తూ.

"అమ్మా! నాకున్నది నీవు ఒక్కతివే, నాన్నగారు అకస్మాత్తుగా చనిపోతే కళ్ళల్లో వత్తులు వేసుకుని పెంచి నన్ను డాక్టర్ని చేసావు. నీకు నా యింట ఆనందంగా ఉండాలి. అదే నాకు కావలసింది. ఆ వచ్చేవాడు నిన్ను పోషించనక్కరలేదు. నేను నిన్ను పోషిస్తుంటే అడ్డు తగలకుండా ఉంటే చాలు" అంది.

కూతురి ప్రేమకు ఆమె హృదయం మంచులా కరిగిపోయింది. పిచ్చితల్లికి నేనంటే ఎంత ప్రేమో. నేనెంత అదృష్టవంతురాలిని అనుకుంది.

ముత్యాల తలంబ్రాలు, రతనాల ఆభరణాలు, ఆకాశమంత పందిరి, నేలంత అరుగు లేకపోయినా, ఏ విఘ్నాలు లేకుండా చక్కగా జరిగిపోయింది కిరణ్, రత్నదీపికల పెళ్ళి. కిరణ్ ఇంజనీరు. దీపికను గవర్నమెంటు ఉద్యోగంలో చేరనీయలేదు. ఆ ఊరిలోనే దీపికవాళ్ళు ఉంటున్న ఇంటిలోనే 'రత్నదీపికా నర్సింగ్‌హోమ్' ప్రారంభించింది దీపిక. మొదటిసారి నర్సింగ్‌హోమ్‌లో ప్రవేశిస్తుంటే ఒళ్ళంతా చెప్పలేని పులకింత కలిగింది దీపికకు. తండ్రి గుర్తుకు వచ్చి నిశ్శబ్దంగా కన్నీళ్ళు బుగ్గలమీదకు జారాయి. తల్లి చూస్తే బాధపడుతుందని, మరింత నిశ్శబ్దంగా వాటిని తుడిచేసుకుంది.

"అమ్మా! కాఫీ" అప్పుడే హాస్పిటల్ నుంచి అలసి వచ్చిన దీపిక తల్లిని పిలిచింది. ఏదో పనిలోనున్న అన్నపూర్ణ గబగబ కూతురికి కాఫీ తెచ్చింది. అదే చేత్తో వియ్యపురాలు విమలకు కూడా రెండోసారి యిచ్చింది కాఫీ.

"వేడి వేడి కాఫీ కడుపులో పడితే హాయిగా ఉంది" దీపిక అంది.

"నీకు వేడివేడిగా యిచ్చిందా, మీ అమ్మ. నాకు చూడు చూరులో నీళ్ళు యిచ్చినట్టు మోహాన కొట్టింది" విసురుగా అంది విమల.

దీపిక బిత్తరపోయి చూసింది. ఈ మధ్య యిటువంటివి అలవాటయిపోయాయి. తన గురించి తల్లి కష్టపడుతుంటే బాణం దెబ్బ తగిలిన పక్షిలా గిలగిలలాడింది, దీపిక మనసు.

అత్తగారు తన తల్లిని ఏదో విధంగా ఏదో మాట అంటుంటే మొదట్లో ఆవిడ తీరే అంత అన్నట్లుండే దీపికకు, రానురాను అవి భరించడం కష్టమైపోతోంది.

"అమ్మా! వంటామె ఉందిగా నీవెందుకు అన్ని పనుల్లో కల్పించుకుంటావు. అత్తయ్యగారికి నీవు చేసిన కాఫీ నచ్చదుగా" అంది.

"తినేవాళ్ళు ఎక్కువ. సంపాదన తక్కువ. కిరణ్‌ని ఏ చిన్న ఖర్చుకి డబ్బులడిగినా విసుక్కుంటున్నాడు. అయినా అడ్డాలనాడు బిడ్డలుగాని, గడ్డాలనాడు బిడ్డలేనా. వంటమనిషికి ఖర్చు ఎందుకని నేను మాన్పించేసాను" అంది విమల.

మాట్లాడలేకపోయింది దీపిక. ఆమె హృదయం మాత్రం అత్తగారు చేతితో నలిపి పడేసిన కోమల కుసుమంలా అయింది.

ఇంట్లో తానొక్కతే ఆడపిల్ల కావడంతో, యింక ఏ విధమైన తోడూ లేకపోవడంతో, పుస్తక జ్ఞానం తప్పించి లోకజ్ఞానం లేకుండా బ్రతికింది రత్నదీపిక. అందుకే అత్తగార్ని అర్థం చేసుకోలేకపోయింది.

తల్లి వంట భారాన్ని నెత్తిన వేసుకోవడంతో, చాలా బాధపడినా, ఏదోలే తనకు కాలక్షేపం, 'ఖాళీగా ఉన్నవారి బుర్ర, దెయ్యాలుండే చెట్టు తొర్రలాంటిది' అనుకుని సమర్ధించేసుకుంది. అంతకంటే మరోమార్గం లేక.

'అబ్బాయి తల్లికి. అమ్మాయి తల్లికి యింత తేడా ఎందుకో. అబ్బాయిని కడుపులోనూ, అమ్మాయిని కాళ్ళలోనూ మోస్తారా?

దీపిక ఆసుపత్రి నుండి యింటికి వచ్చేసరికి అన్నపూర్ణ పనిమనిషి మీద అరుస్తోంది. ఎప్పుడూ ఎవరినీ పల్లెత్తుమాట అనని తల్లి అలా అరుస్తుంటే దీపికకు ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటమ్మా గొడవ?" అడిగింది.

"పనిమనిషి నీ డ్రెస్సింగ్ టేబుల్ మీద ఉండే చిన్న వెండిగిన్నె ఎత్తుకు పోయింది" అంది అన్నపూర్ణ.

"పోనీ లేమ్మా! నీవు ఏ వస్తువు పోయినా అంత బాధపడవు కదా! మరేమిటమ్మా కొత్తగా మాట్లాడుతున్నావు! పైగా పోట్లాడుతున్నావు?" అంది.

"అది కాదు దీపూ. అది చిన్నప్పుడు మీ నాన్నగారు నీ అన్నప్రాశనకు కొన్నది.

దానిని చూస్తే మీ నాన్నగారిని చూసినట్లు ఉంటుంది. నీవేమో దానిలో రబ్బరుబేండులో, సేఫ్టీ పిన్నులు వేసుకొని టేబుల్ మీద పెట్టుకున్నావ్ కదా!"

తల్లి మాటలకు జవాబు చెప్పలేకపోయింది దీపిక. తండ్రి వస్తువులు ఏదిపోయినా తల్లి తట్టుకోలేదు.

ఆ మర్నాటి నుండి పనిమనిషి పని మానేసింది. దీపిక ఒకరిద్దరిని చూసింది గాని, ఎవరూ కుదరలేదు. అత్తగారు కుదరనివ్వడం లేదని బిజీగా ఉన్న దీపిక గ్రహించలేదు. వంటపనితోపాటు అంట్ల పనీ అన్నపూర్ణను ఆశ్రయించాయి శాశ్వతంగా.

జీవితంలో కష్టాలు, సుఖాలు తప్పవుకదా! నా కూతురు హాయిగా ఉంటే చాలు. ఎంతటి శ్రమనైనా భరించగలను అనుకుంది అన్నపూర్ణ. 'రాజీ' జీవిత పయనానికి చక్కని తోడు అని ఆమె ఉద్దేశ్యం.

పండక్కి కిరణ్ తల్లికి, అత్తగారికి ఒకే ఖరీదయిన చీరలు తెచ్చాడు. విమలమ్మ తాడెత్తున లేచింది కొడుకు మీద. విధవరాలికీ నాకూ పోలికా. ఆవిడకంత ఖరీదయినది ఎందుకు, ఇంటిమీద పడి తినేది చాలదా అంటూ నానామాటలు అంది.

అవి దీపిక, అన్నపూర్ణల చెవులలో పడనే పడ్డాయి. సమ్మెట పోటులా తగలనూ తగిలాయి. ఆ మాటలకు కిరణ్ ఏమీ అనలేకపోవడం దీపికకు చాలా ఆశ్చర్యం కలిగించింది. 'మనిషి'కి డబ్బుపై ఆశ పెరిగినప్పుడు అతనిలో కఠినత్వం కూడా పెరుగుతుందేమో అనుకుంది దీపిక. తల్లిని వెనకేసుకు వస్తుంటే, భర్త, అత్తగారూ కూడా తననే నిందిస్తున్నారు.

"అమ్మ పక్కన ఉంటే మొగుణ్ణి, అత్తగారిని లెక్కచేయవలసిన పనేముంది" అని విమల కోడలిని దెప్పి పొడుస్తుంది.

భగవంతుడు కొందరి చావులను ఏక్సిడెంట్స్‌లోను, కొందరికి హాస్పిటల్‌లోనూ మరికొందరికి ఆత్మహత్యల రూపంలోనూ, మరీ ఎక్కువ పాపం పూర్వజన్మలో చేసిన వారికి మెంటల్ టార్చర్‌తో బ్రతుకుతూ చావమని, అత్తల చేతులలో పెడతాడు కాబోలు అనుకుంది మౌనంగా, దీపిక.

జీవితం అనే మాల ఎప్పుడైనా వాడిపోవచ్చు. అందుకే సాధ్యమైనంత వరకూ మంచి పూలతో మాల కట్టాలని ప్రయత్నిస్తున్నా ఆ మంచి పువ్వులు దొరకడం సాధ్యం కావడం లేదు దీపికకు.

"అమ్మా పండక్కి నీకు చీర కొంటాను. నీ పెన్షన్ డబ్బులు ఇవ్వు" అంది దీపిక.

"లేవు దీపూ. యింట్లో ఖర్చులకు వాడేస్తున్నాను" అంది అన్నపూర్ణ.

"అదేమిటమ్మా! ఇంట్లో ఖర్చులకు నేను మా అత్తగారికి చాలా డబ్బు యిస్తున్నాను. హాస్పిటల్‌లో నా ప్రాక్టీసు చాలా పెరిగింది. అదంతా కిరణ్‌కే యిచ్చేస్తున్నాను. పొలం అమ్మేసి కిరణ్‌కు కారు కొనిచ్చావు. ఇలా అయితే ఎలాగమ్మా!"

"అదేమిటే అలా అంటావు. మనయింటి ఖర్చులకు నీ, నా అన్న తేడా ఏమిటి? అయినా ఈ డబ్బు నేను ఏం చేసుకుంటాను. నీ కోసమే కదా! వాళ్ళు అసలు పెళ్ళికి ముందు కట్నం అడగలేదు. అలా అని మనం ఏమీ పెట్టకుండా ఉంటే ఎలాగ అని కదా, కారు కొనిచ్చింది".

"వాళ్ళు తెలివి తక్కువవాళ్ళు కాదమ్మా! ఒక్కర్తే కూతురు, ఉన్నదంతా వాళ్ళు యింకెవరికి యిస్తారు, అని తెలివిగా అడగలేదు".

"పోనీలే ఏదో ఒకటి. నీకు ప్రతీది ఆలోచించకు. మనశ్శాంతిగా ఉండు, యింట్లో. అసలే హాస్పిటల్‌లో ఎక్కువ అలసిపోతున్నావు. నీ కళ్ళక్రింద నల్లమచ్చలు వచ్చేస్తున్నాయి చూడు" ఆప్యాయంగా కూతురిని మందలించింది.

అమ్మా, నాకు కళ్ళక్రింద వస్తున్నాయి గాని, నీకు జీవితంలోనే వస్తున్నాయి అనుకుంది మనసులో ఆవేదనగా దీపిక. తల్లిని ఎంత సుఖపెట్టాలనుకుందో, అంతకంతకూ బాధపెట్టడం తప్పడం లేదు.

అన్నపూర్ణకు ఒంట్లో బావుండలేకపోతే యింట్లో, ఎవరూ పట్టించుకోవడం లేదు. మోకాళ్ళ నొప్పులతో పనంతా అలాగే చేస్తుంది. ఈ విషయం దీపిక గమనిస్తూనే వుంది. అదే యింట్లో ఏ మరదలకో, ఆడబడుచుకో, అత్తమామలకో ఏ చిన్న అనారోగ్యం కలిగినా ఎంత హడావిడి చేస్తారో ఆమెకు తెలుసు.

లాభం లేదని తల్లిని తన నర్సింగ్‌హోమ్‌లోనే అడ్మిట్ చేసింది. తల్లి యింటి గడపదాటిందో లేదో, వంట మనిషి పని మనిషి కూడా గడపలోకి వచ్చేసారు.

అన్నపూర్ణకు చాలా జ్వరంగా వుంది. నాలుగు రోజులు హాస్పిటల్‌లోనే ఉంచాలిన ఉంచేసింది. బట్టలు తీసికెళదామని తల్లిపెట్టి తెరిచింది దీపిక. అందులో ఆనాడు పోయిన వెండిగిన్నె భద్రంగా వుంది. అది ఎందుకు సూట్‌కేస్‌లో ఉందో, యిప్పుడిప్పుడే జీవితానుభవం గడిస్తున్న దీపికకు అర్థం అయింది.

దొంగతనం పనిమనిషి మీద మోపి ఇంక ఆ యింటికి ఏ పనిమనిషి రాకుండా ప్లాన్ చేసి, ఆ పని తన నెత్తిన వేసుకుని, అప్పనంగా తింటున్నావు అనే వియ్యపురాలి మాటలకు తాళం వేయాలనుకుంది. కాని అమాయకపు అన్నపూర్ణ పనిభారం మోయగలిగింది కాని, నిందల భారాన్ని తప్పించుకోలేకపోయింది.

ఎవరైనా జరిగిపోయిన తన జీవితం గురించి వ్రాసుకోగలరు గాని, రాబోయే,




గడవబోయే రోజుల గురించి, తమ తలవ్రాత, తాము వ్రాసుకోలేరు కదా! తల్లి బ్రతుకు ఏమయిపోతుందోనని తల్లడిల్లిపోయింది దీపిక.

"ఇంక నా జ్వరం తగ్గిందిగా, యింటికి వెళ్ళిపోదాం దీపూ, పాపం మీ అత్తగారు ఒక్కర్తే పనితో సతమతమయిపోతున్నారేమో" అంది.

"మా అత్తగారు ఏమీ నలిగిపోవడం లేదు లేదమ్మా! అమ్మా! ఈ జ్వరం యికపై నీకు జీవితాంతం ఉంటుంది" అంది.

"అంటే?" విచిత్రంగా చూసింది అన్నపూర్ణ.

"అవునమ్మా! నాకు నమ్మకమైన మనిషి హాస్పిటల్ చూసుకోవడానికి కావాలి. ఆ పని నీవే ఎందుకు చేయకూడదు. నీవు యిక్కడే ఒక రూమ్‌లో ఉండిపోకూడదూ?"

"నేనా? నేను చేయగలనా?"

"తప్పకుండా చేయ గలవు. నీ పేరున ఆస్తి ఏమీ ఉంచుకోకపోబట్టే కదా వాళ్ళకు చులకన అయ్యావు. అందుకే యిక్కడే వుండు".

"మీ అత్తింటి వాళ్ళు ఏమయినా అనుకుని, అనవసరంగా నిన్ను బాధిస్తారు దీపూ!"

"ఇంతకాలం నన్ను బాధించలేదా? అమ్మా! మనిషి గతానికి వారసుడే కాదు, భవిష్యత్తుకు సంరక్షుడు కావాలంటారు పెద్దలు. మా నాన్నగారు నాకు యిచ్చిన ఈ యిల్లు, నిజానికి నీది. అందుకే, యిది నీ పేరున తిరిగి రిజిష్టరు చేయించాను. ఇకపై యిది, 'అన్నపూర్ణా నర్సింగ్ హోమ్'. అమ్మా! ఇది నీదేనమ్మా. నీ నర్సింగ్ హోమ్‌లో నేను ఒక ఉద్యోగస్తురాలిని మాత్రమే. ఇప్పుడు నీవూ ఆస్తిపరురాలవే. నిన్ను ఎవరూ ఏమీ అనరు. పెద్దలు తెలివి తక్కువగా ఆస్తి పిల్లల పేరున పెట్టేసి వాళ్ళు వీధిన పడనక్కరలేదు. నన్ను యింతదాన్ని చేసినందుకు యిదేనమ్మా నీకు నేనిచ్చే కానుక" అంటూ యింటి పట్టాలు అందించింది.

ఇప్పుడు దీపిక ఆనందానికి పట్టపగ్గాలు లేవు.

(ఆంధ్రభూమి వీక్లీ, 13-07-95)

☆ ☆ ☆

# ప్రేమంటే...

అతన్ని చూసింది మొదలు నాలో ఏదో అలజడి మనసులో ప్రేమ రాపిడి ఇది వరకు ఎప్పుడూ లేదు నాలోయిలా. చంద్ర చూపుల్లో అయస్కాంతం నన్ను పట్టిలాగేస్తుంది.

ఎందుకు నన్ను అలా పట్టిపట్టి చూస్తాడు. నా హృదయాన్ని తట్టి తట్టి ప్రేమ నిద్ర నుండి లేపుతాడు. లాభం లేదు మనసుకి కళ్ళెం వేయాలి.

తలపుల తలుపుకి గొళ్ళెం పెట్టాలి. లేదంటే ప్రేమ బల్లెం నన్ను ముక్కలు ముక్కలు చేసేస్తుంది. ఆ తరువాత విచారించీ లాభం లేదు.

కాలేజీ ఫంక్షనులో చంద్రని నేను అందరినీ చూసినట్లే చూసాను. కాని అతను నన్ను ప్రత్యేకంగా చూస్తున్నాడనిపించింది. స్కూటర్ మానేసి నేను ఎక్కిన సిటీ బస్‌లోనే ఎక్కేవాడు. నాతో మాట్లాడాలని తహతహలాడేవాడు.

మొదట్లో రోమియో అనుకున్నాను. ఆ తరువాత మజ్ను అనుకున్నాను. నేను కనబడనప్పుడు గెడ్డం పెంచితే దేవదాసు అనుకున్నాను. అప్పట్లో అతనిని అంతగా పట్టించుకోని నేను ఇప్పట్లో వింతగా ఎక్కువగా చంద్ర గురించే ఆలోచిస్తున్నాను. మేమిద్దరం మొదట మాట్లాడుకున్నప్పుడు చంద్ర నన్ను ఎంతగా ఆరాధిస్తున్నదీ మనసు విప్పి చెప్పాడు. ఆశ్చర్యంగా చూసాను. నాకు తెలియకుండానే నేను చంద్ర హృదయంలో ఎలా నిండిపోయాను? అదే నా ప్రేమంటే!

ప్రేమికుల్ని చూసి పిచ్చివాళ్ళని హేళన చేసే నేను నా మనసునే దివాళాతీయించి చంద్ర ముందు ఎందుకు పరిచాను. చంద్ర పార్కుకు రమ్మంటే భయం వేసింది కాని వెళ్ళాను. ఇలాంటి తెగింపు ఒక్కసారి వస్తే పదే పదే అదే దారి చూపుతుందేమో, మొదటి సారి సంకోచించిన నేను ఆ తరువాత పెద్దగా తడబడలేదు.

చంద్ర వాళ్ళింట్లో కాలేజీలో క్లాసులు ఉన్నాయని అబద్ధాలు చెప్పి వస్తున్నాడట చూసావా? కావ్యా, ప్రేమ మైకం ఎంత ఘాటుగా ఉంటుందో ఎప్పుడూ అబద్ధాలు ఆడని నేను, నీ కోసం అబద్ధాలు ఆడుతున్నాను. అదీ నీ తప్పేసుమా! నీవు అంత అందంగా ఉండడం అది నాకు నేరం అయింది. నీ ప్రేమను చూరగొన్న నేను అదృష్టవంతుడిని అంటూ నా ఒళ్ళో తలపెట్టుకొని పడుకున్నాడు పార్కులో.

మా యింట్లో నేను ఫ్రెండ్ యింటికి అని చెబుతున్నాను. ఫ్రెండ్ అన్న పదం ఆడో మగో తెలియకుండా ఉన్నందుకు ఆంగ్ల భాషకు థాంక్స్ చెప్పుకున్నాను. ప్రేమంటే



పరవశం. తనను తక్కువగా చేసికొని ఎదుటి వారిని ఆరాధించడం, ప్రకృతి అందంగా కనిపించడం, మనిషి అందంగా కనిపించాలని తాపత్రయ పడడం నిమిషాలు వేగంగా పయనించడం కలలతో శయనించడం. నేనూ చంద్ర కలసి సినిమాలను షికార్లకు తెగ వెళుతున్నాం.

ఆఖరికి యింటిలో తెలిసిపోయింది. చంద్రని తప్పించి నేను ఎవరినీ పెళ్ళి చేసికోనని చెప్పేసాను. కాని మా యింట్లో ఎవరూ ఆటంక పరచలేదు, కాని చంద్ర యింట్లో వద్దన్నారు. కాని చంద్ర నన్ను విడవనన్నాడు. మేము రిజిష్టరు మారేజి చేసుకున్నాం. మా నాన్నగారు ఘనంగా రిసెప్షన్ ఇచ్చారు. ఆ తరువాత కొడుకుని వదులుకోలేక మమ్మల్ని అత్తింటికి ఆహ్వానించారు. అమ్మయ్య అనుకున్నాను నేను. ఓ అయిదు సంవత్సరాలు బాగానే గడిచాయి. ఒక బాబు కూడా పుట్టాడు. ఆ తరువాత నేను చంద్రకు బోర్ కొట్టాను. ఇంటికి ఆలస్యంగా రావడం మొదలు పెట్టాడు. పెళ్ళికి ముందు చంద్ర నా వెంటపడేవాడు. పెళ్ళి తరువాత నేను చంద్ర వెంటపడుతున్నాను.

భార్య భర్తలు ఆడే ఈ గేమ్‌లో ఎప్పుడూ ఒకరి వెనుక ఒకరు పడడమే కాబోలు. మగవాడికి పెళ్ళికి ముందున్న ఇంట్రరెస్టు ఆడదాని మీద పెళ్ళి తరువాత ఉండదెందుకో! రాను రాను చంద్రలో చాలా మార్పులు వచ్చాయి. నేనంటే ప్రేమంటాడు ప్రాణం అంటాడు. అదంతా మాటల్లోనే. చేతల్లో కాదు. నన్ను తప్పించుకొని తిరుగుతున్నాడు. చంద్రను యింటి దగ్గర ఎలా కట్టిపడేయ్యాలో నాకు అర్థం కావడం లేదు. పెళ్ళికి ముందున్న ప్రేమ, ఆరాటం, తపన ఏమయిపోయాయో నాకు అర్థం కావడం లేదు.

అంటీ ముట్టనట్టున్న చంద్ర ప్రవర్తన చూస్తుంటే నాకు ఒళ్ళు మండిపోయింది. నేనంటే ఏమిటో పట్టని భర్తతో కలసి ఉండడానికి మనసు అంగీకరించడం లేదు. పిల్లలు మా యిద్దరికీ బంధాలుగా మిగిలిపోయారు. చంద్రది బయట సర్కిల్. నాది నాలుగు గోడల మధ్య బ్రతుకు. నేను జీవితంలో యిప్పుడు అన్నిటికీ అలవాటు

పడిపోయాను. చంద్ర ఎప్పుడైనా హుషారుగా వచ్చి బయటకు తీసికెళ్ళినా నిర్లిప్తంగా వెళుతున్నాను. నాకు నా జీవితానుభవం నేర్పింది ఒకటే. నిజమైన ప్రేమంటే జీవితాంతం భార్యభర్తలు ఒకరినొకరు నొప్పించుకోనిదే అని.

కాని అలాంటి జీవితాలు ఎక్కడ తారసపడతాయి?

ప్రేమంటే అవకాశం ఉన్నప్పుడు అది పుట్టడం, ఆ తరువాత అవకాశం కల్పించుకోవడం ఆ పిదప వదిలించుకోడానికి ప్రయత్నించడం. ఇది మగవాడి దృష్టిలో, స్త్రీ దృష్టిలో మాత్రం ప్రేమంటే తనను తాను నొప్పించుకున్నా, ఎదుటి వారిని మెప్పించడం ప్రేమకు చాలా అవతారాలున్నాయి. అదీ మగవాని దగ్గర ఒకలా, ఆడదాని దగ్గర మరొకలా పరిస్థితులు, మనసుగతులు ఎదురు తిరిగినప్పుడు ఇంకొకలా ద్రవపదార్థంలా రూపు మార్చుకుంటూనే ఉంటుంది.

(ఆంధ్రభూమి డైలీ, 10-7-94)

☆ ☆ ☆

# నేను పతితను కాను

"అనుసూయా! అనసూయా!"

"ఆ వస్తున్నాను. ఏమిటండి"

"ఏం చేస్తున్నావు. ఇంకా స్నానం చేయలేదా? అలా వున్నావేమిటి?'

"అదేమిటండి అలా చూస్తున్నారు. మీరు కూడా నన్ను అనుమానిస్తున్నారా? నేను పతితను కానండి. నేను పతివ్రతనే. అహ్హాహ్హా ప్రతివ్రతనే"

"అనూ అనూ ఏమిటది ఏమిటా మాటలు. నిన్ను నేను ఏమైనా అన్నానా? నిజమే నీవు పతితవుకాదు. సతీ అనసూయ, సుమతి, సావిత్రికంటే పతివ్రతవే. నిప్పుకంటే పవిత్రమైనదానివే. నేను చెబుతున్నానుగా. నీవు నమ్ము. ఏ భార్య ఏ భర్త కోసం చేయని త్యాగాన్ని నీవు చేశావు. నీ మీద నిందలు, అపనిందలు వేసుకున్నావు. నిందలు ఎవరైనా ఎదుటివారు వేయడం లోకసహజం. కాని నీమీద నీవే వేసుకున్నావు. పతి ప్రాణాలకోసం యముడితో దెబ్బలాడిన సావిత్రి నీ కాలిగోటికి సరిపోదు తెలుసా? తట్టలో భర్తను వేశ్యదగ్గరకు తీసుకెళ్ళిన పురాణంలో పతివ్రత నీ తలవెంట్రుకతో కూడా సమానం కాదు"

"నిజంగా నిజమేనా? నేను ఏ తప్పు చేయలేదు, కదూ!"

"నిజంగా నీవు ఏ తప్పు చేయలేదు"

"మరెందుకు లోకం అంతా నావైపు అలా చూస్తుంది. నేను పతితను అంటుందేం. దానికి తెలియదా నేను శీలవతిని అని."

"లోకం సంగతి నీవు పట్టించుకోకు. నీవు వాళ్లను, వాళ్ల మాటలను లెక్కచేయకు. ఎవరేమంటే నేం, నేను నిన్ను ఏమీ అననుగా. నా చర్మంతో చెప్పులు కుట్టించినా నీ ఋణం తీర్చుకోలేను. నా కన్నీళ్ళతో నీ కాళ్లు కడిగినా నీవు నాకు చేసిన సహాయానికి విలువ సరిరాదు. లోకంలోని పూలన్నింటితోనూ పూజించినా ఇంకా నీకు మరికొన్ని జన్మలకైనా ఋణపడి వుంటాను"

"ఆ ఏదో మీరు నన్ను నమ్మించడానికి కథలలోని డైలాగులు చెబుతున్నారు. నేను పతితనండి. పతితను. నన్ను అందరూ వేలెత్తి చూపుతున్నారు. బయటకు వెళితే కాలెత్తి కూడా తన్నుతారు. మీరు నన్ను నమ్మినా వారు నమ్మరండి. నమ్మరండి నమ్మరు. నిజమండి నమ్మరు. నా మాట నమ్మండి, లోకం నన్ను నమ్మదు. నమ్మదు. వెక్కి వెక్కి ఏడ్చింది అనసూయ. అంతలోనే పకపకానవ్వుతూ ఇల్లంతా పరుగెత్తింది. చంద్రకాంతరావుకి భార్య ప్రవర్తన చూసి మతి పోయింది.



వెంటనే అనుమానం వచ్చి హాస్పిటల్‌కు డాక్టర్‌కి ఫోన్ చేస్తే డాక్టరుగారు వచ్చారు. అనసూయను పరీక్షించి ఆవిడ మెంటల్‌గా డిప్రెస్ అయింది అన్నారు. అలా డిప్రెస్ కావడానికి కారణం, ఆ ఊరిలో చిన్నపిల్లల నడిగినా చెబుతారు. అందుకే డాక్టరుగారు ఎక్కువ ప్రశ్నలు వేయలేదు. అయినా తానే సంజాయిషీ చెప్తుతున్నట్లు చెప్పుకున్నాడు చంద్రాకాంతరావు.

"డాక్టర్ల దగ్గర వ్యాధి గురించి లాయర్ల దగ్గర కేసు గురించి అబద్ధాలు చెబితే నష్టపోయేది ఎవరికి వారే అవతలివారు కాదు. అందుకే మీకు నిజం చెబుతానండి. ఆ విషయం వింటే, మీకు ట్రీట్‌మెంట్ ఇవ్వడం సులభం అవుతుంది" అన్నాడు రావు.

"చెప్పండి" డాక్టర్‌గారు అన్నారు. ఆయన రావుతో మాట్లాడుతున్నా, కళ్ళు అనసూయను ఆమె ప్రవర్తనను పరిశీలిస్తున్నాయి.

"నా భార్య నిజానికి ఏ పాపమూ ఎరుగదండి. నేను చేసిన పాపాన్ని తనమీద వేసుకుంది. నన్ను రక్షించడానికి ఆమె తనకు తానే శిక్ష విధించుకుంది. ఏ ఆడదానికైనా అంతటి నరకం మరొకటి వుండదు. మేము నిజంగానే పేదవాళ్ళం. మా పెళ్ళయిన తరువాత నా భార్య ద్వారా కొంత ఆస్తి వచ్చింది. స్వతహాగా అనసూయ తెలివైంది. పొదుపు వంతురాలు. దానితో నా జీతాన్ని జాగ్రత్తగా వాడుతూ ఒక స్థలం కొన్నాము. ఆ స్థలంలో ఇల్లు కట్టుకోవాలని లోన్ పెట్టాను ఆఫీసులో. పునాదులు తవ్వుతుంటే మాకు..."

"చెప్పండి, ఆగిపోయారేం."

"మాకు మట్టిలో కొంత బంగారం దొరికింది. నిజానికి అది గవర్నమెంట్‌కి

హేండ్‌వర్ చేయాలి. కాని దురాశతో నేను ఆ పని చేయలేకపోయాను. ఎవరికి తెలుస్తుంది అనుకున్నాను. అది నా జీవితంలో తరువాత, తరువాత పాముపై కూర్చుంటుందని నాపై పగబడుతుందని అనుకోలేదు''

"అయితే ఆ నిధితోనే ఇల్లుకట్టారా?''

"అవును, ఆ బంగారంతోనే నేను లక్షాధికారిలా కనబడినా, నిజానికి కోటీశ్వరుడినయ్యాను. పిల్లి కళ్ళుమూసికొని పాలు తాగుతున్నట్లు చేశాను. ఒకరి జోలికి పోనుకదా అనుకున్నాను. నాకు ఒకరి జోలి అక్కరలేకపోయినా, నా ఆస్తి ఎలా వచ్చింది, అనే అవసరం గవర్నమెంటుకి కావాల్సివచ్చింది. అనుకోకుండా ఒకరోజు ఇన్‌కంటాక్స్ వాళ్ళు రైడ్ చేశారు. మొత్తం నా ఆస్తులు, బంగారం అంతా స్వాధీనం చేసుకున్నారు.

అదంతా ఉద్యోగంలో లంచాలు పుచ్చుకున్నానన్నారు. నేను ఆస్తిపోయినా భయపడ దలచుకోలేదు. కాని ఇంత బ్రతుకు బ్రతికి సొసైటీలో గౌరవంగా బ్రతుకుతూ సడెన్‌గా నేను శ్రీకృష్ణ జన్మ స్థానానికి వెళ్ళవలసివస్తే నా జీవితం కుక్క జీవితం కంటే హీనమైపోతుందని భయపడ్డాను. నా జీవితంలోకి అకస్మాత్తుగా అదృష్టం ఎలా ప్రవేశించిందో, అంత అకస్మాత్తుగా దురదృష్టం కూడా ప్రవేశించింది. రెండూ నా ప్రమేయం లేకుండానే వచ్చాయి.

"మరి మీ భార్య ఏమన్నారు''

"అదే చెబుతున్నాను. నా బాధ నా భార్య దగ్గర వెళ్లబోసుకుంటే ఆమె మరొకరి దగ్గర ఆమె బాధ చెప్పుకుంది. వారి సలహా ప్రకారమే నన్ను రక్షించడానికి ప్రయత్నించింది. అంత ఘోరమైన అబద్ధం ఆడడంవలనే ఆమెకు షాకు తగిలింది. ఆ తప్పంతా నాది. నేను చేసిన తప్పుకు ఆమె ఆహుతి అయింది'' వేదనగా అన్నాడు.

"అవును ఆమెకు షాక్ తగిలింది. ఆమె మామూలు మనిషి కావాలంటే, మందుకంటే కూడా మన సహకారం, నీవు తప్పుచేయలేదు అని ఆమెను నమ్మించడం కావాలి. దానికి మీరే ఎక్కువ సహకరించాలి.''

"తప్పకుండా సహకరిస్తాను. ఆమె మామూలు మనిషి కావాలి. ఆమె లేకపోతే నేను ఈ లోకంలోనున్నా ఒకటే పైకలోకంలో ఉన్నా ఒకటే'' రావుగారి గొంతు బొంగురుపోయింది.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుంటే అనసూయ పకపకా నవ్వుతూ పరుగున వచ్చింది. "డాక్టరుగారూ నమస్కారం, నమస్కారం. నమస్కారం. కారం కాదు. తీపి తీపి తీపి కోర్టులో నేను చెప్పిన మాటలు మీరు విన్నారా? అది నిజమని మీరు

నమ్ముతున్నారా? నిజం కాదండి అబద్ధం. అంతా పచ్చి అబద్ధం. ఆ ఆస్తంతా మావారి అక్రమ సంపాదన కాదని, నా అక్రమ సంపాదనని, నాకు చాలా మంది ప్రియులు వున్నారని, వారిద్వారా చాలా బంగారం సంపాదించానని నా భర్త అమాయకుడని కోర్టులో అబద్ధం చెప్పాను. లోకం అంతా నన్ను నిజంగానే చెడిపోయింది అంటుంది. నేను పవితతను కానండి. పవిత్రతనే" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

"మీరు చెప్పేది నేను నమ్ముతున్నాను. మీరు ఏ తప్పు చేయలేదు. ఈ సంగతి లోకానికి నేను చెబుతానుగా" అంటూ డాక్టరుగారు మాటలతోనే మొదటి మాత్ర వేశారు పేషెంట్‌కి.

(ఆంధ్రభూమి డైలీ, 10-07-94)

☆ ☆ ☆

# చిన్న ఆశ

ప్రమదకు చిన్నప్పటి నుండి మల్లెలు, జాజులు, గాజులు, పసుపుకుంకుమలు అంటే చాలా ఇష్టం. అందరి పిల్లలు మొహాలకు క్రీమ్‌లు పూసుకుంటుంటే తను నిండుగా పసుపు రాసుకునేది.

స్టిక్కర్ బదులు కుంకుమనే వాడేది. తలనిండా పూలు పెట్టుకునేది. జడ కత్తిరించడానికి, పొట్టి చేయడానికి ఒప్పుకునేది కాదు. చుడీదార్ వేసుకోకుండా నిండుగా చీరకట్టుకునేది.

ప్రమద ఆశకు తోడుగా భర్త శంకరం కూడా ప్రమదకు రోజూ పువ్వులు తేవడం చేస్తాడు. ప్రమదను చూసి ఓర్వనివాళ్ళు 'అమ్మవారిలా తయారవుతుంది' అంటారు. మెచ్చినవాళ్ళు లక్ష్మీ కళ వుట్టిపడుతుంది అంటారు.

ఎవరు ఎలా అనుకున్నా ప్రమదలో మార్పు రాలేదు. శంకరంతో ఆమె కాపురం చక్కగా సాగుతోంది. ప్రమద స్వంత ఇల్లు కట్టుకుంది. మంచి గార్డెన్ వేసుకుంది. మల్లెలు, విరజాజులు, గులాబీలు, చామంతులు అన్నీ వేసింది ఆ తోటలో.

ప్రమదకు ఇద్దరు పిల్లలు పుట్టారు. అయినా పెళ్ళయిన దానిలాగాని, పిల్లల తల్లిలాగాని కనపడదు. శంకరం ప్రమదకు అన్నిటికి చేదోడు వాదోడుగానే వుంటాడు.

సజావుగా సాగే సంసారం ఒక్కసారిగా తల్లక్రిందులయింది. శంకరానికి ఏక్సిడెంట్ అయింది. హాస్పటల్‌లో చేర్పించారు. వారం రోజులు హాస్పటల్‌లో వుండి చనిపోయాడు శంకరం. ప్రమద బ్రతుకంతా చీకటి అయిపోయింది. పిల్లలు చిన్నవాళ్ళు, ఆమె వయసులో వుంది.

శంకరం పోయిన తరువాత అన్ని కార్యక్రమాలు యధావిధిగా జరిగిపోయాయి. ప్రమద బొట్టు తీయలేదని అందరూ అన్నివిధాలుగా మాట్లాడుకున్నారు. ఆమె దుఃఖం కాస్త మరుగున పడగానే ఎప్పటిలాగే తల నిండుగా పూలు పెట్టుకుంది.

అందరూ నోటి మీద వేలు వేసుకున్నారు. 'ఎంత బరితెగించిందీ' అనుకున్నారు.

ప్రమద మంచి వయసులో వుంది. ఆమె కావాలనుకుంటే మరలా పెళ్ళి చేసుకునే వయసే. పూలు, బొట్టు కోసం మరలా పెళ్ళి చేసుకుంటే బావుణ్ణు అనుకుంది. కాని మరలా మనసు అంగీకరించలేదు. నేను పెళ్ళి కావాలనుకుంటుంది పసుపు కుంకుమల కొరకేగాని, శంకరాన్ని మరచిపోయిగాని, కోరికలు ఆపుకోలేకగాని కాదు కదా! అనుకుని

మళ్ళీ పెళ్ళి మీదకు ధ్యాస మళ్ళించలేదు. ఎప్పటిలాగే ముఖాన బొట్టు, తలలో పూలు పెట్టుకోసాగింది. ఎవరైనా ఆమెను ఎద్దేవా చేస్తుంటే 'మా ఆయన తను చనిపోయినా, నన్ను ఎప్పటిలాగే వుండమన్నారు. తలనిండా పూలు పెట్టుకోమన్నారు' అని అందరితో చెప్పింది. చనిపోయినవానిని ఎవరూ ఏమీ అడగలేరుగా -

భర్తకు మనసులోనే క్షమాపణ చెప్పుకొని, చిన్న అబద్ధంతో తన ఆశ తీర్చుకుంది ప్రమద.

(వనితాజ్యోతి)

☆ ☆ ☆

# ముందడుగు

ప్రియాతి ప్రియమైన రనిత,

ఎలా వున్నావు? ఏం చేస్తున్నావు? నేను ఇదివరకటి హాస్పిటల్‌నుంచి వచ్చేసి, ఇక్కడ లండన్‌లో చేస్తున్నాను. గ్రేట్ ఆర్మండ్ స్ట్రీట్‌లో సిక్ చిల్డ్రన్ హాస్పిటల్ ఉంది. అందులో నాకు రిజిస్ట్రార్ పోస్ట్ దొరికింది. అసలు పాత హాస్పిటల్ ఎందుకు వదిలేసానో తెలుసా? వారికి నా పని చాలా ఇష్టం. నన్ను వెళ్ళవద్దన్నారు. కాని పనికి ఆటంకంగా ఉందని "చీర కట్టవద్దు. ఫాంటు అయినా, ఫ్రాకు అయినా వేసుకోమన్నారు" నాకు ఏడ్రెస్ అయినా అభ్యంతరం లేదుగాని, వాళ్ళు అలా చెప్పేసరికి నాకు, చీర తప్పించి ఏ డ్రెస్సూ ధరించబుద్ధి కాలేదు. చీర కట్టవద్దని చెప్పడానికి వాళ్ళెవరు? అది నా డ్రెస్ నా ఇష్టం అందుకే ఇక్కడకు వచ్చేసాను.

లండన్ నగరం చాల అందంగా ఉంది. ఇండియన్ ఫుడ్‌కి గాని, ఇండియన్స్‌కి గాని ఏవిధమైన కొరతా లేదు. హాస్పిటల్ కూడ ఇంటికి చాల దగ్గర. షాపింగ్ సెంటర్స్ అన్నీ దగ్గర. కారు బయటకు తీసే అవసరమే లేదు. కారు పార్కింగ్ కొంచెం కష్టం ఇక్కడ. అరమైలు దూరంలో షాప్ ఉంటే మైలున్నరదూరంలో కారు పార్క్‌చేసి నడిచి రావాలి. దాని బదులు ఆ అరమైలు నడిస్తేనే మంచిదికదా!

అసలైన ముఖ్య విషయం ఇందులో ఒకటి వ్రాయబోతున్నాను. అది విని నీవు సంతోషిస్తావనే అనుకుంటున్నాను. ఆ మధ్యనాకు ఆంటోనితో పరిచయం అయింది అని వ్రాశానుకదా! అనుకోకుండా మెడికల్ షాపులో ఆంటోని ఫొటో తారుమారు అయింది, నాది ఆంటోనీకి వెళ్ళింది. నేను ఫొటో మార్చడానికి వెళ్ళాను. అదే సమయంలో అతను తన ఫొటో మార్చడానికి వచ్చాడు. నా ఫొటో చాల బాగుందని నాకు అభ్యంతరం లేకపోతే అది తనకు కావాలని రిక్వెస్ట్ చేశాడు. ఆ సమయంలో పరాయి వ్యక్తికి నా ఫొటో ఇవ్వడం ఇష్టంలేక ఇవ్వలేదుగాని పరిచయం పెరిగిన తరువాత ఫొటోనే కాదు, నా జీవితాన్నే అతని చేతుల్లో పెట్టాలని నిర్ణయించుకున్నాను. ఇప్పుడు నాతోనే పనిచేస్తున్నాడు టోని.

రనితా! నీకు తెలుసుకదా! ఇండియాలో పెళ్ళిచూపుల పేరుతో నేను పడిన అవమానాలు. కట్నం దగ్గర ఆగిపోయిన నా పెళ్ళి సంగతులు. "మేరేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అంటారు. అది అక్షరాలా నిజమేనేమో! టోనీకి నాకు రాసిపెట్టి ఉందేమో. అందుకే నేను విదేశాలు వచ్చి వున్నాను. అసలు విదేశానికి వెళతానని నేను కలలో కూడ అనుకోలేదు కదా! తప్పిపోయిన పెళ్ళితో నిరాశ చెందిన నాకు ఎంతో ధైర్యం చెప్పి మా కజిన్ ఇక్కడకు తీసికొని వచ్చాడు. నిజంగా నాకు మరోజీవితాన్ని ఇచ్చాడు.

మొదట నేను ఆంటోనీని పెళ్ళిచేసుకోడానికి నిరాకరించాను. కారణం ఇక్కడి ఇంగ్లీషువాళ్ళకి ఇండియన్స్ అంటే అన్ని విషయాల్లోనూ చిన్నచూపే. అది నేను భరించలేను. కాని ఆంటోని చాల ఉన్నతమై భావాలుకలవాడు. నేను వెనకా ముందూ ఆడుతుంటే ఎంతో ఎన్‌కరేజ్ చేశాడు. మాది కులం, భాష, దేశం, మతం ఏదీ ఒకటి కాదు. అన్నిటికీ అంతరాలే! తరువాత ప్రోబ్లమ్స్ ఏమీ రావుకదా అంటే, ఏమన్నాడో తెలుసా 'నీవు' డాక్టరువై ఉండి ఇలా ఆలోచిస్తావేమిటి? మనుషులు అందరూ ఒకటేకదా! దేశం, భాష అన్నీ వేరుకావచ్చు. కాని మనిషి యొక్క నిర్మాణం ఒక్కటేకదా! చూడు మనిద్దరం డాక్టర్లం. మనం కలసి పని చేసినప్పుడు ఎన్నో విధాలైన ఆపరేషన్లు చేశాం. నీకు ఎక్కడయినా మనిషికి మనిషికి తేడా ఏ దేశాలవారిలోనైనా కనిపించిందా? మనుషులు రకరకాల తీరుల్లో వుండవచ్చు కాని అందరిలోను రక్తం ఉంటుంది. మనిషి రూపులోను, రక్తం గ్రూపులోను ఎన్నో భేదాలుండవచ్చు. కాని మనిషి అవయవాలు అన్నీ ఒకేలా ఉండవా అంటూ ఎంతో హితబోధ చేశాడు. నన్ను ఒప్పించాడు.

రనితా! ఆ మాటలు వింటుంటే చాల సంవత్సరాలక్రితం జరిగిన ఒక సంఘటన గుర్తుకు వచ్చింది. నీకు గుర్తుందో లేదో ఆరోజు మీ ఇంటికి వస్తే నీ ముఖమంతా ఏడ్చి, ఏడ్చి వాచి ఉంది. కారణం ఏమిటని అడిగితే మాట్లాడకుండా డైరీ నా చేతిలో పెట్టావు. ఆ వాక్యాలు నాకు ఇంకా గుర్తే. "నాలో సంస్కారం, మంచితనం తక్కువైతే అది నా తప్పు. కాని నాకు కులం తక్కువైతే అది నా తప్పుకాదు. నన్ను కులం తక్కువది అని హేళన చేసినవాళ్ళూ అమ్మ కడుపునే పుట్టారు. నేనూ అమ్మకడుపునే పుట్టాను. అందరికి చావు పుట్టుకలు ఒకే తీరు ఉన్నప్పుడు ఈ భేదాలు అవమానాలు ఎందుకో! నా తక్కువ కులం నా తప్పే అనుకుంటే అది నిజంగా నాదికాదు. పుట్టించిన దేవుడిదైనా అయి ఉండాలి లేదా కులాల్ని సృష్టించిన మన పూర్వీకులదైనా అయిఉండాలి. "ఈ మాటలు ఎప్పుడూ మరచిపోను నేను. అప్పుడు నీకెంతో ధైర్యం చెప్పాను. ఎన్నో విధాల జీవితంలో ఓడిపోయిన నాకు నీ తియ్యని స్నేహం, టోనీ చక్కని సాహచర్యం చాలు. ఎవరు సంతోషించినా సంతోషించకపోయినా ఈ పెళ్ళికి నీవు సంతోషిస్తావని తెలుసు. మరి మా హనీమూన్ ట్రిప్ ఇండియాకే సుమా! ఉంటా మరి.

అత్యంత ప్రేమతో
నీ సునీత
గ్రేట్ ఆర్మండ్ స్ట్రీట్, లండన్.

(వనితాజ్యోతి, డిసెంబర్, 81)

☆ ☆ ☆

# బ్లూఫిల్మ్

'ఛ ఛ. అదేమిటో గాని ఎప్పుడు ఫిల్మ్ చూడాలన్నా ఏదో ఆటంకమే' సొణుక్కొంటూ అన్నాడు రామం. నిజానికి అతను చెడ్డవాడు కాదు. రామచంద్రుడిలాంటి వాడే. కాని చాలాకాలంగా బ్లూఫిల్మ్ అంటే ఎలా ఉంటుందో ఒక్కసారి ఒక్క సీన్ అయినా చూడాలని జస్ట్ క్యూరియాసిటీ అంతే. "అవునురా రామం. అనుకోకుండా వచ్చారు గాని, లేకపోతే ఈరోజైనా కోరిక తప్పక తీరేదే. ఎలాగేనా త్వరలోనే బ్లూఫిల్మ్ చూపించకపోతే నా పేరు వాసూరావే కాదు" పట్టుదలగా అన్నాడు. ఇద్దరూ అనుకోని అవాంతరం ఎదురై ఆ ఫిల్మ్ చూడలేక హడావిడిగా ఒక చెత్త షో సినిమా చూసి వస్తున్నారు. అంతలోనే అక్కడ పెద్ద గలాటా జరుగుతుంటే ఏమిటోనని అటువైపుగా వెళ్ళారు. "పాపం ఎవరోగాని అయిదు అంతస్తుల నుండి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు" అన్నాడు ఎవరో.

అది అయిదు అంతస్తుల ఫైవ్‌స్టార్ హోటల్. ఆ చనిపోయిన అతన్ని ఆ చుట్టూ అన్నీ సినిమా హాల్స్ కాబట్టి 2వ షో నుండి వస్తున్న జనం ఇంకా ఎవరెవరో చాల మంది గుమిగూడి చూస్తున్నారు. ఏమిటంటే ఆ ఆత్మహత్య చేసుకున్న అతని ఒంటిమీద నూలుపోగు అయినాలేదు. అందరూ అతన్ని అలాగే చూస్తున్నారు. ఎవరూ వంటి మీద బట్ట కప్పడానికి కూడా సాహసించడం లేదు. అతనంటే కోపం కాదు. పోలీసులతో పుణ్యానికి పోతే పాపం ఎదురొస్తుందనే"

"రైడింగ్‌లో పట్టుబడ్డాడట. తలుపులు లూజుగా ఉండడంతో పోలీసులు కొట్టగానే అది ఊడి తలుపు తెరుచు కోవడంతో అకస్మాత్తుగా అలాగే పరుగెత్తుకెళ్ళి దూకాడట" మరొకరు అన్నారు. నిజానికి అతనిని నడిరోడ్డు మీద అందరూ ఆ శరీరాన్ని బ్లూఫిల్మ్‌లాగే చూస్తున్నారు.

అరే ఇతనా? ఇతను నాకు తెలుసు. మా పక్కింటికి వస్తుంటాడు. చాలా మంచివాడు. పాపం చక్కని కుర్రాడు. పెళ్లి కాకుండా ఇదేం పాడుబుద్ధి. ఆఖరికి ప్రాణాలు తీసుకున్నాడు అంటూ వాసుతో అన్నాడు రామం.

పక్కింటికి అంటే అదే ఆ గుడ్డివాళ్ళు ఉండే వారు. వాళ్ళింటికేనా?" వాసు అన్నాడు.

"అవునురా, పాపం ఆ గుడ్డి దంపతుల జీవితాల్లో వెలుగులా అస్తమానూ ఇతను వచ్చేవాడు. పేరు మహేష్. నాకు బాగా తెలుసు. నాతో కూడా చాలాసార్లు సరదాగా మాట్లాడేవాడు. వాళ్లకి మహేష్ అంటే ఎంతో ఇష్టం. ఎప్పుడో మహేష్ కారు క్రింద ఆ దంపతులు పడబోయారట. గుడ్డివాళ్లని అతనికి తెలియదు. వాళ్లు చావు నుండి



తప్పించుకున్నారు. లేదంటే మహేష్ మీద కోర్టు కేసు అయ్యేది. అప్పటినుండి వాళ్లకు సన్నిహితుడు, స్నేహితుడు ఒకటేమిటి అన్నీ ఇతనే.''

"ఈ మధ్య వాళ్లు ఇల్లు ఖాళీ చేసారన్నావుగా'' వాసు అడిగాడు. ఇద్దరూ నడుస్తూ మాట్లాడు కుంటున్నారు.

"అవును. పది సంవత్సరాల నుండి వాళ్లు, మేము పక్క పక్కనే ఉన్నాం. పది రోజుల క్రితం కొడుకు దగ్గరకు పర్మినెంట్‌గా వెళ్లిపోయారు. ఇంతకాలం కొడుకు కంటికి సంబంధించిన చదువు చదవాలని, తన తల్లిదండ్రులకు తానే ఆపరేషన్ చేసి కళ్లు రప్పించాలని పట్టుదలగా చదివాడట. హాస్టల్లో ఉండి. అతనికి ఉద్యోగంరాగానే తల్లిదండ్రులను తీసికెళ్లిపోయాడు. వాళ్లకు కళ్లు వచ్చినా రాకపోయినా ఆ కొడుకే వారికి చూపు ఇకపై.''

"ఒక్కడే కొడుకు కదూ!''

"అవునురా. ఒక్కడే అయినా వజ్రంలాంటివాడు.''

"వాళ్లు గుడ్డి వాళ్లయినా అసలు అలా కనిపించేవారు కాదురా. ఇద్దరికిద్దరూ అందమైనవాళ్లు. అసలు చెప్పనిదే వాళ్ల గుడ్డితనం ఎవరికీ తెలియదు. అంతా మామూలు మనుషులలాగే పనులు చేసికొనేవారు కదరా'' వాసు అన్నాడు.

"నిజమే వాసూ! కొడుకు పుట్టిన తరువాత ఇద్దరికీ యాక్సిడెంట్‌లో కళ్లు పోయాయట. అయినా కళ్లు లేనివారికి వళ్లంతా కళ్లే. ఏమిటో దేవుడి మాయ. వాళ్లు వాళ్ల పనులు వాళ్లు చక్కగాచేసుకుంటారు. బహుశా అలా అలవాటయిపోయిందేమో.''

"ఒక్కరోజు కరెంటు పోతే ఉండలేం. అలా జీవితాంతం ఎలా ఉండగలరోపాపం." వాసు అన్నాడు.

"మనం వాళ్లను చూసి జాలిపడతాంగాని వాళ్లకు వాళ్ల సాధ్యమైనంత వరకూ హాయిగా బ్రతకడానికే ప్రయత్నిస్తారు."

"ఇంతకీ చెల్లమ్మ ఎప్పుడు వస్తుంది పుట్టింటి నుండి" వాసు అడిగాడు రామాన్ని.

"మరో నెల్లాళ్ల పడుతుందిరా! చంటిపిల్ల తల్లి కదా! పని చేసుకోలేదని మూడోనెలలో పంపుతామన్నారు మా అత్తగారు."

"అంతవరకూ నీకు ఈ సెకండ్ షో సినిమాలు తప్పవన్నమాట" నర్మగర్భంగా అన్నాడు వాసు.

"ముత్యాలు, రత్నాలు సముద్రంలో గనులలో దొరుకుతాయంటారుగానీ, అసలు మనిషి నుండి మనిషి పుట్టడం - వాళ్ళు వజ్రాలుకాదుట్రా! ప్రతీ జీవితానికి వాళ్ల పిల్లలు ఎంతో విలువైనవారు. అటువంటి వారిని మనం పొందడంకోసం ఇలాంటి విరహ వేదనలు, ఒంటరి రాత్రులు గడపక తప్పదు మరి" రామం అన్నాడు.

"మా చెల్లెలు అదృష్టవంతురాలు. ఎలాగైనా ఆమె వచ్చే లోపుగా నీ కోరిక తీరుస్తాలే. ఎప్పుడైనా ఆవిడ దగ్గర నాపేరు బయట పెట్టవద్దు సుమా! నిన్ను నేను చెడిపానంటుంది" నవ్వుతూ అన్నాడు వాసు.

ఆ తరువాత ఇద్దరూ విడిపోయారు. తరువాత కలవనే లేదు చాలారోజులు. రామం కూడా ఆ సంగతి మరచిపోయాడు. మరో ఇరవై రోజుల తరువాత వాసు హడావిడిగా వచ్చి ఈ రోజు మా ఇంట్లో ఎవరూ లేరు నీ కోరిక తీరుస్తానులేరా, అంటూ హడావిడిగా లాక్కెళ్లాడు.

భోజనం అయిన తరువాత ఫిల్మ్ ఆన్ చేస్తూ అన్నాడు. "అరేయ్ రామం. ఆ రోజు చనిపోయాడు చూడు మహేష్ అతను పరమ దుర్మార్గుడట. మనం అనవసరంగా జాలిపడిపోయాంగానీ ఎందరో ఆడపిల్లల బ్రతుకులు నాశనం చేశాడట" వాసు అంటున్నా రామం ఆ మాటలు అంతగా పట్టించుకోక, బ్లూఫిల్మ్ వైపు చూడసాగాడు. ఎగ్జయిటింగ్‌గా. అంతే వెంటనే హతాశుడై టి.వి. కట్టేసి కోపంగా బాధగా అన్నాడు. "నిజమేరా, మహేష్ అలా చనిపోయినందుకు చాలా విచారంగా ఉంది. అంతటి దుర్మార్గుడికి అంత మంచి చావేమిటి, కుళ్ళి కుళ్ళి చావాలిరా" అని.

ఆ బ్లూఫిల్మ్‌లో ఉన్నది ఎవరో కాదు రామం పక్కింటి అంధ దంపతులు. ఆ ఫిల్మ్ తీసింది మహేష్ అని వెంటనే అర్థం అయింది రామానికి.

(ఆంధ్రభూమి డైలీ)

☆ ☆ ☆

# నైట్‌డ్రస్

మాధవ్ ఆ రోజే ఊరినుండి వచ్చాడు. ఆఫీసుకెళితే మాధవ్ క్లోజ్ ఫ్రెండ్ మూర్తి ఆ రోజునుండి ఆఫీసుకి రాలేదు. అప్పుడు గుర్తుకు వచ్చింది మాధవ్‌కి మూర్తి హనీమూన్‌కి వెళ్ళాడని. మర్నాడు మూర్తి రానేవచ్చాడు.

రెండురోజులు పోయిన తరువాత మూర్తి మాధవ్‌ని తనింటికి తీసికెళ్ళాడు. ముందు రానన్నాడు మాధవ్. 'మీరు కొత్తగా పెళ్ళయిన వాళ్ళు, మధ్యలో నేనెందుకు' అని తప్పించుకోబోయాడు.

"కొత్తగా పెళ్ళయితే మాత్రం అస్తమానం అదే పననుకున్నావా" చిలిపిగా అన్నాడు మూర్తి. మూర్తి ఇంటికి వెళ్ళగానే "శోభా, శోభా" అని పిలిచాడు మూర్తి.

మూర్తి భార్య శోభ వచ్చింది. ఆమెను అపురూపంగా అలాగే చూస్తూ ఉండిపోయాడు మాధవ్. స్నేహితుని భార్య అన్న సంగతి కూడా మరచిపోయాడు. కారణం ఆమె అతనికి తెలిసినామె కాదు. ఆమె అందాన్ని కాదు అతను చూస్తుంట. ఆమె వేసికున్న నైట్‌డ్రస్ వంక. పింక్ కలర్, స్లీవ్‌లెస్ నైట్‌డ్రస్‌లో రతీదేవిలాగా ఉంది శోభ.

ఆమె పెద్ద అందగత్తె కాకపోయినా ఆ నైట్‌డ్రస్‌లో చాలా సెక్సీగా, అట్రాక్టివ్‌గా కనిపించింది మాధవ్‌కి.

'నమస్తే' అనేసరికి ఈ లోకంలోకి వచ్చి తనను తాను సర్దిచెప్పుకుని తమాయించుకున్నాడు. నైట్‌డ్రస్ రాత్రుళ్ళే వేసికుంటారని తెలుసుగాని పగలు కూడా ఇంట్లో వేసికుంటారని పరాయి మగవాళ్ళముందుకి కూడా అలాగేవస్తారని కొందరు, శోభను చూస్తేగానీ తెలియలేదు మాధవ్‌కి.

ఇంగ్లీషు సినిమాలలో చూసాడు. వాళ్ళు ఎవరైనా వచ్చినప్పుడు వాళ్ళ ఎదురుగా వెళ్ళవలసి వస్తే నైట్‌డ్రస్‌పైన మరో హౌస్‌కోట్ వేసుకొని వెళ్ళడం. కానీ శోభ అలాకాక ఎలాఉన్నది అలాగే వచ్చేసింది బయటకు.

అది నైట్‌డ్రస్ కాదు, హస్‌కోటు అని మనసుకి సర్ది చెప్పుకున్నాడు. అప్పుడుగానీ అతని కళ్ళు ఆమెను వింతగా, చాటుగా చూడటం మానలేదు మాధవ్. మూర్తి ఇంటినుండి అయితే వచ్చాడుగానీ అతని మనసంతా శోభ నైటీ చుట్టూనే తిరగసాగింది.

తనకు పెళ్ళయితే ఎలాగైనాసరే తన భార్యతో నైట్‌డ్రస్ వేయించాలని ఆ నైట్‌డ్రస్‌తోనే మూర్తిలాగే తానుకూడా తన ఫ్రెండ్స్‌కి భార్యను పరిచయం చేయాలని తను ఎంతో అడ్వాన్స్‌గాను, బ్రాడ్ మైండ్‌గాను ఉన్నట్లు భార్య స్నేహితులు అనుకోవాలని కలలుకనడం మొదలు పెట్టాడు.

అసలు అతని కలలు కాబోయే భార్య చుట్టూ కాక కొనబోయే నైట్‌డ్రస్ చుట్టూ తిరగసాగాయి.

ఆ తరువాత తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధం నోరెత్తకుండా ఒప్పేసుకున్నాడు మాధవ్. కారణం పెళ్ళిమీద ఇంటరెస్ట్ కాకపోయినా నైట్‌డ్రస్‌మీద మోజుతో.

శోభనం రాత్రి ఎవరికీ తెలియకుండా ముందుగానే శోభ వేసుకున్నలాంటి పింక్ కలర్, స్లీవ్‌లెస్ నైటీ ఈ గదిలో రహస్యంగా భద్రపరిచాడు.

అమల పాలగ్లాసుతో, తెల్లచీరతో అచ్చు సినిమాలోలాగే వచ్చింది లోపలికి.

అతనికి ఆ చీర చాలా చిరాకు కలిగించింది. మొదటి రాత్రి చిరాకు పడడం కంటే ప్రేమతో తన కోరికను తీర్చుకోవాలనుకున్నాడు.

ముందు భార్యను ప్రేమగా పలకరించి తాను పాలుతాగి భార్యతో తాగించి భార్యను చాలా పొగిడి అప్పుడు అసలు విషయం బయట పెట్టాడు.

ఆ చీర మార్చేసి నైట్‌డ్రస్ వేసుకోమని. ఆమె వింతగా చూసింది అతనివైపు.

ప్లీజ్ అమలా నా కోరిక తీర్చవూ? నిన్ను ఈ డ్రస్‌లో చూడాలని ఎన్ని షాపులు వెతికానో తెలుసా ఇది నీకోసం ఎంతో ఖర్చుపెట్టి కొన్నాను" బ్రతిమాలే ధోరణిలో అన్నాడు ఆమె ఎక్కడ వద్దు అంటుందోనని.

అమలకు పెద్దలు గదిలోకి పంపినప్పుడు అతను చెప్పినట్లు నడుచుకోమ్మా అన్న మాటల కంటే ఇది మీకోసం ఎంతో ఖర్చుపెట్టి కొన్నాను అన్న మాటలు ఆమెపై బాగా పనిచేసాయి. అయినా అది ధరించాలంటే సిగ్గనిపించింది.

"బాబోయ్ ఇక్కడ మీ ఎదురుగా మార్చుకోనా"అంది సిగ్గుపడుతూ.

ఆ మాటలు అతనికి అమృతం పోసాయి చెవిలో. అమల అది ధరించడానికి అంగీకరించినందుకు అలా సిగ్గుపడితే ఎలా అదయినా కొంచెంసేపే. ఆ తరువాత అదీ ఉండదు అన్నాడు.

ఆ మాటలకు మరింత సిగ్గుపడింది అమల.

అమల సందేహిస్తుంటే తానే అటు తిరిగి కనులు మూసుకున్నాడు.

భర్త కోరికపై గబగబా చీరమార్చేసి నైట్‌డ్రస్ వేసికుంది.

అమల పూలజడతో వంటినిండా నగలతో ఆ డ్రస్‌లో ఫన్నీగా కనిపించినా ఆ సమయంలో అప్సరసలాగే అనపించింది మాధవ్‌కి.

ఆమెకు ఆ డ్రస్ కొత్తగా అనీజీగా ఉంది. అయినా భర్త కోసం పెదవులపై నవ్వు పులుముకుంది.

ఆ తరువాత ఆమె బలవంతంగా నవ్వే అవకాశం ఇవ్వకుండా తన పెదవులతో ఆమె పెదవులను మూసేసాడు తమకంగా మాధవ్.

మొత్తానికి మాధవ్ మొదటి రాత్రి తాను కోరుకున్న విధంగా తృప్తిగా చనిపోయేవరకూ గుర్తుండేలా గడిచిపోయింది నైట్‌డ్రస్ పుణ్యమా అంటూ.

అతను ప్రేమించేది, కామించేది నైట్‌డ్రస్‌నో భార్యనో అతనికి అర్థంకాలేదు.

చుట్టాలందరూ వెళ్ళిపోయి వేరుకాపురం పెట్టిన తరువాత అసలు విషయం బయట పెట్టాడు మాధవ్.

పగలు కూడా ఆ నైట్‌డ్రస్‌లే వేసికొనమనే భర్తతో ఏకీభవించలేకపోయింది అమల.

అయినా మాధవ్ పట్టువదలలేదు.

మొదట్లో సిగ్గుగాను బిడియంగాను ఉండేది. రానురాను ఆమెకి ఆ డ్రస్ ఈజీగా ఉండి అబ్బ ఇంతకాలం చీరలెలా కట్టుకున్నాను అనే ధోరణిలోకి వచ్చేసింది.

ఇప్పుడు అమల ఎవరువచ్చినా ఎంతమంది వచ్చినా పగలు కూడా నైస్‌డ్రస్ తీయడం లేదు.

మాధవ్ ఏ ఊరైనా వెళితే చీరలు కొనడంలేదు. నైట్‌డ్రస్‌లే కొంటున్నాడు. అసలు ఎక్కడికైనా బయటకు వెళ్ళిన గంటమాత్రం ఆ చీర ఉంటుంది ఆమె శరీరంమీద. కొంతకాలం పోయిన తరువాత బయటకు మాక్సీలు వేసుకోమన్నా సిద్ధంగానే తయారైంది అమల.

రానురాను అమల కొంచం లావుకావడంతో ఆ డ్రెస్‌లో ఎబ్బెట్టుగా అనిపించసాగాయి.

పెళ్ళికి చిన్నపిల్లలా చెస్ట్ తక్కువగా ఉండేది. ఆ డ్రస్‌లో బాగా అనిపించేది. ఇప్పుడు అలా అనిపించడం లేదు. వోటుగా, బయటవారికి కూడా సెక్సీగా కనిపించసాగింది.

ఇప్పుడు మాధవ్‌కి కూడా నైట్‌డ్రస్ మీద మోజు తీరి చీర కట్టుకోకూడదా? అని ఎప్పుడైనా అడిగితే బాబోయ్ నేను కట్టలేను. అనిజీగా ఉంటుంది అనేస్తుంది అమల.

ఇప్పుడు ఎవరింటికైనా వెళితే ఆ ఇంటిలోని వారు చీరలు కట్టుకుంటుంటే అపురూపంగా చూస్తున్నాడు మాధవ్.

జాకెట్టుకి, చీరకి ఉన్న మధ్యభాగం స్త్రీలలో సెక్సీగా కనిపిస్తుంటే అందుకే కాబోలు ఫారెనర్స్ భారతీయుల డ్రస్‌ను సెక్సీగా ఉంటుంది అంటారు అనుకున్నాడు.

వారికి పొట్ట కనిపిస్తుంటే తప్పు.



మనకి కాళ్ళు కనిపిస్తే తప్పు. ఏ దేశపు పద్ధతి ఆ దేశానిది.

భార్య అచ్ఛాదనలేని నడుంమీద చేయి వేయాలనే వింత కోరిక మొదలైంది అతనిలో.

నైట్‌డ్రస్‌లో ఒంపుసొంపులన్నీ కనబడటం పైటలేకపోవడం అది ఒక ఎట్రాక్షన్ అయితే అవ్వచ్చుకానీ భారతదేశపు స్త్రీకి చీరలో మరిన్ని అందాలు ఒంపుసొంపులు ఉంటాయని ఈ మధ్య అనుకోసాగాడు.

ఈ నైట్ డ్రస్ బావుందా అని ఎప్పుడైనా అమల అంటే అసలు ఏమీ లేకుండా ఉంటేనే బావుంటావు నీవు అంటున్నాడుగానీ ఆ డ్రస్‌ని మెచ్చుకోవడం, పొగడటం భార్యను దగ్గరకి తీసుకోవడంలాంటిది చేయలేకపోతున్నాడు.

అసలు ఆడవారి అందం బట్టలలోను, ఆభరణాలలోనూ ఉందని అమల చీర కట్టుకుంటే బావున్నాని ఈ మధ్య చాలాసార్లు అనుకోసాగాడు.

పగలూ, రాత్రి అదే డ్రస్‌లో చూడడం విసుగనిపిస్తుంది. పగలు చీర, రాత్రికి నైటీ వేసికుంటే వైరైటీగా ఉంటుంది అనుకుంటున్నాడు.

ఒకరోజు ఆఫీసులో మూర్తి భార్య శోభ గురించి మరోఉద్యోగస్థులు మూర్ఖంగా, అసహ్యంగా మాట్లాడటం మాధవ్ చెవిలో పడింది.

"అబ్బ మూర్తి భార్య మొన్ననే పురుటికెళ్ళి వచ్చిందేమో ఆ నైట్‌డ్రస్‌లో డే టైమ్‌లో చూడాలిరా. మరి అందాలు శ్రీరామచంద్రుడికి కూడా వెర్రిపట్టేలా ఉంది. ప్రవరాఖ్యుడికి కూడా పిచ్చిపట్టేలా ఉంది. అంటున్నారు వాళ్ళు.

ఆ మటలు శోభనుకాక అమలను అంటున్నట్లు భావించాడు.

అమల ఇప్పుడు ప్రెగ్నెంట్. ఒళ్ళంతా నిగనిగలాడుతూ ఉంది.

అమల గురించి కూడా వాళ్ళు అలాగే మాట్లాడుకుంటారా? అనే ఊహరాగానే మాధవ్‌కి ఒళ్ళంతా తేళ్ళుపాకినట్లు అనిపించింది. నిజానికి నైట్‌డ్రస్ మీద మొదట ఉన్నంత ఇంటరెస్టు ఇప్పుడు మాధవ్‌కి లేకపోయినా అమలకు డ్రస్ అలవాటయిపోయి అదే హాయనిపిస్తుంది. చీర బోర్ అనిపిస్తుంది.

అసలు తెల్ల చీరలు, పాలగ్లాసులు ఇవన్నీ మగవాడికి కోరిక పెంచడానికి.

కానీ రోజు అదే పనిగా తెల్లచీర, పాలగ్లాసు పట్టుకున్నా కోరిక పెరగదుసరికదా బోరు కొడుతుంది కూడా.

మాధవ్ కూడా ప్రస్తుతం అదే స్థితికి వచ్చేసాడు.

ఆ నైట్‌డ్రస్‌లో మొదట కనిపించినంత అందంగా కనిపించడంలేదు ఇప్పుడు అమల.

బయటకు వెళ్లినప్పుడు చీర కట్టుకుంటే చీరలో ఎంత బావుందో అనుకుంటున్నాడు తరచుగా.

అందుకే ఇకపై తన భార్య అందాల్ని, అవయవ సోయగాల్ని ఇతరుల ముందు బయట పెట్టదలచుకోలేదు.

ఏదైనా గుప్పెట్లో ఉంటేనే అందం. గుప్పెట తెరిస్తే బట్టబయలు అయితే నలుగురి నోళ్ళలోను నానడం అనుకున్నాడు.

పెళ్ళికి ముందు భార్యతో ఎలా నైట్‌డ్రస్‌లు వేయించాలా అని బుర్ర బద్దలు కొట్టుకున్న మాధవ్ ఇప్పుడు అమలతో డే టైమ్ ఆ డ్రస్‌లు ఎలా మాన్పించాలా, చీర ఎలా కట్టించాలా అని తల బాదుకుంటున్నాడు.

అతని కోరిక తీరుతుందని ఆశిద్దాం, పాపం!

(భూమి, 'సెంటర్ సెన్సేషన్', భూమి 28-05-87)

☆ ☆ ☆

# ఆల్ ఇన్ వన్

ఛి! ఛీ వెధవకొంప. వెధవ కొంపాని విసుక్కున్నాడు, వినయ్. ఏం కొంపకేం కొంప ములిగిందట. అంత కోపంగా ఉన్నారు అంది సుధ వంటగదిలోనుండి.

తమరు వంటగదిలోనుండి బయటకు రాకండి. వంటిమీదా(శద్ధ చూపించుకోకండి. వంటింటి కుందేలుని నాకు కట్టబెట్టింది మా అమ్మ. నిన్నుకాదు, ఆమెననాలి' అన్నాడు. ఓ అదా! అయ్యగారి కోపం. చూడండి. మనం నిద్రలేచిన దగ్గరనుండి పడుకునేవరకూ ఉన్న ప్రాబ్లమ్స్‌లో మెయిన్ ప్రాబ్లమ్ తిండి. పొద్దుటి కాఫీ దగ్గరనుండి రాత్రి పడుకునేవరకూ ఏది లేకపోయినా గడవదాయె. పైగా మనం ఆంధ్రులం. అన్నంలోకి ఏం తక్కువైనా సమర్ధించుకోలేం. మరి లేచిన దగ్గరనుండి ముందు ఆహారం సంగతి చూడాలిగా' అంటూ వచ్చింది. మెడలో హారం సర్దుకుంటూ ఆహారం ముందు ఆమె అందం, వంటింటిలోకూడా మెరిసిపోయింది.

“అవును పనితో అలసిన శరీరంతో నీవు, అన్నం బొజ్జనిండా ఆరగించి, అరిగించుకోలేక, భుక్తాయాసంతో నేను గుర్రుపెట్టడమే మన జీవిత లక్ష్యం.” గుర్రుగా సుధవైపు చూశాడు.

భర్తకోపం అర్థం అయి చిన్నగా నవ్వుకుంది సుధ. రాత్రి తాను దూరంగా పడుకుందని కోపం.

భర్తకు రాత్రయితే సెక్స్ ధ్యాస తప్ప మరొకటి ఉండదు. తనకు మాత్రం మంచం ఎక్కిన దగ్గరనుండి రేపు కంచంలోకి ఏమి వండాలి.

పిల్లల బట్టలు ఇస్త్రీ చేసి వున్నాయా లేదా, పాలు తోడేశానా లేదా రేపు పనిమనిషి నీళ్ళు వస్తాయా లేదా అన్నవే గుర్తుకి వస్తాయి. భర్తకు ఏమి తిండిపెట్టాలో అనే తాపత్రయంలో అతనికేం కావాలో అన్నది అంతగా పట్టించుకోదు. భర్త బాధ్యతలను, ఆఫీసు చికాకులను ఆ ఫైళ్ళలోనే మూసేసి, బిగించి, ఆ అరకు తాళం వేసి వస్తాడు. తనకు అలా కుదరదు. అతని పని జాజులమాలలాంటిదైతే, ఇంట్లో తన పని కదంబమాలలాంటిది. ఇంట్లో ఇల్లాలిగా తాను బాధ్యతలనుండి పరారి కాలేదు. పైగా వచ్చేపోయే చుట్టాలొకటి.

అన్నీ చూసుకోవాలి. భర్త మాత్రం భార్య విషయంలో శయనేషు రంభ తప్ప మరేది పట్టించుకోడు.

మరలా ఆరోజు రాత్రికి కథ మొదలయింది. భార్యమీద అలిగి దూరంగా పడుకున్నాడు వినయ్. సుధకు చెప్పలేనంత నీర్సం వచ్చేసింది. పోనీ అని ఊరుకుంటే



గర్వం, నేనంటే లెక్కలేదంటాడు. ఎలాగైనా తగువే. అసలే పగలంతా బావగారి పిల్లలు, మరిది పిల్లలు వచ్చి అక్కడే వుండి, రాత్రికూడా భోంచేసి వెళ్లడంతో వంటతోనూ వాళ్ళ అల్లరితోనూ, ఇల్లు సర్దడంలోనూ బాగా అలసిపోయి వుంది. కళ్ళమీదకు నిద్ర ముంచుకు వస్తుంది. భర్తను చూసీ చూడనట్లు వదిలేస్తే గోటితో పోయేదానికి గొడ్డలి ఉపయోగించాలి. స్విచ్ వేస్తే వెలిగే లైటులా భార్యలో కోరిక పొంగాలి అంటాడు భర్త. అలా ఎలా అవుతుంది.

"ఏమండీ!" మీద చేయివేస్తూ దగ్గరయింది.

వెళ్ళు ఇక్కడినుండి అంటూ భార్య చేతిని విసిరికొట్టాడు.

"నేనేం చేసాను చెప్పండి" అంది బ్రతిమాలే ధోరణిలో.

"నీవేం చేయలేదు. అసలు నీకు మొగుడన్నవాడు ఇంట్లో వున్నాడు. అతనికీ కోరికలు వుంటాయి. కాస్త సాయంకాలం అయ్యేసరికి మురిపిద్దాం. చక్కగా ముస్తాబయి ఎదురు చూద్దాం. అతని ఆశలు తీరుద్దాం అని వుంటేగా!" నిష్ఠూరంగా అన్నాడు. బారెడు అందమైన జడ పట్టుకు లాగినా, జడపదార్థంలా రియాక్షన్ వుండదు అనుకుంటాడు. భార్య వంగొని గదులు తుడుస్తుంటే, పైట వెనుక నుండి స్థనద్వయం అతని హృదయంలో స్పందనలు రేకెత్తిస్తుంది. ఆమె ఏ పని చేస్తున్నా, నవ్వుతున్నా, అజంతా శిల్పం ప్రాణం పోసుకుని వచ్చిన భంగిమలో కనబడుతుంది. సన్నని తెల్లని నడుం తలగడలా చేసుకుని పడుకోవాలని మోహాన్ని అమృతభాండాలుకి అదుపుతూ

పెదవులను ముద్దాడాలని ఎన్నెన్నో అనుకుంటాడు. ఆమె అంత సాగనివ్వదు. భార్యలో కోరికలు లేవనుకుంటాడు. ఆమెలో కోరిక రేకెత్తే అవకాశం తాను ఇవ్వడంలేదని అనుకోడు.

"నామాట వినండి అంటూ దగ్గరగా రాబోయింది. అక్కరలేదు.

పదేళ్ళనుండి వినివిని విసిగిపోయాను. సంసారానికి సెక్స్ ఒక్కటే ముఖ్యం కాదు. ఎన్నో బాధ్యతలు వుంటాయి. అన్నీ సమర్ధించుకోవాలి. ముఖ్యంగా పిల్లల కళ్ళబడకుండా వుండాలి. అంటూ నీతిపాఠాలు వల్లిస్తూ నా కోరికలమీద నీళ్ళు జల్లుతావు. దూరంగా వుండు. ఇంతోటి సుఖం బయట ఎక్కడైనా దొరక్కపోదు. అలా తిరిగేవాడిని కాదుకదా ఎక్కడికి పోతాడు అని నీధైర్యం" అన్నాడు కోపంగా.

తనకు భార్య దగ్గర కావలసినంత తృప్తి దొరకడంలేదని అతని బాధ. భర్త మాటలకు కాస్తంత మనసు చివుక్కుమన్నా తమాయించుకుంది సుధ.

"చూడండి. మరలా నీతివాక్యాలు చెబుతున్నానని అనుకోకండి. ఇందాక మీరన్నారు చూడండి. బయటకు వెళితే ఆమాత్రం సుఖం దొరక్కపోదని. వెళ్ళాలి అని మనసులో వున్నవారిని ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆపలేరు ఎవరినీతి వారికుండాలి. కాని ఆ వెళ్లడంలో సుఖం కొద్దిగా వుండవచ్చుగాని, భార్య ప్రేమకు శాశ్వతంగా దూరం అయిపోతారు. నిజమే. బయట కొందరి మగవాళ్ళ కోరికలు తీర్చడానికి వేశ్యలు సిద్ధంగా వుంటారు. కాని భార్యలలా కాక వాళ్ళు కోరికలతో వేగిపోతూ మగవారిని ఆహ్వానిస్తూ, రెచ్చగొడుతూ, వెచ్చగా పడుకుంటారని మీరు అనుకుంటే మాత్రం పొరపాటు.

ఆకలో, పరిస్థితులో వారిని రెచ్చగొట్టి రెక్కలు విరగ్గొడితే తప్పనిసరి పరిస్థితుల్లో కడుపుకోసం పడుపువృత్తి చేపట్టి, వాళ్ళ శరీరం పుండవుతున్నా, పైకి రుచికరమైన పండులా కనబడుతూ పండువెన్నెలలు మీకు చూపిస్తూ వాళ్ళు మరింత అమావాస్య చీకటిలోకి కూరుకుపోతూ వుంటారు. వాళ్ళు విధిచేతిలోనుండి, కొందరి రాక్షసుల చేతుల్లోకి మారిన అంగడి బొమ్మలే. ఆ ఆకారాల వెనుక వికారమైన జీవితం వుంటుంది. వాళ్ళు అందించే సెక్స్ వెనుక విషంలా చిందించే జబ్బులు కూడా వుంటాయి. ఏ వెలయాలుకూడా మగవాడిమీద చూపించే ప్రేమ నిజమైనదికాదు. పైగా ఏ ఆడది పది మంది మగాళ్ళ క్రిందా నలగాలనుకోదు. పదిమంది ముందు తాళి కట్టించుకుని ఇల్లాలిగానే వుండాలని కోరుకుంటుంది. కాబరే డాన్స్ అట్రాక్షన్‌గా కనబడినంత మాత్రాన కూచిపూడి నర్తకితో ఎప్పుడూ పోల్చకండి.

మనమధ్య ఈ వాదనలు ఎప్పుడూ జరిగేవే. మీకు రోజూ సెక్స్ కావాలి. మగవాడికి జీవితమంతా సెక్సే. ఆడదానికి అది జీవితంలో ఒక భాగం మాత్రమే. అలా అని భర్త మీద ప్రేమలేదని అనుకోకండి.

భర్తకు భార్య జీవితంలో ఒక భాగం మాత్రమే అయితే భార్యకు మాత్రం జీవితమంతా భర్తే. అది గుర్తుంచుకోండి. సరే నా మాట వినండి. ఇకపై మీరు చెప్పినట్లే వింటాను అంది. వినయ్ ఆ మాటలకు కాస్త శాంతించాడు.

ఆ మర్నాటినుండి సుధ ప్రవర్తన పూర్తిగా మార్చేసుకుంది. కూరలు మాడిపోయినా, పిల్లల మొహాలు వాడిపోయినా, వాళ్ళు చదవకపోయినా పట్టించుకోవడంలేదు. ఒంటికి దట్టంగా పెరుగుమీగడలు పట్టించుకుంటుంది. ఖరీదైన తెల్లచీరలు, పలుచని మేక్సీలు కొనేసింది. రాత్రయితే చాలా బుట్టెడు మల్లెలు, ఒంపుసొంపుల ప్రదర్శన, సుగంధాల సువాసన ఎక్కువయ్యాయి. సుధలో మార్పుకి వినయ్‌కి చెప్పలేనంత ఆనందంగా వుంది. ఆమెలో అందాలు మరింత మెరుగై మెరిసే మెరుపులా కనబడుతున్నాయి.

మరో నెల తిరిగేసరికి, రోజూ బిరియాని తినేవాడికి, తెల్ల అన్నం పరమాన్నంలా కనబడినట్లు సెక్స్ అంటే రోత కలగసాగింది. వినయ్‌కు భార్య గుండెలోని బాధ అర్థం కాసాగింది. పిల్లలను పట్టించుకోక పోవడంతో మొండిగా తయారయ్యారు. పైగా హోటల్ తిండి వినయ్‌కు నచ్చక భార్య వంటలో విలువ తెలిసివచ్చింది. పిల్లలకు బయటి తిండి పడక అనారోగ్యం. జీతం సరిపోక అప్పులు మొదలుపెట్టాడు. ఆఫీసులో అనుకోని చికాకులు ఎదురై సెక్స్‌మీదికి ఆలోచనలు పోవడం లేదు. చుట్టాలదగ్గరనుండి సుధ తమను చేరనివ్వడంలేదని కంప్లయింట్స్ మొదలయ్యాయి.

మల్లెలతో అలంకరించుకున్న భార్య రాక్షసిలా కనబడసాగింది. తనను రెచ్చగొడుతుంటే పిశాచిలా అనిపించసాగింది. ఒంట్లో నలతగా వుండి భార్య అంటే భయం పట్టుకుంది. అతని మనసు గ్రహించి అంది సుధ. ఏమండీ, నిజంగా నేను కోరికలతో కాలిపోయి మీ చెంతకు చేరడంలేదు. ఏదైనా అతి అయి మితిమీరితే ఇలాగే వుంటుంది. ఏ మగవాడైనా భార్య తనతో కోఆపరేట్ చేయడంలేదని బాధపడతాడు. కాని నిజానికి భార్య అస్తమానూ కోరిక ప్రదర్శిస్తుంటే తట్టుకోలేదు. ఇల్లు నిలబడడానికి ఇటుకలు, సిమెంట్‌లాంటివి ఎలా అవసరమో, సంసారం చక్కగా నిలబడడానికి భార్య వంటలు, అతిథులు, పిల్లలపై, ఇంటిపై శ్రద్ధలాంటివి అంతే అవసరం. వెలయాలికి ఇల్లు, పిల్లలు వుండరు కాబట్టి తప్పనిసరి పరిస్థితులలో దృష్టి అంతా తన ఆకలిమీద, రాబోయే మగాడిమీద కేంద్రీకరిస్తుంది. కాని భార్యలకు ఇల్లు, పిల్లలు, భర్త, చుట్టాలు అంతా కావాలి అంది. నిజమే సుమా ఆల్ ఇన్ వన్ అయినదే అసలైన ఇల్లాలు అంటూ భార్యను తమకంగా హత్తుకున్నాడు వినయ్. ఈసారి పిల్లలు ఏడుస్తుంటే భార్యకౌగిలి వదిలించుకుని మరీ తాను ఉలిక్కిపడి వెళ్తున్నాడు.

(భూమి, 'సెంటర్ సెన్సేషన్', భూమి 20-09-90)

☆ ☆ ☆

# ఫిగర్

సీమా! ప్రియతమా

అందాల గగన సీమా. నీ అందాల్ని ఎలా పొగడను.

ఎంత పొగిడినా తక్కువే కదా!

నీ సొగసు - ఇంద్ర ధనస్సు

నీ కళ్ళు - నవరత్నాల దీపిక

పెదవి - పగడాల దీవి. అంటూ ఎన్నని చెప్పను. నీ కనుసైగ కోసం ఎంత పరితపించిపోతున్నానో తెలుసా? నీ అంత అందమైన వారు మరొకరు ఉంటారంటే నేను నమ్మను. ఒట్టు. నీకు నేను ఏ విధంగానూ సూట్ కానని తెలుసు. అయినా నీమీద నుండి మనసు మరల్చుకోలేక పోతున్నాను. ఒక్కసారి నావైపు చూడవూ - ధనుంజయ్.

నా నెచ్చెలి - వన్నెల, సొగసు నడకల నెమలీ
నీమేని ఛాయ - పసిడిలోయ
నీ నడుము - ఏనుగు తొండము
నున్నని మెడ - పాలమీగడ

సుందరమైన దృశ్యానికి నీవే భాష్యం. ఏమిటి నీ సొగసులోని రహస్యం. నన్ను నిలువనీయదు. అలా అని కదలనీయదు. మనిషినేమో యిక్కడ, మనసేమో అక్కడ. నీ పరిచయం కలిగిన నేను ఈ జన్మకు ధన్యుణ్ణి. నిన్ను చూడడం కోసమే పుట్టానేమో. ఒక్కసారి నన్ను కరుణించి నాతో మాట్లాడగలవా? నీవు మాట్లాడుతూ ఉంటే నీ దగ్గర తుమ్మెదలు చేసే రొద కూడా వింటాను. వాటిని తరుముతూ కూర్చుంటాను. నీ మోహన రూపం చూస్తూ నేను చనిపోగలిగితే ఎంత బావుణ్ణు. నీవు ఎప్పుడైనా నా అధరాలను చుంబిస్తావేమోనని ఆశతో మద్యానికి, సిగరెట్టుకు దూరంగా ఉన్నాను.

- వినయ్

ఆ ప్రేమ లేఖల్ని మరోసారి చదువుకుంది సీమ. తను నిజంగా అందగత్తె. తను పుట్టినప్పటి నుండి అందరూ అనేమాటే అది. మరి ఆ విషయం భర్త రవికిరణ్ ఎందుకు అనడో ఆమెకు అర్థం కావడం లేదు.

రవికిరణ్ వచ్చేసరికి ఎంతో అందంగా అలంకరించుకుంటుంది సీమ. అయినా దానికి పెద్దగా ఇంపార్టెన్స్ యివ్వడు. కాలేజీలో తనను ప్రేమించిన కోకొల్లల మందిలో

ఏ ఒక్కడిని పెళ్ళాడినా తన జీవితం ధన్యమయ్యేదేమో అనుకుంటూ అసహనంగా బెడ్‌మీద అటు, యిటు దొర్లుతోంది సీమ. భర్త నుండి తన అందం గురించి ఒక్క మంచిమాటైనా వినాలని తహతహలాడుతోంది.

'అమ్మాయ్ సీమా!'' అత్తగారి పిలుపుతో 'ఆ వస్తున్నానత్తయ్యా!' అంటూ వెళ్ళింది.

'ఒంటి గంట దాటింది. ఇంకా భోంచేయలేదేం సీమా!' ఆవిడ గొంతులో ఎనలేని ఆప్యాయత.

కాని ఆ ఆప్యాయతను అర్థం చేసుకునే మనసే లేదు సీమలో. అత్తింటివారంటే చులకన భావం. అది గర్వపు ప్రభావం.

చిన్నప్పటి నుండి అందరూ ఆమెను పొగడి, పొగడి గర్వపు చెట్టుమీద కూర్చో బెట్టేసారు. గంధం లాంటి మనస్తత్వం ఆమెకు చేరువ కాలేదు. పొగడ్తే ఆమెకు ఆహారం అయిపోయింది. అది వింటేనే కడుపు నిండేది అప్పుడు. అదే యిప్పుడు సాగాలనుకుంటే కుదరడం లేదు.

'మీరు తినేయండి. నాకు ఆకలి లేదు' అంటూ వెళ్ళి మరలా పడుకుంది. పుస్తకం పట్టుకుంది. మనసు దానిపై నిలవలేదు.

భర్తపై కోపం యింకా ఎక్కువ చేస్తోంది. తాపం మనిషిలోని నిపుణతను, బ్యూటీని ఎదుటివారు గుర్తించకపోతే అంత కంటే అవమానం మరొకటి ఉండదేమో అదే స్థితిలో ఉంది సీమ.

సాయంకాలం వదినా నీకు సన్నజాజులు యిష్టంగా ఇవిగో. నీకు రెండు మూరలు అంటూ మరదలు చంద్రిక సీమకు యిచ్చింది. ఆమె చిన్నముక్క మాత్రమే తీసుకుంది.

ఆ యింట్లో ఆమెకు ఎవరూ పని చెప్పరు. సాధించరు. ఆమె యిష్టాలకు అనుగుణంగానే ప్రవర్తిస్తారు. అయినా ఆమెలో అసంతృప్తి. వీళ్ళతో నేను కలిసే దేమిటి? వాళ్ళకు నేను చేసేదేమిటి అనుకుంటుంది.

యధావిధిగా భర్త వచ్చేసరికి తలనిండా మల్లెలతో, తెల్లని జరీచీరతో ముస్తాబయింది. రవికిరణ్ వచ్చాడు. కాఫీ యిచ్చింది. 'దేవ కన్యలా ఉన్నావోయ్' అంటూ దగ్గరకు తీసుకుంటాడని రోజూ అనుకుంటుంది. ఆమె అలంకరణను అసలు పట్టించుకోడు అతను. అదే ఆమెకు అతను కొట్టని చెంపదెబ్బ.

పడక దగ్గర కూడా అన్నం తింటున్నంత యథాలాపంగా శృంగారంలో పాల్గొంటాడు. "డార్లింగ్ ఐ లవ్ యూ''. అంటాడని, ఇంతటి అపురూపవతిని పొందడం నా అదృష్టం అంటాడని ఎప్పుడూ ఎదురు చూస్తుంది. అలా అనడు సరికదా పని అయితే చాలు అన్నట్లు ప్రవర్తిస్తాడు.



పాతికేళ్ళు అపురూపంగా పెంచి, సంస్కారవంతుడిగా తయారు చేసిన కొడుకుని, పది రోజుల్లో భార్య వెధవను చేస్తుందట. ఇరవై సంవత్సరాలు ఎండ కన్నెరుగని, గారంగా పెరిగిన కూతుర్ని అత్తింటివారు, భర్త కొద్ది రోజుల్లో సమిధను చేస్తారు.

సంసారం సుఖంగా సాగాలంటే అందము, డబ్బు, హోదా సరిపోదు.

చిన్నచిన్న సంతోషాలు, కొన్ని ఆకస్మిక బహుమతులు, అందాల్ని మెచ్చుకోడాలు, ఆదరణ యిచ్చు కోడాలు ఉండాలేమో.

అప్పుడే శ్రావణమాసపు శుక్రవారం పేరంటానికి వెళ్ళి వచ్చింది సీమ. ఒంటినిండా ఆభరణాలతో, తలస్నానం చేసిన తలతో, పట్టు చీరతో పుత్తడి బొమ్మలా, విరబూసిన కొమ్మలా, గుడిలో నున్న అమ్మవారిలా మెరిసిపోతోంది.

భర్త వచ్చి, తనను చూడాలని తాపత్రయ పడింది. కాని అతను రాలేదు. అత్తగారు భోజనానికి పిలిస్తే విసుక్కుంది. చంద్రిక మీద చిరాకు పడింది. అలాగే బట్టలైనా మార్చకుండా కుర్చీలో కూలబడింది. అలిగిన మనసు నిద్రలోకి జారుకుంది.

ఎప్పుడు వచ్చాడో రవికిరణ్. సోయగాలబాల ఎదురుగా దర్శనమిచ్చేసరికి తమాయించుకోలేకపోయాడు. అమాంతంగా ఆమెను ఎత్తుకొని మంచంమీద పడుకోబెట్టాడు. ఎర్రటి అధరాలను మధువుగ్రోలుతున్నంత తమకంగా అందుకున్నాడు.

నాలుగు పెదాలు పెనవేసుకున్నాయి. శరీరంపై నున్న పట్టుచీరను లాగి పక్కన పడేసాడు. సీమకు మెలకువ వచ్చినా, ఆ హాయిని అనుభవిస్తూ అలాగే కళ్ళు

మూసుకుంది. మెల్లగా జాకెట్ హుక్స్ తొలగించాడు. ఆమె ఎద ఝల్లుమంది. అతని గుండె శృంగార దేవత పాదంలోని గజ్జెలా ఘల్లుమంది.

బంగినపల్లి మామిడిపళ్ళు కొమ్మల చాటున దాగున్నట్లు, బ్రాలాగి పారేసాడు. ఆమె శృంగార మైకం కమ్మిన దానిలా అలా మత్తుగానే ఉంది. స్తనాలను పెదాలతో స్పృశించాడు. ఆమె హృదయం మెత్తగా మూలిగింది. తరువాత లంగాను తప్పించాడు. ఆ నగ్న శరీరం వజ్రాల దీవిలా, కామ దాహంతో నున్న వాడికి కనబడి రమ్మని ఆహ్వానిస్తున్న శృంగార బావిలా కనిపించింది.

ఆమెను అల్లుకుపోయాడు. ఒళ్ళంతా గిలిగింతలు రేగాయి. అతని మెడచుట్టూ చేతుల వేసి తనలో లీనం చేసుకుంది సీమ. సీమా! నీవు నా కోసమే పుట్టావు కదూ! ఈ అందమంతా నాదే కదూ! చెవిలో గుసగుసగా' అన్నాడు రవికిరణ్. ఆమె రతి సామ్రాజ్యానికి మహారాణియై, సెక్స్ వనంలో విహరిస్తున్న పూబోణియై, మైమరచి, ఒళ్ళు మరచి, ఆనందాన్ని అనుభవించింది.

తలుపు దబదబా కొట్టడంతో ఉలిక్కిపడి లేచింది సీమ. ఇదంతా కలా అనుకుంది. ఎక్కడ లేని ఏడుపు ముంచుకు వచ్చింది.

'ఆ వస్తున్నా. కాలింగ్ బెల్ ఉందికదా. తలుపు బాదుతారెందుకు' అంటూ అత్తగారు వెళ్ళి తీయడం తెలుస్తుంది. సీమ రాయిలా అలాగే కూర్చుండిపోయింది. భర్త వచ్చి ఆమెవైపు కన్నెత్తి అయినా చూడకుండా మంచంమీద పడి నిద్రపోవడం గుండెల్లో మంట రేపింది. ఆ మంట చల్లార్చాలంటే ఒకటే మార్గం. పాత ప్రేమలేఖలు తీసి చదువుకోవడమే. బట్టలు మార్చుకొని బీరువా లోనుండి అవి తీసింది. గుండెలో ఏదో గుబులు రేగింది.

అందలాభామా! నా ప్రణయ సామ్రాజ్యపు సీమా. నా మనసు నే పూలగామార్చి పరచి ఉంచాను. దానిమీద నడవవూ. నా పడకపై దుప్పటి బదులు అనురాగాన్ని, తలగడ బదులు నీపై నుండి రాలేని, తీయని తలపుల్ని వేసాను. ఒక్కసారి పరుండవూ. నిన్ను తాకడం కోసం నా చేతివేళ్ళు సన్నజాజులుగా మారుతున్నాయి. మగాడి చేతులు జాజులేమిటి అని నవ్వకోకు. మరి మోటు చేతులతో నిన్ను స్పృజిస్తే సుకుమార కుసుమంలాంటి నీ మేను నలిగి పోదూ... ఇలా సాగిందో ప్రేమికుని లేఖ. ఆనాడు అవన్నీ చిత్తుకాగితాలనుకుంది. మరొకటి తీసింది.

పరువాల జాణా. ఎదలో తీయని రాగాలు పలికే వీణా! వలపుల వానా! నీవేనా అందాల కోన. నీవు ఔనంటే ఔతాను అదృష్టవంతుడిని జీవితాన. కాదంటే చచ్చిపోతాను యిదే నా ఆన. కొన్ని చింపి పారేయగా మిగిలిన ఉత్తరాలవి. ఎప్పుడైనా సరదాగా



భర్తకు చూపించాలని దాచింది. అసలు ఆ పరిస్థితే యింట్లో ఎప్పుడూ రాలేదు. 'చిన్న చిన్న పొగడ్తలతో భార్యను సంతోష పెట్టాలి భర్త అన్న చిన్న విషయం తెలియని రవికిరణ్ గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. ఆ గురక ఆమె కంటికి చురకలా తగిలి నిద్రే రావటం లేదు. భర్త మీద అసంతృప్తి యింట్లో అందరి ముందూ చూపిస్తుంది సీమ.

అత్తగారు గమనిస్తూనే ఉంది. రవి నిర్లక్ష్యం. సీమ చిటపటలు. సంసారంలో సుఖం పొందిన ఏ ఆడదీ అలా చిటపట లాడదని ఆమెకు తెలుసు. కోడలిపై జాలి కలిగింది ఆవిడకు.

ఆ మర్నాడు అత్తగారికి జ్వరం వస్తే చంద్రిక ఒక్కత్తే వంట చేస్తుంటే భార్యను పిలిచి 'చెల్లికి సహాయం చేయమన్నాడు' రవికిరణ్. కాని సీమ కదలలేదు. 'ఏం నేను లేకముందు చంద్రిక చేసేదట కదా! నేనొక్కదాన్నే కదా ఎక్కువయ్యాను ఈ యింట్లో' అంటూ మొండికేసింది. తల్లి అసలే జ్వరంతో ఉంది. తాము అల్లరి పడడం మంచిది కాదని కామ్‌గా ఆఫీసుకెళ్ళిపోయాడు కిరణ్. భర్తను ఏదో మాట అని బాధపెడితేగాని ఆమె మనసు శాంతించడం లేదు. "నన్ను పొగడండి. నాతో సరసంగా ప్రవర్తించండి. నేను, మీరు ఒకేలోకం అన్నట్లు నన్ను మరిపించండి" అని భర్తతో చెప్పుకోలేదు కదా.

ఆ రాత్రి భర్త దగ్గరకు వస్తే చిరాకని పించింది సీమకు. ఆమెను చూసినా అతనికి వెగటుగానే ఉంది.

ఇద్దరూ మూడీగా పడుకున్నారు. మధ్య రాత్రి కోరికకు తట్టుకోలేక భార్యను దగ్గరకు తీసుకున్నాడు. ఆమె విసిరి కొట్టింది. అతను పెద్దగా పట్టించుకోలేదు. తనపని ముగించుకుని నిద్రపోయాడు.

భార్య అనేసరికి అదో చులకన భావమేమో మగాడికి. భార్య ఆరు రోజుల లాంటిది. ప్రియురాలు ఆదివారపు రోజు లాంటిది.

ఆ రోజు ఆఫీసు నుండి రాగానే తల్లి అంది 'రవీ! నేను, మీ నాన్నగారు, చెల్లాయ్ నాలుగు రోజులు అక్కదగ్గరకు వెళతాం' అని అలాయినా భార్యాభర్తలు మరీ దగ్గరవుతారని ఆవిడ ఆశ.

'నేను రాను. నాకు పరీక్షలు దగ్గర పడుతున్నాయి' మొండికేసింది చంద్రిక. తల్లి ఎంత బ్రతిమాలినా వినిపించుకోలేదు. ఆమెకు పరిస్థితి వివరించడానికి కుదరదు. పెళ్ళి కాని పిల్ల. కూతురిని దంపతుల మధ్య పానకంలో పుడకలా వదిలేయక తప్పలేదు.

చంద్రిక మీద పీకల వరకూ కోపం వచ్చింది సీమకు. ఆ కోపం వాళ్ళు వెళ్ళిన వెంటనే చూపించేసింది. 'ఏం యూనివర్సిటీ ఫస్ట్ కొట్టేద్దామనుకుంటున్నావా?' వెటకారంగా అది. వంటలో ఆమెకు సహాయం చేయలేదు కోపంతో. తన పనులు తాను చేసుకొని కామ్‌గా కూర్చుంది సీమ.

ఆ రాత్రి చెల్లి వంటరిగా ఉంటుంది అని భర్త అంటే "ఉండే ఉండనీయండి" అంది పెడసరంగా.

మరో రెండు రోజులు గడిచాయి. చంద్రికకు జ్వరం వచ్చింది. వంట తానే చేసింది సీమ. ఇంటి పనీ చేసింది. బాగా అలసిపోయింది.

భర్త మీద కోపగించుకోడానికి టైమ్ లేదు. చంద్రిక దగ్గరే ఉండి ఏమి కావాలో చూసింది.

ఆ రాత్రి రవి భార్య యింకా పడుకోవడానికి రాలేదేమిటి అని చూశాడు. చెల్లెలి ప్రక్కనే పడుకుంది. చంద్రిక మీద చేయివేసి, అలసిన, ఆందోళన చెందిన ఆమె మొహం అద్భుతంగా కనిపించింది అతనికి. గదిలోకి మెల్లగా పిలిచి 'నీవు ఎంత అందంగా ఉన్నావో తెలుసా?' అంటూ మైకంగా కౌగిలించుకుంటే నలిగిన నైటీ ఫక్కున నవ్వింది. దువ్వుకోని తల తానే పువ్వులా మారింది.

భర్తవైపు అయోమయంగా చూస్తూ నమ్మలేనట్లు చేయి గిల్లుకొని 'నిజంగా' అంటూ అతన్ని అల్లుకు పోయింది సీమ.

(ఆంధ్రభూమి వీక్లీ, 07-04-94)

☆ ☆ ☆

# తాళికట్టిందే రంభ

లీల, భర్త రఘుతో కలిసి ఫంక్షనుకి వెళ్లిందన్న మాటేగాని, ఆ ఫంక్షనులో భర్త ప్రవర్తన, మిగిలిన ఆడవారి వైపు చూసే చూపులు, ఏవగింపు కలిగాయి. అయినా బయటపడదలచుకోలేదు. ఎందుకంటే ఆమెపై చూపించే ప్రేమలో ఆవగింజలో అరవయ్యోవవంతు కూడా తేడా ఉండదు. మరి రఘు ఈ మధ్యే మంచి రచయితగా పేరు తెచ్చుకున్నాడు. దానితో ఎక్కడకు వెళ్ళినా అతన్ని అభిమానులు చుట్టుముట్టడం పరిపాటే. ఆ అభిమానుల్లోని అందమైన సుందరాంగుల్ని చూస్తే లీలకు మనసంతా మండినట్లుంటుంది. వాళ్లందరూ భర్తకు దగ్గరవుతున్నారని ఒక బాధ. తాను అందంగా లేనని మరో బాధ. ఆమెను నిలువనీయదు.

లీల, ఇంటికి రాగానే గబగబా బట్టలు మార్చుకొని, ముభావంగా పడుకొంది. రఘు కూడా పక్కనే పడుకున్నా ఏదో ఆలోచనలోనున్నాడు. లీల ఆలోచనలన్నీ అతని చుట్టూనే తిరుగుతున్నాయి. అతను ఏం ఆలోచిస్తూ ఉంటాడు అని తీవ్రంగా ఆలోచించసాగింది. పార్టీలోని స్లీవ్‌లెస్ జాకెట్టు, బొడ్డు కిందికి చీరతో, తెల్లగా పాలరాతి బొమ్మలా మెరిసిపోయిన ఆ పద్మ గురించి ఆలోచిస్తున్నాడా? సన్నని నడుముతో, పెద్ద జడతో అందంగా కావ్య నాయికలా వెలిగిపోయిన ఆ మోహిని గురించి ఆలోచిస్తున్నాడా అని అనుమానం కలిగి మనసంతా వికలం అయిపోయింది. నల్లని తన శరీరం, చిన్న జడ, మొహం కళగానే ఉన్నా దాని పైనున్న పింపుల్స్ - ఇవన్నీ గుర్తుకి రాగానే తనంటే తనకే చిరాకు కలిగింది. తనే అలా అనుకుంటే తన గురించి భర్త మరెలా అనుకుంటున్నాడో అన్న ఊహ రాగానే, బాధ కలిగింది. నిద్రరాలేదు.

మరికొంచెం సేపటికి, రఘు ఆలోచనలనుండి బయటపడి, ఆమె వైపు జరిగి, నడుం మీద చేయివేసి ఆప్యాయంగా తనవైపు తిప్పుకొని తమకంగా కౌగిలించుకున్నాడు. ఆ కౌగిలింతలో శరీరం ఇమిడిపోయినా మనసులో ఆలోచనలు మాత్రం మరో విధంగా ఉన్నాయి. అంతకుముందు పార్టీలో పద్మతోనూ, మోహినితోను వళ్ళు మరచి నవ్వుతూ మాట్లాడిన భర్త మొహం గుర్తుకి రాగానే అతని చేతులు తాచుపాముల్లా అనిపించాయి. కాని వాటిని విడిపించుకొని దూరంగా జరగడానికి ఆమెకు ఏ కారణమూ కనబడలేదు. భర్త ముద్దులో ఎప్పటిలా రగిలే కోరిక, అతని స్పర్శలో రోజులాగే చక్కని లాలింపు, ఆమెను వివశురాలిని చేసాయి. కొంపతీసి నన్ను, పద్మలాగనో, మోహినిలాగనో ఊహించుకొని అనుభవించడంలేదు కదా అన్న ఊహరాగానే ఊపిరి ఆడనట్లయింది. తమాయించుకొని, అతనిని నెట్టేయబోయింది. ప్లీజ్ లీలా అంటూ రఘు అర్థించేసరికి ఆమెకు ఆ అవకాశమూ కలుగలేదు.



ఆరోజు పెళ్ళినుండి రాగానే బట్టలు మార్చేయబోతుంటే రఘువచ్చి వెనుక నుండి ఆమెను బంధించేసాడు. 'ఉంచుకోవోయ్ కాసేపు' ఆ పట్టుచీర. పెళ్ళిలోని వారేగాని నేను చూడకూడదా ఈ చీరలో నీ అందాలు అంటూ ఆమెను అలాగే ఎత్తి మంచం మీద వేసేసాడు. బాబోయ్, చీర నలిగిపోతుంది అనబోతుంటే, ఆ అవకాశం ఇవ్వకుండా పెదవులు మూసేసాడు. 'ఈ ఆకుపచ్చ పట్టు చీరలో వనకన్యలా ఉన్నావోయ్' అని మధురంగా అంటుంటే, విస్తుపోయి చూసింది లీల. కారణం అంతకుముందు పెళ్ళిలో ఆడవారిని, వారి చీరలను, నగలను, సోయగాలను, సరదాగా, తాను పక్కనుండగానే వారి ముందే పొగిడాడు. ఆ పొగడ్తలతో తనని పోల్చుకొని సిగ్గుపడింది లీల. వాళ్ళ అందాల ముందు, వాళ్ళ చీరల, నగల ముందు తాను వెలవెలబోతూనే ఉంది నిజానికి. భర్త కూడా అలాంటి అందమైన ఆడవారిని పెళ్ళిచేసుకొని ఉండవలసింది అని చాలాసార్లలాగే ఆరోజు కూడా అనుకుంది లీల. కాని ఆమె ఆలోచనలు ఏమీ పసిగట్టని రఘు మామూలుగానే ఉన్నాడు.

రఘు వ్రాసిన కథలలోని, వర్ణనలు చూస్తుంటే అమ్మాయిల అందాల గురించి చదువుతుంటే లీలకు ఎంతో సిగ్గుగా ఉంటుంది. తను అందంగా లేనని బిడియపడుతూ ఉంటుంది.

ఆ రోజు రఘుకి సన్మానం జరిగింది. ఆ సభకు ఎంతో మంది ఆడవారు, అతని అభిమానులు, సీతాకోక చిలుకల్లా అతని చుట్టూ చేరి మాట్లాడుతుంటే లీల చాలా గిల్టీగా ఫీలయింది. అంత మంది అందమైన ఆడవారి మధ్య రఘు గోపాలుడిలా

ఉన్నాడు. ఇంటికి రాగానే శాలువా తీసి లీలకు కప్పి, ఆమెను సంతోషంతో ఎత్తుకొని తిప్పేసాడు. సభలో అతను వ్రాసిన కథలలోని అందమైన ఆడవారి వర్ణనల గురించి మరీ మరీ విందేమో మొహం ముడుచుకుంది. అదేం అలా ఉన్నావు ఆశ్చర్యంగా అడిగాడు.

'నిజం చెప్పండి, నిజంగా నేనంటే మీకు ఇష్టమేనా? నేను అందంగా ఉండను కదూ! మీ చుట్టూ ఉండే అభిమానుల్లా ఉండను కదూ! నన్ను అందంగా లేనిదానిగా మీరు భావించుకుంటారా? అసలు నాలో ఏ ప్రత్యేకతా లేదు. నన్నెలా ప్రేమిస్తున్నారండి' అంటూ మనసులో బాధతీరేలా కళ్ళనీళ్ళు పెట్టుకుంది. భార్య ప్రవర్తనకు, మాటలకు మరింత ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు రఘు. మనసు అర్థం చేసుకున్నాడు. అనునయంగా అన్నాడు. పిచ్చి లీలా ఇదా నీ అనుమానం. ఇంతకాలం ఎందుకు చెప్పలేదు. నిజమే నేను అందమైన వారిని చాల ఆరాధిస్తాను, పొగుడుతాను, కథలలో ఎన్నో సుందర ప్రణయ సన్నివేశాలు, ఆడవారి అంగాంగ వర్ణనలు వర్ణిస్తాను. కాని అవన్నీ నా కలానికే పరిమితం మనసుకి కాదు.

నీలో ఏమీ ప్రత్యేకతలు లేవంటావా? నా భార్యవు కావడమే నీ ప్రత్యేకత. నీవేకాదు నీ స్థానంలో ఎవరున్నా నేను ఇలాగే ప్రేమిస్తాను. అందంతో నాకు పనిలేదు. నీవు నాదానివి. నా సొత్తు, అంతే. మనం బజారులో ఎన్నో ఖరీదైన వస్తువులు చూసి మెచ్చుకుంటాం. కాని మన తాహతుకు ఏది సరైందో అదే కొనుక్కుంటాం. అలాగే భార్యాభర్తలు కూడా. ఇంటికి తెచ్చిన వస్తువును వినియోగించకుండా షాపులో ఖరీదైన వస్తువుని తలచుకొని బాధపడుతూ కూర్చోముకదా!

నా చుట్టూ ఎంతో మంది ఉండవచ్చు. నా ఊహల్లో మరెంత మందో ఉండవచ్చు. కాని వాళ్ళెవరూ నీకు సరిపోరు. ఎందుకంటే నేను తాళికట్టి నా స్వంతం చేసికున్నది నిన్నొక్కదాన్నే కనుక. లోకంలో ఎంత మంది అందమైన వాళ్ళున్నా నాకనవసరం. ఎందుకంటే నీ మీదున్నట్లు నాకు వాళ్ళెవరిమీదా హక్కులేదు కాబట్టి. తాను వలచింది రంభా అంటారుకాని, నా దృష్టిలో తాళికట్టించుకున్నదే రంభకావాలి. ఆమె ఎలాగున్నా సరే. అప్పుడే సంసారం సుఖవంతమవుతుంది. కథ సుఖాంతం అవుతుంది' అంటూ ఆమెను మరింత గుండెలకు హత్తుకున్నాడు. ఆమె మనసులో బాధ పూర్తిగా పోయే లాగ.

(భూమి, 'సెంటర్ సెన్సేషన్', 14-11-89)

☆ ☆ ☆

# విరోధం

జనార్ధనం, కొడుకు శ్రీధర్ దగ్గరకు వెళ్ళాడు - తండ్రిని చూసిన శ్రీధర్ మొహం చిట్లించాడు. చిట్లించిన మొహాన్ని చూసిన జనార్ధనం బాధపడితే, శ్రీధర్ భార్య ఉమ మాత్రం చాలా సంతోషించింది. తన అత్తింటి వారంటే భర్తకు పడదని తెలుసు. ఆమెకు కావలసినది కూడా అదే. ఎప్పుడూ భర్త తన తల్లిదండ్రుల గురించి, అన్నదమ్ముల గురించి మంచిగా మాట్లాడినా, వాళ్ళకు సహాయం చేసినా ఆమె సహించలేదు. భార్యను ఎంతో మార్చాలని ప్రయత్నించి, విఫలుడై సంసారం నరకం చేసుకోలేక తానే మారిపోయాడు శ్రీధర్.

తండ్రి ఫోంచేసిన తరువాత అసలు సంగతి విని, తాడెత్తున లేచాడు శ్రీధర్. "నాన్నగారూ! మీరు నన్ను చదివించిన మాట వాస్తవమే. మీరు కేవలం నన్ను సంపాదించే మిషనుగానే భావించి ఉంటే అసలు పెళ్ళి చేయకుండా ఉండవలసింది. ఇప్పుడు మీ పిల్లలకోసం నా భార్యా పిల్లలను అవస్థపెట్టలేను. నా జీతం మాకే సరిపోతుంది. నా పొజిషన్‌ని బట్టి నేను లగ్జూరియస్‌గా ఉండక తప్పదు. ఇంకెప్పుడూ డబ్బు ప్రసక్తి నా వద్ద తేవద్దు. ఇకపై మీరు నాపై ఆశ పడవద్దు. ఇది నా మాట. అలాగే మీ ఆస్తులలో చిల్లిగవ్వ నాకక్కరలేదు" అని తెగేసి చెప్పేశాడు. తండ్రి చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయాడు. ఉమ మాత్రం భర్త మాటలకు తెగ మురిసిపోయింది. ఆఫీసుకి వెళ్ళి తండ్రికి ఉత్తరం రాశాడు శ్రీధర్.

"నాన్నగారూ! మిమ్మల్ని బాధపెట్టినందుకు మన్నించండి. మీరు సంపాదించింది చిన్న ఇల్లే అయినా, తాతగారు మా మగపిల్ల లందరికీ ఇచ్చింది చాలా పెద్ద స్థలం. ఆ స్థలం అప్పుడు అంత విలువలేనిదే గాని, ఇప్పుడు ఒక్కొక్కరికీ ఇచ్చింది అమ్మితే ఒక్కోలక్షపైనే వస్తుంది. ఇళ్ళ స్థలాలకు అంతలా పెరిగిపోయాయి ధరలు. మీకు జీవితంలో నేను చేయగలిగిన సహాయం అదే. మీ ఆస్తి నా కక్కరలేదు అనడం మీ మీద కోపంతో కాదు, ఉమ ఎదురుగా విరోధం నటించడమే. భార్యా భర్తలు కొన్ని కొన్ని విషయాల్లో ఒకరి మాటకు ఒకరు ఒడంబడి ఉండకపోతే సంసారాలు నిలవవు. ఉమను మార్చడం. నా తరం కాదు. నేను మీతో పెట్టుకున్న విరోధమే మీకు మేలు చేస్తుంది. నేను ఎలాగూ ఆ స్థలంలో ఇల్లు కట్టను. అది అమ్మి ఆ డబ్బు నేను ఇచ్చినట్లుగా చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకు వాడండి. నా ప్రేమ ఎప్పుడూ మీకు ఉంటుంది.

ప్రేమతో శ్రీధర్."

(ప్రభ, 12-10-88)

★ ★ ★

# మనం మారేదెప్పుడు

డియర్ స్మితా!

నువు రాసిన ఉత్తరం అందింది. అది చూసి - అబ్బ ఎవరెస్టు ఎక్కినంత సంతోషం కలిగింది. నీవు ఎదురుగా ఉండి నాతో మాట్లాడుతున్న అనుభూతి పొందాను. ఇక్కడి విశేషాలు వ్రాయమని వ్రాశావు. ఎన్ని వ్రాసినా ఇంకా ఎన్నో మిగిలి పోతూనే ఉంటాయి, ఇక్కడి విశేషాలు. నువు రచయిత్రివి కదా! మరినువ్వు సీరియల్ వ్రాసినట్లే నా ఉత్తరాలు కూడ కొన్ని కొన్ని విశేషాలతో, అన్నీ సశేషాలుగానే వ్రాస్తాను. సరేనా?

ఐర్లాండు దేశం ఎంత చిన్నదేశమో, అంత మంచి దేశం. అంతా పల్లెటూరి వాతావరణం ఇక్కడ పట్టుపరికిణీ కట్టుకొని, జడకుప్పెలు పెట్టుకొని, తలనిండాపూలతో, కాళ్ళకు పట్టీలతో ఊరంతా పరుగెత్తాలనిపిస్తుంది నాకు. కాని అమ్మో! ఎక్స్‌రే కిరణాల్లా ఎముకల్లోకి దూరి కొరుక్కుతినే చలి చూస్తుంటే, నేను వ్రాసే ఈ పెన్ కూడ చలికి వణుకుతోంది తెలుసా?

మా ఇంటి ప్రక్కన ఒక ఇంగ్లీష్ లేడీ ఉంది. బ్రతుకుతున్నది ఈ దేశంలోనైనా ఆ గర్వం, అహంకారం అంతా ఇంగ్లీష్ వారి వారసత్వమే! నన్ను చూసి ఏమంటుందో తెలుసా - "మీ ఇండియన్స్ చీర, జాకెట్టు వేసికొని నడుం అంతా ఎక్స్‌పోజ్ చేసి చాల సెక్సీగా కనిపిస్తారు" అని. వాళ్ళు గౌనులో సెక్సీగా కనబడతారు అని మనం అనుకుంటే - వాళ్ళు మరో విధంగా భావిస్తున్నారు మన గురించి! ఆవిడ అలా అంటే ఆశ్చర్యం వేసింది.

ఈరోజు టి.వి.లో ఆంధ్రలో అడక్కునే వాళ్ళను చూపించాడు. అది చూడగానే టి.వి.ని రెండు ముక్కలు చేసి, సిటింగ్ రూమ్‌లో కాలుతున్న ఫైర్‌లో వేసెయ్యాలని పించింది నాకు. నా బాధ అడుక్కునేవాళ్ళను చూపించినందుకు కాదు. ఇండియా అంతా మొత్తం అంతేనని ఇక్కడివాళ్ళు అభిప్రాయం ఏర్పరచుకున్నందుకు. అక్కడి రాజకీయాలను వింటూ మా ప్రక్కింటి ఏంజిలా ఏమందో తెలుసా? 'మీ ఇండియా బాగుపడాలంటే మరలా మా ఇంగ్లీషు వారు మీ దేశాన్ని పరిపాలించాలేమో"నని. ఆ మాటలోని నిజానిజాల సంగతి ఎలా ఉన్నా, అవి నా గుండెల్లో ముల్లుల్లా గుచ్చుకున్నాయి. చాల బాధ కలిగింది ఇంగ్లీషు వారికి ఇండియన్స్ అంటే ఎలాంటి అభిప్రాయమో చెప్పనా? ఇండియాలో అగ్రకులాలవారు, తక్కువ కులాల వారిని ఎలా చూస్తారో ఈ ఇంగ్లీషువారు ఇండియన్స్‌ని అలా చూస్తారు.

ఈ దేశంలో నాకు నచ్చిన సంగతులూ వున్నాయిలే! అందరూ సమానమనే భావం వీరి నరనరాల్లోనూ ఉంది. ఎవరికి ఎక్కువ ఉంటే వారు ఎక్కువ తింటారు. అంతేగాని లేనివారిని తక్కువగా చూడరు. ఇక్కడి స్త్రీలకు వరకట్నాల బాధలేదు. కులమతాల బేధం లేదు. అంతా ఒకటే కులం. పెళ్ళయిన స్త్రీలకు అత్తల ఆరళ్ళుగాని, ఆడబడుచుల దెప్పుళ్ళుగాని ఉండవు. నాకు ఇంకా నచ్చిన విషయం ఏమిటంటే, ఉమ్మడి కుటుంబాలు అంటూ ఆడదానికి ఊపిరి తీసుకునే చాన్స్ కూడా ఇవ్వని గొడ్డు చాకిరీ ఈ దేశంలో లేదు. ఆడదాన్ని కాలుకింద చెప్పులా అణగద్రొక్కే మగవాళ్ళుగాని, అసహాయస్థితిలో వున్న అబలను బలవంతంగా అనుభవించే నరరూపరాక్షసులుగాని ఇక్కడ లేరు. స్త్రీ-అబలకాని, సబలకాని-స్త్రీలాగే చూస్తారు. నాకు నచ్చని విషయాలు ఎన్నో ఉన్నా, నచ్చినవి మాత్రం ఇవి. మిగతా విశేషాలు తరువాత ఉత్తరంలో. ఉంటానిక.

నీ
శృతి

(వనితాజ్యోతి మంత్లీ, మార్చి 82)

* * *

# అంతర్యం

బయట విపరీతంగా మంచు పడుతోంది. వాతావరణం అంతా చల్లగా వుంది. గాలికూడా గడ్డ కట్టేస్తుందేమో అన్నంతగా చలివుంది. సెంట్రల్ హీటింగు వెచ్చదనంతో చలిని పారద్రోలటానికి ప్రయత్నిస్తున్నారు హాస్పటల్‌లోని స్టాఫ్‌తోపాటు రోగులు కూడా .పొంచివున్న శత్రువులా చలిగాలి తలుపు తీస్తేచాలు లోపలికి వచ్చేస్తుంది.

అప్పుడే ఆపరేషన్ ముగించి బయటికి వచ్చిన డాక్టర్ రఘురాంకి ఇండియానుండి ఫోన్ అనగానే పోయిన ప్రాణం తిగిరివచ్చినంత సంతోషం అయింది. ఆపరేషన్ చేసిన అలసటను కూడా మరిచిపోయి ఆ ఫోన్‌వైపు స్వర్గంవైపు నడుస్తున్నంత సంతోషంగా నడిచాడు. ఆ ఫోన్‌ని చూడగానే ఇండియాని, ఇండియాలోని తన ఇంటిని చూసినంత సంతోషం కలిగింది రఘుకి. ఎన్నో వేల మైళ్ళదూరంలోనున్న ఇండియా సంగతులు అంతచిన్న ఫోన్ మోసుకొనిరావడం ఓహో ఎంత అద్భుతం అనుకున్నాడు. టెలిఫోన్ ఆపరేటర్ ఫోన్ రఘుచేతికిస్తూ చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వుకి జవాబుని నవ్వుతూనే ఇచ్చి ఫోన్ అందుకున్నాడు అపురూపంగా, ఆప్యాయంగా.

ఎంత హుషారుగా ఫోన్ అందుకున్నాడో అంత నీరసంగాను ఆ సంగతి విని కూలబడ్డాడు. ఒకే ఒక్కమాట రఘురాంలోని ఉత్సాహాన్నంతా తుడిచిపెట్టేసింది. ఒళ్ళంతా చెమటలు పట్టినట్లయింది. అంత చలిలోను జేబులోని టిష్యూపేపర్ తీసికొని చెమట పట్టిన మొహం అద్దుకున్నాడు. ఆ నిమిషంలో ఆ పేషెంట్లప్రక్కన తనూ ఒక బెడ్‌మీద పడుకోవాలన్నంత నీరసంగా ఉంది. తాతయ్యకు ఒంట్లో బావులేదు అన్న మాటను అతని గుండె భరించలేకపోయింది. తాతగారు సీరియస్‌గా ఉన్నారట. రఘుని చూడాలని అంటున్నారట. వెంటనే బయలుదేరి రమ్మని ఫోన్.

తాతయ్యకు ఒంట్లో బాగులేదంటే అప్పుడే తాతయ్య శవాన్ని చూసినంత దుఃఖం వచ్చింది రఘుకి. ఆడపిల్లను పెద్దవాళ్ళు వేయికళ్ళతో జాగ్రత్తగా చూడాలిసుమా. ఆడపిల్ల అయితే వేరే ఇంటికి వెళ్ళిపోతుంది. కాని మగపిల్లవాడి భవిష్యత్తు పాడయితే కుటుంబం అంతా నష్టపోతుంది. అందుకే తల్లి, తండ్రిలేని రఘుని కంటిపాపలా పెంచారు రాఘవేంద్రరావుగారు. అలాంటి తాతయ్యకు ఒంట్లో బాగాలేదంటే చెప్పలేని వేదనగా ఆవేదనగా వుంది రఘుకి. ఆ నిముషంలో తాతయ్యను చూడాలన్నంత ఉత్కంఠగా వుంది.

'నెవ్వర్ హిట్ ఎ మేన్ వెన్ హి ఈజ్ డౌన్ యు మే ఫైండ్ హి ఈజ్ బిగ్గర్ దేన్ యు వెన్ హి గెట్స్ అప్'' అనే ప్రముఖ కవి మాటలు ఎప్పుడూ వినిపిస్తూ ఎంతో మంచి మార్గంలో తనను పయనింపజేసిన తాతయ్య అంటే ఎనలేని ప్రేమ రఘుకి. తల్లి, తండ్రి, గురువు, దైవం ఆఖరుకి తన ప్రాణం కూడ తాతయ్యే రఘుకి.

రఘు మొహంలోని విచార రేఖలు చూసిన కిజి అడిగింది. "ఎనీ బాడ్‌న్యూస్" అని. ఆవిడకు ఫోన్‌లోని సంగతి చెప్పి, నీరసంగా యింటివైపు బయలుదేరాడు రఘు.

బయట కురిసిన మంచువలన కారుని జాగ్రత్తగా డ్రైవ్ చేస్తూ నడుపుతున్నాడు గాని, మనసుని బేలన్సులో పెట్టుకోలేకపోతున్నాడు. మనసు ఎన్నోవేల మైళ్ళ దూరంలోనున్న తాతయ్య చుట్టూ పరిభ్రమిస్తుంది. వెళ్ళాలి, వీలైనంత త్వరగా ఇండియా వెళ్లి తాతయ్య ఎప్పటినుండో కోరుతున్న కోరికను తీర్చాలి అనుకున్నాడు రఘు. ఇంతకాలం ఇండియా వెళ్ళాలి. తాతయ్య కోరిక తీర్చాలి అనుకుంటూనే కాలం గడిపేశాడు. కాని యిప్పుడు తాతయ్య కోరిక తీరే రోజు దగ్గరకు వచ్చింది. ఇంత త్వరగా తాతయ్య సిక్ అవుతాడనుకోలేదు. అయినా మనిషి పుట్టిన తరువాత దేనికీ ఒకరోజు అనే నిర్ణయం లేదు. ఎవరి జీవితంలో ఏ రోజు ఎలా గడవాలో అలా గడవాల్సిందే. మనిషి విధిని ఎదిరించలేడు.

ఇండియా వెళ్ళగానే ముందు సినిమాహాలుకి శంఖుస్థాపన చేయాలి. అంతలో యమధర్మరాజు వచ్చి మీ తాతను తీసికొని వెళ్ళిపోతాను అని అంటే ధర్మరాజా! మా తాతయ్య కోర్కెను నేను తీర్చేదాకా మా తాతయ్యను బ్రతికించు. ఆ తరువాత మా తాతయ్యను నా స్వహస్తాలతో నీకు అప్పజెప్పమన్నా నాకు అభ్యంతరం లేదు. నేను తాతయ్య పేరున కట్టించబోయే సినిమాహాలులో తాతయ్య ఒక సినిమా అయినా చూసే వరమివ్వు అని వేడుకోవాలనిపించింది రఘుకి. మనసు ఎంత ఆరాటంగా ఉందంటే అల్లాఉద్దీన్ అద్భుతదీపం వచ్చి ఒక సినిమా హాలు కట్టించి యిస్తే ఎంత బావుణ్ణు అన్నంతగా వుంది. డబ్బుపెట్టి కొనలేని వస్తువు ఆరోగ్యం. రఘు చాలా సంపాదించాడు అమెరికాలో. కాని ఆ డబ్బు రాఘవేంద్రరావుగారి ఆరోగ్యాన్ని కాపాడగలదా? ఆయన పోతున్న ప్రాణాన్ని ఆపగలదా. డబ్బుకే అంత శక్తిఉంటే ప్రతివాళ్ళు ప్రాణాన్ని కొనేసుకుంటారు కదా?

రఘు మనసు అప్రయత్నంగా తాతయ్య దగ్గరకు వెళ్ళిపోయింది. కారు తనపని తాను చేసుకుంటూ ట్రాఫిక్‌ని తప్పించుకుంటూ, మంచు మీద జాగ్రత్తగా, మెల్లగా సాగుతుంది.

"బాబూ! రఘూ! మన ఊరిలో సినిమాహాలు లేదురా. ఎప్పటికయినా నీవు కట్టించి, ఈ ఊరి కష్టజీవులకు కొంచెం వినోదం కలిగించరా."

"అలాగే తాతయ్యా! నీవు చెప్పింది ఏది కాదన్నాను నేను".

"సినిమాహాలు అంటే మాటలు అనుకున్నావురా, మూటలు కావాలి. ఎంత ఖర్చవుతుందో తెలుసా? లక్షలు కావాలి"

"ఎంతయినా ఫరవాలేదులే తాతయ్యా. నీ కోరిక తీర్చడంకంటే డబ్బు ముఖ్యం

కాదు నాకు. నన్ను అమెరికా వెళ్ళనీ. నా సంపాదనతో ముందు సినిమాహాలు కట్టిస్తాను. ఒకవేళ అంత పెట్టుబడి పెట్టుకోలేకపోతే పార్ట్‌నర్స్‌ని పెట్టుకుందాం తాతయ్యా, సరేనా!''

"సరేరా, మనవడా!''

"తాతయ్యా! ఒకమాట అడుగుతాను ఏమనుకోకు, నీకు ఈ వయసులో సినిమా పిచ్చేమిటీ?'' నవ్వుతూ, వెక్కిరిస్తూ అన్నాడు రఘు.

"ఒరేయ్, నాకు కాదురా పిచ్చి. అయినా ఆ సినిమాహాలు అయ్యేసరికి నేను బ్రతికుంటానో ఉండనో కూడ. దేనికయినా ఒక తరంవారు త్యాగం చేస్తే గాని రెండవతరంవారు సుఖపడరు. నా పేరున కట్టించే సినిమాహాలు నా వయసువాళ్ళు అందులో సినిమా చూడకపోవచ్చు. చెట్లు చూడు నాటేది ఒకరు, ఫలాలు, ఫలితాలు అనుభవించేది మరొకరు, అలాగే సినిమాహాలు నాకోసం కాదురా. మన ఊరివారికోసం''

"ఎందుకు తాతయ్యా! నీకంత తాపత్రయం, ఊరివారిమీద''

"అదేమిట్రా తాపత్రయం అంటావు. మన ఊరిలో అందరూ బావుంటే ఎంత బావుంటుంది.''

"సినిమాహాలు వలన ఊరివారు బాగుపడతారా, తాతయ్యా''

"అవునురా ఊరిలో ఏదయినా వినోదం ఉంటే కొంతవరకు తాగుడు జూదం లాంటివి తగ్గించవచ్చును. కోడిపందాలు లాంటి ఆటలు ఆడి కొట్లాటలకు దిగుతున్నారు చాలమంది. కోడిపందాలలాంటి వినోదంకంటే సినిమా వినోదం మంచిది కదా! మనవాళ్ళు తాగుడు, జూదంలాంటివి తగ్గించి, సినిమావైపు మొగ్గుచూపితే, కొట్లాటలు డబ్బు నష్టపోవడాలు వుండవు కదా!''

"నిజమే, సుమా!''

"నిజమే, అని మెల్లగా అంటావేమిట్రా, మొన్న చూడు, మన పాలేరు తమ్ముడు, అతని భార్య పక్క ఊరి సినిమాకెళ్ళివస్తుంటే దారిలో పాపం, ఆ అమ్మాయిని పాడుచేసి అతన్ని చంపేసారు కదా, మరోసారి, కొందరి ఆడవాళ్ళ మెడలో నగలు కత్తి చూపించి దోచుకున్నారు కదా! అదే మనూరిలో సినిమాహాలు వుంటే ప్రజలు యింత నష్టపోరుగా. అందుకే నిన్ను సినిమా హాలు కట్టించమంటున్నాను.''

"అవును, తాతయ్యా! నీవు చెప్పింది చాలా నిజం. నీవు చాలా బాగా ఆలోచించావు. అందుకే పెద్దల మాట పెరుగన్నం మూట అన్నారు.''

"మరి నా కోరిక తీరుస్తావా''

"ఓ తప్పకుండా'' అని అనేశాడు గాని, అప్పటి నుండి ఉద్యోగపు హడావిడిలో

పడి కొంచం నిర్లక్ష్యం చేశాడు. రాఘవేంద్రరావుగారు వున్న ఆస్తి అంతా అమ్మేసి అయినా సినిమాహాలు కట్టించాలి అని రఘుతో చాలాసార్లు చెప్పారు. ఇప్పుడు ఆయనకు ఒంట్లో బావుండలేదు అంటే అయ్యో తాతయ్య కోరిక తీర్చలేకపోయానే అనే బాధ ఎక్కువయింది రఘులో.

డాట్‌సన్ తన యిల్లు వెతుక్కుంటూ వచ్చేసింది. తన యజమాని అయిన రఘు ఆలోచనలతో సంబంధం లేకుండా ఇల్లు రాగానే కారుకి, ఆలోచనలకు కూడా బ్రేక్ పడింది. ఎప్పుడూ ఎవరినీ దూషించవద్దురా రఘు. దూషణ, ఆకాశం మీదకు విసిరిన రాయి, రెండూ సమానమే. అవి విసిరినవారి నెత్తినే పడతాయి. జాగ్రత్త" అని తాతయ్య తనకు పాఠాలు యింకా నేర్పుతున్నట్లే అనిపించింది రఘుకి.

☆ ☆ ☆

రఘు మూడునెలలు శలవుపెట్టి ఇండియా వచ్చాడు. కోనసీమలోని ఒక పల్లెటూరు రఘుది. రఘు వచ్చేసరికి రాఘవేంద్రరావుగారి పరిస్థితి ఊహించిన దానికంటే భయంకరంగా ఉంది. ఆయనకు పక్షవాతం వచ్చి నోరు, చేతులు, ఒక కాలు పడిపోయాయి. ఇప్పుడు మాట్లాడలేరు తనకు కావలసినది కనీసం కాగితంమీద కూడా వ్రాసి చూపించలేరు. అటువంటి స్థితిలో తాతగారిని చూసిన రఘుకి ఎంతో దుఃఖం వచ్చింది. ఎంతో డబ్బుంది ఆయన దగ్గర. కాని ఆయనకు సేవ చేసేందుకు ఇంట్లో ఎవరూలేరు నౌకర్లు జీతం తీసి కోవడంలో చూపిస్తున్న శ్రద్ధ ఆయనకు కావలసినవి సమకూర్చడంలో చూపించడం లేదు. ఆయన ఉన్న గదంతా చీదరగా, శుభ్రం లేకుండా ఉంది. ఆయన మనోభావాలు కనిపెట్టి అనుకూలంగా ప్రవర్తించాలనే తలపు ఆ యింట్లో ఎవరికీ లేదు.

మనుమడిని చూసిన రాఘవేంద్రరావుగారిలో ఎంతో ఉత్సాహం, మరెంతో నిరుత్సాహం కలిగాయి. మనుమడు మరలా తిరిగి వెళ్ళిపోతే తనను చూసే దెవరు అనే ప్రశ్న ఆయనలో "వటుడింతై, అంతయి అన్నట్లు పెరిగిపోసాగింది. అంతేకాదు పూలు కాయలు కాయడం కూడా మొదలుపెట్టింది.

"నేను వచ్చేశాను, నీకేం భయం లేదు. నీ అవసరాలు, కోరికకూడా తీరుస్తాను" అని రఘు తాతగారికి ఎంతో లాలనగా చెప్పాడు. ఆయన వినగలుగుతున్నారుగాని, సమాధానం చెప్పలేక పోతున్నారు. డాక్టరువచ్చి చాలా జాగ్రత్తగా ఆయనకు ట్రీట్‌మెంట్ యిస్తున్నారు. రఘు అయితే మరీ పసిపాపలాగే చూస్తున్నాడాయనను.

"తాతయ్యా! రేపు మంచిరోజు. రేపే సినిమాహాలుకి శంఖుస్థాపన చేయిస్తాను. నీ కోరిక తీరుస్తాను" అని తాతయ్య మొహంలో చూశాడు రఘు, ఆ మొహంలో ఆనందాన్ని వెతుకుతూ, కాని రఘు ఆశించిన ఆనందం ఆయన మొహంలో కనిపించలేదు. పైగా మబ్బులు కమ్మిన చంద్రుడిలా ఉందా మొహం.

"తాతయ్యా! మనకంటే ముందు మరొకరు సినిమాహాలుకి ప్రారంభోత్సవం చేసేసి, అప్పుడే సగం కట్టేశారని దిగులుగా ఉందా. చూడు, ఎంత డబ్బు ఖర్చయినా సరే, దానికంటే ముందు మనహాలు తయారయ్యేలా చూస్తాను. నీవు దిగులు పడకు" అన్నాడు అనునయంగా. కాని ఈసారికూడ ఆయన మొహం వెలగలేదు.

"నీ ఆరోగ్యం బాగవదు అని బాధగా ఉందా. నిన్ను అమెరికా కాదు, చంద్రమండలానికి తీసికెళ్ళి అయినా బాగుచేయించు కుంటాను నేను వచ్చేశాను కదా దిగులెందుకు" అన్నాడు రఘు, ఈసారి ఆయన మొహంలో సంతోషం కనిపించలేదు. రఘుకి "తాతయ్య మనసులో ఏముందబ్బా" అనే ఆలోచనలో పడ్డాడు. అదిసరే తరువాత ఆలోచించవచ్చులే అని శంఖుస్థాపన ఏర్పాట్లు చూడడానికి తాతయ్యతో చెప్పి వెళ్ళాడు, రఘు. రఘుకి యిప్పుడు ఆ సినిమాహాలు పూర్తయితేగాని తాతగారి మొహంలోకి కళరాదు అని అర్థం అయింది. చాలాత్వరగా కట్టించేయాలి అనేపట్టుదల అతనిలో ఎక్కువయింది. "మధ్యాహ్నం వచ్చి శంఖుస్థాపన జరిగే స్థలానికి నీవు ఎలాగైనా రావాలి. నేను తీసికెళతాను" అన్నాడు రఘు, రాఘవేంద్రరావు గారు మాత్రం రఘు ఊహించని విధంగా తలఅడ్డంగా ఊపారు, రఘుకి తాతయ్య ఎందుకు అలా అంటున్నాడో బోధపడలేదు. పైగా బాధకలిగింది. "ఇన్ని రోజులు ఎందుకు కట్టించలేక పోయానా అనే బాధ మరింత ఎక్కువయింది. తాతయ్యకు మాటవస్తే ఎంతబావుణ్ణు అనుకున్నాడు. తనకు ఎన్నో నీతులు నేర్పిన నోరు అలా మూగబోవడాన్ని సహించలేక పోతున్నాడు రఘు.

తల దువ్వుకుందాం అని అద్దంవైపు అడుగులు వేసాడు రఘు. అద్దం ముందు తాతగారు వ్రాసిన అక్షరాలు చక్కగా కనిపంచాయి. గుండ్రటి హేండ్ రైటింగ్‌లో వ్రాసి, అద్దానికి అంటించిన మాటలు ఎంతోనచ్చాయి. రఘుకి. "ఇఫ్‌యు వాంట్ టు బి బ్యూటిఫుల్, స్పెండ్ ఎ మినిట్ బి ఫోర్ ది మిర్రర్, ఫైవ్ బిఫోర్ యువర్ సోల్ అండ్ ఫిఫ్టీన్ బిఫోర్ గాడ్" అని గాడ్ అన్న మాటల్ని ఎర్రింకుతో అండర్‌లైన్ చేసాడు. ఇదివరకు ఆయన అన్నీ నోటితో చెప్పేవారు. ఎక్కడ ఏమంచి మాట చదివినా అది రఘుకి చెప్పకుండా ఉండేవారు కాదు. ఇప్పుడు అలా వ్రాసిపెట్టిన మాటల్ని చూసి కించిత్‌బాధ కలిగింది, రఘుకి రఘూ నీవు వచ్చేసరికి నానోరు, నా చేయి ఉండదు. అందుకే ముందుగానే వ్రాసి ఉంచాను సుమా అని చెప్పినట్లు అనిపించింది. మనసు బాధగా మూలిగింది. మంచిమాటలు విని వదిలివేయవద్దు సుమా, ఆచరించి చూపించు అని కూడా హెచ్చరించేవారు ఆయన.

ఆ మాటల్ని మరలా మననం చేసుకుంటూ, మరలా తాతగారి దగ్గరకు వెళ్ళాడు రఘు. ఆయన మొహం వాడిపోయి ఉంది ఏదో చెప్పాలని తాపత్రయ పడుతున్నారు, చెప్పలేక పోతున్నారు. ఆయన్ని చూస్తుంటే జాలి వెల్లువలా పొంగుకు వచ్చింది, రఘులో.

ఒక్కసారి పరకాయి ప్రవేశం చేసి, ఆయన మనసులోకి వెళ్ళివచ్చి, ఆయన మనసుని గ్రహించగలిగితే ఎంతబావుణ్ణు అనుకున్నాడు. బాధకలుగుతున్నా చెప్పలేని పసిపాపలా ఉంది ఆయన మొహం. జీవిత చరమాంకంలో ఉన్నారు. ఆయన కోరిక ఏమిటో చివరి ఆశయం ఏమిటో ఎందుకు విచారంగా ఉన్నారు. ఆయన మనసులో మాట ఏమిటో? సినిమాహాలు కట్టిస్తున్నందుకు సంతోషిస్తున్నారా లేదా? సంతోషించడం లేదని, నోరు చెప్పకపోయినా, మొహం చెపుతూనే ఉంది.

ఇంతలో బయట ఎవరో వచ్చారు, వారు రాఘవేంద్రరావుగారి దగ్గరకు వెళ్ళారు. వారి మాటలను బట్టి అంతకు ముందు పరిచయంలాగే అనిపించింది రఘుకి. "బాబుగారు. మీరు మాకు సహాయం చేస్తానన్నారు, కొండంత ఆశతో వచ్చాము. మా కొడుకు, కోడలు మమ్మల్ని వెళ్ళగొట్టారు. కష్టపడడానికి శక్తిచాలదు తినడానికి తిండిలేదు. మా గోడు మీ దగ్గరచెప్పుకోవాలని వచ్చాము. మీరు యిలా ఉన్నారని తెలియదు. మీలాంటి వారికి రావలసిన జబ్బుకాదు అంటున్నారు వారు.

ఇలాగే పేదవాళ్ళు ఏదో కారణంతో రావడం, తాతగారు సహాయంచేయడం రఘు ఎరుగనిదికాదు. ఒకసారి యిలాగే ఆస్థంతా లాక్కుని అల్లుడు, కూతురు ఇంటిలో నుండి వెళ్ళగొట్టారని చెబితే వారికి రాఘవేంద్రరావుగారు రిక్షాకొనిచ్చారు. గుడిసెవేసుకొనడానికి డబ్బులిచ్చారు. అదే విదేశాలలో అయితే పెద్దవారు ఇలా పిల్లలమీద ఆధారపడవలసినపనిలేదు. పెద్దలు కోడళ్ళను హింసించి చంపాల్సిన పని అంతకన్నా లేదు. అక్కడ ఎవరిబ్రతుకులు వారివే పెళ్ళి అవగానే పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు ఇటు అత్తింటికి అటు పుట్టింటికిగాని చెందకుండా హాయిగా వేరేకాపురం పెట్టుకుంటారు. అత్తల ఆరళ్ళుగాని, కిరోసిన్ మంటలుగాని ఉండవు అని సంతోషించేవాడు రఘు కాని ఇలా కోడళ్ళు అత్తమామలను తరిమేస్తారని వాళ్ళు ముసలి వయసులో నానాతిప్పలు పడతారు అన్న ఊహ ఇంతకాలం రాలేదు రఘుకి. మనదేశంలో పెద్దలు పిల్లల్ని పెంచితే పిల్లలు పెద్దయి తల్లిదండ్రుల్ని పెంచాలి. ఎవరి కుంటుంబ బాధ్యత వారిదే. విదేశాలలోలాగా ప్రభుత్వపు ప్రమేయంగాని వారిచ్చే డబ్బుగాని ఉండదు. కలిసిమెలిసి ఉండవలసిన రెండు తరాలవారు కొట్లాడుకుంటే ఇలా వీధిన పడకా తప్పదు. ఒక జంట నష్టపోకా తప్పదు.

ఆ వచ్చినవారు కొడుకు, కోడలు పెట్టిన కష్టాల గురించి, పెట్టని తిండి గురించి చెప్పుకుపోతున్నారు కన్నీటితో. అంతకుముందు తాతగారు చెప్పిన సంగతులు గుర్తుకొచ్చాయి రఘుకి. ఒక కుటుంబంలోని దంపతులు కొడుకు కోడలు సరిగా చూడడంలేదని విడిగా బ్రతుకుతుంటే దుండగులు పనివాళ్ళు ఏకమయి వారిని చితకబాది ఆస్తి పట్టుకుపోయారని ఆస్తి ఉన్నా అనుభవించలేని ఆ ఆస్తి వలన ప్రాణాలు పోగొట్టుకున్న వారి కథవిని తాతగారు ఆనాడు ఎంతో బాధ పడిపోయారు. అదే తనవారి దగ్గర వుంటే ఆ నష్టం జరగకపోయేది కదా అని ఎంతో విలవిలలాడిపోయారు.

తాతయ్యదగ్గరకు వెళ్ళివాళ్ళకు ఏమయినా డబ్బుయిచ్చి పంపనా అని అడిగాడు రఘు. అలాగే అని తల ఆడించారాయన. వెంటనే వెయ్యిరూపాయలు తెచ్చి వారిచేతిలోపెట్టాడు రఘు. అప్పుడు మనుమడి వైపు సంతోషంగా చూశారాయన మరోగంటలో మరో ముసలి జంట వచ్చింది. రఘుకి ఆశ్చర్యం వేసింది.

చీమలపుట్టలో నుండి చీమలు వచ్చినట్లు వీళ్ళందరూ ఎక్కడి నుండి వస్తున్నారా అని తాతగారు, ఇదివరకు పెళ్ళిళ్ళు కానివారికి, నిరుద్యోగులకు మాత్రమే ధనసహాయం చేయడం తెలుసు రఘుకి. ఈ సారి వచ్చిన దగ్గర నుండి చూస్తున్నాడు. ధనసహాయం కావాలంటూ ముసలివారే వస్తున్నారు కాని, పడుచువారు రావడంలేదు. తాతయ్యా ముసలిగా అయినందుకు ముసలివారి పైనే జాలిపడుతున్నాడా అనుకున్నాడు. రఘు ఇలా ఎంతమందికి ఇస్తే ఎంతమంది బాగుపడతారు. ఉన్న ఆస్తి అంతా ఇచ్చినా వారి బ్రతుకులు బాగుపడతాయా? ఆకలికి తెలుసా? వారికి ముసలి వయసు వచ్చిందని, వారు కష్టపడలేరని ఆకలి దాని డ్యూటీ అది చేస్తుంది.

తాతయ్యా! వారికి డబ్బులేమైనా ఇవ్వనా, మరలా అడిగాడు రఘు. ఇమ్మన్నట్లు తల ఊపితే మరో వెయ్యి తెచ్చి ఇచ్చాడు రఘు. వారు ఆ డబ్బు తీసికుంటుంటే తాతయ్య మొహంలోకి పరిశీలనగా చూశాడు రఘు, ఆయన మోహంలో ఎనలేని ఆనందం, చెప్పలేనంత తృప్తి. అప్పుడు వెలిగింది రఘు బుర్రలో ట్యూబులైటు, తాతయ్య విచారానికి కారణం తెలిసిపోయింది. తాతయ్యా సినిమాహాలు మానివేసి వృద్ధులకు విశ్రాంతి గృహం కట్టించమంటావా? అని అడిగాడు.

ఆయన అవును కాదు అని అనలేదు గాని ఆయన కళ్ళు ఈసారి రఘుకి జవాబు చెప్పాయి. ఆ కళ్ళు వేల వేల కాంతులతో మెరిసిపోతూ, మురిసిపోతూ రఘువైపు చూశాయి. "అదే సుమా నా కడసారి కోరిక. సినిమాహాలు కానే కాదు." అంటూ "అలాగే తాతయ్యా. తప్పక నీ కోరిక తీరుస్తాను. సినిమా హాలు కాదు కావలసింది, వృద్ధులకు విశ్రాంతి గృహం అని అర్థం అయింది" అన్నాడు సంతోసంగా.

రాఘవేంద్రరావుగారి మొహంలో చెప్పలేనంత ఆనందం తొంగిచూసింది. కళ్ళతోనే "శభాష్ మనవడా" అన్నారు. ఆ సమయంలో తాతగారు చెప్పే అబ్రహం లింకన్ మాటలు గుర్తుకి వచ్చాయి రఘుకి. "ఐ డోంట్ నో హు మై గ్రేండ్ పాదర్ వజ్ అయామ్ మచ్ మోర్ కన్‌సెర్న్డ్ టునో వాట్ హిజ్ గ్రేండ్ సన్ విల్ బి" అని రఘు హుషారుగా బయలుదేరాడు, బయటకు. సినిమా హాలు ప్లాన్‌ని, మార్పించి హోమ్ ఫర్ ది ఎజ్డ్‌కి ప్లాన్ తయారు చేయించడానికి.

(జయశ్రీ, 28-01-92)

☆ ☆ ☆

# శాస్తి

కళ్యాణి వాళ్ళ పక్క ఇంటిలోనికి బాపు బొమ్మలాంటి సుశృత అద్దెకు దిగింది. ఆ అమ్మాయిని చూడగానే పై(ప్రాణాలు పైకే పోయాయి కళ్యాణికి.

ఆ అమ్మాయి ఎవరో శ(త్రువు కాదు పైగా స్నేహమయి కూడాను. కాని వచ్చిన చిక్కల్లా భర్త ఫణితోనే. ఫణికి తన భార్య తప్పించి లోకంలోని ఆడవాళ్ళంతా రంభలే. కళ్యాణి కూడ తక్కువ అందగత్తె కాదు. పెళ్ళికి ముందు రాజహంసలా కనబడిన కళ్యాణి ఇప్పుడతని కళ్ళకు రాక్షసిలా కనబడుతోంది. తన భర్త ఎదుటి ఆడవారిని ఆవురావురు మంటూ చూస్తుంటే కళ్యాణి ఒక్కొక్కసారి అల్లరిపెడుతుంది. ఒక్కొక్కసారి సర్దుకుపోతుంది.

సుశృత గురించి భర్తలో, అతని మనో భావాలు ఎలా ఉన్నాయోనని కనిపెట్ట సాగింది కళ్యాణి. అతను ఏమీ సంతోషించలేదు. పైగా చిరాకుపడి, ఆ మహాతల్లి ఎక్కడా ఇల్లు దొరకనట్లు ఇక్కడ తగలబడిందా, ఏం చేస్తాం మరి, ఇది మన స్వంత ఇల్లు కాదుకదా, సరేలే, నీవుగాని ఆమెతో ఎక్కువగా మాట్లాడవద్దు. ఆవిడ మా ఆఫీసులోనే చేస్తోంది. అందరూ ఆవిడను తిరుగుబోతు అంటారు. అంటూ హేళనగా మాట్లాడేసరికి 'అమ్మయ్య' అనుకుంది.

బహుశా తిరుగు బోతు (స్త్రీలతో కలిసి తిరిగే ఎవరిని చూసినా వీధిలోనివారు వారిని అలాగే అంచనా వేస్తారని కాబోలు ఆవిడతో ఎక్కువ మాట్లాడవద్దన్నాడు భర్త అని కూడా అనుకుంది.

సుశృత మా(త్రం కళ్యాణి ఆమెను ఎంత దూరంలో పెట్టాలని చూస్తుంటే అంత దగ్గరగా రావడానికి (ప్రయత్నిస్తోంది. భర్త లేనప్పుడు మా(త్రమే కళ్యాణి సుశృతతో మాట్లాడేది. ఆ అమ్మాయి ఆప్యాయంగా మాట్లాడుతుంటే మరీ టచ్ మీ నాట్ లా ఉండలేక పోయింది. ఒకటి రెండుసార్లు వాళ్ళిద్దరూ ఫణి కళ్ళలో పడగా ఫణి చేత చివాట్లు కూడా తింది. అయినా సుశృత ఫణి లేని సమయాల్లో వచ్చి మాట్లాడి వెళుతూనే ఉంది.

ఒకసారి సుశృత వాళ్ళ అమ్మవాళ్ళింటికి వెళ్ళింది. ఫణి అంతకు మూడు రోజులముందే కేంప్‌కి వెళ్ళాడు. ఇంక ఒక్కర్తే ఉండటం ఎందుకని కళ్యాణి తల్లి దగ్గరకు బయలుదేరింది.

ట్రయిన్ ఎక్కుతున్నదల్లా త్రాచుపాముని చూసినట్లు టక్కున ఆగిపోయింది కల్యాణి. అదే ట్రయిన్ నుండి నూతన దంపతులు ఉన్నంత సంతోషంగా నవ్వుకుంటూ ఫణి, సుశృత దిగుతున్నారు. క్షణకాలం విస్తుపోయిన కల్యాణి సంగతంతా గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చి గబగబ వారి దగ్గరకు వెళ్ళింది. ప్లాట్‌ఫారమ్ అనికూడ ఆలోచించకుండా తన మెడలో మంగళసూత్రం తీసి సుశృత మెడలో వేసేసి, వెంటనే ట్రయిన్ ఎక్కేసింది కల్యాణి.

(భూమి, 'నేటికథ', 27-02-87)

☆ ☆ ☆

# శత్రువు

మాకు విశాఖ నుండి వేరే ఊరు ట్రాన్స్‌ఫర్ కావడంతో, అక్కడకు వెళ్ళి పోయాం. మావారు టెలిఫోన్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తారు. మేము మంచి సెంటర్‌లో ఇల్లు తీసుకున్నాం.

మేము వెళ్ళిన కొత్తలోనే చుట్టుప్రక్కలవాళ్లు అందరూ వచ్చి పరిచయం చేసుకున్నారు. అందరినీ చూసి చాలా మురిసిపోయాను, నేను. కాని ఆ మురిపెం ఎంతో కాలం నిలువలేదు. రోజూ ఎవరో ఒకరు ఫోన్ చేసుకోడానికి వచ్చేవారు. నాకు అస్తమానం తలుపు తియ్యడం, వేయడంతోనే సరిపోతుంది. పిల్లలు బాగా చిన్నవాళ్ళు కావడం, నిద్రట్లో వాళ్ళు ఉలిక్కిపడి లేవడం, మరలా నిద్రపోవడం జరుగుతోంది.

మాకు ఫోన్ ఫ్రీ అని తెలిసి మరింత మంది రావడం మొదలుపెట్టారు. నాకు ఒంట్లో బావుండక పడుకోవాలన్నా, ఏదైనా కుట్టుకోవాలన్నా, నాకిష్టమైన పెయింటింగ్ చేసుకోవాలన్నా రోజులో ఎప్పుడూ ఫోన్ కోసం వచ్చే పోయేవాళ్లతో కుదిరేది కాదు.

కొందరైతే ఎస్.టి.డి. మాట్లాడేయడం మొదలుపెట్టారు, నన్ను అడక్కుండానే. మా చుట్టాలలో ఎవరికీ ఫోనులు, ఆ ఊరిలో ఇంకా ఎవరూ ఫ్రెండ్స్ లేకపోవడంతో నేను అసలు ఫోన్ ఉపయోగించను. అందరూ వచ్చి ఎస్.టి.డి. చేసేస్తున్నారని మావారు ఎస్.టి.డి. కనెక్షన్ తీయించేశారు. ఒక్క నిట్టూర్పు విడిచి ఊరుకున్నాను. నా మొహమాటంతో వచ్చే పోయేవాళ్లు నన్ను ఇరకాటంలో పెట్టేస్తున్నారు. పైగా ఎదురింటి వాళ్ళనే కాక, పక్కవీధిలోని తమ చుట్టాలని పిలవమని, మాకు ఫోన్లు. 'ఎవరైనా ఒక బోయ్‌ని పెట్టుకుందామా, అందరికీ రోజు కబుర్లు పెట్టడానికి' అని మా వారు జోక్ వేశారు. అలా వద్దు గాని ఫోన్ చేసుకోవడానికి అర్ధరూపాయి ధర పెడతాను అని చెప్పాను. ఆయన వద్దంటున్నా అలాగే పెట్టాను. దానితో ఇంకా రష్ ఎక్కువయిపోయింది. ఎందుకంటే బయట ఫోన్ కాల్ కంటే, నా దగ్గర చాలా చవక.

మా వారితో చీవాట్లు తిని, గవర్నమెంటుని మోసం చేస్తున్నావంటూ లెక్చర్లు విని ఆ పని మానేశాను. నేను చేయని తప్పులకు నాకు శిక్ష. వీధిలో నా మీద ఎన్నో నిందలు. సమాయానికి పిలవలేదనో వస్తుంటే వెంటనే తలుపు తీయడం లేదనో. పరోపకారం నా కంట్లో కారం అయి కూర్చొని, వీధిలోని వారి వ్యాఖ్యానాలతో కళ్ళల్లో నీళ్ళు తిరగడం ప్రారంభించాయి. ఆ ఫోను నాకు పరమ శత్రువు అయిపోయింది ఇప్పుడు.

ఫోను లేక కొందరికి బాధ, ఉండి నాకు బాధ. ఆ తరువాత మా వీధిలో ఒకరిద్దరికి ఫోన్ కనెక్షన్లు వచ్చాయి. అమ్మయ్య అనుకున్నాను. కాని మా యింటికి రద్దీ తగ్గలేదు. కారణం మాది ఫ్రీ ఫోను. ఆ మిగిలిన ఫోను ఉన్నవాళ్ళు వాళ్ళింటికి ఎవరినీ రానివ్వడం లేదట. ఇంక నా గోల వినలేక మా వారు ఫోన్‌కి తాళం వేసి ఆ తాళం ఆఫీసులో పడేసారు. దీనితో మా ఇంటికి ఎవరూ రావడం లేదు, కనీసం స్నేహితుల్లా అయినా.

ఒకరోజు మా పాప, రెండేళ్ళది మేడ మీదనుండి పడిపోయింది. నా మీది కోపంతో మా పక్కింటివాళ్ళు నన్ను పలకరించలేదు. నేను పాపను భుజాన వేసికొని, ఇంటికి తాళం వేసి మా వారికి ఫోన్ చేయడానికి పబ్లిక్ ఫోన్‌కి బయలుదేరాను. టెలిఫోన్ మీద ఉన్న కోపం, అందులో పనిచేస్తున్న మా వారి వైపు మళ్ళింది.

(భూమి, 'నేటికథ', 06-07-92)

☆ ☆ ☆

# బహుమతి

కోకిల వసంతంలోనే కూస్తుంది. మల్లె వేసవిలోనే పూస్తుంది. అవి సీజనల్ కాని ఎలక్షన్లు ఏప్రిల్ 29వ తేదీలాగ అప్పుడప్పుడు వస్తుంటాయి. హడావిడి చేస్తుంటాయి. పండుగలు తిథుల ప్రకారం రావడం సహజం. అవి మార్చడం మన తరంకాదు. ఎలక్షన్ల పండుగ తిథుల ప్రకారంగా రాదు. దానికి కావలసింది నిధులు, ప్రతినిధులు. 'నీ ఓటు నాది' అంటూ అభ్యర్థులు వీధివీధి తిరిగేస్తారు. వాగ్దానాల కూరలు తరిగేస్తారు. ఈ పండుగ, కుల, మత, తారతమ్యం లేనిది. వయోపరిమితి ఉన్నది.

అన్ని ఊర్లకులాగానే ఆ ఊరికి ఎలక్షన్లు వచ్చేసాయి. ఎవరెవరో వస్తున్నారు. ఏవేవో ఉపన్యాసాలు దంచేస్తున్నారు. మాటలతో అవతల పార్టీ వాళ్ళను దించేస్తున్నారు. ఏవో బహుమతులు అందించేస్తున్నారు.

అక్కడ ఒక పిల్లవాడు మట్టి పెంకులో అన్నం తినడం చూసి, ఎంతో జాలిపడి, పోటీదారులు మాటలతోపాటు వాడలోని అందరికీ పెద్ద టిఫిన్ ప్లేటు సైజులో నున్న స్టీలు కంచాలు కొని బహుమతిగా ఇచ్చారు. కంచాలు చూసిన సంబరంలో ప్రజలు బుట్టలు కొద్దీ పూలుతెచ్చి ఉపన్యాసాలు ఇచ్చే నాయకులమీద పూలవాన కురిపించేసారు. "తక్కువ వాగ్దానాలు చేసిన వారికే ఓటువేస్తే, తరువాత తక్కువ నిరుత్సాహ పడవచ్చు" అన్న విషయం తెలియని ఆ పల్లీయులు ఎక్కువ వాగ్దానాలు చేసి, కంచాలు పంచిన వారికే ఓటు వేసి గెలిపించేశారు. ప్రజలపని ఓట్లు వేయడమే! నోట్లు కూడబెట్టుకోడం నాయకుల పని. పదవి వారికి తరగని బంగారు గని!

ఆ పల్లెలోని ప్రజలు అమాయకులు, లోకం తెలియనివారు. నిజానికి తాముండే దేశం పేరేమిటో కూడ వారికి తెలియదు. వారికి తెలిసింది ఒక్కటే ఇది కలికాలం అని. ఆకలికి హలం అని. ఆ పేదవారు ఒక పోటీ దారుని వాగ్దానాల హోరు జోరున చెవుల్లో మ్రోగి, వాళ్ళలో ఆశలు చెలరేగి, అవన్నీ పిచ్చాళ్ళలా నమ్మేసారు. అవి పిచ్చుకగూళ్ళులాంటివని గాలివీస్తే పడిపోతాయని వారు అనుకోలేదు. వాళ్లకు అన్నిటికంటే నచ్చిన వాగ్దానం, 'మీ ఆకలి తీరుస్తాం' అన్నమాట. అమాంతం వారికి పొట్టనిండిపోయినట్లే పట్టరాని ఆనందం కలిగింది.

అయిదేళ్లు గడిచాయి. ఈ అయిదేళ్ళలోను, నాయకులు ఇచ్చిన నున్నని కంచాల్లో అన్నం మాత్రం సున్నా అయికూర్చుంది. గోడకు వేసిన సున్నంలాంటివే వాగ్దానాలని మాత్రం గ్రహించారు వారు. నాయకులు ఇచ్చిన కంచాలు తళ తళ ఏ మాత్రం తగ్గలేదు. నిజానికి వాటిని వాడే అవసరమే రాలేదు వారికి. ఎంత కష్ట పడ్డా కడుపు నిండని రోజులు. పెరుగుతున్న ధరలతో పరుగుతీయలేక నీరసించిపోయారు

వారు. పంటలు వచ్చే సమాయానికి ఏదో ఒక విధమైన నష్టాలే చవిచూసారు. అడవులలో అయితే లేడికి పులి శత్రువు. పాముకి ముంగిస శత్రువు. కాని సభ్య సమాజంలో నున్న మధ్యతరగతి మనుషులకు తోటి మానవులు, జంతువులూ శత్రువులే. అంతేగాదు. పంట మీదనున్న పొలాన్ని ముంచే వరద, మింటి నుండి కావలసిన సమయానికి రాని వర్షం, వేసవిలో రగిలే నిప్పు, అనుకోకుండా వచ్చే తుఫాను, అనారోగ్యాలు ఇవన్నీ శత్రువులే!

మరలా ఎలక్షన్లు వచ్చాయి. ఈసారైనా కలెక్షన్ల మోజులో పడక మంచి సెలక్షన్ చేసికోవాలనుకున్నారు ప్రజలు. కాని పోటీకి నిలిచేటప్పుడు ప్రతీ అభ్యర్థి మంచివాడేనని, తరువాత రాజకీయ చదరంగంలో పావులైపోయి రెక్కలు తెగిన పావురాలైపోయి, వైకుంఠపాళీలో పాములనోట పడకుండా ప్రయత్నించినట్లు పదవిపోకుండా తాపత్రయ పడడంలోనే రోజులు గడిపేస్తారని వారు గ్రహించలేదు. అందుకే ఈసారి ఓటు అడగడానికి వచ్చిన ఆ పాత అభ్యర్థిని చాటుగా తిట్టుకున్నారు.

ఓట్లు కోసం మరలా బహుమతులు పంచడం మొదలైంది.

ఆ అమాయకులు ఏం తెలుసుకున్నా తెలుసుకోకపోయినా ఒక్కటి మాత్రం తెలుసుకున్నారు. మొదటిసారి మనం మోసగింపబడితే అది అవతలివారి తప్పు. కాని రెండవసారి కూడ మోసగింపబడితే అది మన తప్పే అని అందుకే బహుమతులు అందుకోలేదు సరిగదా, వాగ్దానాలు చేసినవారికే మంచి బహుమతిని అందజేశారు. పువ్వులు అనుకొని బుట్ట ఆత్రంగా తెరచిన పాత నాయకులు వన్నె తరగని, వంకర తిరగని అయిదేళ్ళయినా అలాగే ఉన్న ఆనాడు తాము పంచిన కంచాలు చూసి అవాక్కయ్యారు.

(భూమి, 'నేటికథ')

☆ ☆ ☆

# కష్టాలు

పనంతా అయిన తరువాత, భర్త బయటకు వెళ్ళగానే ఫోన్ అందుకుంది దేవకి.

"మీనాక్షి! పనయిందా, నిన్న బజారుకి వెళతానన్నావు వెళ్ళి వచ్చావా, మిగిలిన సంగతులేమిటి? అడిగింది దేవకి.

"దేవీ, నువ్విక్కడ ఉన్నప్పుడు ఇద్దరం సరదాగా షాపింగ్‌కి వెళ్ళేవాళ్ళం. నీవు యిల్లు కట్టుకుని వెళ్ళిపోయావు. నాకు బజారుకి తోడు వచ్చేవాళ్ళే లేరు" మీనాక్షి అంది.

"అది సరేగాని, ఇంతకీ కల్యాణి, విషయం ఏమైంది. వాళ్ళ అమ్మా, నాన్నల ఆచూకీ ఏమైనా తెలిసిందా. పాపం ఆ అమ్మాయి ఏడుపు గుర్తొస్తే, మనసు చెరువయిపోతుందనుకో..."

"నిజమే దేవకీ, కల్యాణి రాత దేవుడలా ఎందుకు రాసాడో మరి. ఇంకా ఆచూకీ ఏమీ తెలియలేదు. పైగా ఆమె మీద ఆస్తికోసం హత్యాప్రయత్నం జరుగుతోందిట."

"అయ్యో రామా! ఆ చిట్టితల్లికి ఎన్ని కష్టాలో. పావని విషయం ఏమైంది మీనా!"

"ఆస్తిలో వాటా అంటూ పావని వాళ్ళ అన్నయ్యల మీద కోర్టుకు వెళ్ళిందిగా, పావనికి వాళ్ళ అన్నయ్యలతో సమానంగా ఆస్తి వచ్చేసింది. ఇప్పుడు చాలా సంతోషంగా ఉంది పావని."

"నాకూ సంతోషంగా ఉంది. పోనీలే మీనాక్షీ. పావనికి ఇంక కష్టాలు తీరినట్లే, భర్త చేసిన అప్పులన్నీ తీర్చుకొని హాయిగా ఉంటుందిలే. ఇక ముందయినా జాగ్రత్తగా ఉండి, భర్త చేతికి ఆస్తి అందకుండా చెయ్యాలి. అప్పుడు పెళ్ళిలో ఇచ్చిన ఇల్లు అమ్మేసాడుగా."

"ఒక విధంగా చూడాలంటే, అన్నలకంటే పావనికే ఎక్కువ ఆస్తి ముట్టింది తల్లి దండ్రుల నుండి. పెళ్ళి ఖర్చు కట్నం, పురుళ్ళ ఖర్చులు, పెట్టుపోతల ఖర్చులుపోగా ఆస్తిలో మగ పిల్లలతో సమానంగా వాటా వచ్చింది. మన కాలంలో పుట్టిన ఆడవాళ్ళకంటే, ఈ కాలంలో పుట్టిన ఆడవాళ్ళు ఒక విధంగా అదృష్టవంతులే."

ఫక్కున నవ్వింది దేవకి. ఇంతలో భర్త రావడంతో ఫోన్ కట్ చేసింది. ఆ మర్నాడు, మరలా మీనాక్షికి ఫోన్ చేసింది పావని.

"మీనా! సుమ సంగతి ఏమైంది. మెడికల్ కాలేజీలో సీటు వచ్చిందా?"

"లేదు దేవీ. ఎమ్‌సెట్ పేపర్ లీక్ అయ్యిందట. అది తేలే వరకు ఏదీ తెలియదు."

"అయ్యో! రామా! సుమ అన్యాయం అయిపోతుందేమో. సుమ సంగతి అలా ఉంచు. విమల అత్తగార్ని పెడుతున్న కష్టాలు విన్నావంటే, నీకు దుఃఖం ఆగదనుకో. అలాంటి బ్రతుకు పగ వాళ్ళకు కూడా వద్దు. రేపు మనకోడళ్ళ చేతిలో మన పరిస్థితి ఏమిటో?"

'ఏం ఫరవాలేదులే మీనా, మనకు ఓల్డేజి హోములున్నాయిగా."

ఇంతలో తలుపు చప్పుడయింది.

"దేవకీ, ఆ ఫోన్‌లో మాట్లాడడం ఆపి, ముందు ఇలారా. మన టి.వి. బాగయింది. తీసికొని వచ్చాను. ఇంక ఆ టి.వి. సీరియల్స్ గురించి, మీనాక్షిగారిని అడగక్కర్లేదు..." అన్న భర్త మాటలు విని రిపేరయి వచ్చిన టి.వి. వైపు ఇంట్లో నుండి పారిపోయిన కొడుకు దొరికినంత సంబరపడిపోతూ చూసింది దేవకి.

(ఆంధ్రభూమివీక్లీ, 28-09-2000)

☆ ☆ ☆

# ముగ్గుల పోటీ

"లతా! లతా! ఈ వార్త విన్నావా?" లోపలికి వస్తూ అన్నాడు వేణు.

"ఏం వార్తండీ?" అంటూ లోపలి నుండి వచ్చింది లత.

"మనమిద్దరం మొగుడూ పెళ్ళాలమట" ఆమెను ఓరగా చూస్తూ అన్నాడు.

"ఆహా అలాగా! నాకింతవరకూ ఎందుకు చెప్పలేదు మీరు?" హాస్యధోరణిలో తనూ అంది.

"అది సరే! ఆంధ్రభూమిలో ముగ్గుల పోటీ పడింది. నీవు పాల్గొనాలి. ఇది పేపరుమీద కాదు. ఆ పత్రిక యాజమాన్యంవారు పెరేడ్ గ్రౌండ్స్‌లో నిర్వహిస్తారట. నేలమీద అక్కడ వెయ్యాలట" బూట్లు విప్పుకుంటూ అన్నాడు.

"అయ్యో! నాకు ముగ్గులు వేయడం, మీకు పెగ్గులు తాగడం అలవాటులేదు కదండీ"

"అలవాటు లేదంటే ఎలాగోయ్ తాళి కట్టించుకోవడం, మొగుడితో కాపురం చేయడం అలవాటు వున్నాయా పెళ్ళికి ముందు చెప్పు. అవి ఎలా అలవాటు అయ్యాయో ముగ్గులు వేయడం అలాగే అలవాటు చేసుకో. నీకు ఎలాగైనా బహుమతి వచ్చి తీరాల్సిందే."

"బహుమతి తప్పకుండా వస్తుంది. మీరు జడ్జిగా వుంటే" అంది.

"నేను జడ్జిగా వుండనక్కర్లేదు. అయినా నీవు పోటీలో పాల్గొంటే నేను జడ్జిగా ఎలా వుంటాను? పట్టుదల వుంటే అదే వస్తుంది బహుమతి."

"పట్టుదల కాదు. ముగ్గుపిండి కావాలి ముందు" అంది.

"ఓ అలాగే. ఎంతయినా తెచ్చి పడేస్తాను. చలిలో నీకు కాఫీ కావాలంటే చేస్తాను. ముగ్గుల పుస్తకాలు తెస్తాను. ఇంకా టైము మూడునెలలుంది. ఆ బహుమతి నీకు వచ్చి తీరాల్సిందే" అన్నాడు.

భర్త తాపత్రయం చూసి నవ్వుకుంది లత.

భర్తను తనే లేపుతోంది రోజూ. నిద్ర లేచిన దగ్గర నుండి కొత్త కొత్త ముగ్గులు సేకరించడం, వాటిని తెల్లవారు జామున వాకిట్లో వేయడం అదే పని అయిపోయింది.

ముగ్గులు మొదలుపెట్టిన మొదట్లో కాళ్ళు లాగడం, ఆయాసం రావడం జరిగేవి. ఇప్పుడు అలవాటయిపోయి అంతా బాగానే వుంది. పగటి నిద్ర తగ్గింది. రాత్రుళ్ళు హాయిగా నిద్రపోతోంది.

ఆ మర్నాడు పేపరు చదువుతూ "ఈ సంగతి చదివావా లతా! ఈ సంవత్సరం వరదలవలన పంటలు పాడయితే అయ్యాయిగానీ దోమలు తగ్గాయట! రేపు ఎదురింటి వారి మగ కుక్కతో పక్కింటివారి ఆడకుక్కకు పెళ్ళి చూపులట" సరదాగా అన్నాడు.

"అది సరే! ఇంతకీ ముగ్గుల పోటీ ఎప్పుడు" అంది నవ్వుతూ.

"లతా! నిజం చెప్పేస్తాను. ఏమీ అనుకోకు. అది ముగ్గులపోటీ కాదు. మేడ్ ఫర్ ఈచ్అదర్ పోటీ. పేరెడ్ గ్రౌండ్స్‌లో మనం పాల్గొనడానికి ఇప్పుడు నీ శరీరపు బరువు సరిపోతుంది. ఈమధ్య విపరీతంగా లావయిపోతుంటే దాన్ని ఖర్చు లేకుండా అదుపు చేసే మార్గం సంక్రాంతి పుణ్యమాని వచ్చింది. అలనాటి ఆ ముగ్గులో ఈనాటి వరకూ ఎంత పరమార్థం వుందో చూడు. ఆడవాళ్ళకు ఎక్సర్‌సైజు, కళను అభివృద్ధి చేసుకోవచ్చు. చిన్న చిన్న పురుగులు ముగ్గువలన ఇంటిలోకి రావు" అన్నాడు.

"ఈ విషయం నేనూ గమనించానండీ. నాకు ముగ్గుల్లోనే కాదు మేడ్ ఫర్ ఈచ్ అదర్‌లోనూ బహుమతి రాకపోయినా ఫర్వాలేదు. నేను బరువు తగ్గాను. అదే నాకు తృప్తి" అంది.

(ఆంధ్రభూమి వీక్లీ, 15-02-96)

☆ ☆ ☆

# కాలక్షేపం

హల్లో!

"హల్లో! ఎవరు కావాలండి మీకు."

"అది 63531 నెంబరేనండి. నేను ఆది శేషయ్యను."

అవునండి. మీకు ఎవరు కావాలి?

"శంకరంగారు కావాలండీ."

"శంకరంగారు మా నాన్నగారండి. ఊరెళ్ళారండి."

"అయ్యయ్యో నాకు చెప్పనేలేదే!"

"మాకూ చెప్పలేదండి. కోపగించి చెప్పకుండా వెళ్ళిపోయారు."

"అడిగానని అనుకోకునాయనా! ఎందుకు వెళ్ళి పోయారు?"

"ఇంట్లో ఆయనకు తోచక ఏదో గొడవ లేపుతారండి."

"తోచక అని నీవే అంటున్నావు కదా! ఆయనా, నేను రిటైర్ అయినవాళ్ళం, పైగా ఏవో జబ్బులున్న వాళ్ళం."

"అది నిజమేననుకోండి. అది మా తప్పు కాదు కదా! నేను, నా భార్య ఉద్యోగాలకు వెళ్ళిపోతాం. చాలీ చాలని జీతాలు. పిల్లలను చూసుకోవాలి, పెళ్ళయిన చెల్లెళ్ళ పురిటి ఖర్చులో, పండగ ఖర్చులో భరించుకోవాలి. ఇవన్నీ ఆయన ఆలోచించాలి కదండి."

"రిటైర్ అయి మీకు భారంగా వున్న ఆయన ఏం ఆలోచిస్తారు?"

"ఏం ఆలోచించకే రోజూ ఏమీ తోచదు అంటూ ఏవో తెలియని నెంబర్లకు ఫోన్లు చేసి ఉత్తుత్తి కబుర్లు మాట్లాడి..."

"దాని వలన ఆయనకూ కాలక్షేపం, ఇటు నాలాంటి వాళ్ళకూ కాలక్షేపం అవుతుందిగాని, నష్టం కాదుగా."

"ఎందుకు కాదండి. ఈ రోజుల్లో అన్ని ధరలతోపాటు టెలిఫోన్ ధరలూ పెరిగాయిగా. ఆయన చేసే కాలక్షేపానికి, నాకు నెలకు అయ్యే బిల్లు అయిదు వందలు."

"నిజంగా!"

"నిజంగానండి. ఆ అయిదు వందలు సంపాదించినప్పుడు ఫోన్ చేయమన్నాను. కోపం వచ్చి వెళ్ళిపోయారు."

ఆ తరువాత ఆదిశేషయ్య టెలిఫోన్ ఖర్చులకు మెల్లగా ట్యూషన్లు మొదలు పెట్టాడు. ఇప్పుడాయనకు ఫోన్ చేయడానికి తీరికా లేదు, అనారోగ్యమూ లేదు.

(ఆంధ్రజ్యోతి వీక్లీ, 22-12-89)

☆ ☆ ☆

# హోదా

ఆ ఇంటికి నాలుగు పోర్షన్లు. నాలుగు పోర్షన్లకూ కాంపౌండ్‌వాల్, గేటు మాత్రం ఒకటే. సాధారణంగా మధ్యతరగతి కుటుంబీకులు కాపురం ఉంటూ ఉంటారు. ఆ నాలుగు పోర్షన్లలోని ఇల్లాళ్ళు భర్తలు ఆఫీసులకు వెళ్ళగానే మహిళా మండలిని మొదలు పెట్టేస్తారు. అక్కడ అన్నీ చాడీలు, ఎదుటి వారి మీద ఏడుపులు, లేనిపోని కబుర్లు, అర్థం పర్థం లేని ఆలోచనలే సాగుతూ ఉంటాయి.

కామాక్షి పుట్టింటికి వెళ్ళి నాలుగు రోజుల తరువాత ఆరోజే రావడంతో అర్జంటుగా మిగిలిన మహిళలు సమావేశమైపోయారు, కామాక్షి ఇంటిలో.

“రండి, రండి వచ్చారా? ఇంకా రాలేదేమిటా, ఆలస్యానికి కారణం ఏమిటాని ఆలోచిస్తున్నాను'' అంటూ పలకరించింది కామాక్షి.

“ఆ... ఆ. ఎప్పుడెప్పుడు వద్దామా అని మాకూ ఆరాటంగానే ఉంది. ఏదీ ఇప్పుడేగా పని తెమిలింది'' సత్యవతి అంది.

“ఏం, కామాక్షీ ప్రయాణం కులాసాగా సాగిందా?, మీ అన్నయ్య, వదిన బావున్నారా? రేణుక అడిగింది.

“ఆ బాగానే వున్నారు. వాళ్ళకేం గుండ్రాయిల్లా వున్నారు. ఈ మధ్య కలర్ టి.వి. కూడా కొనుక్కున్నారు'' అక్కసుగా అంది.

“మీకూ ఉందిగా కలర్ టి.వి.'' సునంద అంది.

కామాక్షి ఉపోద్ఘాతం మొదలుపెట్టింది.

“ఆరోజు నేను వెళ్ళానా? ఉత్తరం వ్రాయకుండా వెళ్ళానుకదా! నేను రిక్షా దిగుతుంటే పై డాబా మీద నుండి మా వదిన చూసింది కాబోలు, ఒక్క నిమిషంలో పరుగు పరుగున కిందకు వచ్చి, నా చేతిలో సూట్‌కేస్ అందుకొని కాళ్లకు నీళ్లిచ్చి ఎంతో ప్రేమ ఉన్నట్లు హడావిడి చేసేసి, ఊరికే నవ్వేస్తూ పలకరించింది. మనసులో నేనంటే మంటే, పైకి మాత్రం అలాగే పళ్ళికిలిస్తూంది.

“వంటలు అవీ బాగా ఒండిపెట్టిందా?'' సత్యవతి అడిగింది. ఏం, ఎందుకు వండదు? వండిందిలే. ప్రతీ పూటా ఏదో స్పెషల్ చేస్తూనే ఉండేది. రుచిగానే వండేదనుకో. ఏదో వంటలు బావున్నాయని అన్నానని, ఊరికే వడ్డించేసి, నాతో బలవంతంగా తినిపించేసేది. తిని, తిని, తిన్న తరువాత ఆయాసంతో అరగంటవరకూ కదలలేకపోయేదాన్ని. మా వదినది ఎంత కుళ్ళు బుద్ధో చూడు, అలా ఆయసపడేదాన్నని,

వక్కపొడికావాలా, తమలపాకు కావాలా అని హేళనగా అడిగేది. నాకు ఒళ్ళు మండిపోయేదనుకో.

సినిమాకు వెళదాం, వెళదాం అని వెధవ ఫైటింగు సినిమాలకు, క్లబ్ డాన్సులున్న సినిమాలకు తీసికెళ్ళి నా బుర్ర తినేసిందనుకో. ఎంత విసిగించేసిందో."

"చీరేమీ పెట్టలేదేమిటి?" సునంద అడిగింది.

"పెట్టిందిలే. అయిదువందలు పెట్టి. చీర బాగానే ఉందనుకో. రేప్రొద్దున్న మా ఆడబడుచు ఆ చీర చూసి మా వదిన నీకు ఎలాంటిది కొందో, నీవూ నాకు వదినవే కాబట్టి అలాంటిదే కొను అని అనాలని, నాతో మా ఆడబడుచు కోసం 500 ఖర్చు పెట్టించాలని ఆమె కోరిక. అప్పుడు గాని మా వదినకు నాపై ఉన్న కడుపుమంట చల్లారదు."

"నాలుగురోజులుంటానని, వారం రోజులుండిపోయావేం కామాక్షి" రేవతి ప్రశ్నకు మరింత నిప్పులు తొక్కిన కోతిలా తయారైంది కామాక్షి.

'ఇంకా నయం ఇంకా ఉండమని గొడవ. రాకరాక వచ్చావు. మరో నాలుగు రోజులుండు కామాక్షి అని ఒకటే నస. ఇక్కడ నా సంసారం అంతా పని మనిషి పాడు చెయ్యాలని, మా ఆయన వేరే ఆడవాళ్ళ కోసం వెంపర్లాడాలని ఆవిడ కోరిక. నా సంసారం నాశనం అయితే సంతోషించేది' కోపంగా అంది.

"స్వీట్సు, కాఫీ తెస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది కామాక్షి. మిగిలిన ముగ్గురు గుసగుసలాడేసారు. 'మంచితనంలో కూడా చెడును వెతికే గుణం కామాక్షికే చెల్లింది. మన దగ్గర బాగానే ఉంటుంది. వాళ్ళ వదిన పేరెత్తితే మండి పడుతుంది. పాపం ఆవిడ చాలామంచిది కదా!' అని.

'ఆవిడా మంచిదే, ఈవిడా మంచిదే. ఆడబడుచు అనే హోదాయే మంచిది కాదు' అంది సునంద.

(ఆంధ్రభూమి పేపర్, 02-10-91)

☆ ☆ ☆

# అపార్థం

అక్కడ ఫంక్షన్ హడావిడిగా ఉంది. ఆవురావురమనిపించేలాను ఉంది. సుమ, సుధీర్, సుమంత్ అటు యిటు తిరుగుతూ, వచ్చిన వారిని నవ్వుతూ పలకరిస్తున్నారు.

సుబ్బారావుగారి భార్య సుమతి కూడా చక్కగా అలంకరించుకుని, అందర్నీ నవ్వుతూ ఆహ్వానిస్తోంది. అది షష్టిపూర్తి ఫంక్షన్. కాని అక్కడ సుబ్బారావుగారు మాత్రం లేరు.

అనంత్ బలవంతం మీద వచ్చిన శ్రీను మాత్రం తనకు అక్కడ ఎవరూ తెలియక బిక్కు బిక్కు మంటూ అటూ యిటూ చూస్తున్నాడు. అనంత్ శ్రీనును వదిలేసి తన ఫ్రెండ్స్‌తో హాయిగా నవ్వుతున్నాడు. మధ్య మధ్యలో శ్రీనుని తమ దగ్గరకు రమ్మంటున్నాడు గాని శ్రీను వాళ్ళతో కలవ లేకపోతున్నాడు. ఆఖరికి బలవంతంగా అనంత్ దగ్గరకు వెళ్ళి "అనంత్! ఇంతకీ ఫంక్షనుకి ముఖ్యమైన వ్యక్తి అయిన సుబ్బారావుగారు ఏరి" అని అడిగాడు శ్రీను.

ఓ, అదా! ఆయనకు మేజర్ ఆపరేషన్ ఉందట అని ముక్తసరిగా చెప్పేసి మరలా అటుతిరిగిపోయాడు.

భర్తకు అక్కడ ఆపరేషన్ అవుతుంటే సుమతిగారేంటి, ఇక్కడ పిల్లలతో అలా ఎంజాయ్ చేస్తుంది. ఆవిడసలు భార్యేనా, భర్త చనిపోయాడా, పోనీ విడాకులు తీసుకుందా అని అనుకుందామంటే అది షష్టి పూర్తి ఫంక్షన్. వారం ముందే కార్డులు పంచారు. ఊరంతా ఇదెక్కడి మనుష్యులురా .బాబూ అనుకున్నాడు శ్రీను.

ఫంక్షను చాలా వరకూ అయిపోయింది. రాత్రి తొమ్మిదిన్నర సమయంలో వచ్చిన సుబ్బారావుగారిని చూసి నోరు ఆవళించాడు శ్రీను. ఇంతకీ సుబ్బారావు గారు డాక్టరని, ఆయన అర్జంటుగా మేజర్ ఆపరేషన్ చేయవలసి వచ్చిందని శ్రీనుకి తెలియదు.

(ఆంధ్రభూమి వీక్లీ, 08-02-2001)

☆ ☆ ☆

# వ్యాపార దక్షత

"ఏమోయ్ రాముా, ఆమధ్య ఏదో వ్యాపారం చేస్తాను - చురుకైన కుర్రాడు తోడుగా వుంటే బావుంటుందన్నావుగా, ఇదిగో ఈ కుర్రాడిని చూడు" అన్నాడు చంద్రం.

"అబ్బే లాభం లేదు" అనుకుంటూ వెళ్ళిపోయాడు రాముా.

మరో నాలుగు రోజుల తరువాత మరోకుర్రాడిని చూపించాడు చంద్రం. "అబ్బే ఇతనూ లాభం లేదు. సన్నగా రివటలా యింత పొడుగ్గా ఉన్నవాడు బిజినెస్‌కి ఏం పనికి వస్తాడు. ఏమనుకోకు చంద్రం, ఇతనూ వద్దు" అన్నాడు రామం.

ఇంతలో కనకయ్య ఎదురయ్యి "చూడు రాముా! వ్యాపారానికి కుర్రాడు కావాలన్నావుకదా, మా చుట్టాలబ్బాయి ఒకడున్నాడు. దగ్గర దగ్గర ఇరవై సంవత్సరాలుంటాయి. పనికివస్తాడేమో చూసుకో" అన్నాడు కనకయ్య.

అతనూ నచ్చలేదు రామానికి.

ఆ కనకయ్యే పాపం, రాముాకి సహాయం చేద్దామనే ఉద్దేశ్యంతో మరోఅబ్బాయిని చూపించాడు ఈసారి కూడా 'సారీ' అనేసాడు రాము.

పోనీ చిన్న ఆడపిల్లలను చూడమంటావా అన్నాడు కనకయ్య "బాబోయ్ ఆడపిల్లే" అన్నాడు. రాము అదేదో ఆటంబాంబులు అన్నమాట విన్నంత భయంగా.

చివరికి ఎలాగైతేనే రాము తనకు తానే ఒక కుర్రాడిని వెతికి పట్టుకున్నాడు. ఆ అబ్బాయి పొట్టిగా మరుగుజ్జులా ఉన్నాడు. ఆ అబ్బాయిని చూసి అందరూ రాముా బిజినెస్‌కి ఈ మరుగుజ్జు ఏం పనికొస్తాడు. అనుకున్నారు. కాని వారికి తెలియని విషయం ఒక్కటే. రాము చేసేది పూలవ్యాపారం. దానికి చిన్న చేతులున్నవాడైతే మూర కొలిచేటప్పుడు తక్కువ పడుతుంది. అదే పొడుగు కుర్రాళ్ళయితే మరీ ఎక్కువ కొలుస్తారు. ఆడవాళ్ళయితే తల్లో పూలు పెట్టుకోడానికి ఆశపడతారని రాము ఉద్దేశ్యం.

(ఆంధ్రభూమి వీక్లీ, 17-05-2001)

☆ ☆ ☆

# జబ్బు

'ఏమండీ'

'ఏమిటి విమలా'

"కాలి చిటికెన వ్రేలు నొప్పండి"

"నీకు అలా కావాల్సిందే"

"అయ్యో అదేమిటండి"

"మరి పతిదేవుణ్ణి రోజూ కరుణించడంలేదుగా. అందుకే పనిష్మెంటు"

"ఛీ. మరీ మీకు సిగ్గులేదు"

"ఎలాగు సిగ్గలేని వాడినయ్యానుగదా, ఏదీ ఇలారా..."

"చాల్లెండి" సిగ్గుపడుతూ అక్కడి నుండి వెళ్ళిపోయింది విమల.

☆ ☆ ☆

"ఏమండీ"

"ఎందుకండీ"

"ఈసారి రెండు వేళ్ళు నొప్పండి"

"ఓ అంతేకదా! ఇంకా ఏమిటో అనుకున్నాను" ఎనాల్జిన్ వేసుకో.

"వేసుకుంటూనే ఉన్నాను. ఒక గంట తగ్గుతుంది. మరలా మామూలే. ఆ కాస్త నొప్పి భరించుకోలేకపోతే ఎలా చెప్పు. ఇద్దరి పిల్లల్ని కన్నావు. పురిటి నొప్పులకంటే అది ఎక్కువదేమీ కాదుగా"

'కాదులెండి... ఆ నొప్పులైతే బాధపడ్డా పిల్లలు కలుగుతారు. ఓర్చుకుంటాము"

"ఈ నొప్పికి కూడ పిల్లలు కలుగుతారు ఓపికపట్టు"

"మీరు జోక్స్‌తో సరిపెట్టేస్తున్నారు. నాగురించి పట్టించుకోవడం లేదు"

☆ ☆ ☆

మరో నెల్లాళ్ళ తరువాత

"విమలా, విమలా"

" ఆ ఇక్కడ పడుకున్నాను. ఎందుకు?

"పగటిపూట నిద్రపోయి వళ్ళు పెంచుకోవద్దని చెప్పానా?

నిద్రపోవడం లేదండి. కాలునొప్పి భరించుకోలేక పడుకున్నాను."

"మొన్న రిప్రజెంటేటివ్ ఇచ్చిన ఏంపిసిలిన్ వేసుకోలేదా?"

"అన్నమైనా మానేస్తున్నానుగాని, మందులు మానడం లేదు. అయినా నొప్పి తగ్గలేదు"

"తగ్గిపోతుంది లే"

"మీరలా అంటుండండి నాకాలు పోయే వరకు. హాస్పిటల్‌లో ఎంతో మందికి ట్రీట్ చేస్తారు. నన్నే నెగ్లట్ చేస్తారు మీరు"

"హాస్పిటల్‌లో వాళ్ళను చూసినందుకు డబ్బులిస్తారు. నీవేమిస్తావు పైగా నేను సంపాదించిందంతా ఖర్చు పెట్టేస్తున్నావు"

"అవునవును నాకోసమే అంతా ఖర్చుపెట్టుకుంటున్నాను."

"పోనీ మాకోసమే లేవే. ఏదీ ఒకసారి నవ్వు."

"అబ్బా ఈ కాలునొప్పి ఇంకా పైకి పాకిందండి. నడవలేక పోతున్నాను"

"నడవలేకపోయినా ఫరవాలేదు. గుడ్డివాళ్ళను చూసి సంతోషించు. వాళ్ళు కళ్ళు లేవని బాధపడతారు. వాళ్ళు ప్రపంచాన్ని చూడలేరు. నీకు కాళ్ళు నొప్పయినా కళ్ళు బాగానే ఉన్నాయిగా"

"ఛ అవేం మాటలండి"

"కాలు నొప్పి గలవాళ్ళు కళ్ళులేని వాళ్ళకంటే మెరుగంటున్నాను. మందులు వేసుకో."

"అయ్యొయ్యో బాధ భరించుకోలేక పోతున్నానండి."

"హాస్పిటల్‌కి వచ్చి చూడు విమలా ఎంతమంది ఎన్ని విధాల బాధపడుతున్నారో, కొందరికి కాళ్ళుండవు. కొందరికి చేతులుండవు."

"ఇప్పుడు వారందరి గొడవ ఎందుకు నా సంగతి చూడండి"

"వారి బాధలకంటే నీ బాధ ఎక్కువ కాదు అంటున్నాను. అన్ని టెస్టులు చేయించానుగా. ధైర్యంగా ఉండు"

☆ ☆ ☆

"ఏమండీ, నా కాలు తీసేసారండీ ఎలా నడవనండి" వెక్కి వెక్కి ఏడ్చింది విమల.

"విమలా సాయంకాలం అలా బయటకు వెళదామా?"

"నేనా? ఈ కాలుతోనా?"

"ఏం, కాలులేనంత మాత్రాన రాలేవా? అదిగో కర్రకాలుందిగా. లేదంటే నిన్ను ఎత్తుకొని తీసుకు వెళతాను. నా కాళ్ళే నీ కాళ్ళనుకో"

ఆ సాయంకాలం - "అదిగో చూడు ఆ పిల్లలు తల్లి లేక ఎలా అలమటిస్తున్నారో. వారి తల్లికి నీ లాగే కాన్సర్. కాని ఆవిడ చనిపోయింది. అటు చూడు అనాధాశ్రమంలో తల్లులులేని పిల్లలు ఎలా విలవిలలాడుతున్నారో. వారి తల్లులకంటే నీవు నయం కదా! నీకు కాలులేక పోయినా ప్రాణం ఉంది. కాని ఆ పిల్లల తల్లులకు ప్రాణం కూడ లేదు"

"నన్ను మన్నించండి. ఇంకెప్పుడూ కాలులేదని బాధ పడను"

"విమలా, జీవితం కష్టాల మయయే కాదు. రోగాల మయం కూడా. ఏ పుట్టలో ఏ పాముందోనన్నట్లు ఏ మనిషిలో ఏ జబ్బుందో ఎవరికీ తెలియదు. నేను హాస్పిటల్లో ఎన్నో రకాల పేషెంట్లను చూస్తుంటాను. అందుకే చెబుతున్నాను. ఎటువంటి జీవితానికైనా అలవాటుపడాలి. తెలిసిందా? నీకు కేన్సర్ రావడం నీవు చేసిన తప్పుకాదు. ఏది ఒకసారి నవ్వు"

"అలాగే ఒకసారే కాదు. బ్రతికినంత కాలం నవ్వుతాను."

(ఆంధ్రభూమి పేపర్, 13-06-87)

☆ ☆ ☆

# ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్...

ఉదయం 10 గంటల సమయం, ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్. "హలో అది గవర్నమెంట్ హాస్పటలాండి"

'ఆ...'

"డాక్టర్ వైద్యనాథ్‌గారితో మాట్లాడాలండి. కొంచెం కనెక్షన్ యిస్తారా?"

"వార్డుకి కనెక్షన్ యిస్తాను. మీరే కనుక్కోండి".

వార్డులో. "ఇక్కడ డాక్టర్ వైద్యనాథ్‌గారు లేరండీ"

"కొంచెం రాగానే 63531కి ఫోన్ చేయమని చెబుతారా? అర్జంటు"

"అలాగే"

10.30ని. హాల్లో 64894 అండి.

"అవును"

"డాక్టర్ వైద్యనాథ్ గారితో మాట్లాడాలండి. వార్డులో లేరట"

"ఆపరేషన్ థియేటర్‌కి కనెక్షన్ యిస్తాను. అక్కడ అడగండి."

"హలో, యిక్కడ డాక్టర్ వైద్యనాథ్‌గారు లేరండి. బహుశా ఇప్పుడు రావచ్చు."

"రాగానే, ఇంటికి రింగ్ చేయమని చెబుతారా, చాలా అర్జంటు"

"అలాగే"

11.00. హలో హాస్పిటలాండి. డాక్టర్ వైద్యనాథ్....

"ఉండండి. ఎక్సరే డిపార్ట్‌మెంట్‌లో ఉన్నారేమో, కనెక్షన్ యిస్తాను.

"ఇక్కడ వైద్యనాథ్‌గారు లేరండి, వచ్చి వెళ్ళిపోయారు"

12.30. "హల్లో హాస్పిటలండి. మరలా నేనే. డాక్టర్....

విసుగ్గా... "ఎక్కడా లేకపోతే యింటి కెళ్ళిపోయారేమో."

"నేను ఇంటి దగ్గర నుండే, వారబ్బాయిని మాట్లాడుతున్నాను."

"మరలా వార్డుకిస్తాను కనెక్షన్ అడగండి."

"ఇక్కడ డాక్టరుగారు లేరండి. ప్రొద్దుటొచ్చి వెళ్లారు. మరలా రాలేదు."

"అయ్యయ్యో. ఎలాగండి చాలా అర్జంటు"

2.30 ని. హల్లో 64891 కదండి. ఇది పదవ ఫోన్ కాల్ అండి! "అయితే మీకింకా మీనాన్నగారు దొరకలేదా? ఇంటికి వచ్చేసి ఉండాలే!"

"మా అమ్మగారు ప్రొద్దున్న కాలుజారిపడ్డారు, తల చిట్లింది. రక్తం చాలా కారిపోయింది. స్పృహలో లేరు. మా నాన్నగారి కోసం అడిగితే ఫోన్‌లో దొరకలేదు."

"అయితే మీరే హాస్పటల్‌కి తీసికొని రావచ్చు కదా అమ్మగారిని!"

"నాకు పోలీయో, నేను నడవలేను. ఇంట్లో ఎవరూ లేరు, తలుపులన్నీ వేసేసి వున్నాయి. మా నాన్నగారు కలిస్తే ఫోన్‌లో అర్జంటు లేదని మెల్లగా రమ్మని చెప్పండి."

"అదేం."

"మా అమ్మగారు చనిపోయారు" మా అమ్మగారు ఈ లోకంలో లేరు.

☆ ☆ ☆

ఫోను పెట్టేసిన ఐదు నిమిషాల్లో హాస్పిటల్ నుండి ఫోనొచ్చింది.

"బాబూ నాన్నగారు వచ్చేస్తున్నారు. సారీ! వెరీ సారీ!!"

"థాంక్స్ ఇప్పటికైనా నాన్నగార్ని పట్టుకోగలిగారు"

"కానీ మీరు ముందే పరిస్థితి చెప్పవలసింది కదూ"

"ఇంతైతే గానీ మీకు వేడి పుట్టదన్న సంగతి నాకు తెలీదు" అంటూ అబ్బాయి ఫోన్ పెట్టేశాడు.

(ఆంధ్రభూమి పేపర్, 16-04-87)

☆ ☆ ☆

# పెళ్ళి ఆగిపోయింది

నాపెళ్ళి ఆగిపోయింది.

పెళ్ళికొడుకు నన్ను ముందర చూడక, నా నలుపు, ఎత్తుపళ్ళ వంపు, మెల్లకన్ను సొంపు అప్పుడే చూడడం వలన కాదు.

నేను అపురూప సౌందర్యవతిని.

కట్నం చాలలేదని, ఆడబడుచులకు చీరలు అందలేదని, లాంఛనాలు సరిగా జరగలేదని, పెళ్ళి ఏర్పాట్లు బాగాలేవని కాదు.

మా నాన్నగారు అప్పుకి కూడా వెరువక మర్యాదలు సరిగా జరిపారు. ఆకాశమంత పందిరి వేశారు.

నా శీలం మంచిది కాదని, నేను అల్లరి చిల్లరగా తిరిగేదాన్నని పెళ్ళివారికి ఎవరో అబద్ధాలు చెప్పడం వలన అంతకన్నా కాదు.

నా సౌశీల్యం వారికి చాలా నచ్చింది.

అబ్బాయి కంటే అమ్మాయి పెద్దదని, వారు ఆలస్యంగా గ్రహించడం వలనా కాదు.

నేను అతని కంటే అయిదేళ్ళు చిన్నదాన్ని. మాది మేడ్‌ఫర్ ఈచ్ అదర్ జంట.

కర్ణుడి చావుకి కారణాలు ఎన్నో అన్నట్లు ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్ళి ఆగిపోవడానికి కారణాలు ఎన్నో వున్నాయి. మా నాన్నగారు మరలా ఇంత ఖర్చు భరించి, నాకు పెళ్ళి చేయలేనని ఉరేసుకోబోయారు. ఆలస్యంగా వచ్చిన నా కాబోయే భర్త ఆ పని ఆపు చేయించాడు.

ఆయన ఒక పూట ఆలస్యంగా రావడానికి కారణం - పై కారణాలు ఏమీ కాదు, అనుకోకుండా వర్షం వచ్చి దారులు కొట్టుకొని పోవడం, మా పెళ్ళికి వర్షం అడ్డువచ్చింది. మా పెళ్ళి ఆగిపోయింది. కాని నెల తరువాత అయింది రిజిస్ట్రారు ఆఫీసులో.

(ఆంధ్రజ్యోతి, 23-02-90)

☆ ☆ ☆

# ఓ అత్తగారి కథ

హనుమాయమ్మ, రాజానుజం దంపతులకు ముగ్గురు అబ్బాయిలు. ముగ్గురికీ పెళ్ళిళ్ళు అయిపోయాయి. రామానుజంగారు బిజినెస్ చేసి అదే బిజినెస్ ముగ్గురు కొడుకులకూ అప్పగించారు. ముగ్గురికీ మూడు ఇళ్ళు కట్టించి ఇచ్చేశారు. వరుసగా ఉంటాయి ఇళ్ళు. వాళ్ళిద్దరూ ఆ పక్కనే ఉన్న చిన్న ఇంట్లో ఉంటారు.

హనుమాయమ్మకు ఇద్దరు తోడికోడళ్ళు ఉన్నారు. వాళ్ళు ముగ్గురూ చాలా ఐకమత్యంగా, అమరికలు లేక స్వంత అక్కా చెల్లెళ్ళలా ఉండేవారు.

కాని హనుమాయమ్మగారి కోడళ్ళకు ఎందుకో ఒకరంటే ఒకరికి పడదు. కూతుళ్ళు లేని ఆవిడ ముగ్గురు కోడళ్ళనూ కన్న తల్లి లాగే చూస్తుంది. కోడళ్ళు కూడా అత్తగారిని ఎంతో ఆప్యాయంగా చూసినా, ఆ ఆప్యాయత ఆవిడకు తృప్తినివ్వడం లేదు. తృప్తి నివ్వక పోవడానికి కారణం 'అత్తగారిని' అనే అహంకారంతో కాదు. కోడళ్ళు ఒకరినొకరు తోడుగా ఉండకుండా దెబ్బలాడుకోవడమే! కోడళ్ళ మధ్య కొడుకులు నలిగి పోవడం, ఏమీ చేయలేక పోవడం ఆవిడ ఎరగనిది కాదు.

అక్కడికీ ముగ్గురికీ సఖ్యం కుదర్చాలని ఎంతో ప్రయత్నం చేసింది. అందరికీ కలిసి, ఒక్కొక్కరికి విడివిడిగా కూడ హిత బోధలు చేసింది. ప్రేమగా చెప్పి చూసింది. కాని వాళ్ళ మధ్య రాజీ కుదరలేదు. ముగ్గురికీ ఒకరంటే ఒకరికి మంట. అత్తగారి దగ్గర ఒకరి మీద ఒకరు చాడీలు చెప్పుకుంటున్నారు.

రేపు నేను పోతే ఈ సంసారం ముక్కలైపోవలసిందేనా? ఎవరికి వారే యమునా తీరే అయిపోయి పరాయివాళ్ళ లాగ బ్రతుకుతారా? అన్న బెంగ ఎక్కువైంది.

అందుకే ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి, అది ఆచరణలో పెట్టింది. అప్పటి నుండి కోడళ్ళ మీద ఒకరి మీద ఒకరికి చాడీలు చెప్పడం, వాళ్ళలో వాళ్ళకు తగువులు పెట్టడం, ఒకరి ఎదురుగా మరొకరిని తిట్టడం చేయసాగింది.

అంతే! ఇప్పుడు ముగ్గురూ ఏకమై అత్తగారిని చాటుగా తిట్టుకోవడం, ముగ్గురూ కలిసి తిట్టుకోవడం చేయసాగారు. ఇంత కాలం ఎంతో మంచిగా చూసే ఆవిడ, ఎందుకిలా తయారైందో వాళ్ళకు అర్థం కాలేదు. ఏది ఏమైతేనే అత్తగారి చాడీల వల్లనే కోడళ్ళందరూ ఏకమై ఇప్పుడు కష్ట సుఖాల్లో కలిసి ఉంటున్నారు.

అప్పుడు అనుకుంది ఆవిడ - 'నేను ఎంతో కాలం బ్రతకను. నేను చెడ్డదాన్నయినా ఫరవాలేదు. సంసారం చక్క బడితే చాలని.

(ప్రభ, 21-10-87)

★ ★ ★

# అన్యోన్యం

రాజీవ్, దీపలు నవ దంపతులు, పెళ్ళి కాగానే మా ఇంట్లోనే అద్దెకుదిగారు ఇద్దరూ చూడచక్కనైన జంట ఎంతో అన్యోన్యంగా ఉండేవారు.

ఏదో కొత్త దంపతులు కదా, అన్యోన్యంగాను ఆప్యాయంగాను ఉండటం సహజం. మరో సంవత్సరం గడిచి 86 కాస్త 87 అయిందిగాని, వారిఅన్యోన్యంలో ఏమీ మార్పులేదు. వారిని చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంటుంది.

రాజీవ్, దీపలు రోజు సాయంకాలం కలిసే బయటకు వెళతారు. రాజీవ్ పంక్షన్స్‌కు వెళ్ళినా కూడా దీపను తీసుకొని వెళ్ళిపోతాడు. దీప ఉదయం పూట అర్జంటుగా బజారుకు వెళ్ళవలసి వచ్చినా భర్త దగ్గరకు వెళితే, తను ఆఫీసులో ఒకఅరగంట పర్మిషన్ పెట్టి ఆమెకు ఏంకావాలో కొనిచ్చి, ఇంటి దగ్గర దింపి వెళతాడు. అప్పుడప్పుడు ఆఫీసు టైంలో కూడ ఇంటికి వచ్చి, భార్యకు ఇంట్లో బోర్ కొడుతుందని కాబోలు సరదాగ కబుర్లు చెప్పి మరీ వెళతాడు. ఒకసారి సంక్రాంతికి ఆఫీసులో పని ఉండటం వలన రాజీవ్ అత్తింటికి వెళ్ళడం కుదరనందున దీప కూడ పుట్టింటికి వెళ్ళలేదు.

అలాగే ఒకరిని విడిచి ఒకరు ఉండనందున చూసేవరందరూ వారిద్దరిదీ అన్యోన్యం అయిన జంట అనుకున్నారు. కాని అసలు విషయం అదికాదు. ఒకరిపై ఒకరికి విపరీతమైన అనుమానం. ఏది ఏమైనా ఓ అనుమానం ఒక జంటను చివరివరకూ అన్యోన్యంగా ఉంచుతుంది.

(కావ్యజ్యోతి)

☆ ☆ ☆

# పెంచిన ప్రేమ

"ఆయా! ఆయా!" గట్టిగా పిలిచింది మధుమతి.

"వస్తున్నా అమ్మాయిగారూ!" అంటూ చెంగుకి చేయి తుడుచుకుంటూ గబగబా వచ్చింది ఆయా.

"త్వరగా పనిముగించుకో. ఈరోజు అనాధాశ్రమానికి మరో పాప వచ్చిందట. ఇప్పుడే ఫోన్ వచ్చింది. వెళ్ళి చూసొద్దాం" అంటూ వెళ్ళిపోయింది.

మధుమతి ఇంటికి పెద్ద ఆడపిల్ల. ఆఖరి చెల్లెలు పుట్టగానే తల్లి చనిపోయింది. మధ్యలో దమయంతి, వసుమతి ఉన్నారు. ఆఖరు చెల్లెలు అవంతిని, రోజూపాప దగ్గర ఉండి తానే చూడడంతో ఒక చెల్లెలులా కాక కూతురిగా అనిపిస్తుంది. మధుమతికి మంచి ఉద్యోగం ఉంది. ఆ ఉద్యోగంతోనే చెల్లిళ్ళ ఇద్దరినీ ఒక యింటివాళ్ళను చేసింది.

తాను పెళ్ళి చేసుకోకూడదని, అవంతి తన కూతురు లాంటిదని అనుకుంది. అవంతిని అపురూపంగా, కంటి పాపగా, ప్రాణంలో ప్రాణంగా పెంచుకుంది. ఇది నా చెల్లెలు కాదు. కూతురు అంటూ అందరికీ చెప్పేది. ఇద్దరికీ వయసులో తారతమ్యం ఎక్కువ ఉండటంతో అందరికి వాళ్ళు తల్లీ పిల్లలులాగే కనబడేవారు. ఆమధ్య అవంతి, ఓ అనామకుడి ప్రేమలో పడడంతో అవంతికి, మధుమతికి మధ్య విభేదాలు తలెత్తాయి. 'వద్దు' అని గట్టిగా మధుమతి చెప్పినందుకు వసుమతి దగ్గరికి వెళ్ళిపోయింది అవంతి. దానితో మధుమతికి ప్రేమల మీద, మమతల మీద అపనమ్మకం కలిగింది. ఏనాడూ వసుమతి అవంతిని దగ్గరకు తీయలేదు. తనదగ్గర పెట్టుకోనూ లేదు. 'అమ్మో! వయసులో ఉన్న ఆడపిల్ల, నా భర్త ఎదురుగా ఉంటే ఎలా?" అంటూ తప్పించుకుంది. అటువంటిది యిప్పుడు 'నీ పెళ్ళి అక్క చేయకపోతేనేం. నేను చేస్తాను' అనగానే యిన్నాళ్ళ బంధాన్ని తెంచుకుని అవంతి వెళ్ళిపోయింది.

దానితో మధుమతికి ఒంటరితనంతో పిచ్చెక్కిపోయింది. దానికంటే అవంతి తన మాట విననందుకు చాలా అవమానంగా ఉంది. మరో పిల్లను పెంచుకుంటే గాని అవంతి మీద కోపం పోయేటట్లు లేదు అనుకుని ఎవరినైనా దత్తత తీసుకోవాలని నిర్ణయానికి వచ్చింది.

మధుమతి, ఆయా, అనాధశ్రమానికి వెళ్ళారు. పాప చాలా బాగుంది. కాని నీర్సంగా ఉంది. మధుమతికి నచ్చలేదు.

"ఇక్కడ పోషణ సరిగా లేక అలా ఉంటారండి. మీరు యింటికి తీసికెళ్ళి ఫారెక్స్, పాలు పడితే బంగారు బొమ్మలా తయారవుతారు పిల్లలు' అని అక్కడ ఒకావిడ చెప్పింది.

ఆ మాటలు రుచించలేదు మధుమతికి. మరో రోజు హాస్పిటల్‌లో ఎవరో పిల్లను



వదిలేసి పోయారనగానే అక్కడకు వెళ్ళింది. పిల్ల నల్లగా ఉందని వద్దనేసింది. పాపగాని, బాబుగాని పెంచుకోవడానికి కావాలని చాలామందితో చెప్పింది మధుమతి. ఆఖరుకి మద్రాసు - బెంగుళూరుల్లో దొరుకుతున్నారని తెలిసి అక్కడకు వెళ్ళింది. ఆరు నెలలు ఎంత ప్రయత్నించినా మధుమతికి నచ్చినవారు దొరకలేదు.

డల్‌గా కూర్చున్న మధుమతితో "అమ్మాయిగారూ! అవంతిగారు చిన్నపిల్ల, ఏదో కోపంతో వెళ్ళి పోయారుగాని, మీరంటే ప్రాణం. ఆవిణ్ణి పిలిపించుకోండమ్మా!" అనునయంగా అంది.

"టట్! దాని పేరు నా దగ్గర ఎత్తవద్దు. నీకు తెలుసుగా ఆయా! అవంతిని ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమించాను. పేగు తెంచుకు పుట్టకపోయినా కన్నబిడ్డలా చూశాను. పసిగుడ్డు దగ్గర నుండి తల్లిలా లాలించాను. చివరికి అది ఎంత మోసం చేసిందో చూడు" వెక్కి వెక్కి ఏడ్చింది మధుమతి.

మధుమతి అవంతి చేసిన పనికి తట్టుకోలేక పోతోంది. "నా పెంపకం ఇంత చేతకానిదా?" అని తలచుకుని తల్లడిల్లి పోతోంది.

మరో నలుగురైదుగురు పిల్లలను చూసిందిగాని, మధుమతికి నచ్చలేదు.

హైద్రాబాద్‌లో ఎవరో పాప ఉందిట. వెళతాను. వెళ్ళి నల్లగా, బక్కగా ఉన్న పాపను తెచ్చుకుంది మధుమతి.

పాపా ఈవిడకు నచ్చింది అనుకుంది ఆయా. మధుమతి ఆయాతో "ఏమిటో ఈ పాపను చూడగానే పెంచుకోవాలనిపించింది. అందంగా లేకపోయినా ఈ పాపపై ఏదో ఆత్మీయత కలిగింది. అందుకే ప్రేమ గుడ్డిది అంటారు కాబోలు" అంది.

కాని ఆయాకు తెలియని సంగతి ఒకటుంది. అవంతి గర్భవతి అయిన విషయం ఆయాకు చెప్పకుండా వసుమతి దగ్గరకు వెళ్ళిపోయింది. అవంతిపై ప్రేమ చంపుకోలేక పిల్లని పెంచుకుంటాను అని అందరి దగ్గర నాటకం ఆడి, అవంతి కూతుర్ని తెచ్చుకుంది. ఆ పాపను అనాథ కానీయకూడదన్నదే మధుమతి ధ్యేయం!

(ఆంధ్రభూమి డైలీ, 08-05-94)

☆ ☆ ☆

# అంతరంగం

నాకు మా ఆవిడ ఆంతరంగం అంతుబట్టడం లేదు. బ్రతికి బట్ట కడతాననే ఆశలేనంతగా జబ్బు పడ్డాను. అప్పుడు బుడిబుడి రాగాలు తీసింది. అదంతా అనురాగమే అనుకున్నాను. రోగంతోనున్న భర్తకు, పైగా రిటైరయిన వానికి ఎంతకాలం సేవ చేస్తాం అనుకుంది కాబోలు.

నేను రిటైర్ అయి హాయిగా కాలుమీద కాలువేసుకుని యింట్లోనే కూర్చోవచ్చు. కాళ్ళరిగేలా ఆఫీసుకి వెళ్లక్కరలేదు అనుకున్నాను. తీరా విశ్రాంతి దొరికాక నా కాలు మీద కాలువేసికోడానికి వీలులేక, నా కాలు మరొకరి చేతిలో పెట్టవలసి వచ్చింది. ఆ మరొకరు ఎవరో కాదు, నా భార్యే. నాకా కాలుకి మైల్డ్‌గా పెరాల్సిస్ వచ్చింది. మందులతో కొంత తగ్గింది. ఆ తరువాత అంతా ఎక్సర్‌సైజు వలనే తగ్గాలి అదంతా, మీరు చేసే ఎక్సర్‌సైజులోనే ఉంది అంటూ డాక్టర్‌గారు చెప్పారు.

మూడు నెలలు బాగుగానే చేసింది మా ఆవిడ రత్నం. డాక్టర్‌గారు వచ్చి ఏమీ ఇంప్రూవ్‌మెంట్ లేదు అనగానే మూలుగు ప్రారంభించింది. ఎవరికైనా రోజుల తరబడి చేయాలంటే విసుగు కదా అని మొదట్లో సమర్థించుకుని, నా కాలు నేను మర్దించుకొనడం మొదలు పెట్టాను. నిజంగా క్షణం తీరిక లేకుండానే మొన్నటి వరకు చేసింది. ఆ తరువాత డాక్టర్ దగ్గరికి వెళ్ళి వచ్చింది. బహుశా ఇప్పట్లో ఆ కాలు రాదు, ఆయన నడవలేరు అని అన్నారు కాబోలు చికాకు పడడం, పిలిచిన వెంటనే రాకపోవడం మొదలుపెట్టింది. దానికీ సహించాను. ఏనాడు పని మనిషిని పెట్టుకోడానికి ఇష్టపడని నా భార్య, ఒక పదేళ్ళ పిల్లను ఇంట్లో పెట్టి హోటల్ నుండి భోజనం, కాఫీలు తీసుకొని రమ్మని చెప్పి, మా అమ్మకు కాలు విరిగి మంచాన పడిందట, నేను వెళ్ళి చేయాలి. అంటూ పుట్టింటికి చెక్కేసింది. ఏనాడు పుట్టింటికి వెళ్ళి నాలుగురోజుల కంటే ఎక్కువ ఉండని రత్నం అలా ఉండిపోయిందంటే, నాకు సేవలు చేయడం ఇష్టం లేకపోవడమే.

ఆ పనిపిల్ల సరిగా చేసేది కాదు. నాకు రత్నం మీద ఒళ్ళు మండినా ఏమీ చేయలేని నిస్సహాయత ఆవరించింది. రెండో నెలలో తీరిగ్గా వచ్చింది రత్నం. నేను అసలు మాట్లాడలేదు. రత్నం లేనన్ని రోజులూ మెల్లగా ఎలాగో తంటాలు పడి నా పనులతో పాటు వంటకూడ చేసికొని తిన్నాను. ఇప్పుడు రత్నం లేకపోయినా బ్రతగ్గలను. అందుకే ముభావంగా ఉన్నాను.

"బాగానే లేచి తిరుగుతున్నారే" అంది ఆనందం ఉట్టి పడుతూ. "అక్కడే ఉట్టిగట్టుకొని ఊరేగలేక పోయావా ఎందుకు వచ్చావు" అన్నాను. "ఇది నా ఇల్లు నా ఇష్టం అంది" ఎంతకు తెగించింది అనుకున్నాను కసిగా.

పనిపిల్లను చాటుకి పిలిచి, 'ఏయే రామి, నేను లేనన్ని రోజులూ అయ్యగారి మాట వినవద్దు అని చెప్పాను కదా, విన్నావా?' అని అడిగింది. నా మనసు ఆ మాటలు విని కుతకుతలాడి పోయింది. ఆ వినకుండా ఉండబట్టే ఆయనకు కాలు స్వాధీనంలోకి వచ్చింది. నేను అన్ని చేసేస్తుంటే ఆయన ఎక్స్‌ర్‌సైజు చేసేవారు కాదు. ఎంత చెప్పినా, ఎవరం చేయకపోబట్టే పని వంకన ఆటోమేటిక్‌గా ఎక్సర్‌సైజ్ అయింది. కాలు వచ్చింది అంది ఆనందంగా. మా ఆవిడను తప్పుగా అర్థం చేసుకున్నందుకు బాధ, కాలు స్వాధీనంలోకి వచ్చినందుకు సంతోషం కలిగాయి.

(జయశ్రీ, మార్చి 88)

☆ ☆ ☆

# బాకీ

ఆ రోజు పోస్టులో వచ్చిన ఉత్తరాలను చూస్తుంటే, చెల్లెలు రాసిన ఉత్తరం కనిపించింది అందులో రమణకు. ఏమి రాసి ఉంటుందో అనుకుంటూ ఆత్రుతగా విప్పాడు.

"ప్రియమైన అన్నయ్యకు దీప్త ప్రేమతో రాయడం. అన్నయ్యా! నీవు వచ్చి మా అత్తగారి నుంచి మమ్మల్ని విడదీసి వేరు కాపురం పెట్టించావు. నీ కిష్టం లేక పోయినా, మా బావగారికి అయిష్టంగా ఉన్నా, నా పోరు పడలేక మీరిద్దరూ ఆ పని చేశారు. అన్నయ్యా, నేను మా అత్తగారు, ఆడబడుచులతో కలిసి ఉన్నప్పుడే నాకు హాయిగా ఉండేదేమో అని ఇప్పుడు అనిపిస్తుంది. మీ బావగారు నా మీద చీటికీ, మాటికీ కోప్పడుతున్నారు. ఇంటికి రాత్రులు ఆలస్యంగా వస్తున్నారు. అందరం కలసి ఉన్నప్పుడు ఎంతో ప్రేమగా చూసేవారు. అప్పుడు, మిగిలిన వారు నన్ను బాధ పెట్టేవారు. నా లాంటి వారి జీవితం ఎప్పటికీ బాధలు పడవలసిందే నేమో! నీవు వదినను ఎంతో ప్రేమగా చూస్తావు. నీలా మీ బావగారు నన్ను చూడరు. వదిన ఎంతో అదృష్ట వంతురాలు. నాకు ఇక్కడ ఉండ బుద్ధి కావడం లేదు. మీ దగ్గరకు వచ్చేయాలని అనిపిస్తూంది. శ్రమ అనుకోకుండా నీవు మళ్ళీ ఒకసారి వచ్చి, నా జీవితాన్ని సరిదిద్ది వెళతావని ఆశిస్తున్నాను.

- దీప్త

ఉత్తరం చదివి భారంగా నిట్టూర్చాడు రమణ. బాగా ఆలోచించి చెల్లెలికి ఉత్తరం రాయడం మొదలు పెట్టాడు.

"డియర్ దీప్తా! నీ ఉత్తరం అందింది. సంగతులు తెలిశాయి. నీవు అస్తమానం మీ అత్తగారితో, మామగారితో, ఇంట్లోని వారితో దెబ్బలాడుతుంటే, తప్పనిసరి పరిస్థితుల్లో వచ్చి, కేవలం నీ తరపునే ఆలోచించి, వేరు కాపురం పెట్టించిన రోజు, నేను సిగ్గుతో తలవంచుకున్నాను. అందరితోనూ ఒక కోడలు దెబ్బ లాడుతుంది అంటే అది పుట్టింటికి తలవంపులే. సరిగా పెంచలేదు అనే నింద పడక తప్పదు. నీ గురించి అన్నిటికీ తల ఒగ్గాను. అయినా నీవు జీవితంలో ఎడ్జస్ట్ కాలేకపోతున్నావు అంటే లోపం నీలోనే ఉందేమో అని అనుమానంగా ఉంది, నాకు.

"పెళ్ళయిన ఆడపిల్లల జీవితాలు ఎవరివో గాని వడ్డించిన విస్తరులు కావు. అలా లేనినాడు నేర్పుతో, ఓర్పుతో మనమే అన్నీ సమకూర్చుకొని వడ్డించు కోవాలి గాని, ప్రతిదాన్నీ భూతద్దంలో నుంచి చూసి ఇంటిని భూతాల గృహంలా చేసుకోకూడదు. ఇల్లు స్వీట్ హోమ్ అయినా, హాట్ హోమ్ అయినా తొంభై శాతం ఆడదాని చేతిలోనే ఉంటుంది.

"మగవాడు అందానికీ, సెక్స్‌కీ మాత్రమే లొంగుతాడు అనుకోవడం అవివేకం. అది కొంత కాలం మాత్రం. నిజంగా మగవాడు లొంగేది భార్య ప్రేమకూ, ఆమె తన వారిపైన చూపే ఆదరణకూ మాత్రమే.

"మీ వదినను నేను ప్రేమగా చూస్తానని రాశావు. నిజానికి ఆమె మన కుటుంబానికి చేసిన సేవలో నేను చూపించే ప్రేమ ఏపాటిది చెప్పు. నేను చూపించే ప్రేమ కానీ ఖర్చు లేనిది. అది కూడా ఆమెకు నేను అందివ్వక పోతే, నేను మనిషిని కాను. అది నిజంగా వచ్చే జన్మలో కూడా ఆమె ఋణం తీర్చు కోలేను. అమ్మా, నాన్న మా పెళ్ళయిన కొత్తలో అకస్మాత్తుగా చనిపోతే, మీ వయసులోనే ఉన్న మీ వదిన మిమ్మల్ని తల్లిలాగే చూసింది. తను తల్లీ, తండ్రీ లేక అన్న వదినల దగ్గర అష్ట కష్టాలు పడింది. అందుకే ఆ బాధ తెలుసు కాబట్టే మనను అంత బాగా చూడగలిగింది. తన వస్తువులు, తన పేరున ఉన్న పొలం మన కోసం ఖర్చు పెట్టింది. రాజు, రవి చదువులకు; నీది, అక్కది పెళ్ళిళ్ళకు ఆమె ఎంత శ్రమ పడింది. మనను ఎలా ఆదుకున్నది నీకు తెలియనిది కాదు. నా జీతం ఎంతో, మన వెనుక నాన్నగారు అప్పులు తప్ప మరేమి మిగల్చ లేదు అన్న సంగతి కూడా నీకు తెలుసు.

"దీప్తా! భార్య సహకారం లేని భర్త ఏనాడూ పైకి రాలేడు. భర్తకు భార్య అందించవలసింది తన ఒక్కడి మీదా ప్రేమ కాదు. తన వారిని ఉన్నత స్థితికి తీసుకొని రావడం కూడా కావాలి. మీ వదిన నాతో సహకరించక పోయినట్లయితే మీకు చాటుగా, మాటుగా డబ్బు పంపగలిగి ఉండేవాడినేమో గాని, మిమ్మల్ని ఖచ్చితంగా ఇంత ఉన్నత స్థితికి తీసికొని వచ్చి మాత్రం ఉండేవాడిని కాదు. నేనూ, మీరూ కూడా అమ్మ నాన్న లేక పోయినా, ఇంత నిశ్చింతగా, హాయిగా, ఏ గొడవలూ లేక పది సంవత్సరాల నుంచి బ్రతుకుతున్నాం అంటే అది మీ వదిన చలవేనమ్మా. ఒక స్త్రీ తన స్వార్థం తాను చూసుకోకపోవడం వల్ల మన కోసం శ్రమించడం వల్ల మనం ఈనాడు ఈ స్థితిలో ఉన్నాం.

అవసరాలు తీర్చుకొని, ఈనాడు తనను నేను చిన్న చూపు చేస్తే నన్ను దేవుడు కూడా క్షమించడు. మీ కోసం తను ఎనిమిది సంవత్సరాలు పిల్లలు కలగకుండా జాగ్రత్తపడింది. ఆఖరికి, ఆఖరిదానివైన నీ పెళ్ళి అయ్యే వరకూ తను తల్లి కాలేకపోయింది. ఇప్పుడు ఆలోచించు, ఇందులో ఏ ఒక్క చిన్నపని అయినా, నీవు నీ అత్తింటి వారికి చేయగలిగావా? ఇక నీ పైన నీ అత్తింటివారికి అభిమానం, నీ భర్తకు అనురాగం ఎలా కలుగుతాయి? భార్య ఇచ్చే విలువ అదేనా? అని, నీవు అనవచ్చు. అవతలవారిని చూడకుండా నీ భర్తకు నీవు అడ్డుపడ్డావు. భార్య మాట విని తల్లిని దూరం చేసుకున్నా డతడు, రేపు మరొకరి మాట విని నిన్నూ దూరం చేసుకుంటాడు. ఆ మనస్తత్వం మగవాడిలోకి ప్రవేశించకుండా చేయవలసిన బాధ్యత భార్యదే.



"మనలాంటి మధ్య తరగతి కుటుంబాల్లో, పెద్ద కొడుకు భార్య ఇంటికి గట్టి పునాదిలా ఉండాలి. లేదంటే ఆ ఇల్లు ఎప్పుడూ కూలిన గోడలాగే ఉంటుంది. నీవు ఇంటికి పెద్ద కోడలివి. ఆలోచించుకో ఇప్పుడు రెండు సంసారాలయ్యాయి. నీ భర్త రెండు సంసారాలను పోషించలేక ఇటు తల్లి దండ్రులకూ, అటు నీకూ పూర్తిగా న్యాయం చేయలేక నతమతమవుతున్నాడేమో గ్రహించావా? ఇలాంటి వేదనల నుంచి తప్పించుకోవడానికే, మగవాడు మగువనూ, మందునూ ఆశ్రయించడం మన సంఘంలో జరుగుతూనే ఉంది. ఇప్పుడు దానికి చేజేతులా నీవే దారి చూపిన దానివయ్యావు.

వదిన అదృష్టవంతురాలు అని నీవనుకుంటున్నావు. ఆమె ఆ అదృష్టాన్ని ఎన్నో కష్ట నిష్ఠూరాలకు ఓర్చి, ఆఖరికి కడుపును కూడా మాడ్చుకొని సంపాదించుకుంది. మరి నీవు చేసిందేమిటి? నీవూ అలాంటి అదృష్టవంతురాలవు కావాలి అంటే, అత్తింటి వారిని ఆదరణతో చూడు. అదే ఆదరణతో నీ భర్తకూ మనశ్శాంతిని ప్రసాదించు. అతను రెండు ఇళ్ళకూ అద్దె కట్టలేక అడ కత్తెరలో పోక చెక్కలా నలిగి పోతున్నాడేమో. బావగారికి నీ వల్ల ఆదాయం లేకున్నా, నీ గురించి వేరే ఖర్చులు రాకుండా చూడు.

మీ వదిన నీలా ప్రవర్తించి ఉంటే మీరందరూ ఏమయ్యే వారో ఒక్కసారి యోచించి, మంచి గృహిణిలా పేరు తెచ్చుకో. నీ భర్తను నీ దారిలోకి మార్చుకునే శక్తి నీలోనే ఉంది. అతనికి అనుకూలంగా ప్రవర్తించి, కొంగున కట్టుకుంటావో, కొప్పున ముడేసుకుంటావో నీ ఇష్టం. సంతోషాన్ని నేను అస్తమానూ వచ్చి ఇవ్వలేను. అది నీవే సంపాదించుకో. నీ వెనుక నీడలా నేనుంటా.

ప్రేమతో...

అన్నయ్య రమణ."

(ప్రభ, 17-08-88)

☆ ☆ ☆

# ఇది నా తప్పు కాదు

"డియర్ అరుణా

నేను క్షేమంగా హైదరాబాద్ చేరాను. ఉద్యోగంలో జాయిన్ అయ్యాను. నేను వచ్చేసిన తరువాత నీజీవితం ప్రశాంతంగా ఉండి ఉంటుంది.

"అరుణా! నేను రాసేది పూర్తిగా చదువు. నా భర్త పోయిన మాట నిజమే. కాని అందువల్ల నేను సెక్స్ గురించి పరితపించిపోతున్నానని నీవు, నీలాంటి వారు అనుకోవడం మాత్రం భ్రమ. నా కోరికలను, పసుపు కుంకుమలను, పూలు, గాజులను కూడా నాభర్త చితిలోనే వేసేశాను. ఆయనను జీవితాంతం ఆరాధిస్తూ బతికేయగలను. అటువంటి దాంపత్యం మాది. నీవు నాకు, మీ వారికీ సంబంధం అంటగట్టి అందరి దగ్గరా తప్పంతా నాదే అన్నట్టు మాట్లాడడం నేను వినకపోలేదు.

"నిజానికి మీ పొరుగున నిశ్చింతగా బ్రతకవచ్చు అని మీ పక్కింటికి మారిన నేను, నీకు నిశ్చింతను కరువు చేశానని చాలాకాలం వరకూ గ్రహించలేకపోయాను. నీమనసులోని విషయం నాకు తెలిసి బాధ పడుతుంటే, మాఅన్నయ్య నన్ను ఓదార్చాడు. అంతటితో ఊరుకోలేదు. నీవెంట పడడం మొదలుపెట్టాడు. అన్నయ్య ఓరచూపులు, డబుల్ మీనింగ్ మాటలు నీకు అర్థం అయినా నీవు మీ వారితో చెప్పలేదు. కారణం తప్పు నీదే అంటారని, నీ కాపురంలో చిచ్చు రగుల్తుందని కదూ?

"నీతప్పు లేకపోయినా మా అన్నయ్య చేష్టల వల్ల తప్పు నీదే అన్నట్టు నీవెంత అల్లరి పాలయ్యావో, మీవారి చేష్టల వల్ల నాతప్పు లేకపోయినా నేనూ అంత అల్లరిపాలయ్యాను, సాటి ఆడదాన్ని ఆడదానివి నీవే అర్థం చేసుకోలేనప్పుడు మగవాడు ఎలా అర్థం చేసుకోగలడు? నీవు తలచినట్లే నీ భర్త కూడా నేను సెక్స్ కోసం పరితపిస్తున్నట్లు భావించాడు. నన్నేదో ఉద్ధరిద్దా మనుకున్నాడు. భార్యను రంపపుకోత పెట్టి, నాలాంటిదాన్ని ఉద్ధరిద్దా మనుకునే ఈ మగవాళ్ళను ఏమనాలి? ఆ ఉద్ధరించేదేదో భార్యనే ఉద్ధరిస్తే నాలాంటి వాళ్ళు అల్లరిపాలు కారు. ఇలా సంసారాలు నాశనమూ కావు.

"మా అన్నయ్యది వట్టి నాటకం మాత్రమే! అలా చేయడం వల్ల మీ నాన్నగారి ఇన్ఫ్లుయెన్స్‌తో నన్ను ట్రాన్స్‌ఫర్ చేయించావు. నాకు కావలసిన ఊరు నాకు దొరికింది. ఇక్కడ పబ్లిక్ స్కూల్లో నా పిల్లలున్నారు. ఇప్పుడు వాళ్ళ దగ్గరే నేనుండవచ్చు. థాంక్యూ అరుణా!

"చివరగా ఒక్క సంగతి. నీ భర్తను నీవు అదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నించుగాని, నాలాంటి ఆడవారి మీద అభాండాలు వేయడానికి ప్రయత్నించవద్దు. నోరు కత్తి కంటే పదునైనది. మనుషుల్ని చంపడానికీ, జీవితాలు నాశనం కావడానికి కత్తులు, బల్లాలు, తుపాకులే అక్కరలేదు. వీటికంటే బలమైనది నోటి నుంచి వచ్చే చెడ్డ మాట. అందుకే నీభర్తతో పాటు నీనోటినీ అదుపులో పెట్టుకుంటావని ఆశిస్తున్నాను.

ఇట్లు
రమణి."

(ఆంధ్రప్రభ వీక్లీ, 29-7-87)

☆ ☆ ☆

# మంచితనం

వరలక్ష్మి గారింట్లో పనిమనిషి బంగారు ఉంగరం ఎత్తుకుపోయింది.

దానికి ఆవిడ నెత్తి, నోరు బాదుకోలేదు. పనిమనిషిని పల్లెత్తు మాట అనలేదు.

"రంగి కొడుక్కి ఒంట్లో బావులేకపోతే, హాస్పిటల్‌కు కావాలి. ఆపరేషన్ అవసరం అని రెండు వందలు అడిగింది. నేను ఇవ్వలేకపోయాను. అందుకే ఆపని చేసింది. లేదండీ రంగి అలాంటిది కాదు. పోనీలే కొడుకు బావుంటే అంతే చాలు" అందావిడ.

విన్నవాళ్లందరూ ముక్కుమీద వేలేసుకున్నారు. ఆ తరువాత రంగి తన తప్పు ఒప్పుకొని ఉంగరం ఇచ్చేయడం అది వేరే విషయం.

వరలక్ష్మిగారి కోడలు అత్తగారితో దెబ్బలాడి వేరే కాపురం పెట్టింది.

"పాపం చిన్న పిల్ల. మొన్నటి వరకూ కాలేజి చదువులు చదివింది. బాధ్యతలు, బరువులూ ఎలా భరించగలదూ!" అంటూ కోడలి తరపునే మాట్లాడింది.

అత్తలందరూ ఆవిడ మీద ఊసులేసుకున్నారు. వాళ్ల కోడలిని చూసి తమ కోడళ్ళు నేర్చుకుంటారని వాళ్ళ భయం.

ఆవిడ బజారు నుండి వస్తుంటే అప్పుడే కారు డ్రైవింగ్ నేర్చుకుంటున్న కుర్రాడు ఆవిడ ఎక్కిన రిక్షాను గుద్దేసాడు. అందరూ ఆ అబ్బాయికి చాలా డబ్బుంది. బెదిరిస్తే చాలా ఇస్తాడు అన్నారు. ఆ పిల్లాడికి నా మీద ఏం కక్ష చెప్పండి. నేనెవరో తెలియదుకదా! కావాలని చేసిన పనికాదు కదా! ఇలాంటివి చిన్న చిన్న ప్రమాదాలు కొత్తవాళ్లు డ్రైవింగ్ నేర్చుకునేటప్పుడు తప్పవు. అయినా నేను బాగానే ఉన్నానుగా, ప్రాణాలు పోలేదుగా" అంటూ ఆ అబ్బాయిని సమర్థించింది. రిక్షా అబ్బి రిక్షా బాగుచేయించుకోడానికి తనే ఇచ్చుకుంది.

అల్లుడు తన కూతురిని కాదని, వేరే అమ్మాయితో సంబంధం పెట్టుకున్నాడట. యాగీ చెయ్యబోతే కూతురిని మందలించింది.

నీ భర్త వేరే అమ్మాయితో తిరుగుతున్నాడు అంటే, అది నీలోపమే. భర్తను ప్రేమతో కట్టిపడేసుకోవాలి. అయినా ఆ అమ్మాయి ఏ దుస్థితిలో ఈ అబ్బాయి పాలపడిందో పరిస్థితేమిటో ఓర్చు అంది.

ఆ తరువాత అదంతా కూతురి అనుమానమే, నిజానికి వారిద్దరికీ ఏ సంబంధం లేదు అని తెలిసింది వరలక్ష్మిగారికి.

ఆవిడ జీవితంలో ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగాయి.

నిజానికి రంగి, వరలక్ష్మిగారి కోడలు, డ్రైవింగ్ నేర్చుకుంటున్న అబ్బాయి, ఆవిడ అల్లుడు అందరూ తప్పులు చేసినవారే. కాని వారందరూ మంచివారేననీ, అసలు తప్పులు చేయనిదెవరూ అంటుంది ఆవిడ.

కొందరికి అందరిలోనూ ఉన్న చెడ్డే కనిపిస్తుంది. మరికొందరికి అందరిలోనూ మంచితనం కనిపిస్తుంది. రెండింటిలో ఏదైనా సులోచనాల చూపే.

(ఆంధ్రభూమి వీక్లీ - 'నేటి కథ')

☆ ☆ ☆

# బేలన్స్



లాయర్ నవనీతరావుకి ఇద్దరు కొడుకులు. ఇద్దరు కూతుళ్ళు. కొడుకు లిద్దరికీ పెద్దమ్మాయి వనజకూ పెళ్ళిళ్ళయిపోయాయి.

ఇద్దరి కొడుకులకు ఆస్తి ఇచ్చేసారు. పెద్దమ్మాయికి ఏభయి వేలు కట్నం ఇచ్చి పెళ్ళి చేశారు. ఇప్పుడు చిన్నమ్మాయి అనూజ పెళ్ళి కుదరింది. కట్నం అరవై వేలు. ఆడపిల్లలకు ఇచ్చే ఆస్థి పేరు కట్నం అని, అది తనకు ఉంది కాబట్టి ఇస్తున్నాను అని ఆయన అనుకున్నాడు.

చెల్లికి అరవై వేలు కట్నం ఇస్తున్నారని తెలిసిన పెద్దమ్మాయి వనజ, తనకు ఏభయి వేలే ఇచ్చారని, చెల్లికి ఎక్కువ ఇస్తున్నారనీ, ఆ మిగిలిన పది వేలూ ఇస్తేగాని పెళ్ళికి రాననీ ఖచ్చితంగా వ్రాసేసింది.

వనజ భర్త మంచివాడే. అస్తమానం వనజే తన భర్తకు పండుగలకు అది కావాలి. ఇది కావాలి అని పేచీ పెట్టి పట్టుకెళుతుంది.

నవనీతరావుగారికి డబ్బుంది కాబట్టి అడిగిన వన్నీ ఇస్తూ వచ్చారు. వనజ వ్రాసిన ఉత్తరం చూసి వెంటనే ఆయన వనజకు సమాధానం వ్రాసారు.

చిరంజీవి సౌభాగ్యవతి వనజకు ఆశీర్వదించి వ్రాయుట. చెల్లి పెళ్ళి కుదరింది అని వ్రాస్తే, నీవు రానని, ఆ పదివేలు కావాలని వ్రాసావు. నిజానికి నీవు అడిగింది న్యాయంగా ఉన్నా అంతర్గతంగా అందులో నువ్వు గుర్తించని ఒక పాయింటు ఉంది.

అనూజ, నీ కంటే ఏడేళ్లు వెనక పుట్టింది. ఏడేళ్ళు వెనుకగా పెళ్ళి చేసి కోబోతోంది. నీకు అప్పటి రోజుల ప్రకారం ఏభయి వేలు ఇచ్చాను. నీవు మా ఇద్దరి కట్నాలనూ కంపేర్ చేసుకొని ఇంకో పది వేలు కావాలంటే, నిజానికి నీవే చెల్లికి ఋణపడి ఉంటావు. నీవు అనూజ కంటే ఎక్కువ అనుభవించావు. ఏడు సంవత్సరాల క్రితం పెళ్ళి చేసుకొని,

మిగిలిన ఆ పదివేల బేలన్సు కంటే ఎక్కువే పట్టుకెళ్ళావు.

సడన్‌గా నేను చనిపోతే మీ అన్నలు, మిమ్మల్ని చూడరు. మీ అచ్చట్లు, ముచ్చట్లు తీరవు. అప్పుడు నీకంటే చిన్నదైన అనూజ చాల నష్టపోయినట్లే కదా. నేను బ్రతికున్నంత కాలం నీవు ఆ ఏడు సంవత్సరాలది, చెల్లి కంటే ఎక్కువ అనుభవించినట్లే కదా!

ఆలోచించు.

నీవు ఆ పదివేలు అడిగావు కాబట్టి ఇంతగా వ్రాయవలసి వచ్చింది. పంతాలు, పట్టింపులు మాని, ఇద్దరూ వచ్చి, పెళ్ళిని జయప్రదం చేయమని కోరుతున్నాను.

ప్రేమతో....
నాన్న, నవనీతరావు.

(భూమి, నవంబర్ 8, 1987)

☆ ☆ ☆

# బూడిద తాడు

ఉన్నట్టుండి మాళవ మహారాజుకి ఓ వింతకోరిక కలిగింది. రాజు తలచుకోవాలేగాని దేన్నయినా క్షణాల్లో జరిపించేసుకో గలడు కదా!

వెంటనే రాజ్యంలో చాటింపు వేయించాడు. - 'ఎవరైతే బూడిదతోతాడును చేస్తారో, వాళ్ళకి రెండువేల వరహాలు బహుమతిగా ఇస్తా'నని.

రెండువేల వరహాలు అనేసరికి అందరికి ఆశ పుట్టింది. కానీ బూడిదతో తాడు చెయ్యడం ఎలా?

ఎందరెందరో ఎన్నెన్నో ప్రయత్నాలు చేశారు. ఎవ్వరూ బూడిదతో తాడు చెయ్యలేక పోయారు.

తన కోరిక నెరవేర నందుకు రాజుకి బాధకలగ సాగింది.

ఆరోజు రాత్రి మారు వేషంలో తిరుగుతూ వూరు చివరనున్న కుమ్మరి ఇంటికి వెళ్ళాడు. అతనితో కాసేపు ఆ విషయం, ఈ విషయం మాట్లాడిన తరువాత తన కోరిక బయటపెట్టాడు.

"అదేముంది..." అనేశాడు కుమ్మరి వెంటనే. అతనంత తేలిగ్గా అనేసరికి రాజుకి ఆశ్చర్యం వేసింది.

"బూడిదతో తాడు ఎలా చెయ్యగలవో చెప్పు" అన్నాడు.

కుమ్మరి గబగబా లోపలికి పోయి ఒక పళ్ళంలో తాడుని పెట్టి తీసుకొచ్చాడు. రాజు చూస్తుండగానే ఆ తాడుమీద కొద్దిగా కిరసనాయిలువేసి అంటించాడు. ఆ తాడంతా కాలిపోయి బూడిద తాడు రూపంలో మిగిలిపోయింది.

"ఇదిగోనండి బూడిదతో తాడు...." అంటూ ఆ పళ్ళాన్ని రాజు ముందుకు తోశాడు కుమ్మరి.

అతని తెలివితేటలు చూసిన తర్వాత రాజుకి - చదువుకి, తెలివి తేటలకు సంబంధం లేదనే విషయం అర్థమైపోయింది.

మర్నాడు సభ తీర్చి ఆ సభలో కుమ్మరిని సత్కరించి, అతని తెలివి తేటలని ఎంతో మెచ్చుకున్నాడు.

(ఆంధ్రభూమి వీక్లీ, 02-11-78)

★ ★ ★

# కోపిష్ఠి అవ్వ

ఒకూరిలో ఒక మామ్మగారు ఉన్నారు. ఆవిడ మహాకోపిష్ఠి ఆవిడ కోడలుగా ఉన్నప్పుడు అత్తగారిని వేపుకుతింది. అత్తగారైనప్పుడు కోడళ్ళను కాల్చుకుతింది. ఆవిడకు మనుమలు, ముని మనుమలు కూడా ఉన్నారు. ఇంటిలోని వారికే కాక ఆ చుట్టు ప్రక్కల అందరికీ ఆవిడంటే భయం. అందరూ చాటుగా ఆవిడను 'కోపిష్ఠి అవ్వ' అని పిలుస్తారు. అలా పిలుస్తారని ఆవిడకూ తెలుసు. ఆ మామ్మగారు ఒకసారి పుణ్యక్షేత్రాలు తిరుగుతూ కాశీకి కూడా వెళ్లింది. ఆ రోజుల్లో కాశికి వెళ్లిన వారు అచ్చట నదిలో తమకు ప్రియమైనది ఏదో ఒకటి వదిలేసి వచ్చేవారు. ఉదాహరణకు ఎవరికయినా మామిడిపండు ఇష్టమనుకోండి. అది ఆ నదిలో వదిలేసి వచ్చేయాలి. మరలా తిరిగి చనిపోయేవరకూ మామిడిపండు తినకూడదు. ఆ విధంగానే మన మామగారు తన కోపం వదిలేయాలని నిశ్చయించుకొని, అలాగే వదిలేసి తిరిగి తన స్వగ్రామం వచ్చేసింది.

మామ్మగారు కాశీకి వెళ్లి వచ్చిందనగానే అందరూ పలకరించడానికి వచ్చారు. అందరితోనూ నవ్వుతూ మాట్లాడుతూ తను కోపం కాశీలో వదిలి వచ్చేసినట్లు చెప్పింది. అందరూ సంతోషించారు. ఆ చట్టుప్రక్కల అల్లరి పిల్లలకు అవ్వను ఏడిపించాలని పించింది. ఆవిడ దగ్గరకు వచ్చి "మామ్మగారూ, కాశీలో మీరు ఏమి వదిలి వచ్చారు" అని నవ్వుతూ అడిగారు. దానికి తిరిగి ఆవిడ నవ్వుతూ "నా కోపం వదిలి వచ్చానర్రా పిల్లలూ!' అంది. తిరిగి "మామ్మగారూ! మీరు కాశీలో ఏమి వదిలారు" అని ప్రశ్నించారు పిల్లలు. ఆవిడ శాంతంగా "కోపం వదిలేశాను" అని చెప్పింది. మరలా అదే ప్రశ్న వేశారు పిల్లలు. ఈసారి కొంచెం విసుక్కుంటూ సమాధానం చెప్పింది. నాలుగవ సారికూడా తిరిగి అదే ప్రశ్నవేయడంతో కర్ర పట్టుకొని కోపంగా "కోపం వదిలి వచ్చాని ఎన్నిసార్లు చెప్పాలి' అని వారిని తరిమింది. అవ్వగారి కోపం పోలేనందుకు పిల్లలు నవ్వుకుంటూ పరుగు తీశారు.

(ప్రభ, 16-11-77)

☆ ☆ ☆

# పాములులేని దేశం

బాలలూ! మీరు ఐర్లాండు దేశంలో పాములు లేవని పాఠంలో చదువుకునే ఉంటారు. మరి దానికి ఒక కథ ఉంది. మీకు తెలుసా? నేను చెబుతాను వినండి. పూర్వం పేట్రిక్ అనే అతను ఐర్లాండు దేశానికి బానిసగా తీసుకొని రాబడినాడు. అతనికి తిండి లేక చలిలో కొండలమీద పందులను మేపుకుంటూ, దేవునికి ప్రార్థనలు చేసుకుంటూ కాలం గడిపేవాడు. కాలక్రమేణా అతను తన ప్రార్థనలతో సెయింట్ అయ్యాడు. అప్పటి నుండి అతను సెయింట్ పేట్రిక్ అని పిలవబడే వాడు. బైబిలులో ఒక కథ ఉంది. భూమిమీద ఎవరూ పుట్టక పూర్వం మొదట దేవుడు ఆదాము, అవ్వ అనే పురుషుని, స్త్రీని సృష్టించాడు. ఒక ఏపిల్‌ను చూపించి, మీరు ఆ ఏపిల్‌ను తినవద్దు. తింటే కష్టాలు కలుగుతాయి అని చెప్పాడు. వారు దేవుడు చెప్పినట్లుగానే తినలేదు. కాని ఒక పాము వచ్చి ఆదామును, అవ్వను ఆ ఏపిల్‌ను తినమని, తింటే ఏమీ కాదని చెప్పింది. వారిరువురు పాము మాటలు నమ్మి ఏపిల్‌ను తిన్నారు. అప్పటి నుండి వారిలో కోరికలు, కోరికలతోపాటు బాధలు బయలుదేరాయి. అందుకోసం సెయింట్ పేట్రిక్‌కి పాములంటే చాలా కోపం. ఆ కారణంగా చేతిలో ఒక కర్ర పట్టుకొని సామ్‌రాక్ అనే ఆయన సహాయంతో ఆ పాముల నన్నిటినీ అట్లాంటిక్ సముద్రంలోకి వదిలేశాడు. అప్పటినుండి ఐర్లాండు దేశంలో పాములు లేవు. ఆ దేశంలో సెయింట్ పేట్రిక్‌కు ప్రతి జూలైలోనూ పండుగ చేస్తారు. ఆయన పేరున చాలా గుడులున్నాయి. ఐర్లాండ్ ప్రజలకు సెయింట్ పేట్రిక్ ఒక విధంగా దేవుడని చెప్పవచ్చు. కొండమీద పూజలు చేస్తారు. కొందరు కొండ జోడులేని కాళ్ళతో ఎక్కుతారు. చలి దేశంలో జోళ్ళు లేకుండా కొండ ఎక్కడం అన్నది ఎంతో గొప్ప.

(ప్రభ, 23-11-77)

☆ ☆ ☆

# అందరూ సమానమే

అది ఏడవ తరగతి. క్లాసంతా గోలగా, అల్లరులతో, గోపి ఏడుపుతో ఉంది మాస్టారు వచ్చేసరికి. మాస్టారు రాగానే నిశ్శబ్దంగా ఎవరి స్థానాల్లో వారు కూర్చున్నారు. నిశ్శబ్దంలో గోపి వెక్కిళ్ళు మాత్రం వినిపిస్తున్నాయి. మాష్టారు గోపి దగ్గరకు వెళ్ళి ఏడుపుకి కారణం తెలుసుకున్నారు. గోపి రమేష్ పక్కన కూర్చున్నాడట, మొదటి బెంచీలో. అందుకని రమేష్‌కి గోపి మీద కోపం వచ్చి, "నీవు రిక్షా వాడి కొడుకువి. నా పక్కన కూర్చుంటావా? వెనక్కి పోయి కూర్చో" అన్నాడట. గోపి కదలక పోయేసరికి రమేష్, అతని స్నేహితులు కలిసి గోపిని కొట్టి వెనక బెంచీలోకి తరిమేశారు. గోపి మాష్టారు చెప్పే పాఠాలు శ్రద్ధగా వింటాడు. చాలా తెలివైన వాడు. ఆ అబ్బాయికి ఉన్న కోరిక మొదటి బెంచీలో కూర్చోవాలని. కాని రమేష్, అతని స్నేహితులు ఎప్పుడూ గోపీని అక్కడ కూర్చోనివ్వరు.

రమేష్ క్లాసులో ఎప్పుడూ అల్లరి చేస్తుంటాడు. అసలు చదవడు. రమేష్ వాళ్ళకి పెద్ద మేడ ఉంది. ఆ మేడ వెనకాల ఉన్న గుడిసెలో ఉంటూ రిక్షా లాగుకునే నాగులు కొడుకు గోపి. అందుకే గోపి అంటే చులకన రమేష్‌కి. మాస్టారు మెల్లగా వెళ్ళికుర్చీలో కూర్చున్నారు. మాష్టారు తన మీద కనీసం జాలికూడా చూపకుండా వెళ్ళిపోవడం చూసి గోపీ అంధరూ ఇంతేనన్న భావంతో నిరాశగా మనసు లోనే దుఃఖిస్తున్నాడు.

"నేను ఒక ప్రశ్న వేస్తాను - జవాబు చెప్పగలవా, రమేష్?" అని మాస్టారు అడిగారు, ఏదయినా అడిగారంటే భయం రమేష్‌కి. ఏ రోజు పాఠాలు ఆ రోజు చదవడు. అయినప్పటికీ మెల్లగా తల ఆడిస్తూ లేచి నిలబడ్డాడు. "నీ కెన్ని కాళ్ళు, ఎన్ని చేతులు ఉన్నాయి, రమేష్" అంటూ మాస్టారు అడిగారు. ఇదేమి ప్రశ్న, ఇంత తేలికైనదా అనుకుంటూ సంతోషంగా, "రెండు కాళ్ళు, రెండు చేతులు, మాష్టారూ" అని జవాబు చెప్పాడు. మాష్టారు వెనక బెంచీ వైపు దృష్టి సారించి, "నీ కెన్ని ఉన్నాయి, గోపి' అని అడిగారు. "నాకు రెండు కాళ్ళు, రెండు చేతులు ఉన్నాయి" అని గోపి సమాధానం చెప్పాడు.

"సరే, మీ అందరికీ పైన తల దగ్గర నుండి కింది పాదం వరకూ అన్నీ సమానంగానే ఉన్నాయి. అందరిలోనూ రక్తం ఉంది. అందరూ తినేది అన్నమే. అందరూ తాగేది నీరే. పీల్చేది గాలే. అవునా?" అని అందరిని ఒకేసారి అడిగాడు మాస్టారు. అవునన్నట్లుగా అందరూ తలలు ఆడించారు. 'అయితే ఇప్పుడు నేను చెప్పేది శ్రద్ధగా వినండి. పై విషయాల్లో అందరూ సమానమే. కాని మనలో మనకు కొన్ని విషయాల్లో తేడాలున్నాయి. పేదవాడు గొప్పవాడు అనే బేధాలు పెద్దకులం, చిన్న కులం అనే

భేదాలు మనలో ఉన్నాయి. నిజానికి ప్రతి మనిషి సమానమే. దేవుని దృష్టిలో అందరూ ఒకటే. వృత్తిని బట్టి కులాలు, సంపదను బట్టి పేదా గొప్పా అనేవి ఏర్పడ్డాయి. ఒక మనిషి మరొక వృత్తి మనిషి తనకు కావలసిన అవసరాలన్నీ తానే తీర్చుకోలేడు. అందుకే ఒక వృత్తి మనిషికి మరొక వృత్తి మనిషికి, అవసరం తప్పక ఉంటుంది. సంఘంలో అన్ని రకాల వృత్తుల వాళ్ళు ఉండాలి. కాని మనం మనిషికి విలువను ఇచ్చినప్పుడు అతని ధనాన్ని, కులాన్ని చూసి ఇవ్వకూడదు. మనుషు లందరూ ఒకటే, అందరూ కలిసి పేదా గొప్ప తేడాలు, కులం, మతం భేదాలు మాని జీవించాలి. మనిషి తాను ఏదయినా మంచి పని చేసినప్పుడు, ఎవరికయినా సహాయపడినప్పుడు సంతోషపడాలి కాని, తన ధనాన్ని, కులాన్ని చూసి గర్వపడకూడదు. ధనం శాశ్వతం కాదు. ఇప్పుడు ధనవంతుడు కొంత కాలానికి పేదవాడు కావచ్చు. పేదవాడు కొన్ని రోజులకు ధనవంతుడు కావచ్చు. మీరు మీలో తేడాలు చూసుకోకుండా, అందరూ మంచిగా చదువుకోవాలి. విద్యను మించిన సంపద లేదు. మంచిగా ఉండి మీ కుటుంబానికి, సంఘానికి, దేశానికి మంచి పేరు తేవాలి" అంటూ ముగించారు మాష్టారు. ఆయన పాఠం చెప్పడానికి పుస్తకం తెరుస్తూ, ఓర కంటితో, సిగ్గుతో కళ్ళు వాల్చుకున్న రమేష్‌ని, సంతోషంతో కళ్ళు మొస్తున్న గోపీని గమనించి చిన్నగా నవ్వుకున్నారు.

(ప్రభ, 31-05-78)

☆ ☆ ☆

# మాష్టారికో శిక్ష

"మాస్టారూ!

నేనెవరో మీకు గుర్తుందా? ఎలా గుర్తుంటుందిలెండి. మీ జీవితంలో నక్షత్రాల్లా స్టూడెంట్స్ ఉంటే, చంద్రుడిలా మీ రొక్కరే ఉండి, మమ్మల్ని అస్తమానూ తిడుతూ ఉండేవారు. ఎంతమంది విద్యార్థులను గుర్తు పెట్టుకోగలరు? మీరు మాత్రం మా కందరికీ గుర్తే. ముఖ్యంగా, నాకు. మిమ్మల్ని మరువడం అసాధ్యం.

చిన్నప్పుడు మీరు మా ఇంటి పక్కన ఉండడంతో, అటు ఇంటి దగ్గరా, ఇటు స్కూల్లోనూ కూడా నాకు మనశ్శాంతి లేకుండా చేశారు. సరిగా, చదవకపోతే 'స్టాండప్ ఆన్ ది బెంచ్'' అని చాలా తేలిగ్గా అనేసేవారుగాని నేనెంత కుమిలిపోయేవాణ్ణో మీకేం తెలుసు? వచ్చే జన్మలోనైనా మీకు మాష్టారుగా పుట్టి మిమ్మల్ని చాలా సేపు నిలబెట్టాలి అని దేవుణ్ణి ప్రార్థించుకునేవాడిని. విచిత్రంగా దేవుడు నా మొర విని నా కోరిక ఈ జన్మలోనే తీర్చేశాడు. మీరు ఎంతో మంది పురప్రముఖుల సన్నిధిలో స్టూడెంట్స్ ఎదురుగా అలా నిలబడడం, మీకేమని పించిందోగాని, నాకు సంతోషంగా కళ్ళ నీళ్ళు వచ్చాయి. నా కోరిక తీరింది. కసితీరింది. మీరూ నిలబడ్డారు కదా!

అసలు నన్ను ఆటలకు వెళ్ళనిచ్చే వారా? చిన్నవయసులో ఆటల మీద కాక మనసు చదువు మీద ఉంటుందా? గుర్రాలలాంటి మా మనసు కళ్ళాలను చేతుల్లో పెట్టుకుని ఆటలకు వెళ్ళకుండా ఆపేవారు. మీ పోరుపడలేక ఏదో చదివి లెక్కల్లో నూటికి తొంభై తొమ్మిది మార్కులు తెచ్చుకుంటే సంతోషించక, 'మూర్ఖుడా! మిగిలిన ఆ ఒక్క మార్కు ఎక్కడికి పోయిందిరా' అంటూ ఎండలో నిలబెట్టేశారు. అనాటి మనఃస్థితి ఏమాత్రం అయినా అర్థం చేసుకోడానికి ప్రయత్నించిరా?

రామనామ జపంలా 'చదువు చదువు, చదువు చదువు' అంటూ అరిగిపోయిన రికార్డులా అరిచేవారు. నాకెంతో కోపం వచ్చేది. అయినా నిగ్రహించుకునే వాడిని. అది మీరు మాత్రం గ్రహించేవారు కాదు. అప్పుడు మిమ్మల్ని ఏమీ చేయలేని పసివాణ్ణి. మీరు బాగా చదువుకున్నారని మీకు చాలా గొప్ప.

మీకు తెలియకుండా అల్లరిగా తిరుగుతున్న నన్ను నా తల్లి దండ్రులే పట్టించు కోకపోయినా, మీరు పట్టు బట్టి చెవి మెలిపెట్టి 'బాగా చదువుతాను' అని నాతో ఒట్టు పెట్టించుకొని వజ్రంలా సానపెట్టడానికి ప్రయత్నించారు. ఎంతసేపూ మీ ధ్యాస మీదేగాని, నాకు చదువంటే ఎంత అయిష్టమో ఆలోచించారా? 'లోకజ్ఞానం' అంటూ ఎన్ని పుస్తకాలు చదివించేవారు!



"అందరూ సర్వేపల్లి రాధాకృష్ణులు కాలేరండి. అది గుర్తుంచుకోండి" నేను ఇలా అంటే మీరేం సమాధానం చెబుతారో నాకు తెలుసు. "రాధాకృష్ణలు కాకపోయినా, అప్రయోజకులు కాని వారందరూ ఆయనతో సమానులే" అంటారు. మీతో మాట్లాడి, వాదించే వయస్సు నాకు లేదనే కదా, మీ ఇష్టం వచ్చినట్లు నన్ను దండించారు. మీకు పనిష్మెంట్ ఇచ్చే శక్తి నాకు లేదనే కదా. మీ ధైర్యం? కాని తలదన్నే వాడుంటే, తాడిని తన్నే వాడుంటాడని మరువకండి. మీకు నేను ఏ శిక్షా వేయకపోయినా, మీకీ శిక్ష పడింది. నాలాంటి చాలా మందిని పెట్టిన ఉసురు, ఇచ్చిన దండన ఊరికే పోలేదు. మీ మెడకు ఉరితాడై బిగిసింది.

మీరు ఆ శిక్ష అనుభవిస్తుంటే నేనెంత పొంగిపోయానో. నా కక్ష తీరిందని ఎంత మురిసిపోయానో తెలియజేయడానికే ఈ ఉత్తరం. ఎదురుగా ఇంత ధైర్యంగా మాట్లాడే శక్తి నాకు ఆనాడు, ఈనాడూ కూడా లేదు. మీరు అలా నిలబడడం చూస్తే, ఆనందంతో నా గుండె పలిగిపోతుందేమో. ఈ ఉత్తరం రాసే అవకాశం పోతుందేమో అని ఎంతో భయపడ్డాను. నేను చిన్నప్పటి నుంచి పడ్డ మనోవేదన అంతా ఇట్టే పోయింది ఎలా అంటారా? అవును మరి, యూనివర్శిటీ వాళ్ళు స్నాతకోత్సవ (కాన్వొకేషన్) సందర్భంగా, మీకు 'కళా ప్రపూర్ణ' బిరుదు ఇస్తున్నప్పుడు, మీ సైటేషన్, మరో మహానుభావుడు చదువుతున్నంతసేపు, మీరు గవర్నర్ సన్నిధిలో, ఎందరో ప్రముఖుల ఎదురుగా, ముఖ్యంగా విద్యార్థులకు అభిముఖంగా నిలబడి ఉండడం, ఆ పిదప గవర్నర్ చేతి మీదుగా కళాప్రపూర్ణ అందుకుని ఒక గోల్డ్ మెడల్ మెడకు తగిలించుకోవడం, మరి

నా కోరిక తీరినట్లు కాదూ? ఇంతకాలానికైనా మీ ప్రతిభను గుర్తించినందుకు యూనివర్శిటీని నేను అభినందిస్తున్నాను. నేను ఎప్పుడు చూశానంటారా? ఇంజనీరింగ్‌లో యూనివర్శిటీ ఫస్ట్ వచ్చి గోల్డ్ మెడల్ తీసుకున్నది నేనేనండి. అసలు ఆ మెడల్ మీకివ్వక, నా కిచ్చారేమిటా అని ఒక్కక్షణం అనిపించింది. మరి నా అభివృద్ధికి కారకులు మీరేగా? మీ విద్యార్థి సిద్దార్థ."

(ప్రభ, 11-01-89)

☆ ☆ ☆

# ఉచితం ఉచితం ఉచితం
# ఆలసించిన ఆశా భంగం

☆ మా గోవిందా స్టీలు షాపులో ఒక స్పూను కొంటే ఒక స్టీలు డ్రమ్ము ఉచితం. స్పూను ఖరీదు కేవలం అయిదు వందలు రూపాయలు మాత్రమే.

☆ మీకు టి.బి రావాలనుకుంటున్నారా! సిగరెట్లు ఎక్కువ తాగండి టి.బి. ఉచితం.

☆ టి.వి. ఎక్కువ చూస్తే వారికి కళ్ళజబ్బు ఉచితం.

☆ మీ శత్రువులకు విస్కీ సీసాలు బహుమతిగా యివ్వండి. వారికి కేన్సర్ ఉచితం.

☆ మా మందులవిందు షాపులో రొంపకు మందులు కొన్నవారికి చేతిరుమాలు ఉచితం.

☆ రోజూ మీ జీవిత భాగస్వామి మీద కోపం తెచ్చుకోండి. బి.పి. ఉచితం.

☆ పీకల వరకూ తినేవారికి ఫేట్ ఉచితం.

☆ అర్ధరాత్రి దాటి ఇంటికి చేరిన మగాడికి తిట్లు ఉచితం.

☆ క్లినిక్ మైనస్ షాంపు వాడిన వారికి చుండ్రు ఫ్రీ. మినాశిని కొబ్బరి నూనె వాడిన వారికి గుండు ఫ్రీ.

☆ మీ యింట్లో గేస్ ప్రొద్దుటే అయిపోతే అర్జంటుగా పక్కింటికో, ఎదురింటికో విజిట్‌కి వెళ్ళండి. కాఫీ ఉచితం.

☆ మూడు ముళ్ళు వేసిన వారికి కట్నం ఉచితం. కట్నం తీసికున్నాడని అమ్మాయి పోలీసు కంప్లయింట్ యిస్తే జైలు భోజనం ఉచితం.

☆ ☆ ☆

# వంటింటి చిట్కాలు

ఇడ్లీలు తెల్లగా రావడం లేదని బాధపడకండి. ఉడికిన తరువాత కాస్త నీలిమందు పెట్టండి.

పూరీలు మెత్తగా రావాలంటే పిండిలో దూదికలిపి బాగా మర్దించండి.

కాకరకాయ చేదుపోవాలంటే, రాత్రి సర్ఫ్‌లో నానబెట్టండి.

దోసెలు కరకరలాడాలంటే, మెత్తని యిసక బాగా కడిగి, దోసెల పిండితోపాటు గ్రయిండ్ చేయండి.

సాంబారులో చింతపండు బదులు, కుంకుడు రసం వేస్తే రుచికి రుచి, ఆముదం ఖర్చు తగ్గుతుంది.

కంద దురద పోవాలంటే, ప్రిక్లీహీట్‌గాని, నైసిల్ పౌడర్‌గాని రాయండి. వండేముందు.

మీ పిల్లలు వంకాయ కూర యిష్టపడకపోతే, ఇటీవల దానిపేరును, బెండకాయగా మార్చినట్లు చెప్పండి.

కాయగూరలు బొటాబొటీగా ఉంటే బెంగపడకండి. ఉప్పు, కారం రెండుసార్లు వేయండి. కూర మిగులుతుంది.

మీ శ్రీవారు, మీరు వండిన వంట ఎలా ఉందని అడిగినపుడు 'నీ మొహంలా ఉంది' అని అంటే అంత బావుందా అనండి. ఇంకెప్పుడూ వంక పెట్టరు.

కొత్త బియ్యంతో వండిన అన్నం కొత్తగా ముడిపడిన మొగుడూ పెళ్ళాం అతుక్కునే ఉంటారు. యిది నిజం.

(కేవలం సరదాకు మాత్రమే)

(ఆంధ్రభూమి వీక్లీ, 26-5-94)

☆ ☆ ☆



రచయిత్రి ప్రముఖుల చేతుల మీదుగా
పొందిన పురస్కారాలు



నా సతీమణి రాధికకు ప్రేమతో

- డా॥ జి.బి. రాజేంద్రప్రసాద్

మా అమ్మకు

-శ్రీకాంత్, శశికాంత్

మా అత్తగారికి

-శ్రీమతి విశాలాక్షి